# మాండలిక వృత్తిపదకోశం

## లోహకార వృత్తి



సంపాదకులు :

ఆచార్య జి. నాగయ్య




తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

# MĀṆḌALIKA VṚITTIPADAKŌŚAM

A Telugu Dialect Dictionary of Occupational Vocabularies

Volume - XII: ALL METAL WORKS EXCLUDING GOLD & SILVER

Editor: Prof. G. NAGAIAH


తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ : 121

ప్రథమ ముద్రణ : డిసెంబరు, 1991

ప్రతులు : 1000

వెల : రూ. 60/-

ప్రతులకు :

తెలుగు విశ్వవిద్యాలయం,

లలిత కళాక్షేత్రం,

పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి,

హైదరాబాదు - 500 004.

ముద్రణ :

భాగ్యం క్వాలిటి ప్రింటర్స్,

48-B, రామానుజ అయ్యర్ స్ట్రీట్,

మద్రాసు - 600 021.

# భూమిక

తెలుగుభాషా సాహిత్య కళాసంస్కృతుల సర్వతోముఖ వికాసానికీ, వికసనానికీ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రశాసనసభ చేసిన చట్టంప్రకారం 1985 డిసెంబరు 2 వ తేదీన రూపుదాల్చిన విశిష్ట విద్యాసంస్థ తెలుగు విశ్వవిద్యాలయం. బోధన, పరిశోధన, ప్రచురణలతోపాటు విస్తరణసేవ, రాష్ట్రేతరాంధ్రులకూ, విదేశాంధ్రులకూ సహాయ సహకారాల కల్పనవంటి బహుముఖీన కార్యక్రమాలను కూడా ఈ విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది. పూర్వంవున్న అకాడమీలు, తెలుగు భాషాసమితి, అంతర్జాతీయ తెలుగు కేంద్రం విలీనంకావడంతో విశ్వవిద్యాలయం వివిధ పీఠాలు, కేంద్రాలు, విభాగాల సమాహారంగా వ్యవహరిస్తున్నది.

తెలుగుజాతి వైభవోన్నతులకు అద్దంపట్టే గ్రంథాల ప్రచురణ విశ్వవిద్యాలయ ప్రధానాశయాల్లో ఒకటి. విశ్వవిద్యాలయంలో విలీనం అయిన అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవిశ్రాంత కృషిద్వారా దేశ సాహిత్యరంగంలో విశిష్టస్థానం సమకూర్చుకుంది. 1957 ఆగస్టు 7 వ తేదీన ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటైన ఈ అకాడమి దేశం మొత్తంమీద ప్రప్రథమ రాష్ట్రస్థాయి అకాడమికావడం విశేషం. ఈ అకాడమి ప్రామాణికమైన నిఘంటువులు, పదకోశాలు, కావ్యాలు, ప్రబంధాలు, వ్యాసాలు, విమర్శలు, కల్పనాసాహిత్యం, పరిశోధనాత్మక గ్రంథాలు, జీవితచరిత్రలు, అనువాదాలు మొదలైనవి 163 గ్రంథాలు ప్రచురించింది.

తెలుగు విశ్వవిద్యాలయం ఈ ప్రచురణ సత్సంప్రదాయాన్ని కొనసాగిస్తూ ఇప్పటివరకు 120 గ్రంథాలను వెలువరించింది.

ప్రస్తుత గ్రంథం 'మాండలిక వృత్తి పదకోశం - లోహకార వృత్తి'. లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి చేపట్టిన గ్రంథప్రచురణ కార్యక్రమాల్లో మాండలిక వృత్తిపదకోశ నిర్మాణం ఎంతో ప్రత్యేకతను సంతరించుకుంది. అకాడమి ఆధ్వర్యంలో వ్యవసాయం, చేనేత, కుమ్మరం, మొ॥న వృత్తి పదకోశాలు ప్రచురితమయ్యాయి. తెలుగు విశ్వవిద్యాలయం ఈ పరంపరలో మత్స్యపరిశ్రమ, వడ్రంగం పదకోశాలు వెలువరించింది. మరో రెండు పదకోశాలు ముద్రణలో వున్నాయి. మరికొన్ని పదకోశాలు నిర్మాణదశలో వున్నాయి.

తెలుగుసీమ అనేక వృత్తులకు ఆటపట్టుగా వర్ధిల్లింది. ఈ వృత్తులను జీవికలుగాచేసుకుని కుటుంబపోషణ చేస్తున్నవారు లక్షలాదిగా వున్నారు. ప్రతి రంగంలోనూ సుసంపన్నమైన పదజాలం వాడుకలో వుంది. అమూల్యమైన ఈ పదజాలాన్ని సేకరించి, విశ్లేషించి అర్థవివరణతోనూ, ఇతర విశేషాలతోనూ పాఠకలోకానికి అందించే ప్రయత్నమే ఈ వృత్తిపదకోశ ప్రచురణోద్దేశం.

ఆయా వృత్తిరంగాలతో విశేషపరిచయం సముపార్జించుకున్న భాషా సాహిత్యవేత్తలు ఈ పదకోశాల నిర్మాణబాధ్యతల్ని స్వీకరించారు.

ప్రస్తుత గ్రంథం 'మాండలిక వృత్తిపదకోశం - లోహకారవృత్తి' ప్రముఖ పరిశోధకులు ఆచార్య జి. నాగయ్యగారి సంపాదకత్వంలో రూపుదిద్దుకుంది. ఇత్తడి, రాగి, కంచు, ఇనుము మొదలైన లోహాలు ఉపయోగించి చేసే పనులు, ఈ లోహకారులు వాడే పనిముట్లు, వీరు తయారుచేసే వస్తువులు ఈ వృత్తికారుల జీవితంతో పెనవేసుకున్న వివిధ అంశాలు ఈ పదకోశంలో చోటుచేసుకున్నాయి. ఎంతో శ్రమించి ఈ గ్రంథప్రామాణ్యాన్ని ఇనుమడింపచేసిన సంపాదకులు ఆచార్య నాగయ్యగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

యథాపూర్వంగా ఈ ప్రచురణకూడా అందరి ఆదరాభిమానాలు చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

**ఆచార్య సి. నారాయణరెడ్డి**
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు
26-10-1991

# విషయ సూచిక

# ఈ గ్రంథ పరిచయం

1.0. పదసేకరణ :

కుమ్మరం, వడ్రంగం, బంగారుపని, కమ్మరం ఈ నాలుగు వృత్తులకు సంబంధించిన పదాలను సేకరించి ఒకే సంపుటంలో ప్రచురించాలని లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి నిర్ణయించింది. దీనికి తగిన నమూనా ప్రణాళికను రూపొందించిన తరువాత పై నాలుగు వృత్తులకు సంబంధించిన పదాలను ఒకే సంపుటంలో ప్రచురించడం సాధ్యం కాదనిపించింది. పైగా ఒక్కొక్క కేంద్రంలో ఒకేమారు నాలుగు ప్రధానవృత్తులకు సంబంధించిన పదాలను సేకరించడం కూడా కష్టమనిపించింది. ఆ కారణంగా కమ్మరాన్ని విడిచిపెట్టి మిగిలిన మూడు వృత్తులకు సంబంధించిన పదాలను అప్పుడు సేకరించడం జరిగింది. వెండి, బంగారు లోహాలను మినహాయించి ఇనుము, ఇత్తడి, రాగి, కంచు, అల్యూమినియం, సిల్వరు, స్టీలు మొదలయిన ఇతర లోహాలకు సంబంధించిన పదాలను సేకరించి 'లోహకారవృత్తి' అనే పేరుతో ఒక ప్రత్యేక సంపుటంగా నా సంపాదకత్వంలో ప్రచురించాలని మాండలిక వృత్తి పదకోశసంపాదక మండలి 1983 లో నిర్ణయించింది. ఈ లోహకారవృత్తిలో కొలిమిపని, ఇత్తడిపని (మట్టిపని), రేకుపని, టింకరుపని, వెల్డింగుపని, శిల్పపని, ఖోతపని, సానపని, బీగాలు, పెట్రొమాక్స్‌లైట్లు, బ్యాటరీలు మొదలైనవి రిపేరు చేసేపని మొదలైన పనులన్నీ చేరతాయి. పదసేకరణకు సంబంధించి రాష్ట్రంలో 76 కేంద్రాలు (కోస్తా 31; తెలంగాణా 29; రాయలసీమ 16) ఎన్నుకోవడమయింది. దాదాపు 40 కేంద్రాలలో లోహకారవృత్తికి సంబంధించిన పదసేకరణ 1965 లోనే కుమ్మరం, వడ్రంగం, బంగారుపని వృత్తిపదాల సేకరణతోపాటు జరిగింది. మొదట కోస్తా, తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలకు ఒక్కొక్క కేంద్రం మాత్రమే ఎన్నికచేసుకొని ప్రాథమికమైన ఒక నమూనా ప్రణాళిక ప్రకారం లోహకార వృత్తికి సంబంధించిన పదాలను సేకరించడం జరిగింది. ఈ విధంగా సేకరించిన పదాల ఆధారంతో పర్యటన పరిశోధకుల అనుభవంతో నిర్దుష్టమైన పద్ధతిలో ఒక ప్రశ్నావళి రూపొందించబడింది.

లోహకారవృత్తి పదసేకరణ కనుగుణంగా ఏర్పరచుకొన్న ప్రశ్నావళి స్వరూపమిది :

1.1. పదసేకరణ ప్రశ్నావళి (స్థూలంగా) :

1. లోహాలు-వాటి రకాలు-వాటిలో కలిపే ఇతరాలు.

2.0. కమ్మరపని.

(a) కొలిమిదగ్గరుండే పనిముట్లు, పరికరాలు.

(b) సాగ్గొట్టే పనిముట్లు.

(c) నరకడానికి వాడే పనిముట్లు.

2.1. వెల్డింగ్‌పనిలో వాడే పనిముట్లు.

2.2. రాగి లేదా ఇత్తడిపనిలో వాడే పనిముట్లు.

(a) కత్తెర-రకాలు.

(b) సుత్తులు-రకాలు.

2.3. లోహపాత్రలు తయారుచేయడానికి వాడే సాధనాలు :

కరవాయిలు - వాటి భేదాలు.

2.4. సర్వే పనిముట్లు - రకాలు :

2.5. పాత్రల అడుగుభాగాన్ని, మధ్యభాగాన్ని, అంచుభాగాన్ని తయారుచేసేటప్పుడు చూపే మెలకువలు.

3.0. లోహపు పాత్రలు - వాటి రకాలు :

3.1. బిందెలు - రకాలు.

3.2. అండాలు - రకాలు.

3.3. చెంబులు - రకాలు.

3.4. గ్లాసులు - రకాలు.

3.5. గరిటలు - రకాలు.

3.6. వంటపాత్రలు - ఉపయోగాన్నిబట్టి, పరిమాణాన్నిబట్టి, ఆకారాన్నిబట్టి వాటి రకాలు - పేర్లు.

3.6.1. పాలు, మజ్జిగ, నూనె మొదలయినవాటికి ఉపయోగించే పాత్రలు - రకాలు.

3.6.2. పాత్రల మూతలు - రకాలు.

3.6.3. నీళ్ళు తేవడానికి, విల్వచేసుకోడానికి వాడే పాత్రలు.

3.6.4. గృహ సామగ్రికి వాడే ఇతర పాత్రలు.

3.7. దేవతా విగ్రహాలు, కలశాలు మొదలైన పూజల్లో, పండుగల్లో, ఉత్సవాల్లో ఇతర సంబరాల్లో వాడే పాత్రలు - వాటిపేర్లు - తయారీ విధానం.

4. టింకర్‌పని (స్టౌవులు, బకెట్‌లు మొ॥నవి అతికేపని) :
కథనాత్మకంగా - ఈ పనిలో ఉపయోగించే పరికరాలు.

5. రేకుపని (డబ్బాలు, చేటలు, జల్లెడలు, డ్రమ్ములు, బీరువాలు, పెట్టెలు, పాలక్యాన్లు, బిందెలు, ఎలుకబోన్లు, పొట్టుపొయ్యిలు మొదలయినవి రేకుతో చేసేపని) :
కథనాత్మకంగా (క్రియాపదాల కోసం) - ఈ పనిలో ఉపయోగించే పరికరాలు.

6. గొడుగులు, బీగాలు, టార్చిలైట్లు, పెట్రొమాక్సు లైట్లు, సైకిళ్లు మొదలయినవాటి తయారీలో, రిపేరులో వాడే పరికరాలు :
వాటి తయారీవిధానం - కథనాత్మకంగా.

7.1. పోతపని (లోహాలతో గంట, దీపస్తంభం, కుప్పెలు, గజ్జెలు, కొప్పెరలు మొదలైనవి తయారుచేయడం) :
వాడే పరికరాలు - కథనాత్మకంగా.

7.2. శిల్పపని (విగ్రహాలు అచ్చుపోయడం, పోగర్లతో లోహశిల్పాలను చెక్కడం) :

(a) అచ్చుల రకాలు.

(b) పోగర్లు - రకాలు.

(c) ఆకురాళ్ళు - రకాలు.

(d) ఇతర పరికరాలు.

8. సానపని - సానపట్టే విధానం : కథనాత్మకంగా.

(a) కత్తులు - రకాలు.

(b) ఇతర పరికరాలు.

9.1. లోహపు వస్తువులకు తరిణి (పాలిష్) పట్టేపని :

కథనాత్మకంగా - ఈ పనిలో వాడే పరికరాలు, పదార్థాలు.

9.2. కళాయిపని :

కథనాత్మకంగా - ఇందులో వాడే పదార్థాలు.

10. వృత్తిపేరు - కులంపేరు - లోహాల వృత్తులవారి ఆచార సంప్రదాయాది విశేషాల సేకరణ :

**1.2.** పర్యటన పరిశోధకులు :

1983 లో ఇద్దరు పర్యటన పరిశోధకులను నియమించుకొని పదసేకరణ పూర్తిచేయడం జరిగింది. పర్యటన పరిశోధకులు నిర్ణీత ప్రయాణ కార్యక్రమాల్ని తప్పకుండా ఆయా కేంద్రాలలో తాము సేకరించిన పద పట్టికలను ఆ కేంద్రాలనుంచే తపాలాద్వారా పంపిస్తూ వచ్చారు.

వివిధ కేంద్రాల పదసేకరణలో పాల్గొన్న పర్యటన పరిశోధకులు :

| పర్యటన పరిశోధకుని పేరు | పర్యటించిన కేంద్రాల సంఖ్య | | | |
|---|---|---|---|---|
| | కోస్తా | తెలంగాణా | రాయలసీమ | మొత్తం కేంద్రాలు |
| 1. డా॥ వి. దొరస్వామి నాయుడు | 15 | 11 | 10 | 36 |
| 2. పి. వేణుగోపాల్ | 16 | 18 | 6 | 40 |

అన్ని కేంద్రాలనుంచి పదపట్టికల రిపోర్టులు తిరుపతి చేరడం పూర్తి అయినతర్వాత కోశనిర్మాణ కార్యక్రమం ప్రారంభమయింది.

**1.3.** కోశనిర్మాణ ప్రక్రియ :

కీ॥శే॥ ఆచార్య జి. యన్. రెడ్డిగారి సంపాదకత్వంలో, నా సహాయ సంపాదకత్వంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు వెలువరించిన కుమ్మరివృత్తి పదకోశంలో పాటించిన పద్ధతులే ఇంచుమించు ఈ కోశ నిర్మాణం లోనూ అనుసరింపబడినాయి.

ఇందులో మొదటిదశ : అన్ని రిపోర్టులనుండి ఒక్కొక్క పదాన్ని ఒక కార్డుమీదికి ఎక్కించడం. అందులోనే వ్యవహర్తలు ఇచ్చిన అర్థం, వాటి కేంద్రాల సంకేతాలనుకూడ గుర్తించడం. ఒక్కొక్క పదానికి సంబంధించిన ఉచ్చారణభేదాలు, రూపాంతరాలు, పర్యాయపదాలు సమీక్షించి ప్రామాణిక రూపాన్ని గుర్తించడం రెండవదశ. రూపాంతరాలను, పర్యాయపదాలను వేరుచేసి వాటిని వేరుగా కార్డులమీద కేంద్రసంకేతాలతో సహా రాయడం మూడవదశ. ఆరోపాలుగా నిర్ణయించిన పదాలను ఒక్కొక్కదానిని ఒక్కొక్క కార్డుమీది కెక్కించడం, పద పట్టికల సహాయంతో పర్యటన పరిశోధకులిచ్చిన అర్థాలను, వివరాలను దృష్టిలో పెట్టుకొని పదానికి అర్థనిర్ణయం చేయడం నాల్గోదశ. అర్థ వివరణలో వ్యవహర్తలు చెప్పిన వివరణ వీలైనంతవరకు వారి మాటల్లోనే ఈ కోశంలో ఇవ్వడమైంది. ఈవిధంగా ఆరోపం, ఉచ్చారణ భేదాలు, రూపాంతరాలు, పర్యాయపదాలు, అర్థవివరణ, కేంద్ర సంకేతం, ప్రతిపదానికి తయారైన తర్వాత వాటిని అకారాది క్రమంలో ఏర్పరచుకొని రూపాంతరాలను, పర్యాయ పదాలను దృష్టిలో పెట్టుకొని పునఃపరిశీలన చేయడం జరిగింది. అన్యదేశ్యాలను గుర్తించి, వాటి ఆంగ్లపదాలకు 'Spelling' ఇవ్వడంకూడ జరిగింది. తరువాత పర్యటన పరిశోధకులు రిపోర్టులలో సూచించిన ప్రకారం చిత్ర

కారులచేత బ్లాకుల తయారీకి రేఖాచిత్రాలను వేయించడమయింది. అటుతరువాత అచ్చుప్రతిని సిద్ధంచేయడమయింది. ఈకోశంలో ఇచ్చిన చిత్రాలు 223. మొత్తం ఆరోపాలు 7770.

**1.4. తెలుగు కావ్యాలు-కమ్మరివృత్తి ప్రసంస :**

మానవ నాగరికత చరిత్రలో ఏర్పడిన పంచవృత్తుల (కమ్మరి, వడ్ల, శిల్పి, కంసాలి, కంచరి)లో కమ్మరం లోహకారవృత్తిలో ప్రాచీనమైంది. లోహకారవృత్తిలో కమ్మరం, కంచరి రెండూ చేరుతాయి. కమ్మరంకు సంబంధించిన పదాలు కొన్ని తెలుగుకావ్యాల్లో ప్రయోగింపబడి ఉన్నాయి. బసవపురాణంలో పాల్కురికి సోమనాథుడు (క్రీ. శ. 12 వ శతాబ్ది) మడివాలు మాచయ్యమహిమను వర్ణించిన సందర్భంలో అతన్ని కమ్మరితో ఇట్లా పోల్చి ఉన్నాడు.

"మును జీవమను లోహమునకు జ్ఞానాగ్ని
నొనరఁగఁబదనిచ్చు కనుమరి యతఁడ"

—బసవపురాణం, వావిళ్ళప్రతి పుట 238.

"కమ్మరీని దుడుకు కార్యవినాశంబు
వడ్లవాని దుడుకు వాలపిడుగు
కాసెవాని దుడుకు కాకుత్సుబాణంబు"

అంటూ వేమన చేతివృత్తులవారు లేకుంటే కలిగే అనర్థాన్ని ఎత్తిచూపి వారిని సమర్థించినాడు.

కమ్మరి దుర్భరజీవితాన్ని పుట్టపర్తి నారాయణాచార్యులు తన మేఘదూతములో ఇట్లా వర్ణించాడు.

"వాడె కమ్మరి చూడు
దౌర్భాగ్యములు గూడు
కొలిమినూదుచు నున్నవాడూ ! తన పొట్ట
కోసమై నవయుచున్నాడూ ! అల్లంత
దూరాన నదెవాని తొయ్యలిని గనుగొమ్ము
జీరాడు చనులతో చీరనోచని చాన"

(మేఘదూతం - పుట 24.)

ఈ క్రింది నూర్పిడి పాటలో జానపదుడు కమ్మరికొలిమిని సాలంకారంగా ఎట్లా వర్ణించాడో చూడండి.

"ఊదేటి తిత్తులూ ఉరుములూ బోలు
వేసేటి సమ్మెట్లు పిడుగులాబోలు
లేచేటి రవ్వలు మెరుపులాబోలు
చుట్టున్న కాపులా చుక్కలాబోలు
నడుమకమ్మరి బిడ్డ చంద్రుణ్ణిబోలు"

—త్రివేణి పుట 116.

ఇట్లా తెలుగుకావ్యాల్లో గ్రంథస్థమై నేటికి తెలుగుదేశంలో వ్యవహారంలో ఉన్న అనేక పదాలకు ఈ నిఘంటువులో అర్థవివరణ ఉంది. ఈ కోశంలో గ్రంథస్థం కాకుండా ఆయా కేంద్రాల్లో సేకరణలో దొరకనివీ, వ్యవహార దూరమైనవీ అయిన పదాలు కొన్నితప్పి ఉండవచ్చు.

**1.5. లోహకారవృత్తిపదాలు-భాషావిశేషాలు-ధ్వనుల మార్పులు :**

లోహకారవృత్తి పదజాలంలో కూడ ఇతర వృత్తిపదజాలంలో మాదిరిగానే దేశ్యపదజాలం ఎక్కువ అయినప్పటికీ యంత్రనాగరికత ప్రభావంవల్ల వచ్చిచేరిన ఆంగ్లపదజాలం కూడ గణనీయమైన శాతంలో (25%) ఉండడం గమనించదగ్గ విషయం. అలాగే పర్షో అరబిక్ మూలకాలైన హిందూస్థానీ పదజాలం కూడ గుర్తించదగ్గ శాతం (6%)లోనే ఉంది. ఇంకొక ముఖ్యవిషయం కూడ లోహకారవృత్తి పదజాల సేకరణవల్ల తెలుస్తుంది. అది పరిసరస్త భాషలేకాక సోదరభాషలు కూడా అయిన తమిళ కన్నడ పదాలసంఖ్య ఒకట్ల స్థానాన్ని దాటకపోవడం; కేవలం పరిసరస్త భాషలైన ఒరియా, మరాఠీ భాషాపదజాలం కూడా పదికి మించకపోవడం. సోదరభాషా పదజాలం కన్నా, పరిసరస్త భాషాపదజాలం ఎక్కువగా ఉండడం. పాలితపాలక భాషల సంసర్గంలో పాలితభాషా ప్రభావ ఆధిక్యాన్ని సూచిస్తుంది.

ఈ కోశంలో గ్రంథస్థమైన పదజాలంలో కనిపించే ధ్వని పరివర్తన విశేషాలు కొన్ని కింద వర్గీకరించి చూపబడ్డాయి.

**1.5.1. అచ్చుల్లో పర్యాయ రూపత**

1. అ | ఒ ల పరివర్తనం

**క్రాళ్ళు | క్రోళ్ళు; గాడిచానం | గోడుకానం; పన్ను | పొన్ను; పంచ్ | పొంచు; బగవాని | బొగాని; మగ | మొగ; మదెలి | మొదొలి; వంపుకంటానీ | ఒంపు కంటానీ; వంపు కంపాసు | ఒంపు కంపాసు; వలువు | ఒలువు; వలుచు | ఒలుచు**

2. అ | ఎ ల పరివర్తనం

ఉద్ధరిణ | ఉద్ధరిణె; కొబ్బరి | కొబ్బెర; గజ్జలు | గజ్జెలు; గుబ్బబిళ్ళ | గుబ్బెబిళ్ళ; దీపాంతలు | దీపాంతెలు; బరిణ | బరిణె; సొలిగ | సొలిగె.

3. ఆద్యక్షరంలో 'గ' వర్ణ, 'చ' వర్ణ పరమైన అత్వానికి సాధారణంగా ఎత్వరూపమే కనిపిస్తుంది. గెడ్డపార; గెంటె; చెక్కరదీపం; చెంచా; చెటాంబరు; చెట్టిన్‌తూగు; చెట్నఅతుక్కు.

4. అ | ఉ ల పరివర్తనం

అణచు | అణుచు; ఉల్లిగడ్డచిక్కం | ఉల్లిగడ్డచిక్కు; చుక్కపెట్టె | చుక్కుపెట్టె; చెక్కనట్టుస్పానర్ | చెక్కునట్టు స్పానర్; మణుగుబుల్లచిల్లు | ముడుగుబుల్లచిల్లు.

5. అ | ఔ ల పరివర్తనం

బగవాని | బౌవ్వాని. (బగవాని | బొగవాని | బౌవ్వాని).

6. అ—ఇ ల పరివర్తనం

అణగేయు | అణిగేయు; ఈలపీట | ఈలిపీట; కుతిక | కుతికి; కత్తెర | కత్తిరి; కలశము | కలిశము; గరిట | గరిటి; గుద్దలి—గుద్దలి; చట్టి | చిట్టి; దీపాంతె | దీపింతి; భరిణ | భరిణి.

7. అయ్ | ఐ ల పరివర్తనం :

బాయ్‌లర్ | బైలరు.

8. అవ్ | ఔ ల పరివర్తనం :

నవ్‌సారం | నౌసారం,

9. ఇ | అ ల పరివర్తనం :

ఉద్దరిణి | ఉద్దరిణ; గరిటె | గరట; చిత్రికపెట్టు | చత్రికపెట్టు; తప్పిల | తప్పాల; బొడ్డుగురిగి | బొడ్డుగురగ; వెలిగారం | వెళగారం.

10. ఇ | ఉ ల పరివర్తనం :

ఇంచి | ఈంచులపట్టీ; ఈలపీట | ఉల్లిపీట; కైపిడి | కైపుడి; గుండిగ | గుండుగ; దిద్దు | దుద్దు.

11. ఇ | ఎ ల పరివర్తనం.

కుంది | కుందె; కజ్జిగకట్టరు | కజ్జెలకట్టరు; గరిట | గరిటె; గిన్ని | గిన్నె; తపిల | తపెల.

12. ఉ | అ ల పరివర్తనం.

ఇనుపదుక్క | ఇనపదుక్క; ఇనుముకళాయి | ఇనపకళాయి; ఇసుక | ఇసక; ఎలుకలబోను | ఎలకలబోను; రుద్దు | రద్దు.

13. ఉ | ఇ ల పరివర్తనం.

ఊదుబుర్ర | ఊదిబుర్ర; కాటుకకాయ | కాటికకాయ; గుండుగిన్నె | గుండీగిన్నె; గోడుసుత్తి | గోడిసుత్తి

14. ఉ | ఒ ల పరివర్తనం.

అంబురు | అంబోరు; గుండుసుత్తె | గొండుసుత్తె; కురువిందంరాయి | కొరువిందంరాయి.

15. ఎ | అ ల పరివర్తనం.

అట్లపెనం | అట్లపానం.

16. ఎ | ఇ ల పరివర్తనం.

కుంచె | కుంచి; బిందె | బింది.

17. ఎ | ఉ ల పరివర్తనం.

కుంచె | కుంచు.

18. ఎ | ఒ ల పరివర్తనం.

వెంటిలేటర్ | ఒంటిలేటర్.

19. ఎ | ఐ ల పరివర్తనం.

ఏసిడ్ | ఐసిడ్.

20. ఒ | ఉ ల పరివర్తనం.

కొప్పెర | కుప్పెర; కొరుడు | కురుడు; కొరవిందంరాయి | కురువిందంరాయి.

21. ఏ | ఆ ల పరివర్తనం.

అరటేకు | అరటాకు; ఏసిడ్ | ఆసిడ్; జడ్ఏంగ్లర్ | జడ్ఆంగ్లర్; టేంకు | టాంకి.

22. అచ్చుల హ్రస్వదీర్ఘత్వాలు - అర్థభేదాన్ని కలిగించని సందర్భాలు ;

ఇలపీట - ఈలపీట.

ఓగరాల - ఓగరల.

కుంచ - కుంచా.

కుట్టంపెట్టు - కుట్టాంపెట్టు.
కురల్ప్లేటు - కూరలప్లేటు.
కారం - కోరం, కోరాం.

23. ఈ క్రింది రూపాలలో ప్రధాన రూపాన్ని ఆధారంగా చేసుకొని వాటి పరిణామ భేదాన్ని నిర్ణయించవచ్చు.

ఆంగలర్ ⟵ ఏంగ్లర్ (Angler) ⟶ యాంగ్లర్. స్పానరు ⟶ పానర్ ⟶ పానం ⟶ పాన.
ఇలపీట ⟵ ఈలపీట ⟵ ఇల్లిపీట ⟶ ఉల్లిపీట. ఆసీడ్ ⟵ ఆసిడ్ - ఏసిడ్ (Acid) ⟶ యాసిడ్ ⟶ ఐసిడ్.

షడగోపురం ⟵ షటగోపు ⟵ శఠగోపం ⟶ శటగోపురం ⟶ శఠగోపురం.

గన్ను ⟵ గన్ ⟶ గని ⟶ గను ⟶ గం ⟶ గాన.

## 1.5.2. హల్లుల ధ్వని పరివర్తనం

(a) పదాది హల్లుల్లో పరివర్తనం

1. క- | గ- కజ్జికాయపెట్టె | గజ్జికాయఅచ్చు; కుబ్బలు | గుబ్బలు; కంజీతట్ట | గంజీతట్ట
2. క- | ప- కడవ | పట్వ; కత్తిచాకు | పత్తిచాకు
3. గ- | జ- గిలకొట్టు | జిలకొట్టు
4. గ- | బ- గ్లోవ్స్ | బ్లౌజు
5. చ- | త- చిత్తి | తిత్తి; బీళ్ళలచెక్కసుత్తి | బీళ్ళలతక్కసుత్తి
6. చ- | శ- | స- చీల | శీల | సీల
7. చ- | ష- చెకనంపని | షెకనంపని
8. చ- | స- చంకబిందె | సంకబిందె; చిప్పింగ్‌చేయు | సిప్పింగ్‌చేయు; చిల్లీస్‌కట్టర్ | సిరిస్ కట్టర్
9. జ- | ద- జంతికలకొట్టం | దంతికలగొట్టం; జోడుతపెలె | దోడితపేల
10. ట- | డ- టకారం | డకారం
11. డ- | ట- డేక్సాచెంబు | టేక్సాచెంబు
12. డ- | ద- డబుల్‌చుక్కపోగ | దబుల్‌చుక్కపోగరు; డాక | దాగ; డాకలి | దాగలి; డిష్ | దిస్
13. త- | ట- తీపిడబ్బా | టీపిడబ్బా; తుంగుమొద్దు | టుంగుమొద్దు; పిడకలతంపు | పిడకలటంపు
14. త- | స- తాంబాళం | సాంబాళం
15. ద- | ర- దుద్దు | రుద్దు
16. న- | ల- నిఖిని | లిఖిని; నైలాన్‌సుత్తి | లైలాన్‌సుత్తి
17. ప- | -ఠ పిత్తడి | ఇత్తడి(?)
18. ప- | బ- పొక్క | బొక్క; మజ్జిగపుడగ | మజ్జిగబుడద

19. ప- | మ- మజ్జిగపుడగ | మజ్జిగముడత

20. బ- | జ- పరివర్తనం బంకమట్టి | జింకమట్టి

21. ర- | ల- పరివర్తనం రబ్బరు | లబ్బరు; రెక్లప్టెర్ | లెపెక్టర్

22. ర- | φ- జ్యాస్క్రసరు | జ్యాస్కసరు; త్రుప్పు | తుప్పు; శ్రావణం | శానం; స్ప్రియర్ | స్పేయర్; పదాది సంయుక్తాక్షరంలో రేఫ లోపించడం తెలుగుభాషకు సహజం. అపదాది సంయుక్తాక్షరంలో రేఫ లోపించిన సందర్భాలు కూడ లోహకారవృత్తి పదజాలంలో ఉన్నాయి.

గుండ్రంఉలి | గుండుఉలి; చట్రం | చట్టం

23. వ- | φ దెబ్బవేయు—దెబ్బఏయు

24. వ- | బ- ల పరివర్తనం వత్తులస్టౌ | బత్తీలస్టౌ; వెలిగారం | బెళగారం

25. శ- | చ- ల పరివర్తనం స్రావణం | చానం

26. శ- | ష- ల పరివర్తనం శటగోపురం | షటగోపు; శానం | షానం; శ్రావణం | షావణం

27. ష- | స- పరివర్తనం షుగర్పాట్టు | సుగర్పాట్టు; షైనింగ్పొటాష్ | సైనింగ్పొటాష్; షోలా పురంబిందె | సోలాపురంబిందె

28. స- | చ- పరివర్తనం సిచ్చు (Switch) | చిచ్చు; కొజ్జాసెరవ | కొజ్జాచెరవ; సలాక | చలాక

29. స- | జ- ల పరివర్తనం తక్కెడసిబ్బులు | తక్కెడజిబ్బులు; సిబ్బిరేకు | జిబ్బిరేకు

30. స- | ష- ల పరివర్తనం సల్ఫర్ | షలరు

31. హ | φ హస్తం | అస్తం; హబ్బు | అబ్బు; దీపహారతి | దీపారతి; హోల్పాక్సు | ఓల్పాక్సు; హోల్డరు | ఓల్డరు

(b) అపదాది హల్లుల పరివర్తనం :

1. - క - | - గ - పోకరు | పోగరు; దాకలి | దాగలి; జవ్వకారు | జవ్వగారు; కురుకు | కురుగు; నక్కలుతీయు | నగ్గలుతీయు.

2. - క - | - చ - దోసెపెంకు | దోసెపెంచు; పెంకు | పెంచు.

3. - క్ష - | - చ్చ - నాలుగుపక్షాల సుత్తి | నాలుగుపచ్చాల సుత్తి.

4. - గ - | - జ - బుడిగె | బుజిడి.

5. - గ - | - ద -మజ్జిగబుడిగ | మజ్జిగబుడిద.

6. - గ - | - య - సాపుకాగితం | సాపుకాయితం.

7. - గ - | వ - నగిషీచేయు | నవిషీచేయు; పూసపోగు | పూసపావు; రాగేకు | రావేకు.

8. - చ - | జ - పలకరించి | పలకరేంజి.

9. - ట - | — డ - కుటకలమంచం | కుడకలకంచం; చిన్నమటన్నసుత్తె | చిన్నమద్దుసుత్తె; బీటుమూకుడి | బీడుమూకుడి.

10. - ట - | - త - గుంటపెనుము | గుంతపెనుము; చాయ్‌కెట్లి | చాయ్‌కేత్లి; శటగోపురం | శతగోపం.

11. - ట్ట - | - ట్ర - చట్టం | చత్రం; పుట్రగాలు | పుట్రాలు.

12. - డ - | - ద - కూరడాక | కూరదాక; మద్రాసుబిందె | మద్రాసుబిందె.

13. - డ - | - న - పొంగడాలు | పొంగనాలు; తాపడంచేయు | తాపనంచేయు.

14. - డ - | - ర - కచడ | కచర; మడుచు | మరుచు; మందడి | మందరి; ముందడిజాడి | ముందరిజాడి.

15. - డ - | - ల - మందడి | మందలి; మరతోడు | మరతోలు.

16. - డ - | - ళ - పొంగడాలపెంచు | పొంగళాలపెంచు.

17. - డ - | - ళ - | ల - కడాయి | కళాయి | కలాయి; జోడ | జోళ; ఇత్తడి | ఇత్తళి.

18. - ండ - | - న - రౌండు ఆకురాయి | రౌను ఆకురాయి; హేండ్‌మేడు | హైన్‌మేడు.

19. - ణ - | - న - శ్రావణం | శానం; కంటాణీ | కంటానీ; కోణం | కోనం; దాణా | దానా; పణ | పన.

20. - ణ - | - మ - గీబరిణి | గీబర్మి.

21. - త - | - ట - కత్తిపీట | కట్టిపీట; జంతిగొట్టం | జంటిగొట్టం.

22. - త - | - ద - తిత్తి | తిది.

23. - ద - | - త - మురదాబాద్‌లోట | మురాతాబాద్‌లోట.

24. - న - | - ద - తేనెమైనం | తేనెమైదం.

25. - న - | - మ - సున్నాపోగరు | సుమ్మపోగరు; స్క్రీను | స్క్రీము.

26. - న - | - ల - సింహాసనం | సింహాచలం; గుంటపొంగనాలు | గుంటపొంగలాలు; గునపం | గులిపెం; మట్నసుత్తి | మట్లంసుత్తి.

27. - ప - | - బ - కంపాసు | కంబాసు; ఉేపు | ఉేబు; చాపను | చాబను.

28. - ప - | - వ - తిరగపోత | తిరగవాత; నిలుపకారు | నిలువుకారు.

29. - ప - | - స - పోపుపెట్టు | పోసుపెట్టు.

30. - బ - | - ప - రికాబు | రికాపు.

31. - బ - | - వ - చావిబిళ్ళ | చావివిళ్ళ.

32. - ంబ - | - బ - డాంబరు | డాబరు.

33. - మ - | - ప - నడుమసుత్తి | నడిపిసుత్తి.

34. - మ - | - ప - | - బ - సమ్మెట | సంపెట | సంబేట.

35. - మ - | - వ - తీర్మానంచేయు | తీర్వానంచేయు.

36. - యు - | - స - చాయ్‌పాను | చాస్‌పాను.

37. - ర - | - డ - దబరసుత్తి | దబడసుత్తి; బూరిమూకుడు | బూరిమూకిరి.

38. - ర - | - ల - కటారిసుత్తె | కటాలిసుత్తె; కార్నరు | కార్నలు; క్యారీరు | క్యారీలు; చీరు | చీలు; స్పానరు | స్పానలు.

39. - ల - | - డ - బీడుకలాయి | బీడుకడాయి; పంచపాలి | పంచపాడి.

40. - ల - | - ట - | - డ - లోపల | లోపట | లోపడ.

41. - ల - | - న - పంచపాల | పంచపాని; ఫీడింగ్‌బాటిల్ | పీడింగ్‌బటను.

42. - ల - | - ళ - కలిశం | కళశం; కలాయి | కళాయి; కీలు | కీళు; కొలాయి | కొళాయి; కోలలు | కోళలు.

43. - ళ - | - ణ - తాంబాళం | తాంబాణం.

44. - వ - | - ф - పావుకోళ్ళు | పాకోళ్ళు; కొడవలి | కొడలి.

45. - వ - | - బ - చావిబిళ్ళ | చాబిబిళ్ళ.

46. - వ - | - య - హరివాణం | హరియాణం.

47. - శ - | - చ - శలాక | చలాక.

48. - ష - | - చ - వాషరు | వాచరు.

49. - ష - | - స - జ్యూస్‌కషరు | జ్యూస్‌కసరు; గన్‌షీటు | గన్‌సీటు; డిష్ | డిస్సు.

50. - స - | - శ - గాడిసీర్నం | గాడిశీర్నం.

51. - స - | - జ - లెమన్‌స్ప్రెసర్ | లెమన్‌స్ప్రెజర్.

1.5.3. తాలవ్యీకరణం :

(a) ఈ కిందిరూపాల్లో తాలవ్యీకరణం గుర్తింపదగింది.
క > చ కిలుం — చిలుం.
కిళి — చిలుక (చిలిక్క్యాను).
తాలవ్యీకరణం చెందనిరూపం కేచెంబు < కైచెంబు.

1.5.4. వర్ణసమీకరణం ;

(a) ఏకపదంలో స్వర లోపానంతరం సంహితాగత సమీకరణం జరిగిన రూపాలు.

(కురిపి) — కుర్పి.
(చిమట) — చిమ్ట.
(చెరవ) — చెర్వ.
(జాలరు) — జాల్ర.
(డొలక) — డొల్క.

(b) సమాసరూపాల్లో స్వర లోపానంతర సమీకరణం.

అజ్జరపుబిందె — అజ్రంబిందె.
గుబ్బపోగరు — గుబ్పోగరు.
తుమ్మమొద్దు — తుమ్మొద్దు.
అడ్డాకుకంచం — అడ్డాక్కంచం.
ఆకుకత్తెర — ఆక్కత్తెర.
ఆకుకమ్మి — ఆక్కమ్మి.

(c) వర్ణసమీకరణం :

1. క్లి > క్కి  చక్లిపావు – చక్కిలంపావు.
2. ఠ > చ్చ  పఠాలగలాను – పచ్చాలగలాను.
3. క్స > చ్చు  కంపక్స – కంపచ్చు.
4. గ్ని > గ్గి  అగ్నికొలిమి – అగ్గికొలిమి.
5. ్రజ > జ్జ  అ్రజంబిందె – అజ్జరపుబిందె.
6. ట్క > ట్ట  పట్కార – పట్టకార.
7. ట్న > ట్ట  మట్నంపోగరు – మట్టపోగర.
8. ్రట > ట్ట  చ్రటం – చట్టం; చి్రటం – చిట్టం.
9. ంబ > మ్మ  కంబి – కమ్మి; జాలీచెంబు – జాలీసెమ్ము.
10. ర్న > న్న  టర్నర్ – టన్నర్.
11. ల్ది > ద్ది  సల్దిదబ్బా – సద్దిదబ్బా.
12. ల్ని > న్ని  ఛాల్ని – ఛన్ని.
13. స్త > త్తా  దస్తాగిన్నె – దత్తాగిన్నె.

1.5.5. స్వరభక్తి : (స్వరాగమం)

క్లిప్పు – కిలిప్పు; గర్దరు – గరదరు; గుండుగ్లాసు – గుండుగిలాసు; దేక్షా – దేగిషా; బ్లోరు – బిలోరు, బులోరు, బులేరు; వస్త్రుకాయితం – వస్తరకాయితం.

1.5.6. వర్ణలోపం :

(a) పదాది 'ప' వర్ణలోపం.

పిత్తడి – ఇత్తడి.

(b) ఇ ఎ లకు ముందు 'వ' వర్ణలోపం.

విడదీయు – ఇడదీయు; విడగొట్టు – ఇడగొట్టు; వీరగ్గొట్టు – ఇరగ్గొట్టు; వెనకమూత – ఎన్కమూత; వెల్లిగారం – ఎల్లిగారం.

(c) పదాది 'హ' వర్ణలోపం.

హస్తం – అస్తం; హబ్బు – అబ్బు; హోల్‌పాకు – ఓల్‌పాకు; హోల్డరు – ఓల్డరు.

(d) పదాంత 'డ' వర్ణలోపం.

రెండుకంచం – రెనుకంచం.

(e) పదాది సంయుక్తంలో 'ర' వర్ణలోపం.

త్రుప్పు – తుప్పు; శ్రావణం – శావనం; స్ప్రియర్ – స్పేయర్.

(f) పదాది సంయుక్తంలో 'స' వర్ణలోపం.

స్తాంబాళం – తాంబాళం.

సంయుక్తాక్షరాల సూక్ష్మీకరణ :

బూర్లెమూకుడు – బూలెమూకుడు; ట్యూబ్ – సూపు.

1.5.7. అక్షరలోపం :

ఓలిగపెనుము – ఓలిపెనుము; కంచుసుత్తి – కంచుత్తి; చిన్నిగడ్డపార – చిన్నగడార;
చేతికారు – చేకారు; జంతికగొట్టం – జంటిగొట్టం.

1.5.8. ద్విత్వలోపం :

అడ్డబద్ద – అడబద్ద; అడ్డమొద్దు – అడమొద్దు; గెడ్డపార – గెడపార; మద్దులి – మదులి.

1.5.9. లోపదీర్ఘత :

అట్టెం – అటేము; అన్నంచెయ్యి – అన్నంచేయి; ఉయ్యాల – ఊయల;
జల్లిగంటె – జాలిగంటె; పెండ – పేడ.

1.5.10. వర్ణవ్యత్యయం :

కోను ఆకుపర – కోను ఆప్కార; గజందబ్బ – గజంబద్ద; పల్చగ – సల్పగ;
బుడిగె – బుజిడి; స్కూ్ర – స్కూలు.

1.5.11. కృతక ప్రామాణికరూపాలు :

ఆమ్లెట్ గరిట – హామ్‌లెట్ గరిట; దూపారతి – దూపహార్తి; ఏర్‌కీ – హేర్‌కీ;
పంచపాత్ర – పంచ్‌పాత్ర; బ్రాస్‌బుష్ – బ్రాష్‌బుష్; బ్లోర్ – ఫ్లోర్.

1.6. సమాసరూపాలు :

ఈ నిఘంటువులో గ్రంథస్థమైన పదజాలంలో సమాసరూపాల నిర్మాణం పరిశీలనార్హమైంది. ఇందులోని సమాసాలను ఈక్రింది విధంగా వివిధ రకాలుగా వర్గీకరించవచ్చు.

1.6.1. (a) కేవలం దేశ్యపదాలతోకూడిన దేశ్యసమాసాలు :

ఇటువంటివి లోహకారవృత్తి పదజాలంలో విరివిగా కనిపిస్తాయి;

ఉదా :– అత్తిరసపలక, ఆవకాయగంటె, ఇస్తరాకు్కంచం, ఈలపీట, ఉగ్గుగిన్నె, ఊదుడుగొట్టం, ఎల్లబూడిద, ఒంగసుత్తి, ఓలిగపెనుము, కజ్జికాయపెట్టె, గుల్లమోపు, చిన్నకత్తెర, జీడిమామిడి మరచెంబు, డాకలిమొద్దు, తడిపొట్టు, దోటికత్తి, నాటుకత్తెర, పండ్లపుల్ల, బావిగిలక, మజ్జిగదుత్త, రంపంపొట్టు, లావుబిందె, వంపుదాగలి, సంగటిబాన.

1.6.2. (b) తత్సమ తద్భవాలున్న మిశ్రసమాసాలు :

ఇలాంటి సమాసాల్లో సాధారణంగా మొదటిపదం తత్సమతద్భవాల్లో ఒకటిగాను, రెండవది దేశ్యంగాను ఉంటుంది. ఉదాహరణకు కొన్ని –

తత్సమసహితాలు : చక్రాలగిద్దె, ఛత్రిపుల్లలు, తూర్పుబిందె, త్రిపురచెంబు, దీపారాధనకుండి, ద్రాక్షకు, ద్వాపరతోరణం, నక్షత్రార్తి, పంచపాత్ర, భజనతాళం, భుజాలకొరాం, మంజరిపీట, రంధ్రాలగరిటె, లలితజాడి, వింజామరగొట్టం, సింహాసనంతొట్టి, సీతాపతిబిద్ద, హిందూస్తాన్‌కమ్మి.

తద్భవసహితాలు : చందమామఅచ్చు, పచ్చాలగిన్నె, బసవునుత్తి, మంగళారతిపళ్ళెం, కొనపుకారు.

1.6.3. కేవలం అన్యదేశ్య సమాసాలు :

వీటిని మళ్ళీ మూడురకాలుగా వర్గీకరించవచ్చు

(a) కేవలం హిందూస్థానీ పదాలతో కూడినవి. ఇవి 105.

ఉదా : అత్తరసీసా, అమన్‌దస్తా, చపాతిడబ్బా, చాయ్‌చెంబా, చోరీఖానా, ఝూలాపానా, పాన్ మసాలాడబ్బా, పాన్‌దాను, బాజీచెంచా, మసాలడబ్బా, లస్సీబుడ్డీ, సాదాలోట, సాపుకాయితం, సేదపట్టీ, సెట్నాలచంచా.

(b) కేవలం ఇంగ్లీషు పదాలతో కూడినవి. ఇవి – 901.

ఉదా :–అండర్‌గ్రౌండు, సీక్రెట్‌బీరువా, ఆపిల్‌కట్టర్, ఆయిల్‌కాను, ఆర్క్‌వెల్డింగ్, ఎగ్‌కట్టర్, ఎమ్రీపేపరు, ఈజీచెయిర్, గ్రైండింగ్‌మిషను, గ్లాస్‌స్టాండు, డ్రస్సింగ్‌టైపు బీరువా.

(c) ఇంగ్లీషు హిందూస్థానీ పదాలతో కూడినవి. ఇవి – 69. వీటిని మళ్ళీ రెండురకాలుగా విభజించవచ్చు :

(1) మొదటిపదం ఇంగ్లీషు, రెండోది హిందూస్థానీ. ఇవి – 21.

ఉదా : ఆయిల్‌డబ్బా, ఎమిటెకాగితం, ఒవల్‌బాజిల్, కరీడబ్బా, టేపుడబ్బా, పాలిష్‌కాయితం, ఫ్యాన్సీకిస్తీ, బెండింగ్‌కడ్డీ, మోల్డింగ్‌అండా, రైలుకూజా, హార్లిక్స్‌సీసా.

(2) మొదటిపదం హిందూస్థానీ, రెండోది ఇంగ్లీషు. ఇవి – 48.

అండాకట్టరు, అండాహ్యాండిలు, అల్వాట్రే, చట్నీప్లేటు, చాయ్‌స్టాండు, చెంచాకాస్టాండు, చెంచా కారేజీ, డబ్బాటిఫెను, పలావ్‌ట్రే, పాన్‌స్పూను, బాజీస్పూను, మసాలాబాక్స్, మిర్చికట్టర్, రసగుల్లా పికప్, సాహెబ్‌ప్లేటు.

1.6.4. అన్యదేశ్య దేశ్యపద సంఘటిత సమాసాలు :

సమాసగత పదక్రమాన్నిబట్టి వీటిని రెండురకాలుగా వర్గీకరించవచ్చు (a) అన్యదేశ్య దేశ్యమిశ్రాలు. (b) దేశ్య అన్యదేశ్య మిశ్రాలు.

(a) అన్యదేశ్య దేశ్యమిశ్రాలు :

(1) హిందూస్థానీ తెలుగుపద క్రమమున్న సమాసాలు. ఇవి – 104.

ఉదా :–అండాగిన్నె, కూజాచెంబు, చట్నీతుక్కు, చప్పాతిగిన్నె, డబ్బాగిన్నె, దర్జీకత్తెర, నగిషీ సుత్తి, పార్శీచెంబు, బూందిగంటె, సాదాకంచం, రొట్టెపెట్టె.

ఇంగ్లీషు తెలుగుపద క్రమమున్న సమాసాలు. ఇవి – 413.

ఉదా :–అల్యూమినియం గరిట, ఆయిల్‌గిన్నె, ఇంగ్లీషుకత్తి, కుక్కర్‌గిన్నె, కోకనట్టుజాడీ, గ్యాసుపొయ్యి, చర్చిబొమ్మ, టింకరుసుత్తి, డబుల్‌చక్కపోగరు, నిప్పల్‌గిన్నె, పిట్టర్‌బానం, పూటుబద్ద, ఫ్లవర్ కుంకుమభరణి, బత్తిస్టాండు, మిల్క్‌పడి, మిషన్‌కత్తెర, యుదిమ్మ, రింగుచెంబు, లైట్‌గడ్డ, వాటర్‌గిన్నె, వెల్డింగ్‌గడ్డపార, సబ్బుపెట్టె, సిప్పింగ్‌శానం, సెట్టింగ్‌సుత్తి, హామ్‌లెట్‌గరిట, హోల్‌పోగరు.

(b) దేశ్య అన్యదేశ్య మిశ్రాలు : ఇవి రెండురకాలు.

(1) తెలుగు హిందూస్థానీపద క్రమమున్న సమాసాలు. ఇవి – 30.

ఉదా ; అగ్రజండబ్బా, అన్నంచెంబా, అన్నండేక్సా, ఇడ్లీడబ్బా, ఇత్తడికార్ఖానం, ఇనపకళాయి, కాడచెంబా, గుండిడేక్సి, డిజైన్‌గరిట, పన్నీరుసీసా, నీళ్ళడబ్బా, పాలబుడ్డీ, మూతడబ్బీ, మోటకాయితం, లోతుడబరా, వక్కపొడిడబ్బా.

(2) తెలుగు ఇంగ్లీషుపద క్రమమున్న సమాసాలు. ఇవి – 201.

ఉదా : అగరుబత్తిస్టాండు, అంచుగ్లాసు, ఆఫ్‌రౌండు ఆకురాయి, ఇడ్లీప్లేటు, ఎర్రగడ్డకట్టర్, కంచుప్లేటు, కాఫీగిన్నె, కాడమగ్గు, కుట్టుమిషను, గద్దెగిలాసా, గాలిపంపు, గొల్లెంటిఫిన్, చందనకప్పు, చిల్లిప్లేటు, దానంగ్లాసు, నిమ్మకాయకసర్, పచ్చలగలాసు, పాలకుక్కరు, బొక్కలస్పూనరు, బత్తీలస్టౌ, రింగుచెంబు, వంపుగ్లాసు, వెన్నబకెట్, హారతిప్లేటు.

దేశ్య పదాలతోనేకాక తత్సమతద్భవాలతో కూడిన, అన్యదేశ్య మిశ్రసమాసాలుకూడ ఈ కోశంలో కనిపిస్తాయి. అవి–

సంధ్యావందనంసెట్టు – తత్సమ అన్యదేశ్య.

సాధారణగ్లాసు – తత్సమ + అన్యదేశ్య.

రెండుకంటే ఎక్కువ పదాలున్న సమాసాల్లో పదక్రమం ఒక పద్ధతిలో లేని సమాసాలుకూడ ఈ కోశంలో ఉన్నాయి. అవి–

ఆలగడ్డకట్టర్ – హిం. దే. ఇం.

ఏక్‌నంబరుపంపు – హిం. ఇం. ఇం.

ఓవల్‌బాజీస్పూను – ఇం. హిం. ఇం.

కాఫీపొడిడబ్బా – ఇం. దే. హిం.

కాఫీపొడిస్పూను – ఇం. దే. ఇం.

కూజాబిందెకరవాయి – హిం. దే. దే.

కొత్తనమూనాబిందె – దే. హిం. దే.

గ్యాస్‌పొయ్యిలస్టాండు – ఇం. దే. ఇం.

చిన్నగన్‌సుత్తి – దే. ఇం. దే.

త్రికోణడిలాకరు – ఇం. దే. ఇం.

పెద్దరైస్‌అండ – దే. ఇం. హిం.

మటన్‌దబరాగిన్నె – ఇం. హిం. దే.

మసాలాపొడిడబ్బా – హిం. దే. హిం.

యస్. పి. దబరాగిన్నె – ఇం. హిం. దే.

రౌండుఇడ్లీప్లేటు – ఇం. దే. ఇం.

రౌండుబాజీస్పూను – ఇం. హిం. ఇం.

### 1.6.5. అన్యదేశ్యాలు :

మొత్తం పదజాలంలో ఇతర వృత్తిపదకోశా లన్నిటికన్న ఈకోశంలో అన్యదేశ్య పదాల శాతం ఎక్కువగా ఉంది. కుమ్మరం, చేనేతలలాగ ఈ వృత్తి ఏదో ఒక కులానికి చెందింది కాదు. యంత్ర నాగరికత ప్రభావంవల్ల వాడుకలోకి వచ్చిన స్టీలు, గాజుసామాన్లు, కుక్కర్లులాంటి వంటసామాన్లకు సంబంధించిన పదజాలం దాదాపు ఆంగ్లభాషామయమే. ఇవిగాక డబ్బా, బుడ్డీ, దబరా, డేగిసాలాంటి పర్షో అరబిక్ మూలకాలైన హిందూస్థానీ పదాలుకూడ గణనీయమైన సంఖ్యలోనే కనిపిస్తాయి.

లోహకారవృత్తి పదకోశంలో మొత్తం అన్యదేశ్యాలు : 2276. వాటి వివరాలు :—

| | |
|---|---|
| కేవలం ఇంగ్లీషు పదాలు | 378 |
| కేవలం ఇంగ్లీషు పదబంధాలు | 901 |
| ఇంగ్లీషు తెలుగు పదబంధాలు | 413 |
| తెలుగు ఇంగ్లీషు పదబంధాలు | 201 |
| కేవలం హిందూస్థానీ పదబంధాలు | 105 |
| హిందూస్థానీ ఇంగ్లీషు పదబంధాలు | 48 |
| ఇంగ్లీషు హిందూస్థానీ పదబంధాలు | 21 |
| తెలుగు హిందూస్థానీ పదబంధాలు | 71 |
| హిందూస్థానీ తెలుగు పదబంధాలు | 104 |
| ఒరియా | 2 |
| మరాఠీ | 3 |
| కన్నడ | 2 |
| తమిళ | 1 |
| హిందూస్థానీ ఇంగ్లీషు తెలుగు కలిసిన పద బంధాలు | 18 |

ఈ పదకోశంలో కనిపించే పర్యాయపద సంపదకూడ గుర్తించదగిందే. ఒక వస్తువు రకరకాల పేర్లను కల్పించే వృత్తి పనివారి సృజనాత్మకత దీనివల్ల తెలుస్తుంది.

ఉదా :—జ్యాస్‌కషరు — జ్యాస్‌వడగర, టోస్టర్, పర్లిగానిమిషన్, రవంమిషన్, రాంపాల.

కారాచాచ :—

కారాలచిట్టి, కారాసుజల్లెడ, కారెగాసం, కారెలగరిట, కారెలసొలిగలు, గిద్దె, చక్కిలంపావు, చక్కివఘ్ను. చక్రాలగిద్దె, చక్రాలపావు, చుట్లసొలిగ, జంతికగిద్దె, జంతికగొట్టం, జెల్లిగరిట, పూసగొట్టం, పూసపాగు, పూసపావు, మడుగుబోలగిద్దె, మడుగులపావు, మునుగుబుల్లచిట్లు, మురికిసెట్టు, మురుకుఅచ్చు, మురుకు కొలాయి, మురుకుచిట్టి, మురుకుపావు, మురుకులకాడ, మురుకుల కా చంచా, మురుకులగిద్దె, మురుకుల పీట, మురుగుగొట్టము, లంకశెగాలపీట, వాంపొడిసొలిగ, శేవుపీట, సేగుపావు, సొండిగలఅచ్చు, సొలిగ, హోటల్‌మిషన్.

1.6.6. పర్యాయపద కల్పనలో ఒక విశేషం కనిపిస్తుంది. ముఖ్యంగా సమాసరూపాలలో ఏదో ఒక పదాన్ని అల్లాగే ఉంచి, మరొక పదానికి పర్యాయ వాచకాన్ని గ్రహించి కూర్చడం.

(1) కారాల చిట్టి
కారాసు జల్లెడ
కారెగాసం
కారెల గరిట
కారెల సొలిగలు.

(2) చక్కిలం పావు
చక్రాల పావు
పూస పావు
మడుగాల పావు
షేగు పావు.

(3) మురికిసెట్టు
మురుకు అచ్చు
మురుకు కొలాయి
మురుకు చిట్టి
మురుకు పావు
మురుకుల కాడ
మురుకుల కా చంచా
మురుకుల గిద్దె
మురుకుల పీట
మురుగు గొట్టము.

1.6.7. ఈ గ్రంథ పరిచయంలో మాండలికపద వ్యాప్తిని తెలిపే వ్యవహారభేదకరేఖలు (Isoglosses) గీచిన పటాలను జోడించలేదు. స్థూలంగా చూసినట్లయితే ముందు వెలువడిన వ్యవసాయం. చేనేత, వాస్తుపదకోశాల్లో మాండలిక సరిహద్దులకు సంబంధించి చేసిన నిర్ణయాలే ఈ కోశానికి అన్వయిస్తాయి.

జి. నాగయ్య

# పరిశోధకుల పర్యటన వివరాలు

| ప్రాంతం ఊరి. నెం. | పర్యటించిన కేంద్రం/ఊరు | తాలూకా | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు సం॥లు | ప్రధానవృత్తి (వ్యవహర్త మాటల్లో) | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నా.సంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 1. | సుళ్ళూరుపేట | సుళ్ళూరుపేట | నెల్లూరు | 1. టి. కుప్పాచారి | ఆచార్లు | 50 | కొలిమిపని | | | వి.దొ.స్వా.నా. |
| | | | | 2. దత్తమ సింగ్ | | 50 | రేకుపని | | | ,, |
| | | | | 3. కె. మునస్వామి | | 32 | టింకరుపని | | | ,, |
| | | | | 4. ఎం. గోవిందరాజన్ | | 40 | ఇత్తడిపని | | | ,, |
| | | | | 5. అన్నయ్య | | 50 | పాత్రలఅమ్మకం | | 5వ తరగతి | ,, |
| కో. 2. | నెల్లూరు | నెల్లూరు | నెల్లూరు | 1. షేక్‌రసూల్‌సాహెబ్ | ముస్లీం | 55 | కొలిమిపని | | 3వ తరగతి | ,, |
| | | | | 2. మహబూబ్‌భాషా | ,, | 30 | వెల్డింగుపని | | | ,, |
| | | | | 3. షేక్‌సాన్‌భాషా | ,, | 50 | రేకుపని | | 6వ తరగతి | ,, |
| | | | | 4. ఈసూఫ్ | ,, | 45 | టింకరుపని | | | ,, |
| | | | | 5. అప్పలస్వామి | | 60 | పాత్రలదుకాణం | | 5వ తరగతి | ,, |
| కో. 3. | కావలి | కావలి | నెల్లూరు | 1. బళ్ళరామయ్య | | 26 | కొలిమిపని | | 5వ తరగతి | ,, |
| | | | | 2. సాంబయ్య | | 42 | వెల్డింగుపని | | 3వ తరగతి | ,, |
| | | | | 3. షేక్ అబ్దుల్ | ముస్లీం | 40 | టింకరుపని | | | ,, |
| | | | | 4. పాండురంగవర్మ | విశ్వబ్రాహ్మణ | 45 | లోహాలతయారి | | 5వ తరగతి | ,, |
| | | | | 5. కూరుబ్ | ముస్లీం | 27 | పాత్రలదుకాణం | | 10వ తరగతి | ,, |
| కో. 4. | ఒంగోలు | ఒంగోలు | ప్రకాశం | 1. తిపరం సుబ్బారావు | | 30 | కొలిమిపని | | | ,, |
| | | | | 2. మస్తాన్ | ముస్లీం | 25 | వెల్డింగుపని | | | ,, |
| | | | | 3. షేక్ సలీం | ,, | 25 | రేకుపని | | | ,, |
| | | | | 4. పోతురాజు | రాజులు | 22 | ఇత్తడిపని | | | ,, |
| | | | | 5. గోవిందశెట్టి | వైశ్య. | 50 | పాత్రలదుకాణం | | 8వ తరగతి | ,, |

కో: కోస్తా; తె: తెలంగాణా; రా: రాయలసీమ; వి.దొ.స్వా.నా. : వి. దొరస్వామినాయుడు; పి.వే.గో. : పి. వేణుగోపాల్.

| ప్రాంతం ఊరి. నెం. | పర్యటించిన కేంద్రం ఊరు | తాలూకా | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు సం॥లు | ప్రధానవృత్తి (వ్యవహర్త మాటల్లో) | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నా. సంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 5. | చీరాల | చీరాల | ప్రకాశం | 1. వెంకటేశ్వర్లు | | 35 | కొలిమిపని | | | వి.దొ.స్వా.నా. |
| | | | | 2. ఈసుప్ షేక్ | దూదేకుల | 20 | వెల్డింగుపని | | 4వ తరగతి | ,, |
| | | | | 3. షేక్‌గఫార్ | ముస్లిం | 49 | రేకుపని | | | ,, |
| | | | | 4. గొ్త్తిప్రకాశరావు | విశ్వ బ్రాహ్మణ | 36 | రాగిఇత్తడిపని | | 7వ తరగతి | ,, |
| కో. 6. | తెనాలి | తెనాలి | గుంటూరు | 1. శివకోటేశ్వరరావు | బలిజ | 30 | రేకుపని | | 3వ తరగతి | ,, |
| | | | | 2. శివారెడ్డి | కాపు | 31 | ఇత్తడిపని | | 7వ తరగతి | ,, |
| | | | | 3. అక్కలరామయ్య | మొదలియార్ | 34 | శిల్పపని | | 8వ తరగతి | ,, |
| | | | | 4. సాంబశివరావు | బలిజ | 23 | గిల్టువర్కు | | 8వ తరగతి | ,, |
| | | | | 5. శంకర్ | వైశ్య | 28 | పాత్రలదుకాణం | | 9వ తరగతి | ,, |
| కో. 7. | సత్తెనపల్లె | సత్తెనపల్లె | గుంటూరు | 1. మంకాలికోటిస్వామి | కంసాలి | 48 | కమ్మరపని | | 5వ తరగతి | ,, |
| | | | | 2. సాంబశివరావు | బ్రాహ్మణ | 34 | వెల్డింగుపని | | 10వ తరగతి | ,, |
| | | | | 3. నాగేశ్వరరావు | బలిజ | 22 | రేకుపని | | 7వ తరగతి | ,, |
| | | | | 4. గురుబాలు | ,, | 18 | మట్టుపని (ఇత్తడిపని) | | 3వ తరగతి | ,, |
| కో. 8. | గుంటూరు | గుంటూరు | గుంటూరు | 1. ఎంగయ్య | గాండ్ల | 34 | రేకుపని | | 7వ తరగతి | ,, |
| | | | | 2. షేక్ హుసేన్ | ముస్లిం | 46 | ఇత్తడిపని | | 3వ తరగతి | ,, |
| | | | | 3. రామయ్య | ఈడిగ బలిజ | 30 | పోతపని | | చదువులేదు | ,, |
| | | | | 4. రాలినూకరాచ్చారి | కంసాలి | 40 | శిల్పపని | | 6వ తరగతి | ,, |
| కో. 9. | రేపల్లె | రేపల్లె | గుంటూరు | 1. బ్రహ్మాచ్చారి | కంసాలి | 43 | కొలిమిపని | | | ,, |
| | | | | 2. వెంకటప్ప | చాకలి | 28 | వెల్డింగుపని | | 4వ తరగతి | ,, |
| | | | | 3. చినస్వామి | ఆచ్చారి | 40 | ఇత్తడిపని | | 3వ తరగతి | ,, |
| కో. 10. | విజయవాడ | | కృష్ణా | 1. వెంకటస్వామి | వైశ్య | 50 | రేకుపని | | 9వ తరగతి | ,, |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | 2. సుండి కోడిరెడ్డి | ఆచ్చారి | 52 | ఇత్తడిపని | | 5వ త:గతి | వి.దొ.స్వా.నా |
| | | | | 3. పాండురంగారావు | బలిజ | 48 | మోల్డింగ్‌వర్క్ (పోతపని) | | 8వ తరగతి | ,, |
| | | | | 4. వెంకటేశ్వరరావు | బలిజ | 48 | శిల్పపని | | 7వ తరగతి | ,, |
| కో. 11. | గుడివాడ | గుడివాడ | కృష్ణా | 1. నరసింహాచారి | ఆచారి | 31 | కొలిమిపని | | 3వ తరగతి | ,, |
| | | | | 2. సలీం | ముస్లీం | 45 | రేకుపని | | — | ,, |
| | | | | 3. మునిరాం | బలిజ | 30 | మోల్డింగ్‌పని | | — | ,, |
| | | | | 4. గోవిందశెట్టి | వైశ్య | 45 | పాత్రలదుకాణం | | 9వ తరగతి | ,, |
| కో. 12. | మచిలీపట్నం | మచిలీపట్నం | కృష్ణా | 1. భీమాసాహెబ్ | దూదేకుల | 32 | రేకుపని | | 5వ తరగతి | ,, |
| | | | | 2. సుబ్బయ్య | బలిజ | 62 | ఇత్తడిపని | | 8వ తరగతి | ,, |
| | | | | 3. సలీం | ముస్లీం | 35 | పాత్రలదుకాణం | | — | ,, |
| కో. 13. | ఏలూరు | ఏలూరు | పశ్చిమగోదావరి | 1. లక్ష్మణరావు | బలిజ | 35 | వెల్డింగ్‌పని | | 5వ తరగతి | ,, |
| | | | | 2. నాయుళ్ళ పెద్దిరాజు | — | 70 | రేకుపని | | — | ,, |
| | | | | 3. బాపయ్య | — | 40 | టింకరుపని | | 4వ తరగతి | ,, |
| | | | | 4. కె. మునుస్వామి | ఆచార్లు | 58 | ఇత్తడిపని | | 8వ తరగతి | ,, |
| | | | | 5. చెంచయ్య | బలిజ | 23 | పాత్రలదుకాణం | | — | ,, |
| కో. 14. | తణుకు | తణుకు | పశ్చిమగోదావరి | 1. పైలి సింహాద్రి | బలిజ | 60 | కొలిమిపని | | 3వ తరగతి | ,, |
| | | | | 2. బాలక్రిష్ణయ్య | బలిజ | 18 | సాల్డరింగ్‌పని | | 2వ తరగతి | ,, |
| | | | | 3. నలిమెలి క్రిష్ణారెడ్డి | కాపు | 40 | పోతపని | | 5వ తరగతి | ,, |
| కో. 15. | భీమవరం | భీమవరం | ,, | 1. పి. నరసింహమూర్తి | కంసాలి | 48 | కొలిమిపని | | 3వ తరగతి | ,, |
| | | | | 2. సచ్చిదానందమూర్తి | ఆచ్చారి | 42 | రేకుపని | | 2వ తరగతి | ,, |
| | | | | 3. మానిపల్లి ప్రసాద్ | — | 23 | ఇత్తడిపని | | — | ,, |
| | | | | 4. లక్ష్మీనారాయణ | వైశ్య | 43 | పాత్రలదుకాణం | | 8వ తరగతి | ,, |
| కో. 16. | నరసాపురం | నర్సాపురం | పశ్చిమ గోదావరి | 1. గుసిక్రితిమూర్తులు | కమ్మరకులం | 23 | కొలిమిపని | రేకుపని | చదువులేదు | పి.వే.గో. |
| | | | | 2. కోలా చంద్రశేఖర్‌రావు | అగ్నికుల క్షత్రియ | 22 | డిజైనువర్క్ (వెల్డింగ్‌పని) | | 8వ తరగతి | ,, |
| | | | | 3. గుబ్బుర నారాయణమూర్తి | శెట్టిబలిజ | 54 | రేకుపని | | 8వ తరగతి | ,, |
| | | | | 4. దేవాదుల నరసింహాచారి | కంసాలి | 38 | ఇత్తడిపని | | SSLC (Old) | ,, |
| | | | | 5. కోటిపల్లి దొర | తెలగ | 35 | పాత్రలదుకాణం | | ఇంటర్మీడియట్ | ,, |

| ప్రాంతం ఊరి. నెం. | పర్యటించిన కేంద్రం/ఊరు | తాలూకా | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు సం॥లు | ప్రధానవృత్తి (వ్యవహర్త మాటల్లో) | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నా.సంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 16. | నరసాపురం | నర్సాపురం | పశ్చిమ గోదావరి | 6. ధవళా సూర్యారావు | తెలగకాపు | 60 | శిల్పపని | | 2 వ తరగతి | పి. వే. గో. |
| కో. 17. | రాజమండ్రి | రాజమండ్రి | తూర్పు గోదావరి | 1. ఎస్. బాబూరావు | అగ్నికుల క్షత్రియ | 48 | మాట్లుపని (కమ్మరం) | వడ్రంగం | 4 వ తరగతి | ,, |
| | | | | 2. వి. సూర్యానారాయణ | కొప్పుల వెలమ | 40 | వెల్డింగుపని | — | 9 వ తరగతి | ,, |
| | | | | 3. పి. సాయిబాబు | శెట్టిబలిజ | 28 | రేకుపని | — | 6 వ తరగతి | ,, |
| | | | | 4. కోరుమిల్లి మహాలింగం | విశ్వబ్రాహ్మణ | 65 | శిల్పపని | — | పెద్ద బాలశిక్ష | ,, |
| | | | | 5. శీలం నూకరాజు | పద్మసాలె | 60 | పాత్రల దుకాణం | — | — | ,, |
| కో. 18. | అమలాపురం | అమలాపురం | ,, | 1. ఇళ్ళ వెంకటేశ్వరావు | శెట్టిబలిజ | 30 | కమ్మరం | — | 9 వ తరగతి | ,, |
| | | | | 2. పి. అప్పారావు | ,, | 42 | వెల్డింగ్‌పని | కమ్మరం | 4 వ తరగతి | ,, |
| | | | | 3. గురవయ్యానాయుడు | తెలగ నాయుడు | 45 | రేకుపని | — | చదువులేదు | ,, |
| | | | | 4. పులిగడ్డసూర్యనారాయణ | కంసాలి (దేశస్థులు) | 58 | శిల్పపని | — | 4 వ తరగతి | ,, |
| | | | | 5. జగన్నాథరావు | వైశ్య | 33 | పాత్రల దుకాణం | — | పి.యు.సి. | ,, |
| కో. 19. | కాకినాడ | కాకినాడ | ,, | 1. జి. వెంకట్రావు | కమ్మరబ్రహ్మ | 30 | కొలిమిపని | వడ్రంగం | — | ,, |
| | | | | 2. అట్ల క్రిష్ణ | వడమటికాపు | 26 | వెల్డింగ్‌పని | — | 5 వ తధగతి | ,, |
| | | | | 3. వి. చిన్నన్న | గొల్ల | 17 | రేకుపని | మెకానికల్ వర్కు | 4 వ తరగతి | ,, |
| | | | | 4. జి. తమ్మారెడ్డి | పంటరెడ్డి | 64 | టింకరపని | — | — | ,, |
| | | | | 5. పైల వెంకటేశ్వర్లు | తూర్పుకాపు | 54 | ఇత్తడిపని | — | 7 వ తరగతి | ,, |
| | | | | 6. లొల్ల నారాయణమూర్తి | పద్మసాలె | 45 | పోతపని | — | — | ,, |
| | | | | 7. జి. కైలాష్ | విశ్వబ్రాహ్మణ | 25 | పాత్రల దుకాణం | — | బి. కాం. | ,, |
| కో. 20. | తుని | తుని | తూర్పు గోదావరి | 1. టి. నూకరాజు | కమ్మరబ్రహ్మ | 60 | కమ్మరం | వడ్రంగం | — | ,, |
| | | | | 2. పప్పు వీర్రాజు | పద్మసాలె | 57 | ఫ్రేమువర్కు | | 5వ తరగతి | ,, |
| | | | | 3. కె. సత్యనారాయణ | శెట్టిబలిజ | 29 | టింకరువర్కు | | 1వ తరగతి | ,, |
| | | | | 4. యమ్. బాబూరావు | విశ్వబ్రాహ్మ | 35 | ఇత్తడిపని | | 3వ తరగతి | ,, |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | 5. కె. నారాయణమూర్తి | కొప్పు ఎలమ (నాయుడు) | 50 | మోల్డింగ్‌పని | | 3వ తరగతి | ,, |
| | | | | 6. సుబ్బారావు | వైశ్య | 39 | మెటల్‌షాపు (పాత్రలదుకాణం) | | 9వ తరగతి | ,, |
| కో. 21. | ఎలమంచిలి | ఎలమంచిలి | విశాఖపట్నం | 1. పి. సాంబశివరావు | కంసాలి | 30 | కమ్మరం | వడ్రంగం | 3వ తరగతి | ,, |
| | | | | 2. అంగా శంకర్రావు | అగ్నికుల క్షత్రియ | 42 | జాబిరివర్క్ | 1. ఎలక్ట్రికల్ ఇంజినీరింగ్ వర్క్ 2. రేకుపని | 7వ తరగతి | ,, |
| | | | | 3. డి. సూర్యారావు | శెట్టిబలిజ | 35 | షీట్ మెటల్ వర్క్ | | 2వ తరగతి | ,, |
| | | | | 4. మానేపల్లి బుచ్చయ్య | కంసాలి | 55 | ఇత్తడిపని | | 5వ తరగతి | ,, |
| | | | | 5. ఎమ్. మల్లికార్జునరావు | దేవాంగ | 70 | పోతపని | | 10వ తరగతి | ,, |
| | | | | 6. ఇ. ఆదినారాయణరావు | కంసాలి | 32 | పాత్రలదుకాణం | | — | ,, |
| కో. 22. | అనకాపల్లి | అనకాపల్లి | విశాఖపట్నం | 1. డి. సత్యం | బొందిలి రాజులు | 50 | కమ్మరం | — | — | ,, |
| | | | | 2. గౌరీశంకర్ | షరాబు | 22 | ఫాబ్రికేషన్ వర్క్ | — | 9 వ తరగతి | ,, |
| | | | | 3. కె. నాగేశ్వర్రావు | పెద్దకాపు | 32 | రేకుపని | — | 8 వ తరగతి | ,, |
| | | | | 4. కలిమి అప్పారావు | తూర్పు కాపు | 28 | టింకరుపని | — | 5 వ తరగతి | ,, |
| | | | | 5. ఎ. అప్పలాచార్య | విశ్వబ్రాహ్మణ | 35 | ఇత్తడిపని | — | — | ,, |
| | | | | 6. జి క్రిష్ణారావు | తెలగకాపు | 32 | పోతపని | — | S.S. L.C. | ,, |
| | | | | 7. జగన్నాధం | పద్మసాలె | 32 | స్పిన్నింగ్‌వర్క్ | — | 3 వ తరగతి | ,, |
| | | | | 8. కె. వీరభద్రస్వామి | లింగబలిజ | 50 | పాత్రల దుకాణం | — | స్కూల్‌ఫైనల్ | ,, |
| కో. 23. | విశాఖపట్నం | విశాఖపట్నం | ,, | 1. బి. లక్ష్మణరావు | పద్మసాలె | 34 | కమ్మరం | డిజైన్‌వెల్డింగ్ | — | ,, |
| | | | | 2. జి. జోజి | వెలమ | 25 | గ్రిల్‌వర్క్ | — | 9 వ తరగతి | ,, |
| | | | | 3. ఎస్.ఎ.కె. మొహిజుద్దీన్ | ముస్లీం | 50 | రేకుపని | — | స్కూల్‌ఫైనల్ | ,, |
| | | | | 4. చింతల ఎర్రయ్య | పెద్దకాపు | 35 | టింకరుపని | — | 5 వ తరగతి | ,, |
| | | | | 5. రాలి చినబాబు | విశ్వబ్రాహ్మణ | 26 | ఇత్తడిపని | — | — | ,, |
| | | | | 6. ఎ. నాగరాజు | తెలగ | 22 | పాత్రల దుకాణం | — | 10వతరగతి | ,, |
| కో. 24. | శృంగవరపుకోట | శృంగవరపుకోట | విశాఖపట్నం | 1. కోదండరామాచార్యులు | బ్రహ్మ | 28 | కమ్మరం | వడ్రంగం | 6 వ తరగతి | ,, |
| | | | | 2. పి.ఎస్.జె.భాస్కర్రావు | గౌర | 19 | వెల్డింగుపని | | 10వ తరగతి | ,, |

| ప్రాంతం ఊరి. నెం. | పర్యటించిన కేంద్రం ఊరు | తాలూకా | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు సం॥లు | ప్రధానవృత్తి (వ్యవహర్త మాటల్లో) | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నా. సంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కో. 24. | శృంగవరపుకోట | శృంగవరపుకోట | విశాఖపట్నం | 3. ఆదారు అప్పారావు | గౌర | 33 | రేకుపని | — | 5 వ తరగతి | పి.వే.గో. |
| | | | | 4. కె. సన్యాసిరావు | కంచర (విశ్వబ్రాహ్మణ) | 40 | ఇత్తడిపని | | ,, | ,, |
| | | | | 5. ఎ. పీర్రాజా | దేవాంగులు | 40 | పోతపని | | — | ,, |
| | | | | 6. షేక్‌మదీనా | ముస్లీం | 40 | పాత్రల దుకాణం | | 6 వ తరగతి | ,, |
| కో. 25. | తగరపువలస | భీమునిపట్నం | విశాఖపట్నం | 1. ఎమ్. వెంకట్రావు | షరాబు (విశ్వబ్రాహ్మణ) | 30 | కమ్మరం | | — | ,, |
| | | | | 2. పి. రాజేంద్రప్రసాద్ | వడ్రంగి ఆచార్లు | 20 | గ్రిల్‌పని | | 5 వ తరగతి | ,, |
| | | | | 3. పి. పోలీసు | షరాబు | 70 | ఇత్తడిపని | | 3 వ తరగతి | ,, |
| | | | | 4. పి. ఏడుకొండలు | సేనాపతులు | 52 | టింకరుపని | | 6 వ తరగతి | ,, |
| | | | | 5. రాంబాబు | ,, | 28 | పాత్రల దుకాణం | | ఇంటర్మీడియట్ | ,, |
| కో. 26. | విజయనగరం | విజయనగరం | విశాఖపట్నం | 1. కె. రామారావు | షరాబు | 25 | కమ్మరం | బంగారుపని | 5 వ తరగతి | ,, |
| | | | | 2. ఎస్. ఈశ్వర్రావు | విశ్వబ్రాహ్మణ | 28 | వెల్డింగ్‌పని | | ,, | ,, |
| | | | | 3. ఆర్. అప్పలాయుడు | తూర్పుకాపు | 22 | రేకుపని | | 7వ తరగతి | ,, |
| | | | | 4. కె. సన్యాసిరావు | పంటరెడ్డి | 35 | టింకరుపని | | 5వ తరగతి | ,, |
| | | | | 5. కె. సన్యాసిరావు | కంచర | 35 | ఇత్తడిపని | | 5వ తరగతి | ,, |
| | | | | 6. కె. వాసుదేవరావు | పద్మసాలె | 33 | పోతపని | | S.S.L.C. | ,, |
| | | | | 7. ఎ.కె.ఆర్. రమేష్ | దేవాంగ | 29 | పాత్రలదుకాణం | | M Sc., | ,, |
| కో. 27. | సాలూరు | సాలూరు | శ్రీకాకుళం | 1. వి. పెద్దఅప్పలస్వామి | కమ్మర షరాబు | 70 | కమ్మరం | వడ్రంగం | 3వ తరగతి | ,, |
| | | | | 2. పి. తౌడ్ | — | 45 | డ్రిల్లువర్కు | | | ,, |
| | | | | 3. ఎమ్. గంగారాం | యాదవ | 25 | టిన్ మేకర్స్‌పని | | | ,, |
| | | | | 4. ఎమ్. వెంకట్రమణ | షరాబు (విశ్వబ్రాహ్మణ) | 45 | ఇత్తడిపని | | 1వ తరగతి | ,, |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | 5. పి. జగన్నాథరావు | కంచర (విశ్వబ్రాహ్మణ) | 50 | పోతపని | | ,, |
| | | | | 6. కె. సత్యనారాయణ | షరాబు | 33 | పాత్రలదుకాణం | పి.యు.సి. | ,, |
| కో. 28. | శ్రీకాకుళం | శ్రీకాకుళం | శ్రీకాకుళం | 1. ఎస్. సూర్యనారాయణ | షరాబు | 25 | కమ్మరం | 10వ తరగతి | ,, |
| | | | | 2. జె. వి. రమణమూర్తి | వైశ్య | 35 | వెల్డింగుపని | 7వ తరగతి | ,, |
| | | | | 3. జె. ఆదిశేష | దేవాంగ | 30 | రేకుపని | 5వ తరగతి | ,, |
| | | | | 4. సి. తౌడాచారి | కంసాలి | 31 | ఇత్తడిపని కళాయిపని | SSLC | ,, |
| | | | | 5. వి.ఉమామహేశ్వరావు | క్షత్రియ | 35 | టింకరుపని | పి.యు.సి. | ,, |
| | | | | 6. అత్తిని నీలాచలం | ఆచార్లు | 33 | శిల్పపని | 6వ తరగతి | ,, |
| | | | | 7. డి. అప్పారావు | షరాబు | 50 | పాత్రలదుకాణం కళాయిపని | 10వ తరగతి | ,, |
| కో. 29. | టెక్కలి | టెక్కలి | శ్రీకాకుళం | 1. డి. రాజారావు | షరాబు | 35 | కమ్మరం వడ్రంగం | 2 వ తరగతి | ,, |
| | | | | 2. కె. రామారావు | హరిజన్ | 27 | డిజైను ర్కు | 10వ తరగతి | ,, |
| | | | | 3. కె. తులసీరావు | షరాబు | 25 | ఇత్తడిపని | 5 వ తరగతి | ,, |
| | | | | 4. ఎ. రామూర్తి | విశ్వబ్రాహ్మణ | 62 | స్పిన్నింగ్‌వర్కు పోతపని | 8 వ తరగతి | ,, |
| | | | | 5. కె. అప్పారావు | తెలగ | 35 | టింకరుపని/ టిన్‌మేకర్‌పని | 4 వ తరగతి | ,, |
| | | | | 6. ఎస్. ప్రసాదరావు | వైశ్య | 32 | పాత్రల దుకాణం | S S.L.C. | ,, |
| కో, 30. | ఇచ్ఛాపురం | ఇచ్ఛాపురం | శ్రీకాకుళం | 1. బి. బ్రహ్మయ్య | విశ్వబ్రాహ్మణ | 30 | కమ్మరం | 9 వ తరగతి | ,, |
| | | | | 2. డి. దుర్గారావు | తెలగ | 32 | వెల్డింగ్‌పని లేత్‌వర్క్ | 3 వ తరగతి | ,, |
| | | | | 3. కె. సన్నబాబు | కొస్సారి (కంసాలి) | 28 | ఇత్తడిపని | 10వ తరగతి (ఒడియా) | ,, |
| | | | | 4. పి. యోగీశ్వరావు | ఆర్యవైశ్య | 18 | పాత్రల దుకాణం | ఇంటర్మీడియట్ | ,, |
| తె. 1. | గద్వాల | గద్వాల | మహబూబ్ నగర్ | 1. పెద్ద హనుమంతు | వడ్ల (కంసాలి) | 35 | కమ్మరం | | ,, |
| | | | | 2. ఎమ్. అబ్దుల్ అఫీవ్ | ముస్లీం | 28 | వెల్డింగ్‌పని, జాలివర్కు ఇంజనీరింగ్ వర్కు | 6 వ తరగతి | ,, |
| | | | | 3. కంచర ఎల్లయ్య | కంచర | 60 | ఇత్తడిపని | 4 వ తరగతి | ,, |
| | | | | 4. గోపాల్ | — | 40 | టింకరుపని | 3 వ తరగతి | ,, |
| | | | | 5. షఫీ అహమ్మద్ | ముస్లీం | 26 | పాత్రల దుకాణల | బి యస్.సి. | ,, |

| ప్రాంతం ఊరి. నెం. | పర్యటించిన కేంద్రం/ఊరు | తాలూకా | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు సంవత్సరాలు | ప్రధానవృత్తి (వ్యవహర్త మాటల్లో) | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నామసంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తె. 2. | నాగర్‌కర్నూలు | నాగర్‌కర్నూలు | మహబూబ్ నగర్ | 1. తిరుపతయ్య | కమ్మర | 48 | కమ్మరంపని | | 7వ తరగతి | పి.వే.గో. |
| | | | | 2. అబ్దుల్ అలీమ్‌భాషా | ముస్లీం | 21 | వెల్డింగుపని | | 5వ తరగతి | ,, |
| | | | | 3. ఎస్. వల్లి | ,, | 21 | రేకుపని | | | ,, |
| | | | | 4. కంచరం విష్ణుమూర్తి | కంచర | 43 | ఇత్తడిపని | | | ,, |
| | | | | 5. జె. నాగయ్య | ,, | 40 | పాత్రలదుకాణం | | 8వ తరగతి | ,, |
| తె. 3. | మహబూబ్ నగర్ | మహబూబ్ నగర్ | ,, | 1. కమ్మరాచారి | కమ్మర | 45 | కమ్మరం | | | ,, |
| | | | | 2. కె. బ్రహ్మయ్య | ,, | 35 | వెల్డింగుపని | | 6వ తరగతి | ,, |
| | | | | 3. ఎమ్. హఫీస్‌ఖాన్ | ముస్లీం | 22 | రేకుపని | | 10వ తరగతి | ,, |
| | | | | 4. సర్వర్ | ,, | 65 | సాటరింగ్‌పని | | | ,, |
| | | | | 5. డి. సత్యనారాయణ | త్వష్టబ్రహ్మ | 37 | ఇత్తడిపని | | | ,, |
| | | | | 6. ఎ. చందుబాబు | తోటబలిజ | 26 | పాత్రలదుకాణం | | ఇంటర్మీడియట్ | ,, |
| తె. 4. | తాండూరు | తాండూరు | రంగారెడ్డి | 1. కమ్మర దశరథ్ | రాజపూత్ (గిసాడి) | 22 | కమ్మరం, మోట పని | | | ,, |
| | | | | 2. సయ్యద్ రియాజుద్దీన్ | ముస్లీం | 21 | గ్రిల్‌వర్కు మెకానికల్‌వర్క్ | | 7వ తరగతి | ,, |
| | | | | 3. చన్నుమియా | ,, | 32 | టింకరుపని | | | |
| | | | | 4. కంచర వీరయ్య | ఛత్రపతి వంశం (మరాటి) | 32 | ఇత్తడిపని | | 5వ తరగతి | ,, |
| | | | | 5. కె. మనోహర్ | వైశ్య | 24 | పాత్రలదుకాణం | | బి. ఏ. | ,, |
| తె. 5. | వికారాబాదు | వికారాబాదు | రంగారెడ్డి | 1. కె. పాండురంగాచారి | విశ్వకర్మ | 28 | కమ్మరం | వడ్రంగం | 4వ తరగతి | ,, |
| | | | | 2. చంద్రమౌళి | ఔసలి (గోల్డ్‌స్మిత్) | 40 | వెల్డింగుపని | లేత్‌పని | 3వ తరగతి | ,, |
| | | | | 3. మహమ్మద్ యూసుఫ్ | ముస్లీం | 40 | టింకరుపని | | చదువులేదు | ,, |
| | | | | 4. గోపి | శివాజి వం. (క్షత్రియ) | 22 | పాత్రలదుకాణం | కళాయిపని | 10వ తరగతి | ,, |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తె. 6. | ఇబ్రహీంపట్నం | ఇబ్రహీంపట్నం | రంగారెడ్డి | 1. ఇ. కిరణ్‌రావు | వైశ్య | 45 | కమ్మరం | వెల్డింగుపని | పి. వే. గో. |
| | | | | 2. వాసుదేవరావు | విశ్వబ్రాహ్మణ | 50 | ఇత్తడిపని | 3వ తరగతి | ,, |
| | | | | 3. ఎస్.ఆర్. అంజనేయులు | ,, | 36 | పాత్రలదుకాణం | 7వ తరగతి | ,, |
| తె. 7. | సంగారెడ్డి | సంగారెడ్డి | మెదక్ | 1. శివయ్య | కమ్మర | 47 | కమ్మరం | | ,, |
| | | | | 2. పాండు | ముత్రాసు | 37 | ఫ్యాబ్రికేషన్‌వర్క్ | 6వ తరగతి | ,, |
| | | | | 3. పి. నరసింహం | బెస్త | 35 | రేకుపని | | ,, |
| | | | | 4. ఎమ్. అజీజ్ అల్లీఖాన్ | ముస్లీం | 40 | టింకరుపని | పాత్రల దుకాణం 4వ తరగతి | ,, |
| | | | | 5. వెంకోజీ | ఛత్రపతి వంశం | 30 | ఇత్తడిపని | గొడుగుల రిపేరి బి.కాం. | ,, |
| తె. 8. | సిద్ధిపేట | సిద్ధిపేట | మెదక్ | 1. కడియాలు సుబ్బయ్య | అచ్చారి | 28 | కొలిమిపని | 1 వ తరగతి | వి.దొ.స్వా. |
| | | | | 2. ఎ. బాలయ్య | ,, | 26 | వెల్డింగుపని | | ,, నా. |
| | | | | 3. నాగభూషణం | ,, | 46 | ఇత్తడిపని | 9 వ తరగతి | ,, |
| | | | | 4. పున్నం చంద్రబ్రహ్మయ్య | ,, | 50 | శిల్పపని | 3 వ తరగతి | ,, |
| | | | | 5. భాస్కర్ | ఈడిగ బలిజ | 36 | పాత్రల దుకాణం | 7 వ తరగతి | ,, |
| తె. 9. | మెదక్ | మెదక్ | ,, | 1. ఎమ్. డి. మహమ్మద్ గౌస్ | ముస్లీం | 38 | రేకుపని | 8 వ తరగతి | ,, |
| | | | | 2. హుసేన్‌భాషా | ,, | 40 | ఇత్తడిపని | | ,, |
| | | | | 3. వి. వి. శర్మ | బ్రాహ్మణ | 42 | పాత్రల దుకాణం | 9 వ తరగతి | ,, |
| తె. 10. | బాన్సువాడ | బాన్సువాడ | నిజామాబాద్ | 1. పకీర్‌భాషా | ముస్లీం | 55 | ఇనుపపని | 3 వ తరగతి | ,, |
| | | | | 2. రాముడు | ఆచారి | 30 | ఇత్తడిపని | | ,, |
| | | | | 3. సాంబశివయ్య | బలిజ | 50 | పాత్రల దుకాణం | 5 వ తరగతి | ,, |
| తె. 11. | నిజామాబాద్ | నిజామాబాద్ | ,, | 1. రుసూరుద్దీన్ | ముస్లీం | 37 | ఇనుపపని | | ,, |
| | | | | 2. పకీర్‌భాషా | ,, | 28 | రేకుపని | 5 వ తరగతి | ,, |
| | | | | 3. ఎమ్. హేమంతాచారి | ఆచారి | 30 | పాత్రల దుకాణం | 9 వ తరగతి | ,, |
| తె. 12. | ఆదిలాబాద్ | ఆదిలాబాద్ | ఆదిలాబాద్ | 1. రహమాన్‌భాషా | ముస్లీం | 28 | వెల్డింగ్‌పని | | |
| | | | | 2. షేక్ ఇమామ్‌సాహెబ్ | ,, | 70 | ఇత్తడిపని | 4 వ తరగతి | ,, |
| | | | | 3. సింగు | సిక్కు | 33 | రేకుపని | | ,, |
| | | | | 4. మాధవ్ | బలిజ | 45 | పాత్రల దుకాణం | | ,, |
| తె. 13. | చిన్నూరు | చిన్నూరు | ,, | 1. కె. వి. ఆచార్య | ఆచారి | 50 | కమ్మరపని | 4 వ తరగతి | ,, |

| ప్రాంతం ఊరి. నెం. | పర్యటించిన కేంద్రం/ఊరు | తాలూకా | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు సంవత్సరాలు | ప్రధానవృత్తి (వ్యవహర్త మాటల్లో) | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నామసంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తె. 13. | చిన్నూరు | చిన్నూరు | ఆదిలాబాద్ | 2. పకీర్ భాషా | ముస్లిం | 41 | వెల్డింగ్ పని | ఇంజనీరింగ్ వర్క్ | | వి.దొ.స్వా.నా. |
| | | | | 3. షేక్ అబ్దుల్లా | ,, | 31 | శిల్పపని | | | ,, |
| | | | | 4. బాపు | బలిజ | 32 | పాత్రల దుకాణం | | 5 వ తరగతి | ,, |
| తె. 14. | సిరిసిల్లా | సిరిసిల్లా | కరీంనగర్ | 1. పద్మనాభం | ఆచ్చారి | 55 | కమ్మరంపని | | 3 వ తరగతి | ,, |
| | | | | 2. బ్రహ్మయ్య | ,, | 48 | ఇత్తడిపని | | 8 వ తరగతి | ,, |
| | | | | 3. రావు | బ్రాహ్మణ | 32 | పాత్రల దుకాణం | | 10వ తరగతి | ,, |
| తె. 15. | కరీంనగర్ | కరీంనగర్ | కరీంనగర్ | 1. హనుమానుడు | ఆచ్చారి | 48 | కమ్మరంపని | | 3వ తరగతి | ,, |
| | | | | 2. కె. బాలయ్య | ,, | 40 | ఇత్తడిపని | | 5వ తరగతి | ,, |
| | | | | 3. నరసయ్య | బలిజ | 55 | పోతపని | | | ,, |
| | | | | 4. బాబూరావు | కోమటి | 32 | పాత్రలదుకాణం | | 8వ తరగతి | ,, |
| తె. 16. | మంథెన | మంథెన | ,, | 1. చంచయ్య | బలిజ | 36 | ఇత్తడిపని | | ,, | ,, |
| | | | | 2. మునిరత్నం | బ్రాహ్మణ | 32 | పాత్రలదుకాణం | | 10వ తరగతి | ,, |
| తె. 17. | వరంగల్ | వరంగల్ | వరంగల్ | 1. జంపయ్య | మన్నెపుకులం (మాల) | 45 | కమ్మరం | సానెపని | 2వ తరగతి | పి. వే. గో. |
| | | | | 2. ఎమ్. రత్నం. | క్రిష్టియన్ | 50 | వెల్డింగుపని | | 7వ తరగతి | ,, |
| | | | | 3. కె. శంకరయ్య | వడ్ల | 38 | రేకుపని | | 4వ తరగతి | ,, |
| | | | | 4. పీరాస్వామి | హరిజన్ | 21 | టింకరుపని | | | ,, |
| | | | | 5. రామనారాయణాచారి | కంచర | 24 | ఇత్తడిపని | | 8వ తరగతి | ,, |
| | | | | 6. రాగి సుదర్శనం | ,, | 36 | పోతపని | | 3వ తరగతి | ,, |
| | | | | 7. పెందోట విష్ణుమూర్తి | ,, | 30 | శిల్పపని | | 10వ తరగతి | ,, |
| | | | | 8. రాగి బ్రహ్మచారి | ,, | 40 | కంచుపని | | 8వ తరగతి | ,, |
| | | | | 9. తుమ్మ జగన్నాథం | పద్మసాలె | 50 | పాత్రలదుకాణం | | 3వ తరగతి | ,, |
| తె. 18. | నర్సంపేట | నర్సంపేట | వరంగల్ | 1. గనోజి పీరాచారి | విశ్వబ్రాహ్మణ | 40 | కమ్మరపని | | 7 వ తరగతి | ,, |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | 2. ఆలంపల్లి రాజయ్య | వడ్ల | 36 | వెల్డింగ్‌పని | లేత్‌పని | 5 వ తరగతి | ,, |
| | | | | 3. గుగ్గిల బ్రహ్మయ్య | కంచర్ల | 50 | ఇత్తడిపని | | | ,, |
| | | | | 4. మిట్టపల్లి సోమయ్య | ఇరముష్టి | 35 | పాత్రల దుకాణం | | బాలశిక్ష | ,, |
| తె. 19. | మహబూబాబాద్ | మహబూబాబాద్ | వరంగల్లు | 1. కంద్రాతి చెంచయ్య | ఆరె (కమ్మరి) | 40 | కమ్మరం | | 6 వ తరగతి | ,, |
| | | | | 2. కె. వి. రామ్ | బంజారా | 30 | ఫాబ్రికేషన్‌వర్క్ | లేత్‌వర్క్ | 7 వ తరగతి | ,, |
| | | | | 3. కందుకూరి లక్ష్మణాచారి | త్వష్టబ్రహ్మ | 35 | ఇత్తడిపని | | 10వ తరగతి | ,, |
| | | | | 4. బిట్టు చంద్రయ్య | హరిజన | 50 | టింకరుపని | | 8 వ తరగతి | ,, |
| | | | | 5. ఆర్. యాదగిరి | మంగలి | 43 | పాత్రల దుకాణం | | మెట్రిక్ | ,, |
| తె. 20. | ఏటూరునాగారం | ములుగు | వరంగల్లు | 1. పి. హెచ్. లూక్ | క్రైస్తవుడు | 55 | కమ్మరపని | | 1 వ తరగతి | వి.దో.స్వా.. |
| | | | | 2. చంద్రయ్య | హరిజన | 53 | టింకరుపని | | | ,, నా.. |
| | | | | 3. అబ్దుల్‌కలామ్ | ముస్లీం | 50 | వెల్డింగ్‌పని | | | ,, |
| | | | | 4. రామారావు | సాలె | 45 | పాత్రల దుకాణం | | 3 వ తరగతి | ,, |
| తె. 21. | ఇల్లందు | ఇల్లెందు | ఖమ్మం | 1. టి. పోసాలు | వడ్ల | 23 | కమ్మరం | వడ్రంగం | | పి. వే. గో. |
| | | | | 2. ఎమ్. ఎ. కలామ్ | ముస్లీం | 32 | వెల్డింగుపని | మోటార్లరిపేరి | 5వ తరగతి | ,, |
| | | | | 3. మహమ్మద్ ఇబ్రహీం | ,, | 37 | టింకరుపని | వైద్యం | | ,, |
| | | | | 4. రాజేశ్వరరావు | కంచర | 27 | ఇత్తడిపని | | 10వ తరగతి | ,, |
| | | | | 5. సయ్యద్ అబ్జల్ | ముస్లీం | 32 | రేకుపని | | 2వ తరగతి | ,, |
| | | | | 6. కె. నాగేశ్వరరావు | పద్మసాలె | 21 | పాత్రలదుకాణం | | 10వ తరగతి | ,, |
| తె. 22. | భద్రాచలం | భద్రాచలం | ,, | 1. కంద్రాతి సోమయ్య | కమ్మర | 55 | కమ్మరం | | 5వ తరగతి | ,, |
| | | | | 2. చిక్కం శంకరరావు | తెలగకాపు | 26 | వెల్డింగుపని | | 8వ తరగతి | ,, |
| | | | | 3. జె. పాపారావు | స్రిష్టికర్ణం (పట్నాయక్) | 35 | రేకుపని | టింకరుపని | 3వ తరగతి | ,, |
| | | | | 4. చెన్నక్రిష్ణయ్య | వైశ్య | 30 | పాత్రలదుకాణం | | 10వ తరగతి | ,, |
| తె. 23. | కొత్తగూడెం | కొత్తగూడెం | ,, | 1. సి. హెచ్. అప్పారావు | తూర్పుకాపు | 24 | కమ్మరం | | 4వ తరగతి | ,, |
| | | | | 2. ఎం. డి. హనీఫ్ | ముస్లీం | 23 | వెల్డింగుపని | లేత్‌పని | 7వ తరగతి | ,, |
| | | | | 3. షేర్‌ఖాన్ | ,, | 45 | రేకుపని | సాల్డరింగ్‌పని | | ,, |
| | | | | 4. సోమయ్య | కంచరి | 42 | ఇత్తడిపని | | 7వ తరగతి | ,, |

| ప్రాంతం ఊరి. నెం. | పర్యటించిన కేంద్రం/ఊరు | తాలూకా | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు సంవత్సరాలు | ప్రధానవృత్తి (వ్యవహర్త మాటల్లో) | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నామసంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తె. 23. | కొత్తగూడెం | కొత్తగూడెం | ఖమ్మం | 5. నరసింహారావు | పద్మసాలె | 28 | పాత్రలదుకాణం | | 6వ తరగతి | పి. వే. గో. |
| తె. 24. | ఖమ్మం | ఖమ్మం | ఖమ్మం | 1. బొడ్ల నాగేశ్వరరావు | కమ్మరి | 25 | కమ్మరం | | 5 వ తరగతి | ,, |
| | | | | 2. ఎస్. వి. క్రిష్ణారెడ్డి | పెదకంటి | 33 | వెల్డింగుపని | | S.S.L.C. | ,, |
| | | | | | కాపు | | | | | ,, |
| | | | | 3. ఎం. ఆనందరావు | హరిజన | 25 | రేకుపని | | 8 వ తరగతి | ,, |
| | | | | 4. సయ్యద్ ఖాదర్ | ముస్లీం | 36 | టింకరుపని | | 3 వ తరగతి | ,, |
| | | | | 5. రాగి జహిందాచారి | కంచరి | 38 | ఇత్తడిపని | పోతపని | 8 వ తరగతి | ,, |
| | | | | 6. కొంకిమళ్ళ | వైశ్య | 50 | పాత్రల దుకాణం | | 10వ తరగతి | ,, |
| | | | | రామచంద్రమూర్తి | | | | | (ఉర్దూ మీడియం) | |
| తె. 25. | సూర్యాపేట | సూర్యాపేట | నల్గొండ | 1. ఈరయ్య | బైటికమ్మరి | 50 | కమ్మరం | | | |
| | | | | 2. షేక్ సలీమ్‌ఖాన్ | ముస్లీం | 23 | వెల్డింగుపని | | 7 వ తరగతి | ,, |
| | | | | 3. శ్రీపాది వీరయ్య | కంసాలి | 55 | టింకరుపని | | 2 వ తరగతి | ,, |
| | | | | 4. పర్వతం పూర్ణయ్య | త్వష్టబ్రహ్మ | 40 | ఇత్తడిపని | | S.S.L C. | ,, |
| | | | | 5. కొడితాల నారాయణ | వైశ్య | 25 | పాత్రల దుకాణం | | 8 వ తరగతి | ,, |
| తె. 26. | మిర్యాలగూడ | మిర్యాలగూడ | నల్గొండ | 1. పి. క్రిష్ణ | బైటికమ్మరి | 20 | కమ్మరం | | 7వ తరగతి | ,, |
| | | | | 2. కె. లక్ష్మణాచారి | కంసాలి | 24 | వెల్డింగుపని | | ,, | ,, |
| | | | | 3. ఎం. డి. యూసఫ్‌జాని | ముస్లీం | 25 | టిన్‌కర్‌వర్క్ | | 6వ తరగతి | ,, |
| | | | | 4. షేక్ జిలాని | ,, | 23 | రేకుపని | | 10వతరగతి | ,, |
| | | | | 5. పి. సత్తెయ్య | పద్మసాలి | 36 | పాత్రలదుకాణం | | 4వ తరగతి | ,, |
| తె. 27. | నల్గొండ | నల్గొండ | ,, | 1. ముత్యాలు | కమ్మరి | 40 | కమ్మరం | | 6వ తరగతి | ,, |
| | | | | 2. ఎం. డి. ఖైసర్ | ముస్లీం | 24 | వెల్డింగుపని | | ఇంటర్మీడియట్ | ,, |
| | | | | 3. కె. బాబ్జి | తెలగకాపు | 34 | రేకుపని | | లైబ్రరీస్టడి | ,, |
| | | | | 4. కొన్నాల బ్రహ్మయ్య | కంచరి | 50 | కంచరపని | | 2వ తరగతి | ,, |
| | | | | 5. ప్రకాష్ | వైశ్య | 25 | పాత్రలదుకాణం | | 9వ తరగతి | ,, |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తె. 28. | భువనగిరి | భువనగిరి | ,, | 1. రాములు | కంచరి | 60 | శిల్పపని | | 1వ తరగతి | వి.దొ.స్వా. |
| | | | | 2. షేక్ సాహెబ్ | ముస్లీం | 55 | టింకరుపని | | | ,, నా. |
| | | | | 3. సత్తెయ్య | సాలె | 60 | పాత్రలదుకాణం | | 2వ తరగతి | ,, |
| | | | | 4. బాపయ్య | తెలగ | 48 | రేకుపని | | 1వ తరగతి | ,, |
| తె. 29. | చండూరు | భువనగిరి | నల్గొండ | 1. ముంజపల్లి రాములు (పానగల్లు) | కంచరి | 75 | శిల్పపని | | 3 వ తరగతి | పి. వే. గో. |
| | | | | 2. సంకోజి పెద్దకనకయ్య | ,, | 60 | ఇత్తడిపని | | ,, | ,, |
| | | | | 3. సంకోజి సాయన్న | ,, | 30 | పోతపని | | 6 వ తరగతి | ,, |
| రా. 1. | చిత్తూరు | చిత్తూరు | చిత్తూరు | 1. రఘుపతి | విశ్వబ్రాహ్మణ | 20 | రేకుపని | | | వి.దొ.స్వా. |
| | | | | 2. నరసింహం | ,, | 27 | ఇత్తడిపని | | 4 వ తరగతి | ,, నా. |
| | | | | 3. పేట చెంగల్రాయాచ్చారి | ఆచ్చారి | 47 | శిల్పపని | | 7 వ తరగతి | ,, |
| రా. 2. | శ్రీకాళహస్తి | శ్రీకాళహస్తి | చిత్తూరు | 1. సాంబశివన్ | ఆచ్చారి | 21 | కొలిమిపని | తరణిపని | 5 వ తరగతి | ,, |
| | | | | 2. షేక్ అక్రంభాషా | ముస్లీం | 25 | రేకుపని | | ,, | ,, |
| | | | | 3. వీరభద్రారెడ్డి | కాపు | 35 | వెల్డింగుపని | | 6 వ తరగతి | ,, |
| | | | | 4. షేక్ అబ్దుల్‌మజీద్ | ముస్లీం | 38 | ఇత్తడిపని | | 3 వ తరగతి | ,, |
| రా. 3. | కుప్పం | కుప్పం | చిత్తూరు | 1. కె. మురుగన్ | బలిజ | 21 | కొలిమిపని | | 8వ తరగతి | |
| | | | | 2. రామబ్రహ్మం | ఆచ్చారి | 18 | వెల్డింగుపని | | ,, | ,, |
| | | | | 3. ఎం. సుకుమార్ (కాదర్ మురిమ్) | ముస్లీం | 45 | టింకరుపని | | 6వ తరగతి | ,, |
| | | | | 4. జి. లక్ష్మయ్య | ఈడిగబలిజ | 25 | పోతపని | | 10వ తరగతి | ,, |
| రా. 4. | మదనపల్లె | మదనపల్లె | ,, | 1. పకీర్‌భాషా | ముస్లీం | 50 | ఇనుంపని | | 3వ తరగతి | ,, |
| | | | | 2. ఎస్. ఎస్. బాలు | గాండ్ల | 25 | రేకుపని | | 8వ తరగతి | ,, |
| | | | | 3. ఎస్. జబ్బార్‌సాబ్ | ముస్లీం | 28 | పోతపని | | 6వ తరగతి | ,, |
| రా. 5. | తిరుపతి | చంద్రగిరి | ,, | 1. ఖాదర్‌వలి | ముస్లీం | 35 | వెల్డింగ్‌పని | | 4వ తరగతి | ,, |
| | | | | 2. రామాంజలి | బలిజ | 40 | రేకుపని | | | ,, |
| | | | | 3. భాష | ముస్లీం | 40 | టింకరుపని | | | ,, |
| | | | | 4. సాంబశివరావు | విశ్వబ్రాహ్మణ | 27 | ఇత్తడిపని | | 6వ తరగతి | ,, |
| | | | | 5. గుఃప్పాచారి | ,, | 53 | శిల్పపని | | | ,, |
| | | | | 6. పెంచులాచారి | ,, | 43 | పోతపని | | 3వ తరగతి | ,, |

| ప్రాంతం ఊరి నెం. | పర్యటించిన కేంద్రం/ఊరు | తాలూకా | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు సం॥లు | ప్రధానవృత్తి (వ్యవహర్త మాటల్లో) | ఉపవృత్తి | చదువు | పర్యటన పరిశోధకుని నా. సంకేతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రా. 6. | రాజంపేట | రాజంపేట | కడప | 1. ఎస్. సాదావల్లి | ముస్లీం | 40 | కొలిమిపని | | | వి.దొ.స్వా. |
| | | | | 2. బాలబ్రహ్మయ్యాచారి | కంసాలి | 35 | వెల్డింగుపని | | 3 వ తరగతి | ,, నా. |
| | | | | 3. ఎస్. నరసింహారెడ్డి | కాపు | 35 | రేకుపని | | 7 వ తరగతి | ,, |
| | | | | 4. మహబూబ్ పీర్ | ముస్లీం | 28 | ఇత్తడిపని | | | ,, |
| రా. 7. | కడప | కడప | ,, | 1. మహమ్మద్ హుసేన్ | ముస్లీం | 57 | కొలిమిపని | | 3 వ తరగతి | ,, |
| | | | | 2. కె. రాము | కంసాలి | 36 | వెల్డింగుపని | | ,, | ,, |
| | | | | 3. యాఖూబ్ | ముస్లీం | 32 | రేకుపని | | | ,, |
| రా. 8. | ప్రొద్దుటూరు | ప్రొద్దుటూరు | ,, | 1. సుబ్బారావు | బలిజ | 60 | కొలిమిపని | | 3 వ తరగతి | ,, |
| | | | | 2. వెంకటేశ్వరుడు | కంసాలి | 35 | వెల్డింగుపని | | 5 వ తరగతి | ,, |
| | | | | 3. డి. క్రిష్ణారెడ్డి | రెడ్డికులం | 35 | రేకుపని | | 10వ తరగతి | ,, |
| | | | | 4. ఎస్. మహబూబ్ బాషా | ముస్లీం | 33 | పోతపని | | 7 వ తరగతి | ,, |
| రా. 9. | వనిపెంట | బద్వేలు | ,, | 1. కె. అబ్దుల్ బాషా | ముస్లీం | 23 | ఇత్తడిపని | | 7 వ తరగతి | ,, |
| | | | | 2. ఎ. ఫకురుద్దీన్ | ,, | 42 | పోతపని | | | ,, |
| రా. 10. | హిందూపురం | హిందూపురం | అనంతపురం | 1. బి. అల్లాబకాష్ | ముస్లీం | 38 | కొలిమిపని | | | పి. వే. గో. |
| | | | | 2. బి. జె. సి. శేఖర్ | హిందు | 30 | వెల్డింగుపని | | 6వ తరగతి | ,, |
| | | | | 3. ఎమ్. శ్రీనివాసుల్రెడ్డి | కాపు | 20 | రేకుపని | | 5వ తరగతి | ,, |
| | | | | 4. భాషా | ముస్లీం | 32 | టింకరుపని | | | ,, |
| | | | | 5. డి. అబ్దుల్ రషీద్ | ,, | 70 | పోతపని | ఇంజనీరింగ్ వర్క్ | | ,, |
| | | | | 6. ఎమ్. ఎ. శ్రీరాములు | ఆర్యవైశ్య | 45 | పాత్రలదుకాణం | | S.S L C. | ,, |
| రా. 11. | అనంతపురం | అనంతపురం | ,, | 1. అబ్దుల్ అజీజ్ | ముస్లీం | 45 | కొలిమిపని | కొయ్యపని | | ,, |
| | | | | 2. గోపాలక్రిష్ణ | వైశ్య | 27 | రేకుపని | మండీ వ్యాపారం | ఫార్మసీ డిప్లమా | ,, |
| | | | | 3. భాషా | ముస్లీం | 28 | టింకరుపని | | | ,, |
| | | | | 4. శాంతిప్రసాద్ | జైన్(దిగంబర్) | 80 | పాత్రలదుకాణం | | | ,, |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రా. 12. | తాడిపత్రి | తాడిపత్రి | అనంతపురం | 1. శ్రీధరాచారి | ఆచార్లు | 50 | కొలిమిపని | | 3వ తరగతి వి.దొ.స్వా.నా |
| | | | | 2. భాషా | ముస్లీం | 45 | టింకరుపని | | ,, |
| | | | | 3. శేఖర్ | బలిజ | 47 | వెల్డింగ్‌పని | | 2వ తరగతి ,, |
| | | | | 4. ఆదెప్ప | సాలె | 45 | పాత్రలదుకాణం | | 3వ తరగతి ,, |
| రా. 13. | రాయదుర్గం | రాయదుర్గం | అనంతపురం | 1. కె. వలీసాబ్ | ముస్లీం | 40 | కొలిమిపని | | 4 వ తరగతి పి.వే.గో. |
| | | | | 2. ఎమ్. సత్యనారాయణ | శూద్ర | 27 | వెల్డింగ్‌పని | మోటార్ మెకానికల్ | 8 వ తరగతి ,, |
| | | | | 3. గపూర్‌సాబ్ | ముస్లీం | 60 | టింకరుపని | కళాయిపని | ,, |
| | | | | 4. సి. పి. రామచంద్రప్ప | సోమవంశ క్షత్రియ | 50 | చిత్రకారుపని | | S.S.L.C. ,, |
| రా. 14. | ఆదోని | ఆదోని | కర్నూలు | 1. బాబూరావు | రాజపూత్ | 49 | కొలిమిపని | | 3 వ తరగతి ,, |
| | | | | 2. ఎస్. ఆదెప్ప | సౌకుళసాలె | 32 | వెల్డింగుపని | | 9 వ తరగతి ,, |
| | | | | 3. మహమ్మద్ | ముస్లీం | 35 | ఇత్తడిపని | వ్యవసాయం | ,, |
| | | | | 4. రాఘవేంద్ర | నాడర్ (ఈడిగ) | 28 | స్పిన్నింగ్‌పని | | 8 వ తరగతి ,, |
| | | | | 5. చంద్రశేఖర్ | సింగ్ | 25 | పాత్రల దుకాణం | | 10వతరగతి ,, |
| రా. 15. | కర్నూలు | కర్నూలు | ,, | 1. అబ్దుల్ అహమ్మద్ | ముస్లీం | 45 | కొలిమిపని | | ,, |
| | | | | 2. ముక్తార్ అహమ్మద్ | ,, | 25 | వెల్డింగుపని | | 8 వ తరగతి ,, |
| | | | | 3. అబ్దుల్ అఫీస్ | ,, | 40 | టింకరుపని | | ,, |
| | | | | 4. అబ్దుల్ రఫూక్ | ,, | 22 | రేకుపని | | ,, |
| | | | | 5. సత్తిరాజు | పద్మసాలె | 46 | పోతపని | | 2 వ తరగతి ,, |
| | | | | 6. సీతారాంశెట్టి | వైశ్య | 30 | పాత్రల దుకాణం | జనరల్‌స్టోర్సు | 10వతరగతి ,, |
| రా. 16. | నంద్యాల | నంద్యాల | కర్నూలు | 1. రామచంద్ర | బైటకమ్మరి | 24 | కొలిమిపని | | 5వ తరగతి ,, |
| | | | | 2. లింగారెడ్డి | కాపు | 20 | వెల్డింగుపని | | ఇంటర్మీడియట్ ,, |
| | | | | 3. ఎస్. గౌస్‌ఫీరా | ముస్లీం | 25 | ఇత్తడిపని | | 6వ తరగతి ,, |
| | | | | 4. బి. సాంబశివారెడ్డి | కాపు | 38 | రేకుపని | వ్యవసాయం | 5వ తరగతి ,, |
| | | | | 5 ఎజాజుద్దీన్ | ముస్లీం | 19 | స్పిన్నింగ్‌వర్క్ | | 7వ తరగతి ,, |
| | | | | 6. జమాల్‌ఖాన్ | ,, | 45 | కమ్మరపని (టింకరువర్క్) | | ,, |

# రేఖా చిత్రాల పట్టిక

# ప్రధాన సంకేత వివరణ

ఇం. = ఇంగ్లీషు

ఉ. = ఉచ్చారణభేదం (-భేదాలు)

ఏ. = ఏకవచనం

కో. = కోస్తాజిల్లా

క్రి. = క్రియాపదం

చూ. = చూడు

తె. = తెలంగాణా

పర్యా. = పర్యాయపదం

బ. = బహువచనం

రా. = రాయలసీమ

రూ. = రూపాంతరం (రూపాంతరాలు)

వి. = విశేష్యం

విశే. = విశేషణం

సం. = సంస్కృతం

హిం. = హిందూస్తానీ

[ < ] చారిత్రక నిష్పత్తి సూచనకు గుర్తు; మొన
[ > ] వైపున్న రూపం అర్వాచీనం (నిష్పన్నం)
రెండోవైపున్నది ప్రాచీనం (మూలరూపం).

# మాండలిక వృత్తిపదకోశం-12

## లోహకార వృత్తి

### అ

అకండదీపం: చూ. అఖండదీపం (రా. 12).

అకండం: పర్యా. దేశ్వాగుల్ల, జవ్వ², మొగ. పాత్రల మూతిఅంచు కలిసిన భాగం (తె. 6).

అక్షయపాత్ర: గుమ్మడికాయవాకలుండే ఇత్తడిపాత్ర. హరిదాసులు నెత్తిన పెట్టుకొని తిరుగుతూ బిచ్చం అడుక్కోడానికి ఉపయోగం చూ. చిత్రం 1 (కో. 12).

అక్షింతకుడకలు: చూ. పర్యా. పంచపాలి. అయిదు వైపులా అయిదు లోహపుచిప్పలు గుత్తిగా అతికించి ఉండి పైన పట్టుకోడానికి కాడ ఉన్నపాత్ర. శుభ కార్యాల్లో కుంకుమ, అక్షింతలు, పసుపు, గంధం వేసిపెట్టుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 146 (కో. 30).

అక్షింతగుత్తు: చూ. పర్యా. పంచపాలి. శుభకార్యాల్లో కుంకుమ, పసుపు, అక్షింతలు, గందం వేసిపెట్టుకోడానికి అయిదువైపులా అయిదు లోహపుచిప్పలు గుత్తిగా అతికించి ఉండి, పైన పట్టుకోడానికి కాడ ఉన్నపాత్ర (కో. 30).

అక్షింతలపళ్లెం: అక్షింతలు పెట్టుకోడానికి వాడే చిన్నడిజైను పళ్లెం (కో. 23).

అఖండదీపం: రూ. అకండదీపం. దేవాలయాల్లో ఉపయోగించే మూత ఉండే ప్రమిద (రా. 14).

అగరుగొట్టు: (క్రి.) పర్యా. అగరుగాలగొట్టు, కార్బన్ కొట్టు, కిలింగ్‌చేయు, చిప్‌చేయు, చిప్పింగ్‌చేయు, చెక్కుకొట్టు, పేలగొట్టు, ఫ్లక్స్ ఊడగొట్టు, ఫ్లక్స్ తీయు, ఫ్లక్స్‌రాలగొట్టు, రాలగొట్టు, రాల్చు. వెల్డింగ్ అయిన తర్వాత బుడిపెలను తీసివేయడం (తె. 7).

అగరుబత్తిస్టాండు: (అగరుబత్తి+ఇం. Stand). పర్యా. అగరొత్తులసెట్టు, అగరొత్తులస్టేండు, ఊదరబత్తిగొట్టం, ఊదుబత్తిస్టాండు, ఊదొత్తులస్టాండు, కడ్డీస్టాండు, బత్తిస్టాండు. దేవునిదగ్గర ఊదువత్తులు పెట్టి వెలిగించడానికి వాడే లోహపు స్టాండు. మూడుగాని, నాల్గుగాని, ఆరుగాని కొమ్మలు, అడుగునమట్టు, మధ్యలో పెద్దగొట్టం నుంచి సన్నగొట్టాలుగాని తీగలుగాని ఉంటాయి. ఆ గొట్టాల్లో అగరువత్తులు పెట్టుతారు చూ. చిత్రం 2. (కో. 22; తె. 5, 14-16).

అగరురాలగొట్టు: (క్రి.) చూ. పర్యా. అగరుగొట్టు. వెల్డింగ్ అయిన తర్వాత బుడిపెలను తీసివేయడం (తె. 7).

అగరొత్తులసెట్టు: (అగరొత్తుల+ఇం. Set) చూ. పర్యా. అగరుబత్తిస్టాండు. దేవునిదగ్గర ఊదొత్తులు పెట్టడానికి వాడే లోహపుస్టేండు. మూడుగాని, నాల్గుగాని, లేదా ఆరుగాని కొమ్మలు, అడుగునమట్టు, మధ్యలో పెద్దగొట్టంనుంచి సన్నగొట్టాలుగాని తీగలుగాని ఉంటాయి. ఆ గొట్టాల్లో అగరువత్తులు పెట్టుతారు చూ. చిత్రం 2. (కో. 14).

అగరొత్తులస్టేండు: చూ. పర్యా. అగరుబత్తిస్టాండు. దేవుని దగ్గర ఊదువత్తులు పెట్టడానికి వాడే లోహపు స్టాండు. మూడు, నాల్గు లేదా ఆరు కొమ్మలు అడుగునమట్టు, మధ్యలో పెద్దగొట్టం నుంచి సన్నని గొట్టాలుగాని, తీగలుగాని ఉంటాయి. ఆ గొట్టాల్లో అగరొత్తులు పెట్టుతారు చూ. చిత్రం 2 (కో. 12, 19).

అగ్గికారు: అగ్గినిపట్టుకొని కుంపటిలో వేయడానికి ఉపయోగించే సాధనం (కో. 19).

అగ్గికొలిమి: ఇత్తడిపాత్రల భాగాలను అతికించడానికి ఉపయోగించే చిన్నపొయ్యి (తె. 20).

అగ్గిగంపె: పర్యా. నిప్పుగంపె. నిప్పు తెచ్చుకోడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 3 (రా. 8).

అగ్గిరేకు: కొలిమివగ్గర బొగ్గులు ఎగదోసే పరికరం చిన్నచాటకు పొడవాటికాడ ఉంటుంది (కో. 22, 23).

అంకిల పూలమట్టం: చూ. పర్యా. పూలమట్టం.

'L' ఆకారంలో 2′ × 1′ సైజులో చేయబడిన ఇనపబద్ద. దీని రెండు భుజాలమీద అంగుళాలు గుర్తించి ఉంటారు. మూలల సమకోణం చూడ డానికి ఉపయోగం. చూ. చిత్రం 194. (కో. 24).

అంకోడ: బండి కమ్మిలాగడానికి పనికివచ్చే పని ముట్టు (రా. 6).

అంగుళవాలుపోగర: విగ్రహాల తయారీలో చక్కగా కొట్టడానికి వాడే పనిముట్టు (కో. 6).

అంగుళంకడ్డి: ఇనుపవస్తువుల వంపులు సరిచేసే పరికరం (కో. 15).

అచ్చు[1]: బండి ఇరుసు నయంచేయడానికి ఉప యోగించే పరికరం (కో. 28; తె. 22; రా. 6, 7).

అచ్చు[2]: (బ.), అచ్చులు. పర్యా. అండ, అచ్చుల బాక్సు. పోతపాత్రచుట్టూ ఉండే చెక్క చట్రం. (కో. 2, 14, 22; రా. 5, 8, 9).

అచ్చుకారు: పర్యా. అచ్చుపట్టుకార. సరిసేటప్పుడు సాపు అచ్చును పట్టుకొనే పనిముట్టు (తె. 22).

అచ్చుదొడ్డి: చూ. పర్యా. పోతదొడ్డి[1]. పోతపనిలో పోతవస్తువులు పోసుకోవడానికి వాడే చౌకం ఆకారంలో ఉండే ఇనపకట్టు. ఇవి రెండు ఉంటాయి. అడుగుభాగంలో పెట్టినదొడ్డికి పైన మేకులు బిగిస్తారు. దానిపైన పెట్టేదొడ్డికి ఆ మేకులు సరిపోయేటట్లు రంధ్రాలు ఉంటాయి (కో. 21).

అచ్చుపట్టుకార: చూ. పర్యా. అచ్చుకారు. సరి సేటప్పుడు సాపు అచ్చును పట్టుకొనే పనిముట్టు (తె. 19, 22).

అచ్చుపీట: దీపాన్ని తయారుచేసే చెక్కపీట (రా. 5),

అచ్చుపెట్టి: మామూలు మట్టిని జల్లించి. ఆముదం కలిపి అచ్చుకట్టడానికి వాడే పరికరం (కో. 13).

అచ్చుబిళ్ళ: మట్టి అచ్చునుచేయడానికి ఉప యోగించే పోతబిళ్ళ (తె. 22).

అచ్చులబాక్సు: (< అచ్చుల + ఇం. box) చూ. పర్యా. అచ్చు[2]. పోతపాత్రచుట్టూ ఉండే చెక్క చట్రం (రా. 11).

అజరండబ్బా: వస్తువులు పెట్టుకోవడానికివాడే పొడ వైన డబ్బా. అజ్రం అనే ఊరిలో తయారయింది (తె. 11).

అజ్జరపుబింది: చూ. అజ్జరంబింది (కో. 19).

అజ్జరంబింది: రూ. అజ్జరపుబింది. ఇత్తడిబిందె (కో. 24).

అజ్రంతపాల: అజ్రం అనే ఊళ్ళో తయారయిన వంటపాత్ర (కో. 12, 13, 15).

అజ్రంబిందె: అజ్రం అనే ఊళ్ళో తయారయిన లోహపుపాత్ర. నీళ్ళకు ఉపయోగం (కో. 13, 15, 18, 20).

అంచలదిమ్మె: గొడ్డళ్ళకు రంధ్రం వేయడానికి వాడే ఇనుపదిమ్మె (రా. 4).

అంచు[1]: కొడవలి పిడికి తొడిగే రేకు (రా. 4).

అంచు[2]: పాలక్యాను పైభాగం (రా. 2).

అంచు[3]: మట్టి అచ్చు కొనభాగం. (కో. 2. 5).

అంచు[4]. వావర (కో. 3).

అంచుకరవాలు: బిందె అంచుభాగాన్ని వంచడానికి వాడే పనిముట్టు (కో. 5).

అంచుకంచం: అంచున్న ఇత్తడిపళ్ళెం. భోజనం చేయడానికి వాడ్తారు. చూ. చిత్రం 4. (కో. 26).

అంచుకూరగిన్నె: కూరలు ఉంచుకోడానికి వాడే అంచుఉన్న చిన్నపాత్ర (తె. 13).

అంచుగ్లాసు: (< అంచు + ఇం. Glass) అంచుతో ఉండే సాదా గ్లాసు (కో. 21, 24).

అంచుపళ్ళెం: కొనభాగం అంచుకలిగిన వెడల్పు పాత్ర. పాయసం పోసుకోడానికి వాడ్తారు (తె. 8, 9).

అంచుబిందె: ఉ. అంచుబింది. దట్టమైన కడ్డీని అంచు చుట్టూ బిగించిఉండే ఇత్తడిబిందె (కో. 18, 30).

అంజూరాకు: అంజూరపు ఆకు ఆకారంలో అంచు లేకుండా తయారుచేసిన భోజనపుపళ్ళెం (కో. 7, 12, 15).

అటకంసుత్తె: బిందెల అంచులు చేసేటప్పుడు వాడే పరికరం (రా. 15).

అటేము: చూ. అట్టెం (కో. 3).

అట్టెం: రూ. అటేము. చూ. పర్యా. దాంబరు. బిందెను తరిణిమోపుకు అంటించడానికి వాడే జిగురుపదార్థం (తె. 22, 26).

అట్లకర్ర: పర్యా. అట్లకాడ[1], అట్లపుల్ల[2], అట్లూస, ఉల్దాని, కర్చిసలాక[1], దబ్బ[3], దోసెకాడ, దోసె గంటె, దోసెగరటు, పల్ల, పోతకాడ, రొట్టెదెబ్బ, సరాతం, సాదాకాడ. దోసెలు, రొట్టెలు మొదలయినవి పెనంపైనుంచి తీయడానికి, తిరగదిప్ప డానికి వాడే, కొసభాగం చదరంగాఉండే పరికరం, చూ. చిత్రం 5. (కో. 26, 29, 30).

అట్లకాడ[1]: ఉ. అట్లగాడ చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనంపైనుండి తీయడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 5. (కో. 2-4,

6, 9, 11, 13, 15, 17, 18, 24, 25, 28, 30; తె. 17, 18, 20, 21, 24).

అట్లకాడ²: పర్యా. అట్లపుల్ల², కురిపి. పెద్ద పాత్రల్లో వంటలుచేసేటప్పుడు కలియబెట్టడానికివాడే పొడవాటి సలాక (తె. 21).

అట్లపుల్ల¹: చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనంపైనుండి తీయడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 5. (కో. 6, 11, 19–24, 26, 27, 29).

అట్లపుల్ల²: చూ. పర్యా అట్లకాడ². పెద్దపాత్రల్లో వంటలుచేసేటప్పుడు కలియబెట్టడానికివాడే పొడవాటి సలాక (కో. 17, 23).

అట్లపెనుం: ఉ. అట్లపానము, అట్లపెనము అట్లపెనం. పర్యా. అట్లరేకు, తంబోల దోసెరేకు, తంబోల పెనుం, తావలు, దోసెపెంక, దోసెపెంచు, దోసెపెనుం, దోసెరేకు, పెంక, పెంచు, పెనుం², ప్లేటు⁸, బచ్చాలపెనం, బచ్చాలరేకు. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి వాడే లోహపరికరం. చూ. చిత్రం 6. (కో. 3, 5, 14, 16, 18, 19, 28; తె. 14–16, 18, 21).

అట్లరేకు: చూ. పర్యా. అట్లపెనుం. దోసెలు, రొట్టెలు చేసుకోటానికుపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (కో. 17, 20–23, 26).

అట్లూస: (<అట్లు + ఊస) చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనంపైనుండి తీయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 5. (కో. 16,18).

అడ: బిందె కొనభాగం (కో. 8).

అడకట్టె: పర్యా. అడబద్ద. ఇత్తడిపాత్రలను పాలిష్ పెట్టేటప్పుడు చేతికింద ఆధారంగా ఉపయోగించే పరికరం (తె. 24).

అడకత్తెర: పర్యా. చూతి, పరబాతా, పచ్చివక్కలను కత్తిరించే సాధనం (తె. 8, 9, 17, 22).

అడకుర్ర: పుయ్యలో అతుకు ఉండే పెడల్పుగిన్నె (కో. 19).

అడగోలు: పర్యా. చక్రం³, చిన్నదిమ్మె, చెటాంబరు. చౌరస్‌దిమ్మ, ఛాపన్, పట్టముక్క, పయ్యా², పాలం¹, పిలేట్, పెద్దదిమ్మె, ప్లాట్‌పన, బాడిచట్టంబసు, పట్టమెరెం, మిదిను, మిరం, మిరిన్‌గుడ్డ, మిరియం, మిరియంబిళ్ళ, మూలమెరియం, మూలాడి, సస్టదిమ్మ. లోహపురేకులను కడ్డీలను సాపుచేయడానికి వాడేదిమ్మ (రా. 13).

అడబద్ద: చూ. పర్యా. అడకట్టె. ఇత్తడిపాత్రలను పాలిష్ పెట్టేటప్పుడు చేతికి ఆధారంగా ఉపయోగించే పరికరం (తె. 17, 21).

అడమొద్దు: పర్యా. అడమోపు, కర్రచెక్క, కర్ర దుద్దు, కొరడు, కొరడుమొద్దు, గూటం², చెక్క, టుంగు, డుంగ, తలదుంగ, తుంగుమొద్దు, తుమ్మొద్దు, దుక్క, దుంగ, దొలదుక్క, నేము, పంగల్, పంగల్‌కొయ్య, పంగలదుక్క, పంగుకట్టి, మొద్దు¹. కరవాయిని కదలకుండా పట్టి ఉంచడానికి వాడే కొయ్యదిమ్మ (తె. 3).

అడమోపు: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండా పట్టి ఉంచడానికి వాడే కొయ్యమొద్దు (తె. 22).

అడరాయి: కిరవాయికింద ఎత్తుగ ఉంచేరాయి (తె. 3, 4, 6).

అడరేకు: వాయిలేకుండా దొల్క, బిళ్ళ కలిసి ఉండే బిందెభాగం (తె. 25).

అడికోలు: పర్యా. అడుగుదబ్బ, ఎరకబద్ద, కొలతబద్ద, దొపుట్, మట్టపలక¹, మట్టంబద్ద, మార్క్సపట్టి, రైటాంగలు, సీతాపతిబద్ద, సీదాపట్టి, సీదాబద్దె. ఇత్తడిరేకులపై, ఇనుపసామాన్లపై కొలతలను గీయడానికి వాడే ఇనపబద్ద. (రా. 1).

అడిగేమొద్దు: పర్యా అద్ద², బుర్ర³, ముకంబల్ల, వాల్‌మాను, సంగడి¹, సంగడిదిండు, సంగడి మొద్దు, సంగడిమోపు. ఇత్తడిపాత్రలను మెరుగు పెట్టడానికి వాడే కొయ్యదిమ్మ (తె. 12).

అడుగు: పర్యా. అడుగుపక్క, అడుగుబిళ్ళ, బిళ్ళ², సర్కిల్‌బిళ్ళ. ఇత్తడి లేదా ఇనుపపాత్రల అడుగు భాగపు రేకు (రా. 4, 5).

అడుగు ఉలి: తరిణిపనిలో ఉపయోగించే పనిముట్టు (రా. 2).

అడుగుడప్ప: పోతపాత్ర మడి (కో. 22).

అడుగుగొడుతు: పర్యా. కంగను, గాజ, చక్రం², పళ్ళచక్రం, రింగు⁴. గొడుగుపుల్లలను బిగించడానికి గొడుగుకర్ర పైభాగానఉండే గుండ్రని ఇత్తడి పళ్ళచక్రం (కో. 27).

అడుగుతీయు: (క్రి.) కొలతప్రకారం అడుగుభాగం రేకును కత్తిరించడం (కో. 18, 23).

అడుగుదబ్బ: రూ. అడుగుబద్ద చూ. పర్యా. అడికోలు. ఇత్తడిరేకులపై, ఇనుపసామాన్లపై కొలతలను గీయడానికి ఉపయోగించే ఇనుపబద్ద (కో. 3; రా. 5, 15).

అడుగుపక్క: చూ. పర్యా. అడుగు. ఇత్తడి, ఇనుప పాత్రల అడుగుభాగపు రేకు (కో. 28).

అడుగుపర్మ: పర్యా. అడుగుపెట్టె. ట్రంకుపెట్టె క్రిందిభాగం (కో. 22).

అడుగుపాదం: ధూపకం క్రిందిభాగం (రా. 5).

అడుగుపెట్టె: చూ. పర్యా. అడుగుపర్మ. ట్రంకుపెట్టె క్రిందిభాగం (రా. 4).

అడుగుబద్ద: ఉ. అడుగుబద్దె. చూ. అడుగుదబ్బ (కో. 7, 10, 17; తె. 21).

అడుగుబిళ్ళ: చూ. పర్యా. అడుగు. ఇత్తడి, ఇనుప పాత్రల అడుగుభాగపు రేకు (కో. 5; తె. 14, 15; రా. 1).

అడుగుమడుపు: డ్రమ్ము క్రిందికి వంపుతిరిగి ఉండడం (రా. 4).

అడుగులగడ్డపార: డొల్కకు అడుగు భాగాలను బిగించడానికి వాడే పనిముట్టు (తె. 4).

అడుగులేయు: (క్రి.) పాలిష్ పెట్టడానికి ముందు బిందె అడుగు భాగాలను నొక్కులులేకుండా సాపు చేయడం (తె. 25).

అడ్గానిసుత్తి: చూ. అడ్డగనిసుత్తె (రా. 15).

అడ్డ¹: పర్యా. జవ్వ², డొలక², డొలుపు¹, డొల్ల¹, దొడ్డె, పక్క, పక్కరేకు, పొట్ట, పొట్టరేకు, బుర్ర², మధ్యరేకు, మయం, మయందొడ్డి, మిర్రు, వెడల్పు. బిందె మధ్యభాగపురేకు (తె. 19).

అడ్డ²: చూ. పర్యా. అడిగేమొద్దు. ఇత్తడి పాత్రలను మెరుగు పెట్టేటప్పుడు ఉపయోగించే కొయ్యదిమ్మ (కో. 14, 19–22, 24, 28; తె. 15, 16).

అడ్డ³: గొడుగుపుల్లలు బిగించి ఉండే క్రింది గొట్టం (కో. 29).

అడ్డ⁴: గింజలను కొలవడానికి ఉపయోగించే ఇనుప పాత్ర. తవ్వలో నాలుగవవంతు (తె. 9, 15, 16).

అడ్డ⁵: పర్యా. కురుకు, ఫక్కా. ట్రంకుపెట్టె అడుగు భాగానికి పక్కన ఉండేరేకు (తె. 17).

అడ్డ⁶: పర్యా. కుండ¹. అన్నం వండడానికి, నీళ్ళు తోడటానికి ఉపయోగించే గుండ్రని లోహపుబిందె (తె. 17).

అడ్డఊస: గొడుగుఊసకు అడ్డంగా ఉండేకడ్డి (కో. 24).

అడ్డకన్ను: పర్యా. అడ్డకన్నుసుత్తి, అడ్డగనిసుత్తె, అడ్డగన్ను చెక్కసుత్తి, అడ్డగంసుత్తి, అడ్డలు మట్నుకరవాయి, అడ్డలేసే కరవాయి, అడ్డసుత్తె, అడ్డాగలి, అణచుకరవాయి, అన్చేసుత్తి, వాటం సుత్తి. ఇత్తడి, అల్యూమినియం పాత్రలను వంపు చేయడానికి వాడే పనిముట్టు (రా. 2).

అడ్డకన్నుసుత్తి: రూ. అడ్డగన్నుసుత్తి. చూ. పర్యా. అడ్డగన్ను. ఇత్తడి, అల్యూమినియం రేకులను వంపు చేయడానికి వాడే పనిముట్టు (కో. 3–13, 15; రా. 5, 7).

అడ్డకొయ్య: ఇత్తడిపాత్రలను తట్టడానికి వాడే కరవాయి బిగించి ఉన్నకొయ్య. (కో. 2, 6, 10, 12).

అడ్డగనిసుత్తె: రూ. అడ్గానిసుత్తి, అడ్డగనుసుత్తి, అడ్డగానసుత్తి చూ. పర్యా. అడ్డకన్ను. ఇత్తడి, అల్యూమినియం పాత్రలను వంపుచేయడానికి వాడే పనిముట్టు (కో. 19–28; తె. 1–3, 7, 23, 25, 26; రా. 5).

అడ్డగనుసుత్తి: చూ. అడ్డగనిసుత్తె (కో. 23; తె. 7).

అడ్డగన్నుచెక్కసుత్తి: చూ. పర్యా. అడ్డకన్ను. ఇత్తడి, అల్యూమినియం రేకుల్ని వంపుతట్టడానికి వాడే పనిముట్టు (కో. 3).

అడ్డగన్నుసుత్తి: చూ. అడ్డకన్నుసుత్తి (కో. 7, 10, 11, 12, 15–18, 19, 21, 22, 24, 29).

అడ్డగళ్ళి: పర్యా. అడ్డీ, కట్టర్బాణం, కట్టర్ఛెన్ని, చాపను, చాపు, దారుశాసం. రేకులు, కడ్డీలు తెగ్గొట్టడానికివాడే దిమ్మ (రా. 11).

అడ్డగంసుత్తి: చూ. పర్యా. అడ్డకన్ను. ఇత్తడి, అల్యూమినియం పాత్రలను వంపుచేయడానికివాడే పనిముట్టు (రా. 5).

అడ్డగానసుత్తి: చూ. అడ్డగనిసుత్తె (కో. 20; తె. 23; రా. 5).

అడ్డగిన్నె: అన్నంకూరలు వండటానికి ఉపయోగించే పాత్ర (కో. 4, 5, 9).

అడ్డరేక: ఇత్తడిపాత్రల మధ్యభాగంలోని వెడల్పాటి రేకు (తె. 14, 15, 24).

అడ్డలుమట్నుకరవాయి: చూ. పర్యా. అడ్డకన్ను. ఇత్తడి, అల్యూమినియం పాత్రలను వంపుచేయడానికివాడే పనిముట్టు (తె. 14).

అడ్డలేసేకరవాయి: చూ. పర్యా. అడ్డకన్ను. ఇత్తడి, అల్యూమినియం పాత్రలను వంపుచేయడానికివాడే పరికరం (తె. 11).

అడ్డసుత్తె: చూ. పర్యా. అడ్డగన్నుసుత్తి. గ్లాసులు పొడుగేసుకోడానికి, చెంబులు, గిన్నెలు, అణచుకోడానికి రేకులు మోటుకొట్టడానికి వాడే ప్లాటుగా, అడుగున పలచగాఉండే చిన్న పరికరం (కో. 1, 6, 13; తె. 7, 21, 24; రా. 1, 3, 5, 14).

అడ్డం: పెట్టె క్రిందిభాగం ప్రక్కరేకు (కో. 23).

అడ్డాకు: చూ. పర్యా. ఇస్తరాకు. ఆకులమాదిరి పుల్లలు

కుట్టినట్లు డిజైనువేసి అంచులేకుండా తయారుచేసిన భోజనం కంచం (కో. 10, 11, 14, 20, 23).

అడ్డాక్కంచం: చూ. పర్యా. ఇస్తరాక్కంచం. ఆకుల మాదిరిపుల్లలు కుట్టినట్లు డిజైనువేసి తయారుచేసిన అంచున్న భోజనం కంచం. (కో. 28).

అడ్డాగలి: చూ. పర్యా. అడ్డకన్ను. ఇత్తడి. అల్యూమినియం పాత్రలను వంపుచేయడానికి వాడే సుత్తి (తె. 8, 9).

అడ్డి: పర్యా. పోగర. లోహపురేకులపై, కడ్డీలపై రంధ్రాలు వేయడానికి గుర్తులుపెట్టే పరికరం చూ. చిత్రం. 165 (తె. 26).

అడ్డీ: చూ. పర్యా. అడ్డగళ్ళి. రేకులు, కడ్డీలు తెగ్గొట్టడానికి వాడే దిమ్మ (కో. 26).

అణచుకరవాయి: చూ. పర్యా. అడ్డకన్ను. ఇత్తడి అల్యూమినియం పాత్రలను వంపుగా అణచుకొనే పనిముట్టు (కో. 14).

అణచుకొను: (క్రి.) చూ. పర్యా. అణచు. ఇత్తడి పాత్రల పొట్టభాగానికి అతకడానికి వీలుగా ఎత్తుగా ఉండే రేకుని క్రిందికివంచడం (తె. 9).

అణిగేయు: (క్రి.) (< అణగు + వేయు). చూ. పర్యా. అణచు. ఇత్తడిపాత్రల పొట్టభాగానికి అతకడానికి వీలుగా ఎత్తుగాఉకండే రేకుని క్రిందికి వంచడం (తె. 9).

అణచు: (క్రి.) పర్యా. అణచుకొను, అణిగేయు, అనగగొట్టు. ఇత్తడిపాత్రల పొట్టభాగానికి అతకడానికి వీలుగా ఎత్తుగాఉండే రేకుని క్రిందికివంచడం (కో. 20).

అంటకాక: పట్టాల రెండంచులను కలిపి ఊడిరాకుండ ఒకదానిపై ఒకటిపెట్టి అతికించడానికి కొలిమిలో ఎర్రగ కాల్చిన వేడిమి (కో. 18; తె. 7, 18).

అంటకాకతీయు: (క్రి.) పర్యా. అంటకాయు. పట్టా రెండంచులను కలిపి గుండ్రంగా జాయింటు చేయడం (తె. 21).

అంటకాయు: (క్రి.) చూ. పర్యా. అంటకాకతీయు. పట్టా రెండంచులను కలిపి గుండ్రంగా జాయింటు చేయడం (తె. 4).

అంటబెటు[1]: (క్రి.) మందేగుడ్డను స్ప్రిట్ కటోరిలో ఉంచి గాలికొట్టి స్టౌబర్నర్‌ను వెలిగించడం (తె. 3, 17).

అంటబెట్టు[2]: (క్రి.) రేకులను ఇరికించడం (తె. 19).

అంటించు: (క్రి.) తరిణిపనిలో లక్కను కొయ్యకు కరిపించడం (రా. 2).

అంటుడుగిన్నె: కూరలు వడ్డించడానికి వీలుగా ఒక దానిప్రక్క మరొకటి అమర్చిచేసిన కూరగిన్నెలు. చూ. చిత్రం. 7. (తె. 2).

అంటుపెట్టు: (క్రి.) బిందెను తరణిమొద్దుకు అతికించడం. (తె. 15).

అండాహ్యాండిలు: (< అండా + ఇం. Handle). ఉ. అండ్‌హాండిలు. బక్కెట్ ఆకారంలో ఉండే పాత్ర (కో. 6, 8).

అండ: చూ. పర్యా. అచ్చు[2]. పోతపాత్ర చుట్టూ ఉండే చెక్కచట్రం (కో. 21).

అండర్‌గ్రౌండ్ సీక్రెట్‌బీరువా: (< ఇం. Under ground secret + బీరువా). అడుగున రహస్యపు అర ఉండే బీరువా (తె. 20).

అండా[1]: ఉ. అండ, అండి, అండీ. పర్యా. అండాబిందె, అన్నంగుండిగ, అన్నందేక్సా, అరకాగు, కడేలఅండా, కడేలతపిల, కుళగ[2], గంగాళం, గాజు[2], గుంజు[3], చెరవ, జోడ, జోడతాళి, జోడుతాల్‌సెట్టు, నిలువు అండ, నిలువు కళాయి, నిలువుగంగాళం, నీళ్ళ అండీ, బారుగంగాలం, సాదా అండీ. అన్నం వండడానికి, నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల హాండిలు, వెడల్పు మూతఉండే నిలువైన లోహపుపాత్ర. చూ. చిత్రం. 8. (కో. 2-8, 20-29; తె. 5, 12, 13, 15, 23; రా. 6-13).

అండా[2]: పోతచెంబు మధ్యభాగం (కో. 29).

అండాకట్టరు: (< హిం. అండా + ఇం. Cutter). ఉడకబెట్టిన కోడిగుడ్డును కత్తరించడానికి వాడే పీట (రా. 4).

అండాగిన్నె[1]: చిన్నపిల్లలకు పాలుపట్టే చిన్న ఇత్తడి పాత్ర (కో. 29).

అండాగిన్నె[2]: మజ్జిగనిల్వ ఉంచుకొనే పొడవు పాత్ర (కో. 29).

అండాబిందె: చూ. పర్యా. అండా[1]. అన్నం వండటానికి, నీళ్ళు తోడటానికి ఉపయోగించే పాత్ర. చూ. చిత్రం. 8. (కో. 10).

అండాలకరవాయి: పర్యా. అండాలగడ్డపలుగు. అండాలు తయారుచేయడానికి ఉపయోగించే పనిముట్టు (కో. 22; తె. 10, 11, 14-16; రా. 9).

అండాలగడ్డపలుగు: చూ. పర్యా. అండాలకరవాయి. అండాభాగాలు తయారుచేయటానికి వాడే పరికరం (తె. 6).

అతికేకారు: పర్యా. కారు, గుబ్బపట్టకారు. చానపుగార, చిన్నకారు, చిన్నపట్టుకారు, చిమట, చెవుల

కారు, చేతిపిడ్డు, చొళిఇక్కళం, నిప్పుకారు, నిప్పుపట్కాడు, నిబ్బరంకారు, నిలుపకారు, నిలువుపట్కాడు, నీరుకారు, పట్టకారు, పెద్ద ఇక్కళం, పెద్దకారు, పెద్దపట్టకార, పెద్దవంకారు, బొమగుమూతులకారు, బోతకారు, ప్లాట్ కారు, మట్టంపట్టకారు, మూతిపట్టకారు, మూసకారు, మూసపట్టకారు, రెండుబుగ్గలకారు, సన్నకారు, సన్నపట్టకారు, సాడ్చి, సాదాకారు, సాదాపట్టకారు, సాపుకారు, సైజుపట్టకార. నిప్పును, వేడి లోహపు వస్తువులను పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు (కో. 21).

**అతుకిచ్చు:** (క్రి.) (< అతుకు + ఇచ్చు) చూ. పర్యా. అతుకు. రెండు రేకులను కాని, కమ్ములను కాని, పట్టాలను కాని కలిపి ఒకటిగా అతకడం (తె. 1).

**అతుకు:** (క్రి.) పర్యా. అతుకిచ్చు, అతుకుచేయు, అతుకుపెట్టు, కాకతీయు[2], జాయింట్ చేయు, మడుపేయు[2], మందడికాయు, మందడిమాటు, మందర అతుకు, మాటు, మాటేయు, మూడు, మెల్టా, మోల్డింగ్. రెండు లోహపు రేకులనుగాని, కమ్ములనుగాని, పట్టాలనుగాని కలిపి కాల్చి ఒకటిగా గుండ్రంగా అతకడం (కో. 2, 4, 5; తె. 8, 9, 14, 15, 16, 19, 21; రా. 6, 8).

**అతుకుగజం:** పర్యా. అతుకుడుకడ్డీ. బిందెలను అతికేటప్పుడు టంకాన్ని సరిచేయడానికి వాడే పనిముట్టు (కో. 26).

**అతుకుచేయు:** (క్రి.) చూ. పర్యా. అతుకు. రెండు రేకుముక్కలనుగాని, కమ్ములనుగాని, పట్టాలనుగాని ఒకటిగా అతకడం (కో. 23).

**అతుకుడుకడ్డీ:** చూ. పర్యా. అతుకుగజం. పాత్రలను అతికేటప్పుడు టంకాన్ని సర్దడానికి వాడే పనిముట్టు (తె. 6).

**అతుకుడుకొలిమి:** పర్యా. బ్లోయర్‌కొలిమి, సేకొలిమి. పాత్రల రేకులను అతకడానికి ఉపయోగించే చిన్న పొయ్యి (తె. 23).

**అతుకుడుపెట్టు:** (క్రి.) చూ. అతుకుపెట్టు (తె. 5).

**అతుకుపెట్టు:** (క్రి.) రూ. అతుకుడుపెట్టు. చూ. పర్యా. అతుకు. రెండురేకులనుగాని, కమ్ములనుగాని, పట్టాలనుగాని ఒకటిగా అతకడం (తె. 5, 20).

**అతుకులు:** జాయింట్లు. పాత్రరేకుల మధ్యభాగం కలియడం (తె. 8).

**అతుక్కొను:** (క్రి.) చూ. పర్యా. కరుసుకొను. కడ్డీ రేకుకు అతుక్కోవడం (తె. 1).

**అత్తరసీస:** (హిం.) చూ. పర్యా. అత్తరుదాని. అత్తరు పోయడానికివాడే పరికరం. చూ. చిత్రం 9. (కో. 12).

**అత్తరుడబ్బి:** (హిం.) చూ. పర్యా. అత్తరుదాని. అత్తరుపోయడానికి వాడే సాధనం. చూ. చిత్రం. 9. (తె. 23).

**అత్తరుదాని:** (హిం.) (బ.) అత్తరుదాన్లు. ఉ. అత్తరు దాను. పర్యా. అత్తరసీస, అత్తరుడబ్బి, అత్తరు బుడ్డి, పన్నీరుచెంబు, పన్నీరుదాని, పన్నీరుబుడ్డి, పన్నీరుసీసా. అత్తరు చల్లుకోడానికి వాడే సీసా ఆకారంలో ఉండే స్టీలుసాధనం. చూ. చిత్రం. 9. (తె. 8, 9, 13, 15, 17, 19, 24. 25).

**అత్తరుబుడ్డి:** (హిం) చూ. పర్యా. అత్తరుదాని. అత్తరుపోయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 9 (తె. 6).

**అతిరసపలక:** పర్యా. అబక. నిప్పట్లు కాల్చుకొనే సాధనం (రా. 6).

**అత్తుకొను:** (క్రి.) సాల్డరింగ్‌పనిలో కడ్డీతో తగరం కరిపించుకోవడం (రా 8).

**అదరగొట్టు:** (క్రి.) మట్టి అచ్చులోని మాదిరిపోత పాత్రను బయటకు తీయడానికి అచ్చుపై చిన్నగ దెబ్బవేయడం (తె. 19).

**అదుము:** (క్రి.) వైపు, లాడం, బీరువా రేకులను నొక్కడం (రా. 3, 5).

**అదురు:** చూ. పర్యా. అదురుఉలి. ఇత్తడిబిందె పై డిజైనుగీతలు గీయడానికి ఉపయోగించే పరికరం (కో. 2).

**అదురుఉలి:** పర్యా. అదురు. అదురులేగ, ముల్లంగి లేగ. ఇత్తడిబిందె పైడిజైను గీతలు గీయడానికి వాడే పనిముట్టు (రా. 2).

**అదురులేగ:** చూ. పర్యా. అదురు ఇత్తడిబిందె పైడిజైను గీతలు గీయడానికి వాడే పనిముట్టు (కో. 4, 6, 8, 9, 10, 12, 22).

**అదురువాలేగ:** పర్యా. కొదువు, గిర్రులేగ, జిర్రు లేగ, తుంట[2], పట్టలేగ, పీసులేగ, ముల్లాగివర, ముల్లేగ, వంకమెరుగుకడ్డీ, వంకలేగ, వంపుకమ్మి[1], వాలిఉలి, వాలుకమ్మి, సంగడిమొుల, సన్నలేగ. పాలిష్ పాత్రల పైడిజైన్లు వేయడానికి వాడే పరికరం. (కో. 22).

**అద్దలించు:** (క్రి.) పర్యా. నున్నచేయు. మట్టి అచ్చు పైకప్పు గీసిన తర్వాత చేత్తో నున్నగా చేయడం (కో. 20).

అద్దాలపోగర: అద్దాలను కోయడానికి ఉపయోగించే మొల (కో. 20).

అద్దు: (క్రి.) రేకును తాకడం (రా. 3).

అద్దం[1]: పర్యా. డూము, వెల్డింగ్ అద్దం, వెల్డింగ్ గ్లాసు, వెల్డింగ్ సీల్డు, షేడు[1], సీల్డు[1], స్క్రీన్ గ్లాసు, స్క్రీను, హాండ్ సీల్డు, హెల్మెటు. వెల్డింగు పనిలో కంటికి రక్షణగా ఉపయోగించే పరికరం. (కో. 24; తె. 8,9,13; రా. 11,12,15).

అద్దం[2]: పర్యా. అద్దంసెట్టు. పెట్రోమాక్స్ లైటు మెంటల్‌కు రక్షణనిచ్చే గ్లాసు గొట్టం (తె. 23).

అద్దంసెట్టు: చూ. పర్యా. అద్దం[2]. పెట్రోమాక్స్ లైటు మెంటల్‌కు రక్షణనిచ్చే గ్లాసు గొట్టం (తె. 18).

అనకాపల్లిబింది: నీళ్ళు తేవడానికి ఉపయోగించే ఒకరకం గుండ్రనిబిందె (కో. 24).

అనకాపల్లిబుడ్డి: పొట్ట ఎక్కువగా, మూతి చిన్నగా ఉండే చిన్న లోహపుపాత్ర. అనకాపల్లిలో తయారయింది (కో. 29).

అనగగొట్టు: (క్రి.) చూ. పర్యా. అణుచు. ఇత్తడి పాత్రల పొట్టభాగానికి అతకడానికి వీలుగా, ఎత్తుగా ఉండే రేకుని క్రిందికివంచడం (రా. 2).

అనగ్గొట్టు: (క్రి.) పోతపనిలో మట్టిని తొక్కుడు చేయడం (రా. 4).

అనపకరువాయి: ఉ. అనుపుకరువాయి. పాత్రల కుతికభాగాన్ని తయారుచేయడానికి ఉపయోగించే పరికరం (కో. 6, 20).

అనపబెట్టు: (క్రి.) బిందెల అడుగుభాగం కచ్చులు లేకుండా నున్నగా చేయడం (కో. 26).

అనిగసుత్తి: ట్రంకుపెట్టె రేకును బొద్దుకొట్టడానికి వాడే పనిముట్టు (కో. 2).

అనిగేయు: (క్రి.) పర్యా. మనగొట్టు. పొడవుగా ఉండే ఇనుపముక్కలను కొలిమిలోకాల్చి ముద్దగా చేయడం (తె. 17).

అనీలింగ్‌పర్నీసు: రేకును మెత్తపనంకోసం కాల్చడానికి వాడే పరికరం. ట్రక్కులాగా ఉంటుంది (రా. 7).

అనుచు: (క్రి.) రూ. అనుపువేయు, అనుపు. పర్యా. పట్టు[1], లావుచేయు. రేకును గుండ్రంగా అతికించి బిందె మధ్యభాగాన్ని బొర్రలాగ చేయడం (కో. 22, 23, 27; తె. 3, 7).

అనుపసుత్తి: రూ. అనుపుడుసుత్తి. రేకును అణగ్గొట్టి అందాలుతీర్చడానికి వాడే పనిముట్టు (కో. 4).

అనుపుడుసుత్తి: చూ. అనుపసుత్తి (కో. 28).

అనుపువేయు: (క్రి.) చూ. పర్యా. అనుచు. రేకుల్ని వంచి పాత్ర ఆకారాన్ని తయారుచేయడం (కో. 29).

అనువు: (క్రి.) చూ. అనుచు (రా. 1).

అన్చేసుత్తి: చూ. పర్యా. అద్దకన్ను. ఇత్తడి, అల్యూమినియం పాత్రలను వంపుచేయడానికి ఉపయోగించే పనిముట్టు (తె. 26).

అన్నంకారేజి: (< అన్నం + ఇం. Carriage) చూ. పర్యా. కారియరు. అన్నం వగైరా పదార్థాలు తీసుకెళ్ళడానికి వాడే పాత్ర (కో. 24).

అన్నంగరిటె: పర్యా. అన్నంహస్తం. అన్నం వడ్డించటానికి వాడే హస్తంలాగా ఉండే గరిట చూ. చిత్రం 10 (కో. 30).

అన్నంగిన్నె: వంటకు వాడే చిన్న లోహపుపాత్ర (కో. 28).

అన్నంగెరిటె: చూ. పర్యా. హస్తం. అన్నం వడ్డించడానికి వాడే పెద్దస్పూను. చూ. చిత్రం 223 (కో. 1, 18).

అన్నంగుండిగ: చూ. పర్యా. అండా[1]. అన్నం వండటానికి, నీళ్ళు తోడటానికి ఉపయోగించే గుండ్రని పాత్ర. చూ. చిత్రం 8 (కో. 18).

అన్నంచెయ్యి: రూ. అన్నంచేయి. చూ. పర్యా. హస్తం. అన్నం వడ్డించడానికి వాడే పెద్దస్పూను. చూ. చిత్రం 223 (తె. 5, 7).

అన్నంచేయి: చూ. అన్నంచెయ్యి (కో. 28).

అన్నంచెంచా: ఉ. అన్నంచెంచా. చూ. పర్యా. హస్తం. అన్నం వడ్డించడానికి వాడే చేయిగరిటె. చూ. చిత్రం 223 (తె. 3, 8).

అన్నండేక్సా: (అన్నం + హిం. దేగ్చా) చూ. పర్యా. అండా[1]. అన్నం వండడానికి, నీళ్ళు తోడటానికి ఉపయోగించే పాత్ర. చూ. చిత్రం 8, (కో. 10, 12).

అన్నంబింది: వంటకు వాడే లోహపుపాత్ర (కో. 30).

అన్నంబుట్ట: పర్యా. కళ్ళజంగిడి; కూరలబుట్ట, గంజితట్ట, చిల్లిప్లేటు, జల్లిగిన్నె, జల్లిసిబ్బి, జల్లిసెట్టు, జాలి[7], జిబ్బిరేకు, వడగంప, వడగిన్నె, వడబుట్ట, వడితట్ట, వార్చేపళ్ళెం. అన్నం వంచుకోడానికి, బియ్యం వడబోయటానికి వాడే రంధ్రాలున్న లోహపుపాత్ర. చూ. చిత్రం 11, (కో. 17-19),

అన్నంసరవ: వంటకు వాడే గుండ్రని అండాలాగ ఉండే లోహపుపాత్ర. చూ. చిత్రం 12. (తె. 19).

అన్నంహస్తం: చూ. పర్యా. అన్నంగరిటె. అన్నం వడ్డించడానికి వాడే చేయిలాగ ఉండేగరిట. చూ. చిత్రం 10 (కో. 26).

అందపరచు: (క్రి.) పర్యా. అందపుచ్చు, అందపెట్టు, అందంచేయు. ఇత్తడి రేకులను పాత్రల ఆకారం వచ్చేటట్లుగా కొట్టడం (కో. 28).

అందపుచ్చు: (క్రి.) చూ. పర్యా. అందపరచు. ఇత్తడి రేకులను పాత్రల ఆకారం వచ్చేటట్లుగా కొట్టడం (కో. 26).

అందపెట్టు: (క్రి.) చూ. పర్యా. అందపరచు ఇత్తడి. రేకులను పాత్రల ఆకారాలు వచ్చేటట్లుగా కొట్టడం (కో. 27).

అందంచేయు: (క్రి.) చూ. పర్యా. అందపరచు. ఇత్తడిరేకులను పాత్రల ఆకారాలు వచ్చేటట్లుగా కొట్టడం (కో. 5).

అందె: కోడికాళ్ళకు కట్టే ఆభరణం (కో. 13).

అందెలు: పర్యా. కాళ్ళగజ్జెలు, గంగురు, గజ్జెలు¹. నాట్యసమయంలో కాళ్ళకు కట్టుకోడానికి వాడే చిన్న ఇత్తడి మువ్వలు. చూ. చిత్రం 52 (కో. 7; తె. 18).

అప్పడాలపట్టుకారు: నూనె పెనంనుంచి అప్పడాలు తీయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 13. (రా. 3, 5).

అప్పడాలసిమటా: చూ. పర్యా. రంధ్రాల గరిటె. నూనెలోనుండి పిండిపదార్థాలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న పరికరం. చూ. చిత్రం 107 (రా. 4).

అబక¹: అన్నం వడ్డించడానికి ఉపయోగించే కాడ ఉన్న ఇత్తడిపళ్ళెం (కో. 22).

అబక²: ఇత్తడి టిఫనుబాక్సు (కో. 19).

అబక³: చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనెలో నుండి పిండివంటకాలు తీయడానికి వాడే రంధ్రాలున్న పరికరం. చూ. చిత్రం 107. (తె. 17, 21)

అబ్బు¹: ఉ. హబ్బు. పర్యా. సైకిలుహబ్బు. సానరాయి తిరిగేటప్పుడు పక్కలకు కదలకుండ ఉండటానికి చక్రానికి అమర్చిన పరికరం (కో. 23; తె. 6; రా. 12, 14).

అబ్బు²: ఉ. హబ్బు. ఇనుపముక్కల్ని వంపుపెట్టడానికి క్రింద ఉపయోగించే దిమ్మ (కో. 16, 27).

అబ్బు³: వంకరగాఉండే వస్తువును చక్కగ సరిచేయడానికి వాడే గుండ్రటి పరికరం. (తె. 12).

అబ్బుపుల్లలు: సైకిల్‌చక్రానికి ఉండే కమ్మలు (తె. 12).

అమన్‌దస్తా: (హిం.) చూ. అమమ్‌దస్త¹ చూ. పర్యా. ఉక్కురోలు. మసాలాపొడులు దంచుకోడానికి ఉపయోగించే ఉక్కుసాధనం చూ. చిత్రం 25 (కో. 18, 23, 24, 26, 28).

అమనస్‌ప్లేట్‌డబ్బా: (< హిం. అమనస్ + ఇం. plate హిం. డబ్బా). పప్పులు మొదలైన పొడి పదార్థాలు నిల్వ ఉంచుకోవడానికి వాడే స్టీల్‌డబ్బా (తె. 11, 16).

అమమ్‌దస్త: (హిం.) చూ. అమన్‌దస్తా (కో. 4, 9).

అమసపాదుకాయితం: (< అమసపాదు + హిం. కాయితం) చూ. పర్యా. ఎమరీపేపరు. లేగపట్టిన తర్వాత తెగినభాగాల్ని సాపుపట్టడానికి వాడే గరుకాయితం (కో. 21, 24).

అమెరికన్‌స్పూను: (ఇం. American Spoon). ద్రవపదార్థాలు వడ్డించుకోడానికి వాడే డిజైను ఉన్న చిన్నగరిట (కో. 6).

అమ్మవారిబిందె: ఒకటిన్నరడుగు వెడల్పుమూతి ఉండే నీళ్ళపాత్ర చూ. చిత్రం 14 (కో. 2).

అమ్మూర్: బీరువాల తయారీలో ఉపయోగించే పట్టకార (రా. 12).

అమ్మూరుపట్టుకార: చూ. పర్యా. చిప్ట. అతికేటప్పుడు పాత్రలను పట్టుకోడానికివాడే పనిముట్టు (రా. 8).

అంబరి: తనుమును సాగ్గొట్టే సాధనం (కో. 23).

అంబురి: మరలు బిగించే సాధనం (రా. 10).

అంబురు: ఉ. అంబూరు. రూ. అంబోరు. అతికేటప్పుడు పాత్రలను పట్టుకోడానికి, కడ్డీలు నరికేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి, చీలలను ఊడబెరకడానికి, వెల్డింగ్‌పనిలో ముక్కలు పట్టుకోడానికివాడే పనిముట్టు (తె. 1, 3, 4; రా. 11, 13, 16).

అంబోరు: చూ. అంబురు (రా. 8).

అయోడిన్‌కప్పు: (< ఇం. Iodine + Cup). కూరలు, మజ్జిగ మొదలయినవి పోసుకోడానికి వాడే గిన్నె (కో. 6, 11).

అర: వస్తువులుంచడానికి బీరువాలో ఉండేచోటు (రా. 4, 14).

అరకాగు: చూ. పర్యా. అండా¹. నీళ్ళునిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల పిడి, వెడల్పుమూతి ఉన్న పెద్ద లోహపుపాత్ర. చూ. చిత్రం. 8 (రా. 7).

అరగదీయు: (క్రి.) వెల్డింగ్‌చేసిన తర్వాత కడ్డీలపై ఉండే బొడిపెలను కనబడకుండా చేయడం

(కో. 19).

అరటిఆకు: చూ. అరిటాకు (తె. 1).

అరటిచెట్టు: అరటిచెట్టు ఆకారంలో ఉండే ఇత్తడిరేకు. వాకిలికి అలంకారంగా ఉపయోగిస్తారు (రా. 15).

అరటేకు: ఉ. అరటాకు, అర్టాకు. రూ. అరటిఆకు. పర్యా. కోటేకు. అరటాకులో సగభాగం ఆకారంతో అంచు లేకుండాచేసిన స్టీలుపళ్ళెం. పెద్దసైజువి భోజనాలకు, చిన్నసైజువి ఫలహారాలకు, చాలా చిన్నసైజువి దేవునివద్దను నైవేద్యానికి వాడుతారు. చూ. చిత్రం 15. (కో. 7, 10–15, 19, 20, 23, 26, 29; తె. 1, 2, 8, 9, 13, 19, 23, 24).

అరటేకుకంచం: ఉ. అరటాక్కంచం. అరటాకులో సగభాగం ఆకారంతో అంచున్న స్టీలుపళ్ళెం. పెద్ద సైజువి భోజనాలకు, చిన్నసైజువి ఫలహారాలకు, ఇంకా చిన్నసైజువి దేవునివగ్గర నైవేద్యానికి వాడుతారు (కో. 15, 28).

అరడ[1]: గంట మధ్యభాగం (రా. 3).

అరడ[2]: బంతిలాగా ఉండే గరగ మెడభాగం (కో. 20).

అరణివేణి: చూ. అరివేణి (కో. 7, 22).

అరపు: పర్యా. అరపూస. అల్యూమినియం పాత్రలకు మెరుగు పెట్టడానికివాడే జిగురుపదార్థం (కో. 4, 26).

అరపూస: రూ. పర్యా. అరపు. అల్యూమినియం పాత్రలకు పాలిష్ పెట్టడానికివాడే బంకపదార్థం (కో. 26).

అరపౌనుసుత్తి: (< అర + ఇం. Pound + సుత్తి). రివిట్లు కొట్టడానికి వాడే పనిముట్టు (కో. 24; రా. 10).

అరబత్తి: గోళ్ళు కత్తిరించుకోడానికి వాడే కత్తెర (తె. 8, 9).

అరలస్టాండు: వంటసామాన్లు పెట్టుకోడానికి వాడే పరికరం (కో. 14, 15).

అరలు: పర్యా. సొరుగులు. బీరువాలోపలి సెల్ఫులు (కో. 18, 26).

అరిగెపాత్ర: చూ. పర్యా. పంచపాత్ర. సంధ్య వార్చుకొనేటప్పుడు తీర్థానికి వాడే చిన్నపాత్ర. గుండ్రంగా ఉండి క్రిందిభాగంలో కుదురు ఉంటుంది (రా. 7, 8, 12, 13).

అరసున్నచానం: శిల్పపనిలో రేకును వంపు చేసుకోడానికి వాడే పరికరం (కో. 6).

అరికత్తెర: పచ్చివక్కను కత్తిరించడానికి వాడే సాధనం (తె. 7).

అరివేణం: చూ. అరివేణి (కో. 2, 22); తె. 2, 21, 22).

అరివేణి: ఉ. అరవాణి. రూ. అరివేణం, అరణివేణి. పర్యా. తట్ట[3], పళ్లెం[1], పూజతట్ట. పూజతప్పుకు, ప్లేటు[3], హరివాణం, సంపుష్టిని. పంచపాత్ర మొదలైన పూజాసామగ్రి ఉంచుకోడానికి వాడే రాగి పళ్ళెం (కో. 7, 11, 14, 15, 18, 20–29; తె. 21).

అరిసెచట్టం: చూ. పర్యా. అరిసెపలక. అరిసెలు చేసినతర్వాత వాటిలోని నూనెను తీసివేయడానికి వాడే పరికరం. రంధ్రాల బిళ్ళను పట్టుకోడానికి వీలుగా ఉండే పిడితో అరిసెలపై పెట్టి ఒత్తితే నూనె దిగిపోతుంది. చూ. చిత్రం 16 (కో. 23).

అరిసెపలక: పర్యా. అరిసెచట్టం, అరిసెలవొత్తుడు. అరిసెలు తయారుచేసిన తర్వాత వాటిలోని నూనెను తిసివేయడానికి వాడే పరికరం. రంధ్రాల బిళ్ళను పట్టుకోడానికి వీలుగా ఉండే పిడితో అరిసెలపై పెట్టి ఒత్తితే నూనె దిగిపోతుంది. చూ. చిత్రం. 16 (తె. 19).

అరిసెలవొత్తుడు: చూ. పర్యా. అరిసెపలక. అరిసెలు చేసినతర్వాత వాటిలోని నూనెను తీసివేయడానికి వాడే పరికరం. రంధ్రాల బిళ్ళను పట్టుకోడానికి వీలుగా ఉండే పిడితో అరిసెలపై పెట్టి ఒత్తితే నూనె దిగిపోతుంది. చూ. చిత్రం. 16 (తె. 19).

అరుగు: (క్రి.) కుట్టుమిషన్ భాగాలు అరిగిపోవడం (రా. 6).

అర్ధగణి: రేకును లెవల్ చేయడానికి ఉపయోగించే సాధనం (రా. 13).

అర్దండ: తాళం వేయడానికి వీలుగా వెల్డింగ్ తలుపులకు అంటించే గొళ్ళెం (తె. 6, 25).

అర్త్: (< ఇం. Earth.) రూ. ఎర్తు. పర్యా. అర్త్ కేబులు, ఎర్త్ వెల్డింగ్, యర్త్‌వైరు. వెల్డింగ్ పనిలో అవసరమయ్యే ముఖ్యమైన పనిముట్టు (తె. 4, 6, 7, 22, 25).

అర్త్‌కేబులు: (< ఇం. Earth cable) చూ. పర్యా. అర్త్. వెల్డింగ్ పనిలో అవసరమయ్యే ముఖ్యమైన పనిముట్టు (తె. 18).

అర్రలటిఫిన్: (< అర్రల + ఇం. Tiffin) చూ. పర్యా. కారేజి. భోజనం తీసుకెళ్ళడానికి మూడు నుంచి అయిదు గిన్నెలవరకు ఉండే పరికరం (తె. 22).

అలగార్తి: కర్పూరపుహారతి (రా. 5).

అలికినకమ్మి: చూ. అలిక్కమ్మి (కో. 22).

అలిక్కమ్మి: పర్యా. అలికినకమ్మి, అల్పికమ్మి. పాత్రల రిపేరిలో అతికేటప్పుడు టంకాన్ని నద్దడానికి వాడే పొడవైన కడ్డీ (కో. 16, 19–22, 25, 27).

అలివేసుబకెట్టు: పదార్థాలు ఉంచుకోడానికి వాడే పాత్ర (కో. 7).

అలుగు: దాయాలకు వేసే రంధ్రం (రా. 5).

అలెన్‌కీ: డ్రిల్‌చెక్స్‌ను బిగించే పనిముట్టు (తె. 1).

అల్పికమ్మి: చూ. అలిక్కమ్మి (కో. 15).

అల్మారి: (< ఇం. Almirah). ఇనుపరేకులతో తయారుచేయబడిన బీరువా (తె. 24).

అల్యూమినియం: పాత్రల తయారీకి వాడే ఒకరకం లోహం (రా. 5).

అల్యూమినియంగరిట: కూరలు వేసుకోడానికివాడే అల్యూమినియం లోహంతోచేసిన స్పూను (కో. 1)

అల్యూమినియంప్లేటు: ఏవైనా వస్తువులుంచుకోడానికి అల్యూమినియం లోహంతోచేసిన సెల్ఫు (కో. 7).

అల్యూమినియంమగ్గు: పాలు కాచుకోవడానికి అల్యూమినియం లోహంతోచేసిన కాడ చెంబు (కో. 1).

అల్యూమినియంరాడ్డు: కరెంటుకమ్మీలు తయారు చేసుకోడానికి ఉపయోగపడే పరికరం (రా. 7).

అల్లు: (క్రి.) చత్రిపుల్లలన్నింటిని కలిపి వరుసగా దన్నర్‌లో వైరుసహాయంతో కూర్చడం (కో. 18; రా. 4).

అల్లుకొను: (క్రి.) గరుకుగాఉండే మట్టిని జల్లెడ పట్టడం (రా. 15).

అల్వాట్రే: (< హిం. హల్వా + ఇం. Tray). హల్వా చేసుకోదానికి వాడే నాలుగుపక్షాలున్న వెడల్పాటి అల్యూమినియం పళ్ళెం (కో. 2, 17).

అళా: చూ. పర్యా. అళాసీసం. కళాయిపనికి పనికి వచ్చే పదార్థం (రా. 5).

అహాసీసం: పర్యా. అళా. కళాయిపనికి ఉపయోగించే పదార్థం (రా. 1).

అళీ: బండిచక్రానికి చుట్టూవేసే ఇనుపబద్ద (రా. 13, 14).

అశీలబండ: రాయిబండ (తె. 14).

అవుట్‌కట్టె: (ఇం. out కట్టె). ఉలికి ఆధారంగా వాదే పరికరం (రా. 16).

అవుట్‌కర్ర: (< ఇం. out + కర్ర). స్పిన్నింగ్ వర్కులో రేకును ప్రెస్‌చేయడానికి వాడే సాధనం (కో. 26).

అవుట్‌పట్టు: (క్రి.) (< ఇం. out + పట్టు). హెచ్చు తగ్గులుగావుండే రేకును సాపుగాచేయడం (రా. 16).

అవుట్ సైడ్ ఇన్నర్: ఇనుపగేట్లలో వెలుపలికొలతలు చూచుకోదానికి వాడే పరికరం (తె. 12).

అవుటర్: చూ. పర్యా. అవుటర్ కంపాసు. పాత్రల కొలతలను నిర్ణయించుకోడానికి వాఢే కైవారం (రా. 14).

అవుటర్‌కంపాసు: పర్యా. అవుటర్. బోల్టులపై కొలతలు, బేరింగ్ బయటకొలతలను వేయడానికి వాడే పరికరం (రా. 3, 6).

అవుటు: (క్రి.) (< ఇం. out). పాత్రపీసులు బయటికిరావడం (రా. 8).

అవుటుతీయు: (క్రి.) (< ఇం. out + తీయు). అల్యూమినియం రేకును మిషన్‌లో బిగించి లెవల్ చేయడం (కో. 22).

అసెంబ్లిచేయు: (క్రి.) (< ఇం. Assemble + చేయు). రేకులన్నీ కలిపి బీరువా ఆకారంవచ్చేటట్లు జాయింట్ చేయడం. కొలతలప్రకారం కడ్డీలను డిజైన్లలాగ అమర్చడం (తె. 25; రా. 5).

అస్తరు: మొదటిసారి బీరువాకువేసే రంగు (తె. 22).

అస్తం: చూ. హస్తం (కో. 24; తె. 12, 22).

అంసకాగితం: రంగువేయడానికిముందు పెట్టెను తుడవడానికి వాఢే పేపరు (కో. 28).

## ఆ

ఆక్‌పరచెంబు: నీళ్ళు తాగడానికి ఉవయోగించే ఇత్తడిపాత్ర (కో. 24).

ఆకాశదీపం[1]: పువ్వొత్తి పెట్టడానికి వాడే ప్రమిద. దీనిమధ్యలో ఉండే గొట్టంద్వారా వత్తి ఎక్కించి వెలిగిస్తారు. పైకిచూస్తుంటుంది కాబట్టి దీనిని అకాశదీపం అంటారు (తె. 6, 21).

ఆకాశదీపం[2]: కార్తీకమాసంలో దీపం వెలిగించి ధ్వజస్తంభంమీద పెట్టడానికి కాయలాగ ఉండే సాధనం (కో. 11; 12).

ఆకు: బిందె మెడకు, దొడ్డికిమధ్య ఉండే వంపుభాగం (కో. 21; తె. 19).

ఆకుకోరాచెంబు: చూ. ఆకుపరాచెంబు (కో. 21).

ఆకుపరా: చూ. ఆకుపార (కో. 21).

ఆకుపరాచెంబు: రూ. ఆకుకోరాచెంబు. చూ. పర్యా.

దోసకాయచెంబు. క్రిందిభాగంలో మట్టుపైఅంచుకి తలభాగంమీద బొడ్డు ఉండి దోసకాయ ఆకారంతో చేసిన సాదాచెంబు (కో. 10, 16, 17, 20–22, 24, 29).

ఆకుపార: రూ. అకుపరా, ఆప్కారా, హాక్పరా. చూ. పర్యా. దోసకాయచెంబు. దోసకాయ ఆకారంలోఉండే ఇత్తడిచెంబు. శుభకార్యాల్లో పాలు తేవడానికి, నీళ్ళు తాగడానికి ఉపయోగం (కో. 19).

ఆకుపారచెంబు: చూ. పర్యా దోసకాయచెంబు. నీళ్ళు తాగడానికి వాడే దోసకాయ ఆకారంలోఉండే ఇత్తడిచెంబు (కో. 27).

ఆకుబిందె: పర్యా. జవ్వబిందె. మైలవరం బిందె. వరంగల్‌బిందె, వ్యాపారంబిందె. నీళ్ళు తెచ్చుకోడానికి వాడే వెడల్పుమూతిఉన్న ఇత్తడిబిందె చూ. చిత్రం 17 (తె. 22).

ఆకురాయి: పర్యా. గోపురంముక్క ఆకురాయి, చిన్నపైలు, నిమ్మనబొద్దు ఆకురాయి, నైసుపైలు, పైలు. మొద్దుబారిన పనిముట్టును పదునుపెట్టడానికి, బీరువాల మూలలు అరగదీయడానికి, తాళంచెవులను రిపేరుచేయడానికి, లోహపువస్తువుల జాయింట్లవద్ద అతుకులు కనబడకుండా సాపుచేయడానికి పోగర్లను తయారుచేయ్యడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 18 (కో. 1–6, 10–25, 28–30; తె. 4–8, 10–14, 16, 18–25; రా. 7–10, 12–16).

ఆకురాయి ఉలి: లోహాల పాత్రల్లోని మట్టిని తీసి వేయడానికి ఉపయోగించే పనిముట్టు (రా. 2).

ఆకురాయికత్తిరి: ఇత్తడిపాత్రలు తయారు చేసుకోడానికి వీలుగా రేకుల్ని కత్తిరించడానికి వాడే పరికరం (కో. 14).

ఆకురాయికమ్మి: పాలిష్ పనికి ఉపయోగించే పరికరం (కో. 14).

ఆకురాయితిగ: ఇత్తడిపాత్రకు అడుగులుచేయడానికి పనికివచ్చే పరికరం (తె. 5, 8).

ఆకులకత్తెర: రూ. ఆక్కత్తెర. పర్యా. చుట్టకత్తెర. బీడీ ఆకులను కత్తిరించడానికి వాడే పనిముట్టు (తె. 4).

ఆకువక్కపెట్టె: ఆకులు ఒకఅరలోను, పోకలు ఒక అరలోను, చెక్కలు మరొక అరలోను పెట్టుకోడానికి వీలుగా, గుండ్రం లేదా చౌకం లేదా ముక్కోణం ఆకారాల్లోఉండే అరల స్టీలుపెట్టె (రా. 15).

ఆకుసజ్జ: స్టీలురేకు ఆకులు అతికించిఉండే పూలసజ్జ (కో. 22).

ఆక్కత్తెర: చూ. ఆకులకత్తెర (తె. 18).

ఆక్కమ్మి: గ్లాసుల ప్రక్కభాగాన్ని పాలిష్ పట్టడానికి ఉపయోగించే పరికరం (కో. 19).

ఆక్సా: (< ఇం. Oxablade). రూ. యాక్సా. చూ. పర్యా. రంపం. ఇనుపరేకులను కోసుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 195 (తె. 15).

ఆక్సాఫ్రేము: రూ. ఆక్సాఫ్రేము. చూ. పర్యా. రంపం. ఇనుపకమ్ములు, పైపులు రేకులు మొదలైనవి కోయడానికి పనికివచ్చే పనిముట్టు. చూ. చిత్రం 195 (కో. 1, 3, 5; తె. 8, 9, 11; రా. 3–6, 12–16).

ఆక్సాబ్లేడు: చూ. పర్యా. రంపం. ఇనుపరేకులు, కమ్ములు, పైపులు మొదలయినవి కోయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 195 (కో. 1, 20; రా. 2, 5, 6, 10).

ఆగరు: (< ఇం. Auger). పొలాల్లో బోరింగ్ వేయడానికి వాడే మెలిపైపు (కో. 24).

అంకిలర్: సాల్డరింగ్‌పనిలో రేకులుకొట్టడానికి వాడే పరికరం (రా. 6).

అంగల్‌పీసు: (< ఇం. Angle piece). చూ.పర్యా. అంగ్లేరు. కడ్డీని ఫారకొట్టడానికి, సరిచేయడానికి వాడే L ఆకారపు కడ్డీ (తె. 3).

అంగలర్: (ఇం. Angler). రూ. యాంగ్లరు. రేకు వంచడానికి వాడే పరికరం (రా. 8).

అంగిలు: (< ఇం. Angle). ట్రంకుపెట్టె సరిగా ఉందా, లేదా అని చూడటానికి వాడే పరికరం (రా. 7).

అంగ్లేరు: రూ. అంగ్లరు, ఎల్లాంగ్లరు, యాంగిల్సు. చిన్న ఇనుపముక్కల్ని వంచడానికి కమ్మరం పనిలో వాడే V ఆకారపుకడ్డీ. వెల్డింగ్ డిజైను ఫ్రేములచుట్టూ వేసే బలమైన 'L' లేదా 'V' ఆకారపుకడ్డీ (తె. 3, 4, 18, 25).

అజోక్కడ్డీ: బీగాల్లోపల హెచ్చుతగ్గులను సరిచేయడానికి వాడే పరికరం (కో. 18).

అట్‌కోకో: కొలిమిలో వేసేబొగ్గు (రా. 5).

అట్‌తీయు: (క్రి.) < ఇం. out తీయు). వెల్డింగ్ డిజైన్లను తయారుచేయడానికి ముందుగా పెద్ద రేకుపై డిజైను గీసుకోవడం (తె. 19).

అటకిచెన్ని: ఇనపపిండి జల్లెడ (తె. 10, 11).

అటుచేసుకొను: (క్రి.) గ్రిల్స్‌చేయడానికి ముందు డిజైను గీసుకోవడం (తె. 1).

ఆడించు: (క్రి.) పర్యా. ఆడిపించు. బీరువా తలుపును లోపలికి, బయటికి సులువుగా తిరుగునట్లు చేయడం (కో. 17-20, 28; రా. 10).

ఆడిపించు: (క్రి.) చూ. పర్యా. ఆడించు. బీరువా తలుపును సులువుగా తిరిగేటట్లు చేయడం (రా. 16).

ఆడు: (క్రి.) వెల్తురు రావడానికి లాంత్రిన్ పైబర్‌ను పైకి క్రిందికి త్రిప్పడం (తె. 3).

ఆదితీయు: (క్రి.) రేకుపై కొలత తీయడం (కో. 20).

ఆన్విత: పట్టీలను సాగ్గొటానికి, కట్ చేయదానికి వెల్డింగ్ పనిలో ఉపయోగించే ఇనుపదిమ్మ (తె. 5).

ఆనములు: వెల్డింగ్ చేసేముందు కడ్డీలపై పెట్టే గుర్తులు (కో. 16).

ఆనందగ్లాసు: నీళ్లు తాగడానికి వాడే పొడవుగా, పెద్దగా, సాదాగా ఉండేగ్లాసు (కో. 4, 6, 10, 11, 13, 15; తె. 8-11, 13).

ఆనియన్‌కట్టర్: (ఇం.) ఉల్లిపాయలు తరగడానికి ఉపయోగించే పరికరం (కో. 17).

ఆప్‌కార[1]: ఉ. ఆప్‌కోరా, ఆవ్‌కోరు. పర్యా. ఆప్‌కోరా చెంబు. మధ్యభాగం వెడల్పుగ, కొంచెం పక్షెలుగా, కూజా ఆకారంతో ఉండి, మూతిభాగం పొడవుగా ఉండే ఇత్తడి పోతచెంబు. నీళ్లు తాగడానికి ఉపయోగం (కో. 20, 22, 29).

ఆప్‌కోరాచెంబు: చూ. పర్యా. ఆప్‌కార. మధ్యభాగం వెడల్పుగ, కొంచెం పక్షెలుగా, కూజా ఆకారంతో ఉండి, మూతిభాగం పొడవుగా ఉండే ఇత్తడి పోతచెంబు (కో. 19).

ఆప్‌కోరాప్లేటు: డిజైను అంచు ఉండే స్టీలుపళ్లెం (కో. 21).

ఆప్‌రౌండుఉలి: (< Half round + ఉలి). బీరువాలో మూలలు వచ్చినపుడు సరిచేయడానికి వాడే పరికరం (కో. 15).

ఆప్‌రౌండుకత్తెర: (< ఇం. Half round + కత్తెర). రేకును ఆప్‌రౌండుగా కత్తిరించడానికి వాడే పరికరం (కో. 14).

ఆపిల్ కుంకుమభరిణి: పర్యా యాపిల్‌కాయ. యాపిల్ ఆకారంలో ఉండే డబ్బి. కుంకుమ పోసుకోడానికి వాడ్తారు. (కో. 6).

ఆపాలపెనం: ఒక అడుగు లోతుతో దాకలాగ ఉండే లోహపుపాత్ర. పట్టుకోడానికి అంచుంటుంది. కింది దాకలో కలిపిన పిండిపోసి దానిపై ఇంకోదాక బోర్లించి ఆపాలు పోసుకుంటారు. చూ. చిత్రం 19 (కో. 19, 23; రా. 9).

ఆపు: కొయ్యముక్కలు పగలగొట్టడానికి వాడే సాధనం (రా. 2).

ఆప్కారా: ఆకుపార (కో. 10).

ఆప్‌రౌండు ఆకురాయి: (< ఇం. Half round + ఆకురాయి). పర్యా. ఆఫ్‌రౌండు పైలు. విగ్రహాల చేతులు, కాళ్లు సాపుచేయడానికి, గొట్టాల లోపలి భాగాల్ని శుభ్రం చేయడానికి వాడే పనిముట్టు (కో. 18; తె. 3).

ఆప్‌రౌండు గెడ్డపార: (< ఇం. Half round + గెడ్డపార). గంగాళాల అడుగుభాగాన్ని చదరం చేయడానికి వాడే పరికరం (కో. 4, 9, 11).

ఆప్‌రౌండు పుతల్: (< ఇం. Half round + పుతల్). బీరువాపై అంచులు, ప్రక్క గోడలు వంచడానికి ఉపయోగించే పడగాకారపు సాధనం (తె. 2, 20, 24; రా. 15).

ఆప్‌రౌండు పైలు: (< ఇం. Half round + File). చూ. పర్యా. ఆఫ్‌రౌండు ఆకురాయి. బీరువారేకులపై రంధ్రాలు సరిచేయడానికి వాడే గుండ్రని ఆకురాయి. విగ్రహంలో కాళ్లు, చేతులు సరిచేయడానికి కూడా వాడ్తారు (కో. 6, 28; తె. 2, 20, 25; రా. 6).

ఆపిల్‌కట్టర్: (< ఇం. Apple Cutter). ఆపిలు కాయలు కోయడానికి వాడే సాధనం (తె. 15, 16).

ఆమరు: (< ఇం. Hammer). రూ. యామరు, హేమరు. పర్యా. పెద్ద దేశమట్‌సుత్తి, పొట్లం హతోడి, బెండింగ్‌హామరు, మడిదలసుత్తి, మలాటు. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపు చేయడానికి వాడే సుత్తె. ఒకపక్క గుబ్బగా, మరొకపక్క చదునుగా ఉంటుంది (తె. 5).

ఆముదం: పోతపనిలో ఉపయోగపడే నూనె (తె. 8).

ఆయకుడుముపాత్ర: కుడుములు తయారుచేసుకోడానికి వాడే రంధ్రాలుండే పాత్ర (కో. 10, 12).

ఆయిల్‌కాను: (< ఇం. Oil can). చూ. ఆయిల్ క్యాను (కో. 2, 26; తె. 19, 20, 22).

ఆయిల్‌కాపు: (< ఇం. Oil cap). రూ. ఆయిల్ కాప్. పర్యా. ఆయిల్‌కీ. కిరసనాయిల్ టాంక్ గొట్టంపై ఉండే బిరడా. గాలిని బయటికిపోకుండా ఉంచి, ఆయిల్‌ను కావలసినట్లు వదులుకోడానికి ఉపయోగం (కో. 22, 28; తె. 17, 22).

ఆయిల్‌కార్క్: (< ఇం. Oil cork). చూ. పర్యా. ఆయిల్‌కాపు, బర్నర్‌కువచ్చే గాలిని కంట్రోల్ చేయడానికి టాంక్ గొట్టంపైౖ ఉండే పరికరం (కో. 29).

ఆయిల్‌కీ: (< ఇం. Oil key). చూ. పర్యా. ఆయిల్‌కాపు. ఆయిల్‌ను విడుదలచేయడానికి పనికివచ్చే పరికరం (కో. 28).

ఆయిల్‌కుప్పి: (< ఇం. Oil + కుప్పి). సైకిల్ చక్రానికి అయిల్ వేయడానికి పనికివచ్చే పరికరం (తె. 8, 13).

ఆయిల్‌కేప్: చూ. ఆయిల్‌కాపు (కో. 2).

ఆయిల్‌క్యాను: రూ. ఆయిల్‌కాను; ఆయిల్‌క్యాన్స్. పర్యా. ఆయిల్‌జాడి. నూనె తెచ్చుకోడానికి వాడే పొడవైన సీసాలాగఉండే స్టీలుపాత్ర. చూ. చిత్రం 20 (కో. 15; తె. 13, 14, 15, 16).

ఆయిల్‌గరిటె: (< ఇం. Oil + గరిటె). డబ్బాల్లోంచి నూనెను తీసుకోడానికి వాడే కాడఉండే గరిట (కో. 22).

ఆయిల్‌గిన్నె: (ఇం. Oil + గిన్నె). పనిముట్లను పదునుపెట్టే నూనెను వేసుకొనే చిన్న కప్పు (కో. 2, 26).

ఆయిల్‌జాడి: (< ఇం. Oil + జాడి). చూ. పర్యా. ఆయిల్‌క్యాను. నూనె తెచ్చుకోడానికి వాడే పొడవైన సీసాలాగఉండే స్టీలుపాత్ర. చూ. చిత్రం. 20. కో. 22).

ఆయిల్‌ట్యాంకు: కిరోసిన్ పొయ్యటానికి, నూనెను పంపడానికి వాడే పరికరం (రా. 7).

ఆయిల్‌డబ్బా: సైకిల్ బ్రేకులకు, వీల్స్‌కు పనికివచ్చే నూనెను ఉంచుకోడానికి వాడే చిన్న బాక్సు (రా. 8).

ఆయిల్‌నట్: స్టౌ బర్నర్‌కువచ్చే గాలిని అదుపులో ఉంచే సాధనం (కో. 30).

ఆయిల్‌పంపు: డ్రమ్ముల్లోనుండి నూనెను పైకి తీయడానికి వాడే పరికరం (తె. 17).

ఆయిల్‌ఫిల్టర్: (< ఇం. Oil filter). వడగాని పూరిగాని వేసుకోడానికి వాడే పరికరం (రా. 8).

ఆయిల్‌వాసర్: (< ఇం. Oil washer). పెట్రమాక్సు ఆయిల్‌బాక్సుకు బిగించిఉండే పరికరం (కో. 2).

ఆయిల్‌సాకెట్: నూనె పోయడానికి స్టౌ టాంకిపై బిగించిన గొట్టం. దీనిపైన ఏర్ కీ ఉంటుంది (తె. 17).

అయిలు: పర్యా. గ్యాసునూనె, నూనె, మంచినూనె. లోహపు పాత్రలకు మెరుగుపెట్టడానికి వాడే మంచి నూనె లేదా కొబ్బరినూనె (కో. 4, 8, 22).

అయుధం: తెగడానికి వీలుగాచేసిన పనిముట్ల అంచు (తె. 22).

అయుధంఏయు: (క్రి.) చూ. పర్యా. సరుసు. పదును పెట్టడానికి వీలుగా పనిముట్ల అంచుల్ని ఏటవాలుగా, పల్చగ తయారుచేయడం (తె. 21).

అయుధంకొట్టు: (క్రి.) చూ. పర్యా. సరుసు. పదును పెట్టడానికి వీలుగా పనిముట్ల అంచుని ఏటవాలుగ, పల్చగ తయారుచేయడం. (తె. 17).

అయుధంచేయు: (క్రి.) చూ. పర్యా. సరుసు. పదును పెట్టడానికి వీలుగా పనిముట్ల అంచుల్ని ఏటవాలుగ, పల్చగ తయారుచేయడం. (తె. 18).

అర్‌కెచెంబు: నీళ్ళు తీసుకొని వెళ్ళడానికి వాడేచెంబు (కో. 2).

ఆర: (హిం.) చూ. పర్యా. రంపం. కడ్డీలను కోయడానికి ఉపయోగించే రంపం. చూ. చిత్రం 195. (తె. 2).

ఆరబెట్టు: (క్రి.) పాత్రను తోమిన తర్వాత తేమ లేకుండా చేయడం. విగ్రహాన్ని ఎండబెట్టడం (కో. 1; రా. 1, 3, 5, 7).

ఆరా: ఇనుపతంతెలు, పైపులు కోయడానికి ఉపయోగించే అక్సా రంపంతో ఉండే చట్రం (తె. 20; రా. 14).

ఆరి: సానమిషను బెల్టును కుట్టడానికి ఉపయోగించే పరికరం (కో. 20; రా. 15).

అరుచేయు: (క్రి.) ఇనుపకడ్డీని బాడిసెలాగ తయారు చేయడం (కో. 24).

అరుపౌనులుగన్: (< ఆరు + ఇం. Pounds gun). తారు డ్రమ్ములు చదరం చేసుకోడానికి ఉపయోగించే సమ్మెట (కో. 5).

అర్క్: (< ఇం. Arc). వెల్డింగ్ నలుసు (తె. 15).

అర్క్‌వెల్డింగ్: పర్యా. ఆర్కుట్రాన్సుఫరం. ఇనుప వస్తువులను అతికించే వెల్డింగ్ (తె. 25).

అర్క్‌వెల్డింగ్‌మిషన్: బీరువాలోపలిభాగం వెల్డింగ్ చేయడానికి, బీరువా సెల్ఫ్‌లకు ఉపయోగపడే పరికరం (రా. 7).

అర్కుట్రాన్సుఫరం: చూ. పర్యా. ఆర్క్‌వెల్డింగ్. ఇనప వస్తువులను అతికించే వెల్డింగు (కో. 47).

అర్ను: అలగార్తికి పైభాగంలో పెట్టేదీపం కొనభాగం, (రా. 5).

ఆర్పు: (క్రి.) ఉ. ఆరుపు. పర్యా. ఆర్పుకొను. కొలిమిలో పాత్ర వేడెక్కినప్పుడు నీళ్ళు చిలకరించి కాక తగ్గించడం. (తె. 8, 9, 12, 14, 16; రా. 5).

ఆర్పుకొను: (క్రి.) చూ. పర్యా. ఆర్పు. కొలిమిలో మంట ఎక్కువరాకుండ అగ్గిపై నీళ్ళు చిలకరించడం. (కో. 21).

ఆలుగడ్డకట్టర్: (< ఆలుగడ్డ + ఇం. Cutter). రూ. ఆల్లగడ్డకట్టర్. పర్యా. ఆలుకట్టర్. ఉర్లగడ్డలు కత్తిరించుకోడానికి వాడే పరికరం. (తె. 15).

ఆలుకట్టర్: (< ఆలు + ఇం. Cutter). చూ. పర్యా. ఆలుగడ్డకట్టర్. ఉర్లగడ్డలు కోసుకోడానికి వాడే పరికరం. (తె. 11).

ఆలెకగు: నీళ్ళు కాచుకోడానికి ఉపయోగించే లోహపు పాత్ర. (రా. 9).

ఆలోచిప్స్: (< ఇం. Hallow chips). తురిమే మిషన్‌లాగ ఉండే ఇనుపమిషన్. (తె. 11).

ఆల్లి: చూ. పర్యా. లడిగ. సీసాల్లో, స్టౌలలో నూనె పోయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 201. (రా. 11).

ఆల్తి: కొలత. (రా. 10).

ఆల్లగడ్డకట్టర్: చూ. ఆలగడ్డకట్టర్. (తె. 16).

ఆవకాయగరటు: చూ. ఆవకాయగరటి. (కో. 13).

ఆవకాయగంటె: పర్యా. ఆవకాయగరటి. కోడిగుడ్డు ఆకారంలో ఉండి, పెద్దరంధ్రాలుండే స్టీలుచెంచా. ఆవకాయ ఎత్తుకోవడానికి వాడ్తారు. (కో. 18).

ఆవకాయగరటి: రూ. ఆవకాయగరటు. చూ. పర్యా. ఆవకాయగంటె. ఆవకాయ ఎత్తుకోడానికి వాడే పెద్దరంధ్రాలుండి కోడిగుడ్డు ఆకారంలో ఉండే స్టీలుచెంచా. (కో. 15).

ఆసిడ్: (< ఇం. Acid). ఉ. ఆసిడ్, ఆసీడ్, ఐసిడ్, యాసిడ్. పర్యా. ఆసిడ్ పాలిష్, తేజాపు, ద్రావకం, మరాఠీ ద్రావకం, మహాద్రావకం, సల్ఫర్, హైడ్రోక్లోరిక్ ఆసిడ్. టింకర్ పనిలో పాత్రలను అతకడానికి ముందు రేకు మడుపులపై పూయడానికి, లోహపుపాత్రల మైలను పోగొట్టడానికి వాడే ద్రవపదార్థం. (కో. 5, 22, 24, 26, 28; రా. 5, 7, 12).

ఆసిడ్‌పాలిష్: (< ఇం. Acid Polish). చూ. పర్యా. ఆసిడ్. యంత్రపు బిళ్ళల్ని మెరుగు పరచడానికి వాడే ద్రవం. (కో. 13).

ఆస్టిన్‌సెట్: (< ఇం. Austinset). పెట్రోమాక్స్ లైట్ గ్యాసును కంట్రోలు చేసే సాధనం ఇది పిన్‌రాడ్‌కు బిగించి ఉంటుంది (తె. 22).

## ఇ

ఇక్కళం: కాపుపెట్టిన ఇనుప ముక్కలను పట్టుకోడానికి వాడే పట్టుకార (రా. 13).

ఇగుడు: (క్రి.) కొలిమిలో కాల్చి బిందెకు టంటాన్ని అతికించడం. (కో. 29).

ఇగ్గు[1]: నైసురాయితో పదును త్వరగా ఎక్కకుండా ఉండటం. (రా. 12).

ఇగ్గు[2]: (క్రి.) కొలిమికి గాలి రావడానికి తిత్తిని కట్టె సహాయంతో పైకి, క్రిందికి ఊపడం. (రా. 14,16).

ఇగ్గు[3]: (క్రి.) పదునుపెట్టే గొడ్డలి భాగాన్ని పల్చగ చేయడం. (రా. 15).

ఇంగలం: కొలిమిలోని నిప్పు. (తె. 4, 6).

ఇంగ్లీషుకత్తి: (< ఇం. English + కత్తి). పర్యా. ఇంగ్లీషుచాకు. ప్లాస్టిక్‌పిడి ఉండే మంగలికత్తి. కంపెనీలో తయారు చేస్తారు. (తె. 22).

ఇంగ్లీషుచాకు: (< ఇం. English + చాకు). చూ. పర్యా. ఇంగ్లీషుకత్తి. ప్లాస్టిక్‌పిడి ఉండే మంగలికత్తి. కంపెనీలో తయారు చేస్తారు. (తె. 24).

ఇంగ్లీషురైజరు: (< ఇం. English Razor). పర్యా. స్టీలు రైజరు. షేవింగ్ చేయడానికి మంగలిషాపుల్లో వాడేకత్తి. (రా. 7).

ఇచ్చాకొట్టు: (క్రి.) ఇత్తడి రేకును వెడల్పుగా కొట్టుకోవడం. (తె. 14, 15).

ఇచ్చు: (క్రి.) తయారయిన ఇత్తడి పాత్రలను దుకాణంలో ఇవ్వడం. (తె. 15).

ఇంచు: (క్రి.) బకెట్ అంచు గట్టిగ ఉండటానికి కడ్డీని లోపల పెట్టడం. (రా. 1).

ఇంచెస్: డిజైన్లను నిలబెట్టేందుకు గోడలలో పాతిన నాలుగు చివరాలుగా ఉండే కడ్డి. (తె. 5).

ఇంజస్: చూ. ఇంజిస్. (కో. 23).

ఇంజస్ షైప్ బీరువా: డోరుపిన్నులు లేకుండా మడతబందులతో తలుపులుండే బీరువా. (తె. 20).

ఇంజిపెస్: చూ. పర్యా. ఇంజిస్. వెల్డింగ్ ఫ్రేములను కొయ్యచట్రంలో అమర్చడానికి ఉపయోగించే చిన్న గుండుకడ్డీ ముక్కలు. (తె. 25).

ఇంజిస్: రూ. ఇంజస్. పర్యా. ఇంజిపెస్, నర్మద. డిజైను ఫ్రేములను కొయ్యచట్రంలో అమర్చడానికి ఉపయోగించే చిన్న గుండ్రని కడ్డీ ముక్కలు. (కో. 23; తె. 17, 24).

ఇంజిస్పానర్: (< ఇంజి+ఇం. Spanner). సైకిల్ నట్టులు విప్పి పంచర్ చేయడానికి వాడే పనిముట్టు. (రా. 5).

ఇటుకరాయిపొడి: దీపం తయారు చేయటానికి ఐదు వైపుల ఒకదానికొకటి అతకకుండా ఉండటానికి వాడే పొడి. (రా. 5).

ఇడగొట్టు: (క్రి.) ఇత్తడి పనిలో పీకభాగాల ఆకారం వచ్చేటట్లు చేయడం. (కో. 28).

ఇడదీయు: (క్రి.) రేకులన్ని ముద్దగా జాయింటుచేసి మరల పువ్వులాగ చేయడం. కొబ్బరి తురుం చేయడానికి ఈ పద్ధతి ఉపయోగిస్తారు. (కో. 16).

ఇడుచు: (క్రి.) బిందె అంచును వెనక్కివంచడం. (కో. 19).

ఇడేయు: (క్రి.) గుండ్రంగా ఉండే ఇనుప కడ్డీలను కాల్చి పొడవుగా చేయడం. (కో. 13).

ఇడ్లీ: కావురావడానికి ఉపయోగించే రైల్వే బొగ్గు. (రా. 13).

ఇడ్లీకుక్కరు: (< ఇడ్లీ + ఇం. Cooker). చూ. పర్యా. ఇడ్లీపాత్ర. ఇడ్లీలు తయారు చేయడానికి వాడే పాత్ర. చూ. చిత్రం 22. (కో. 1, 17, 21; తె. 8, 9, 10).

ఇడ్లీగుత్తు: చూ. పర్యా. ఇడ్లీ పాత్ర. ఇడ్లీలు తయారు చేసుకొనే ప్లేటు. చూ. చిత్రం 22 (కో. 27).

ఇడ్లీగుండర్: చూ. పర్యా. ఇడ్లీపాత్ర. ఇడ్లీలు తయారు చేసుకోడానికి వాడే పాత్ర. చూ. చిత్రం 22. (కో. 1).

ఇడ్లీడబ్బా: ఇడ్లీలు పెట్టుకోడానికి వాడే డబ్బాపాత్ర. (కో. 3, 6; తె. 12).

ఇడ్లీడిష్: పర్యా. ఇడ్లీప్లేటు¹. ఇడ్లీలనుఉంచి భోజనం టేబులుపై పెట్టుకోడానికి వాడే మూతఉండే పాత్ర. చూ. చిత్రం 21. (రా. 3, 9, 11).

ఇడ్లీపాత్ర: పర్యా. ఇడ్లీకుక్కరు, ఇడ్లీగుత్తు, ఇడ్లీ గుండర్. ఇడ్లీలు తయారుచేయడానికి వాడే పరికరం చూ. చిత్రం 22. (కో. 2, 4-12, 15-20, 22, 24-28; తె. 1, 2, 11-13, 19, 21, 22; రా. 6-8, 12, 13).

ఇడ్లీపాత్రకరవాయి: ఇడ్లీపాత్ర తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 10, 12; రా. 2).

ఇడ్లీపాత్రస్టాండు: (< . ఇడ్లీపాత్ర + ఇం. Stand). ఇడ్లీపాత్ర ఉంచుకోడానికి వాడే సాధనం. (కో. 7).

ఇడ్లీప్లేటు¹: చూ. పర్యా. ఇడ్లీ డిష్. (<. ఇడ్లీ + ఇం.Plate). కోడిగుడ్డుఆకారంలో లేదా గుండ్రంగా ఉండే స్టీలుతట్ట. ఇడ్లీలు మొదలైన టిఫిన్ పెట్టుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 21. (కో. 1, 4, 8, 9, 18, 19; తె. 2, 8, 9, 13).

ఇడ్లీప్లేటు²: (< ఇడ్లీ + ఇం. Plate). చూ. పర్యా. ఇడ్లీ రేకు. ఇడ్లీపాత్రలో ఇడ్లీలు పోసిపెట్టడానికి ఉండే భాగం. చూ. చిత్రం 22A. (కో. 8).

ఇడ్లీబాక్సు: (< ఇడ్లీ + ఇం. Box). ఇడ్లీలు పెట్టుకోడానికి వాడే స్టీలుతట్ట. (కో. 2; తె. 10).

ఇడ్లీరేకు: పర్యా. ఇడ్లీప్లేటు². ఇడ్లీపాత్రలో ఇడ్లీలు పోసిపెట్టడానికి ఉండే భాగం. చూ. చిత్రం. 22A. (కో. 17).

ఇడ్లీస్టాండు: (< ఇడ్లీ + ఇం. Stand). ఇడ్లీలు పెట్టుకొనే ప్లేటుఉన్న సాధనం. పొడవాటికడ్డీకి వరుసగా ఇడ్లీగిన్నెలు అమర్చిఉంటారు. (తె. 5; రా. 14).

ఇడ్లీస్టాండుకుక్కర్: (<. ఇడ్లీ + ఇం. Stand cooker). ఇడ్లీ ప్లేట్ల స్టాండును పెట్టుకోడానికి వీలుగాఉండే పొడవైన పాత్ర. (రా. 7).

ఇడ్లీస్టాండుపాత్ర: (< ఇడ్లీ + ఇం.Stand + పాత్ర). పర్యా. ఇడ్లీ స్టాండును పెట్టడానికి వీలుగా ఉండే పొడవైన పాత్ర. కుక్కర్‌లాగ ఉంటుంది (తె. 20, 21).

ఇడ్లీస్పూను: చూ. పర్యా. ఇడ్లీహస్తం. ఇడ్లీలు పెట్టుకోడానికి వాడే పరికరం. (కో. 1).

ఇడ్లీహస్తం: పర్యా. ఇడ్లీస్పూను. ఇడ్లీలు పెట్టుకోడానికి వాడే పరికరం. (కో. 6).

ఇత్తడి: ఉ. ఇత్తాడి. ఇత్తడిపాత్రల తయారీకి, ధ్వజ స్తంభం తొడుగుకువాడే లోహం. (కో. 5, 7, 13; తె. 5, 8; రా. 3, 5, 8).

ఇత్తడికార్ఖానం: (ఇత్తడి + హిం. కార్ఖానా). ఇత్తడిపాత్రలు తయారుచేసే స్థానం. (కో. 8).

ఇత్తడికుంప: పెట్రోమాక్సులైటు మెంటల్ మట్టి కుండను గట్టిగా బిగించడానికి టోపను కిందిభాగాన ఉండే పరికరం. (తె. 22).

ఇత్తడిగంట: పెంపుడు జంతువులకు మెడలోకట్టే ఆభరణం. (కో. 6).

ఇత్తడిగిన్నె: ఇత్తడిరేకుతో తయారుచేసిన వెడల్పు పాత్ర. పాలుకాచుకోడానికి, అన్నం వండటానికి ఉపయోగం. (తె. 19).

ఇత్తడిటంకం: యంత్రపువిళ్ళలు మొదలయిన ఇత్తడి సామాన్లు అతకడానికి ఉపయోగించే సాధనం. (కో. 19; తె. 6; రా. 3).

ఇత్తడిడ్రమ్ము: (< ఇత్తడి + ఇం. Drum). నీళ్ళకు

వాడే కొళాయి అమర్చిన ఇత్తడిపాత్ర (రా. 12).

ఇత్తడిపని: ఇత్తడరేకుతో బిందెలు, దేక్సాలు, చెంబులు మొదలయినవి తయారుచేసే పని. పాత ఇత్తడి పాత్రలకు కళాయివేసే పనినికూడా ఈ పేరుతో పిలుస్తారు. (కో. 18, 19, 25, 27).

ఇత్తడిపని: పర్యా. కంచరపని. ఇత్తడి, రాగి రేకులతో బిందెలు, పాత్రలు తయారుచేసే పని. (తె.2).

ఇత్తడిబకెట్టు: ఇత్తడిరేకుతో తయారుచేసిన బకెట్టు. నీళ్ళు తోడుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 23 (రా. 3, 9).

ఇత్తడిమాలు: మూసలోకరిగిన ఇత్తడి. ద్రవరూపంలో ఉంటుంది. (తె. 10, 11).

ఇత్తడిరేకు: I.C S రేకు. బెజవాడనుండి తెస్తారు. దీనితో మకరతోరణాలు, కావలసిన విగ్రహాలు తయారుచేస్తారు. (కో. 3).

ఇత్తడివిగ్రహం: కొలిమిలో కరుగబెట్టిన ఇత్తడిని మట్టి మచ్చులో పోసి తయారుచేసిన విగ్రహం. (రా. 5).

ఇత్తలిఅండ: నీళ్ళకు ఉపయోగించే లోహపుపాత్ర. (రా. 2).

ఇత్తళి: ఉ. ఇత్తలి, ఇత్తాళి. చూ. ఇత్తడి. (రా. 35).

ఇదిరించు: (క్రి.) పర్యా. ఫ్లక్సుతీయు. పాత్రలకు వెల్డింగ్ పూర్తయిన తర్వాత పైనుండే బొడిపెలను తీసివేయడం. (తె. 17).

ఇన్‌సైడ్: పర్యా. ఇన్‌సైడ్ బన్నర్. ఇనుపచట్టాలు బిగించేటప్పుడు కొలతలను సరిచూసుకోడానికి వాడే సాధనం. (కో. 8, 26).

ఇన్‌సైడ్‌బన్నర్: చూ. పర్యా. ఇన్‌సైడ్. ఇనుప చట్టాలు బిగించేటప్పుడు లోకొలతలు చూచుకోడానికి వాడే పరికరం. (తె. 12).

ఇనపకళాయి: చూ. ఇనుముకళాయి. (కో. 26).

ఇనపదుక్క: రేకును గుండ్రం చేయడానికి వాడే పనిముట్టు. (కో. 28).

ఇనపబకెట్టు: ఇనుపరేకుతో తయారుచేసిన బకెట్టు. నీళ్ళు తోడుకోడానికి ఉపయోగం. ప్రక్కభాగంలో రివిట్లు కొట్టివుంటారు. చూ.చిత్రం 24. (రా. 3.5).

ఇనపమొద్దు: చూ. పర్యా. దాగలి. లోహపు కమ్మీని, రేకు బిళ్ళల్ని, సాగ్గొట్టడానికి వాడే రైలు కమ్మీలాగా ప్లాటుగా ఉండే ఇనుపపరికరం. (తె. 18).

ఇనపపోగర: నగిషీ చెక్కడానికి వాడే పరికరం. (కో. 7, 12).

ఇనప్పెట్టె: డబ్బు, నగలువగైరా విలువైన వస్తువులు దాచిపెట్టుకోడానికి వాడే మూడడుగుల ఎత్తుతో ఇనపరేకుతో తయారుచేసిన, తలుపులుగల పెట్టె (రా. 3, 5, 8).

ఇనపమంచం: ఇనపరేకుతో, పైపులతో తయారుచేసిన మంచం. పడుకోడానికి ఉపయోగం. (కో. 3, తె. 8, 9; రా. 3, 5).

ఇనుప ఆకురాయి: పర్యా. ఫ్లాట్ ఫైల్. ఇనుముతో చేసిన ఆకురాయి. పాత్రలపై ఉండే గరుకులను సాపుచేయడానికి ఉపయోగం. (తె. 17).

ఇనుపకడ్డీ: చూ. పర్యా. ఇనుపతంతె. గొడుగు కడ్డీలను పళ్ళ చక్రానికి బిగించడానికి పనికివచ్చే సన్నని ఇనుపతంతె. (కో. 19, 18).

ఇనుపకారు: పర్యా. కడియా[1], కడెం, కడ్డీ[2], కయ్య[1], టింకింగ్‌రాడు, దాగిని, పట్టుగోలు, పత్తి కట్టుకడ్డీ, సాల్డన్‌ఐరను, సాల్డరను; సాల్డ్రింగ్ ఐరన్‌రాడు, సాల్డ్రింగ్ కడ్డీ, సాల్డ్రింగ్ కమ్మి, స్టీల్‌కడ్డీ, సోల్డ్రింగ్‌రాడు, సోల్డ్రింగ్‌హామరు. సాల్డ్రింగ్ చేయడానికి ఉపయోగించే ఇనుప కమ్మి పరికరం. (కో. 12).

ఇనుపకుండ: నీళ్ళు తెచ్చుకోడానికి వాడే కూజా ఆకారమున్న ఇనుపరేకు బిందె. (తె. 1).

ఇనుపకుండీ: పర్యా. ఇనుపరోలు. ఇత్తడి బిళ్ళల్ని కుదించడానికి వాడే రోలులాగ ఉండే గుండ్రని దిమ్మె. (తె 14, 16).

ఇనుపకుర్పి: అన్నం కలబెట్టడానికి వాడే గరిటె, (కో. 2).

ఇనుపగరట్టు: ఇత్తడిని పోసుకోడానికి వాడే ఆరు అడుగులున్న పరికరం. (కో. 10).

ఇనుపగరిటె: కొలిమిలో తెట్టును తీయడానికి ఉపయోగించే పరికరం. (కో. 18).

ఇనుపగంగాళం: నీళ్ళు కాచుకోడానికి వాడే పెద్ద పాత్ర. (తె. 12, 13).

ఇనుపగంటె: తిరగమూత పెట్టేటప్పుడు, కూరలు వేసుకోడానికి వాడే ఇనుప పరికరం. కొలిమిలో ఇత్తడి ద్రావకాన్ని కలియబెట్టడానికి కూడా వాడ్తారు. (తె. 3, 12, 13; రా. 5).

ఇనుపగుండి: నీళ్ళు తెచ్చుకోడానికి వాడే కూజా ఆకారంతో ఉన్న ఇనుపబిందె. (తె. 2).

ఇనుపగుండు: ఏదైనా వస్తువుల్ని కొట్టడానికి పనికి వచ్చే పరికరం. (తె. 8, 9).

ఇనుపతంతె: పర్యా. ఇనుపకడ్డీ, ఇనుపవైరు, చిన్న

తంతె, తంతె, తివ్వ, తీగ, పినరు, వైరు. గొడుగు పుల్లలను పళ్ళచక్రానికి బిగించడానికి వాడే సన్నని వైరు. (కో. 15, 17; తె. 1-3, 11-14, 16).

ఇనుపదుక్క: పర్యా. పట్టి, పులేల్‌పట్టి, పుల్లెల్‌బద్దె, పెద్దమెరిమ్, పొడుగుమోపు, ప్లాట్‌దిమ్మె, ప్లాట్‌మోపు, ప్లాటుబద్దె². డిజైన్లు చేయడానికి వాడే ఇనపబద్ద. (కో. 19).

ఇనుపపట్ట: సానరాయిపై మైలను పోగొట్టడానికి వాడే పరికరం. సానరాయి క్రింద ఈ పట్టనుంచి పైనుండి ఇసుకను పోస్తుంటే మైలపోయి సానరాయి మెరుగవుతుంది. (తె. 18).

ఇనుపపని: ఇంట్లోవాడే ఇనపసామాన్లను తయారు చేసే పని. (కో. 20).

ఇనుపపొయ్యి: పర్యా. కట్టెలపొయ్యి. కర్రపొయ్యి, పుల్లలపొయ్యి, పొయ్యి². కట్టెలతో వంటచేయడానికి ఉపయోగించే అర్ధచంద్రాకారపు నిలువు ఇనుపరేకు పొయ్యి. (తె. 1).

ఇనుపబద్ద: డొక్కపై ఉండే మట్టిని శుభ్రంచేసే పరికరం. (కో. 29).

ఇనుపబాండలు: పర్యా. ఇనుపమూకుడు. తిరగబోత వేసుకోడానికి వాడే పెనం. (కో. 1).

ఇనుపబిళ్ళ: నిప్పులు ఆరిపోకుండా కొలిమిపై మూతగా ఉపయోగించే రేకు. (తె. 1).

ఇనుపబిందె: తాగేనీళ్ళు తెచ్చుకోడానికి వాడే కడవ లాంటి పాత్ర. (తె. 12, 13).

ఇనుపబుంగ: నీళ్ళుతెచ్చుకోడానికి వాడే చిన్నదుత్త. (కో. 3).

ఇనుపబోళి: మన్ను ఎత్తడానికి ఉపయోగించే తట్ట. (రా. 10).

ఇనుపమట్నసుత్తె: ఇత్తడిరేకులను సాపుచేయడానికి నక్కీపనిలో వాడే పరికరం. (తె. 17).

ఇనుపముక్క: సానపెట్టడానికి ముందు సానరాయిపై మైల పోగొట్టడానికి వాడే కడ్డీ. (తె. 23).

ఇనుపమూకుడు: ఉ. ఇనపమూకిడి, ఇనుపమూకిడి. చూ. పర్యా. ఇనుపబాండలు. పేపుళ్ళు, గారెలు, పిండివంటలు మొదలయినవి చేయడానికి వాడే ఇనుపపెనం. (కో. 14, 15, 17).

ఇనుపమొద్దు: పెద్దపెద్ద ఇత్తడిపాత్రల అడుగుల్ని కొట్టడానికి వాడే పరికరం. (తె. 10, 11, 22).

ఇనుపరాడ్డు¹: (< ఇనుప + ఇం. Rod). బియ్యపు డమ్మాల తయారీలో అంచుభాగాన్ని వంచుకోడానికి వాడే పొడవాటి కడ్డీ. (కో. 12, 15, 26).

ఇనుపరాడ్డు²: (< ఇనుప + ఇం. Rod). గొడుగుకు ఆధారమైన పొడవాటి కడ్డీ. (కో. 26).

ఇనుపరాడ్డు³: (< ఇనుప + ఇం. Rod). పోతపని చేసేటప్పుడు అచ్చును కుదించడానికి ఉపయోగించే కడ్డీ. (తె. 20).

ఇనుపరింగు: (< ఇనుప + ఇం. Ring). గంట లోభాగాన ఉండే రింగు. (రా. 5).

ఇనుపరోలు: చూ. పర్యా. ఇనుపకుండి. ఇత్తడిపాత్రల అడుగుబిళ్ళలు తట్టుకోడానికి, లోతుచేయడానికి వాడే గుండ్రని పరికరం. (తె. 1, 2, 4-6).

ఇనుపవైరు: చూ. పర్యా. ఇనుపతంతె. గొడుగు పుల్లలను పళ్ళచక్రానికి బిగించడానికి వాడే సన్నని ఇనుపతంతె. (కో. 14; తె. 13).

ఇనుపసుత్తె: బొట్టు పొయ్యిలరేకును వంచుకోడానికి, చీలలు బిగించడానికి, ఆంజనేయ బొమ్మలు తయారు చేయడానికి. రేకుల జాయింట్లు ఊడిరాకుండా గట్టిగ కొట్టడానికి వాడే గుండ్రని పనిముట్టు. (కో. 13, 22, 26; రా. 1, 2, 5).

ఇనుము: పనిముట్లు తయారుచేసుకోడానికి వాడే లోహం. (కో. 8, 11; తె. 3, 11; రా. 3, 5, 8).

ఇనుముకళాయి: రూ. ఇనుపకళాయి. పిండివంటలు చేయడానికి వాడే పట్టుకోడానికి కాడలున్న ఇనుప పాత్ర. (కో. 26).

ఇనుమ్ముక్క: స్టౌను శుభ్రంచేయడానికి వాడే ఇనుప కడ్డీ. (కో. 29).

ఇన్నర్: (< ఇం. Inner). పాత్రలోతును నిర్ణయించే సాధనం. (రా. 14).

ఇన్నర్‌కంపాసు: (< ఇం. Inner compass). వెల్డింగ్ మిషన్‌కుండే బుష్ కొలతలు సరిచూచే పరికరం. (రా. 3, 6).

ఇన్నర్‌కేస్: (< ఇం. Inner case). పెట్రోమాక్సు లైట్ల లోభాగం. (కో. 2).

ఇప్పగొట్టు: (క్రి.) గొట్టంలాంటి గుండ్రని రేకును వెడల్పుగా మూతి ఆకారం వచ్చేటట్లు వగుల గొట్టడం. (తె. 22).

ఇప్పు¹: (క్రి.) బిగాలురానప్పుడు రావంతో కొట్టి విడదీయటం. (కో. 19).

ఇప్పు²: (క్రి.) చూ. పర్యా. వాటంచేయు². ఇత్తడి రేకును వెడల్పుగ సాగ్గొట్టి గుండ్రంగా వెనక్కి వంచి బిందెమూతిని చేయడం. (కో. 27; తె. 4, 31).

ఇప్పు³: (క్రి.) బర్నర్‌ను ఊడదీయడం. (కో. 28).

ఇప్పు⁴: (క్రి.) ముద్దగా ఉండే రేకులను కత్తితో విడదీయడం. (కో. 28).

ఇప్పేసుత్తి: సన్నని రేకును వెడల్పు చేయడానికి వాడే పనిముట్టు. (రా. 11).

ఇరకబెట్టు: (క్రి.) బిందెను తయారుచేయడానికి రేకు భాగాలను ఒకదానిలో ఒకటి జాయింట్ చేయడం. (తె. 24).

ఇరకంపోవు: (క్రి.) ఇనుబద్ద ఇరిగిపోవడం. (తె. 22).

ఇరగ్గొట్టు: (క్రి.) రూ. విరగ్గొట్టు. (1) పొడవుగా ఉన్న ఇనుప కడ్డీలను ముక్కలుగా చేయడం. (2) బీగాన్ని రిపేరుచేయడానికి రెండుగా విడగొట్టడం. (3) పాత్రమూతి ఆకారాన్ని చేయడానికి రేకును వంచడం. (4) ఇనుమును కానంతో తెగనరకడం. (కో. 16, 21).

ఇరికిచ్చుడుచేయు: (క్రి.) ఇత్తడిబిందె భాగాలను పల్లచేసి ఒకదానిలో మరొకటి దూర్చిచేయడం. (తె. 18).

ఇరికించు: (క్రి.) (1) తయారుచేసిన బిందె భాగాలన్నిటికి కలిపి ఆకారాన్ని చేయడానికి ఒకదానిలో మరొక అంచుపెట్టి పళ్ళ సహాయంతో జత చేయడం. (2) వంచిన డిజైను కడ్డీలను ఫ్రేములో అమర్చడం. (తె. 14, 16, 18, 19, 22, 25).

ఇరిసేపుల్ల: ఇత్తడిపాత్రల తయారీలో పళ్ళు పెట్టుకోడానికి వాటి Y ఆకారంతో ఉండే పరికరం. (తె. 14, 16).

ఇరుసచ్చు: (< ఇరుసు + అచ్చు). బండి ఇరుసును రౌండు చేయడానికి వాడే అచ్చు. (కో. 1).

ఇరుసు: కరవాయిలాగా ఉండే బండిఇరుసు. బక్కెట్లు పోల్డింగ్ చేయడానికి. ముంతలు, శేర్లు, మొదలయిన వాటికి రివిట్లు కొట్టడానికి, రేకును గుండ్రంగా వంచడానికి, ఇత్తడిరేకుల అతుకులు కనబడకుండా సాపుచేయడానికి ఉపయోగం. (కో. 7, 16, 19, 29; తె. 14, 17, 26; రా. 2).

ఇరుసుమట్టం: రూ. ఇరుసులమట్టం. కాల్చి సాగ్గొట్టిన ఇరుసుకోపును గుండ్రంగా చేయడానికి ఉపయోగించే పనిముట్టు. అడుగుభాగం అర్ధ చంద్రాకారంగా ఉంటుంది. (తె. 23).

ఇరుసులమట్టం: చూ. ఇరుసుమట్టం. (తె. 24).

ఇలపీట: ఉ. ఇలపీట. చూ. ఈలపీట. (తె. 7, 17).

ఇల్లికర్ర: బర్మాను త్రిప్పడానికి ఉపయోగించే సాధనం. ఒకపొడవు కర్రకు తాడునుకట్టి, బర్మాకు దాన్ని మెలివేసి, తగిలించి కర్ర సహాయంతో త్రిప్పుతారు. అపుడు బర్మా సులువుగ తిరుగుతుంది. (తె. 18).

ఇల్లిపీట: చూ. ఈలపీట. (తె. 17).

ఇల్లు: గొడుగు కడ్డీలు అమర్చడానికి రింగులో ఏర్పాటుచేసిన అర. (రా. 11, 14, 15).

ఇస్క్రీమ్‌కప్: ఐస్‌క్రీమ్ తినడానికి ఉపయోగించే పొడవు కాడ ఉన్నపాత్ర. (తె. 16).

ఇసరంసరవ: కూరలుచేసుకోడానికి వాడే వెడల్పు పాత్ర. (తె. 2).

ఇసుక: ఉ. ఇసక, ఉసక, ఉసిక, వుస్క. చిలుంపట్టిన ఇత్తడిపాత్రను శుభ్రపరచడానికి, సానరాయిపై మైల పోగొట్టడానికి ఉపయోగం. (కో. 24, 28; తె. 5-8, 14, 16, 23; రా. 2, 14, 15).

ఇసుక అచ్చు: కరిగిన లోహాన్ని పోయడానికి ఇసకతోచేసిన అచ్చు. (తె. 4).

ఇస్క్రూడ్రైవరు: చూ. స్క్రూడ్రైవరు. (తె. 14A).

ఇస్తరాకు: (< ఇస్తర + ఆకు). రూ. ఇస్త్రాకు. పర్యా. అడ్డాకు, ఇస్తరి, కుట్టుడాకు. ఆకులమాదిరి పుల్లలు కుట్టినట్లు డిజైనువేసి, అంచులేకుండా తయారుచేసిన భోజనం ప్లేటు. (కో. 3-13, 15, 19-30; తె. 1-16).

ఇస్తరాకంచం: పర్యా. అడ్డాకంచం. ఆకులమాదిరి పుల్లలుకుట్టినట్లు డిజైనువేసి తయారుచేసిన అంచున్న ప్లేటు. భోజనాలకు ఉపయోగం. (కో. 18).

ఇస్తరి: చూ. పర్యా. ఇస్తరాకు. ఆకుమాదిరి పుల్లలు కుట్టినట్లు డిజైనువేసి అంచులేకుండా తయారుచేసిన భోజనం ప్లేటు. (తె. 17).

ఇస్తరితట్టు: పర్యా. కుట్టుడాకు కంచం. ఇస్తరాకులాగ ఉండే గుండ్రని లోహపుపళ్ళెం. భోజనం చేయడానికి ఉపయోగం. (రా. 12).

ఇస్త్రీపెట్టె: గుడ్డలు ఇస్త్రీచేసుకోడానికి వాడే పరికరం. (కో. 4, 9).

ఇస్రంచేయు: (క్రి.) పొట్టిగాఉండే ఇనపముక్కను కాల్చి వెడల్పుగ, పొడవుగ చేయటం. గట్టిగా ఉండే మేకులను వదులుచేయడం. (తె. 1, 3, 4).

ఇస్క్రూడ్రైవర్: (< ఇం. Screw driver). ఉ. ఇస్క్రూడ్రైవర్. నట్లు విప్పడానికి, బిగించడానికి ఉపయోగించే సాధనం. (తె. 21, 22).

## ఈ

ఈచరు: చూ. ఈజీచైరు (రా. 3, 5).

ఈజీచైరు: (< ఇం.) రూ. ఈచరు. విశ్రాంతికి

వాలుగా కూర్చోవడానికి వాడే కుర్చీ. మధ్యలో గుడ్డవేసి వుంటారు. మడుచుకోవచ్చు. (కో. 24; రా. 3, 8).

ఈంచులపట్టి: కొలతబద్ద. (తె. 2).

ఈనెపీట: కాయగూరలు తరగడానికి వాడే సాధనం. (తె. 4).

ఈపు: కత్తుల, కొడవళ్ళ పదునుపెట్టే భాగం కాకుండ వెనుకఉండే భాగం. (రా. 12).

ఈలకత్తి: చూ. పర్యా. కత్తిపీట. కూరగాయలు తరగడానికి వాడే కత్తిపీట. చూ. చిత్రం. 39 (తె. 1; రా. 14–16),

ఈలపీట: రూ. ఇలపీట. ఇల్లిపీట, ఈలపీట, ఉల్లిపీట. చూ. పర్యా. కత్తిపీట. కాయగూరలు తరగడానికి వాడే సాధనం. చూ. చిత్రం. 39. (తె. 3, 6, 7, 14–16).

ఈలపెట్టి: చూ. కత్తిపీట. కూరగాయలు తరగడానికి వాడే సాధనం. చూ. చిత్రం 39. (రా. 13).

ఈలిపీట: చూ. ఈలపీట. (తె. 10, 11).

## ఉ

ఉక్కు: దిమ్మలు, పనిముట్లు తయారుచేసుకోడానికి వాడే ఇనుము, మాంగనీసు కలిసిన లోహం. (రా. 3, 8, 12).

ఉక్కుకడాయి: ఆరెరాసులో ఉపయోగించే ఉక్కుపాత్ర. (రా. 14).

ఉక్కుకడ్డీ: స్ప్రింగ్ చేయడానికి వాడే పత్తికట్టు కడ్డీ. (కో. 25).

ఉక్కురోలు: పర్యా. అమామ్‌దస్తా. కారంపొడి, మసాలాపొడులు దంచుకోడానికి వాడే ఉక్కు పరికరం. చూ. చిత్రం. 25. (రా. 3, 5).

ఉక్కులి: (< ఉక్కు+ఉలి). రేకును తెగ్గొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 16).

ఉగల్దాన్: ఎంగిలి ఊసుకోడానికి వాడే పాత్ర. మహమ్మదీయులు ఎక్కువగా వాడ్తారు. (రా. 7, 12, 14).

ఉగ్గంకారు: కొలిమిపనికి ఉపయోగపడే పరికరం. (రా. 9).

ఉగ్గుగిన్నె: పర్యా. గల్ల[1], గోకుడు, చేదుగోకర్ణ పాలగిన్నె[1], పాలాడి. బొట్టగిన్నె[1]. చిన్నపిల్లలకు ఉగ్గుపట్టడానికి వాడే మట్టుఉండే చిన్న పాత్ర. చూ. చిత్రం. 26. (కో. 1–6, 11–16, 17, 22–24; తె. 1–9, 14, 16, 17, 20, 23; రా. 11, 14).

ఉగ్గుబిల్ల: పాత్రను మెరుగుపెట్టేటప్పుడు చేతికి ఆధారంగా ఉపయోగించే సాధనం. (కో. 27).

ఉంకపొయ్యి: కాఫీ తయారుచేసుకోడానికి వాడే ఇనుపపొట్టుపొయ్యి. (తె. 10, 11).

ఉంగలం: కొలిమిలోని నిప్పు. (తె. 3).

ఉట్టి: ఏదైనా పదార్థాలు క్రిందపెట్టకుండా కాపాడుకోడానికి వాడే సాధనం. (కో. 4, 9).

ఉడ్‌పెడిలు: (< ఇం. Wood + Peddle). పర్యా. చెక్కపిడి, తొక్కుచెక్క, పెడిలు, స్టాపింగు సానరాయి తిరగడానికి చక్రానికి ఏర్పాటుచేసిన సాధనం. (తె. 14).

ఉడన్‌హేమరు: (< ఇం. Wooden Hammer). పర్యా. కట్టెసుత్తె, కర్రసుత్తి, కొయ్యసుత్తి, గుండ్రంకొయ్యసుత్తి, చిన్నకొయ్యసుత్తి, చెక్కసుత్తి, చెట్టుసుత్తి, టక్కు, తక్కుసుత్తి, పాలం కొయ్యసుత్తి, పెద్దకట్టెసుత్తి, పెద్దకొయ్యసుత్తి, పెద్దచెక్కసుత్తి, పొక్కింపుకర్రసుత్తి, పొక్కింపు కొయ్యసుత్తి, పొక్కింపుసుత్తి, మట్టంచెక్క సుత్తి, మానుసుత్తి, ముక్కు[2], ముట్టిసుత్తి, ముట్టె. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 63. (తె. 2).

ఉడుకుచేయు: (క్రి.) కొలిమిలో ఇనుపవస్తువులను వేడిచేయడం. (రా. 1, 3, 11).

ఉంటుగెడ్డపార: బిందె అడుగుభాగాన్ని, సాపు చేయడానికి వాడే పరికరం. (రా. 5).

ఉండకరవాలు: పర్యా. పట్వాకరవాయి. పెద్ద పాత్రల మధ్యభాగం తయారుచేయడానికి, రాగి చెరవలకు చుక్కలు కొట్టడానికి, విగ్రహం పనిలో కవచం చేయడానికి వాడే పనిముట్టు. తలభాగం గుండ్రంగా ఉంటుంది. (కో. 2, 8, 10, 13).

ఉండగడ్డపార: పర్యా. కోరం[1], కోరండాకలి, గన్ను, గుండుకోరం, గుండుగెడపార, గుండు మొల, గుండ్రండాకలి, గునపం, గోల, గోలు డాకలి, డాగలగునపం, తలగెడపార, నాలుగడుగుల గెడ్డపార, పెద్దగడ్డపలుగు, పెద్దగునపం, పెద్దగడ్డ పార, పొడుగు గెడ్డపార, బిందెలగెడ్డపార, బుంగలగెడ్డపార, బొద్దుమొల, మట్టంగెడ్డపార, మట్నపలుగు, మండాలగునపం, మెరుగుగెడ్డపార, రాడ్డు[3], రౌండు గెడ్డపార, రౌండుగునపం, లడికొరాం, వట్రుడాకలి, వెల్డింగ్ గెడపార. లోహపుపాత్రల సొక్కులు తీయడానికి, అడుగు భాగాలు సాపుచేయడానికి వాడే పరికరం చూ.

చిత్రం. 83. (తె. 1).

ఉండగునపం: ఇడ్లీపాత్రకు చుక్కలు కొట్టడానికి వాడే పరికరం. అల్యూమినియం కలాయిలు, కాగులు మొదలయినవి తయారుచేయడానికి పాత్రలో రంధ్రాలు కలపడానికి వాడే పరికరం. (కో. 10, 12, 13, 22, 25, 26).

ఉండచేయు: (క్రి.) శిల్పపనిలో మట్టి అచ్చులోపలి భాగంలో కరుగులు దిబ్బలాగా చేయడం. (రా. 1, 2).

ఉండమనిసబ్బల్: బిందె క్రింది, పైభాగాలు కొట్టుకోడానికి వాడే గెడ్డపార. (తె. 12).

ఉండోమ్: వంపురేకులను సక్కగ సాపుచేయడానికి ఉపయోగించే గుండ్రనితల ఉండే గునపం (తె. 26).

ఉత్తపాతఇత్తడి: పనికిరాని ఇత్తడి. దీన్ని కరుగబెట్టి కొత్త లోహాన్ని తయారుచేస్తారు. (రా. 5).

ఉద్దనంబిందె: నీళ్ళు ఉంచుకోడానికి ఉపయోగించే గుండ్రని పాత్ర. (కో. 30).

ఉద్దరణ: రూ. ఉద్దరాణి. తీర్థంవేయడానికి వాడే రాగిచెంచా. (కో. 7, 29).

ఉద్దరాణి: చూ. ఉద్దరణ. (కో. 23).

ఉద్దరి: చూ. ఉద్ధరిణి. (తె. 8).

ఉద్దరిణి: చూ. ఉద్ధరిణి. (రా. 15).

ఉద్దరేణి: చూ. ఉద్ధరిణి. (తె. 2; రా. 16).

ఉద్దాణి: చూ. ఉద్ధరిణి. (కో. 28).

ఉద్దెరిణి: చూ. ఉద్ధరిణి. (తె. 19).

ఉద్ధరిణి: ఉ. ఉద్ధరిణి, వుద్దరిని, వుద్వరిణె, రూ. ఉద్దరి, ఉద్దరేణి, ఉద్దాణి, ఉద్దెరిణి, ఉద్గరిణి. పర్యా. తీర్థం స్పూను, పూజాగరటు, రుద్రాణి దేవాలయాల్లో తీర్థంవేయడానికి, సంధ్యావార్చుకొనేటప్పుడు, పంచపాత్రలో ఉంచుకోడానికి వాడే పొడుగాటి గరిటె. (కో. 3, 5, 7, 10–18, 20–28, 30; తె. 3–8, 14, 18–25; రా. 9, 12–16).

ఉనకపొయ్యి: చూ. పర్యా. చిట్టిపొయ్యి. పొట్టుతో వంటచేయడానికి వాడే ఇనుపపొయ్యి. (తె. 12).

ఉనగునపం: పాత్రమధ్యఉండే కట్టభాగాన్ని నునుపు చేయడానికి వాడే సాధనం. (తె. 3).

ఉనుకబూడద: చూ. పర్యా. కవరుబూడిద. అచ్చుకు మన్ను అంటుకోకుండా ఉండడానికి చల్లే పొడి. (తె. 17).

ఉపకారు: బండిచక్రానికి కమ్ముల నెక్కించడానికి వాడే పరికరం. (తె. 2).

ఉప్పు: రిపేరి చేయడానికి బీగాన్ని రెండుగా మధ్యకు పగులగొట్టడం. (రా. 6).

ఉప్మాగరిట: కోడిగుడ్డు ఆకారంగల గరిట. కూరలు, ఉప్మా వడ్డించడానికి ఉపయోగం. (కో. 30).

ఉబ్బు: బిందె మొదలయిన వాటిపైభాగంలో ఉండే ఒత్తు. (రా. 1, 5, 7).

ఉబ్బుడబ్బా: చూ. పర్యా. డబ్బా[1]. బక్కెట్టులాగా చేత్తో పట్టుకోడానికి కమ్మిఉండే స్టీలుపాత్ర. చారు, మజ్జిగలాంటి పదార్థాలు ఉంచుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం. 121. (తె. 1, 10, 11).

ఉబ్బులు: పర్యా. కచ్చులు, కతికులు, గరుకులు[1], గాట్లు[1], దరువులు, దర్దులు, దాట్లు, దుంకలు, నాట్లు, నొక్కులు, పలుకులు, పిలకలు, పుంజీలు, పైక్స్, బర్సు, బొడిపెలు, బరాకులు, మొలలు, రేసులు, వస్సు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (కో. 16).

ఉబ్బులెత్తు: (క్రి.) ఇత్తడిరేకుపై డిజైన్లుగ ఉబ్బులు కొట్టడం. (రా. 13).

ఉబ్బెత్తుతీయు: (క్రి.) పర్యా. లొట్టచేయు[2]. చెకనం పనిలో ఇత్తడిరేకుపై మొలతో బొడిపెలు కొట్టడం. రేకును తిరగేసినపుడు గుంతలుమాదిరి కనిపిస్తాయి. (తె. 26).

ఉయ్యాల: రూ. ఊయల. పర్యా. తొట్టాను, తొట్టెలు. చిన్నపిల్లలను నిద్రపుచ్చడానికి వాడే లోహపు పరికరం. దేవతావిగ్రహాన్ని ఉంచి ఊచడానికి కూడా ఉపయోగం. చూ. చిత్రం 27. (కో. 28; తె. 7, 9).

ఉరవ: పర్యా. వాయ. పాత్ర పొట్టభాగంపై వచ్చే చుట్టుకొలత. (కో. 20, 22, 25, 28).

ఉరవేయు: (క్రి.) చూ. పర్యా. పొడుగేయు. గ్లాసులను అడ్డసుత్తెతో సాగ్గొట్టి వెడల్పుచేయడం. (కో. 14).

ఉరువు: తయారైన లోహపాత్ర. (రా. 2, 5).

ఉరూసి: రేకుపై గీతలు గీచుకోడానికి వాడే సూదిలాంటి పరికరం (రా. 11).

ఉల్ఛాని: (మరాఠీ) ఉ. ఉల్త్తాని. చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనంపైనుండి తీయడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం. 5. (తె. 2, 7, 9).

ఉలవకర్ర: చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటికర్ర. (కో. 20).

ఉలవపాదు: చక్రంలో ఇరుసు తిరగడానికి వీలుగా అమర్చిన ఇనుపగొట్టం. (కో. 19, 24).

ఉలవారిన్: కాలిన రేకులను బయటతోసే రేకుదబ్బ. (రా. 3).

ఉలి: (బ.) ఉలులు. రూ. ఉళి. పర్యా. వకాకి. రేకును పాత్రగా లాగడానికి, ట్రింకుపెట్టెకు గుబ్బ కొట్టడానికి, పాత్రలను శుభ్రపరచడానికి, బీరువా పనిలో బెండింగ్‌చేయటానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 28. (కో. 2, 5, 15, 20, 22, 24, 26; రా. 1, 4, 5, 7, 10, 14, 16).

ఉలిషెం: చూ. పర్యా. పోగరు. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలువేయడానికి గుర్తులుపెట్టేపరికరం. చూ. చిత్రం 165. (తె. 2, 5, 8).

ఉల్లా: (< హిం.) డ్రిల్లింగ్‌మిషన్‌తో రేకుకు రంధ్రం వేసినపుడు రేకుచుట్టూ ఉండే ఉబ్బు. (రా. 6).

ఉల్ష్: చూ. పర్యా. గ్రైండరు. వెల్డింగ్ ఉబ్బులను శుభ్రపరచడానికి వాడే యంత్రం. (రా. 7).

ఉల్లిగడ్డచిక్కం: రూ. ఉల్లి గడ్డ చిక్కు. చూ. పర్యా. ఉల్లిపాయల బుట్ట. ఉల్లిపాయలను ఆరబెట్టుకోడానికి సన్నని ఇనపతీగలతో అల్లినబుట్ట. చూ. చిత్రం. 29. (తె. 10-13).

ఉల్లిగడ్డచిక్కు: చూ. ఉల్లిగడ్డచిక్కం. (తె. 23).

ఉల్లిగడ్డసీగ: ఉల్లిపాయలు ఉంచుకోడానికి వాడే స్టాండు. (తె. 11).

ఉల్లిపాయలబుట్ట: పర్యా. ఉల్లిగడ్డచిక్కం, ఉల్లి బుట్ట, ఎర్రగడ్డబుట్ట, చిక్కం, తీగబుట్ట, బుట్టి. ఎర్రగడ్డలు, కాయగూరలు నిల్వ ఉంచుకోడానికి వాడే ఇనపకమ్ములతో అల్లిన సాధనం. చూ. చిత్రం. 29. (కో. 7).

ఉల్లిపీట: చూ. పర్యా. ఈలపీట (తె. 12, 13).

ఉల్లిబుట్ట: చూ. పర్యా. ఉల్లిపాయలబుట్ట. ఉల్లిగడ్డలు వగైరా నిల్వ ఉంచుకోడానికి వాడే ఇనుపతంతెల బుట్ట. చూ. చిత్రం. 29. (తె. 22).

ఉల్లోపు[1]: గొడుగు లోపలిభాగం. (కో. 27).

ఉల్లోపు[2]: అచ్చులో సరుకు ప్రవహించడానికి చేసిన గాడి (కో. 24).

ఉళి: చూ. ఉలి. (రా. 13).

ఉళువాయి: బండి ఇరుసు తిరగడానికి ఉపయోగపడే ఇరుసుగొట్టం. (రా. 13).

ఉస: కొలిమిలో కాకతగ్గితే అగ్గిని కదిలించడానికి వాడే ఇనపచువ్వ. (కో. 2).

## ఊ

ఊక: ఉ. వునక, వూక. పర్యా. పొట్టు, వరి ఊక, వరిపొట్టు. కొలిమిలోకాక బాగారావడానికి, పాత్రలను తోమడానికి వాడే పదార్థం. (కో. 5, 7, 10; తె. 10, 13).

ఊకపార: వడ్లమిషన్‌లో పొట్టుతీయడానికి వాడే ఇనపసాధనం. (కో. 19).

ఊకుడు: తలుపు తిమ్మిడిని అమర్చడానికి గోడలో పెట్టే '⌐' ఆకారపు క్లాంపు. (తె. 25).

ఊగు: (క్రి.) రేకుతో పాత్ర ఆకారాన్ని, తయారు చేసేటప్పుడు దానికి అనుగుణంగా కదలడం. (కో. 22).

ఊడగొట్టు: (క్రి.) కుట్టుమిషన్ సామాన్లు విడ తీయడం. (కో. 19; తె. 7; రా. 6).

ఊడదీయు: (క్రి.) పర్యా. ఊడిపోవు, గుంజు, పెరుకు, పోతపోసిన విగ్రహాలమట్టిని తీసివేయడం. (తె. 2; రా. 1).

ఊడిపోవు: (క్రి.) చూ. పర్యా. ఊడదీయు. మట్టి అచ్చును ఇత్తడి విగ్రహంనుండి విడదీయడం. (రా. 5).

ఊదరగొట్టం: చూ. ఊదుడుగొట్టం. (రా. 6).

ఊదరబత్తిగొట్టం: చూ.పర్యా. అగరుబత్తి. వెలిగించిన అగరుకడ్డీలు గుచ్చి ఉంచడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 2. (కో. 1).

ఊదిన్‌గొళి: చూ. పర్యా. ఊదుడుగొట్టం. బొగ్గుల పొయ్యికి నోటితో గాలిని అందించడానికి వాడే ఇనపగొట్టం. (రా. 14).

ఊదిబుర్ర: చూ. ఊదుబుర్ర. (రా. 4).

ఊదు[1]: (క్రి.) కొలిమిలోనికి తిత్తిద్వారా గాలిని పంపడం. (రా. 2, 3, 5, 6, 10).

ఊదు[2]: (క్రి.) పోతఅచ్చుపై రంధ్రాన్ని లోపల మట్టిలేకుండ నోటితో శుభ్రం చేయడం. (తె. 26).

ఊదుకొలాయి: చూ. పర్యా. ఊదుడుగొట్టం. పొయ్యి ఊదుకోడానికి వాడే పరికరం. (కో. 1).

ఊదుగొట్టం: చూ. ఊదుడుగొట్టం. (రా. 15).

ఊదుడుగొట్టం: రూ. ఊదరగొట్టం, ఊదుగొట్టం, ఊదురుగొట్టం. పర్యా. ఊదిన్‌గొళి, ఊదుకొలాయి, ఊదుబుర్ర, ఊపరగొట్టం. ఊపురు, గొట్టం[3], పొయ్యిగొట్టం. బొగ్గులపొయ్యికి నోటితో గాలిని అందించడానికి వాడే ఇనపగొట్టం. (తె. 3, 7, 20, 22; రా. 16).

ఊదుబత్తిస్టాండు: ఉ. ఊదిబత్తిస్టాండు. చూ. పర్యా. అగరుబత్తిస్టాండు. అగరుబత్తులు గుచ్చి ఉంచడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 2.

(కో. 14, 15; తె. 1, 5, 8).

ఊదుబుర్ర: చూ. ఊదుబుర్ర. చూ. పర్యా. ఊదుడు గొట్టం. పొయ్యంపొయ్యికి నోటితో గాలిని అందించ డానికి వాడే సాధనం. (రా. 2).

ఊదుదుగొట్టం: చూ. ఊదుడుగొట్టం. (కో. 2).

ఊదొత్తులస్టాండు: చూ. పర్యా. అగరుబత్తి స్టాండు. దేవునిదగ్గర అగరొత్తులు పెట్టడానికి వాడే లోహపు స్టాండు. మూడుగాని, నాలుగాని లేదా ఆరుగాని కొమ్మలు, అడుగుపట్టు మధ్యలో పెద్దగొట్టంనుంచి సన్నగొట్టాలుగాని, తీగలుగాని ఉంటాయి. ఆ గొట్టాల్లో అగరొత్తులు పెడతారు. చూ. చిత్రం. 2. (కో. 21).

ఊను[1]: (క్రి.) టంకపెట్టె క్రిందిభాగం భూమిపై ఆనడం. (రా. 5).

ఊను[2]: రేకుపై పొట్టుగా వచ్చిన గాడులను, దెబ్బలను మరల సక్కగచేయడం. (కో. 17-19).

ఊనేపోగరు: రంధ్రాలేయడానికి ముందు జాయింట్లపై కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 18).

ఊపరగొట్టం: చూ. పర్యా. ఊదుడుగొట్టం. వంట పొయ్యిలు మండనప్పుడు గాలిని ఊదడానికి ఉపయోగించే పరికరం. (రా. 2).

ఊపుడు: చూ. పర్యా. ఊదుడుగొట్టం. పొయ్యికి గాలి రావడానికి ఉపయోగించే గొట్టం (రా. 12).

ఊయ్యాలపలక: ఊయ్యాల ఊగడానికి వాడే పరికరం. (రా. 8).

ఊరగాయజాడి: పర్యా. ముంతిడిజాడి. ఊరగాయ వేసుకోడానికి వాడే జాడి. (కో. 9).

ఊరగాయస్పూను: (< ఊరగాయ + ఇం.Spoon). మామిడికాయ, నిమ్మకాయలాంటి ఊరగాయలు వేసుకోడానికి వాడే చెంచాలు. (కో. 1).

ఊరుపెంట: పర్యా. పెంకమన్ను, బుద్ద, బురజ. టాకచేసినప్పుడు మసికాకుండ పాత్రలపై పూయడానికి ఉపయోగపడే పేడ, ఎర్రమన్ను కలిపిన పదార్థం. (తె. 2).

ఊర్ధ్వశి: బీరువాలో రెండురేకుల్ని కలిపే పరికరం. (రా. 4).

ఊస: పర్యా. కొరాం; గబార[1], గద్దపార, గునపం[2], గూటం[3], టంకంగద్దపార, రవ్వపాకలి, రవ్వమొల, మొల[1]. టంకాన్ని రవ్వచేయడానికి వాడే చిన్న కమ్మి. కొలిమిపనిలో, పెట్టింగ్‌పనిలో, మూసపనిలో, కొల్మికోసం తయారీలో కూడ ఉపయోగం. (కో. 7, 11-14, 16, 18, 22; తె. 21; రా. 15).

ఊసక్యాపు: (< ఊస + ఇం. Cap). గొడుగును మూసిఉంచినపుడు ఊసలను పట్టుకొనే రింగు. (కో. 23).

ఊసగొట్టు: (క్రి.) బండిచక్రం పట్టాను ఊదగొట్టి తీసివేయడం (తె. 4).

ఊసలు[1]: సైకిల్ చక్రాలకుండే కమ్మలు. (కో. 15).

ఊసలు[2]: గొడుగుకు ఆధారమైన సన్నని ఇనుప కడ్డీలు. ఇవి నిలువుకు 8, అడ్డంకు 8, మొత్తం 16 ఉంటాయి. (కో. 23, 24; తె. 21, 22).

ఊసి: కొలతలువేసినతర్వాత గీతలుగీయడానికి వాడే సూది. (రా. 10).

ఊసిచేయు: (క్రి.) కొయ్య అచ్చులోఉండే రేకు అచ్చును తీయడానికి రేకు అచ్చును వదులు చేయడం. (కో. 29).

ఊసిపోవు: (క్రి.) తుప్పుపట్టిన గొడుగుపుల్లలు విరిగిపోవడం. పాత్రలకు జాయింట్లు ఊడిపోవడం. (తె. 18, 19).

ఊసుపోగరు: సన్నదొంకలు వేసుకొని రివిట్ చేయడానికి వాడే పరికరం. (రా. 2).

## ఎ

ఎక్కనాగు: (క్రి.) వస్తువులకు బిగ్గొట్టిన మేకులను బైటికి లాగడం. (కో. 24).

ఎక్కించు: (క్రి.) (1). పాత్ర ఆకారాన్ని చేసిన తర్వాత రివిట్లుకొట్టడం. (రా. 11). (2). ఇనప రంధ్రంలో కొడవలికూలును దూర్చడం. (రా. 4). (3). బీరువా భాగాలన్నింటిని ఒకదానికొకటి క్రింద పెట్టి బిగించడం. (రా. 6).

ఎక్కు: పర్యా. ప్రెస్సింగ్ ఎక్కు. గొడుగు తెరచి ఉంచినపుడు కమాన్లగొట్టాన్ని పట్టిఉంచే సాధనం. ఇది ఇనుపరాడ్డుకు బిగించిఉంటుంది. (కో. 24-27).

ఎక్కువదిమ్మ: పర్యా. ఎక్కువాయి, గాడిమద్దాలి, దిమ్మె, ఛార్, మట్టంఉలి, మల్‌కట్‌డై, మల్‌కట్ దిమ్మ, మొద్దాలి, మొద్దు, మోపు[1], బొద్దులి. లోహపురేకుల జాయింట్లకు రివిట్లు కొట్టడానికివాడే సాధనం. (కో. 16, 22).

ఎక్కువాయి: చూ. పర్యా. ఎక్కువదిమ్మ. లోహపు రేకుల జాయింట్లకు రివిట్లుకొట్టడానికి వాడే సాధనం. (కో. 16).

ఎక్వాదిమ్మ: మూలభాగాల్ని మలకట్ ఏయడానికి వాడే సాధనం. (కో. 23).

ఎక్సల్: (< ఇం. Axil). సైకిల్‌చక్రం మధ్యలో

తిప్పుకోడానికి వాడే పరికరం. (తె. 12).

ఎగ్‌బీటర్: (< ఇం. Egg beater). పర్యా. ఎగ్ పిట్టర్. కోడిగుడ్లను బిళ్ళలుగ కోయడానికి ఉపయోగించే స్టీలు పరికరం. (తె. 2).

ఎగ్‌పిట్టర్: రూ. ఎగ్‌పెట్టర్. చూ. పర్యా. ఎగ్‌బీటర్. కోడిగుడ్లు కత్తిరించుకోడానికి వాడే సాధనం. (తె. 11).

ఎగ్‌పిల్లర్: చూ. ఎగ్‌పెట్టర్. (కో. 1).

ఎగ్‌ప్లేటు: (< ఇం. Egg plate). కోడిగుడ్డు ఆకారంలో ఉండే మూత. (తె. 10, 11).

ఎజ్జిచేయు: (క్రి). పీరువాతలుపు పట్టడానికి వీలుగా గాడి భాగాల్ని సరిచేయడం. (కో. 17).

ఎట్నాబర్నర్: చూ. పర్యా. స్టౌ. కంచాలకోళ్ళు, మరచెంబుమట్లు, మరకట్లు మొదలయినవి అతకడానికి వాడే సాధనం. చేత్తోపట్టుకోడానికి కొక్కి ఉంటుంది. పైన గొట్టం క్రింద తొట్టిమాదిరి ఉంటుంది. (కో. 15).

ఎడ: పర్యా. పైడిప్ప. (1). మట్టి అచ్చు పైభాగం. (కో. 2). (2). పాత్ర మధ్యభాగం. (కో. 10, 12, 13, 20, 22, 26).

ఎడకరవాయి: పాత్రను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 28).

ఎడకారు: రూ. ఎడగారు. పర్యా. నాలుకారు. కొలిమిలో నుండి కాగే మూసను పట్టుకోడానికి, కాలే ఇనప కడ్డీలను బయటికితీయడానికి, గుండ్రని ఇనప ముక్కల్ని సాగ్గొట్టేటప్పుడు పట్టుకోడానికి, నాగవాసాల్ని వంపుపెట్టేటప్పుడు పట్టుకోడానికి కమ్మరపనిలో వాడే పనిముట్టు. (కో. 13, 17-19, 22, 24, 28; తె. 21).

ఎడగారు: చూ. ఎడకారు. (కో. 20, 23; తె. 19-25).

ఎడదిప్ప: పాత్ర. మధ్యభాగం. (కో. 28)

ఎడసుత్తి: ఉ. యెడసుత్తి. రేకులను పొడవుగా సాగదీయటానికి, రేకులపై బొద్దు తేల్చడానికి, చెంబులకు మట్నవేయడానికి, బిందెల పీకలను, దొడ్లను బల్లించడానికి వాడే ముల్లులాంటి పనిముట్టు (కో. 5, 16, 18-24, 26-29).

ఎడ్డర్‌స్టాక్: మిషన్‌లో బిగించిఉండే చేతికి ఆధారమైన కడ్డీ. (కో. 22).

ఎడ్లకుప్పెలు: ఎద్దులకొమ్ములకు తొడిగే ఇత్తడి కొప్పెర్లు (తె. 17).

ఎడ్లగజ్జెలు: ఒక పట్టెడకు అమర్చిన పొడవైన ఇత్తడిగజ్జలు. ఎడ్ల మెడలో కట్టడానికి ఉపయోగం. (తె. 17).

ఎంటు: రేకుపై ఉండే నొక్కు. (రా. 5).

ఎండబెట్టు: (క్రి.) శిల్పపనిలో పచ్చి అచ్చులను ఎండలోపెట్టడం. (కో. 11, 18).

ఎండుకొబ్బరి తురుం: ఎండుకొబ్బరి తురమడానికి వాడే పరికరం. (కో. 23).

ఎత్తిపోయు: (క్రి). మూసలోని మెటల్‌ను కొలిమిలో నుండి తీసి అచ్చులలో పోయడం. (రా. 11).

ఎత్తు: (క్రి.) మూసపెట్టెలో ఉండే మట్టిని ఎత్తడం, పాత్రల తయారీకి కొలత తీయడం. (రా. 3, 4, 11, 15).

ఎత్తుకేను: (క్రి.) (1). డిజైన్లుగ కత్తిరించే ముందు కడ్డీపై కొలతలువేయడం. (2). బిందెనొక్కులను పరిచయం చేయడం. (3). భాగాలను కలపడానికి వీలుగా కత్తిరించినపల్లను వంచడం. (కో. 12, 16).

ఎత్తుచెక్క: మూసపెట్టెలోని మట్టి పాడెట్టేటప్పుడు క్రింద పడకుండ వెనుకభాగాన ఉపయోగించే చిన్నదిమ్మ. (తె. 26).

ఎదటిపుల్ల: వ్రేలు · వేడెక్కకుండా సానపనిలో ఆధారంగా ఉపయోగించే చిన్న వెదురుపుల్ల. (తె. 23).

ఎదర: రూ. ఎదురై. పెట్టెల ముందుభాగం. (కో. 10).

ఎదురుబల్ల: పర్యా. వాలడ్డ. అంటించిన శాల్తీవడుసు రాకుండా ఉండటానికి మొగంబల్లకి ప్రక్కగా, శాల్తీకి ఆపుగా నేలమీద విడిగాఉంచే కొయ్యచెక్క. (కో. 20, 24).

ఎదురుమోపు: ఇత్తడికాగుకు, బిందెకు పాలిష్ చేయడానికి సహాయంగాఉండే పరికరం. (కో. 4, 5, 9).

ఎదురుతేగ: ఉ. ఎదరుతేగ. తరణిపనిలో పాత్రల లోపల అడుగుభాగం సాపుచేయడానికివాడే పరికరం. (కో. 21; తె. 1).

ఎదురై: చూ. ఎదర. (తె. 12).

ఎద్దులగొలుసు: ఎద్దులను కట్టేసుకోడానికి పనికివచ్చే ఇనపగొలుసు. (రా. 7).

ఎద్దులపట్టి: ఎద్దులమెడకు తగిలించే పట్ట. (రా. 6).

ఎనబై నెంబరురాయి: (< ఎనబై + ఇం. Number + రాయి). ఇనపసామాన్లను పదునుపెట్టడానికి వాడే రాయి. (కో. 24; తె. 24).

ఎనిమిది తొమ్మిది నెంబరు రింజి: సైకిలు బ్రేకులు ఊడదీయడానికి వాడే పరికరం. (కో. 15).

ఎన్కమూత: పర్యా. కప్పు[3], మూత[1], వెనుక టోపను, బ్యాటరీలు బయటికిరాకుండ గొట్టాన్ని

మూసిఉంచే బిరడా. దీని లోపలి స్ప్రింగుద్వారా బ్యాటరీల సహాయంతో బల్బు వెలుగుతుంది. (తె. 19, 20, 23).

ఎన్ను: పనిముట్లను పదునుచేయగా మిగిలిన భాగం. (తె. 23).

ఎన్నుపోగరు: విగ్రహానికి బొద్దుకొట్టడానికి వాడే పరికరం. (కో. 19).

ఎఫ్. టి. జెడ్ యాంగిల్స్: (< ఇం. F. T. Z. Angles). గ్లాస్‌డోర్ల చుట్టూ బిగించడానికి వెల్డింగ్ పనిలో వాడే చిన్న పట్టీలు. (తె. 24).

ఎమరీపేపరు: (< ఇం. Emery Paper). రూ. ఎంబ్రిపేపరు. పర్యా. అమసపాదు కాగితం, ఎమరి కాగితం, కరాసుకాయితం, పాలిష్‌కాయితం, పేపరు, ప్లింటుపేపరు, మెరుగుగాయితం, మోటకాయితం, సాపుకాయితం, సిలుంపేపరు. రేకులపై ఉండే తుప్పును పోగొట్టి శుభ్రంచేయడానికి వాడే గరుకైన కాయితం. అల్యూమినియం పాత్రలకు మెరుగు రావడానికి తరిణిపనిలోవాడ్తారు. (కో. 2, 3, 7, 10, 13, 22-28; తె. 3, 6, 17, 20, 24, 25; రా. 7).

ఎమరిస్టోన్: రూ. ఎంబ్రిస్టోన్. సానపట్టడానికి గ్రైండర్‌ను అమర్చిఉండే సానరాయి. (కో. 20).

ఎమరికాగితం: (< ఇం. Emery + కాగితం). చూ. పర్యా. ఎమరిపేపరు. పాత్రపైఉండే గీతలు పోగొట్టేదానికి వాడే గరుక్కాయితం. (కో. 8).

ఎమ్మింగుచేయు: (క్రి.) (< ఇం. Hemming + చేయు). రేకును మడిచివేయడం (రా. 3).

ఎమ్రీపేపరు: (< ఇం. Emery + Paper). చూ. ఎమరీపేపరు. (కో. 10-21, 28).

ఎంబ్రిపేపరు: (< ఇం. Emery Paper). చూ. ఎమరిపేపరు. (రా. 15).

ఎంబ్రిస్టోన్: (< ఇం. Emergy Stone). చూ. ఎమరిస్టోన్. (రా. 13).

ఎర్‌కంప్రేచర్: (< ఇం. Air Compressure). తయారైన డబ్బాల్ని నీళ్ళలోముంచి పరీక్ష చేయడానికి వాడే పరికరం. (రా. 7).

ఎరకబద్ద: చూ. పర్యా. అడికోలు. ఇత్తడిరేకులపై, ఇనుపసామాన్లపై కొలతలను గీసేందుకు వాడే ఇనుపబద్ద. (తె. 1).

ఎరకబెట్టు: (క్రి.) రూ. ఇలకపెట్టు. ఇత్తడిరేకుపైన పనిముట్ల సహాయంతో డిజైనును దించుకోవడం (తె. 26).

ఎరగడసుత్తి: బిందెపూలతిని లెవల్‌చేసుకోడానికి వాడే పరికరం. (రా. 9).

ఎర్త్‌వెల్డింగ్: (< ఇం. Earth Welding). చూ. పర్యా. అర్త్. కరెంటుతో ఇనుప ప్లేట్‌లను అతికే పరికరం. (తె. 8, 13).

ఎర్త్‌వైరు: చూ. పర్యా. అర్త్. వెల్డింగ్ చేయడానికి వాడే సాధనం. (కో. 17, 21).

ఎర్తు: ఉ. యర్త్. చూ. అర్త్. (కో. 16, 18, 20-29; తె. 1, 5, 7, 17, 19, 20, 22, 23, 24).

ఎర్రగడ్డకట్టర్: (< ఎర్రగడ్డ + ఇం. Cutter). ఎర్రగడ్డను కత్తిరించడానికి వాడే పరికరం. (కో. 1).

ఎర్రగడ్డబుట్ట: చూ. పర్యా. ఉల్లిపాయలబుట్ట. ఎర్రగడ్డలు, కోడిగుడ్లు వేసుకోడానికి వాడే ఇనుప కమ్ములతో చేసిన సాధనం. చూ. చిత్రం. 29. (కో. 1; రా. 5).

ఎర్రగోడుసుత్తి: రూ. ఎల్లగోడుసుత్తె. బిందెను వెడల్పుచేయడానికి, సాపుచేయడానికి, కొట్టడానికి వాడే పరికరం. (తె. 5).

ఎల్‌పులేల్: రేకు బెండింగ్‌వచ్చిని కచ్చితంగా లెవల్ చేయడానికి బీరువాలపనిలో వాడే ఆంగ్లేర్ ముక్క. (తె. 25).

ఎలకపెట్టు: (క్రి.) చూ. ఎరకబెట్టు. (తె. 8, 9).

ఎలకలకట్టర్: (< ఎలకల + ఇం. Cutter). చూ. పర్యా. ఎలకలబోను. ఎలుకలు పట్టుకోడానికి ఉపయోగపడే సాధనం. చూ. చిత్రం. 30. (తె. 12).

ఎలకలఖట్కా: చూ. పర్యా. ఎలకలబోను. ఎలుకలను పట్టడాని కుపయోగించే పీట. చూ. చిత్రం. 30. (తె. 6).

ఎలకలపెట్టె: చూ. పర్యా. ఎలకలబోను. ఇనుప రేకుతో తయారుచేసిన బోను. ఇందు ఎలుకలు పడి ఉంటాయి. చూ. చిత్రం. 30. (తె. 9).

ఎలకలబోను: పర్యా. ఎలకల కట్టర్, ఎలకలఖట్కా, ఎలకలపెట్టె, కట్టక, చువేక కట్టిక, తీగబోనె, బిళ్ళ బోను, బోను, మీస్లై, స్ప్రింగ్‌మీట. ఎలుకలు పట్టడానికి ఇనుపతంతెతో తయారుచేసిన పరికరం. చూ. చిత్రం. 30. (కో. 17, 22, 23, 26; తె. 9, 11, 17, 25; రా. 4, 12).

ఎలక్ట్రోడ్: (< ఇం. Electrode). వెల్డింగ్ చేయడాని కుపయోగించే కర్బనపుకడ్డి (తె. 19).

ఎలక్షన్‌బాక్సు: (< ఇం. Election Box). నాలుగు ప్రక్కల సమకొలతలు కలిగిఉండే వోట్లపెట్టె. (కో. 4, 9).

ఎలపలకమ్ములు: చెంబుల పైభాగాన్ని సరిచేసే

పరికరం. (కో. 10).

ఎలాస్టిక్: (< ఇం. Elastic). గొడుగును మూసినప్పుడు చుట్టూ గుడ్డకట్టివేసే రబ్బరుబట్ట. (తె. 23).

ఎలిగారం: ఉ. వెలిగారం. రూ. ఎల్లిగారం, బెళిగారం. ఇత్తడిపాత్రలను అతకడానికి, టంకంవేయడానికి ముందు లోపలిభాగాల్లో రాయడానికి వాడే తెల్లని పదార్థం. గంధకం తేజాబ్‌లో దీన్ని కలిపితే ఇత్తడి బిందెకు రంగువస్తుంది. (కో. 14, 16, 24; తె. 3, 4, 6, 9, 12, 17, 21, 23; రా. 3, 6, 15).

ఎలిగోడుసుత్తె: బిందె మూతులను విప్పడానికి వాడే పరికరం. (తె. 4).

ఎలిమీటర్: ఉ.ఎలిమ్నేటర్. (< ఇం.Eliminator). రేడియోలను పరీక్షచేయడానికి వాడే పరికరం. (తె. 11).

ఎలుకలమీట్టు: ఎలుకలను పట్టడానికి వాడే సాధనం. (తె. 5).

ఎలుముచేయు: (క్రి.) పర్యా. చెప్పాచేయు, వాటంచేయు[1]. పదునుపెట్టడానికి వీలుగా కత్తులను వెడల్పుచేయడం. (తె. 5).

ఎలువు: చక్కగఉండే గొడ్డలి వాయిభాగం. (తె. 23).

ఎల్కతీయు: (క్రి.) ఇత్తడిరేకును గుండ్రంగాచేసి వెనక్కువంచి మూతి ఆకారాన్ని చేయడం. (తె. 7).

ఎల్వుతీగ: ఇత్తడిపాత్రలకు అతుకులు కనబడకుండ డిజైనువేసే పరికరం (తె. 7).

ఎల్వుశానం: పర్యా. ఎల్వుషావణం. అడుగుభాగం వెడల్పుగ, సన్నగ, కూచిగఉండే పరికరం. వేడి ఇనుపముక్కల్ని నరకడానికి వాడ్తారు. (తె 24).

ఎల్లగోడుసుత్తె: చూ. ఎర్రగోడుసుత్తె. (తె. 5).

ఎల్లబూడిద: పాత్ర అచ్చుకు మన్ను అతుక్కోకుండ చుట్టూ చల్లే కొలిమిలోని బూడిద. (కో. 22).

ఎల్లాంగల్: చూ. ఎల్లాంగ్లరు. (రా. 12).

ఎల్లాంగ్లరు: (< ఇం. L Angler). రూ. ఎల్లాంగల్. డిజైన్లచుట్టూ అమర్చే L ఆకారపు కడ్డీ. రేకును ఛాల దగ్గర మడవడానికి ఉపయోగం. (కో. 22; తె. 1; రా. 10).

ఎల్లిగారం: చూ. ఎలిగారం. (తె. 25, 26; రా. 15).

ఎసలు: వెల్డింగ్‌పనిలోవచ్చే హెచ్చుతగ్గులు. (కో.15).

## ఏ

ఏక్‌నెంబరుపంపు: (< హిం. ఏక్ + ఇం. Number pump). టాక్టరును కొట్టడానికి పనికివచ్చే పెద్ద పంపు. (తె. 8, 13).

ఏకాత్ర: చూ. ఏకాత్రం. (కో. 20).

ఏకార్తి: రూ. యాకార్తి. చూ. పర్యా. దూపారతి. దీపం వెలిగించి హారతిపట్టడానికి వాడే చిన్న గరిట. చూ. చిత్రం. 137. (కో. 12; తె. 3, 4, 17).

ఏకాత్రం: రూ. ఏకాత్ర. దేవాలయాల్లో దీపాలు వెలిగించడానికి వాడే పెద్ద ప్రమిద. (కో. 19).

ఏంగిల్: (< ఇం. Angle). బీమువారేకు ఏకోణంలో ఉందో చూచుకొనే సాధనం. (రా. 4).

ఏటిపొగర: రంధ్రాలు వేయడానికి వాడే సాధనం. (కో. 16).

ఏట్లుఏయు: (క్రి.) పర్యా. కరివిడిపట్టు, చీవాటంపెట్టు, తరణంపెట్టు, తరమాతపెట్టు, తరుము[1], వాలేయు[1], సంగడిపట్టు, సంగదేయు, సానచేయు, సానబట్టు, సునుగుతీయు, పూర్తయిన లోహపు పాత్రను మెరుగుపెట్టడం. (రా. 10).

ఏతంబాన: రూ. ఏతాపుబాణ, ఏతంబాణ. చూ. పర్యా. ఏతంబొక్కెన. వ్యవసాయదార్లు ఏతాం తొక్కుతూ చెరువులలోనుండి నీళ్ళతోడి పొలాలకు పారించడానికి వాడే సాధనం. చూ. చిత్రం. 31. (రా. 11).

ఏతంబాణ: చూ. ఏతంబాన. (రా. 4).

ఏతంబొక్కెన: పర్యా. ఏతంబాన, ఏతాంగూడ. వ్యవసాయదార్లు ఏతాం తొక్కుతూ చెరువులలో నీళ్ళను క్రిందినుండి పైకిచేది పొలానికి పారించడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 31. (తె. 9,13).

ఏతాపుబాణ: చూ. ఏతంబాన. (కో. 1).

ఏతాంగూడ: చూ. పర్యా. ఏతంబొక్కెన. ఏతాం తొక్కుతూ పుడికి నీళ్ళుతోడటానికి వాడే గూడగా ఉండే రేకు. చూ. చిత్రం 31. (రా. 4).

ఏనల్: ఛానం పైభాగం. (రా. 15).

ఏనుగుపన్నీరుబుడ్డి: సన్నగా పొడుగాటి ఏనుగు మూతి, పీకతో అడుగున మట్లు, మధ్యన కాయపెట్టి చేసిన పాత్ర. పన్నీరు చల్లడానికి ఉపయోగం. (కో. 13, 14, 23).

ఏనుగుపాదంపళ్లెం: పెద్దసైజు ఇత్తడి కంచం. (కో. 20).

ఏపుడుదాక: వేపుళ్ళకు దాకలాగ నిడివి తక్కువగా ఉన్న లోహపు పాత్ర. (కో. 20).

ఏయు: (క్రి.) టోపి ఊడిరాకుండ మేకును కొట్టడం. (కో. 27).

ఏర్‌కీ: (< ఇం. Air Key). రూ. హేర్‌కీ. స్టౌ బర్నర్ లేదా పెట్రోమాక్సులైటుకు వెళ్ళే గాలిని అదుపులో ఉంచడానికి వాడే సాధనం. ఇది బర్నర్

కిందిభాగాన అమర్చబడి ఉంటుంది. (కో. 2; తె. 22).

ఏలొంపుకరవాయి: రూ. ఏళొంపు కరవాయి. పాత్రల అంచులు వెనక్కు మడుచుకోడానికి, జవ్వలను బిగించడానికి వాడే పనిముట్టు. (కో. 20, 24-26).

ఏళొంపుకరవాయి: చూ. ఏలొంపుకరవాయి. (కో.28).

## ఐ

ఐండిల్: (< ఇం. Handle). తలుపును ఆడించడానికి బీరువాపై ఉండే వంపుకడ్డీ. (తె. 17). గొడుగును పట్టుకోడానికి గొడుగుకర్రకు అమర్చిన ప్లాస్టిక్ పరికరం. (తె. 21).

ఐదుపౌనులసుత్తి: (< ఐదు + ఇం. Pounds + సుత్తి). చిన్నచిన్న వస్తువుల్ని కొట్టుకోడానికి వాడే పనిముట్టు. (తె. 8).

ఐరన్: (< ఇం. Iron). వెల్డింగ్‌పనిలో ఉపయోగించే మోపు. (తె. 2, 4; రా. 15).

ఐరన్‌నెక్కల్: గొడుగుకు ఆధారమైన పొడవుపాటి కడ్డీ. (తె. 18).

ఐరన్‌ప్లేటు: (< ఇం. Iron plate). చట్టవదరంగా ఉండే వెడల్పైన లావుపాటి ఇనుపరేకు. ఇనుపముక్కల్ని, ఇనుపరేకుల్ని సాగ్గొట్టడానికి,ముందుగా డిజైన్లు గీసుకోడానికి కమ్మరంపనిలో ఎక్కువగా వాడ్తారు. (తె. 14, 15, 20).

ఐరన్‌బాక్సు: (< ఇం. Iron Box). ఉతికినబట్టల్ని మడతలులేకుండా తోముకోవడానికి వాడే స్టీలు పరికరం. (తె. 12, 13).

ఐరన్‌బ్రష్: (< ఇం. Iron Brush). ఫ్రేములపై వెల్డింగ్ తుంపర్లు లేకుండ శుభ్రంచేసే ఇనుప తంతెల కుంచె. (తె. 21).

ఐరన్‌ముక్క: (< ఇం. Iron + ముక్క). ఏవస్తువులైనా కొట్టడానికి పనికివచ్చే గూటం (తె. 11).

ఐరన్‌సుత్తె: (< ఇం. Iron + సుత్తి). లావురేకులను తెగ్గొట్టడానికి వాడే సాధనం. (తె. 20).

ఐరన్‌సేఫ్‌ఫిటింగ్‌బీరువా: (< ఇం. Iron safe fitting + బీరువా). బీరువాలోపల అమర్చిన మరొక చిన్న బీరువా. (తె. 20).

ఐస్‌క్రీమ్‌కప్పు: (< ఇం. Icecream Cup). ఐస్‌క్రీము ఉంచుకోడానికి వాడే కాడఉన్న చిన్న స్టీలు గిన్నె. దీనికి అంచులు పొడవుగా ఉంటాయి. (కో. 6; తె. 14, 15, 20).

ఐస్‌క్రీమ్‌గ్లాసు: (< ఇం. Icecream glass) ఐస్‌క్రీము ఉంచుకోడానికి వాడే గుండ్రని స్టీలు లోటా. (తె. 8, 9, 13).

ఐస్‌క్రీమ్‌స్పూను: (< ఇం. Icecream spoon). ఐస్‌క్రీము తినడానికి వాడే చిన్న గరిట. (కో. 6,11).

ఐస్‌గ్లాసు: (< ఇం. Ice + గ్లాసు). ఉ. అయిసుగ్లాసు, ఐసీగ్లాసు. క్రిందాపైనా లావుగా మధ్యభాగం కొంచెం లోపలికి వంచబడిఉండే లోటా. చల్లని నీళ్ళు తాగడానికి ఉపయోగం. చూ. చిత్రం 32. (కో. 5, 7, 11-24, 29; రా. 8).

ఐసిడ్: (< ఇం. Acid). చూ. ఆసిడ్. (తె. 17).

## ఒ

ఒగల్‌దాన్ని: రూ. ఒగల్దాన్. పర్యా. తూప్‌దాక, పీకదాన. ఉమ్మేయడానికి వాడే పెద్ద స్టీల్‌తట్ట. (తె. 8, 9).

ఒగల్దాన్: చూ. ఒగల్‌దాన్ని. (తె. 6, 7).

ఒగ్గాణిగరిటె: తిరగవాతగింజలు వేయించుకోడానికి వాడే గరిట. (రా. 14).

ఒగ్గి: (బ.) ఒగ్గిలు. ఉ. వొగ్గిలు. యంత్రపు బిళ్ళకు రింగు అతకడానికి వాడే ఇనుపకొక్కిలాంటి పరికరం. (కో. 5, 8, 11, 13, 14, 20, 21; తె. 10, 12).

ఒగ్గు: (క్రి.) రేకుపై కంపాస్‌తో గీతగీయటం. (కో. 26).

ఒగ్గుబల్ల: పాలిష్ చేసేటప్పుడు మెరుగు సమంగా రావడానికి చేతికి మోపుగావాడే పరికరం. (కో. 14, 19, 29; రా. 15).

ఒగ్గె: ఇనుప పట్టీలను క్లాంపులలాగ బెండ్‌చేయడానికి వాడే సాధనం. చతురస్రాకారపు రింగును రైలు కమ్మికి అతికించి ఉంటారు. (తె. 21, 22).

ఒగ్గేయు: (క్రి.) పూర్తి అయిన ఇనుపపెట్టెను ప్రక్కకుపెట్టడం. (కో. 28).

ఒంగసుత్తి: ఉ. వంగసుత్తి-కొనభాగంలో వంపు ఉండే పరికరం. మరచెంబుకు కీలువేయడానికి, పాత్రల వంపులదగ్గర పనిచేయడానికి, చెంబులకు పీకల్లో సాపువేయడానికి ఉపయోగం. (కో. 12, 15, 21, 24, 29).

ఒటాంగి: బల్లలను చక్కగ చేయడానికి, వంచడానికి వాడే సాధనం. (తె. 5).

ఒడిగంటిగిన్ని: పెండ్లిలో వధువు ఒడిలో బియ్యంతోపాటు పెట్టే ప్రమిదమోస్తరుండే చిన్న గిన్నె. (కో. 13).

ఒడితీయు: తరణిపట్టడానికి వీలుగా పాత్రను సమంగా అడ్డకు అంటించడం. (కో. 22).

ఒడిసిపోవు: (క్రి.) చకనంపనిపూర్తికావడం. (తె.26).

ఒడించు: (క్రి.) పొడవుగావుండే కడ్డీలను అర్ధ చంద్రాకారంగా చేయడం. (కో. 16).

ఒడ్డ: (ఒరియా.) చూ. పర్యా. గొట్టం². గొడుగు పుల్లలు బిగించడానికి ఉపయోగపడే గొడుగు కడ్డీపై పైకి క్రిందికి సులువుగా తిరిగే పరికరం. (కో.12).

ఒడ్డు: పర్యా. కుట్టంపెట్టు. గొయ్యికొట్టు, పుటంపెట్టు. పొక్కించు. గుండ్రని రేకును గుంతగాకొట్టి పాత్ర అడుగుభాగాన్ని చేయడం. (కో. 16, 19-23, 29).

ఒంటికన్నుసుత్తె: కొలిమిపనిలో ఇనుమును చదరంగా చేయడానికి, రేకులను సాగ్గొట్టడానికి వాడే పనిముట్టు. విగ్రహాన్ని క్రాస్ తిప్పడానికికూడ ఉపయోగం. (కో. 3, 5, 28; తె. 21).

ఒంటిమోపుకరవాయి: విగ్రహం చెవిభాగం తయారు చేయడానికి వాడే పరికరం. (కో. 6).

ఒంటిలేటర్: (< ఇం. Ventilator). గాలి రావడానికి గోడల పైభాగాన అమర్చే గాలి కిటికీ. (తె. 1).

ఒత్తికొయ్య: విగ్రహాలు తయారుచేయడానికి వాడే సాధనం. (రా. 5).

ఒత్తు: (క్రి.) చూ. పర్యా. గుద్దు². పిసికినమట్టిని అచ్చుకు అతుక్కొనేటట్లు గట్టిగ నొక్కడం. (తె. 7, 8).

ఒత్తుకొను: (క్రి.) సన్నగావుండే రంధ్రాలను కొంచెం వెడల్పుచేయడం. కొడవలిపిడిని కాకచేసి ముందు భాగాన్ని కొంచెం మొద్దుగా కొట్టడం. (కో. 19; రా. 10).

ఒద్దిబద్దె: చూ. పర్యా. వట్టి¹. కొలతలువేసిన తర్వాత గీతలు గీసుకోడానికి వాడే సాధనం. చూ. చిత్రం. 71. (కో. 19).

ఒద్దుకొను: (క్రి.) ఇత్తడిరేకుపై గుండ్రని గీతలు గీయడం. (కో. 25).

ఒంపు: పర్యా. వంచలుపేయు. రేకుబిళ్ళను గుంతగా కొట్టి తయారుచేయడం. (తె. 2).

ఒంపుకంటానీ: పర్యా. వంకినబిళ్ళ, వాలేగ. పాత్ర వంపుభాగాల్లో మెరుగుపేయడానికి వాడే పరికరం. (కో. 12, 20).

ఒంపుకంపాసు: చూ. పర్యా. ఒంపుకైవారం. మర చెంబులు గిన్నెలు మొదలైనవాటి నమూనాలు గీయడం. (కో. 13).

ఒంపుకీతకత్తు: చూ. పర్యా. వాలేగ. కంచాలు, గిన్నెలు మొదలైనవాటికి వాలుగీతలు వేయడానికి వంపుల్లో పట్టడానికి వాడే పరికరం. దీనివల్ల దెబ్బలుకొట్టినపుడు ఏర్పడిన కచ్చులు సాపు అవుతాయి. (తె.22).

ఒంపుకైవారం: పర్యా. ఒంపు కంపాసు. మర చెంబులు, గిన్నెలు మొదలైనవాటి నమూనాలు గీసుకోడానికి వాడే పరికరం. (కో. 10).

ఒంపులేగ: చూ. పర్యా. వాలేగ. కంచాలు, గిన్నెలు మొదలైనవాటికి వాలుగా గీతలువేయడానికి, వంపుల్లో పట్టడానికి వాడే పరికరం. దీనివల్ల దెబ్బలుకొట్టినపుడు ఏర్పడిన కచ్చులు సాపు అవుతాయి. విగ్రహం వొంపుభాగాల్లో మెరుగుపేయడానికి కూడా వాడ్తారు. (కో. 10; తె. 24).

ఒరిజబద్ద: చూ. పర్యా. వట్టి¹. కొలతలు తీయడానికి ఉపయోగించే పొడవాటి పల్చనిబద్ద. చూ. చిత్రం.71. (కో. 22).

ఒరుజు: (క్రి.) చూ. పర్యా. ఒర్జుకొను. కొలత ప్రకారం రేకులపై గీతగీయడం. (కో. 20).

ఒర్జుకొను: (క్రి.) పర్యా. ఒరుజు. రేకుపై గుండ్రంగా గీతగీయటం. (కో. 28).

ఒలుచు: (క్రి.) అచ్చు ఎండినతర్వాత లోహాన్ని పోసినాక పైనున్న మట్టిని తీసేయడం. (కో. 28).

ఒలువు: పెట్టెకుండే ఉబ్బులో చిన్నగుంత కొట్టడానికి వాడే సాధనం. (రా. 10).

ఒల్లేయు: (క్రి.) తలుపుబందులు తుప్పుపట్టకుండా కీలును శుభ్రపరచడం. (కో. 28).

ఒవల్ ఇడ్లీ ప్లేట్: (< ఇం. Oval + ఇడ్లీ + ఇం. Plate). కోడిగుడ్డు ఆకారంలో ఉండే ఇడ్లీపాత్ర మూత. (కో. 6, 11).

ఒవల్ ట్రే: (< ఇం. Oval tray). కోడిగుడ్డు ఆకారంలో ఉండే గిన్నె. (కో. 12, 15).

ఒవల్ ప్లేటు: (< ఇం. Oval plate). కోడిగుడ్డు ఆకారంలో ఉండే మూత. గిన్నెలపై మూయడానికి ఉపయోగం. (కో. 13, 15).

ఒవల్ బాజిల్: (< ఇం. Oval + హిం. బాజిల్). చూ. పర్యా. ఒవల్‌స్పూను. కోలగావుండే గరిటె (కో. 13, 15).

ఒవల్ బాజి స్పూను: (< ఇం. Oval + హిం. బాజి + ఇం. Spoon). చూ. పర్యా. ఒవల్‌స్పూను. కూరలు వేసుకోడానికి వాడే కోలగావుండే గరిటె (కో. 6).

ఒవల్ సోపుబాక్సు: (< ఇం. Oval soap Box):

కోడిగుడ్డు ఆకారంలో ఉండే సబ్బుపెట్టె. (కో. 6).

ఒవల్‌స్పూను: (< ఇం. Oval spoon). పర్యా. ఒవల్‌బాజిల్, ఒవల్‌బాజి స్పూను. కోడిగుడ్డు ఆకారంలో ఉండే టీస్పూను. (తె. 10).

## ఓ

ఓగరల: రూ. ఓగరాల. చూ. పర్యా. కాతగరిటె. వారుగిన్నె. చూ. చిత్రం 47. (తె. 10, 11).

ఓగరాల: చూ. ఓగరల. (తె. 17).

ఓంకారు: ఇనుపముక్కలు బెండ్‌చేసుకోడానికి వాడే పరికరం (కో. 3).

ఓంతీయు: (క్రి.) పర్యా. హోంవేయు. అసమానంగా ఉండే బెజ్జాలను సమానంగా వచ్చేటట్లు చేయడం. (కో. 19; తె. 17, 22, 24).

ఓల్‌పాక్సు: చూ. హోల్‌పాక్సు. (తె. 3, 19, 24).

ఓల్‌పాసు: రూ. ఓలిబాసు. చూ. హోల్‌పాక్సు. (తె. 7).

ఓలరు: రూ. వాలరు, హోలరు, ఉ. వోలరు. చూ. పర్యా. టార్చి. వెల్డింగ్ రాడ్‌లను పట్టుకోడానికి వాడే పరికరం. (కో. 19-22, 28).

ఓలిగపెనుము: రూ. ఓలిపెనుము, ఓళలపెనుము, హోళిగపెనం. ఓలిగలు చేయడానికి వాడే చదరంగా ఉక్కురేకు. చూ. చిత్రం. 33. (రా. 10).

ఓలిగసలాకు: మూలలు గుండ్రముగ ఉండే పొడుగాటి రేకు. ఓలిగలు పెనుంనుంచి తీయడానికి వాడ్తారు. (రా. 12).

ఓలిపెనుము: చూ. ఓలిగపెనుము. (రా. 12).

ఓలు: (< ఇం. Hole). చూ. పర్యా. కన్నం. గొడ్డలికివేసే రంధ్రం. (కో. 13).

ఓల్డరు: (< ఇం. Holder). ఉ. వోల్డరు. రూ. వాల్డరు, హోల్డరు[1]. చూ. పర్యా. టార్చి. వెల్డింగ్ పనిలో వెల్డింగ్‌రాడ్డును పట్టుకోడానికి ట్రాన్స్‌ఫారంకు కేబుల్‌పైరుద్వారా బిగించిఉండే సాధనం. (కో. 24, 29; తె. 3, 5, 7, 17, 18, 21, 24; రా. 10, 15).

ఓల్డింగ్‌కట్టి: (< ఇం. Holding + కట్టి). సాన రాయి ఊగకుండ ఉండటానికి అమర్చిన మోపు. (రా. 15).

ఓళీలపెనుము: చూ. ఓలిగపెనుము. (రా. 13).

ఓవర్‌లెట్‌వెల్డింగ్: (< ఇం.Overlet Welding). ఆరోహణ, అవరోహణక్రమంలో చేసిన వెల్డింగ్. (తె. 17).

ఓవల్‌కంచం: (< ఇం. Oval + కంచం). చూ. పర్యా. బాదామికంచం. బాదంకాయ ఆకారంలో ఉండే భోజనం ప్లేటు. చూ. చిత్రం 175. (కో. 18, 20, 19).

ఓవల్‌గెరిట: (< ఇం. Oval + గరిటె). చిన్నచిన్న వస్తువులు ఎత్తుకోడానికి వాడే కోడిగుడ్డు ఆకారంతో ఉండే స్పూను. (కో. 1).

ఓవల్‌డిష్: (< ఇం. Oval dish). డైనింగ్ టేబుల్‌పై కూరలు, అన్నం ఉంచుకోడానికి వాడే కోడిగుడ్డు ఆకారంతోఉండే పాత్ర. (కో. 17).

ఓవల్‌షేపు తామరాకు: కోడిగుడ్డు ఆకారంలో, తామరాకులాగా అంచులేకుండా చేసిన స్టీలుపళ్ళెం. భోజనానికి వాడ్తారు. (కో. 19).

ఓవల్‌సేప్‌కంచం: (< ఇం. Ovalshape + కంచం). చూ. పర్యా. బాదామికంచం. బాదంకాయ ఆకారంతో ఉండే భోజనంప్లేటు. చూ. చిత్రం. 175. (కో. 16, 29).

ఓవల్ స్పూను: (< ఇం. Oval spoon). టీపొడి వేసుకోడానికి వాడే, కోడిగుడ్డు ఆకారంలో ఉండే చిన్న గరిట. (తె. 11).

ఓవల్ హ్యాండిల్‌డిస్: (< ఇం. Oval handle dish). కోడిగుడ్డు ఆకారంతో ఉండే స్టీల్‌తట్ట (తె. 10).

## క

కక్కలాకరాయి: చూ. పర్యా. కక్కుసీర్నం. కొడవళ్ళకు కక్కుపెట్టడానికి వాడే పరికరం. (రా. 2).

కక్కుకొడవలి: పర్యా. తాగోళం, లిక్కి. గడ్డి కోయడానికి ఉపయోగించే పనిముట్టు. (రా. 4).

కక్కులు: పర్యా. పండ్లు, పల్లకట్టు, పితుకులు, పిన్ని, పిందీలు, పుంజీ, మడపన్లు. ఇత్తడి బిందె భాగాలను అతకడానికి రేకు అంచులపై అక్కడక్కడ చేసిన చిన్న కత్తిరింపులు. (తె. 22).

కక్కుసీర్నం: పర్యా. కక్కలాకరాయి. కొడవళ్ళకు కక్కుపెట్టడానికి ఉపయోగించే సాధనం. (రా. 6).

కగ్గించు[1]: (క్రి.) రూ. కగ్గింపు. పర్యా. నిప్పులు పోయు. ఇత్తడి పాత్రలకు పాలిష్ చేసేటప్పుడు పచ్చదనాన్ని తేవడానికి లోవల నిప్పులువేయడం. (కో. 29).

కగ్గించు[2]: (క్రి.) ఇనుమును ముక్కలుగ తెగ్గొట్టడం:

(కో. 30).

కగ్గింపు: చూ. కగ్గించు[1]. (కో. 17).

కంకణం: పర్యా. కడెం[2], జవ్వకమ్మి, తలపడి[1], సీకు[2]. పాత్రల అంచులు దట్టంగా ఉండటానికి ఉపయోగించే లోహపుకడ్డి. (తె. 24).

కంగను: (హిం.) చూ. పర్యా. అడుగు గొడుతు. గొడుగు పుల్లలను బిగించడానికి గొడుగుకర్ర పైభాగాన ఉండే గుండ్రని ఇత్తడి పళ్ళచక్రం. (తె. 4).

కంగోరం: పోతపాత్ర మెడభాగం. (కో. 20).

కంగోరుపోగరు: శిల్పపనిలో రంధ్రాలు వేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 8).

కచ్‌సుత్తె: చూ. పర్యా. కమ్మరసుత్తె. లోహపు రేకులను సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 19).

కచర[1]: విగ్రహాన్ని పోత పోసినపుడు ఏర్పడే కతుకులను కత్తిరించే పరికరం. (తె. 9).

కచర[2]: పాత్రలపై ఉండే గచ్చులు. (తె. 8).

కచడ: పోత చెంబులపై ఉండే మైల. (తె. 7).

కచోడి: అన్నం తినడానికి ఉపయోగించే కంచుపాత్ర. (తె. 19).

కచ్చసుత్తె: పర్యా. కచ్చితంకడ్డీ, కచ్చుడాకలి. కాల్చిన ఇనుప కడ్డీలను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 20).

కచ్చికొట్టు: (క్రి). రేకుపై గుర్తుకొట్టడం. (రా. 13).

కచ్చితంకడ్డీ: చూ. పర్యా. కచ్చసుత్తె. కాల్చిన ఇనుప కడ్డీలను సాపుచేయడానికి వాడే పరికరం. (రా. 6).

కచ్చి: బీరువాకు వెనక ఉండే అంచుల వలయం. (రా. 15).

కచ్చు: వెల్డింగ్ పనిలో కట్‌చేసిన తర్వాత వచ్చే హెచ్చు తగ్గు. (కో. 13, 28).

కచ్చుకరవాయి: పర్యా. కచ్చుసుత్తె. పూర్తయిన ఇత్తడి బిందెలపై చుక్కలు కొట్టడానికి ఉపయోగించే పనిముట్టు. అడుగు భాగంలో చిన్నచిన్న గళ్ళు ఉంటాయి. చూ. చిత్రం 34. (తె. 3).

కచ్చుడాకలి: చూ. పర్యా. కచ్చసుత్తె. కాల్చిన ఇనప కడ్డీలను సాగ్గొట్టడానికి వాడే పనిముట్టు. (తె. 1).

కచ్చుతెగు: (క్రి). బిందెకు ఉండే మైలని తరిణి కమ్ములద్వారా పోగొట్టడం. (కో. 22).

కచ్చులు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (తె. 3).

కచ్చుసుత్తె: ఉ. కచ్చుసుత్తి. చూ. పర్యా. కచ్చుకరవాయి. పూర్తయిన ఇత్తడి బిందెలపై చుక్కలు కొట్టడానికి ఉపయోగించే పనిముట్టు. అడుగు భాగంలో చిన్నచిన్న గళ్ళుంటాయి. చూ. చిత్రం 34. (తె. 3,8,9,24; రా. 16).

కజ్జికాయపెట్టె: పర్యా. కజ్జికాయల అచ్చు, కజ్జెల చెక్క. కజ్జికాయలు చేయడానికి ఉపయోగించే అర్ధచంద్రాకారపు అచ్చు. చూ. చిత్రం 35. (రా. 6).

కజ్జికాయలఅచ్చు: చూ. పర్యా. కజ్జికాయపెట్టె. కజ్జికాయలు చేయడానికి ఉపయోగించే పరికరం చూ. చిత్రం 35. (రా. 4).

కజ్జిగకట్టరు: (కజ్జిగ+ఇం. Cutter). రూ. కజ్జెలు కట్టరు. పర్యా. కరంజికట్టర్. కజ్జికాయలు చేయడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 36. (కో. 1).

కజ్జెలచెక్క చూ. పర్యా. కజ్జికాయపెట్టె. కజ్జికాయలు తయారుచేసుకొనే అర్ధచంద్రాకారపు అచ్చు చూ. చిత్రం 35. (తె. 14-16).

కజ్జెలుకట్టరు: చూ. కజ్జిగకట్టరు. (తె. 15).

కంచరపని: ఉ. కంచెరపని. చూ. పర్యా. ఇత్తడిపని ఇత్తడిరాగి రేకులతో బిందెలు, పాత్రలు తయారు చేసేపని. (కో. 26; తె. 1, 2).

కంచరార్తి: చూ. కంచార్తి. (తె. 3, 4).

కంచం: పర్యా. గిన్నె[3], తట్ట[2], తాటు, తాంబిని, తాళి[1], తెల్లె, పళ్లెం[2], ప్లేటు[4], మీల్స్‌ప్లేటు, రైస్‌ప్లేటు, సాదాకంచం. అన్నంతినడానికి వాడే లోహపుపాత్ర చూ. చిత్రం. 214. (కో. 4, 7, 10-30; తె. 14, 17, 18, 21, 22, 25).

కంచంకమ్మి: అల్యూమినియం కంచాలకు లోభాగాన పాలిష్ చేయడానికి వాడే పరికరం. (కో. 4).

కంచార్తి: రూ. కంచరార్తి. పర్యా. కుందె, చెక్కరదీపం. జ్యోతి, దీపపుసెమెడ్స్, దీపంకుంది, దీపం చెమ్మె, దీపారాధన, దీపింత, నిరంజన్, నివాళి, ప్రణీత, షమా, సమాప్. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 58. (తె. 1-3, 5, 7; రా. 15).

కంచాలస్టాండు: (<కంచాల + ఇం. Stand). పర్యా. చిక్కు, బగోనాస్టాండు, బత్తానికస్టాండు, సెల్ఫు[1], స్టాండు[1], పళ్లాలు, గ్లాసులు, గరిట్లు ఉంచడానికి ఉపయోగించే ఇనుపపట్టీల స్టాండు. చూ.

చిత్రం 220. (కో. 24 30).

కంచి: (< హిం. కైంచీ) రేకులు కత్తిరించడానికి ఉపయోగించే పెద్ద కత్తెర. (తె. 12).

కంచు: రాగి, తగరం సమపాళ్ళలో కలిపి తయారు చేసిన లోహం. అచ్చులు, డిమ్మెలు, గంటలు మొదలయినవి తయారు చేయడానికి ఉపయోగం. (కో. 28; తె. 17).

కంచుకార్ పని: ఇత్తడి, రాగి పాత్రలు రిపేరుచేసే పని. (రా. 14).

కంచుగంట: దేవాలయాల్లో మోగించడాని కుపయోగించే కంచుతో చేసిన సాధనం. పెంపుడు జంతువులకు అలంకారానికి మెడలో కట్టే ఆభరణం. (కో. 6; రా. 2).

కంచుగిన్నె: అన్నం తినడానికి వాడే కంచుపాత్ర. (కో. 21–23, 25, 28, 30).

కంచుచెంబు: నీళ్ళుతాగడానికి ఉపయోగించే కంచుతో చేసిన పాత్ర. (తె. 5, 19, 22; రా. 16).

కంచుత్తి: చూ. కంచుసుత్తె (కో. 2, 31, 42; తె. 17, 18, 24, 28).

కంచుప్లేటు (< కంచు+ఇం. Plate). మూతగా పెట్టుకోడానికి ఉపయోగించే కంచుతోచేసిన తట్ట. (కో. 28, 30).

కంచుమట్నుసుత్తె: చూ. పర్యా. కంచుసుత్తె. ఇత్తడి, స్టీల్‌పాత్రల నమూనా పూర్తయిన తర్వాత నొక్కులు సాపు చేయడానికి ఉపయోగించే కంచుదిమ్మ ఉన్న కొయ్యసుత్తి. (తె. 17).

కంచుసుత్తె: రూ. కంచుత్తి. పర్యా. కంచుమట్నుసుత్తె. ఇత్తడి, స్టీల్‌పాత్రల నమూనా పూర్తయిన తర్వాత నొక్కులు సాపుచేయడానికి వాడే కంచుదిమ్మ ఉన్న కొయ్యసుత్తె. (కో. 10–12, 16, 22; తె. 16, 25).

కంచోడిచన్ని: తక్కువ వెడల్పు ఉన్న కడ్డీలను తెగగొట్టడానికి వాడేపరికరం. (రా. 15).

కంజరు: ఇనుపగజ్జెలు. (తె. 10, 11).

కట్ ఏయు: (క్రి.) (< ఇం. Cut + ఏయు). అడుగు భాగం కింద మోపకుండా చుట్టూ ఎత్తయినరేకుదిమ్మ కట్టడం. (తె. 22).

కట్‌చేయు: (క్రి.) (< ఇం. Cut + చేయు). రూ. కటింగ్‌చేయు. చూ. పర్యా. తరుగు[1]. పొడవాటి మందంగల రేకులను, ఇనుప కడ్డీలను సైజు ప్రకారం ముక్కలుగా కత్తరించడం. (కో. 17, 21, 22, 24, 25, 27, 29; తె. 5, 6, 18–21, 22; రా. 15).

కట్‌ప్లేటు: (< ఇం. Cutplate). పెద్దపాత్రలకు వేసేమూత. చూ. చిత్రం. 37. (కో. 2).

కటరు: (< ఇం. Cutter). చూ. పర్యా. కత్తెర. కత్తరించడానికి వాడేపరికరం. చూ. చిత్రం. 40. (తె. 17).

కటంపెట్టు: (క్రి.) బిందె దొడ్డిభాగానికి అతికేందుకు వీలుగా కుతికభాగాన్ని తయారుచేయడం. (కో. 21).

కటాయించు: (క్రి.) ఇనపరేకును సైజుప్రకారం కత్తరించడం. (కో. 16).

కటారిసుత్తె: రూ. కటారిసుత్తి. బిందె భుజాలను సరిచేసేందుకు ఉపయోగించే పనిముట్టు. ఇది సన్నగా ఉండి, పొడవుగ ఉంటుంది. (కో. 21).

కటారు: గడియారం రిపేరు పనిలో లింక్స్ ఒత్తడానికి, పీకడానికి ఉపయోగించే పరికరం, (రా. 7).

కటాలిపెట్టు: (క్రి). బిందె పొట్టభాగాన్ని అతకడానికి వీలుగా కుతికను సాగగొట్టడం. (కో. 22).

కటాలిసుత్తి: చూ. కటారిసుత్తి. (కో. 5, 10, 12, 14, 22–27).

కటింగ్ ఉలి: (< ఇం. Cutting + ఉలి). పాత్ర ఆకారం తయారుచేసేటపుడు పీసులను కత్తిరించే పరికరం. (కో. 2, 6, 22, 26; రా. 8, 16).

కటింగ్ కారు: (< ఇం. Cutting + కారు). పర్యా. కట్టింగ్‌ప్లైరు, పట్టకారు[2], పిల్లరు, ప్లేయరు. మరలు తిప్పడానికి, సావర్ పనిలో వస్తువులను కదలకుండా పట్టుకోడానికి, గొడుగు పుల్లలకు వైరు చుట్టడానికి వాడే పనిముట్టు. (కో. 17, 19, 20, 22, 23).

కటింగ్‌శానం: (< ఇం. Cutting + శానం). ఉ. కటింగ్‌శానం. పర్యా. కట్టర్ పట్టుకార, పైకట్టరు. ఇనప కడ్డీలను ఖచ్చితంగా తెగ్గొట్టడానికి ఉపయోగించే పరికరం. (కో. 21; తె. 20).

కటింగ్‌చేయు: (క్రి). (< ఇం. Cutting + చేయు). చూ. పర్యా. తరుగు[1]. పొడవాటి మందం గల రేకులను, ఇనప కడ్డీలను సైజు ప్రకారం. ముక్కలుగా కట్‌చేయడం. (కో. 28; తె. 24; రా. 13).

కటింగ్‌టూలు: (< ఇం. Cutting tool). స్పేయర్ భాగాల్ని కత్తిరించే పరికరం. (కో. 8).

కటింగ్‌పిలేరు: చూ. కటింగ్‌ప్లేరు. (తె. 4).

కటింగ్‌ప్లేయరు: చూ. కటింగ్‌ప్లేరు. (కో. 1–4, 7–15, 19, 23–30; తె. 1–5, 17–23, రా. 5–9,

12_16).

కటింగ్‌ప్లేరు: (< ఇం. Cutting plier). రూ. కటింగ్‌పిలేరు, కటింగ్‌ప్లేయరు, కటింగ్‌పేరు. చూ. పర్యా. కటింగ్‌కారు. చిన్నచిన్న వస్తువుల్ని పట్టుకోడానికి పనికివచ్చే పట్టుకారు. మేకులు పీకడానికి, సన్నకమ్మిని తెంచడానికి ఉపయోగం (కో. 8, 10; తె. 20, 22, 25; రా. 3, 7).

కటింగ్‌ఫేరు: చూ. కటింగ్‌ప్లేరు. (కో. 24).

కటింగ్‌మిషన్[1]: (< ఇం. Cutting machine). పొడవైన ఇత్తడి లేక ఇనపబద్దలను ముక్కలుగా కత్తిరించడానికి వాడే పరికరం. (3, 5, 6, 12, 15_18; తె. 24; రా. 7, 8).

కటింగ్‌మిషన్[2]: (< ఇం. Cutting machin ). జుట్టు కత్తిరించడానికి వాడే పరికరం. (కో. 20).

కటింగ్‌తీగ: (< ఇం. Cutting+తీగ). ఇత్తడి పాత్రలను మెరుగుపెట్టడానికి వాడే పరికరం. (కో. 8).

కటోరి[1]: (< హిం. కటోరి) ఉ. కటోర్. పర్యా. గిన్నె[2], పాలిష్‌కటోర, పోకస్‌గిన్నె, ఫోకస్సింగ్ కటోర, బాటరిగిన్నె, మైతాబు, రిఫ్లెక్టరు; లేఫెక్టరు. వెలుతురు బాగారావడానికి టార్చిలైటు దక్కన్‌లో బొడిపెలాగ ఉండి, బిరడా మూసినపుడు సెల్సు టచ్‌కావడానికి అమర్చిన రాగిరేకు. (తె. 2, 19, 25).

కటోరి[2]: పర్యా. మీదిప్లేటు. వంట చెల్లాచెదరు కాకుండా స్టౌబర్నర్‌పైవేసే రింగు. (తె. 5, 6, 23).

కటోరి[3]: పర్యా. గుబ్బ, గుబ్బకట్టు. బొకెట్లు, ట్రంకు పెట్టె క్రిందిభాగం భూమిపై ఆనకుండా ఉండేందుకు ఏర్పాటుచేసిన ఉబ్బు. (తె. 6).

కటోరి[4]: ఉ. కటోర్. పర్యా. గిన్నెలు. పచ్చళ్ళు, కూరలు వడ్డించుకొనేందుకు, పెరుగుచేసుకొనేటందుకు వాడే చిన్న కప్పుగిన్నె. (తె. 3_5).

కట్కా[1]: పర్యా. చిప్పు. టార్చిలైటును వెలిగించడానికి, ఆర్పివేయడానికి వాడే బాటరీలగొట్టంపై ఉన్న పరికరం. (తె. 3).

కట్కా[2]: చూ. ఖట్కా[1]. (తె. 2, 17).

కట్కా[3]: లోహపు పాత్రల అడుగున అమర్చిన రేకు బిళ్ళ. (తె. 1, 25).

కట్కా[4]: తాళంకప్ప లోపలి లివరు అమర్చడానికి వాడే చిన్నపట్టి. (తె. 24).

కట్టు: పర్యా. దాగలి[2], దిమ్మ[1], పాటా[1], పాన, పిన్ను, పుడక[1], పూటి, ప్లేటు[3], బల్లింపుడుంగ, బీడుచెక్క, రైలుదిమ్మ, రైలుపట్టా, రైలుపోలు, రైలుబడ్డీ, రైల్వేకమ్మి, లంగరు, లంగరుముక్క, రైను[2], చట్రం[3], హాండ్‌లూల్సు[1]. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (రా. 3).

కట్టుక: చూ. పర్యా. ఎలకలను పట్టుకోడానికి వాడే సాధనం. చూ. చిత్రం 30. (తె. 13).

కట్టుకత్తి: చూ. పర్యా. కట్టుకత్తిరి. రేకులను కత్తిరించడానికి ఉపయోగించే పెద్దకత్తెర. (కో. 18).

కట్టుకత్తిరి: పర్యా. కట్టుకత్తి. రేకులను కత్తిరించడానికి వాడే పెద్దకత్తెర. (కో. 13, 17; తె. 21).

కట్టుకొట్టు: (క్రి.) అచ్చులపై ఉండే గట్టిపట్టిని తీసివేయడానికి రేకుతో దాన్ని పెల్లగించడం. (కో. 22).

కట్టర్: (< ఇం. Cutter). వస్తువుల్ని పట్టుకొని ఎత్తడానికి లేదా మేకులూడదీయటానికి వాడే పొడుగు కాడలున్న కత్తెర లాంటి పరికరం.(తె.25).

కట్టర్‌శాణం: (< ఇం.Cutter+శాణం). చూ. పర్యా. అడ్డగళ్ళి. రేకులు, కడ్డీలు తెగ్గొట్టడానికి వాడేదిమ్మ. (తె. 12).

కట్టర్‌ఛెన్ని: (< ఇం. Cutter+ఛెన్ని). చూ. పర్యా. అడ్డగళ్ళి. రేకులు, కడ్డీలు తెగ్గొట్టడానికి వాడేదిమ్మ. (తె. 23).

కట్టర్‌దిమ్మ: (< ఇం. Cutter+దిమ్మ). ఉ. కటర్ దిమ్మ. పర్యా. చానలు, దాగలి, దనగా, దిండు[2], ఇనుపకడ్డీలను కట్‌చేసి, లెవల్‌చేయడానికి వాడే దిమ్మ. (కో. 23; తె. 18, 19).

కట్టర్‌పట్టుకార: (ఇం. Cutter+పట్టుకార). చూ. పర్యా. కటింగ్‌దానం. ఇనుపకడ్డీలను కచ్చితంగా కట్‌చేయడానికి వాడేపరికరం. (రా. 3).

కట్టర్‌బిళ్ళ: (ఇం. Cutter+బిళ్ళ). పర్యా. కట్టర్‌బ్లాకు. ముక్కలను తెగ్గొట్టేందుకు వెల్డింగ్‌పనిలో ఉపయోగించేమోపు. (కో. 16).

కట్టర్‌బ్లాకు (< ఇం. Cutter Block ). చూ. పర్యా. కట్టర్‌బిళ్ళ. వెల్డింగ్‌పనిలో పట్టీలను కట్‌చేసేందుకు వాడేదిమ్మ. (తె. 22).

కట్టరు: ఉ. కటరు. చూ. పర్యా. అడ్డగళ్ళి. రేకులు, కడ్డీలు తెగ్గొట్టడానికి ఉపయోగించే దిమ్మ. (కో.2_5. 9, 16, 19, 22, 24, 26, 28; తె. 1, 3_9, 11_13; 17_19; 21_25, 30; రా. 4, 5, 7, 11, 14, 16).

కట్టసుత్తి: రేకు వంపుతిరిగినపుడు సడపడానికి వాడే పరికరం. (రా. 3).

కట్టి[1]: కొలిమిలో మంటవేయడానికి ఉపయోగించే చెక్కపేళ్ళు. (రా. 1).

కట్టి[2]: రేకును వంచేటపుడు ఉలికి ఆధారంగా ఉపయోగించే సాధనం. (రా. 14).

కట్టిపీట: పర్యా. పీటకత్తి. కూరగాయలు తరగడానికి వాడే సాధనం. (కో. 16).

కట్టిపేడు: కత్తులను సానపట్టేటప్పుడు చేయికాలకుండ ఆధారంగా ఉపయోగించే చిన్న కొయ్యముక్క. (తె. 18).

కట్టు[1]: (క్రి.) సున్నమట్టిని అచ్చులాగ తయారు చేయడం. (రా. 2, 15).

కట్టు[2]: (క్రి.) తిత్తిలాగ తయారుచేసేందుకు కొయ్యకు చర్మాన్ని కట్టడం. (రా. 10).

కట్టు[3]: (క్రి.) డ్రమ్ము అడుగుభాగాన్ని గుండ్రంగా చేయడం. (రా. 4).

కట్టు[4]: (క్రి.) రేకుచుట్టూ లోపల కడ్డీని చుట్టడం. (రా. 10).

కట్టు[5]: (క్రి.) పట్టాను కాగబెట్టినతర్వాత బండి చక్రానికి ఎక్కించి బిగించడం. (రా. 12).

కట్టు[6]: (క్రి.) అశీలు బిగించడం. (రా. 13).

కట్టు[7]: కానాన్ని పట్టుకోడానికి ఉపయోగించే పరికరం. (కో. 22; రా. 11).

కట్టు[8]: రేకుమూత. (రా. 2).

కట్టు[9]: ఇడ్లీ పాత్రలు తయారుచేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 13).

కట్టు[10]: డ్రమ్ముచుట్టూ పైభాగంలో ఉండే కమ్మి. (రా. 1).

కట్టు[11]: బట్టీచుట్టూ ఉండే మట్టి చెదిరిపోకుండ పైన వేసే రింగు. (రా. 15).

కట్టు[12]: బండిచక్రానికి చుట్టూరఉండే ఇనుపబద్ద. (కో. 19, 20; రా. 3).

కట్టు[13]: జల్లెడ, చేట మొదలైన పరికరాల అంచు భాగం. (రా. 10).

కట్టు[14]: డబ్బాలు, బకెట్లుకింద మోపకుండా అడుగున ఎత్తుగా చుట్టూవేసే రేకు. (తె. 3, 5, 21)

కట్టుఉలి: రేకు అవుటువస్తే కత్తిరించడానికి ఉపయోగించే పనిముట్టు. (రా. 14).

కట్టు ఎక్కించు: (క్రి). కాగపెట్టిన కమ్ములను బండి చక్రానికి బిగించడం. (రా. 16).

కట్టుకమ్మి: లోహపు పైభాగాన లోపల అమర్చినకడ్డీ. (రా. 2).

కట్టు బిగించు: (క్రి). బకెట్‌పై చుట్టూ కడ్డీవేసి అంచులాగ గట్టిగ చేయడం. (కో. 16).

కట్టుచీలపోగర: పర్యా. దబ్బపోగర. బండి అచ్చుకు కొనభాగాన రంధ్రం వేయడానికి ఉపయోగించే పరికరం. (రా. 4).

కట్టె: పర్యా. ఉలవకర్ర, కడ్డీ[3], కర్ర[1], కామ[1], కొలంబియా కర్ర, గళ్ళకర్ర, గొడుగుఊచ, గొడుగుకర్ర, గొడుగు సువ్వ, ఛత్రిరాడు, ట్యూబు, నెక్కర్‌రాడు, పేపరు చెత్తుకర్ర, రాడ్డు[1], సలాక[4], సీకు[4], హాండలు. గొడుగుకు ఆధారమైన పొడవైన లోహపుకడ్డీ. (తె. 4).

కట్టెకర్ర: పర్యా. కట్టెరాడు. గొడుగుకు ఆధారమైన పొడవైనకర్ర. (తె. 23).

కట్టెదిండు: సానరాయిని లాగడానికి రాయికి బిగించిన కొయ్య. (తె. 23).

కట్టెపిడి: చాకులను పట్టుకోడానికి వాడేకొయ్య. (రా. 15).

కట్టెపెట్టె: పాత్ర అచ్చులను తయారుచేసే పెట్టె. (రా. 15).

కట్టెబొగ్గుల పొయ్యి: ఉక్కు కుంపటి. (తె. 20).

కట్టెరాడు: (< కట్టె + ఇం. Rod). చూ. పర్యా. కట్టెకర్ర. గొడుగుకు ఆధారమైన పొడవైన కర్ర. (తె. 25).

కట్టెలపొయ్యి: చూ. పర్యా. ఇనుపపొయ్యి. కట్టెలతో వంట చేయడానికి వాడే అర్ధచంద్రాకారపు నిలువు ఇనపరేకు పొయ్యి. (కో. 1, 2, 4, 9; తె. 1, 2, 8–16, 18–20, 22, 25; రా. 8, 12, 16).

కట్టెసుత్తె: ఉ. కట్టసుత్తె, కట్టిసుత్తి, కట్టెసుత్తి. చూ. పర్యా. ఉడన్‌హేమర్, రేకులను సాపుచేయడానికి వాడేపరికరం. నవాసారాన్ని, మెత్తగా నూరడానికి కూడా ఉపయోగం. చూ. చిత్రం. 68. (తె. 1–3, 6, 8, 9, 11, 12, 14, 16, 24; రా.1, 11, 12, 15).

కట్రు: వెల్డింగ్ చేసిన తర్వాత పైనుండే బుడిపెలను తీసివేయడానికి వాడేపరికరం. (కో. 27).

కట్లు[1]: రేకుపై బొద్దుకట్టేటప్పుడు బద్దీలనుకలిపి బిగించడానికి వాడే పరికరాలు. (తె. 21).

కట్లు[2]: పెట్టె కిందమోపకుండా ఉండటానికి కింద కొట్టిన బొడిపెలు. (కో. 17).

కట్లు[3]: బక్కెట్ల అడుగుభాగం. (కో. 5).

కట్లపొయ్యి: కట్టెలుపెట్టి వంటచేయడానికి వాడే ఒకరకం ఇనపపొయ్యి. (రా. 13).

కటోరి: పర్యా. కటోరిగిన్నె, కప్పుగిన్నె, పెరుగుగిన్నె. పెరుగుకువాడే అంచులేని చిన్నపాత్ర. (కో. 24; తె. 17).

కటోరిగిన్నె: చూ. పర్యా. కటోరి. పెరుగు పోసుకోడానికి

వాడే చిన్నకప్పు. (కో. 1).

కడవలకరవాయి: పర్యా. గుండిగల కరవాయి, బుంగకరవాయి. గుండ్రనిలోహపు పాత్రలు తయారు చేయడానికి, మెరుగుపెట్టడానికి వాడే పనిముట్టు. (కో. 10, 12; తె 7).

కడవ: పర్యా. బుంగ. నీళ్ళుతేవడానికి ఉపయోగించే చిన్న లోహపుబిందె. (కో. 5, 7, 10, 12; తె. 4, 21, 22; రా. 13, 14).

కడశిలపోగర: బండిఅచ్చుకు తొలలువేయడానికి ఉపయోగించే మొల (రా. 2).

కడాయి: రూ. కడేలు, కలాయి, కళాయి[1]. పర్యా, కలాయిగిన్నె, గుంటలపెనం, గుంటలబాండ్లి, గుల్ల[5], గోళం[1], చిన్నబాండి, చెవుల బాణలి, టకారం[1], టక్కుబాణ, పెంకె[1], నూనెపెనం, పులుసుకళాయి, పెనం[1], బాణవా, బాండ్లి, బాళిగ, బీడుకలాయి, బీడుపెనం, బీడుమూకుడి, బూరి మూకిడి, బూర్లెపెనం, మూకుడు[1], రేకుమూకుడు. పిండివంటలు చేయడానికి ఉపయోగించే ఇరువైపులా పిడిఅమర్చిన గోళంలాగ ఉండేలోహపు పాత్ర. చూ. చిత్రం. 163. (తె. 6, 11, 17, 18; రా. 3, 7, 12–15).

కడియబిందె: చూ. కడెంబిందె. (కో. 16).

కడియా[1]: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డరింగు చేయడానికి వాడేఇనుపకమ్మి పరికరం. (తె. 3, 5, 6).

కడియా[2]: చూ. ఖడియా. (తె. 4).

కడింపుసుత్తి: ఇనుపకడ్డీలపై నాట్లుపెట్టడానికి ఉపయోగపడే పరికరం. (కో. 24).

కడీడబ్బా: పర్యా. చిలుకుడబ్బా, టిఫిను[1], టిఫిన్‌డబ్బా, తొట్టిగిన్నె, పొలంగిన్నె, పొలండేక్చా, మిల్కపడి[2], బొక్కెన[2], సద్దిగిన్నె, సద్దిడబ్బా. పొలందగ్గరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే పిడి, మూత ఉన్నపాత్ర. (తె. 17).

కడుగు: (క్రి.) పూర్తయిన లోహపుపాత్రలను శుభ్రపరచడం. (తె. 5, 7, 12, 14, 15, 16).

కడుగుబుట్ట: బియ్యాన్ని కడగడానికి ఉపయోగించే ఇత్తడిసాధనం. (కో. 17).

కడెం[1]: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డరింగ్‌చేయడానికి వాడేఇనుపకమ్మి పరికరం. (తె. 17).

కడెం[2]: చూ. పర్యా. కంకణం. పాత్రల అంచులు దట్టంగా ఉండటానికి ఉపయోగించే లోహపుకడ్డీ. (తె. 4, 7).

కడెం[3]: టార్చిలైట్‌ను పట్టుకోడానికి ఉపయోగించే వెనుకమూతకు అమర్చిన గుండ్రని ఇనపకడ్డీ. (తె. 17).

కడెంబిందె: రూ. కడియంబిందె. పర్యా. కుంచం[1], గుండాలి, గుండీబిందె. పాలు, నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగించే గుండ్రనిమూతి ఉన్న ఇత్తడిబిందె. మూతిభాగంలో గుండ్రనికడియం అమర్చి ఉంటారు. (కో. 10; తె. 3, 5).

కడేలఅండా: ఉ. కడీలఅండ. చూ. పర్యా. అండా[1], నీళ్ళునిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల పిడి, వెడల్పుమూతి ఉన్న పెద్దలోహపు పాత్ర. చూ. చిత్రం. 8. (కో. 1, 2, 12, 13; తె. 15; రా. 2).

కడేలతపేల: చూ. పర్యా. అండా[1]. నీళ్ళునిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల పిడి, వెడల్పుమూతి ఉన్న పెద్దలోహపుపాత్ర. చూ. చిత్రం. 8. (కో. 5; రా. 3).

కడేలు: చూ. కడాయి. (తె. 10, 11).

కడ్డి[1]: పర్యా. గజం, టంకంకడ్డీ, టంకంకమ్మి, టంకం పుల్ల, పొడికమ్మి, రవ్వకడ్డీ, రవ్వమూస, రవ్వ సలాక, సలాక[3], సీకు[1], సువ్వ. ఇత్తడి పాత్రలను రవ్వతో అతకడానికి వాడే ఇనపకమ్మి. (కో. 3, 11, 14, 27; తె. 21; రా. 12).

కడ్డి[2]: ఉ. కడ్డీ. చూ. పర్యా. ఇనుపకారు. సాల్డరింగ్ చేయడానికి వాడే ఇనుపకమ్మి పరికరం. (కో. 26, తె. 23).

కడ్డి[3]: చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారంగా వాడే పొడవాటి లోహపు చువ్వ. (తె. 2).

కడ్డి[4]: లోహపు వస్తువులను పట్టుకోడానికి వాడే పరికరం. (కో. 2, 6, 12).

కడ్డి[5]: ఉ. కడ్డీ. పర్యా. వంచురాడ్డు. లోహపు వస్తువుల వంపులను సరిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 7, 15, 17, 18; తె. 1; రా. 8).

కడ్డిస్టాండు: అగరువత్తులు వెలిగించి గుచ్చి ఉంచడానికి వాడే పరికరం. చూ. చిత్రం 2. (కో. 2).

కంటకొయ్య: పర్యా. గుంజ[1], సంగడికొయ్య, సూటింగు. సంగడి దిండును బిగించడానికి ఉపయోగించే 'V' ఆకారపు వంగల కొయ్య. (తె. 22).

కంటపుసలాకు: చూ. పర్యా. తేగ. తరిణి పట్టే టప్పుడు లోహపు వస్తువుకు షైనింగుతో తెగువ రావడానికి వాడే పరికరం. (కో. 7).

కంటం: లోహపు రేకుపై మార్కు వేయడానికి వాడే ఆక్సాబ్లేడు ముక్క. (కో. 21).

కంటాణి: చూ. కంటానీ. (కో. 21).

కంటానీ: రూ. కంటాణి, కంట్రానీ. చూ. పర్యా. లేగ. తరిణి పట్టేటప్పుడు లోహపు వస్తువుకు తెగువ రావడానికి వాడే పరికరం. (కో. 5, 16, 21).

కంటికి రెంపిలేగ: పాత్ర లోపల అడుగుభాగాన్ని మెరుగు పెట్టడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 27).

కంటిపోగరు: పర్యా. సక్కటివాలు. రేకు విగ్రహం చుట్టూ అంచు కొట్టడానికి ఉపయోగించే మొద్దు మేకు (కో. 3).

కంటుదిమ్మె: పర్యా. కమ్మరం[2], కుయ్య, పాదు, బుడ్డి[1], ముంత[2]. ఇరుసును అమర్చడానికి వాడే బండిచక్రం మధ్యలో ఉండే కొయ్యదిమ్మ. (రా. 4).

కంట్రానీ: చూ. కంటానీ. (కో. 28).

కంట్రోల్ సాకెటు: (< ఇం. Control socket). పర్యా. కంట్రోలు. బర్నర్ గిన్నె క్రింది భాగంలో బిగించిన స్క్రూ. మంటను అదుపుచేయడానికి ఉపయోగం. (కో. 26; తె. 6).

కంట్లకొయ్య: బిందె గొంతుభాగం సరిచేయడానికి వాడే పరికరం. (తె. 14, 16).

కంతాణి: రూ. కంతాని. పర్యా. కంతాణిలేగ, కంతానిచెక్క, నిహాని, పట్టాలేగ, పాలిష్‌కమ్మి, పాలిష్‌లేగ, పెద్దలాగ, పెద్దవంకలాగ, పైపట్టు కమ్మి, మెట్టుకన్న ఉలి, మెరుగుసదరం, లోహపు పాత్రలకు మెరుగు పట్టడానికి వాడే పరికరం. (కో. 5, 10, 14-16, 19, 20).

కతాణిలేగ: రూ. కంత్రానిలేగ. చూ. పర్యా. కంతాణి. లోహపు పాత్రలకు మెరుగు పట్టడానికి వాడే పరికరం. (కో. 16, 22).

కంతానీ: చూ. కంతాణి. (కో. 17, 23, 30; రా. 15).

కంతానిచెక్క: చూ. పర్యా. కంతాణి. లోహపు పాత్రలకు మెరుగు పెట్టడానికి వాడే పరికరం. (రా. 10).

కంతం: పర్యా. గల్ల[2], పీక[1]. లోహపు బిందె గొంతు భాగపు రేకు. (కో. 23; రా. 11, 13).

కంతంపోగర: పర్యా. కంత్రాని. రంధ్రాలు సరిచేయడానికి వాడే పరికరం. (కో. 21).

కంత్రాణిలేగ: చూ. కంతాణిలేగ. (కో. 26, 27).

కంత్రాని: చూ. పర్యా. కంతంపోగర. రంధ్రాలు సరిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 29).

కంత్రానిలాగు: పూర్తిగ మెరుగు వచ్చేందుకు బిందెల తరణి పనిలో వాడే మొద్దు పరికరం. (కో. 21).

కండక్టరు: (< ఇం. Conducto). కరెంటును ఒకచోటనుంచి మరొకచోటికి పంపడానికి ఉపయోగించే తీగ. (రా. 7).

కండింపు అచ్చు: కాల్చిన ఇనుమును ఖండించడానికి వాడే పరికరం. (రా. 2).

కతికలు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (తె. 28; రా. 8).

కత్తిరింపులుపెట్టు: (క్రి.) భాగాలను అతకడానికి వీలుగా రేకుపై చిన్న కత్తిరింపులు చేయడం. (తె. 1).

కత్తి[1]: పర్యా. చాకు[1], తక్కారీకత్తి, బతాయి, బత్తాయి చాకు[1], బ్లేడు[1]. కూరగాయలు తరగడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 97. (కో. 4, 9, 23, 24; రా. 5, 11, 12).

కత్తి[2]: కట్టెలు నరకడానికి వాడే సాధనం. (కో. 4, 9, 23; రా. 14).

కత్తి[3]: అచ్చులపైన మట్టిని తీయడానికి వాడే సాధనం. (రా. 2).

కత్తి[4]: ఎద్దుదెక్కలు నరకడానికి వాడే సాధనం. (కో. 16).

కత్తి[5]: గొడుగు గుడ్డను కత్తిరించడానికి వాడే సాధనం. (కో. 20, 23; రా. 8).

కత్తి[6]: క్షౌరంచేసే పనిముట్టు. (తె. 8).

కత్తి[7]: రూ. కత్తిరి, కత్రి. పర్యా. ఖెంచి. లోహపు రేకులను కత్తిరించడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం. 33. (కో. 4, 9, 21, 23, 25, 26; తె. 1, 8, 9, 23; రా. 5, 15).

కత్తి[8]: పర్యా. చిప్పింగ్ హామరు, చీపింగ్ సుత్తి, చీపర్, చీపింగ్ సిజర్, బద్దె[4], బిసింగ్ హామర్, మంత్రదండం, వెల్డింగ్‌సుత్తి, సిప్పింగ్ శానం. వెల్డింగ్ ఉబ్బులను కొట్టడానికి వాడే పరికరం. (కో. 28).

కత్తిఅకురాయి: మూలభాగాల్లో సాపుచేయడానికి వాడే ఆకురాయి. (కో. 18).

కత్తికంటానీ: విగ్రహంలోభాగాన్ని మెరుగువేయడానికి వాడేపరికరం. (కో. 7, 12).

కత్తిపీట: పర్యా. ఈలపెట్టె, ఈలకత్తి, ఈలపీట,

కొడలి. కూరగాయలు తరగడానికి వాడేసాధనం. చూ. చిత్రం. 39. (కో. 1, 4, 9, 15, 17‒24, 28; తె. 21‒24; రా. 2, 4, 7, 11, 12).

కత్తిరి: ఉ. కత్తెర. చూ. కత్తి⁷. (కో. 1, 3‒30; తె. 1‒9, 15, 17‒20, 22‒24, 25).

కత్తితేగ: పాత్ర చిన్నభాగాలవద్ద మెరుగుపెట్టడానికి వాడే సూదిలాంటి పరికరం. (కో. 28).

కత్తిమొల: పర్యా. గంటపోగర, గుటమొల, గూటిక, గూటికమొల, దట్నపోగర, పలకకడ్డీ, పాతిపోగరు, పాతిలోతకడ్డీ, పెద్దగుట్టలమొల, పెద్దపాలుమొల, బాల్‌పెన్‌హామరు, బెజ్జంపోగర, ముతకపోగర, మూలపోగారు, రాడ్డు¹, రింగుపోగర, రొంపుదట్న పోగరి, రౌనుకుసి, రౌనుపోగర, లావుపోగర, వంపుసక్కడిమొల, వంపుసక్కటివాలు. లోహపు రేకులను కత్తిరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడేపరికరం. (తె. 17).

కత్తెర: పర్యా. కటరు. కత్తిరించడానికి ఉపయోగించే పనిముట్టు. అపరేషన్‌లు చేయడానికి కూడ ఉపయోగం. చూ. చిత్రం. 40. (కో. 23, 29; తె. 4‒6, 17).

కత్తెరపెట్టు: (క్రి.) రేకును కత్తిరించడం. (తె. 14).

కత్తెరబోను: ఉ. కత్తిరిబోను. ఎలుకల్నిపట్టడానికి ఉపయోగించే పరికరం. ఎదురెదురు పండ్లుంటాయి వాటిమధ్యలో ఎలుకపడినపుడు స్ప్రింగు ఊడిపోయి బిగించుకొనిపోయి ఎలుక చచ్చిపోతుంది. (కో. 4, 13, 14, 17; తె. 22).

కత్రి: చూ. కత్తి⁷. (రా. 14).

కదలగొట్టు: (క్రి.) మట్టితోగట్టిగ ఉండే అచ్చును ఊడగొట్టడం. (కో. 24).

కదింపు¹: (క్రి.) బిందెఅంచును [illegible] (కో. 8; తె. 6).

కదింపు²: బిందెగొంతు కిందిభాగం. (కో. 2)

కదింపువేయు: (క్రి) బిందెను గాడిచేయడం (కో. 10).

కదింపుసుత్తి: బిందెగొంతుభాగాన్ని గాడిచేయడానికి వాడేపరికరం. (కో. 6, 10, 11, 12,).

కదుపు: (క్రి.) లోపలిపాత్ర అచ్చునుపైకి తీయడానికి చుట్టూఉండే కొయ్యఅచ్చును మెల్లగాకదలించడం. (కో. 22).

కనికపుల్ల పర్యా. పలకపుల్ల, పొలవుపుల్ల, బలపం, సుద్ద. రేకులపై, కడ్డీలపై గుర్తులు పెట్టడానికివాడే సుద్దముక్క. (కో. 19, 24).

కనుమూలు: విగ్రహం కన్నుభాగాన్ని చెక్కడానికి ఉపయోగించే సాధనం. (తె. 8, 9, 13).

కనెక్టింగుపిన్ను: (< ఇం. Cannecting Pin). కత్తిని తయారుచేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 7).

కన్నం: పర్యా. ఓలు, కోరిమయం, గాలి², చెల్లు, దొంక¹, తాడుకట్టు, తాళు, తూటు, తూము, తొల, దవ్వ, దుంక, నిలవ, పుల్లి³, పైరంధ్రం, పోతదొడ్డి², పోతమాత, పోతమూలు, బర్మల్, బురక, బెజ్జం, బొక్క, బొడ్డిమొల, బొర్ర, బ్లోవల్వు, రంధ్రం, వాయిదారు, సందు, సొరగు, 1. అతికినపాత్రలకుండే రంధ్రం. 2. పోతలోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి ఏర్పాటుచేసిన రంధ్రం. (కో. 20, 23).

కన్నాకట్టు: గల్లలు తయారుచేయడానికి వాడే ఒకవైపు కూచిగ ఉండేపనిముట్టు. (కో. 20).

కన్నిమిరియం: చేసినకత్తిని శుద్ధంచేయడానికి వాడే సాధనం. (కో. 2).

కన్ను: కరవాయిపైభాగం. (కో. 2).

కన్నుపోగర: విగ్రహంపనిలో గోర్లుచెక్కడానికి వాడేపరికరం. (కో. 10).

కన్నుమొల: పర్యా. సున్నపోగర. రేకుపై కన్ను మాదిరి గుండ్రంగా వలయాలు చెక్కడానికి, శిల్పి పనిలోవాడే పనిముట్టు. దీని అడుగుభాగం కొద్దిగ లోపలికి నొక్కబడి గుండ్రంగా ఉంటుంది. (తె. 17, 26).

కన్నుసుత్తి: మల్‌కటు చేయడానికి వాడే పరికరం. (కో. 5).

కందిలి: (కండిల్ < ఇం. Candle) ఇండ్లలో వెలుతురు కోసం ఉపయోగించే చిన్నలాంతరు. (తె. 4, 6).

క[illegible]స్టాండు. (< ఇం. [illegible] Stand). [illegible] పెట్టుకోడానికి ఉపయోగించే స్టాండు. (రా. 7).

కప్పు¹. పర్యా. క్యాపు, క్లిప్పు¹, షల్లరింగు. గొడుగును మూసినప్పుడు పుల్లలను పట్టిఉంచడానికి వాడే రింగులాంటి పరికరం. (తె. 5).

కప్పు²: పర్యా. క్యాపు, గిన్ని, టోపను², టోపి², తగడిటోపను. గుడ్డజారిపోకుండా, నీళ్ళుదిగకుండా ఉండటానికి గొడుగుపైభాగాన అమర్చిన చిన్నరేకు తొడుగు. (కో. 27, 29; తె. 5).

కప్పు³: చూ. పర్యా. ఎన్నమూత. దాటరీలు వెలుపలికి రాకుండ బాడీకిఉండే బిరడ. (తె. 22).

కప్పు[4] : పర్యా. గిన్నె[4]. కూరలు ఉంచుకోడానికి వాడే చిన్నలోహపుగిన్నె. సైజువారీగా ఉంటాయి. చిన్న పిల్లలకు అన్నం తినిపించడానికి కూడ ఉపయోగం. (కో. 24; తె. 12, 13).

కప్పు[5] : నొక్కబడిన ఇరుసుదొలుపు భాగం. (తె. 21).

కప్పు[6] : (క్రి.) పెట్టె అడుగుభాగంపై మీదభాగాన్ని సమంగా బిగించడం. (కో. 17).

కప్పుగరిట: కూరలు వడ్డించుకోడానికి వాడేస్పూను. (కో. 7).

కప్పుగిన్నె: చూ. పర్యా. కటోరి. పెరుగు పోసుకోడానికి ఉపయోగించే చిన్నపాత్ర. (కో. 4, 9).

కప్పుగీయు: (క్రి.) మట్టిఅచ్చులజాయింట్లు కనబడకుండ పుల్లతో సరిచేయడం. (కో. 20).

కప్పుపోగర: సైకిల్ అబ్బులు ఊడదీయటానికి వాడే పరికరం. (కో. 14).

కప్పులకారేజి: భోజనం తీసుకెళ్ళడానికి ఉపయోగించే నాల్గు లేదా అయిదు గిన్నెలున్న, లోహపుపాత్ర. చూ. చిత్రం. 41. (కో. 30).

కప్పులమట్టం: ఇనుప ముక్కల్ని వంపుపెట్టడానికి కమ్మరం పనిలో వాడే సుత్తిలాంటి పనిముట్టు. (తె. 23, 24).

కప్పువంపు: బీరువా తలుపులు సరిగా కూర్చోడానికి చేసిన గాడి. (కో. 21).

కప్పుసాసరి: (< ఇం. Cup saucer). కాఫీ, టీ మొదలయినవి త్రాగడానికి వాడే చిన్న స్టీలుగిన్నె, చిన్నప్లేటు. చూ. చిత్రం. 42). (కో. 1, 2, 13, 16, 28; తె. 22; రా. 7).

కబ్జాలు: పర్యా. బందులు. పెట్టె అడుగుభాగాన్ని, మూతభాగాన్ని కలిపే సన్ననికీళ్ళు. (కో. 22, 26, 28).

కమ్‌కట్‌దబ్బ: పెట్టెకు బార్ కొట్టడానికి ఉపయోగించే పనిముట్టు. (రా. 11).

కమర్‌నుత్తి: వెల్డింగ్ పనిలో వంపులు తీయడానికి ఉపయోగించే పరికరం. (కో. 15).

కమల్‌సోపు: పర్యా. బ్రాస్‌సబ్బు, పాలిష్‌కేకు, పాలిష్‌సోపు, లోహపు వస్తువులపై పాలిష్ చేయడానికి ఉపయోగపడే సబ్బు. (తె. 17).

కమలహస్తం: లోహంతో చేసిన దేవుని కుడిచెయ్యి. (కో. 16).

కమలం: అన్నం కొలవడానికి వాడేపాత్ర. జమిందారుల ఇళ్ళలో వాడ్తారు. చూ. చిత్రం. 43. (కో. 22).

కమలంగిన్నె: క్రింద కుదురుతో వంగిన అంచుతో ఎనిమిది పలకలతో కమలం ఆకారంతో సాపుగా నగిషీ ఉండే లోహపు పాత్ర, (కో. 12, 13, 15, 21; రా. 7, 8).

కమండలం: మునులు ధరించే లోహపు చెంబు. (కో. 19, 22; తె. 21).

కమాన్‌ముక్క: లేగలు రుద్దడానికి ఉపయోగించే పరికరం. (కో. 4, 9).

కమాని: పర్యా. బందోబస్తు. పెట్టెను తెరచినపుడు మూత పడిపోకుండ ఉండడానికి ఇరుమూలల అమర్చిన పట్టీ(లు). (కో. 22, 23, 26, 28; తె. 6).

కమాన్లు: (ఏ.) కమాను. పర్యా. గజం[8], చక్రి పుల్లలు, పుల్లలసెట్, పుల్లలు[1]. గొడుగులో ఉండే సన్నని ఇనపకడ్డీలు. (కో. 18-27; తె. 4).

కమ్చి: (హిం.) చూ. పర్యా. కుక్కారు. బండి చక్రానికి పట్టాలను గుంజడానికి ఉపయోగించే పనిముట్టు. (తె. 7).

కమ్మరకారు: రూ. కమ్మరంకారు. పర్యా. కమ్మర పట్టుకారు, కొలిమికారు, గత్త, శానపుకట్టు, శానంకారు, శానంపట్టకారు, చాపకచిప్ప, చిప్ప, చేతికారు, చేల్‌పట్టకార, టాంగ్, తనంపట్టకార, తిన్నటికారు, పట్టకారు[1], పెద్దపట్టకారు, బిగాంబర్, రౌండుకారు, శానంబద్ది, శానంమట్ట, సక్కని పట్టకార. అతికేటప్పుడు లోహపు పాత్రలు పట్టుకోడానికి, సాగ్గొట్టేటప్పుడు కాలిన లోహపు ముక్కలను పట్టుకోడానికి, తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి, కరిగిన లోహాన్ని, అచ్చులో పోసేటప్పుడు మూసను పట్టుకోడానికి వాడే పట్టకార. చూ. చిత్రం. 147. (కో. 18-28; తె. 1, 3, 6-9, 13-18, 22, 25, 26).

కమ్మర పట్టకారు: చూ. పర్యా. కమ్మరం పట్టకారు. అతికేటప్పుడు లోహపు పాత్రలు పట్టుకోడానికి, తెగ్గొట్టేటప్పుడు లోహపు కడ్డీలను పట్టుకోడానికి వాడే సాధనం. చూ. చిత్రం 147. (తె. 2, 3).

కమ్మరసుత్తె: ఉ. కమ్మరసుత్తి, కమ్మరిసుత్తీ. రూ. కమ్మరంసుత్తె. పర్యా. కచ్‌సుత్తె, బల్లింపుసుత్తె, బొద్దుచదరం, బొద్దుసుత్తి. లోహపు రేకులను సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 12, 13, 15-19, 21, 22, 25, 29; తె. 17, 19, 21, 22, 24).

కమ్మరం: పర్యా. కమ్మరంపని, కొలిమిపని, పచ్చి

పని, మోటపని. లోహాలతో పాత్రలను, పనిముట్లను తయారుచేసే పని. (కో. 20, 21, 23–25, 27, 29; రా. 16).

కమ్మరం[2]: చూ. పర్యా. కంటుదిమ్మె. ఇరుసును అమర్చడానికి వాడే కొయ్యదిమ్మ. బండిచక్రం మధ్యలో ఉంటుంది. (కో. 29).

కమ్మరంకారు: చూ. కమ్మకారు. (కో. 20, 22, 25, 27).

కమ్మరంపని: చూ. పర్యా. కమ్మరం[1]. లోహాలతో పాత్రలను, పనిముట్లను తయారుచేసే పని. (కో. 27, 29).

కమ్మరంసుత్తె: చూ. కమ్మరసుత్తె. (కో. 17, 21; తె. 19, 21).

కమ్మాకురాయి: లోహపు వస్తువు తయారయిన, తర్వాత అతుకులదగ్గర సాపు రాసుకోడానికి వాడే పరికరం (కో. 15).

కమ్మి[1]: పర్యా. పయ్య[1]. బండిచక్రంచుట్టూవేసే ఇనపబద్ద. (కో. 14, 21; తె. 1, 18).

కమ్మి[2]: పర్యా. కమ్మికడ్డి. పిన్ను[1], బెండింగ్ రాడ్, రాడ్డు[2]. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడే మోపు. (కో. 2, 4, 13, 19–21, 29, 30; రా. 4, 5, 10, 16).

కమ్మి[3]: అచ్చులచుట్టూ ఉండే మట్టిని శుభ్రంగా తీసివేయడానికి వాడే పలచని రేకు. (కో. 19).

కమ్మి[4]: రివట్లను లాగించడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 23).

కమ్మి ఆకురాయి: విగ్రహం పూర్తయిన తర్వాత అతుకులు సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 18).

కమ్మికట్టు: (క్రి.) బకెట్, డబ్బాల అంచులు గట్టిగా ఉండటానికి కడ్డీవేసి దిమ్మలాగ చేయడం. (తె. 21).

కమ్మికడ్డి: చూ. పర్యా. కమ్మి[2]. పెట్టెకు రివిట్లు కొట్టడానికి వాడే పరికరం. (రా. 8).

కమ్మిడి: మెటల్‌ను పాలిష్ చేయడానికి వాడే సాధనం. (రా. 2).

కమ్మిపట్ట: అడుగురేకులను చక్కగ చేయడానికి రోకలికి బదులుగా వాడే సాధనం. (రా. 15).

కమ్మిపట్టుకారు: కాగిన ఇనపలోహాన్ని పట్టుకోడానికి వాడే సాధనం. (రా. 3).

కమ్మిబిందె: నీళ్ళు తెచ్చుకోడానికి వాడే కడ్డీలాంటి అంచుకలిగిన లోహపు బిందె. (కో. 21).

కమ్మిముక్క: గొడుగుల రిపేరుపనిలో ఉపయోగించే మోపు. (కో. 30).

కమ్ము: పర్యా. పట్టా, రిమ్ము. బండిచక్రానికి చుట్టూ వాడే ఇనపబద్ద. (రా. 14).

కమ్ము: (క్రి.) పూర్తయిన పెట్టెను, డ్రమ్మును మెరకపల్లాలు లేకుండ సమంగా సరిచేయడం. (కో. 17).

కమ్ములు: పర్యా. పుల్లలు[2], పోక్సులు, పైయల్. సైకిలుకు అమర్చిన చిన్న కడ్డీలు. (రా. 8).

కంపక్స్: చూ. కంపాసు[2]. (కో. 22).

కంపచ్చు: చూ. కంపాసు[2]. (కో. 16).

కంపన్సు: చూ. కంపాసు[2]. (కో. 20).

కంపర్‌బాక్సు: పర్యా. కంపాసు[2], కైవడి[2], కైవారం కత్తిరి. లోహపురేకుపై, పట్టీపై గుండ్రని గీతలు గీయడానికి వాడే పరికరం. (కో. 19).

కంపర్స్: చూ. కంపాసు[2]. (కో. 21. 26–28).

కంపాసు[1]: పర్యా. కైవడి[1]. పెట్టెమూత నిలబెట్టడానికి అడుగుభాగంపైన ఉండే కీలు. (కో. 2, 10; తె. 17, 21; రా. 4).

కంపాసు[2]: (< ఇం. Compass). ఉ. కంపాస్, కొంపాస్, రూ. కంపక్స్, కంపచ్చు, కంపన్సు, కంపర్స్. పర్యా. కైవారం. రేకుపై పట్టీపై గుండ్రంగా గీతలు గీయడానికి వాడే పరికరం. (కో. 2, 5, 15–23, 25, 28; తె. 12, 15, 22; రా. 1, 3, 4).

కంపాసుపోగరు: ఇనుపరేకులపై రంధ్రాలు వేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 5).

కంపెనీకత్తి: (< ఇం. Company + కత్తి). చూ. పర్యా. కంపెనీకత్తెర. కంపెనీవాళ్ళు తయారుచేసిన షేవింగుకత్తి. (తె. 22).

కంపెనీకత్తెర: (< ఇం. Company + కత్తెర). పర్యా. కంపెనీకత్తి. కంపెనీవాళ్ళు తయారుచేసిన షేవింగు కత్తి. (తె. 24).

కంప్రెసరు: (< ఇం. Compressure). బీరువాలకు, మంచాలకు, కుర్చీలకు పెయింట్ వేయడానికి ఉపయోగించే మిషన్. (రా. 3).

కప్లింగు: (< ఇం. Cuppling). కడ్డీలను బెండింగ్ చేయడానికి వాడే సాధనం. (రా. 14).

కంబాసు: మూతపడకుండ ఉండటానికి పెట్టెలు మొదలైనవాటి ప్రక్కలలో అమర్చిన నిర్మాణం. (రా. 10).

కంబి: కొలిమిదగ్గర బొగ్గులు ఎగదోయడానికివాడే ఇనుప పరికరం. (రా. 11).

కంబిదేగ్చా: అంచుచుట్టూ లావుపాటి కడ్డీబిగించి ఉన్న లోహపుపాత్ర. పాయసంవండటానికి వాడ్తారు. (రా. 11).

కంబుడ్డీ: మూతివెడల్పుగా మిగతభాగం గుండ్రంగా ఉన్న లోహపుబిందె. (కో. 20).

కయ్యి¹: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డరింగ్ చేయడానికివాడే ఇనపకమ్మి పరికరం. (రా. 15).

కయ్యి²: చూ. ఖడియా. (రా. 15).

కరగబెట్టు: (క్రి.) కొలిమిలో లోహపుపాత్రలను కరగబెట్టడం. (తె. 8).

కరడుమట్టు: పర్యా. మట్టన, మట్నపని. పోత పాత్రలను సాపు చేసేపని. (తె. 22).

కరవడి: పాలిష్‌పెట్టని మైలఉన్నబిందె. (తె. 3).

కరవడిచేయు: (క్రి.) లోహపుపాత్రలను నైసు చేయడం. (కో. 13).

కరవడిలేగ: బిందెపైమైలను పోగొట్టడానికి పాలిష్ పనిలోవాడే పరికరం. (తె. 3).

కరవడిసుత్తి: చెంబులకు అందాలుతీర్చిన తర్వాత సాపుకొట్టడానికివాడే పనిముట్టు. (కో. 10, 17).

కరవాయి: ఉ. కరువాయి. చూ. కరవై. పర్యా. పట్టాకరవాయి, వంపుగడారు, సాదాఇరుసుకరవాయి, సాదాకరవాయి, సాపుకరవాయి. లోహపుపాత్రలను సాపుచేయడానికి వాడేపరికరం. (కో. 2, 4, 10, 11, 14, 16, 17, 19, 21, 24-26, 28; తె. 5, 17, 19, 20, 22, 26; రా. 3. 8, 11).

కరవాయిసుత్తి: వాటేసినతర్వాత కొట్టడానికివాడే బొద్దుగా ఉండే పనిముట్టు. ఒక అంగుళంరేకు రెండంగుళాలుగా పెరుగుతుంది. దీనితోకొడితే. (కో. 2).

కరవై: చూ. కరవాయి. (రా. 10, 11, 13, 15, 25).

కరంజికట్టర్: (< కరంజి + ఇం. Cutter). చూ. పర్యా. కజ్జిగ—కట్టరు. కజ్జికాయలు చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 36. (కో. 6, 11).

కరండి: < తమిళం-కరండి. చూ. పర్యా. హస్తం. అన్నంవడ్డించడానికి ఉపయోగపడే చేయిగరిటె. చూ. చిత్రం. 223. (కో. 14).

కరారు: ఎద్దులచర్మాన్ని దువ్వడానికివాడే సాధనం. (తె. 1).

కరాసుకాగితం: చూ. పర్యా. ఎమరిపేపరు. మెరుగుపెట్టినపాత్రను నున్నగచేయడానికివాడే గరుకు పేపరు. (కో. 21, 24)

కరిపించు: (క్రి.) పర్యా. కరిపివేయు. రేకులను పట్లుచేసి ఒకదానికొకటి అతికడం. (రా. 14).

కరిపేయు: (క్రి.) పైప్‌లో రంధ్రంపడిఉంటే రబ్బరు పెట్టి కరిపించడం. (కో. 3).

కరివిడిపట్టు: (క్రి.) చూ. పర్యా. ఏట్లుపేయు. పూర్తయిన లోహపుపాత్రను మెరుగుపెట్టడం. (కో. 29).

కరీడబ్బా: కూరలకు ఉపయోగించే లోహపుపాత్ర. (కో. 5, 17).

కరు: (బ.) కరులు. టింకరుపనిలో చిల్లులుపోయిన పాత్రలను, డబ్బాలను అతికేపనిముట్టు. (కో. 1,2).

కరుకురాయి: వెల్డింగ్‌పనిలో ఉపయోగపడే సానరాయి. (రా. 10).

కరుగకట్టు: (క్రి.) లోహపు అచ్చులను మట్టి అచ్చు లాగా మూసలాగా చేయడం. (రా. 5).

కరుగు¹: ఎండిన, లోహపు ఆకారం కలిగిన మట్టి అచ్చు. (రా. 2, 5).

కరుగు²: కొలిమిలో అగ్గివల్ల లోహపు వస్తువులు కరగడం. (రా. 1, 6).

కరుగుకొలిమి: రూ. కరుగ్గొలిమి. పర్యా. కరుంగోలు దుకాణం, కాసుకొలిమి, కుమ్మరం, కొలిమి, చేకొలిమి, దుకాణం, దొడ్డి¹, పొయ్యి³, పోత కొలిమి, బట్టి¹. లోహాలను వేడి చేయించడానికి ఉపయోగించే పొయ్యి. చూ. చిత్రం. 69. (తె. 3).

కరుగుదల: కరిగిన అల్యూమినియం లోహం. (కో. 24).

కరుగ్గొలిమి: ఉ. కరగ్గొలిమి. చూ. కరుగుకొలిమి. (తె. 17, 19, 22, 23, 26).

కరుగ్గొలిమిసలాక: మూస లోపలి లోహాన్ని కలబెట్టడానికి వాడే పొడవుకడ్డీ. (తె. 22).

కరుసుకొను: (క్రి.) కడ్డీరేకుకు అతుక్కోవడం. (తె. 1).

కరుంగోలు దుకాణం: చూ. పర్యా. కరుగుకొలిమి. లోహాలను వేడి చేయటానికి ఉపయోగించే పొయ్యి. చూ. చిత్రం. 69. (కో. 29).

కరెంటుచక్రం: (< ఇం. Current + చక్రం). అల్యూమినియం పాత్రలు పాలిష్ వేయడానికి వాడే పరికరం. (కో. 4).

కరెంటు డ్రిల్‌మిషన్: (< ఇం. Current drill machine). పర్యా. డ్రిల్‌చెక్క, డ్రిల్‌బాత్, డ్రిల్లింగ్, డ్రిల్లింగ్ మోటారు, డ్రిల్లుమిషన్, బర్మ, జేన్‌డ్రిల్లు. లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలేయడానికి వాడే కరెంటు యంత్రం. (తె. 8, 9).

కర్చిసలాక[1]: చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనంపై నుండి తీయడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 5. (తె. 4, 6, 7).

కర్చిసలాక[2]: చూ. పర్యా. కూరగరిటె. కూరలు వడ్డించటానికి వాడే పరికరం. చూ. చిత్రం. 63. (తె. 14–16).

కర్ణకుండలాలు: జంతువు తలకాయ మాదిరి ఉండే కర్ణాభరణాలు. (కో. 2).

కర్పూరహారతి ప్లేటు: (< కర్పూరహారతి + ఇం. plate). దేవునికి హారతిపట్టే పళ్ళెం. (కో. 1).

కర్ర[1]: చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారంగా ఉపయోగించే పొడవాటి కడ్డీ. (కో. 23, 29, 30; తె. 20, 22, 25).

కర్ర[2]: మిషన్‌పై రేకును అవుటు తీయడానికి ఉపయోగించే సాధనం. (కో. 22).

కర్రగూటం: పర్యా. కర్రముక్క, కూరుకర్ర, కూర్చేకట్టె, గునపం[3], గూటం[4], దబ్బెకొర్రు, దుడ్డు, అచ్చుల్లో మట్టిని కూరడానికి వాడే సాధనం. (కో. 28).

కర్రచెక్క: చూ. పర్యా. అడమొద్దు. లోహపు పట్టా కింద మోపుగవాడే కొయ్యదిమ్మ. (కో. 27).

కర్రదుడ్డు: చూ. పర్యా. అడమొద్దు. లోహపురేకులను వంచడానికి వాడే కొయ్యదిమ్మ. (కో. 23).

కర్రపొయ్యి: చూ. పర్యా. ఇనుపపొయ్యి. కట్టెలతో వంటచేయడానికి వాడే అర్ధచంద్రాకారపు నిలువు ఇనుపరేకు పొయ్యి. (కో. 22, 23).

కర్రముక్క: చూ. పర్యా. కర్రగూటం. అచ్చుల్లో మట్టిని కూరడానికి వాడే సాధనం. (కో. 11, 18).

కర్రసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకుల్ని గుంటగా కొట్టడానికి, పంపులు తీయడానికి, గాట్లను అణచడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 68. (కో. 4, 9–29; తె. 8–17, 20–22; రా. 7).

కర్రీస్‌తూగు: (< ఇం. Curries + తూగు). చూ. పర్యా. గుత్తిగిన్నె. నాలుగుగిన్నెలు కలిపి గుత్తిగా కడ్డీకి బిగించి ఉంటాయి. కూరలు వడ్డించడానికి ఉపయోగం. చూ. చిత్రం 87. (తె. 1).

కర్రీస్‌స్పూను: చూ. కర్రీస్పూను. (తె. 16).

కర్రీస్‌స్పూన్సు: చూ. కర్రీస్పూను. (తె. 14, 15).

కర్రీస్పూను: (< ఇం. Curry sp on). రూ. కర్రీస్‌స్పూను, కర్రీస్‌స్పూన్సు. కూరలు వడ్డించడానికి వాడే గరిట. (కో. 1).

కర్రు: నాగలికి తొడిగిన ఇనుపసాధనం. భూమిని దున్నడానికి ఉపయోగం. (తె. 4, 6).

కర్లు: చూ. పర్యా, గొడ్డలి. కట్టెలుకొట్టుకోడానికుపయోగించే ఇనపపరికరం. చూ. చిత్రం 90. (తె.5).

కలగొట్టు: (క్రి.) ఉ. కలెగొట్టు. పర్యా. కలుపు[1], దవన్ చేయు. పాత్రలకుండే రంధ్రాలను మూసేయడం. (కో. 19; తె. 2, 23. 26; రా. 15).

కలశంచెంబు: ఉ. కలశముచెంబు, కలిశముచెంబు, కలిశెంచెంబు. పర్యా. కలిశం. దేవునిదగ్గర కలశం పెట్టడానికివాడే చెంబు. చూ. చిత్రం 44. (తె. 21; రా. 11, 12, 14).

కలాయి: చూ. కడాయి. (కో. 17, 23, 24, 29, 30; తె. 21, 24, 25).

కలాయిగిన్నె: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికివాడే ఇరువైపుల పిడి అమర్చిన గోళం లాగఉండే లోహపుపాత్ర. చూ. చిత్రం 163. (కో. 26; తె. 18, 24).

కలాయిచేయు: (క్రి.) బిందెకు కలాయిపూయడం. (రా. 12).

కలాయిడేగ్చా: ఉ. కలాయిడేక్సా. రూ. కలాయిడేగిష. చూ. పర్యా. డేక్షా. వంటలుచేయడానికి వాడే లోహపు పాత్ర. ఏటవాలు భుజాలతో అడుగుభాగం వెడల్పుగా ఉంటుంది. చూ. చిత్రం 123. (తె. 5, 24).

కలాయిడేగిష: చూ. కలాయిడేక్షా. (తె. 25).

కలాయిపని: చూ. కళాయిపని. (తె. 2).

కలాయిసోల: ఉ. కలయ్‌సోల. చూ, కళాయిసోల. (తె. 17, 22, 23, 25).

కలాంసీసం: కళాయికి ఉపయోగపడే పదార్థం. (రా.3).

కలిగినసెట్టు: (బ్రాహ్మణులు) పచ్చడిచేసుకొని తినడానికివాడే '∪' ఆకారంగిన్నె. ఇందులోపచ్చడి 7 రోజులుదాకా పెట్టుకోవచ్చు (కో. 2).

కలిశం: రూ. కళశం. చూ. పర్యా. కలశంచెంబు. దేవునిదగ్గర తీర్థం ఉంచుకోడానికివాడే చెంబు. చూ. చిత్రం 44. (కో. 5).

కలిశెదీపార్తి: దేవునిమూలలో ఎల్లప్పుడు దీపం వెలిగించడానికి వాడేపరికరం. (తె. 21).

కలుపు[1]: (క్రి.) చూ. పర్యా. కలగొట్టు. పాత్రలకుండే రంధ్రాలను మూసేయడం. (కో. 19; రా. 14).

కలుపు[2]: (క్రి.) సానపట్టేముందు కత్తిని చక్కగ చేయడం. (రా. 12).

కలుపు[3]: అచ్చుకట్టడానికి మట్టిని మెత్తగాకలపడం. (తె. 22; రా. 5).

కల్డింగ్: చూ. పర్యా. లింగంకాయ. లింగాయితులు

మెడలో ధరించే లింగంకాయ. (రా. 12).

కత్తిఅద్దు: (క్రి.) మట్టిచుక్కలు కనబడటానికి పాత్రపై మసిపూయడం. (కో. 29).

కత్పెల్: జుట్టు కత్తిరించడానికివాడే కత్తెరలాంటి పరికరం. (తె. 10, 11).

కల్లి: రెండు గొడుగుపుల్లల మధ్యఉండే గొడుగుగుడ్డ. (కో. 27).

కళశం: చూ. కలశం. (రా. 15).

కళాయి[1]: ఉ. కళాయ్. చూ. కడాయి. (కో. 18, 22; తె. 20, 22; రా. 6, 7).

కళాయి[2]: పాత్రకు చిలుంలేకుండా చేయడానికివాడే నవాచారం, తగరం, సీసం, ద్రావకంకలిపి వేడిచేసిన పదార్థం. (కో. 1, 2, 4, 5, 17; రా. 2, 3, 5, 6).

కళాయిగిన్నె: పర్యా. కళాయిసోల, కుళగ[1]. చారుగిన్నె[1], పొడుగుకూరపుగిన్నె. పొడుగుగిన్నె. సోల, సోలగిన్నె. కూరలు నిల్వ ఉంచుకోడానికివాడే పొడవైన లోహపుపాత్ర. (కో. 16, 18–20).

కళాయిడేగ్చా: నీళ్ళుతెచ్చుకోవడానికి, అన్నం వండుకోవడానికి, ఉపయోగించే లోహపుపాత్ర. (కో. 1, రా. 8).

కళాయిపని: రూ. కలాయిపని. పర్యా. మాట్లుపని. పాత్రలు రిపేరుచేసి, చిలుంపట్టకుండా ఉండటానికి కళాయి వేసేపని. (కో. 5; రా. 3, 5).

కళాయిపైపు: (< కళాయి + ఇం. Pipe). వడ్లద్రమ్మ్ గొంతుభాగాన్ని వంచడానికి వాడేసాధనం. (రా. 1).

కళాయిసోల: ఉ. కళాయిసోలా. రూ. కలాయిసోల. చూ. పర్యా. కళాయిగిన్నె. నీళ్ళుతాగడానికి, కూరలు వేసుకోవడానికి ఉపయోగించే పొడవైన లోహపు పాత్ర. (కో. 6, 8, 10, 11).

కళ్ళచక్రం: చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనె లోనుండి పిండివంటకాలు తీయడానికి వాడేపరికరం. చూ. చిత్రం 107. (కో. 28).

కళ్ళజంగిడి: చూ. పర్యా. అన్నంబుట్ట. బియ్యం, ఉడికిన కూరగాయలు వడబోసుకోవడానికి వాడే అడుగుభాగాన రంధ్రాలున్న లోహపుపాత్ర. చూ. చిత్రం 11. (కో. 28).

కళ్ళజోడు: కంటిఅద్దాలు. (కో. 15).

కళ్ళసిబ్బి: పర్యా. కాయవడి, జల్లిప్లేటు, సిబ్బి[3]. అన్నాన్ని, ఉడకబెట్టిన కాయగూరలను వార్చడానికి వాడే సగభాగం రంధ్రాలు కలిగిన ప్లేటు. (కో. 22).

కవచ కిరీటం: దేవుని విగ్రహం తలపై పెట్టడానికి వాడే మామూలు తొడుగు. (కో. 2).

కవచ కుండలాలు: చవక కాయలాగా ఉండే సాధనాలు. కవచానికి అలంకరించడానికి ఉపయోగం. (కో. 2).

కవచం: రూ. కొవచ. పర్యా. తొడుగు[4], వంచెస్తలం, సర్వాంగం. దేవుని విగ్రహానికి ముఖం తప్పించి మిగతా శరీర భాగమంతటకీ వేసిన లోహపు తొడుగువస్త్రం. (కో. 8, 11, 12, 13, 16, 18, 20, 28; తె. 1, 3; రా. 11).

కవర్త్రాళ్: అలగా త్రిపై ఉన్న పొరలు. (రా. 5).

కవరింగు: (< ఇం. Covering). బట్టీలో పెట్టుకోడానికి వాడే తీగలాగ ఉండే పరికరం. (కో. 10).

కవరు[1]: (< ఇం. Cover). పర్యా. గ్లోస్, దస్తానా, బ్లౌజ్, హాండ్గ్లోజ్. వెల్డింగ్ చేసేటప్పుడు కరెంటు షాక్ కొట్టకుండా చేతులకు వేసుకొనే చర్మపు తొడుగు. (తె. 5).

కవరు[2]: పర్యా. చొక్కా, ఛందన్, ప్లాస్టిక్, లేబుల్, వాచరు, శుక్రం. గొడుగు లోపలికి నీరు పోకుండ పైభాగాన అమర్చిన చిన్న ప్లాస్టిక్బట్ట. (తె. 1).

కవరు[3]: (బ.) కవర్లు, కవర్సు. పర్యా. కూర ప్లేటు, డక్కను, డబరామూత, డిజైను ప్లేటు, మూత[2], రికాబు[1]. పాత్రలపై మూతగావాడే పళ్ళెం. (కో. 4, 10, 14, 15, 17, 22, 23; తె. 19, 22, 24; రా. 13).

కవరుకట్టు: (క్రి.) (< ఇం. Cover + కట్టు). పోత విగ్రహం తయారుకావడానికి అచ్చువిగ్రహంపైన మూడుపూతలు మట్టిని గట్టిగ అంటించడం. కరిగిన లోహాన్ని అచ్చులో పోసినపుడు మైనం కరగి బయటికి రాగా కవరు మాత్రమే మిగుల్తుంది. (తె. 17).

కవరుబూడిద: పర్యా. ఉనుకబూడిద, పరుపుబూడిద, పిడకలబూడిద, బుగ్గు, బూడిద, బొగ్గు బూడిద. అచ్చుకు మన్ను అంటుకోకుండా ఉండడానికి చల్లే పొడి. (కో. 20).

కవరుబోల్టు: (< ఇం. Cover bolt). మూసినపుడు తలుపులు రాకుండ బిగించడానికి వాడే చిలుకు. (తె. 17).

కవంగము: చూ. పర్యా. పంపు[3]. డ్రమ్ములోనుండి నూనెను పైకి తోడుకోడానికి ఉపయోగపడే సాధనం. (రా. 13).

కవురికొట్టు: (< ఇం. Cover + కొట్టు). బిందెపై చిన్నచిన్న బుడిపెలు అలంకరణకోసం కొట్టడం,

(కో. 20).

కవ్వం: ఉ. సల్లకవ్వం. పర్యా. చల్లకవ్వం, చల్లగిటి, చల్లచిక్కం, మజ్జిగకవ్వం. రవి. మజ్జిగ చిలకడానికి వాడే సాధనం. చూ. చిత్రం 45. (కో. 4, 5, 22, 27, 28, 30; తె. 3, 6, 17, 19).

కసండి: సద్దికి వాడే పెద్ద లోహపుచెంబు. (తె. 12).

కసిక: ఇనప వస్తువులను గాడిగా నొక్కడానికి వాడే పరికరం. (రా. 6).

కాక: కొలిమిలోని అగ్గివేడిమి. ఇనప ముక్కల్ని ఎర్రగా కాల్చడానికి ఉపయోగం. (కో. 2, 20, 24; తె 8; రా. 6, 10).

కాక ఎక్కు: (క్రి.) పర్యా. కాకచేయు, కాకతీయు, కాకపెట్టు, కాకలు కాల్చు, కాయు[3], జిర్రగ తీయు, కాకబట్టు' ఇనుమును సాగ్గొట్టడానికి, అతకడానికి వీలుగా కొలిమిలో ఎర్రగ కాల్చడం. (తె. 18; రా. 11).

కాకచేయు: (క్రి.) చూ. పర్యా. కాక ఎక్కు. ఇనుమును సాగ్గొట్టడానికి వీలుగా కొలిమిలో ఎర్రగా కాల్చడం. (రా. 11, 15).

కాకతీయు[1]: (క్రి.) చూ. పర్యా. కాక ఎక్కు. ఇనుమును సాగ్గొట్టడానికి వీలుగా కొలిమిలో ఎర్రగా కాల్చడం. (తె. 3, 7, 16, 17, 19).

కాకతీయు[2]: చూ. పర్యా. అతుకు. రెండు లోహపు కమ్ములను కలిపి కాల్చి ఒకటిగ గుండ్రంగా అతకడం. (కో. 28).

కాకపట్టు: (క్రి.) చూ. కాకపెట్టు. (తె. 1).

కాకపెట్టు: (క్రి.) రూ. కాకపట్టు. చూ. పర్యా. కాక ఎక్కు. ఇనుమును సాగ్గొట్టడానికి, అతకడానికి వీలుగా కొలిమిలో ఎర్రగ కాల్చడం. (తె. 18).

కాకలుకాల్చు: (క్రి.) చూ. పర్యా. కాక ఎక్కు. ఇనుమును సాగ్గొట్టడానికి వీలుగా కొలిమిలో ఎర్రగ కాల్చడం. (కో. 20).

కాకశానం: వేడిగా ఉన్న లోహపు ముక్కలను తెగ్గొట్టే పనిముట్టు. (కో. 17).

కాకినాడచెంబు: పర్యా. పోతచెంబు. మూతి పొడుగ్గా కూజా ఆకారమున్న చిన్న లోహపు పాత్ర. నీళ్ళు తాగడానికి వాడ్తారు. (తె. 7, 18; రా. 14).

కాకు: బిరడా. దీనిలోపల గట్టిగా ఉంచడానికి వాషరు ఉంటుంది. (తె. 5).

కాకెక్కు: (క్రి.) కొలిమిలో అగ్గి వేడెక్కడం. (కో. 5).

కాకేయు: (క్రి). సాగ్గొట్టడానికి వీలుగా ముడి ఇనుమును బాగా రెండుమూడుసార్లు ఎర్రగా కాల్చడం. (తె. 21).

కాగడా: స్టౌను వెలిగించడానికి ఉపయోగించే 'U' ఆకారపు కడ్డీ. (తె. 3, 22).

కాగపెట్టు: (క్రి.) పర్యా. గరమ్‌చేయు, తాపడంపెట్టు, మరిగపెట్టు, వేడిచేయు, సెగచేయు. కొలిమిలో లోహపు పాత్రల్ని, కడ్డీలను బాగా ఎర్రగా వేడి చేయడం. (తె. 5).

కాగు: పర్యా. కాగుబిందె, చుక్కబిందె, రాజమండ్రి కాగు, రాజమండ్రి బింది. నీళ్ళు తేవడానికి ఉపయోగించే వెడల్పు మూతిగల లోహపు బిందె. చూ. చిత్రం 46. (కో. 4–10, 12, 16, 18, 19, 22, 24; తె. 5, 7–11, 13–19, 22, 23, 25; రా. 14, 16).

కాగుకరవాయి: రూ. కాగులకరవాయి. పర్యా. కాగుడై, కాకులమట్న కరవాయి, కుండలకరవాయి, పెద్ద కాగులకరవాయి. లోహపు కాగులను సాపు చేయడానికి వాడే పరికరం. (తె 23).

కాగుడుతపాల: పర్యా. కొప్పెర. పట్టుకోడానికి ఇరువైపులా హాండిల్సు అమర్చిన లోహపు పాత్ర. నీళ్ళు కాగపెట్టుకోడానికి ఉపయోగం. (తె. 26).

కాగుడై: చూ. పర్యా. కాగు కరవాయి. లోహపు కాగులు తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 6).

కాగుబిందె: ఉ. కాగుబింది. చూ. పర్యా. కాగు. నీళ్ళు తేవడానికి వాడే వెడల్పుమూతిగల లోహపు పాత్ర. (కో. 13, 15, 17, 18, 20, 23, 25 28, 29; చూ. చిత్రం 46. (తె. 14, 24).

కాగులకరవాయి: ఉ. కాగులుకరవాయి. చూ. పర్యా. కాగుకరవాయి. లోహపుకాగులు సాపుచేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 6, 13).

కాజ: గొడుగు కడ్డీలకు ఉండే చిన్న రంధ్రం. గుడ్డ ఊడిరాకుండ దీనిద్వారా దారంతో కుట్టి ఉంటారు. (కో. 23). (చొక్కాలకు గుండీలుపెట్టడానికి చేసిన చిన్న రంధ్రం).

కాజాకట్టు: (క్రి.) గుడ్డ చినగకుండ గొడుగుకు పైభాగాన టోపిచుట్టూ కుట్లువేయడం. (కో. 30).

కాంచు: (క్రి.) పర్యా. కాల్చు. కొలిమిలో లోహాన్ని బొగ్గులువేసి ఎర్రగావచ్చేటట్లు చేయడం. (రా. 5).

కాట్‌లెటరు: పర్యా. కేటలాగు, జాతిబుక్కు, డిజైను పుస్తకం. డిజైన్లను తయారుచేయడానికి వాడే బొమ్మలపుస్తకం. (కో. 23).

కాట: ఇనుపగేట్లను తూకంవేయటానికి వాడే త్రాసు. (తె. 4, 5, 9).

కాటన్‌వేస్టుగుడ్డ: (< ఇం. Cotton waste + గుడ్డ) కళాయిపూయడానికి వాడేపాతబట్ట. (కో. 2).

కాటర్‌పిన్ను[1]: సైకిలుపెడల్‌కు ఉండేనట్టు. (తె. 8).

కాటర్‌పిన్ను[2]: తలుపుసులువుగ తిరగడానికి బీరువాలో పైభాగాన అమర్చిన పరికరం. (తె. 2).

కాటర్‌పిన్నుపాన: సైకిల్‌కాటర్‌పిన్నును బిగించటానికి ఉపయోగించే స్పానరు. (తె. 13).

కాటాసిబ్బి: త్రాసుకు ఇరుపైపులా ఉండేరేకు. (కో. 18).

కాటికకాయ: పర్యా. కాటుకగిన్నె. కాటుక ఉంచడానికి వాడేడబ్బి. (కో. 2).

కాటిచ్చు: (క్రి.) పర్యా. కాట్లుపేయు. మడుపులు చేయడానికి వీలుగా రేకుమూలలను కత్తిరించడం. (కో. 18).

కాటుకగిన్నె: చూ. పర్యా. కాటికకాయ. కాటుక ఉంచడానికివాడే డబ్బి. (కో. 6).

కాట్లు: రేకులను జాయింటుచేయడానికి అంచులపై పెట్టే చిన్నకత్తిరింపులు. (తె. 23).

కాట్లుపేయు: (క్రి.) చూ. పర్యా. కాటిచ్చు. కత్తిరించిన రేకును వంచడానికి వీలుగా మరల మూలలు కత్తిరించడం. (కో. 17, 18).

కాట్లుచేయు: (క్రి.) లోహపు రేకుపై పళ్ళు కత్తిరించడం. (కో. 23).

కాట్లుపెట్టు: (క్రి.) కడ్డీలను తెగ్గొట్టేముందు గుర్తులు పెట్టడం. (కో. 18, రా. 15)

కాడ: పట్టుకొరకు ఉండే మూతిభాగం. (రా. 4).

కాడగరిట: చూ. పర్యా. కాడగంటె. నీళ్ళు. చారు, మజ్జిగలాంటి ద్రవపదార్థాలు పోసుకోడానికి వాడే (పట్టుకోడానికి) కాడ ఉండే పాత్ర. చూ. చిత్రం 47) (కో. 15; తె. 21).

కాడగంటె: పర్యా. ఒగరల, కాడగంట, చారుగంటె, డొక్క[1], నీళ్ళగంటె, పాలగరిటె[1], పాలగంటె, లాడిల్, వగ్గాల్. చారు, మజ్జిగలాంటి ద్రవ పదార్థాలు పోసుకోడానికి వాడే (పట్టుకోడానికి) కాడ ఉండే స్టీలు సాధనం. చూ. చిత్రం 47. తె. 15, 25).

కాడగిన్నె: ఉ. కాడగిన్ని. పర్యా. కాడమగ్గు, చాకేటు, చాయ్‌గిన్నె, చాయ్‌జాడి, చాస్‌పాను, దండిబోగన, ఫ్యాన్సీకటోరి, సాస్‌పిన్ను, స్పాను, హాండల్‌టాపు. కాఫీ, టీ తయారుచేయడానికి వాడే పొడవుపాటి కాడఉన్న పాత్ర. (కో. 19-21, 24, 28; తె, 2, 8, 9, 19, 21, 22, 24; రా. 4, 6, 12, 15.

కాడచంచా: సాంబారు, రసం ఉంచుకోడానికి వాడే కాడ ఉన్న స్పూను. (తె. 8, 9).

కాడపళ్ళెం: అన్నం వడించడానికి వాడే కాడ ఉన్న ప్లేటు. (కో. 20, 21).

కాడమగ్గు: (కాడ + ఇం. Mug). చూ. పర్యా. కాడగిన్నె. టీ తయారుచేయడానికి వాడే పొడవు కాడఉన్న వెడల్పు పాత్ర. (తె. 25).

కాడర్‌పిన్ను: పర్యా. గూటం[1]. కుట్టుమిషన్ నిలబడడానికి సహాయపడే పరికరం. (రా. 8).

కాండ్రడజాయింటు: (< కాండ్రడ + ఇం. Joint). ఒకరేకును కొంచెంవంపుచేసి, మరొకరేకును కొద్దిగ దానిలోపెట్టి చేసిన జాయింటు. (కో. 16).

కానా: (< హిం. ఖానా) ఉ. కాను. పర్యా. కాలమ్, గడి[1], చట్రం[3], డిజైను[2], డై[2], బాక్సు[1]. డిజైను ఫ్రేములోఉండే ఒక్కొక్క డిజైనులు. (కో. 19, 20, 22, 23, 27; తె. 3-5, 17).

కాప్: (< ఇం. Cap). పర్యా. డక్కన్[1], డెచ్. టార్చిలైటు గొట్టాన్నిమూయడానికి అమర్చిన బిరడ. (తె. 3).

కాపరురాడు: (< ఇం. Copper Rod). డబ్బాకు హైడ్రాలిక్‌ఆసిడు పూయడానికి ఉపయోగించే రాగికడ్డీ. (రా. 7).

కాపించు: (క్రి.) ఇత్తడిరేకును నిప్పులలో కాల్చడం. (రా. 13).

కాపీమగ్సు: (< Coffee mugs). కాచినకాఫీని ఉంచుకోడానికివాడే లోహపుపాత్ర. (తె. 10).

కాపు: నాలుగుపైపులా మంటసమంగా రావడానికి బర్నర్‌పై అమర్చినరింగు. (కో. 29, 30).

కాప్టెన్‌గ్లాసు: (< ఇం. Captain glass). నాలుగు పక్కలా సమానమైన కొలతలుండే లోటా. నీళ్ళు తాగడానికి వాడ్తారు. (తె. 15).

కాఫికారేజి: (< ఇం. Coffee Carriage). కాఫీ, టీ తీసుకెళ్ళడానికి ఉపయోగించే పొడవుపాటి స్టీలు పాత్ర. (కో. 22).

కాఫిగిన్నె: పర్యా. కాఫీమగ్గు[2]. పాలు, కాఫీ కాచుకోడానికి వాడే పాత్ర. (కో. 2, 19).

కాఫిడబ్రా: ఉ. కాఫిడబ్రి. కాఫీగాని, కూరలుగాని తయారుచేయడానికి ఉపయోగించే పాత్ర. (కో. 27; రా. 14).

కాఫిజెల్లెడ: పర్యా. కాఫీ పిల్టరు, కాఫీ మగ్గు, కాఫీ వడి, చేపసు. కాఫీ వడగట్టడానికి వాడే సాధనం. చూ. చిత్రం 48. (కో. 30).

కాఫీపిల్టరు: (< ఇం. Coffee filter). చూ. కాఫీ ఫిల్టరు. చూ. చిత్రం. 48. (కో. 1, 2, 4, 9; తె. 14, 16, 30).

కాఫీపొడిడబ్బా: కాఫీపొడి ఉంచుకోడానికి వాడే పాత్ర. (కో. 15).

కాఫీపొడిస్పూను: కాఫీపొడి వేసుకోడానికి ఉపయోగించే చెంచా. (కో. 11).

కాఫీఫిల్టరు: రూ. కాఫీ పిల్టరు. చూ. పర్యా. కాఫీ జెల్లెడ. కాఫీ వడగట్టుకోవడానికి వాడే సాధనం. రా. 12).

కాఫీబుర్ర: కాఫీ చేయడానికి వాడే మూత ఉన్న లోహపు పాత్ర. (తె. 18).

కాఫీమగ్గు[1]: చూ. పర్యా. కాఫీ జెల్లెడ. కాఫీ వడగట్టుకోవడానికి వాడే సాధనం. చూ. చిత్రం 48. (తె. 8).

కాఫీమగ్గు[2]: రూ. కాఫీమగ్గు[1]. చూ. పర్యా. కాఫీ గిన్నె. కాఫీ కాంచుకోడానికి వాడే పాత్ర. (కో. 6, 10, 11, 17; తె. 6, 13).

కాఫీస్పూను: చూ. పర్యా. కాఫీపొడి స్పూను. కాఫీ పొడి వేసుకోడానికి వాడే గరిట. (కో. 6).

కాఫీమగ్సు: చూ. కాఫీమగ్గు[2]. (తె. 11).

కాఫీవడి: చూ. పర్యా. కాఫీ జెల్లెడ. కాఫీ వడగట్టడానికి వాడే సాధనం. (రా. 8).

కాబిన్‌పెట్టె: (< ఇం. Cabin + పెట్టె). రేకుపై బొద్దుల్లాంటి డిజైన్లున్న ట్రంకుపెట్టె. (కో. 28; తె. 17; రా. 15).

కాబిన్‌పోగర: (< ఇం. Cabin + పోగరు). రేకుపై సొట్టలు తీయడానికి, రంధ్రాలు వేయడానికి వాడే మొల (కో. 17).

కాబిన్‌మోపు: (< ఇం. Cabin + మోపు). వెడల్పు దిమ్మెపై రెండు బద్దీలు బిగించి ఉన్న పకరం. రేకుబొద్దు కొట్టడానికి ఉపయోగం. (కో. 17).

కామ[1]: చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటి కడ్డీ. (కో. 18).

కామ[2]: గొడ్డలిని పట్టుకోడానికి వాడే కొయ్యపిడి. (తె. 20).

కామాక్షి దీపం: దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. దీనివెనక రేకుపై కామాక్షి విగ్రహమున్న బొమ్మ ఉంటుంది. (కో. 1, 2, 29; తె 21; రా. 15).

కాము: కొయ్యపిడిని వేయడానికి గొడ్డళ్ళకు, పారలకు చేసే రంధ్రం. (కో. 27).

కాయభాగం: పోతపాత్ర కిందిభాగం లేదా అడుగు భాగం. (కో. 26).

కాయవడి: చూ. పర్యా. కళ్ళసిబ్బి. ఉడకబెట్టిన కాయగూరలను వార్చడానికి వాడే సగభాగం రంధ్రాలు కలిగిన పళ్ళెం. (తె. 17).

కాయిగ్లాసు: పర్యా. కాలే పిల్లిగ్లాసు. క్రింది భాగంలో సన్నగా పైన మూతిదగ్గర కాయలాగ ఉబ్బుగా ఉండే లోటా. చూ. చిత్రం 49. (కో. 16, 18, 19, 20, 29).

కాయు[1]: (క్రి.) గుర్తులు పెట్టిన లోహపు ముక్కల్ని శానంతో నరకడం. (కో. 18).

కాయు[2]: (క్రి.) ఇనుప కమ్మలను సుత్తితో అణగ్గొట్టడం. (కో. 24).

కాయు[3]: (క్రి.) చూ. పర్యా. కాకఎక్కు. ఇనుమును సాగ్గొట్టడానికి వీలుగా కొలిమిలో ఎర్రగా కాల్చడం. (కో. 29; తె. 1, 17; రా. 14).

కారంజల్లెడ: కారంపొడిని జల్లించడానికి వాడే పరికరం. (కో. 20).

కారాచాచ: పర్యా. కారాలచిట్టి, కారాసు జల్లెడ, కారెగాసం, కారెల గరిట, కారెల సొలిగలు, గిద్దె, చక్కిలం పావు, చక్కివళ్ళు, చక్రాలగిద్దె, చక్రాల పావు, చుట్లసొలిగ, జంతికగిద్దె, జంతికగొట్టం, జెల్లిగరిట, పూసగొట్టం, పూసపాగు, పూసపావు, మడుగుబోలగిద్దె, మడుగులపావు, మునుగుబుల్లు చిట్లు, మురికిసెట్టు, మురుకు అచ్చు, మురుకు కొలాయి, మురుకుచిట్టి, మురుకుపావు, మురుకుల కాడ, మురుకులకాచంచా, మురుకులగిద్దె, మురుకుల పీట, మురుగుగొట్టము, లంకశెగులపీట, వాంపొడి సొలిగ, శేవుపీట, సేగుపావు, సొండిగల అచ్చు, సొలిగ, హోటల్ మిషన్. కారాలు, వాంపొడి, మురుకులు, జంతికలు వగైరా పదార్థాలు పిండుకోవడానికి వాడే జల్లెడలాగా ఉండే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 10, 11).

కారాలచిట్టి: రూ. కారాలచిట్లు. చూ. పర్యా. కారాచాచ. కారాసు, మురుకులు; వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. (రా. 10).

కారాలచిట్లు: ఉ. కారాలచుట్లు. చూ. కారాలచిట్టి. చూ. చిత్రం 50. (రా. 6, 8, 16).

కారాసగంటె: రూ. కారెలగరిట. చూ. పర్యా. కారా

వాప. కారాసు, ముకకుల వగైరా పదార్థాలు చేయ వానికి వాడే లోహపు పరికరం. (కో. 1).

కారాసుజక్లైపు: చూ. పర్యా. కారాచాప. కారాసు, ముకకుల వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (రా. 3).

కారియరు: రూ. క్యారీరు. పర్యా. క్యారీ, భోజనం కారేజి, మీల్స్ కారియరు, స్పూను కారీరు. అన్నం వగైరా పదార్థాలు తీసుకెళ్ళడానికి వాడే పరికరం. (కో. 16, 17, 19, 23; తె. 1, 2, 22, 23, 28; రా. 12, 15, 16).

కారు[1]: పర్యా. చదరప్పచ్చు, చదరం దిమ్మె, టప్ప నయమిదుం, మట్టం[1]. రేనచ్చు, సదరంబిళ్ళ, సావ్‌బొద్దు, సాపచ్చు, సాపుదిమ్మె, సాపుమట్టం. కాల్చిన ఇనపబడ్డీలను సాపుజేయడానికి వాడే దిమ్మ. (రా. 16).

కారు[2]: (బ.) కార్లు. చూ. పర్యా. అతికే కారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 8, 10, 4, 14, 15, 18, 30; తె. 3, 8, 13, 19, 23, 26; రా. 3, 5, 15).

కారు[3]: దున్నడానికి ఉపయోగపడే నాగలికి క్రింది భాగాన అతికించిఉండే ఇనపసాధనం. (రా. 13).

కారు[4]: అల్యూమినియం పాత్రల పోతపనిలో వాడే ఆరు అడుగుల పొడవున్న పరికరం. (కో. 11).

కారెగాసం: చూ. పర్యా. కారాచాప. కారాసు, మురుకుల వగైరా పదార్థాలను చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 10, 11).

కారెలగరిట: చూ. కారాసగింజె. చూ. చిత్రం 50. (తె. 11).

కారెలసాలిగెలు: చూ. పర్యా. కారాచాప. కారాసు, మురుకులు మొదలగు పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 10).

కారేజి: పర్యా. అర్రల టిఫిన్. భోజనం తీసుకెళ్ళ డానికి మూడునుంచి అయిదుగిన్నెలవరకు ఉండే పరికరం. (కో. 19–24, 29, 30; తె. 6, 17–21).

కార్ఖానం: అల్యూమినియం పాత్రలు తయారుచేసే చోటు. (కో. 5).

కార్కు: (< ఇం. Cork). వాటర్ బాయిలర్సు తయారుచేయడానికి ఉపయోగించే పరికరం. (తె. 15).

కార్నర్‌కమ్మి: (< ఇం. Corne-+కమ్మి. పర్యా. కార్నర్ ప్లేటు. పెట్టె మూలభాగంలో డిజైను రావడానికి ఉపయోగించే పరికరం. (రా. 4).

కార్నర్‌ప్లేటు: (< ఇం. Corner plate). పెట్టె మూలభాగంలో డిజైను రావడానికి ఉపయోగించే పరికరం. (రా. 4, 7).

కార్నరు: (< ఇం. Corner). ట్రంకుపెట్టె ప్రక్క భాగం. (రా. 8).

కార్నలు: మూతకుమూలలో డిజైనురావడానికి వాడే పరికరం. (రా. 10).

కార్బన్‌కొట్టు: (క్రి.) (< ఇం. Corbon+కొట్టు). చూ. పర్యా. అగరుగొట్టు. వెల్డింగ్‌అయిన తర్వాత బుడిపెలను తీసివేయడం. (కో. 26).

కార్బన్‌తీసేయు: (< ఇం. Corbon - తీసేయు). డిజైన్లవెల్డింగు పూర్తయిన తర్వాత పైనుండే బొడిపెలను తీసివేయడం. (తె. 4).

కార్బైడు: (< ఇం. Corbide). స్టౌకు అంటుకుఉండే కరుడుగట్టిన నల్లనిపదార్థం. (కో. 30).

కార్బొరెండం: (< ఇం. Corborendum). పెట్రో మాక్సులైటు వెల్తురు రావడానికి అవసరమయ్యే గొట్టం. దీని ద్వారా నూనెప్రవహించి వత్తివెలుగు తుంది. (తె. 3).

కాల్‌చివ్‌బల: విగ్రహం నయంపట్టడానికి వాడే పడగ లాంటి పరికరం. (కో. 2).

కాలమ్: (< ఇం. Column). చూ. పర్యా. కానా. డిజైనుఫ్రేములో ఉండే ఒక్కొక్క డిజైనుఅర. (తె. 25).

కాలవసట్టం: ఉ. కాలువసట్టం. చూ. పర్యా. కాలువ చక్కి. చెత్తాచెదారం కాలువల్లోకి వెళ్ళకుండ అడ్డం పెట్టడానికివాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం. 51. (కో. 19).

కాలిడబ్బా: పర్యా. టిఫెన్‌బాక్సు. టిఫెన్‌పెట్టుకోడానికి వాడేపాత్ర. చూ. చిత్రం 115. (తె. 14–16).

కాలిదీపం: పొడవుకాడగలిగిన దీపం ప్రమిద. (రా. 15).

కాలు: దూపకంలో నడిమధ్యకమ్మి. (రా. 5).

కాలుతొక్కు: (క్రి.) రేకును చదరంచేయడం. (రా. 5).

కాలువచక్కి: పర్యా. కాలవసట్టం, జాలి[3], జాలిబిళ్ళ, బచ్చలిప్లేటు, బీడుజాలి, మదుంచక్కి, మోరిజాలి, మోరిబిళ్ళ, సట్రం[1]. కాలువల్లోకి చెత్తాచెదారం వెళ్ళకుండా అడ్డంపెట్టడానికివాడే రంధ్రాలబిళ్ళ. (కో. 23).

కాలేపిల్లిగ్లాసు: చూ. పర్యా. కాయిగ్లాసు. క్రింది భాగంలో సన్నగా పైన మూతిదగ్గర కాయలాగ ఉబ్బుగా ఉండేలోటా. చూ. చిత్రం 49. (కో. 18,

19, 24),

కాల్సికారు: కాలుతున్న లోహపుముక్కల్ని తీయడానికి వాడేసాధనం. (కో. 17).

కాల్చికొమ్ము: గొట్టాలు వంచేటప్పుడు వాడే గునపం లాంటి సాధనం. (కో. 19).

కాల్చు: (క్రి.) చూ. పర్యా. కొలిమిలో లోహాన్ని వేడి చేయడం. (కో. 2, 24; రా. 2).

కాల్చుపెట్టు: (క్రి.) లోహాన్ని ఎర్రగా కాల్చడం. (కో. 26).

కాల్మొద్దు: సంగడిని బిగించడానికి ఉపయోగించే కంటకొయ్యకు ఎదురుగ ఉండే మరొక కొయ్య. (తె. 22).

కాళ్ళగజ్జెలు: చూ. పర్యా. అందెలు. నాట్య సమయంలో కాళ్ళకు కట్టుకోడానికి వాడే చిన్న ఇత్తడి మువ్వలు. చూ. చిత్రం 52. (కో. 7; తె. 17).

కాళ్ళదుక్క: పర్యా. కాళ్ళదుంగ. కరవాయిలు బిగించడానికి వాడే పరికరం. (కో. 10, 12).

కాళ్ళదుంగ: చూ. పర్యా. కాళ్ళదుక్క. (కరవాయిలు బిగించడానికి వాడే పరికరం). (కో. 14).

కాళ్ళపైపు: (< కాళ్ళు + ఇం. Pipe). బీరువాకాళ్ళకు వంపులు పెట్టడానికి వాడే గొట్టం. (కో. 24).

కాళ్ళపొయ్యి: పాలు కాచడానికి ఉపయోగించే పొయ్యి. (కో. 4, 9).

కాళ్ళు: రూ. కోళ్ళు. బీరువా, స్టౌ కింద మోపకుండా ఉండడానికి అమర్చిన ఎత్తు నిర్మాణాలు. (కో. 21, 23, 24, 26; తె. 2, 17, 24; రా. 4, 10, 12).

కావు: ఇనుమును కాగబెట్టడానికి మంట బాగా ఎర్రగా రావడం. (రా. 14).

కావురాయిరంగు: రాగిపాత్రలకు పాలిష్ పనికి ఉపయోగించే గడ్డలాంటి పదార్థం. (కో. 2).

కాశీచెంబు: చూ. పర్యా. గుడిచెంబు. పైభాగాన చక్రం, క్రిందిభాగాన మట్టుఉండే చెంబు. నీళ్ళకు ఉపయోగం. (కో. 2, 16).

కాస్టింగు: (< ఇం. Casting). ఎండిన మట్టిఅచ్చులను కాల్చడానికి వాడే కొలిమి. (రా. 2).

కాసన్‌డేక్సా: చూ. పర్యా. డేక్సా. వంటకు వాడే పెద్ద లోహపు పాత్ర. చూ. చిత్రం 123. (తె. 8; 9, 13).

కాసండి: పప్పు వండుకోడానికి వాడే చిన్న లోహపు చెంబు. (తె. 2, 12).

కాసుకొలిమి: చూ. పర్యా. కరుగుకొలిమి. లోహాలను వేడిచేయడానికి వాడే పొయ్యి. చూ. చిత్రం 69. (తె. 26).

కాస్టీకారు: కంచుముద్దను వేడిచేసేటప్పుడు పట్టుకొని తిప్పడానికి వాడే సాధనం. (తె. 17).

కాస్టిక్‌సోడా: లోహపు పాత్రలను శుభ్రపరచడానికి వాడే పదార్థం. (రా. 7, 8, 14-16, 22, 26).

కిట్టం: ఇనుము, బొగ్గు, పొట్టుకలసిన మిశ్రమం. (రా. 14).

కిట్టు[1]: (< ఇం. Kit). స్ప్రింగ్‌కట్టులు బిగించే పరికరం. (రా. 4).

కిట్టు[2]: చూ. కీటు. (రా. 14).

కిడిచేయు: క్రి. మట్టిని బాగుగ పిసికివేయడం. (రా.5).

కిందికట్టరు: (< కింది + ఇం. Cutter). ఇనుప ముక్కలను కట్‌చేయడానికి ఉపయోగించే దిమ్మ. (తె. 22).

కిందిగిన్నె: స్టౌను వెలిగించడానికి వీలుగా బర్నర్ క్రిందిభాగాన ఉండే ప్లేటు. (తె. 24).

కిందిడై: టంకుపెట్టెరేకు వంచటానికి ఉపయోగించే పనిముట్టు. (తె. 22).

కిందివాచరు: (కింది+ఇం. Watcher). రింగు రాపిడికి గుడ్డదెబ్బతినకుండా ఉండగానికి గొడుగు లోపల పైభాగానవేసే ప్లాస్టిక్‌బట్ట. (తె. 25).

కిర్‌లేక్రమ్మి: చూ. పర్యా. తీగ. లోహపుపాత్రలపై గీతగీయడానికివాడే పరికరం. (కో. 16).

కిరీటకం: చూ. కిరీటం. (కో. 12).

కిరీటం: (బ) కిరీటాలు. రూ. కిరీటకం. పర్యా. మకుటం, వైరముడి. దేవుని విగ్రహాలకు తలపైన పెట్టడానికి వాడే లోహపుసాధనం. (కో. 2, 11, 13, 16, 18, 20; తె. 1, 2, 7, 8, 17, 24; రా. 13, 14).

కిరోసిన్ ఇంజను: (< ఇం. Kerosine Engine). చూ. పర్యా. పంపు[3]. డ్రమ్ముల్లోనుండి నూనెను పైకి తోడడానికి ఉపయోగపడే సాధనం. చూ. చిత్రం 53. (తె. 22).

కిరోసిన్ స్టౌ: కిరసనాయిలుపోసి వెలిగించి వంటచేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 54. (రా. 3, 7, 10).

కిరోసిను: లోహపు పాత్రలను పాలిష్ చేయడానికి వాడే నూనె. (కో. 2; రా. 2).

కిలిప్పు: (< ఇం. Cli..). గొడుగు మూసినపుడు పుల్లలను పట్టి ఉంచడానికి ఉపయోగించే హాండిల్‌కు ఉన్న రింగు. (తె. 20).

కిలింగ్‌చేయు: (క్రి.) చూ. పర్యా. అంగరుగొట్టు.

వెల్డింగ్ అయినతర్వాత బుడిపెలను తీసివేయడం. (తె. 17).

కిస్‌పెట్ తీగ: పర్యా. కిస్‌తీగ. పాలిష్ పాత్రలపై డిజైన్లువేయడానికి వాడే పరికరం. (కో. 27).

కిస్‌తీగ: చూ. పర్యా. కిస్‌పెట్ తీగ. పాలిష్ పాత్రలపై డిజైన్లువేయడానికి వాడే పరికరం. (కో. 25, 26).

కిస్టిల్: రూ. కిస్తి, కిస్సి. పర్యా. ట్రే. స్వీట్లు నిల్వ చేయడానికి, హోటళ్ళలో పదార్థాలు సరఫరా చేయడానికి వాడే వెడల్పు అంచుఉన్న ట్రే. చూ. చిత్రం 55. (తె. 3).

కిస్తి: చూ. కిస్టల్. (తె. 10, 14, 16, 17).

కిస్సి: చూ. కిస్టల్. (తె. 19).

కీ: లైటు, స్టౌ బర్నరుకు టాంకిపైన ఉండే గాలిని విడుదలచేసే పరికరం. (తె. 3).

కీచైన్లు: (< ఇం. Key Chains). తాళాలు కూర్చుకోడానికి వాడే గొలుసు. (కో. 28).

కీటు: రూ. కిట్టు². బిందె దట్టమైన అంచుభాగం. (కో. 2, 5; తె. 3; రా. 5).

కీటేయు: (క్రి.) పర్యా. గుంజు⁶. బిందె మూతిరేకును వంచి అంచుచేయడం. (కో. 2; తె. 1, 3, 4, 18).

కీట్లసుత్తి: పర్యా. కీట్లుకరవాయి. పాత్ర కింది అంచు భాగం చేయడానికి, విగ్రహం వక్షస్థలం చెక్కడానికి ఉపయోగించే నల్చదరపు పరికరం. (కో. 10; తె. 1).

కీడిచ్చు: (క్రి.) మట్టిని సుత్తితో కొట్టడం. (రా. 5).

కీడుకొను: (క్రి.) సానరాయిపై కత్తిని నూరుకోవడం. (కో. 24).

కీడురాయి: మంగలిషాపుల్లో వాఢే సానరాయి. (కో. 24).

కీత ఆకురాయి: సాపుచేయడానికిముందు విగ్రహాన్ని గోకడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 17).

కీతకడ్డి: చూ. పర్యా. తీగ. తరిణి పట్టేటప్పుడు వస్తువుల హెచ్చుతగ్గులు లేకుండా సరిచేయడానికి వాడే పరికరం. (తె. 18).

కీతకంటాణీ: రూ. గీతకంట్రాని. తీగలాగానే పొరలు గీయటానికి, ఎమ్రీసేవరు పట్టవలసిన వస్తువును సాపుచేయడానికి వాఢే పరికరం. (కో. 20, 29).

కీతరేకు: చూ. గీతరేకు². (కో. 20, 21).

కీతలేగ: విగ్రహాన్ని రుద్దడానికి ఉపయోగించే పరికరం. (కో. 6).

కీమరు: మూసను ఉంచడానికి ముందు కొలిమిని శుభ్రం చేయడానికి వాడే పనిముట్టు. (రా. 11).

కీమూత్: పర్యా. చావిబిళ్ళ. తాళం రంధ్రం అందంగా కనపడడానికి బీరువా తలుపుపై ఉండే తాళంబిళ్ళ. (తె. 20).

కీరెజి: సైకిల్ చక్రానికి కమ్ములు బిగించడానికి ఉపయోగించే పరికరం. (కో. 7).

కీలు¹: చూ. కీళు. (కో. 11; తె. 17, 21; రా. 10).

కీలు²: అడ్డకు పాత్రను అందించడానికి వాడే నల్లని జిగురుపదార్థం. (కో. 20, 29).

కీలుచెంబు: పర్యా. మరచెంబు¹, మర్రిచెంబు. చూ. చిత్రం 189. (రా. 14).

కీళు: రూ. కీలు¹. పర్యా. గడ్డపిన్ను. ట్రంకుపెట్టె అడుగుభాగాన్ని, మూతభాగాన్ని కలిపే మడత బందులు. (కో. 4, 9; రా. 4, 8).

కీళుబందు: బీరువా రేకులు బిగించడానికి వాడే పరికరం. (రా. 8)

కీసెట్టు: (< ఇం. Key + set). పర్యా. చెవు, తాళం¹, పాట్లా, పాట్లాకు¹, లాక్‌కేస్, లాక్‌సెట్టు, బీరువా లాకింగ్‌సెట్టు. (తె. 20).

కుక్క గొలుసులు: కుక్కలను కట్టివేయడానికి వాడే ఇనప గొలుసులు. (కో. 28).

కుక్కపట్టు: చూ. పర్యా. కుక్కారు. బండి చక్రానికి కమ్ములు ఎక్కించడానికి వాడే పనిముట్టు. (కో. 24).

కుక్కర్‌గిన్నె: (< ఇం. Cooker + గిన్నె). చూ. పర్యా. కుక్కరు. అన్నం, కూరలు చేయడానికి ఉపయోగించే స్టీల్ లేదా ఇండాలియం పాత్ర. (కో. 6, 8, 11, 26; తె. 8, 9, 13).

కుక్కరు: (< ఇం. Cooker). పర్యా. కుక్కరుగిన్నె. అన్నం, కూరలు చేయడాని కుపయోగించే స్టీల్ లేదా ఇండాలియం పాత్ర. (కో. 20).

కుక్కలు: బండి చక్రానికి పట్టాలను (కమ్ములను) ఎక్కించడానికి ఉపయోగించే సాధనాలు. ఇవి రెండు ఉంటాయి. పట్టాల కిరువైపుల పట్టి ఎక్కిస్తారు. (కో. 3; తె. 5. 19-24).

కుక్కారు: పర్యా. కమ్చి, కుక్కపట్టు, కుత్త, జాకి, డక్కి¹, నకల్, నక్క, బేపు, బేపుకారు, లాగిన కారు. బండి చక్రానికి కమ్ములు ఎక్కించడానికి వాడే పనిముట్టు. (కో. 19-22, 27).

కుంకుడుకాయ: విగ్రహాన్ని సల్ఫ్యూరిక్ ఆసిడ్‌తో కడిగిన తర్వాత మరింత తెలుపుకోసం దీని నురుగును వాడతారు. (తె. 17).

కుంకుమకాయ: ఉ. కుంకుంకాయ. పర్యా. కుంకుమ

పెట్టె, కుంకుమభరిణె, కుంకుంగిన్నె, బేటడబ్బా. భరిణె, సాదా కుంకుమభరిణె. కుంకుమ పోసుకోడానికి వాడే మూతవున్న స్టీలు కప్పుగిన్నె. చూ. చిత్రం 56. (కో. 12; తె. 10, 11, 17, 18).

కుంకుమపెట్టె: చూ. పర్యా. కుంకుమకాయ (కుంకుమ పోసుకోడానికి ఉపయోగించే స్టీల్ కప్పుగిన్నె. దీనికి మూత ఉంటుంది). (తె. 8, 9).

కుంకుమబరిణె: ఉ. కుంకుమబరిణ. చూ. కుంకుమభరిణె. (కో. 22; తె. 21).

కుంకుమభరిణె: ఉ. కుంకుమభరిణ, కుంకుమభరిణి. రూ. కుంకుమభరిణ. చూ. పర్యా. కుంకుమకాయ. కుంకుమ పోసుకోడానికి ఉపయోగించే స్టీలు కప్పుగిన్నె. దీనికి మూత ఉంటుంది. చూ. చిత్రం 56. (కో. 1, 2, 4, 22; తె. 14-16).

కుంకుంగిన్నె: చూ. పర్యా. కుంకుమకాయ. కుంకుమ పోసుకోడానికి వాడే స్టీల్ కప్పుగిన్నె దీనికి మూత ఉంటుంది. చూ. చిత్రం 56. (తె. 1).

కుంకుంపేల: పర్యా. గుత్తి, చౌపాళి, పూజగుత్తి. కుంకుమ, పసుపు వగైరా పూజాసామగ్రి ఉంచుకోడానికి ఉపయోగించే నాల్గు లేదా అయిదు స్టీలు గిన్నెలు. (రా. 14).

కుంగేయు: (క్రి.) పొడవు ఇనపముక్కల్ని కొలిమిలో కాల్చి ముద్దగా చేయడం. (తె. 24)

కుచ్చి: బిందె గొంతుభాగం. (కో. 29; తె. 14, 16).

కుచ్చి గునపం: పాత్రల అంచును తయారుచేసే పరికరం. (కో. 13, 28).

కుజ్జు గునపం: పాత్రలకు రివిట్లుకొట్టే పరికరం. లోతు డబరాలకు అడుగులు వేయడానికికూడ ఉపయోగం. (కో. 10, 12).

కుంచ: ఉ. కుంచా. స్వీట్లు ఉంచడానికి వాడే నక్షీ అంచులున్న, వెడల్పు పళ్లెం. మహమ్మదీయులు ఎక్కువగా ఉపయోగిస్తారు. (తె. 17; రా. 15).

కుంచం[1]: చూ. పర్యా. కడెంబిందె. పాలు, నీళ్ళు తెచ్చుకోడానికి వాడే గుండ్రని మూతివున్న ఇత్తడి బిందె. (తె. 23).

కుంచం[2]: ఇరుసును ఉంచడానికి బండి చక్రంలో ఉండే గొట్టం. (కో. 27).

కుంచం[3]: గింజలు కొలిచేందుకు ఉపయోగించే గుండ్రని లోహపాత్ర. (తె. 15, 18)

కుంచంకట్లు: బండిచక్రం గట్టిదనానికి ఉపయోగించే దిమ్మచుట్టూ ఉండే ఇనుప రింగులు. (కో. 24).

కుంచు: పర్యా. చింపకట్ట, చిరకొలకట్టె, చిరకోల, జల్లుమట్ట, తొట్టిమట్ట, పిడస[1], మట్ట, సోపకమ్మ, సోపుమట్ట. కాక బాగా రావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే కొబ్బరిమట్ట లేదా గుడ్డ చుట్టబడిన కర్రముక్క. (కో. 30).

కుంచె: పర్యా. పాలిష్ బ్రష్సు, బ్రెస్సు. లోహపు వస్తువులకు పాలిష్ చేయడానికి వాడే పనిముట్టు. (తె. 17; రా. 15).

కుంచెకొట్టు: (క్రి.) బీగాల, బాక్రీల రివిట్లను పైకి రాకుండ రేకుకు సమానంగా ఉండేటట్లు అణగ్గొట్టడం. (తె. 23).

కుటకలకంచం: రూ. కుడకలకంచం. పర్యా. గుంటలకంచం, గుంటలపళ్ళెం[1], డిన్నర్ ట్రే. డిన్నర్ప్లేటు, పాందాను[1], బాంబే అన్నంగిన్నె, బొంబాయిప్లేటు[1], భోజనట్రే, భోజనపాత్ర, భోజనం ప్లేటు, మద్రాసు మీల్స్ప్లేటు, మీల్స్ ట్రే, ట్రే[1], స్క్వేయర్ ట్రే[1]. కూరలు వడ్డించుకోవడానికి వీలుగా గుంటలు అమర్చి చేసిన లోహపు భోజన పాత్ర. చూ. చిత్రం 57. (కో. 23).

కుటకలు: భోజనపాత్రలో కూరలు వేసుకోడానికి, ఇడ్లీపాత్రలో ఇడ్లీలు చేయడానికి చేసిన గుంట భాగాలు. (తె. 24, 25).

కుట్టగొనపేయు: (క్రి.) పోతబిళ్ళ అంచును డొల్లకు అతకడానికి వీలుగా పల్చగా చేయడం. (తె. 20).

కుట్టం: బిందె కిందిభాగం. (తె. 8, 9).

కుట్టంపెట్టు: రూ. కుట్టాంపెట్టు. చూ. పర్యా. ఒడ్డు. గుండ్రని రేకును గుంతగకొట్టి బిందె అడుగుభాగం లాగ చేయడం. (కో. 25, 27; తె. 1, 3, 7).

కుట్టాంపెట్టు: (క్రి.) చూ. కుట్టంపెట్టు (కో. 26).

కుట్టు: పర్యా. జంగు[1], చిట్టెం, చిట్టాయి, సిమిడి. కొలిమిలో ఇనుము కాలగా మిగిలిన పనికిరాని బొగ్గు, ఇనుము మిశ్రమం. (కో. 24, 25).

కుట్టుడాకు: చూ. పర్యా. ఇస్తరాకు. ఆకుమాదిరి పుల్లలు కుట్టినట్లు డిజైనువేసి అంచు లేకుండా తయారుచేసిన భోజనం పళ్లెం. (కో. 16).

కుట్టుడాకు కంచం: చూ. పర్యా. ఇస్తరితట్ట. ఇస్తరాకులాగా ఉండే గుండ్రని లోహపు పళ్లెం. భోజనం చేయడానికి ఉపయోగం. (కో. 18).

కుట్టుమిషను: (< కుట్టు+ఇం. Machine). సూటుకేసు తయారీలో లోభాగాన బ్యాగ్లు కుట్టడానికి ఉపయోగపడే పరికరం. (తె. 8, 9).

కుట్రపోయు: పోతవిగ్రహం లోపలుండే మురికిని నోటితో ఊదడం. (కో. 17).

కుడక: పర్యా. గిన్నె[1], చిప్ప[1], టంకంచిప్ప, డిప్ప[2], పొడిగిన్నె, మంటిచిప్ప, రవ్వచిప్ప, రాచిప్ప. టంకంపొడి వేసుకోడానికి వాడే పాత్ర. (కో. 4).

కుడకల కంచం: చూ. కుటకల కంచం. (కో. 24).

కుడుంరింగు: (< కుడుం + ఇం. Ring). కుడుములు చేయడానికి ఉపయోగించే గుండ్రంగా ఉండే పరికరం. (కో. 10, 12).

కుడ్క: పర్యా. కొబ్బరికట్టరు, కొబ్బరికోరం, కొబ్బరి గరిక, కొబ్బరిగసిని, కొబ్బరిగిరె, కొబ్బరితురుపు, కొబ్బరిపీట, కొబ్బెరమిషను, కోరం[2], గరిక, చేతి కోరం, తురిమే ఈలపీట, తురిమేచెక్క, తురిమే పీట, తురుము[1], తురుముకత్తి, తోపడచుబ్బు, త్రోకను, మంజరిపీట, మాంజరి, సేటుకోరం. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (తె. 24).

కుత్త: చూ. పర్యా. కుక్కారు. బండిచక్రానికి పట్టాల నెక్కించడానికి వాడే పట్టకారు. (తె. 25).

కుంటకొట్టు: (క్రి.) చూ. పర్యా. కుంటచేయు. పాత్రలు తయారుచేయడానికి రేకును వంపు చేయడం. (కో. 1).

కుంటచేయు: (క్రి.) పర్యా. కుంటకొట్టు. పాత్రలు తయారుచేయడానికి రేకును వంపుచేయడం. (కో.1).

కుంటసుత్తి: బాండలకు. టకారాలకు కుంటకొట్టడానికి ఉపయోగించే పరికరం. (కో. 1).

కుండ[1]: చూ. పర్యా. అడ్డ. అన్నం వండటానికి, నీళ్ళు తేవడానికి ఉపయోగించే గుండ్రని లోహపు బిందె. (కో. 22, 30; తె. 1, 3, 7, 17).

కుండ[2]: పెట్రోమాక్సులైటు మెంటలుకు గ్యాసును అందజేయడానికి, వత్తిని కట్టడానికి ఉపయోగించే రంధ్రాల పరికరం. (తె. 19, 22).

కుండబింది: కురసమూతి ఉండే నీళ్ళపాత్ర. (కో. 20).

కుండమిషను: (< కుండ + Machine). రేకులపై రంధ్రాలు వేయడానికి ఉపయోగించే సాధనం. (తె. 2; రా. 16).

కుండల కరవాయి: చూ. పర్యా. కాగు కరవాయి. లోహపుకుండలు సాపుచేయడానికి వాడే పరికరం. (తె. 2, 3).

కుండి[1]: చూ. కుంది. (కో. 5).

కుండి[2]: ఇనుమును టెంపర్ పట్టడానికి వాడే, నీటి పాత్ర. (కో. 19, 23, 26, 27).

కుతిక: ఉ. కుతికి. చూ. పర్యా. కంఠం. బిందె గొంతుభాగపు రేకు. (కో. 10, 14, 15, 19–21, 23–28).

కుతికపట్టు: కమ్మరం పనిలో ఇరుసుకోపుల మెడ నొక్కడానికి వాడే సాధనం. (తె. 24).

కుతికసంది: ఇరుసు కుతికభాగానికి, దొడ్డిభాగానికి మధ్య ఉండే అతుకు. (కో. 21).

కుతికసుత్తి: కమ్మరంపనిలో ఇరుసుకోపుల కుతికలు సాగగొట్టడానికి వాడే సాధనం. (కో. 28).

కుత్తిగునపం: పాత్ర సుడిభాగం తయారుచేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 20).

కుదిచ్చుడు: బిందెబొల్కలు చేయడానికి వాడే పొడవుగా, వెడల్పుగా ఉండే కొయ్యదిమ్మ. (తె. 17).

కుదించు[1]: (క్రి.) పర్యా. కుదేసుకొను. లావు ఇనుప కడ్డీని ముద్దగా చేయడం. (తె. 19).

కుదించు[2]: (క్రి.) రూ. కుదింపు. పర్యా. కుదింపు చేయు, గుంటకొట్టు, గుద్దు[1]. (1). గుండ్రని రేకును బిందె అడుగుభాగపు బిళ్ళలాగ పళ్ళెం తయారు చేయడం. (2). బోత అచ్చును చేయడానికి మట్టిని అచ్చులోవేసి గట్టిగ కూరడం. (కో. 5; తె. 4, 5, 12, 14, 16, 18–22).

కుదింపుచేయు: (క్రి.) చూ. పర్యా. కుదించు[2]. గుండ్రని రేకును బిందె అడుగుభాగంలాగ లోతుగ చేయడం. (కో. 6, 17; తె. 22).

కుదింపుబిళ్ళ: రేకును గుంతగ కొట్టడానికి వాడే పనిముట్టు. (రా. 10).

కుదింపుబింది: పాలు తేవడానికి వాడే గుండ్రని బిందె. (కో. 27).

కుదింపుమొద్దు: పాత్రల బొల్కలు చేయడానికి వాడే కొయ్యదిమ్మ. (తె. 17).

కుదింపుసుత్తె: పాత్రల అడుగుభాగాల్ని కుదించడానికి తుపాకి ఆకారంలోఉన్న పనిముట్టు. (తె. 35).

కుదుపు: (క్రి.) చూ. పర్యా. గెలుకు. కొలిమిలోని అగ్గిని కలియబెట్టడం. (కో. 2).

కుదురు[1]: పైపులు తట్టడానికి ఉపయోగించే పరికరం. (కో. 1).

కుదురు[2]: దంచేటపుడు గింజలు ఎగిరిపోకుండ ఉండటానికి రోటిచుట్టూ అమర్చిన లోహపు రింగు. (తె. 22; రా. 4).

కుదేయు: (క్రి.) గొడ్డలి తలను తయారుచేయడానికి ఇనుమును కాల్చి ముద్దగా చేయడం. (తె. 4, 22).

కుదేసుకొను: (క్రి.) చూ. పర్యా. కుదించు[1]. లావు ఇనుపకడ్డీని ముద్దగా చేయడం. (తె. 19).

కుంద: లోహాన్ని ముక్కలు కట్ చేసేటప్పుడు కింద పోపుగ వాడే సాధనం. (రా. 11, 13).

కుంచె: రూ. కుంచి[1]. చిప్పలు, పెనుల్లెడు బ్రాసుల్లు, బొందెలు మొదలయినవాటి అడుగుభాగం గుంటలు కొట్టడానికి వాడే గుండ్రని పనిముట్టు. (కో. 2,3,4).

కుందులు: (ఏ.) కుంది. పర్యా. దీపస్తంభాలు, దీపారాధన కుందులు. దీపారాధనకు వాడే ఇత్తడి లేదా స్టీలుతో చేసిన చిన్న స్తంభాలు. చూ. చిత్రం 58. (కో. 12–15, 25, 30).

కుంపె: ఉ కుంప. చూ. పర్యా. కంచాత్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 53. (కో. 6, 19–26, 28).

కుప్పె: అందంగా కన్పించడానికి ఎద్దు కొమ్ములకు వేసే ఇత్తడి తొడుగు. (రా. 6).

కుబ్బలు: ట్రంకుపెట్టె క్రింద మోపకుండ ఉండడానికి అడుగుభాగాన ఉండే రేకు దొడిమెలు. (తె. 17).

కుమ్మరి చక్రం: లోహాన్ని తయారుచేయడానికి ముందు మట్టిని చెంబులాగ తయారుచేయడానికి వాడే పరికరం. (రా. 2).

కుమ్మరం: చూ. పర్యా. కరుగు కొలిమి. లోహాలను వేడి చేయడానికి ఉపయోగించే పొయ్యి. చూ. చిత్రం 69. (కో. 19–22, 24, 25).

కుంపటి[1]: పర్యా. పొయ్యి[4], పోతకుంపటి, బొగ్గు పొయ్యి, బొగ్గుల కుంపటి. రేకు బొగ్గులపొయ్యి. బొగ్గులతో వంట చేయడానికి వాడే లోహపుపొయ్యి. చూ. చిత్రం 131. (కో. 1, 4, 14, 15, 17, 19, 24, 26; తె. 14, 23, రా. 7).

కుంపటి[2]: పర్యా. బట్టి. టింకరుపనిలోవాడే చిన్న డబ్బారేకుపొయ్యి. చిన్నబకెట్‌లో మట్టిపొయ్యిని చేసి నిప్పువేస్తాడు. (తె. 21).

కుంపటి[3]: వంటసామాన్లు పెట్టుకోడానికి ఉపయోగించే పరికరం. (కో. 9).

కుంపటిబిళ్ళ: పర్యా. చక్కి[1], చట్రం[2], చత్రం, జాలి[2], జల్లెడ, పొయ్యిజాలి, పొయ్యిబిళ్ళ, ప్లేటు[5], బిళ్ళ[1], బొగ్గుబిళ్ళ, బొగ్గులపొయ్యిలబిళ్ళ, బొగ్గుల పొయ్యిలో బూడిదరాలడానికి ఉపయోగించే రంధ్రాల ప్లేటు. చూ. చిత్రం 59. (కో. 2; తె. 21).

కుంపసు: (< ఇం. Compass). రూ. కొంపాసు. రేకులపై గుండ్రంగా గీతలుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 19; రా. 11).

కుంపకోణంకడవ: చూ. పర్యా. కంకబిందె. మూతి పొట్టిగా, అడుగువెడల్పుగా; క్రిందిభాగం వెడల్పుగా ఉండే లోహపుపాత్ర. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. (రా. 11).

కుంబకోణంచెంబు: రూ. కుంభకోణంచెంబు. పర్యా. దానంచెంబు, పూనాదేశి. మూతి చిన్నదిగాఉండే చిన్న లోహపుపాత్ర. కుంభకోణంలో తయారయింది. (కో. 3, 12, 18; తె. 6, 7–25; రా. 11).

కుంబకోణంబిందె: మూతిచిన్నదిగా ఉండే లోహపు పాత్ర. కుంభకోణంలో తయారయింది. చూ. చిత్రం 80. (కో. 1, 3, 5, 12, 16, 18; తె. 2, 3, 17; రా. 7, 8, 11, 12, 13).

కుంభకోణంచెంబు: చూ. కుంభకోణంచెంబు. (కో. 19, 22; తె. 5. 10, 11).

కుయ్యి[1]: చూ. పర్యా. కంటుదిమ్మ. ఇరుసును అమర్చడానికివాడే బండిచక్రం మధ్యలోఉండే కొయ్యదిమ్మ. (తె. 13).

కుయ్యి[2]: ఇత్తడిరేకును పళ్ళెంలాగ తయారు చేయడానికివాడే ఇనుపరోలు. (కో. 24; తె. 17, 25).

కురతలు: చూ. పర్యా. గరుకులు[2]. రేకుపైఉండే నొక్కులు. (కో. 27).

కురల్‌ప్లేటు: (< కూరలు + ఇం. plate). మహమ్మదీయులు భోజనం చేయడానికి ఉపయోగించే అంచుచుట్టూ చిక్కైనులు అమర్చిన లోహపుపాత్ర. (తె. 1).

కురసవరిటాకు: దేవుని నైవేద్యానికివాడే చిన్న అరిటాకు ఆకారంలోఉన్న అంచులేని భోజనంపళ్లెం (కో. 18).

కురంపల్లిబిందె: కురంపల్లిలో తయారయ్యే గుండ్రని లోహపుబిందె. అంచులావుగా ఉంటుంది. నీళ్ళు, పాలు తెచ్చుకోడానికి ఉపయోగం. (తె. 7).

కురాయించు[1]: (క్రి.) చూ. పర్యా. కూరు. పోత పాత్రను తయారుచేయడానికి అచ్చుల్లో మట్టిని గట్టిగా కూరడం. (తె. 19).

కురాయించు[2]: (క్రి.) చూ. పర్యా. కుదించు[2]. గుండ్రని ఇత్తడి రేకును పాత్రల అడుగుభాగపు బిళ్ళలాగా గుంతగా తయారుచేయడం. (తె. 19).

కురిపి: ఉ. కుర్పి. చూ. పర్యా. అట్లకాడ. పెద్ద పాత్రల్లో వంటలు చేసేటప్పుడు కలియబెట్టడానికి వాడే పొడవాటి సలాకు. (కో. 17, 19, 23; తె. 21).

కురుకు: రూ. కురుగు. చూ. పర్యా. అడ్డ. ట్రంకుపెట్టె అడుగు భాగానికి ప్రక్కన ఉండే రేకు. (కో. 17; తె. 21; రా. 8, 12, 15).

కురుగు: చూ. కురుకు. (రా. 10).

క్షురువువేయు: (క్రి.) పోత పాత్రలపై ఉండే రంధ్రాలను సాగదీసి రంధ్రాలు కనబడకుండ 'కుట్టు'లాగ అతుకు వేయడం. (కో. 26).

క్షురుందం: పర్యా. గెరెండర్. సాన పట్టడానికి వాడే కురుందం రాయి, లక్కతో కలిపిచేసిన సాధనం. (తె. 7).

కురుందం రాయి: రూ. కొరివిందం రాయి. సాన రాయిని తయారుచేయడానికి వాడే గరుకు సాధనం. (తె. 7).

కుర్చీక: వేరుశెనగ చెట్లు పీకడానికి వాడే ఇనుప పరికరం. (రా. 12).

కుళిగ[1]: చూ. పర్యా. కళాయిగిన్నె. ఏవైన పదార్థాలు నిలువ ఉంచుకోడానికి ఉపయోగించే పొడవైన లోహపు పాత్ర. (రా. 11).

కుళిగ[2]: చూ. పర్యా. అండా[1]. నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల హాండిల్సు, వెడల్పు మూతి ఉన్న లోహపు పాత్ర. చూ. చిత్రం 8. (రా. 11).

కుసుగునవం: అంచు మట్టం చేయడానికి వాడే పరికరం. (కో. 16).

కూచోబెట్టు: (క్రి.) పర్యా. తీర్చుకొను, పంపకం ఏయు, పార్టీషన్‌చేయు, పేర్చు[1]. ఆకారాన్ని తయారు చేయడానికి కొలతప్రకారం డిజైను కడ్డీలను అమర్చడం. (రా. 11, 14, 15; తె. 2).

కూజా: పర్యా. కూజాబిందె, చంకబిందె, చంద్రలేఖ, తిరుపతిబిందె, పాలిష్‌బిందె, మద్రాస్‌బిందె, నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగించే కూజా ఆకారమున్న లోహపు పాత్ర. చూ. చిత్రం 62. (కో. 16).

కూజాకరవాయి: పర్యా. కూజాబిందె కరవాయి, కూజాబిందె సుత్తి, కూజాసుత్తి, దిండ్లకరవాయి, పెద్దకరవాయి, బిందెకరవాయి, బిందె మట్నాల కరవాయి, మద్రాసు బిందెలకరవాయి. కూజా ఆకారపు బిందెలను సాపుచేయడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 177. (కో. 27; తె. 22; రా. 2).

కూజాచెంబు: పర్యా. కూజాముంత. నీళ్ళు తాగడానికి ఉపయోగించే కూజాలాగఉండే స్టీలుచెంబు. చూ. చిత్రం 61. (కో. 10, 12, 15, 17, 23).

కూజాబిందె: ఉ. కూజబిందె, కూజాబింది. చూ. పర్యా. కూజా. నీళ్ళు తెచ్చుకోడానికి వాడే కూజా ఆకారమున్న లోహపు పాత్ర. చూ. చిత్రం 62. (కో. 4-6, 8-10, 12, 13, 15, 17-20, 22, 23, 25-27, 29; తె. 2, 18-20, 22-25).

కూజా బిందెకరవాయి: చూ. పర్యా. కూజాకరవాయి. కూజా ఆకారపు బిందెలను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 177. (కో. 6, 10, 12).

కూజా బిందెసుత్తి: చూ. పర్యా. కూజాకరవాయి. కూజా ఆకారపు బిందెలను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 177. (కో. 10).

కూజాముంత: చూ. పర్యా. కూజాచెంబు. నీళ్ళు తాగడానికి ఉపయోగించే కూజాలాగ ఉండే స్టీలు చెంబు. చూ. చిత్రం 61. (కో. 24).

కూజాసుత్తి: చూ. పర్యా. కూజాకరవాయి. కూజా ఆకారపుబిందెలను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 177. (కో. 6, 11).

కూడబడు: (క్రి.) రెండు పదార్థాలను కలపడం. (కో. 26).

కూడిమిపాత్ర: ఇడ్లీపిండి తయారుచేయడానికి వాడే పాత్ర. (కో. 10, 12).

కూనకప్పు: ద్రవపదార్థాలు పోసుకోడానికి వాడే గిన్నె. (కో. 6).

కూరఅండి: వంటలు చేయడానికివాడే నిలువుగా ఉండే పెద్దలోహపుపాత్ర. (కో. 11).

కూరగరటు: చూ. కూరగరిటె. (కో. 2).

కూరగరిటె: రూ. కూరగరటు. పర్యా. కర్చిసలాక[2], కూరగంటె, గుంటగరిటె[1], పోసు, బాజిల్, బాజీచెంచా, రౌండుగరిట, రౌండుబాజిస్పూను, లోతుగరిటె, సాదాగరిట. స్ట్రెయిట్‌గరిట, స్పూను[1], కూరలువడ్డించటానికి వాడే లోహపుపరికరం. చూ. చిత్రం 63. (కో. 1, 2; తె. 14. 16).

కూరగంటె: చూ. పర్యా. కూరగరిటె. కూరలు వడ్డించటానికి వాడే లోహపుపరికరం చూ. చిత్రం 63. (తె. 22, 23).

కూరగాయగిన్నె: పర్యా. టేబుల్‌డీసు, డబుల్ డక్కర్. డిష్‌బౌల్, రౌండుహ్యాండిల్‌డిస్, హ్యాండిల్‌డిస్. చేసినవంటకాలను టేబుల్‌పై ఉంచుకోడానికి వాడే మూతఉన్న పాత్ర. (తె. 15).

కూరగిన్నె: పర్యా. గిన్నె[6]. టోప్, టోప్‌గిన్నె, పలకలగిన్నె, పాలిష్‌గిన్నె, పిడత[1], మొల్లంగి గిన్నె, లోతుగిన్నె, సాదాగిన్నె, సాధారణపొలు. కూరలు పెట్టుకోడానికివాడే చిన్నలోహపుపాత్ర, అడుగుభాగంలో మట్టు(చుట్టూవున్నకడెం) ఉంటుంది. చూ. చిత్రం 64. (కో. 2, 17, 19, 20, 22. 24-26, 28; తె. 7-9, 18, 19; రా. 6-8).

కూరగుత్తి: రూ. కూరలగుత్తి, కూర్లగుత్తి. చూ. పర్యా. గుత్తిగిన్నె. నాల్గువైపుల నాల్గు లోహపుచిప్పలు గుత్తిగా అతికించిఉండి పైన పట్టుకోడానికి కాడఉన్న లోహపుపాత్ర. కూరలువడ్డించడానికి ఉపయోగం. చూ. చిత్రం 87. (కో. 2, 23, 26; తె. 17, 19, 20, 23).

కూరడాక: చూ. కూరదాక. (కో. 1, 2, 4, 9, 17; రా. 7).

కూరడాకల: చూ. కూరదాకలి. (కో. 2).

కూరదబరా: చూ. పర్యా. కూరదాక. కూరలు చేయడానికివాడే కొద్దిపాటిపొడవు వెడల్పు ఉన్న పాత్ర. చూ. చిత్రం 65. (కో. 3).

కూరదాక: రూ. కూరడాక. పర్యా. కూరదబరా, కూరదాకలి, కూరసంజ, దస్తాగిన్నె[2], దాక, దాకలి, కూరలు చేయడానికి వాడే కొద్దిపాటి పొడవు వెడల్పు ఉన్న పాత్ర. చూ. చిత్రం 65. (కో. 21, 22, 24; తె. 17, 18).

కూరదాకలి: రూ. కూరడాకల. చూ. పర్యా. కూరదాక. కూరలు చేయడానికి వాడే కొద్దిపాటి పొడవు వెడల్పు ఉన్న పాత్ర. చూ. చిత్రం 65. (కో. 17, 19).

కూరపళ్ళెం: కూరలు ఉంచడానికి వాడే కంచంలాగా ఉన్న చిన్న లోహపు పాత్ర. (కో. 27).

కూరప్లేటు: (< కూర + ఇం. Plate). చూ. పర్యా. కవరు[8]. పాత్రలపై మూతగా వాడే పళ్లెం. (కో. 25, 29).

కూరల కాడ: చూ. పర్యా. గుత్తిగిన్నె. కూరలు వడ్డించడానికి వాడే 4, లేదా 5 గుత్తుల గిన్నెలు. చూ. చిత్రం 87. (తె. 5).

కూరలగుత్తి: ఉ. కూర్లగుత్తి. (కో. 18–22, 24, 28; తె. 21–24).

కూరల పంచపాళి: చూ. పర్యా. గుత్తిగిన్నె. నాల్గు లేదా అయిదు గిన్నెలు కలిపి గుత్తిగా ఒక కడ్డీకి బిగించి ఉంటాయి. కూరలు వడ్డించడానికి వాడ్తారు. చూ. చిత్రం 87. (తె. 3).

కూరలబుట్ట: చూ. పర్యా. అన్నంబుట్ట. ఉడికిన కూరగాయలు వడగట్టడానికి ఉపయోగించే అడుగున రంధ్రాలున్న లోహపు పాత్ర. చూ. చిత్రం 11. (కో. 18).

కూరసట్టి: చూ. పర్యా. చట్టి. కూరలు చేయడానికి వాడే చిన్న లోహపుపాత్ర. (కో. 6, 7, 15; (తె. 3, 11, 12, 14, 16).

కూరసంజ: చూ. పర్యా. కూరదాక. కూరలు చేయడానికి వాడే కొద్దిపాటి పొడవు వెడల్పు వున్న పాత్ర. చూ. చిత్రం 65. (కో. 17, 19).

కూరు: (క్రి.) పర్యా. కురాయించు[1], కూర్చు, దట్టన చేయు, దట్టించు[1]. పోతపాత్రను తయారుచేయడానికి అచ్చుల్లో మట్టిని గట్టిగా కూరడం. (కో. 2, 19, 20, 22, 23, 28).

కూరుకర్ర: చూ. పర్యా. కర్రగూటం. అచ్చుల్లో మట్టిని కూరడానికి వాడే సాధనం. (కో. 28).

కూర్చు: (క్రి.) చూ. పర్యా. కూరు. పోతపాత్రను తయారుచేయడానికి అచ్చుల్లో మట్టిని గట్టిగా కూరడం. (తె. 23, 25).

కూర్చేకట్టె: చూ. పర్యా. కర్రగూటం. అచ్చుల్లో మట్టిని కూరడానికి వాడే సాధనం. (తె. 25).

కూలింగ్‌బాక్సు: (< ఇం. Cooling Box). చల్లని పదార్థాలు ఉంచుకోడానికి ఉపయోగపడే పెట్టె. (కో. 15).

కూలు: కొయ్యపిడి వేయడానికి వీలుగాఉండే కొడవలి వెనుకభాగం. (తె. 23; రా. 4).

కూలుచేయు: (క్రి.) ఉ. కూలిచేయు. పిడి చేయడానికిగాను కొడవలి క్రిందిభాగాన్ని సన్నగా పొడవుగా చేయడం. (తె. 19, 21).

కూలేగ: చిన్న మెరుగుకడ్డి. (కో. 21).

కూస: చూ. కూసం. (కో. 24).

కూసం: రూ. కూస. పర్యా. కూసంపట్టి, పిన్ను[2], మూలల్లాంపు. బీరువా, సేఫ్‌లాకర్ తలుపు సులభంగా తిరగడానికి, గట్టిగ ఉండడానికి అమర్చిన లోహపు కడ్డి. (కో. 17, 18; తె. 22; రా. 16).

కూసంచేయు: (క్రి.) కత్తెరను పట్టుకోడానికి వేలి రింగు చేయడానికి ఇనప పట్టిని పొడవుగా సన్న కాడలాగ తయారుచేయడం. (తె. 17).

కూసంపట్టి: చూ. పర్యా. కూసం. బీరువా. సేఫ్‌లాకర్ తలుపు సులభంగా తిరగడానికి, గట్టిగ ఉండడానికి అమర్చిన చిన్న కడ్డి. (కో. 26; తె. 27).

కెటిలు: (< ఇం. Kettle). ఉ. కిట్లీ. కెట్లి, కేట్లీ. రూ. కెతిలీ. పర్యా. రేకుగిన్నె. కాఫి, టీ తయారు చేయడానికి వాడే గిన్నె. (కో. 16, 17, 22, 23, 26, 30; తె. 3, 5, 6, 8, 9, 12, 24; రా. 6, 11, 12, 14).

కెతిలీ: ఉ. కెతిలీ, కేతిలీ, కేత్లి. చూ. కెటిలు. (తె. 2, 7, 21, 23).

కెంపు: చూ. పర్యా. రాగి పాత్రలకు, గుళ్ళవస్తువులకు

వాడే ఎర్రగా ఉండే ఒకరకం లోహం. (రా. 14).

కేక్ ఓవను: (< ఇం. Cake oven). పర్యా. కేక్ పాటు. కేకుగిన్నె. కేకును తయారుచేయడానికి ఉపయోగించే అల్యూమినియం పరికరం. (కో. 1,7).

కేక్‌పాటు: చూ. పర్యా. కేక్ ఓవను. కేకును తయారు చేయడానికి ఉపయోగించే అల్యూమినియం పరికరం. (తె. 17, 20, 22).

కేకుగిన్నె: (< ఇం. Cake + గిన్నె). కేకును తయారుచేయడానికి ఉపయోగించే అల్యూమినియం పరికరం. (కో. 24).

కేచెంబు: సీకు తెచ్చుకోడానికి ఉపయోగించే చిన్న పాత్ర. (కో. 2).

కేటలాగు: (< ఇం. Catalogue). చూ. పర్యా. కాట్‌లెటరు. డిజైన్లను తయారుచేయడానికి వాడే బొమ్మల పుస్తకం. (తె. 1, 7, 17).

కేను: (< ఇం. Cane). చూ. కాను. చూ. పర్యా. పాలక్యాను. వస్తువులు నిల్వ ఉంచడానికి ఉపయోగించే మూత ఉన్న, పెద్ద అల్యూమినియం డబ్బా. చూ. చిత్రం 157. (కో. 21, 23).

కేబుల్ విత్ హోల్డరు: (< ఇం. Cable with holder). వెల్డింగ్ రాడ్ను మిషన్‌కు అమర్చిన భాగం. (రా. 7).

కేబుల్ వైరు: (< ఇం. Cable wire). చూ. పర్యా. కేబులు. వెల్డింగ్ ట్రాన్స్‌ఫారంనుండి హోల్డర్‌కు కరెంటును అందించడానికి ఉపయోగించే మందమైన రాగితంతి. (తె. 15, 18).

కేబులు: (< ఇం. Cable). పర్యా. కేబుల్ వైరు. వెల్డింగ్ కేబుల్సు, వెల్డింగ్ వైరు. వెల్డింగ్ ట్రాన్స్‌ఫారంనుండి హోల్డరుకు కరెంటును అందించడానికి ఉపయోగించే మందమైన రాగితంతి. సన్నని రాగి తంతెలను ఒక తాడులాగ చేసి, గొట్టంలో అమర్చి ఉంటారు. (తె. 7, 25).

కేరేజి: భోజనం తీసుకెళ్ళడానికి నాల్గు గిన్నెలుండే లోహపు పరికరం. (కో. 16, 14).

కైపటి: ములకట్టు వేసేటప్పుడు వాడే సాధనం. (రా. 11, 12).

కైపిడి: ఉ. కైపిడి. పర్యా. చేపిడీటుండు. చేయిపిడి, పిడి, హ్యాండిలు[1], పెద్దైను పట్టుకోడానికి వీలుగా అమర్చిన నిర్మాణం. (రా. 10, 12).

కైలదిగు: (క్రి.) లోహాన్ని కల్పగ పళ్లెం ఆకారం వచ్చేటట్లు తయారుచేయడం. (తె. 17).

కైవడి[1]: చూ. పర్యా. కంపాసు[1]. పెద్దమూత నిలబెట్టడానికి వాడే అడుగుభాగంపైన ఉండే కీలుబందు. (రా. 8).

కైవడి[2]: చూ. పర్యా. కంపర్ బాక్సు. లోహపు రేకుపై, పట్టీపై గుండ్రని గీతలు గీయడానికి వాడే పరికరం. (రా. 8).

కైవారం: చూ. పర్యా. కంపాసు. రేకుబిళ్ల సర్కిలు గీసుకోడానికి వాడేపరికరం. (కో. 26, 28; తె. 10, 11; రా. 10).

కైవారంవేయు: పర్యా. కైవారంతిప్పు, కైవారంపెట్టు; గీయు. రేకుపై కైవారంతో గుండ్రగా గీతగీయడం. (రా. 10).

కైవారంకత్తిరి: చూ. పర్యా. కంపర్‌బాక్సు. లోహపు రేకుపై, పట్టీపై గుండ్రనిగీతలు గీయడానికివాడే పరికరం. (కో. 24).

కైవారంతిప్పు: (క్రి.) చూ. పర్యా. కైవారంవేయు. రేకుపై కైవారంతో గుండ్రంగా గీతగీయడం. (తె. 17).

కైవారంపెట్టు: చూ. పర్యా. కైవారంవేయు. రేకుపై కైవారంతో గుండ్రంగా గీతవేయడం. (తె. 4, 22).

కైవారు: చూ. పర్యా. కంపర్‌బాక్సు. లోహపురేకుపై, పట్టీపై గుండ్రనిగీతలు గీయడానికివాడే పరికరం, (కో. 1-4, 6, 8, 9-13, 27, 29; తె. 1-4, 6-9, 12, 14, 16-18. 21, 23-25; రా. 2, 5-8, 10-12, 14-16).

కొక్కి: కొలిమిలో కమ్ములుతీసే పరికరం. (రా. 3, 7).

కొంకర్లు: గిన్నెకొనభాగం వంపులు (తె. 8).

కొంకిసుత్తి: బిందెలగొంతు భాగాన్నిసరిచేసే పనిముట్టు. (రా. 13).

కొంగముట్టుకారు: తాళంలోఉండే లివర్లు ఊడదీయ డానికివాడే పనిముట్టు. (కో. 18).

కొంగమూతిసుత్తె: చూ. పర్యా. కొంగసుత్తి. కొంగ మూతిసుత్తెలాగా ఉండే పరికరం. కొసభాగంలో రింగులాగ ఉంటుంది. రేకు లోపలిభాగంలో పొక్కింపడానికి ఉపయోగం. (తె. 24).

కొంగసుత్తి: పర్యా. కొంగమూతిసుత్తె. కొంగమూతి లాగా ఉండే పరికరం. కొసభాగంలో రింగులాగా ఉంటుంది. రేకులోపలి భాగంలో పొక్కించడానికి ఉపయోగం. (కో. 7).

కొచ్చెగచేయు: (క్రి.) మొద్దుబారిన పనిముట్లను పదునుపెట్టడం. (రా. 14, 15).

కొజ్జాసెరవ: వివాహాదిసమయాల్లో అన్నం వండేందు కుపయోగించే గంట ఆకారంలో ఉండే వెడల్పు

తక్కువగల ఇత్తడిపాత్ర. (తె. 4).

కొంచి: చిన్నరంధ్రాలు చేయడానికి వాడే పనిముట్టు. (కో. 27).

కొట్టు: (క్రి.) పర్యా. తట్టు², సన్నచేయు². కాల్చిన తర్వాత లోహపు రేకులను, కడ్డీలను పట్టంగ అదరగొట్టడం. (కో. 1; రా. 3, 5).

కొట్ర: కూరలు సన్నగుసవి వేసుకోవడానికి ఉపయోగించే పాత్ర. (రా. 15).

కొడలి: చూ. పర్యా. కత్తిపీట. కూరగాయలు తరగడానికి వాడే సాధనం. (తె. 12).

కొడవలి: పైరు లేదా గడ్డికోయడానికి వాడే పదునైన ఇనపసాధనం. చూ. చిత్రం 66. (రా. 3, 5, 11).

కొడిమాలబిందె: కిందిభాగం సన్నగాఉండి పైన ఏటవాలుగాఉండే నీళ్ళ పాత్ర. (తె. 15).

కొండ: చక్రానికి అశీలు బిగించడానికి ఉపయోగించే పరికరం. (తె. 2).

కొండి¹: తాళానికి ఉండే లావుకడ్డి. (తె. 5).

కొండి²: పట్టుకోవడానికి పెట్టెకు ఇరువైపులఉండే హాండిలు. (తె. 6).

కొండికారు: ఇనుమును సరికేటప్పుడు కానాన్ని, రంధ్రాలేసేటప్పుడు పోగర్లను పట్టుకోడానికి ఉపయోగించే పరికరం. (తె. 18).

కొండిగిన్నె¹: పర్యా. డొంగ. చలివేంద్రంలో నీళ్ళు పోయడానికి వాడే సాధనం. (తె. 1).

కొండిగిన్నె²: టీ తయారుచేయడానికి ఉపయోగించే ఇరువైపుల హాండిల్సు, కాడ ఉన్న పాత్ర. (తె. 1, 2).

కొండిచెంబు: ప్రయాణాల్లో నీళ్ళు తీసుకెళ్ళడానికి ఉపయోగించే మరచెంబు. (తె. 6).

కొండిటిఫను: ఏవైన పదార్థాలను తీసుకెళ్ళడానికి వాడే హాండిలు, మూతఉండే పొడవుపాత్ర. (తె. 6).

కొండిడబ్బా: ఏవైన వస్తువులు తీసుకెళ్ళడానికి ఉపయోగించే మూత. (తె. 5).

కొండిపావు: పర్యా. కోపా, మగ్గు. నీళ్ళు పోసుకోడానికి, వేడిగాఉండే ద్రవపదార్థాలను చల్లార్చడానికి ఉపయోగించే లోహపు పాత్ర. చూ. చిత్రం 67. (లా. 16).

కొండీసూది: ఆడవాళ్ళు తలలో గుచ్చుకోడానికి ఉపయోగించే పిన్ను. (రా. 6).

కొండెంకరవాయి: మూతిబిందె అడుగు తట్టడానికి వాడే పనిముట్టు. (రా. 1).

కొండ్లకారు: తెగబెట్టేటప్పుడు ఇనుప పట్టీలను గట్టిగా పట్టుకోవడానికి వాడే పరికరం. దీని తలభాగం కొద్దిగ వంపుతిరిగి కొంచెం వెడల్పుగ ఉంటుంది. (తె. 18).

కొండ్లగిన్నె: అంచుల్లో వంపుతిరిగి ఉన్న చిన్నపాత్ర. హూటకు వాడ్తారు. (తె. 8, 9).

కొండ్లు: పట్టుకోవడానికి పాత్రలకు అమర్చిన హాండిల్సు. (తె. 1).

కొత్తనమూనా బిందె: పర్యా. రేకుబిందె. నీళ్ళు తేవడానికి ఉపయోగించే డబ్బీ ఆకారపు ఇత్తడి బిందె. (తె. 5, 6).

కొత్తనమూనా బిందెల కరవాయి: డబ్బీ ఆకారపు రేకు బిందెలను తయారుచేయడానికి వాడే మోపు. (తె. 3, 6).

కొత్తంపార. పర్యా. బొరుగు. గడ్డి తవ్వడానికి వాడే పనిముట్టు. (తె. 6).

కొదురు: చూ. పర్యా. అమరువాలేగ. పాలిష్ పాత్రలపై డిజైన్‌లు వేయడానికి వాడే పనిముట్టు. (రా. 1).

కొన: కొడవలి ముక్కుభాగం. (రా. 4).

కొప్పెర: ఉ. కుప్పెర. చూ. పర్యా. కాగుడు తపాల. పట్టుకోడానికి ఇరువైపులా పిడి అమర్చిన లోహపు పాత్ర. నీళ్ళు కాగబెట్టుకోడానికి ఉపయోగం. (తె. 9, 11–13, 15, 17–21, 23–25).

కొప్పెర కరవాయి: కొప్పెర తయారీలో ఉపయోగించే పనిముట్టు. (తె. 10, 11).

కొబ్బరి కట్టరు: (< కొబ్బరి + ఇం. Cutter). చూ. పర్యా. కుడక. కొబ్మరి తురమడానికి వాడే పరికరం. (తె. 15),

కొబ్బరికోరం: ఉ. కొబ్బెర కోరాం, కొబ్బెర కోరెం. చూ. కొబ్బరికోరా. చూ. పర్యా. కుడక. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (కో. 4, 5, 14, 26; తె. 19, 21).

కొబ్బరికోరా: ఉ. కొబ్బర కోరి. చూ. కొబ్బరికోరం. (కో. 15; తె. 2).

కొబ్బరిగరిక: చూ. పర్యా. కుడక. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (రా. 15).

కొబ్బరిగసిని: చూ. పర్యా. కుడక. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (తె. 10).

కొబ్బరిగిరె: చూ. పర్యా. కుడక. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (తె. 10).

కొబ్బరితురుము: ఉ. కొబ్బరితురుం. చూ. పర్యా. కుడక. కొబ్బరితురమడానికి వాడేపరికరం.

(కో. 1-5, 14, 15; తె. 10-13, 15, 21; రా. 4, 6, 7).

కొబ్బరిపీట: చూ. పర్యా. కుడ్క. కొబ్బరితురమడానికి వాడే పరికరం. (కో. 2; తె. 3, 19, 23-25).

కొబ్బరిపీచు: పాత్రలను తోమడానికివాడే టెంకాయ నార. (కో. 27; తె. 14, 16).

కొబ్బరిబోండ: కొబ్బరిబోండా ఆకారంలోఉండే లోహపుపాత్ర. (కో. 26).

కొబ్బరిమట్టు: కొబ్బరిపుల్లల చీపురు. బిందెలపై ఆసిడ్ పూయడానికి ఉపయోగం. (కో. 21).

కొబ్బెరనూనె: ఉ. కొబ్బరినూనె. పనిముట్లకు టెంపరివ్వటానికివాడే నూనె (తె. 3, 21).

కొబ్బెరమిషిను: (< కొబ్బర + ఇం. Machine). చూ. పర్యా. కుడ్క. కొబ్బరను తురమడానికివాడే సాధనం. (తె. 17).

కొమ్ముచెంబు: చూ. పర్యా. పాలచెంబు[2]. ఒకప్రక్క కొమ్ములాంటి గొట్టం, మరోప్రక్క పిడిఅతికి చేసిన చెంబు. చిన్నపిల్లలకు పాలుపట్టడానికి ఉపయోగం. (కో. 5, 7. 12, 12, 15, 15).

కొమ్ముడాకిలి: చూ. కొమ్ముదాగలి. (రా. 4, 7).

కొమ్ముదాకలి: చూ. కొమ్ముదాగలి. (తె. 25).

కొమ్ముదాగలి: రూ. కొమ్ముడాకలి, కొమ్ముదాకిలి. పర్యా. డాకలా. ముక్కుపన. ఇనపముక్కల్ని గుండ్రగా వంపుపెట్టడానికి, ఇత్తడిబిందె మెడ భాగంలో కొట్టడానికివాడే దిమ్మ. దీనికి ఒకప్రక్క కొమ్ములాగా ఉంటుంది. (కో. 5, 7, 11, 12, 16, 19, 21, 25-29; రా. 2),

కొమ్మునుత్తి: పర్యా. తోకసుత్తి. రివిట్లుకొట్టడానికి వీలుగా రంధ్రాలు వేయడానికివాడే పనిముట్టు. (కో. 16, 24; రా. 11, 13).

కొంపాసు: (< ఇం. Compass). చూ. కుంపసు. (కో. 10; రా. 11).

కొయ్య: తరిణిపనిలో పాత్రను తగిలించుకోడానికి వాడే పరికరం. (రా. 5).

కొయ్యతుండు: పర్యా. కొయ్యదిమ్మ. మానితుండు. బిందె లావుచేయడానికి, కరవాయి కిందపెట్టడానికి వాడే పనిముట్టు. (రా. 1, 2, 3).

కొయ్యదిమ్మ: చూ. పర్యా. కొయ్యతుండు. విగ్రహం రేకులు జాయింట్ చేయడానికి వాడే పరికరం. (కో. 10).

కొయ్యమట్టంసుత్తి: రేకును చదరం చేయడానికి వాడే పరికరం (రా. 2, 5).

కొయ్యసుత్తి: ఉ. కొయ్యసుత్తె. చూ. పర్యా. ఉడన్ హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 1, 2, 4-6, 8, 9, 11, 15, 19; తె. 3, 8; రా. 2-6).

కొరడు: ఉ. కురుడు. చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండ పట్టి ఉంచడానికి వాడే కొయ్యిమొద్దు. (తె. 1, 3; 23-26).

కొరడుమొద్దు: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండా పట్టి ఉంచడానికి వాడే కొయ్యమొద్దు. (తె. 1).

కొరం: అడుగుబిళ్ళను సాపుచేయడానికి వాడే గెడ్డపార లాంటి పరికరం. (తె. 11).

కొరాం: చూ. పర్యా. ఊస. టంకాన్ని రవ్వచేయడానికి వాడే పరికరం. (తె. 17).

కొరివిందంరాయి: చూ. కురుందంరాయి. (తె. 23).

కొలకుండ: ధాన్యం కొలవడానికి వాడే పెద్ద లోహపు పాత్ర. (తె. 24).

కొలతగిన్నె: ద్రవపదార్థాల్ని కొలవడానికి వాడే గిన్నె. (కో. 6, 11).

కొలతపైపు: (< కొలత + ఇం. Pipe). చూ. పర్యా. పంపు[3]. డ్రమ్ముల్లోనుండి నూనెను పైకి తోడుకో డానికి ఉపయోగపడే సాధనం. (రా. 5).

కొలతబద్ద: రూ. కొలబద్ద. చూ. పర్యా. అడికోలు. ఇత్తడిరేకులపై, ఇనుపసామాన్లపై కొలతలను గీసేందుకు వాడే ఇనుపబద్ద. అంగుళాలు, అంగుళాల భాగాలు గుర్తించిన రెండడుగుల పొడవుంటుంది. (కో. 2, 12, 18; 30; తె. 10-12).

కొలబద్ద: చూ. కొలతబద్ద. (కో. 30).

కొలంబియాకత్ర: చూ. పర్యా. కత్తె. గోడుగుకు ఆధారమైన పొడవాటి లోహపు కడ్డీ. (కో. 29).

కొలాయి: పర్యా. టాకి[3], డ్రమ్ము[2], నీళ్ళకొలాయి, నీళ్ళటాంకి, నీళ్ళడబ్బా, నీళ్ళడ్రమ్ము, పవాళీ, వాటర్ టాంకి, మంచినీళ్ళు నిల్వఉంచడానికి కింది భాగాన కోళాయి అమర్చిన పరికరం. చూ. చిత్రం 124. (రా. 12).

కొలిమి: ఉ. కొలుం, కొలుము, కొల్మి. చూ. పర్యా. కరుగుకొలిమి. లోహాలను వేడిచేయడానికి ఉపయో గించే పొయ్యి. చూ. చిత్రం 69. (కో. 4, 9, 11, 15, 17-20, 22, 26, 28; తె. 1-4, 6, 7, 17-21, 23-25; రా. 10).

కొలిమికారు: చూ. పర్యా. పర్యా. కమ్మరకారు, అతికేటప్పుడు లోహపుపాత్రలను పట్టుకోడానికి,

తెగ్గొట్టేటప్పుడు లోహపుకడ్డీలను పట్టుకోడానికివాడే సాధనం. చూ. చిత్రం 147. (కో. 7).

కొలిమిపని: చూ. పర్యా. కమ్మరం. లోహాలతో పాత్రలను, పనిముట్లను తయారుచేసే పని. (కో. 16, 19; తె. 3, 4, 10, 12, 13, 15).

కొలిమిచువ్వ: పర్యా. ఖడియా, గజం[4], గజఊస, టాకింగ్‌రాడ్, చేకొలిమిసలాక, డాఖని, పడవకారు, పుల్ల[2], పొగడబ్బ, బొరిగి, భోజొప్ప. బోదులుకమ్మి, నటికెం, చట్టుపూస, చట్రం[2], సరిగోలు, సరిగోలు కమ్మి, సరుకోలుకడ్డి, సీకు[3], సువ్వ[2], సెలాకు, సెలాకుపుల్ల, సొరకత్తెలు. కొలిమిలోని బొగ్గను కుదించడానికి, కాకనుచూడ్డానికి వాడే కొద్దిగ వంపు తిరిగిన సన్నని పొడవుకడ్డీ. (తె. 24).

కొలుచుకొను: (క్రి.) రేకును కొలత వేసుకోవడం. (రా. 1).

కొలువు: కొలిమిలో ఇనపకడ్డీలు పెట్టి ఎక్కువసేపు లేకుండా చేయడం. (రా. 5).

కొల్తెం: బిందెలో కీటు-కోదలమధ్య ఉండే ఏటవాలు భాగం. (తె. 3).

కొల్తెం ఏయు: (క్రి.) బిందె మూతిభాగాన్ని వెనక్కి వంచి అంచుచేయడం. (తె. 3, 26).

కొళ: చూ. పర్యా. కోవ. పట్టిమాదిరి వెనక్కి మడచిన బిందె పైభాగపు అంచు. (తె. 8).

కొళాయి బక్కెట్టు: పర్యా. జార. కొలాయి అమర్చిన లోహపు నీళ్ళపాత్ర. (రా. 10, 11).

కొళివి: చూ. పర్యా. పొయ్యిగొట్టం. కట్టెల పొయ్యికి గాలి ఊపడానికి ఉపయోగించే పరికరం. (రా.)

కొస: బిందె కొనభాగం. (తె. 16).

కొసగొట్టు: (క్రి.) బిందెవాయి పండ్లు కత్తిరించి జవ్వకు అతకడానికి ముందు నున్నగ సాపు చేయడం. (తె. 25).

కొసీఛాణం: కడ్డీ మూలలు కత్తరించడానికి వాడే పనిముట్టు. (రా. 12).

కొస్సగచేయు: (క్రి.) పర్యా. సువ్వచేయు. కూచిగ చేయడం. (తె. 5).

కోకనట్టుజాడి: (< ఇం. Coconut + జాడి). కొబ్బరికాయ ఆకారంలో ఉండి పైమూతఉండే పాత్ర. (కో. 17).

కోకనట్టుడబ్బా: (< ఇం. Coconut + డబ్బా). కొబ్బరినూనె పోసుకోడానికి ఉపయోగించే రేకు పాత్ర. (కో. 4).

**కోకు:** పర్యా. కోకొబొగ్గు. కొలిమిలోవేడి బాగా రావడానికి ఉపయోగించే నల్లనిపదార్థం. (రా. 11).

కోకొబొగ్గు: చూ. పర్యా. కోకు. కొలిమిలోవేడి బాగా రావడానికి ఉపయోగించే నల్లనిపదార్థం. (కో. 10, 28).

కోటపాడుబిందె: కోటపాడులో తయారయిన నీళ్ళ పాత్ర. (కో. 24).

కోటేకు: చూ. పర్యా. అరటేకు. అరటాకు నగభాగం ఆకారంతో అంచులేకుండా తయారుచేసిన స్టీలుపళ్ళెం. పెద్దసైజువి భోజనాలకు, చిన్నసైజువి ఫలహారాలకు, ఇంకా చిన్నసైజువి దేవునిదగ్గర నైవేద్యానికి వాడ్తారు. చూ. చిత్రం 15. (కో. 13).

కోట్రింగు: సైకిల్‌హ్యాండిల్ హెడ్‌బోల్టు బిగించ డానికి ఉపయోగించే స్పానరు (తె. 3, రా. 8).

కోడికత్తి: పందెంలో కోడికాళ్ళకు కట్టడానికి వాడేచాకు. (కో. 20, 24; తె. 21).

కోడిగుడ్డుకంచం: పర్యా. కోడిగుడ్డుగిన్నె. అన్నం తినడానికి ఉపయోగించే కోడిగుడ్డు ఆకారంలోఉండే పళ్ళెం. (కో. 2, 3, 20; 23).

కోడిగుడ్డుగరిటె: కూరలు వేసుకోడానికి వాడే కోడిగుడ్డు ఆకారంలో ఉండే పరికరం. (తె. 23).

కోడిగుడ్డుగిన్నె: చూ. పర్యా. కోడిగుడ్డుకంచం. అన్నం తినడానికి ఉపయోగించే కోడిగుడ్డు ఆకారంలోఉండే పళ్ళెం. (కో. 1).

కోడిగుడ్డుప్లేటు: (< కోడిగుడ్డు + ఇం. Plate). ఫలహారం తినడానికివాడే కోడిగుడ్డు ఆకారంలోఉన్న చిన్నతట్ట. (కో. 19).

కోడిబొద్దులు: కోడికాళ్ళకు కడెంలాగాచుట్టిన లోహపు తొడుగు. (రా. 7).

కోడి లోలాకులు: కోడి చెవులకు వేసిన ఆభరణాలు. (రా. 7).

కోణం: బిందెలో జవ్వ, గొంతు కలిసేభాగం. (కో. 5).

కోణంపులేలు: బీరువా రేకు మడుపులను చక్కగా చేయడానికి వాడే సాధనం. (తె. 17).

కోణంసుత్తి: కడ్డీలను వంపు చేయడానికి వాడే సాధనం. (కో. 18, 26).

కోన్ ఆక్‌పర్ చెంబు: పర్యా. కోను అకుపరా, కోను ఆప్‌కార. పొట్టభాగం 'V' ఆకారం కలిగిన లోహపు పాత్ర. నీళ్ళు తాగడానికి వాడ్తారు. (కో. 24).

కోన్‌రింజి: సైకిలు చక్రం లేవలు చేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 14).

కోనసుత్తి: స్టీల్ గిన్నెలకు సొట్టలు లేకుండా సరిచేయ డానికి ఉపయోగించే పరికరం. (కో. 4, 9).

కోనం: పాత్ర మధ్యభాగం. (కో. 18).

కోనం గునపం: అల్యూమినియం పాత్రలు పదరం చేయడానికి వాడే పరికరం. (కో. 13).

కోవీలు: రేకు మూలభాగాలు. (కో. 22).

కోను: కుతిక, దొడ్డిల మధ్య ఉండే ఇరుకు భాగం. (కో. 23).

కోను అకుపరా: చూ. పర్యా. కోను ఆక్సర్ చెంబు. కోణంలాంటి పొట్టభాగం కలిగిన లోహపు చెంబు. నీళ్ళు తాగడానికి ఉపయోగం. (కో. 21).

కోన్ అప్కార: చూ. పర్యా. కోన్ ఆక్సర్ చెంబు. పొట్టభాగం 'V' అకారం కలిగిన లోహపు పాత్ర. నీళ్ళు తాగడానికి ఉపయోగం. (కో. 22).

కోనుగిన్నె: చూ. పర్యా. దబ్బకాయ గిన్నె. మట్టులేని చిన్న లోహపుపాత్ర. (కో. 16).

కోనుపాట: రేకును ఏటవాలుగా వంచడానికి ఉపయో గించే పరికరం. (కో. 22).

కోపా: చూ. పర్యా. కొండిసావు. నీళ్ళు పోసుకోడానికి, వేడిగా ఉండే ద్రవపదార్థాలను చల్లార్చడానికి వాడే లోహపు పాత్ర. చూ. చిత్రం 67. (కో. 20, 21, 24, 28).

కోపు¹: చక్రంలో ఇరుసును అమర్చడానికి తయారు చేసిన గుండ్రని భాగం. (కో. 26; తె. 23).

కోపు²: తేజాబ్‌నువేసి ఉంచే చిన్నపాత్ర. (తె. 23).

కోపు³: టీ తాగడానికివాడే గిన్నె. (తె. 19).

కోపుచేయు: (క్రి.) ఇరుసును రొదలోకి ఎక్కించ డానికి పొడవుగా గుండ్రంగా చేయడం. (తె. 21).

కోయు¹: (క్రి.) తాళంచెవిని లివర్ల సైజు ప్రకారం ఆకురాయితో అరగదీయడం. (కో. 19, 24).

కోయు²: (క్రి.) అతకడానికి వీలుగా రేకులను కత్తెరతో కత్తరించడం. (కో. 30; తె. 3).

కోయు³: బీరువా తలుపులకుండే మరలుత్రిప్పడం. (కో. 19).

కోయు⁴: (క్రి.) అచ్చులచుట్టు మటిలేకుండ రేకుతో సాపుచేయడం. (కో. 20, 21).

కోయు:⁵ (క్రి.) పొడవుగ ఉండే ఇనపముక్కలను చిన్నవిగా చేయడం. (కో. 17, 18, 20, 22, 23, 26).

కోర్‌సింగు: రేకుపై రంధ్రాలువేసిన తర్వాత కింది వైపు విచ్చుకొనిఉండే రేకు. (కో. 24).

కోరం¹: ఉ. కొరాం, కోరాం. చూ. పర్యా. ఉండ గడ్డపార. లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అతుకుభాగాలు సాపుచేయడానికి వాడేపరికం. (తె. 10, 14, 15, 17, 18, 20).

కోరం²: ఉ. కోరాం. చూ. పర్యా. కుడ్క. కొబ్బరి తురుమడానికివాడే పరికరం. (కో. 16-22, 28).

కోరంచాకలి: రూ. కోరదాకలి. చూ. పర్యా. ఉండ గడ్డపార. లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అతుకుభాగాలు సాపుచేయడానికివాడే పరికరం. చూ. చిత్రం 83. (తె. 8, 9).

కోరాపేయు: (క్రి.) రేకుపైభాగం అంచులుమడిచి దిమ్మలాగా చేయడం. (తె. 17).

కోరాం: చూ. పర్యా. కట్ట. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడేపరికరం. (తె. 8, 9).

కోరిమయం: చూ. పర్యా. కన్నం. పోతలోహాన్ని అచ్చులోకి పోయడానికి ఏర్పాటుచేసిన రంధ్రం. (రా. 15).

కోరు¹: (క్రి.) అచ్చును చేయడానికి ముందు బాక్సుల్లో మన్నును బాగాకూరడం. (కో. 26, రా. 15).

కోరు²: పర్యా. జవ్వ³, మూతపక్క, మూతపన్మ. ట్రంకుపెట్టె మూత భాగంలోని రేకు. (కో. 18).

కోరు³: అంచులు మడచిన రేకు. (కో. 19, 23, రా. 8, 10, 12, 15).

కోరుచేయు: (క్రి.) పర్యా. పచ్చికొట్టు, పచ్చి మలుపు, పచ్చివంచు, పంథాకొట్టు, పట్టాయించు, ఫ్రేముఖేపు, మల్‌కట్టు ఏయు, మల్‌కట్ కొట్టు, మడచు, మడత ఏయు¹, మడతబెట్టు, మడుసేయు, మల్చు¹, మోసేయు, వారకొట్టు. రెండు లోహపు రేకులను కలిపి, ఒకటిగ జాయింట్ చేయడం. (తె. 6).

కోరువంచు: (క్రి.) జవ్వంచు రేకును ముందుకు మడిచివేయడం. (కో. 22).

కోల: బిందె బిళ్ళ, జవ్వ కలిసిన భాగంకొలత. (తె. 8, 9).

కోలకంచం: కోడిగుడ్డు ఆకారంతో తయారుచేసిన పళ్ళెం. అన్నం తినడానికి ఉపయోగం. (కో. 12, 15).

కోలన: పెనం తయారుచేయడానికి వాడే పొడుగుసుత్తి. (తె. 10, 11).

కోలపెట్టు: (క్రి.) రూలు తీసిన రేకుపై దాని ప్రకారం సుద్దతో గీత గీయడం. (కో. 27).

కోలలు: చూ. కోళలు. (తె. 8, 9, 11).

కోలాడు: (క్రి.) లోహం అంతా కరగడానికి మూసను

కదిలించడం. (కో. 13).
కోళలు: రూ. కోలలు. ఉత్సవాల్లో చేత్తో పట్టుకొని ఆడడానికి వాడే సన్నగా కడ్డీ మాదిరిగా ఉండే సాధనాలు. (కో. 12; తె. 17, 19).
కోళ్ళు: చూ. కాళ్ళు. (కో. 24; తె. 17).
కోవ: పర్యా. కొళ, తాపుదాలు, వెలుసు². పట్టీమాదిరి వెనక్కి మడిచిన బిందె పైభాగపు అంచు. (కో. 27; తె. 3, 7, 19–22, 24, 25; రా. 7).
కోవచేయు: (క్రి.) బిందెగూటి అంచు గట్టిగా ఉండడానికి అంచుకింద చిన్న గడ్డిలాగ చేయడం. (తె. 13).
కోవడాకలి: చూ. పర్యా. కోవలసుత్తి. పాత్రల అంచు భాగాలను మడచడానికి వాడే కడ్డీ. కొద్దిగా ముందుకు వంచబడి పక్షికారంగా ఉంటుంది. (తె. 3).
కోవలకోరాం: చూ. పర్యా. కోవలసుత్తి. పాత్రల అంచులు మడచడానికి వాడే కడ్డీ. కొద్దిగ ముందుకు వంచబడి పక్షికారంగా ఉంటుంది. (తె. 13, 19, 20, 22).
కోవలసుత్తి: పర్యా. కోవడాకలి, కోవలకోరాం, కోవాల మొల, తోక కరువాయి. పాత్రల కోవలు (అంచులు) మడచడానికి వాడే కడ్డీ. కొద్దిగ ముందుకు వంచబడి పక్షికారంగా ఉంటుంది. (కో. 14; తె. 3, 19).
కోవాలమొల: చూ పర్యా. కోవలసుత్తి. పాత్రల అంచులు మడచడానికి వాడేకడ్డీ. కొద్దిగ ముందుకు వంచబడి పక్షికారంగా ఉంటుంది. (తె. 19).
కోషింగ్ ఇచ్చు: (క్రి.) బెజ్జాల క్రింది పొక్కులను తీసివేసి రంధ్రాలను శుభ్రం చేయడం. (తె. 2).
కోసుకొను¹: (క్రి.) కొలత ప్రకారం పట్టీలను కట్ చేయడం. (తె. 4).
కోసుకొను²: (క్రి.) తాళాన్ని సరిచేయడానికి తాళం చెవిని ఆకురాయిపైన కోయడం. (తె. 18).
కౌచవ: చూ. కవచం. (రా. 13).
కౌబారుసుత్తి: ఒకవైపు కొట్టడానికి మరొకవైపు సీలలు లాగడానికి తయారుచేసిన పనిముట్టు. (కో. 1).
కౌరుపోగర: పర్యా. గుప్పోగరు, దోనలపోగరు, ముక్కోణపు పోగరి. విగ్రహం కోణాల్లో, చిన్న భాగాల్లో మెరుగుగీతలు కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 10, 16, 18; రా. 1, 5).
క్యాను: (బ.) క్యాన్లు. పర్యా. నూనె కొసగు. పాలు తీసుకువెళ్ళడానికి, నూనె పోసుకోడానికి వాడేపాత్ర. (కో. 2; తె. 8, 9, 15).
క్యాప్ కటింగ్‌మిషను: (< ఇం. Cap Cutting Machine). డబ్బా మూతను తయారుచేయడానికి వాడే పరికరం. (రా. 7).
క్యాపరు: (< ఇం. Capper). ఇనుప రేకులను కొట్టడానికి ఉపయోగించే స్కేలులాగా ఉండే ఇనుప బద్ది. (కో. 13).
క్యాపు¹: చూ. పర్యా. కప్పు¹. గొడుగును మూసినపుడు ఛత్రి పుల్లలను పట్టి ఉంచడానికి ఉపయోగించే రింగులాంటి పరికరం. (తె. 6).
క్యాపు²: (< ఇం. Cap). చూ. పర్యా. కప్పు². గుడ్డ జారిపోకుండ, నీళ్ళు దిగకుండా ఉండడానికి గొడుగు పైభాగాన అమర్చిన చిన్నరేకు తొడుగు. (కో. 20, 23).
క్యాప్టెన్‌గాసు: (< ఇం. Captain glass). మధ్య భాగంలో వంకరఉండి వెడల్పుఅంచు ఉండే లోహపులోటా. కాఫీతాగడానికి వాడ్తారు. (తె. 14, 16).
క్యారీ: చూ. పర్యా. కారియరు. అన్నంవగైరా పదార్థాలు తీసుకెళ్ళడానికి వాడేపరికరం. (కో. 2; రా. 7).
క్యారీరు: చూ. కారియరు. (కో. 2, 4, 6–11).
క్యారీలు: (< ఇం. Carrier). సైకిల్‌వెనక కూర్చోడానికి ఉపయోగించే సీటు. (తె. 12).
క్యారెట్టుస్కాబరు: (< ఇం. Carret scabber). క్యారెట్లుతురమడానికి ఉపయోగించే పరికరం. (కో. 1).
క్యారేజిస్పూను: అన్నం తినడానికి ఉపయోగించే చిన్నగరిటె. (కో. 2).
క్రాంకు: సైకిల్‌లో కాళ్ళుపెట్టుకొనే ప్రక్కభాగం. (తె. 8).
క్రాష్‌మూలమట్టం: (< ఇం. Cross + మూలమట్టం). మంచాలకు కాళ్ళులెవల్ పెట్టుకోడానికి వాడేసాధనం. (రా. 2).
క్రాస్‌కరవాయి: (< ఇం. Corss + కరవాయి). పర్యా. క్రాస్‌గెడ్డపార, క్రాస్‌దట్టపోగరు. విగ్రహం పనిలో రేకుక్రాస్‌గా ఉంటే సరిచేయడానికి వాడే పరికరం. (కో. 3).
క్రాస్‌గెడ్డపార: (< ఇం. Cross + గడ్డపార). చూ. పర్యా. క్రాస్‌కరవాయి. విగ్రహంలోహాన్ని క్రాసుగా వంచడానికివాడే పరికరం. (కో. 3).
క్రాస్‌చిన్నపోగరు: (< ఇం. Cross + చిన్న

పోగరు). చిన్న చిన్న డిజైన్లు, నగిషీపని చేయడానికివాడే పరికరం. (కో. 3).

క్రాస్‌పట్టపోగరు: (< ఇం. Cross + దట్టపోగరు). చూ. పర్యా. క్రాస్‌పవాయి. శిల్పపనిలో విగ్రహం వేళ్ళుమలచడానికి వాడే పరికరం. (కో. 6).

క్రాస్‌పట్టుకార: (< ఇం. Cross + పట్టుకార). శిల్పి పనిలోక్రాస్‌గా ఉండే ముక్కలు పట్టుకోవడానికి వాడేపరికరం. (కో. 3).

క్రాస్‌పేన్‌హేమర్: (< ఇం. Cross pan Hammer). బీరువాపనిలో రేకులు కొట్టడానికివాడే పరికరం. (కో. 15).

క్రిందిఅచ్చు: బండిఇరుసు క్రిందిభాగంలో పెట్టుకోడానికి ఉపయోగించే పరికరం. (కో. 3).

క్రిందికట్టరు: (< క్రింది + ఇం. Cutter). ఇనుప ప్లేట్లను కటింగ్ చేయడానికి వాడే ఇనుపదిమ్మె. (రా. 7).

క్రిందిపాదం: దీపం క్రిందిభాగం. (రా. 5).

క్రిందిమిదిని: ఇనుపవస్తువులను గోలుచేయడానికి వాడే సాధనం. రా. (14).

క్రూడాయిలు: (< Crude oil). లోహపు అచ్చుకు, మట్టిని వేరుచేయడానికి ఉపయోగించే ద్రవపదార్థం. (రా. 2).

క్రూసుకిల్: చూ. పర్యా. సీమమూస. కరిగిన ద్రావకాన్ని కొలిమినుండి తెచ్చుకోడానికి ఉపయోగపడే కూజాలాంటి పాత్ర. రాజమండ్రిలో తయారయింది. (రా. 2).

క్లాత్‌ఎమరిపేపరు: (< ఇం. Cloth Emory Paper). పర్యా. బల్లకట్టు మెరుగు. చిలుమును తీసివేయడానికి ఉపయోగించే కాగితం. (తె. 2).

క్లాంపరు: (< ఇం. Clamper). వెల్డింగు ఉబ్బులను కొట్టడానికి వాడే సాధనం. (కో. 19).

క్లాంపు¹: (< ఇం. Clamp). బొగ్గుపొయ్యి తయారు చేయడానికి వాడే పైపు. (రా. 2).

క్లాంపు²: (ఇం. Clamp). పర్యా. క్లిప్పు². రేకులను కదలకుండ పట్టి ఉంచడానికి వాడే పట్టీ. (రా. 10-12, 16).

క్లిప్పు¹: (< ఇం. Clip). చూ. పర్యా. కప్పు¹. గొడుగును మూసినపుడు పుల్లలను పట్టిఉంచడానికి ఉపయోగించే రింగులాంటి పరికరం. (కో. 25, 26, 29, 60; తె. 23).

క్లిప్పు²: చూ. పర్యా. క్లాంపు. రేకులను వంచేటప్పుడు కదలకుండా పట్టివుంచటానికి వాడేసాధనం. (రా. 10).

క్లిప్పు³: సానరాయి నట్టును కదలకుండ పట్టిఉంచడానికి ఉపయోగించే కడ్డీ. (తె; 22).

క్లీనరు: (< ఇం. Cleaner). మెటల్‌పైనుండే మట్టిని రుద్దడానికివాడే పనిముట్టు. (రా. 11).

ఖట్కా¹: రూ. కట్కా. గొడుగును తెరచినపుడు ఛత్రిపుల్లలరన్నర్‌ను పట్టిఉంచడానికి గొడుగు ఇనప కర్రపై ఉండే పరికరం. క్రిందఒకటి, పైనఒకటి రెండు ఉంటాయి. (తె. 4, 6, 18, 20).

ఖట్కా²: టార్చిలైటుస్విచ్. (తె. 4).

ఖడియా: రూ. కడియా², కయ్యా². చూ. పర్యా. కొలిమిచువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికివాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవు కడ్డీ. (తె. 20).

ఖండించు: పర్యా. చెక్కు. రేకును కాల్చిసుధ్యలో కొద్దిగ చీల్చడం. (కో. 29).

ఖరాబవు: (క్రి.) (< ప. ఖరాబ్) ఇనుము తుప్పుపట్టి చెడిపోవడం. (రా. 17)

ఖాజాకట్టు: (క్రి.) గొడుగు గుడ్డకిందికి జారకుండ పైభాగాన కుట్టడం. (కో. 18).

ఖైంచి: (< హిం. కైంచీ) చూ. పర్యా. కత్తి. లోహపు రేకులను కత్తరించడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 38. (తె. 3, 4).

ఖైనాడబ్బా: సున్నం, మసాలపొడి వేసి ఉంచడానికి వాడే చిన్నడబ్బా. (కో. 30).

## గ

గంగచెంబు: కాశీనుంచి తీర్థం తీసుకరావడానికి వాడే మరచెంబు. (కో. 21, 24).

గంగాజమునకడవ: ఇత్తడి-రాగి కలిపిచేసిన బిందె. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. (తె. 4).

గంగాలం¹: చూ. గంగాళం. (కో. 23; తె. 3, 6, 7, 20, 23, 25).

గంగాలం²: అన్నం తినడానికి వాడే గిన్నె. (కో.28).

గంగాళం: (బ). గంగాళాలు. ఉ. గంగళం. గంగాళాం. రూ. గంగాలం¹. చూ. పర్యా. అండా¹. నీళ్ళు నిల్వచేసుకోడానికి వాడే ఇరుపైపుల రెండుకొక్కీలు, వెడల్పు మూతిఉన్న పెద్ద లోహపు పాత్ర. చూ. చిత్రం 8. (కో. 2-8, 10, 13, 16-20, 26, 29; తె. 1, 8, 9, 11, 12, 14-17, 24; రా. 2, 4, 7, 9, 15, 16).

గంగాళంకరవాయి: రూ. గంగాళాల కరవాయి.

గంగాళాల అంచులు మడుచుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 70. (కో. 5, 13; తె. 3).

గంగాళాలకరవాయి: చూ. గంగాళం కరవాయి. (కో. 2, 4, 8-13; తె. 1; రా. 9).

గంగాళాలగెడ్డపార: గంగాళాల అడుగులు కొట్టడానికి ఉపయోగపడే పరికరం. (కో. 6).

గంగురు: (< హిం. గంగ్రు). ఉ. గుంగురు. చూ. పర్యా. అందెలు. నాట్యసమయంలో కాళ్ళకు కట్టుకొనే చిన్న ఇత్తడిమువ్వలు. (తె. 10, 11).

గచ్చు: పర్యా. గాత్, గాబు[1], గుంట[3], గోళెం[1], తొక్కు[5], తొట్టి[4]. వేడిగాఉన్న లోహపు వస్తువులను చల్లబరచడానికి ఉపయోగపడే లోహపు పాత్ర. (రా. 16).

గజస్తంభాలు: ఆలయప్రాంగణంలో మొదట కనిపించే ధ్వజస్తంభం. (కో. 20).

గజం[1]: చూ. పర్యా. కడ్డీ. ఇత్తడిపాత్రలను రవ్వతో అతకడానికివాడే కడ్డీ (కో. 23, 24).

గజం[2]: చూ. పర్యా. పట్టీ[1]. రేకుపై కొలతలను గుర్తించడానికి ఉపయోగించే పొడవైన రేకు స్కేలు. చూ. చిత్రం 71. (తె. 18).

గజం[3]: చూ. పర్యా. కమాన్లు. గొడుగుకు ఆధారమైన కడ్డీ(లు). (కో. 29).

గజం[4]: చూ. పర్యా. కొలిమిచువ్వ. కొలిమిలో బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే, కొద్దిగ వంపుతిరిగిన, సన్నని పొడవు కడ్డి. (కో. 25-27).

గజంఊస: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడువు కడ్డీ. (కో. 24).

గజంకట్టె: చూ. పర్యా. పట్టీ[1]. రేకుపై కొలతలు వేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 71. (రా. 13).

గజంబద్ద: చూ. పర్యా. పట్టీ[1]. రేకులపై కొలత లేయడానికి ఉపయోగించే స్కేలు. చూ. చిత్రం 71. (కో. 14, 24, 27, తె. 17).

గజ్జికాయ అచ్చు: చూ. పర్యా. కజ్జికాయపెట్టె. కజ్జికాయలు తయారుచేసుకొనే అర్ధచంద్రాకారపు పరికరం. (కో. 23).

గజ్జిలబిందె: చూ. పర్యా. గుండుబిందె. నీళ్ళు తేవడానికి, వంటచేయడానికి వాడే వెడల్పు మూతిఉన్న గుండ్రని బిందె. చూ. చిత్రం 85. (కో. 1).

గజ్జెలగంట: అందంకోసం ఎద్దులకు, వాహనాలకు కట్టే గంట. (కో. 1).

గజ్జెలు[1]: చూ. పర్యా. అందెలు. నాట్య సమయంలో గల్లుగల్లు మనడానికి కాళ్ళకు కట్టుకొనే చిన్న ఇత్తడి సాధనాలు. (కో. 7, 29, 30; తె. 2, 6, 7, 10, 11, 22-25).

గజ్జెలు[2]: ఉ. గజ్జిలు. పర్యా. బునుగులు, బొడగలు, మువ్వలు, మూగలు. ఎద్దుల మెడకు, వాహనాలకు కట్టుకోడానికి వాడే లావుపాటి గుండ్రని ఇత్తడి సాధనాలు. (కో. 6, 7, 13, 28, 29; తె. 5, 8, 9, 17, 19, 22, 25).

గంజి: మచ్చె కొట్టేటప్పుడు ఇత్తడిరేకు మెతువుగ సాగడానికి బిందె లోపలిభాగాన పట్టించే పదార్థం. (తె. 24).

గంజితట్ట: చూ. పర్యా. అన్నం వంచుకోడానికి వాడే అడుగున రంధ్రాలున్న లోహపు పాత్ర. చూ. చిత్రం 11. (రా. 3).

గంజిదాక: పర్యా, గంజి వార్పుదాక. గంజి వార్చుకోడానికి వాడే లోహపు పాత్ర. (కో. 20).

గంజివారదాక: ఉ. గంజివార్దాక. చూ. గంజి వార్పుదాక. (కో. 18, 21).

గంజివార్పుదాక: చూ. పర్యా. గంజిదాక. గంజి వార్చుకోడానికి వాచే లోహపు పాత్ర. (కో. 17).

గంజు: చూ. పర్యా. డేగ్చా. వంటలు చేయడానికి వాడే లోహపు పాత్ర. ఏటవాలు భుజాలతో అడుగుభాగం వెడల్పుగ ఉంటుంది. చూ. చిత్రం 123. (తె. 12, 16, 17).

గటంచి: పర్యా. గడార[2], గాడికడ్డీ, గాడిదిమ్మ, గాడిసు, గాల[1], గాలపట్టె, గుండు[3], గేజి[1], గాడి అచ్చు, ఘరను, చైనలు, జగ్గుపాటను; జిగ్గు, జులరు, డంగ, డిజైను[1], డై[1], డైపాన, డైస్‌నెట్టు, నానిమొద్దు, పుల్లరు, బావుదిమ్మ, బెండ్‌పీసు, బెండింగ్‌గాల, బెండింగ్‌చిప్ప, బెండింగ్‌టేబులు, బెండింగ్‌ప్లేటు[2], రైలుపోలు, రైలుప్లాటు, సాంచ[2], స్కోరుదిమ్మె. లోహపురేకు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే సాధనం. (తె. 12).

గట్టు: సాగగొట్టిన దుక్క ముద్ద. (తె. 17).

గడ: తాళంలోపల (ఉండే) లివర్లకింద ఉండే సాధనం. దీనివల్ల తాళంచెవి సులువుగ తిరగగలుగుతుంది. (కో. 16).

గడచెంబు: పర్యా. మరముంత, రైలుకూజ. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగపడే చెంబు. (తె. 10 11).

గడార[1]: ఉ. గడారి, గడారు. చూ. పర్యా. ఊస, టంకాన్ని రవ్వచేయడానికి వాడేపరికరం. (రా. 11).

గడార[2] : ఉ. గడరు, గాడరు. రూ. గద్దరు, చూ. పర్యా. గటంచి, లోహపురేకులు, కడ్డీలు వంపు చేయడానికి వాడేదిమ్మ. (తె. 1, 3, 6, 8, 9, 13, 18; రా. 10, 12, 16).

గడి[1] : చూ. పర్యా. కానా. డిజైన్ ఫ్రేములో ఉండే ఒక్కొక్కడిజైన్‌అర. (కో. 24).

గడి[2] : బీరువాబీగం. (రా. 4).

గడయారంపెట్టె: గడియారాలను ఉంచుకోవడానికి ఉపయోగించే ఇనుపపెట్టె. (కో. 4, 9).

గడ్డ: పర్యా. దిమ్మ[2], లైట్‌గడ్డ, వ్యాపర్‌కేప్, హోల్డరు[3]. టార్చిలైట్‌లో బల్బును ఉంచడానికి అమర్చిన దిమ్మ. (తె. 3, 19-21, 23).

గడ్డకట్టు: (క్రి.) కొలిమిలో వేడెక్కిన పదార్థం చల్లారిన తర్వాత ఏర్పడేస్థితి. (రా. 1).

గడ్డపార: చూ. పర్యా. ఊస. టంకాన్ని రవ్వ చేయడానికి వాడే పరికరం. పాత్రలకు చుక్కలు కొట్టడానికి క్రింద పట్టుకోడానికి కూడా ఉపయోగం. (తె. 3; రా. 15).

గడ్డపారమొద్దు: గడ్డపారకింద ఎత్తుగ ఉంచడానికి వాడే కర్రదిమ్మ. (తె. 4).

గడ్డపిన్ను: చూ. పర్యా. కీల. ఇనుపపెట్టెలు తయారు చేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 4, 9, 11).

గడ్డరు: చూ. గడార[2]. (కో. 2, 4, 6-12, 18, 19, 21, 22, 24, 26, 28; తె. 2, 12, 20, 21, 22, 24; రా. 6).

గడ్డలు: పర్యా. గుట్టలుమిట్టలు. బిందెలో చదరంగా లేకుండాఉండే హెచ్చుతగ్గులు. (కో. 3).

గడ్డ: సీటులెవల్ చేయడానికి వాడేపనిముట్టు (రా. 4).

గంట: ఆలయాల్లో ఇండ్లలో పూజాసమయంలో వాయించడానికి, జంతువుల మెడలో కట్టడానికి ఉపయోగపడే పరికరం. చూ. చిత్రం 72. (కో. 21, 24, 30; తె. 2, 3, 5, 10, 11, 17-19, 25, రా. 6, 12, 15, 16).

గంటపోగరు: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలువేయడానికి వాడేపరికరం. (కో. 6).

గంటం[1]: అల్యూమినియం పోతపనిలో దొడ్ల అడుగు భాగంలో ఉండే గుండ్రపు పరికరం. (కో. 4).

గంటం[2]: లోహపు పాత్ర అచ్చును పట్టుకోడానికి ఉపయోగించే పొడవాటి కడ్డీ. (కో. 19-22, 24, 28).

గంటం[3]: చూ. పర్యా. ఘంటం. పూర్వం తాటాకులపై వ్రాయడానికి ఉపయోగించిన సాధనం.

గంటాకలాసు: డిజైను వంచుకోడానికి T ఆకారంలో ఉండే పరికరం. (కో. 15).

గంటు: బిందెపై ఉండే ఉబ్బు భాగం. (కో. 8).

గంటె[1]: చూ. పర్యా. కూరగరిటె. కూరలు వడ్డించ డానికి పదార్థాలు ఎత్తుకోడానికి వాడే సాధనం. (తె. 12).

గంటె[2]: పర్యా. గరిటె, గుదము, చెలికిపార, రేక[3], రైలుకట్నం, సేవాల్. కొలిమిలో బొగ్గులు వేయ డానికి వాడే పొడవుకాడ ఉన్న వెడల్పు రేక. (తె. 1; రా. 3).

గంట్లుకొట్టు: (క్రి). తయారైన బిందెపై చుక్కలు కొట్టడం. (కో. 24).

గండదీపం: గండం వచ్చినవాడు ఎత్తుకోడానికి ఉపయోగించే నాలుగు చంచాలున్న లోహపు పరి కరం. (తె. 21).

గదులపెట్టె: పర్యా. పోగుపుడబ్బా, పోపులడబ్బా, పోపులపెట్టె, మసాలడబ్బా, మసాల పొడిడబ్బా, మసాల బాక్సు. మసాల దినుసులు వేసి ఉంచుకో డానికి వాడే పరికరం. 4, 5; 6, 7 లేదా 8 గిన్నెలు కలిపి ఒక వెడల్పు పాత్రలో అమర్చి ఉంటారు. చూ. చిత్రం 73. (కో. 21).

గద్దె[1]: పర్యా. చుట్టకుదురు, బిందెకుదుర్లు, మట్టు[1]. పాత్రలు ఎత్తుగా ఉంచడానికి వీలుగా క్రిందిభాగంలో అమర్చిన గుండ్రటి లోహపురింగు. చూ. చిత్రం 99. (తె. 17).

గద్దె[2]: పర్యా. పాదపట్టే. విగ్రహంయొక్క అడుగు భాగం. (తె. 17).

గద్దెగిన్నె: చూ. పర్యా. మట్టుగిన్నె. కిందిభాగంలో మట్టుకలిగిన లోతైన లోహపు పాత్ర. అన్నం తినడానికి ఉపయోగం. (తె. 8).

గద్దెగిలాసా: పర్యా. మట్టుగ్లాసు. క్రిందిభాగంలో మట్టుఉండే లోటా. (కో. 2).

గద్దెచెంబు: పర్యా. మట్టుచెంబు. అడుగుభాగం కింద మోపకుండ ఎత్తయిన కట్టు అమర్చిన సన్నమూతి లోహపు చెంబు. (తె. 3, 6, 8, 9, 18).

గద్దెచెంబులకరవాయి: గద్దెచెంబుల మధ్యభాగాన్ని చేయడానికి ఉపయోగించే సాధనం. (తె. 3).

గన్: (< ఇం. Gun) రూ. ఘన్. చూ. పర్యా. గన్ సుత్తె. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాగ్గొట్టడానికి వాడే లావు సుత్తి. తుపాకిలోని కర్ర భాగపు ఆకారంలో చేసినట్టి సుత్తి. (కో. 3, 23;

తె. 1-5, 8-11, 15, 18, 20, 24; రా. 12-16).

గన్‌మెటల్: (< ఇం. Gun Metal). ఇత్తడి, రాగి, సీసం, కలిపిన లోహం. (రా. 2).

గన్‌సుత్తె: (< ఇం. Gun + సుత్తి). రూ. గన్నుసుత్తె. పర్యా. గన్. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి; సాగ్గొట్టడానికి వాడే పరికరం. తుపాకి లోని కర్రభాగపు ఆకారంలో చేసినట్టి సుత్తి. (తె. 1, 2, 7, 9-11; 16, 18, 21; రా. 2).

గనగ: చూ. పర్యా. డగ్గా. ఇనపకడ్డీలను వంపుపెట్ట డానికి వాడే పెట్టెలాగా ఉండే పరికరం. (కో. 28).

గనపుపురి: పర్యా. గోనెపీసు. శిల్పపనిలో లోహపు అచ్చు మట్టిఅచ్చు విడిపోకుండా దళంగా ఉండ డానికి మట్టిలోకలిపే జనపనార. (రా. 2).

గనం: పర్యా. గనంసీటు. మందపులోహపు రేకు. (రా. 3).

గనంసీటు: చూ. పర్యా. గనం. మందపులోహపురేకు. (రా. 3).

గన్ను: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపుపాత్రల నొక్కులుతీయడానికి, అడుగుభాగాలు సాపు చేయడానికివాడే పరికరం. (తె. 1, 5, 7, 19-26).

గన్నుబండ: పోతబిళ్ళ అంచుల్ని పల్చగచేయడానికి వాడే ఇనపదిమ్మ. (తె. 20).

గన్నుసుత్తె: చూ. గన్‌సుత్తె. (తె. 20, 23, 24, 25).

గందపుగిన్నె: రూ. గందంగిన్నె. గందం వేసుకో డానికివాడే చిన్నలోహపుపాత్ర. (కో. 1, 13, 15, 18, 19, 20, 28, రా. 7).

గందపుగిన్నెటిఫను: (< గందపుగిన్నె + ఇం. Tiffin) గంధంగిన్నె ఆకారంలో అడుగుఉండే టిఫిన్‌బాక్సు. (కో. 16).

గందంగిన్నె: చూ. గందపుగిన్నె. (తె. 1, 7, 18, 19).

గంధకంతేజబ్: (< గంధకం + హిం. తేజాబ్). బిందెలోపల మైలతీయడానికి, రంగురావడానికివాడే పదార్థం. (తె. 3).

గంధపుగిన్నె: చూ. గంధంగిన్నె. (కో. 6, 24, 25).

గంధంగిన్నె: రూ. గంధపుగిన్నె. పర్యా. చందన కప్పు. గంధం, కుంకుమ, పసుపు, వేసుకోడానికి వాడే చిన్న లోహపుకప్పు. చూ. చిత్రం 74. (కో. 19-23, 27).

గప్పుకా: పర్యా. బయిలరు, వాటర్‌బయలరు. నీళ్ళు కాచుకోవడానికి వాడే సాధనం. చూ. చిత్రం 173. (తె. 8, 9).

గమేల: చూ. గమేలం. (కో. 23, 24, 28; తె. 11)

గమేలం: రూ. గమేల, గమేళ, గమేళం. పర్యా. గంప[2], గుల్ల[2], గోళం[2], జబ్బ[2], టకారం[2]. తెంకె[2], టోకరు, తట్ట, బొచ్చె, బొప్పె, మట్టితట్ట. ఇటుకలు, రాళ్ళు, మట్టి మొదలయినవి మోయడానికి, పారవేయడానికి వాడే ఇనపపాత్ర. (కో. 19).

గమేళ: చూ. గమేలం. (కో. 17).

గమేళం: చూ. గమేలం. (కో. 22).

గమ్ము: (< ఇం. Gum). పర్యా. సరచ్చు. సూట్‌కేసు తయారీలో ఉపయోగించే బంకపదార్థం. (తె. 8, 9).

గమ్మెల: చూ. పర్యా. స్కాల్‌బేసను. అన్నం ఆరబోసుకోడానికి, పిండికలుపుకోవడానికి ఉపయోగ పడే వెడల్పు మూతిఉన్న లోతైనపాత్ర. (రా. 4).

గంప[1]: చూ. పర్యా. స్కాల్‌బేసను. అన్నంఆరబోసుకో డానికి, పిండి కలుపుకోడానికి వాడే వెడల్పుమూతి ఉన్న లోతైనపాత్ర. (రా. 15).

గంప[2]: చూ. పర్యా. గమేలం. ఇటుకలు, రాళ్ళు. మట్టివగైరా మోయడానికి వాడే ఇనపపాత్ర. (తె. 1-3, 7; రా. 12-15).

గరగ[1]: చూ. పర్యా. లడిగ. గరాటసీసాల్లో, స్టౌలలో నూనెపోయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 201 (కో. 30).

గరగ[2]: గ్రామదేవతల ఉత్సవాల్లో ఎగిరేటప్పుడు తలపైపెట్టుకొనే కలశం. గుండ్రని పోతపైభాగంలో సర్పం, గొడుగు మొదలయినవి అమరుస్తారు. చూ. చిత్రం 75. (కో. 20, 21).

గరడరు: ఉ. గర్డరు. రూ. గారడలు. లోహపురేకులు. కడ్డీలు వంపుచేయడానికి వాడే దిమ్మ. (కో. 17; రా. 11).

గరమ్‌చేయు: (క్రి.) (< హిం. గరమ్ + చేయు). ఉ. గరాంచేయు, గెరంచేయు. చూ. పర్యా. కాగబెట్టు. కొలిమిలో లోహపురేకుల్ని, కడ్డీలను ఎర్రగా వేడి చేయడం. (తె. 4, 5, 16, 17).

గరమ్‌పెట్టు: (< హిం. గరమ్ + పెట్టు). చూ. పర్యా. కాగబెట్టు. కొలిమిలో లోహపు పాత్రల్ని, కడ్డీలను బాగా ఎర్రగా వేడిచేయడం. (తె. 4).

గరమవు: (క్రి.) (< హిం. గరమ్ + అవు). లోహపు పాత్రలు వేడెక్కడం. (తె. 1),

గరంటె: చూ. గరిటె[1]. (రా. 16).

గరండ: ఉ. గరండా. లోహపు రేకులు, కడ్డీలు వంపు చేయడానికి వాడే దిమ్మ. (రా. 8, 10, 14, 15).

గరాట: చూ. పర్యా. లడిగ. గరగ[1]. సీసాల్లో, స్టౌలలో

నూనె పోయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 201. (తె. 21, 22; రా. 15).

గరిట: ఉ. గరటి. రూ. గరటె. పర్యా. గంటె, చాయ్‌చెంచా, చాయగంటె, టేబుల్‌స్పూను, డిజైన్ రైస్ స్పూను, డ్రైగరటి, డోగన్‌చెంచా, తొక్కు-గంటె, నూనెగంటె, నూనె గెరిట, నూనె స్పూను, నేతిగరటి, పాలగంటె, రాతెండి[1], వాటర్‌స్పూను, సీతెండి, స్పూను[1]. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే సాధనం. చూ. చిత్రం 223. (కో. 1, 4-6, 9, 11, 13, 15, 17-30; తె. 4-7, 18-22; రా. 4, 11, 13, 15).

గరిటె[1]: చూ. పర్యా. హస్తం. అన్నం వడ్డించడానికి వాడే పెద్ద స్పూను. (కో. 7, 16; రా. 16).

గరిటె[2]: పర్యా. గెంటె[2], చినగెంటె, చిన్న గరిటె, చిప్ప, పరపుగెంటె, స్పూను[2]. మూసలో కరిగిన లోహపు తేటను తీయడానికి వాడే పరికరం. (కో. 2, 11, 19, 20, 22, 24, 28; తె. 21, 22, 24; రా. 15).

గరిటె[3]: కొలిమిలో నిప్పులు ఎత్తుకోడానికి వాడే పరికరం. (కో. 13, 14, 28, 29; రా. 4, 7).

గరిడి: భజనచేయడానికి వాడే పెద్దసైజు తాళాలు. (కో. 23).

గరిడె: చూ. పర్యా. గంటె[2], కొలిమిలో బొగ్గులు వేయడానికి వాడే పొడవు కాడఉన్న వెడల్పు రేకు. (తె. 8, 9, 13).

గరుకురాయి[1]: పర్యా. గ్రీనింగు, గ్రైండింగ్ స్టోను, దప్పంరాయి, దొడ్డుకంకర, నెంబరురాయి, మీడియం రాయి, ముతకరాయి. మెంటురాయి, సాన[1], సాన రాయి[1], సానరాయి కేబుల్. వర్కు-షాపుల్లో వెల్డింగ్ అతుకులను శుభ్రంచెయ్యడానికి వాడే రాయి. (తె. 20; రా. 14, 16).

గరుకురాయి[2]: పర్యా. గిలెండర్‌రౌతు, గ్రీనింగు రాయి, దొడ్డసాన, సన్నరౌతు, సన్నసాన, సాన[2], సానరాయి[2], సానరౌతు, స్మూత్‌రాయి; స్టోన్‌రాయి. మొద్దుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడానికి వాడే రాయి. (కో. 26; తె. 4).

గరుకులు[1]: చూ. పర్యా. ఉబ్బులు. లోహపురేకులపై వెల్డింగ్ చేసినపుడు ఏర్పడే హెచ్చుతగ్గులు. (తె. 13, 14; రా. 6).

గరుకులు[2]: పర్యా. కురతలు, నొత్తలు. మరుగులు, మొరుకులు. లోహపు పాత్రలపైఉండే నొక్కులు. (తె. 16).

గరుడస్తంభం: ఇల్లిల్లు తిరిగే దాసర్లువాడే ఇనప దీప స్తంభం. చేత్తోపట్టుకోడానికి పొడవాటి ఇనపకడ్డీ, నేలపై నిలబెట్టడానికి స్టాండు, చమురుపోసి గుడ్డ వత్తిని వెలిగించడానికి వీలుగా కడ్డీ పైభాగంలో కొంచెం లోతుగాఉన్న చతురస్రాకారపు పలక అమర్చివుంటుంది. చూ. చిత్రం 76. (రా. 3, 5, 8, 11).

గరువు: బ్లోరు తొండంలో ఉండే కొలిమి బూడిద. దీన్ని తీసిపారవేస్తారు. లేదా అచ్చుకట్టేటప్పుడు పోతపనిలో ఉపయోగిస్తారు. (తె. 25).

గర్మ: రొట్టెల డబ్బా. (తె. 10, 11).

గల: చూ. గల్ల[1]. (కో. 18).

గలీజుచేయు: (క్రి.) రేకును అపరిశుభ్రంచేయడం. (రా. 3).

గల్త: (హిం.) చూ. కమ్మరకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు చానాన్ని పట్టుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 147. (తె. 4).

గల్ల[1]: రూ. గల, గళ్ళ[1]. చూ. పర్యా. లడిగ. సీసాల్లో, స్టౌలలో నూనె పోయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 201. (కో. 11, 19-23, 25-29).

గల్ల[2]: చూ. పర్యా. కంఠం. బిందె గొంతుభాగపు రేకు. (తె. 10, 11, 15-17, 20, 21).

గల్ల[3]: పర్యా. గుబ్బెబిళ్ళ, గోతిబిళ్ళ, గోదురేకు, గోళం[2]. మట్టి అచ్చుకట్టడానికి, పాత్ర అచ్చు కదలిపోకుండ పైన మూయడానికి ఉపయోగించే గుండ్రని రేకు. అచ్చు పూర్తిగ కట్టినతర్వాత పాత్ర అచ్చుతోపాటు ఈ బిళ్ళనుకూడా తీసివేస్తారు. (కో. 4, 11, 26).

గల్ల[4]: మూసలోపోసిన ఇత్తడి చల్లారినతర్వాత విగ్రహ రూపం చెందడం (తె. 11).

గల్లదుక్క: పర్యా. గల్లదొడ్డి. మట్టిఅచ్చు కట్టేగల్లను తయారుచేయడానికి ఉపయోగపడే సాధనం. (కో. 29).

గల్లదొడ్డి: చూ. పర్యా. గల్లదుక్క. మట్టిఅచ్చు కట్టే గల్లను తయారుచేయడానికి ఉపయోగపడే సాధనం. (తె. 22).

గల్లసుత్తె: పర్యా. గొంతుసుత్తి, వాయిలసుత్తె బిందెల గొంతుభాగాన్ని సాపుచేయడానికి వాడే ఏటవాలు తల కలిగిన సుత్తి. అడుగుభాగం కొద్దిగా వంగి ఉంటుంది. (తె. 20, 21).

గళ్ళ[1]: చూ. గల్ల[1]. (కో. 24).

గళ్ళ[2]: చూ. పర్యా. పాలగరిటె[2] చిన్నపిల్లలకు పాలు

పట్టడానికివాడే ఉగ్గగంటె. (కో. 48).

గళ్ళకర్ర: చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటి లోహపుకడ్డీ. (కో. 29).

గవ్వ: ట్రంకుపెట్టెమూత భాగపు పక్క రేకు. (తె. 17, 21).

గాగుల్సు: (< ఇం. Goggles). గ్రైండింగ్ చేసే టప్పుడు మరకలు కంట్లోపడకుండ వాడే సులోచనాలు. (తె. 21).

గాజ: చూ. పర్యా. అడుగుగొడుతు. గొడుగుపుల్లలను బిగించడానికి గొడుగుకర్ర పైభాగాన ఉండే గుండ్రని ఇత్తడి పరికరం. (కో. 23).

గాజు: చూ. పర్యా. అండా[1]. నీళ్ళు నిలవచేసుకోడానికి వాడే ఇరుపైపుల రెండు కొక్కీలు, వెడల్పుమూతి ఉన్న పెద్దలోహపుపాత్ర. చూ. చిత్రం 8. (కో. 24).

గాజుగిన్ని: కోడిగుడ్డు ఆకారంతో మట్టుఉండే చిన్న లోహపుపాత్ర. (కో. 29).

గాటుపెట్టు: (క్రి.) గాట్లుపెట్టు. పర్యా. గాలాలుతీయు మల్‌కట్ ఏయడానికి వీలుగా రేకు మూలలను కత్తరించడం. (కో. 23).

గాటుముక్క: రేకుపై గాట్లుపెట్టడానికి మార్కు వేయడానికి కూచిగాఉన్న చిన్న రేకుముక్క. (కో. 22).

గాట్లు[1]: చూ. పర్యా. ఉబ్బులు. లోహపువస్తువులపై ఉండే బొడిపెలు. (కో. 8).

గాట్లు[2]: పర్యా. గాలాలు. కత్తరించిన రేకుమూలలు. (కో. 22, 23, 26).

గాట్లుపెట్టు: చూ. గాటుపెట్టు. (కో. 22, 26).

గాడి[1]: కైపుడికి మధ్యలో కమ్మిఅమర్చడానికి చేసిన నిర్మాణం. (రా. 12).

గాడి[2]: చదరంగా ఉండేరేకుతో పల్లంగా కొట్టేభాగం. (కో. 10; రా. 2).

గాడి[3]: చూ. పర్యా. హెజ్జి. గొడుగుపుల్లలను బిగించే చక్రం అర. (కో. 17, 24, 29).

గాడికడ్డి: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (కో. 18).

గాడికాలు: చూ. పర్యా. పోతకాలు. కరిగేలోహన్ని పోయడానికి, అచ్చుకు రంధ్రం పెట్టడానికి వాడే పరికరం. (రా. 15).

గాడికొట్టు: (క్రి.) పర్యా. సదరుకొట్టు. కట్టువేయడానికి వీలుగారేకుపై పొడవునా బొడిపెకొట్టడం. (తె. 22).

గాడిచానం: చూ. గోడుశానం. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 11, 13, 14, 16, 22, 25, 26).

గాడిచేయు: (క్రి.) ఇనుమును లోతుచేయడం. రా. (3).

గాడిడాగలి: ట్రంకుపెట్టెకు మోపుపెట్టుకోడానికి వాడే పరికరం (కో. 13).

గాడిదిమ్మ: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (కో. 13).

గాడిప్లేటు: (< గాడి + ఇం. Pl te). ట్రంకుపెట్టెలో గాడి చేసుకోడానికి పనికివచ్చే పరికరం. (తె. 13).

గాడిమద్దెలి: చూ. పర్యా. ఎక్కువదిమ్మ. లోహపు రేకుల జాయింట్లకు రివిట్లు కొట్టడానికి వాడే సాధనం. (కో. 13).

గాడిమొద్దు: పాలకాన్లకు చుట్టూ గాడికొట్టడానికి ఉపయోగించే పరికరం. (రా. 12).

గాడిరైమర్: (< గాడి + ఇం. Rimer). రేకు గాడి హెచ్చుతగ్గులు లెవల్ సరిచేయడానికి వాడే పరికరం. (రా. 6).

గాడిశీర్నం: ఉ. గాడిసీర్నం. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలుచేయడానికి వాడే పరికరం. (కో. 28).

గాడిసు: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (కో. 6).

గాడి హ్యాండిల్: (గాడి + ఇం. Handle). అర అంగుళం గాడి పట్టుకోడానికి వాడే పరికరం. (కో. 15).

గాడ్రింజి: గ్రైనింగ్ మిషన్‌లో గాడిపట్టుకొనే పరికరం. (కో. 15).

గాత్: చూ. పర్యా. గచ్చు. వేడిగాఉన్న లోహపు వస్తువులను చల్లబరచడానికి ఉపయోగపడే నీటి పాత్ర. (కో. 28).

గాబు[1]: చూ. పర్యా. గచ్చు. వేడిగాఉన్న లోహపు వస్తువులను చల్లబరచడానికి ఉపయోగపడే నీటి పాత్ర. (తె. 24).

గాబు[2]: చూ. పర్యా. అండా[1]. నీళ్ళు నిల్వఉంచడానికి వాడే ఇరుపైపుల హాండిల్సు, వెడల్పు మూతఉన్న పెద్ద లోహపు పాత్ర. (కో. 22).

గారడలు: చూ. గరడరు. (తె. 25).

గారెలకమ్మి: పర్యా. వడలకమ్మి. నూనెలోంచి గారెలు తీయడానికి వాడే సన్నని ఇనపచువ్వ. చూ. చిత్రం 77. (కో. 24).

గాల[1]: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపుచేయడానికి వాడే దిమ్మ. (తె. 17).

గాలి[2]: చూ. పర్యా. కన్నం. పోతలోహాన్ని అచ్చులోకి పోయడానికి ఏర్పాటుచేసిన రంధ్రం. (రా. 12).

గాలకొట్టు: (క్రి.) రేకు వంగిపోకుండ డబ్బామధ్యలో బొద్దుకొట్టడం. (తె. 21).

గాలపట్టి: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (తె. 17).

గాలం: ఉ. గాలాం. పర్యా. పాతాళభైరవి, పాతాళగరిగ, పాతాళగరుడి. బావిలోపడిన వస్తువులను పైకితీయడానికి ఉపయోగించే కొక్కీలున్న పరికరం. చూ. చిత్రం 154. (కో. 4, 9, 15, 23, 24).

గాలాలు: చూ. పర్యా. గాట్లు[2]. కత్తిరించిన రేకు మూలలు. (కో. 17, 18, 24; (తె. 8).

గాలాలుతీయు: చూ. పర్యా. గాటుపెట్టు. మల్‌కట్ వేయడానికి వీలుగా రేకుమూలలను కత్తిరించడం. (కో. 17).

గాలిపంపు: పర్యా. పంపు[1], పంపుసెట్. స్టౌకు, పెట్రొమాక్స్‌లైటుకు గాలికొట్టడానికి టాంకికి అమర్చిన సాధనం. (తె. 19).

గాస్‌నూనె: (< ఇం. Gas + నూనె). పర్యా. ఆయిలు. లోహపుపాత్రలకు మెరుగుపెట్టడానికి వాడే ద్రవపదార్థం. (తె. 3).

గిండి: పర్యా. గ్లాసు, తాళి[2], రాగిచెంబు. పూజా సమయంలో తీర్థానికై వాడే రాగిపాత్ర. (రా. 15).

గిద్దె: ఉ. గిద్ద. చూ. పర్యా. కొరాచావ. మురుకులు, కారాను, వాంపొడి వగైరా పదార్థాలు పిండుకోడానికి ఉపయోగపడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 2, 7, 19, 22, 25).

గిన్ని: చూ. పర్యా. కప్పు[2]. గుడ్డజారిపోకుండా, నీళ్ళు దిగకుండా ఉండడానికి గొడుగుపైభాగాన అమర్చిన చిన్నరేకు తొడుగు. (కో. 28).

గిన్నిలు: చూ. పర్యా. కటోరి[4]. చిన్నకప్పులు. కూరలు వడ్డించుకోడానికి వాడ్తారు. (కో. 23).

గిన్నె[1]: చూ. పర్యా. కడక. టంకంపొడిని వేసుకోడానికి వాడేపాత్ర. (కో. 28; తె. 14, 28).

గిన్నె[2]: చూ. పర్యా. కటోరి[1]. వెలుతురు బాగా రావడానికి టార్చిలైట్ బల్బుచుట్టు ఉండే తెల్లని రేకు. (తె. 18, 20, 21).

గిన్నె[3]: చూ. పర్యా. కంచం. అన్నంతినడానికి ఉపయోగించే లోహపుపాత్ర. చూ. చిత్రం 214. (తె. 3).

గిన్నె[4]: చూ. పర్యా. కప్పు[4]. కూరలకువాడే చిన్న లోహపుపాత్ర. సైజువారీగా ఉంటాయి. (తె. 12).

గిన్నె[5]: పర్యా. పైగిన్నె[1], స్లైమరింగు, బల్బరేకప్పు, బల్బులోగిన్నె, బల్బురేరింగు, రింగు[1]. స్టౌలో బర్నరుమంటను అదుపులో ఉంచడానికి అమర్చిన రింగు. (తె. 4, 6, 10, 18, 19).

గిన్నె[6]: ఉ. గిన్ని. చూ. పర్యా. కూరగిన్నె. అడుగు భాగంలో సుట్టు (చుట్టూఉన్న కిడెం) చిన్నఅంచు ఉన్న లోహపుపాత్ర. కూరలు పెట్టుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 64. (కో. 3, 27; తె. 1, 12, 25; రా. 13, 16).

గిన్నె[7]: గొడుగుగుడ్డ కిందికి జారకుండ పైన బిగించి ఉండే చిన్నరేకు. (కో. 25).

గిన్నె[8]: పోతపనిలో కాలేమూసను పైకితీసి ఉంచడానికి వాడే మట్టిపాత్ర. (కో. 28).

గిన్నెసమ్మెటి: గిన్నెల, బిందెల అంచుల్ని మడచడానికి వాడే పనిముట్టు. (కో. 16).

గిరక: చూ. గిలక. (తె. 17; రా. 15).

గిరకొట్టు: చూ. గిర్రకొట్టు. (తె. 1, 23, 25).

గిరద: పూరీలు చేయడానికివాడే గుండ్రనిదిమ్మ. (తె. 11).

గిరాయించు: (క్రి.) నొక్కులుండే రేకును శుభ్రంగా సాపుచేయడం. (కో. 16).

గిరిక: చూ. గిలక[1]. చూ. పర్యా. కుడక. కొబ్బరి తురమడానికివాడే పరికరం. (రా. 15).

గిరిజలస్పూను: (< గిరిజల + ఇం. Spoon). పర్యా. చిన్న గరిట, డిజైన్ గరిట. టీ పొడి వేసుకోవడానికి వాడే చిన్న గరిట. (తె. 10, 11).

గిర్ర: పర్యా. హిందూస్తాను. ట్రంకుపెట్టె పైభాగంలో ఉండే గీత. (రా. 8).

గిర్రకొట్టు: (క్రి) రూ. గిరకొట్టు, గిలకొట్టు. పర్యా. ఘరకొట్టు, జిల్లకొట్టు. పాలిష్ పాత్రలపై డిజైన్లు వేయడం. (తె. 25).

గిర్రలుకొట్టు: పెట్టె పైభాగంలో గిర్రలు గీయడం. (రా. 4).

గిర్రులేగ: రూ. గిరలేగ, చూ. పర్యా. అమరువాలేగ. పాలిష్ పాత్రలపై డిజైనులు చేయడానికి వాడే పరికరం. (తె. 24).

గిర్లు: చూ. గిల్లు. (తె. 18).

గిలక[1]: చూ. గిరిక. (రా. 14).

గిలక[2]: రూ. గిరక. పర్యా. గిల్ల, గొలుసు, చక్రం[4], చిప్ప[2], తరణిచక్రం, తరిచ్చి, వయ్యా[3], బండిగిల్ల, బండిచక్రం, రోదా, సంగడిగిల్ల, సంగడిదిండు తిరగడానికి వాడే చక్రం. (తె. 9).

గిలక³: పిల్లలను ఆడించడానికి ఉపయోగపడే పరికరం. (కో. 18, 30).
గిలకొట్టు: (క్రి.) చూ. గిర్రకొట్టు. (తె. 2).
గిలగిచ్చుకాయ: చిన్నపిల్లలు ఆడుకోడానికి ఉపయోగించే లోహపు గిలక. (కో. 21).
గిలెండర్ రౌతు: (ఇం. Grinder + రౌతు). చూ. పర్యా. గరుకురాయి². మొద్దుబారిన లోహపు పని ముట్లను పదును పెట్టడానికి వాడే రాయి. (తె. 4.)
గిల్ట్‌పని: (< ఇం. Guilt + పని) నక్లీస్‌చేసే పని. (కో. 6).
గిల్ల: రూ. గిర్లు. చూ. పర్యా. గిలక². సంగడిదిండు తిరగడానికి వాడే పరికరం. (తె. 1, 23, 25).
గీకు: (క్రి.) రూ. గీయు, గీరు¹. పోతపని చేసే టప్పుడు అచ్చులచుట్టూ ఉండే మట్టిని రేకుతో గీకడం. (కో. 22; తె. 25).
గీకుడుపట్టి: పర్యా. గీతరేకు², చాంచి, చేతిరేకు, రేకు³. అచ్చులపై ఉండే మట్టిని శుభ్రంచేయడానికి వాడే పల్చని రేకు. (తె. 25).
గీటురాయి: పర్యా. తరిగుండరాయి, ఏలుగురౌతు, మెరుగురాయి. లేగలను పదునుపెట్టడానికి పనికివచ్చే తెల్లనిరాయి పొడి. (కో. 29).
గీతకంట్రాసి: చూ. గీత కంటాణీ. (కో. 28).
గీతగుంజు: (క్రి.) స్కేలుతో రేకుపై గీతగీయడం. (తె. 8).
గీతపోగరు: పర్యా. గోరుపోగరు¹. గోరుమూల, గోరువంపు పోగరు. విగ్రహం డిజైన్లు చిత్రించే పరికరం. (కో. 3).
గీతరేకు¹: చూ. పర్యా. పట్టి¹. ఇత్తడిరేకుపై కొలతలు, లైన్లు గీసుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 71. (కో. 28).
గీతరేకు²: రూ. కీతరేకు. చూ. పర్యా. గీకుడుపట్టి. అచ్చులపై ఉండే మట్టిని శుభ్రంచేయడానికి వాడే పల్చని రేకు. (కో. 20, 21).
గీతలేగ: గీతలు వేయడానికి వాడే పరికరం. (కో. 5).
గీబరిణి: చూ. గీబర్మి. నూనె, నెయ్యిలాంటి ద్రవ పదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపు పాత్ర. (తె. 10, 11, 17).
గీబర్మి: చూ. గీబరిణి. (తె. 10, 11).
గీయు: (క్రి.) చూ. గీకు. (కా. 26).
గిరలేగ: చూ. గిర్రులేగ. (తె. 5).
గీరు¹: (క్రి.) చూ గీకు. (కో. 16, 24).
గీరు²: (క్రి.) పర్యా. కైవారం వేయు. రేకుపై కైవారంతో గుండ్రంగా గీతవేయడం. (రా. 14).
గుజారను: పర్యా. చదరపు చానం, చిన్న వంపుగోరు పోగరు, డిజైనుపోగరు, మసపోగరు, మెరుగు బ్రెషు, వాలిపోగరు, వాలుపోగరు. లోహపు రేకుపై డిజైన్లు కొట్టడానికి వాడే పరికరం. (కో. 16).
గుంజ¹: చూ. పర్యా. కంటకొయ్య. సానరాయిని కదలకుండ బిగించడానికి వాడే 'V' ఆకారపు పంగల కొయ్య. (తె. 23).
గుంజ²: కొలిమి తిత్తులను పక్కలకు కదలకుండ బిగించే కట్టె. ఇరువైపులా రెండు ఉంటాయి. (తె. 18).
గుంజు¹: (క్రి.) పర్యా. గుసుసు. సానరాయి తిరగ డానికి బెల్టు సహాయంతో లాగడం. (తె. 2, 15).
గుంజు²: కొలిమిలోనుండి మూసను బయటకు తీయడం. (రా. 15).
గుంజు³: (క్రి.) పయ్యకు పట్టాను బిగించడానికి పట్టకార్లతో గట్టిగా లాగడం. (తె. 7).
గుంజు⁴: (క్రి.) చూ. పర్యా. ఊడదీయు, ఊడ దీయడం. (తె. 1).
గుంజు⁵: చూ. పర్యా. అండా¹. నీళ్ళు నిల్వ ఉంచ డానికి వాడే ఇరువైపుల హాండిల్సు, వెడల్పు మూతి ఉన్న పెద్ద లోహపు పాత్ర. చూ. చిత్రం 8. (కో. 14).
గుంజు⁶: (క్రి.) చూ. పర్యా. కీచేయు. బిందె మూతి రేకునువంచి అంచుచేయడం. (తె. 1).
గుంజే ఇంజను: (< గుంజే + ఇం. Engine) చూ. పర్యా. పంపు³. డ్రమ్ముల్లోనుండి నూనెను పైకి తోడడానికి ఉపయోగపడే సాధనం. (తె. 21, 22. 24. 25).
గుంజేగరాట: ఉ. గుంజె గరాటు. చూ. పర్యా. పంపు³. డ్రమ్ముల్లో నుండి నూనెను పైకి తోడ డానికి ఉపయోగపడే సాధనం. చూ. చిత్రం. (తె. 6, 23).
గుంజేలాడకి: చూ. పర్యా. పంపు³. డ్రమ్ముల్లో నుండి నూనెను పైకి తోడుకోడానికి ఉపయోగపడే సాధనం. (తె. 5).
గుట్టలుమట్టలు: చూ. పర్యా. గడ్డలు. బిందెలో చదరంగా లేకుండా ఉండే హెచ్చుతగ్గులు. (కో. 1).
గుట్టమొల: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకు లను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (తె. 25).

గుడికారుఖలా: (మరాఠీ.) విగ్రహం ఉంచి పూజ చేయడానికి వాడే సింహాసనం. (తె. 1).

గుడిచెంబు: పర్యా. కాశీచెంబు. పైభాగాన విష్ణుచక్రం లేదా అడ్డబొట్టు, క్రిందిభాగాన మట్టు (జవ్వ) ఉండే చెంబు. (కో. 7, 13).

గుడ్డ[1]: చూ. పర్యా. బట్ట. గొడుగుపుల్లలను కప్పుతూ పైభాగాన అమర్చిన నల్లనిబట్ట, మీద నీళ్ళు పడకుండా ఆపుతుంది. (రా. 3).

గుడ్డ[2]: పాత్రకు కళాయి పూయడానికి వాడేబట్ట. (కో. 3-5, 16, 28, 29; రా. 3, 6, 7).

గుడ్డకత్తెర: పర్యా. టైలర్కత్తెర, టైలర్సిజరు, దర్జీకత్తెర, బట్టకత్తెర, బీడుమెటల్కత్తె, మిషన్కత్తెర, మేలకత్తెర. గుడ్డలు కత్తరించడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 78. (కో. 2; రా. 3).

గుడ్డటేపు: (< గుడ్డ + ఇం. Tape). పర్యా. టేపు[2], బట్టస్కేలు. గుడ్డలు కొలతలు తీయడానికివాడే స్కేలు. చూ. చిత్రం 118. (తె. 20).

గుడ్డవేలిక: సైనుమట్టిపాత్రను తయారుచేయడానికి వాడేవస్తువు. (రా. 2, 15).

గుంట[1]: పర్యా. గుంటదుంగ. రేకులను గుండ్రంగ చేయడానికివాడే కర్రదుంగ. (కో. 14).

గుంట[2]: చూ. పర్యా. గచ్చు. వేడిగాఉన్న లోహపు వస్తువులను చల్లబరచడానికి ఉపయోగపడే లోహపు పాత్ర. (తె. 23; రా. 2).

గుంట[3]: లోహాలుతయారు చేయడానికి ఏర్పరచిన గుంత. (రా. 5).

గుంట[4]: ఇడ్లీపాత్రలో పల్లంగాఉండే భాగం. (కో. 13).

గుంటకరవాయి: విగ్రహంమెడలో వంపుకొట్టడానికి వాడే పరికరం. చూ. చిత్రం 79. (కో. 3).

గుంటకొట్టు: (క్రి.) చూ. పర్యా. కుదించు[2]. గుండ్రని రేకును బిందె అడుగుభాగంలాగ లోతుగా వచ్చేటట్లు చేయడం. (తె. 22).

గుంటగరిటె: చూ. పర్యా. కూరగరిటె. కూరలు వడ్డించడానికివాడే లోహపుపరికరం. చూ. చిత్రం 63. (కో. 16-18).

గుంటగిన్నె: పర్యా. గుండిగ[2]. చల్దిఅన్నం తినడానికి వాడే లోహపుపాత్ర. (కో. 2).

గుంటదుంగ: చూ. పర్యా. గుంట[1]. రేకులను గుండ్రంగ చేయడానికివాడే కొయ్యతుండు[1]. (కో. 16).

గుంటపొంగడాల పెనం: పర్యా. గుంటపొంగనాల పళ్ళెం, గుంటపొంగనాలు, గుంటలపళ్ళెం[2], గుంత పెనుము, గుంతపొంగడాలపీట, పంగనాలపెనుము, పులుఉంట్ల పెనం, పొంగడాలపళ్ళెం, పొంగనాల పెంచు, పొంగనాలపెనం, పొంగనాలమూకుడు. పొంగనాలు చేయడానికివాడే గుంతలుఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (తె. 21).

గుంటపొంగనాలపళ్ళెం: చూ.పర్యా. గుంటపొంగడాల పెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంతలుఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (తె. 21).

గుంటపొంగనాలు: రూ. గుంటపొంగవాలు. చూ. పర్యా. గుంటపొంగడాల పెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంటలుఉన్న లోహపు అచ్చురేకు చూ. చిత్రం 80. (తె. 11).

గుంటపొంగలాలు: చూ. గుంటపొంగనాలు. (తె. 10).

గుంటలకంచం: చూ. పర్యా. కుటకలకంచం. కూరలు వడ్డించడానికి వీలుగా గుంటలమర్చి చేసిన భోజన పాత్ర. చూ. చిత్రం 57. (తె. 13).

గుంటలపళ్లెం[1]: చూ. పర్యా. కుటకలకంచం. కూరలు వేసుకోవడానికి వీలుగా గుంటలు అమర్చి చేసిన లోహపు భోజనపాత్ర. చూ. చిత్రం 57. (తె. 13, 17).

గుంటలపళ్లెం[2]: చూ. పర్యా. గుంటపొంగడాల పెనం. పొంగడాలు చేయడానికి వాడే గుంతలు ఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (తె. 8-10).

గుంటలపెనుం: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపుల హాండిల్సు అమర్చిన గోళంలాగ ఉండే లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (తె. 14-16).

గుంటలబాండ్లి: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపుల హాండిల్సు అమర్చిన గోళంలాగా ఉండే లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (కో. 4, 9).

గుంటూరుబిందె: గుండ్రంగా ఉండే లోహపుపాత్ర. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. (తె. 17).

గుండకొట్టు: (క్రి.) రూ. గుండగకొట్టు. పర్యా. గుండ చేయు. గట్టిగఉండే టంకాన్ని మెత్తగ నలగ్గొట్టడం. (కో. 21, 24).

గుండగకొట్టు: (క్రి.) చూ. గుండకొట్టు. (కో. 29).

గుండచేయు: (క్రి.) చూ. పర్యా. గుండకొట్టు. గట్టిగ ఉండే టంకాన్ని మెత్తగ నలగ్గొట్టడం. (కో. 25).

గుండాకలి: చూ. గుండ్రడాకలి. (తె. 8, 9).

గుంఢాలి: చూ. పర్యా. కడెంబిందె. పాలుతేవడానికి ఉపయోగించే గుండ్రని మూతిఉన్న ఇత్తడి బిందె. (రా. 14).

గుంఢాలు: చూ. గుండీలు. (కో. 16).

గుండాం: బియ్యం గాలించేదానికి వాడే వెడల్పు మూతి ఉండే లోహపు పాత్ర. చూ. చిత్రం 81. రా. 3, 5).

గుండి[1]: ఉ. గుండీ, గుండు. రూ. గుండిగ[1]. వంటలు చేయడానికి వాడే నిలువుగా ఉండే లోహపు పాత్ర. (కో. 5, 20).

గుండి[2]: గొడుగు ఊచలను బిగుతుగా పట్టి ఉంచడానికి ఉపయోగపడే సాధనం. (తె. 21, 28).

గుండిగ[1]: ఉ. గుండుగు. చూ. గుండి[1]. (కో. 16, 19).

గుండిగ[2]: చూ. పర్యా. గుంటగిన్నె. చల్దిఅన్నం తినడానికి వాడే లోహపు పాత్ర. (తె. 20).

గుండిగలకరవాయి: చూ. పర్యా. కడవలకరవాయి. లోహపు గుండిగలు చేయడానికి ఉపయోగించే పనిముట్లు. (కో. 5).

గుండిడేక్స: అన్నం, కూరలు వండడానికి మూత వెడల్పుగా అడుగు చదరంగా పెద్దగాఉండి నిలువుగా ఉండే లోహపు పాత్ర. (తె. 1).

గుండీగిన్నె: వంటకు వాడే చిన్న లోహపు పాత్ర. (కో. 26).

గుండీపెట్టు: (క్రి.) చూ. పర్యా. తూముపెట్టు. ముద్ద చేసిన గొడ్డలితలపై కట్టె పెట్టుకోడానికి రంధ్రం చేయడం. (కో. 19).

గుండీబిందె: చూ. పర్యా. కడెంబిందె. పాలు తేవడానికి ఉపయోగించే గుండ్రని మూతిఉన్న ఇత్తడి బిందె. (తె. 5, 24).

గుండీముక్క: క్రిందమోపకుండ టంకుపెట్టెకు అడుగున బిగించిన బొడిపెరేకు. (కో. 23).

గుండీలు: రూ. గుండాలు. బాండలికి, అండాకు ఇరువైపులా పట్టుకోడానికి అమర్చిన హేండిల్సు. (కో. 24).

గుండు[1]: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారమున్న చిన్న లోహపు పాత్ర. చూ. చిత్రం 84. (తె. 14, 16).

గుండు[2]: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (కో. 29).

గుండు[3]: రేకు గుంతగారావడానికి వాడే పనిముట్టు. (రా. 13).

గుండు అచ్చు: పర్యా. చందమామ అచ్చు, పడచ్చు. కాగిన ఇనుమును గుండ్రంగా చేయడానికి ఉపయోగించే అర్ధచంద్రాకృతిగా ఉన్న పనిముట్టు. (రా.2).

గుండు ఆకురాయి: లోహాన్ని అరగడానికి వాడే పరికరం. (రా. 5).

గుండు ఉలి: రూ. గుండ్రం ఉలి. లోహం పైభాగం శుద్ధంచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (రా. 2).

గుండుకడ్డి: కొడవలి, కత్తుల పొన్నులు తయారు చేసుకోడానికి వాడే పరికరం. (రా. 2).

గుండుకరవాయి: పర్యా. గుల్లొంపుకరువాయి, గొర్రె కరువాయి, నొక్కులకరవాయి, బొడుసుకరవాయి. లోహపు పాత్రల అంచుభాగాలను తయారుచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 82. (తె. 5; రా. 12).

గుండుకన్నుసుత్తి: చూ.పర్యా. గుండుసుత్తె. లోతుగా దించడానికి, కంచాలు, గిన్నెలు మొదలైనవి సాపు చేయడానికి వాడే గుండ్రని పరికరం. చూ. చిత్రం (కో. 2).

గుండుకొరం: ఉ. గుండుకొరాం. చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి ఉపయోగపడే గుండ్రని తలకలిగిన పరికరం. చూ. చిత్రం 83. (తె. 17, 19, 21).

గుండుగిలాసు: (< గుండు + ఇం. Glass). చూ. పర్యా. రౌనుగలాసు. నీళ్ళు తాగడానికివాడే గుండ్రని లోటా. (తె. 14).

గుండుగెడపార: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 83. (కో. 10; రా. 2).

గుండుచెంబు: రూ.గుండ్రటి చెంబు. పర్యా. గుండు[1], గుల్లి చెంబు, గుళ్ళి, చిన్న చెంబు, పార్శీ చెంబు, పూనా చెంబు, మద్రాసు చెంబు, మార్వాడి ముంత, ముంత[1], మైలవరపు చెంబు, మోల్డింగ్ చెంబు, రింగు చెంబు, రౌండు చెంబు, శేరు చెంబు, సత్తారి చెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె రూపంతోచేసిన లోహపు పాత్ర. పైభాగం గుండ్రంగా ఉంటుంది. చూ. చిత్రం 84. (కో. 1, 2, 29; తె. 17; రా. 2).

గుండుతట్ట: చూ. పర్యా. స్మాల్ బేసను. అన్నం ఆరబోసుకోడానికి, పిండి కలుపుకోడానికి ఉపయోగపడే వెడల్పు మూతిఉన్న లోతైన పాత్ర. (తె. 2).

గుండుతపాళా: పర్యా. తిరుపుర తపాల, పప్పుతపాల,

రింగుతపాల. కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కి-వంచి మూతి వెడల్పుగాచేసినట్టి లోహపు పాత్ర. మాడుండదు. అంచుపక్కన బొద్దుంటుంది. అన్నం, కూరలు వండడానికి ఉపయోగం. (కో. 12, 15).

గుండుతల్లె: చూ. పర్యా. రౌనుకంచం. అన్నం తినడానికి వాడే గుండ్రని పళ్ళెం. నిలబడడానికి దీని అడుగుభాగంలో మూడు గుబ్బలుంటాయి. (తె. 3).

గుండుబిందె: ఉ. గుండుబింది. పర్యా. గజ్జలబిందె, గుండుసరవ, చుక్కలబిందె, నిర్మల్‌బిందె, నీళ్ళ బిందె. నీళ్ళు తేవడానికి, వంట చేయడానికి వాడే వెడల్పు మూతిఉన్న గుండ్రని బిందె. చూ. చిత్రం 88. (కో. 29; తె. 3; రా. 16).

గుండుబిందెలకరవాయి: గుండ్రని జవ్వ బిందెలను తయారుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 4).

గుండు మరచెంబు: పర్యా. రౌను మరచెంబు. పైభాగం గుండ్రంగా ఉండే మరచెంబు. (రా. 7, 8, 11).

గుండుమొల: చూ. పర్యా. ఉండ గడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే పరికరం. (తె. 25).

గుండుసరవ: చూ. పర్యా. గుండుబిందె. నీళ్ళు తేవడానికి, వంట చేయడానికి వాడే వెడల్పుమూతి ఉన్న గుండ్రని బిందె. చూ. చిత్రం 85. (రా. 12).

గుండుసుత్తి: రూ. గుండిసుత్తి, గుండ్రసుత్తి, గుండ్రంసుత్తి, గుండుసుత్తె, పర్యా. గుండుకన్ను సుత్తి, గుబ్బసుత్తి, గొడ్డలిసుత్తి, గోడుసుత్తి. గోలుసుత్తి, జాతిసుత్తి, తెలవాయి, పెద్దసుత్తె[2], మట్నంసుత్తి, రైలుసుత్తి, రౌండుసుత్తి, లస్కర్ మట్ సుత్తి, లస్కర్‌సుత్తె, లావుసుత్తి, లోతుగా దించడానికి, కంచాలు, గిన్నెలు మొదలయినవి సాపుచేయడానికి వాడే గుండ్రని పరికరం. చూ. చిత్రం 86. (కో. 3, 7, 11, 17_25, 26, 28; తె. 10, 11, 17, 19; రా. 4, 7, 12, 14_16).

గుండ్రటిచెంబు: చూ. గుండుచెంబు. (తె. 20).

గుండ్రసుత్తె: చూ. గుండుసుత్తి. (తె. 24).

గుండ్రం ఉలి: చూ. గుండు ఉలి. (కో. 2).

గుండ్రం కొబ్బరితురుము: చూ. పర్యా. పచ్చి కొబ్బరిపీట, పచ్చికొబ్బరిని తురిమే పరికరం. చూ. చిత్రం 144. (కో. 4).

గుండ్రంకొయ్యసుత్తి: చూ. పర్యా. ఉడన్ హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63. (కో. 12).

గుండ్రండాకలి: రూ. గుండాకలి. చూ. పర్యా. ఉండ గడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి వాడే పరికరం. చూ. చిత్రం 83. (తె. 8, 9).

గుండ్రంపూలబుట్ట: పర్యా. పువ్వులసజ్జ, రౌండు పూలబుట్ట. దేవాలయానికి పూజాసామగ్రి తీసుకెళ్ళడానికి ఉపయోగపడే పరికరం. (కో. 4).

గుండ్రంసుత్తి: చూ. గుండుసుత్తి. (కో. 28).

గుత్తి: చూ. పర్యా. కుంకుంపేల. కుంకుమ, పసుపు వగైరా పూజాసామగ్రి ఉంచుకోడానికి ఉపయోగించే మూడు, నాల్గు, అయిదు స్టీలుగిన్నెలు. (కో. 2).

గుత్తిగిన్నె: రూ. గుత్తుగిన్నెలు, గుత్తులగిన్నె. పర్యా. క్రీస్‌తూగు, కూరగుత్తి, కూరలకాడ, కూరల పంచపాళి, చముక్, చౌపాని, దస్తాగిన్నె, నాలుగు గిన్నెలు, పచ్చడిగుత్తు. నాల్గుగిన్నెలు కలిపి గుత్తిగా ఒక కడ్డికి బిగించి ఉంటాయి. కూరలు వడ్డించడానికి ఉపయోగం. చూ. చిత్రం 87. (తె. 11, 13_15; రా. 8).

గుత్తుగిన్నెలు: చూ. గుత్తిగిన్నె. (తె. 9).

గుత్తులగిన్నె: చూ. గుత్తిగిన్నె. (కో. 1).

గుదము: చూ. పర్యా. గంటె[2]. కొలిమిలో బొగ్గులు వేయడానికి వాడే పొడవు కాడ ఉన్న వెడల్పురేకు. (రా. 15).

గుద్దలి: (బ.) గుద్దలు. కాలువలు త్రవ్వేందుకు ఉపయోగించే ఇనుప పనిముట్టు. రేషన్ పనిలో కూడా వాడ్తారు. (రా. 10, 12).

గుద్దు[1]: (క్రి.) చూ. పర్యా. కుదించు[2]. రేకును గిన్నె లాగ వచ్చేటట్లు చేయడం. (తె. 6).

గుద్దు[2]: (క్రి.) పర్యా. ఒత్తు, దట్టించు[2], నప్పు[2]. అచ్చుకు అతుక్కునే టట్లుగా చేతితో పిసికిన మట్టిని గట్టిగా కూరడం. (కో. 20, 26).

గునపం[1]: రూ. గులిపెం. చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అడుగు భాగాలు కొట్టడానికి వాడే గుండ్రనితల కలిగిన పరికరం. (కో. 4, 5, 8_11, 20_22, 24_26, 28, 29; తె. 2, 17).

గునపం[2]: ఉ. గునిపెం. చూ. పర్యా. ఊస. టంకాన్ని రవ్వచేయడానికి వాడే పరికరం. (తె. 17, 21, 25).

గునపం[3]: రూ. గులపం. చూ. పర్యా. క్రగూటం.

అచ్చుల్లో మట్టిని కూరడానికి వాడే సాధనం. (తె. 19).

గుసుసు: (క్రి.) చూ. పర్యా. గుంజు[1]. సానరాయి తిరగడానికి బెల్టుసహాయంతో లాగడం. (తె. 17).

గుంతపెనము: చూ. పర్యా. గుంటపొంగడాల పెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంతలు ఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (రా. 10,12).

గుంతపొంగడాల పీట: చూ. పర్యా. గుంటపొంగడాల పెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంతలు ఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (తె. 6).

గుప్పోగరు: చూ. పర్యా. కౌరుపోగర. విగ్రహం కోణాల్లో, చిన్నభాగాల్లో మెరుగు గీతలుకొట్టడానికి వాడే మొల. (రా. 1, 5).

గుబ్బ: (బ). గుబ్బలు. చూ. పర్యా. కటోరి[3]. ట్రంకుపెట్టె కిందిభాగం నేలను ఆనకుండా ఉండేందుకు ఏర్పాటుచేసిన ఉబ్బు. (కో. 2, 5, 28; తె. 21; రా. 8).

గుబ్బఊను: ట్రంకుపెట్టెకు గుబ్బలు రావడానికి వాడే పనిముట్టు. (రా. 5).

గుబ్బకట్టు: చూ. పర్యా. కటోరి[3]. ట్రంకుపెట్టెకింది భాగంభూమిని ఆనకుండా ఉండేందుకు ఏర్పాటు చేసిన ఉబ్బు(లు). (కో. 2, 5, 28; తె. 6; రా. 8).

గుబ్బకారు: పర్యా. కట్టర్, దొప్పకారు, దొప్పపట్టకార. సన్నఇక్కళం. సన్ననిపట్టకార. చిన్నచిన్న వస్తువుల్ని పట్టుకోడానికి పనికివచ్చే పట్టకారు. మేకులు పీకడానికి, నట్లుతిప్పడానికి, సన్నకమ్మిని తెంచడానికి ఉపయోగం. (కో. 6, 11; తె. 24).

గుబ్బచ్చి: చూ. గుబ్బపంచు. (కో. 16).

గుబ్బపట్టకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 2).

గుబ్బపట్టి: లోహపురేకును కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి, వాడే పరికరం. (రా. 8).

గుబ్బపంచు: చూ. పర్యా. రౌండుపంచు. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడేపరికరం. (రా. 11).

గుబ్బపోగరు: పెట్టెగుబ్బ కొట్టడానికి వాడే పరికరం. (కో. 4–6, 10, 23).

గుబ్బబిళ్ళ: చూ. గుబ్బెబిళ్ళ. (తె. 23).

గుబ్బసుత్తి: చూ. పర్యా. గుండుసుత్తి. లోహపు రేకును కత్తరించడానికి, పొక్కించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (కో. 5, 6, 8, 10, 11, 18; రా. 2).

గుబ్బెబిళ్ళ: రూ. గుబ్బబిళ్ళ. చూ. పర్యా. గల్ల[3]. మట్టిఅచ్చు కట్టడానికి, పాత్రఅచ్చు కదిలిపోకుండ పైన మూయడానికి ఉపయోగించే గుండ్రనిరేకు. అచ్చుపూర్తిగ కట్టిన తర్వాత పాత్ర అచ్చుతో పాటు ఈబిళ్ళను కూడా తీసివేస్తారు. (తె. 23, 25).

గుబ్బెలపడెచ్చు: ఇత్తడిరేకుపై బొడిపెలు చేయడానికి ఉపయోగపడే దిమ్మ. చూ. చిత్రం. (తె. 25).

గుమ్మ: చూ. పర్యా. గుమ్మెకొయ్య. తరిణిపనిలో చక్రాలు తిప్పడానికి వీలుగా ఇరుసుకు తగిలించిన వంపుఉండే ఇనుపకడ్డీ. (కో. 5).

గుమ్మడికాయ: నూనె, నెయ్యి లాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపుపాత్ర. (తె. 23).

గుమ్మడికాయతట్టు: చూ. పర్యా. పడిగం. కోవెలలో తీర్థంఉంచడానికి వాడే గుమ్మడికాయ ఆకారంతో ఉన్న లోహపుపాత్ర. (రా. 13).

గుమ్మడికాయిమరచెంబు: గుమ్మడికాయ అకారంతో ఉండేచెంబు. (కో. 11, 20).

గుమ్మడితట్టు: చూ. పర్యా. పడిగం. కోవెలలోతీర్థం ఉంచడానికి వాడే గుమ్మడికాయ ఆకారంతోఉన్న లోహపుపాత్ర. (రా. 7).

గుమ్మెకొయ్య: పర్యా. గుమ్మ, బావు, సీల[2]. తరణిపనిలో చక్రాలు తిప్పడానికి వీలుగా ఇరుసుకు తగిలించిన వంపు ఉండే ఇనుపకడ్డీ. (కో. 5).

గురిగి: చూ. పర్యా. మూస. లోహాన్ని కరిగించడానికి ఉపయోగపడే పాత్ర. (తె. 18).

గురుజు: పర్యా. గొడితె. తలుపులు బిగించడానికి ఉపయోగించే గుమ్మానికి బిగించిన లావుపాటి చీల. (కో. 30).

గుర్రం: రూ. గుఱ్ఱం. గొడుగును తెరచినపుడు పుల్లల గొట్టాన్ని పట్టిఉంచడానికి గొడుగుకర్రపై ఉండే పరికరం. (తె. 1, 5, 17; రా. 14, 15).

గులపం: ఉ. గులిపెం. చూ. గునపం. (తె. 8, 21).

గులాబిగుత్తు : చూ. పర్యా. గులాబిగంటె. గులాబిపువ్వు లాంటి వంటకాలు చేయడానికి వాడే అచ్చు. 4, 6, చిన్నగొట్టాలను ఒక కాడకు అతికి చేస్తారు. (కో. 24; తె. 17).

గులాబిగంటె: పర్యా. గులాబిగుత్తు, గులాబిపువ్వు, రోసుఫ్లవర్. గులాబిపువ్వు లాంటి వంటకాలు చేయడానికి వాడే అచ్చు. 4, 5 చిన్నగొట్టాలను ఒక కాడకు అతికి చేస్తారు. (తె. 22).

గులాబిపువ్వు: రూ. గులాబిపూలు. చూ. పర్యా. గులాబిగంటె. గులాబిపువ్వు లాంటి వంటకాలు చేయడానికి వాడే అచ్చు. 4, 6 చిన్న గొట్టాలను ఒక కాడకు అతికి చేస్తారు. (కో. 16, 17, 19, 20, 22, 23, 26, 28; తె. 21, 22).

గులాబిపూలు: ఉ. గులాబీపూలు. చూ. గులాబిపువ్వు. (కో. 1; తె. 24).

గులాబిప్లేటు: పర్యా. దోసెప్లేటు. కొద్ది లోతు ఉన్న పళ్లెం పాత్రలపై మూయడానికి వాడ్తారు. అంచులు వొంకీలుగ ఉంటాయి. (కో. 18, 23).

గులిపెం: చూ. గునపం[1]. (తె. 8-11).

గుల్ల[1]: చూ. పర్యా. ఉగ్గుగిన్నె. చిన్నపిల్లలకు మందు పోయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 26. (కో. 30).

గుల్ల[2]: (బ.) గుల్లలు. చూ. పర్యా. స్మాల్‌బేసను. అన్నం ఆరబోసుకోడానికి, పిండి కలుపుకోడానికి ఉపయోగపడే వెడల్పుమూతి ఉన్న లోతైన పాత్ర. (తె. 5, 12, 16).

గుల్ల[3]: మైనంతోచేసి చుట్టూ మట్టిపూత వేసిన అచ్చు విగ్రహం. (కో. 18).

గుల్ల[4]: ఇత్తడి, ఇనుపపాత్రల అడుగుభాగపు రేకు. (కో. 18).

గుల్ల[5]: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరుపైపులా హాండిల్సు అమర్చిన గోళంలాంటి లోహపుపాత్ర. చూ. చిత్రం 163. (తె. 12).

గుల్ల[6]: చూ. పర్యా. గమేలం. ఇటుకలు, రాళ్ళు, మట్టి మొదలైనవి మోయడానికి వాడే ఇనపపాత్ర. (తె. 10, 11, 13).

గుల్లమోపు: పర్యా. చుట్ట, డమ్మీ, డొలనట్టు, తోలచుట్ట, తోలిబిళ్ళ, దిమ్మ[3], నట్టు[2], పోగర్‌పంచ్‌డై, బొట్టు, మోపు[4], లోహపు రేకులపై, పట్టీలపై సులువుగ రంధ్రాలు వేయడానికి వాడే దిమ్మ. (కో. 16).

గుల్లిచెంబు: చూ. పర్యా. గుండుచెంబు, నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారంతో చేసిన చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 84. (కో. 24, 28).

గుల్లిసెంబు: చూ. గుళ్ళిచెంబు. (కో. 29).

గుల్లాంపుకరువాయి: చూ. పర్యా. గుండు కరువాయి. లోహపుపాత్రల అంచుభాగాలను తయారుచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 82. (కో. 21).

గుళ్లి: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారంతో చేసిన చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 84. (కో. 22).

గుళ్ళిచెంబు: రూ. గుల్లిసెంబు. పర్యా. గుళ్ళీలు. మట్టులేని గుండ్రని మరచెంబు. (కో. 23, 24).

గుళ్ళీలు: చూ. పర్యా. గుళ్ళిచెంబు. మట్టులేని గుండ్రని మరచెంబు. (కో. 23).

గూటం[1]: చూ. పర్యా. కాడర్‌పిన్ను. కుట్టుమిషను నిలబడడానికి సహాయపడే పరికరం. (రా. 6).

గూటం[2]: చూ. పర్యా. అడమొద్దు. లోహపు రేకులను వంచడానికి వాడే కొయ్యదిమ్మ. (రా. 3).

గూటం[3]: చూ. పర్యా. ఊచ. టంకాన్ని రవ్వచేయడానికి వాడే పరికరం. (తె. 14, 16, 18; (రా. 7).

గూటం[4]: చూ. పర్యా. క్రగూటం. అచ్చుల్లో మట్టిని కూరడానికి వాడే సాధనం. (కో. 20, 22, 26; రా. 15).

గూటం[5]: లోహపుపాత్రల పైభాగంలో నొక్కులు తీయడానికి వాడే పరికరం. (తె. 5; రా. 6).

గూటం[6]: లోహపుపనిలో మోపుగా వాడే సాధనం. (కో. 4, 6, 16).

గూటిక: చూ. పర్యా కత్తెమొల. లోహపు రేకులను కత్తిరించడానికి, రంధ్రాలువేయడానికి వాడే పరికరం. (తె. 25).

గూటికమొల: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (తె. 25).

గూన: పర్యా. పర్నా. వర్షపునీరు కిందపడడానికి వీలుగా మిద్దెల పైభాగాన అంచుల్లో అమర్చిన పల్చని రేకుగొట్టం. (తె. 25).

గెడపార: చూ. గెడ్డపార. (రా. 3).

గెడ్డ అచ్చు: ఇనుపగడ్డలు నరకడానికి వాడే పరికరం. (కో. 3).

గెడ్డ ఉలి: లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 1).

గెడ్డకీలు: బక్కెట్లకు ప్రక్కభాగంలో వేసే కీలు. (రా. 6).

గెడ్డపలుగు: బిందె అతుకులుకొట్టడానికి వాడే పరికరం. (రా. 7).

గెడ్డపార: ఉ. గడ్డపార. రూ. గెడపార. పర్యా. చిన్న కొరాం, చిన్న గునపం. చిన్న గెడ్డపార, చెంబు

గెడ్డపార, దబరాలగునపం. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి, గొడ్డలికి రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 88. (కో. 1-5, 9; 14-16; తె. 4, 5, 10, 11, 19; రా. 1, 5-7, 16).

గంటె[1]: ఉ. గెంట. చూ. పర్యా. కూర గరిటె. కూరలు వడ్డించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63. (కో. 30; తె. 2-4, 8, 9, 14, 17, 19, 24; రా. 7, 15).

గంటె[2]: చూ. పర్యా. గరిటె[2]. మూసలో కరిగిన లోహపుతేటను తీయడానికి వాడే పరికరం. (తె. 17, 19, 23; రా. 2).

గరం: కొలిమిలో బిందెల్ని కాచడం. (తె. 12).

గరండర్: (< ఇం. Grinder). చూ. పర్యా. కురుందం. సానపట్టడానికి వాడే కురుందం రాయి, లక్కతో కలిపిచేసిన సాధనం. (తె. 7).

గెలుకు: (క్రి.) పర్యా. కుదుపు, గెలుముకొను. కొలిమిలోని అగ్గిని కలబెట్టడం. (రా. 15).

గెలుముకొను: (క్రి.) చూ. పర్యా. గెలుకు. కొలిమిలోని బొగ్గులను కలబెట్టడం. (కో. 2).

గేజి[1]: (< ఇం. Gauge). చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (తె. 23, 24).

గేజి[2]: (< ఇం. Gauge). రేకు పరిమాణం. (రా. 7).

గేజు: చూ. పర్యా. హేర్‌వాల్. బర్నర్‌కువచ్చే గాలిని అదుపులో ఉంచడానికి పనికివచ్చే సాధనం. (కో. 30).

గేటుముక్క: చిన్న రేకులను వంపుపెట్టడానికి సానపనిలో పనికివచ్చే 'U' ఆకారపు చిన్న దిమ్మ. (తె. 18).

గేడి: బీరువాకు మూతపడడానికి వీలుగాచేసిన గాడి. (రా. 10).

గేడిదిముడు: రేకు తలుపుల గెడి. (కో. 4).

గేడిసుత్తి: డబ్బాలను గేడుగాకొట్టే పరికరం. (రా. 7).

గేడు: డబ్బా భాగం. చదరంగాలేకుండా కూసిగా ఉంటుంది. (రా. 7).

గేర్: (< ఇం. Gear). పర్యా. గేర్‌కిరన్, గేర్‌కేసు, గోర్‌లివర్, గ్యాస్‌ప్లేయర్, గ్రీమ్‌లివర్. సైకిల్ చక్రం తిరగడానికి వాడే పరికరం. (తె. 8, 13).

గేర్‌కిరన్: చూ, పర్యా. గేర్. సైకిల్‌చక్రం తిరగడానికి వాడే పరికరం. (తె. 12).

గేర్‌కేసు: (< ఇం. Gear case). చూ. పర్యా. గేర్, సైకిల్‌చక్రం తిరగడానికి వాడే పరికరం. (తె. 8).

గేర్‌లివర్: (< ఇం. Gear lever). చూ. పర్యా. గేర్. సైకిల్‌చక్రం తిరగడానికి వాడే పరికరం. (తె. 8, 13).

గేరా: నూనెను నిల్వ ఉంచడానికి వాడే దీపంబుడ్డి భాగం. (తె. 17).

గైనింగు: చూ. గ్రీనింగు. (రా. 2).

గొగ్గిలం: పర్యా. జిగురు, పట్టుమైన, మైనంముద్ద. విగ్రహంనగిషీపనికి వాడే పదార్థం. (కో. 10).

గొట్టం[1]: పర్యా. పైపు[1]. లోహపువస్తువుల రిపేరులో మోపుగా ఉపయోగపడే సాధనం. (కో. 12, 21, 23, 25; తె. 21).

గొట్టం[2]: పర్యా. నూనెపైపు, పైపు[2]. స్టౌబర్నర్‌కు టాంకిద్వారా నూనెను అందించడానికి అమర్చిన పరికరం. (తె 3, 4).

గొట్టం[3]: పర్యా. గొడుతు, రన్నరు[1], వొద్ద, హోల్డరు[2]. గొడుగుపుల్లలు బిగించడానికి ఉపయోగపడే గొడుగు కడ్డీపై పైకి, కిందికి సులువుగ తిరిగేపరికరం. (కో. 23-26; తె. 4, 19, 21, 23).

గొట్టం[4]: పర్యా. పైపు[1], బాడి[1], బుర్ర[1]. టార్చిలైట్‌లో బాటరీలను ఉంచడానికి ఉపయోగించే స్విచ్‌ఉన్న గొట్టం. (తె. 4, 21, 22, 24, 25).

గొట్టం[5]: చూ. పర్యా. ఊదుడుగొట్టం. పొయ్యికి గాలిని అందించడానికి వాడే సాధనం. (కో. 14, 15, 29; తె. 8, 9, 13).

గొడగలకత్తి: మేదరపనివాళ్ళు ఉపయోగించే కత్తి. (కో. 27).

గొడితె: చూ. పర్యా. గురుజు. తలుపులు బిగించడానికి ఉపయోగించే గుమ్మానికి బిగించిన లావుపాటి చీల. (కో. 26).

గొడుగు: పర్యా. ఛత్రి. ఎండకు ఎండకుండా వానకు తడవకుండా వాడే పరికరం. చూ. చిత్రం 89. (తె. 1, 5, 6, 7).

గొడుగుకర్ర: చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటి కడ్డీ. (కో. 27, 28; తె. 21, 22).

గొడుగుసువ్వ: చూ. పర్యా. కట్టె. గొడుగుకు అధారమైన పొడవాటి కడ్డి. (తె. 23, 24).

గొడుతు: చూ. పర్యా. గొట్టం[3]. గొడుగు పుల్లలు బిగించడానికి ఉపయోగపడే గొడుగు కడ్డీపై పైకి కిందికి సులువుగ తిరిగే పరికరం. (కో. 27).

**గొడుసుకరవాయి: పర్యా. గొంతునిగే గెడపార,**

గొంతుమట్టంసుత్తి, గొంతులునిగే కరవాయి, గొంతుసాప్‌సుత్తి. బిందె గొంతుభాగం శుభ్రం చేయడానికి వాడే బద్దలాంటి పనిముట్టు. (రా. 2).

గొడ్డలి: (బ.) గొడ్డళ్ళు. పర్యా. కర్ర, కట్టెలు కొట్టుకోడానికి చీల్చుకోడానికి ఉపయోగించే ఇనప పరికరం. చూ. చిత్రం 90. (కో. 4; తె. 5; రా. 4).

గొడ్డలికడ్డి: రూ. గొడ్డళ్ళకడ్డి, గొడ్లకడ్డి. గొడ్డలికి రంధ్రాలు వేయడానికి వాడే లావుపాటి మొద్దుకడ్డి. (కో. 2).

గొడ్డలిపట్టుకారు: చూ. పర్యా. గోలుపట్కార్. గొడ్డలి తూము పట్టుకోడానికి వాడే పరికరం. (రా. 8).

గొడ్డలిసుత్తి: చూ. పర్యా. గుండుసుత్తి. లోహపు రేకులను కత్తిరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (తె. 24).

గొడ్డళ్ళకడ్డి: చూ. గొడ్డలికడ్డి. (రా. 3).

గొడ్లకడ్డి: చూ. గొడ్డలికడ్డి. (తె. 21).

గొడ్లిసుత్తి: బీగాలు పగులగొట్టడానికి వాడే పరికరం. (రా. 12).

**గొండి**: దీపంబుడ్డి పట్టుకోడానికి చేసిన పిడులు. (కో. 20).

**గొండుసుత్తె**: చూ. గుండుసుత్తి. (తె. 2).

**గొండెం**: తాళంకప్పకు ఉండే పిడి. (కో. 24).

గొన్నెం: తాళం వేయడానికి ట్రంకుపెట్టెలకు కొట్టిన నిర్మాణం. (కో. 16).

**గొంతు**: చూ. పర్యా. కంఠం. బిందె గొంతుభాగపు రేకు. (కో. 1, 2, 4, 9; తె. 14; రా. 1, 2, 4, 9).

**గొంతుఉలి**: తరణీవనిలో పాత్ర గుండుగా రావడానికి ఉపయోగించే ఉలి. (రా. 2).

**గొంతునిగే గెడపార**: చూ. పర్యా. గొడుసుకరవాయి. బిందెగొంతు సరిచేయడానికి వాడే పరికరం. (కో.5).

**గొంతుమట్టం సుత్తి**: చూ. పర్యా. గొడుసుకరవాయి. బిందె గొంతుభాగంలో శుభ్రంచేయడానికి వాడే సుత్తి. (రా. 2).

**గొంతుసాప్ సుత్తి**: చూ. పర్యా. గొడుసుకరవాయి. బిందె గొంతుభాగంలో సాప్‌కొట్టడానికి వాడే సుత్తి. (కో. 1-5, 9; రా. 2, 5).

**గొంతుసుత్తి**: చూ. పర్యా. గల్లసుత్తె. బిందె గొంతు భాగాన్ని తయారుచేయడానికి వాడే ఏటవాలు తల గలిగిన సుత్తి. (కో. 3).

**గొట్టుపట్టకారు**: రాళ్ళు పగలకొట్టడానికి పనికివచ్చే పరికరం. (కో. 7).

గొయ్యికొట్టు: (క్రి.) సాదా గుండ్రని రేకును గుంతగా కొట్టి పాత్ర అడుగుభాగాన్ని తయారుచేయడం. (కో. 25).

గొర్చెకరువాయి: చూ. పర్యా. గుండుకరవాయి. లోహపు పాత్రల అంచుభాగాలను తయారుచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 82. (రా. 14).

గొరెకొమ్ము: పనిముట్లను పదునుపెట్టడానికి వాడే సాధనం. కాల్చిన పనిముట్లపై దీన్ని రుద్దితే పదునులాగ వస్తుంది. (తె. 4).

గొర్లు ఇరుసు: మడక-కారులకు మధ్యభాగం. (కో.7).

గొలుసు: చూ. పర్యా. గిలక. సంగడిదిండు తిరగడానికి వాడే పరికరం. (తె. 21).

గొలుసు కరవాయి: పర్యా. బాయలర్ కరవాయి. బాయిలర్ పైపులు చేయడానికి వాడే పరికరం. (రా. 1).

గొల్లెం టిఫిన్: చూ. పర్యా. గొళ్ళెండబ్బా. పిండి, నూనె పదార్థాలు తెచ్చుకోడానికి వాడే మూత ఉన్న లోహపు పాత్ర. మూతకు గొళ్లెం అమర్చిఉంటారు. (తె. 20).

గొల్లెం డబ్బా: ఉ. గొల్లిండబ్బా. చూ. గొళ్లెం డబ్బా. (కో. 15; తె. 21).

గొళిండబ్బా: చూ. గొళ్లెండబ్బా. (కో. 17).

గొళ్లెలహండా: చూ. పర్యా. గొళ్లెండబ్బా. పిండి, నూనె పదార్థాలు తెచ్చుకోడానికి వాడే మూతఉన్న లోహపు పాత్ర. మూతకు గొళ్లెం అమర్చిఉంటారు. చూ. చిత్రం 91. (కో. 30).

గొళ్లెండబ్బా: రూ. గొల్లెం టిఫిన్, గొల్లెం డబ్బా, గొళిండబ్బా. పర్యా. గొళ్లెలహండా, తాళండబ్బా, మూతడబ్బి. పిండి, నూనె పదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపు పాత్ర. మూతకు గొళ్లెం అమర్చి ఉంటారు. చూ. చిత్రం 91. (కో. 19; తె. 25).

గోకర్ణం: ఉ. గోకర్ణ, గోకర్ణ. పర్యా. చారుగిన్నె[2], చారుగోకర్ణం, చారుజగ్గు, చారుదార, ముక్కుగిన్నె[1], మూకుడుచెంబు, సాంబార్‌పాట్, సోమసత్తెర, సోమసత్రం. పాయసం, చారు, మజ్జిగ మొదలయినవి వడ్డించడానికి వీలుగా పైభాగాన గాడిరేకు అమర్చిన పాత్ర. చేత్తో పట్టుకోడానికి కాడఉంటుంది. చూ. చిత్రం 92. (కో. 2, 16-28; తె. 1-4, 8-11, 14, 18-23).

గోకు: (క్రి.) ఇత్తడిపాత్రలను రుద్దడం. (రా. 1).

గోకురు: చూ. పర్యా. ఉగ్గుగిన్నె. చిన్నపిల్లలకు ఉగ్గు పోయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 26,

(కో. 28).

గోడు: రేకు అంచు. (కో. 23).

గోడ్డువంచు: (క్రి.) పాత్రలపై అంచులను దళసరిగ చేయడం. (కో. 16).

గోడుశానం: చూ. గాడిశానం. (కో. 19).

గోడుసుత్తి: ఉ. గోడిసుత్తి. రూ. గోలుసుత్తి. చూ. పర్యా. గుబ్బసుత్తి. బీరువారేకులు ట్రంకుపెట్టె రేకులు వంచడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 86. (కో. 10, 13, 18, 19).

గోతంపీసు: లోహాన్ని మట్టితో కప్పేటపుడు ఉపయోగించే వస్తువు. (రా. 2).

గోతిబిళ్ళ: చూ. పర్యా. గల్ల[3]. మట్టి అచ్చుకట్టడానికి, పాత్ర అచ్చు కదిలిపోకుండ పైన మూయడానికి ఉపయోగించే గుండ్రని రేకు. అచ్చు పూర్తిగ కట్టినతర్వాత పాత్ర అచ్చుతోపాటు ఈ బిళ్ళను కూడా తీసివేస్తారు. (కో. 20, 22).

గోదారిగుండగ: చూ. గోదావరిగుండ. (కో. 3).

గోదారిగుండి: చూ. గోదావరిగుండి (కో. 1, 6, 8, 11).

గోదావరిగుండి: ఉ. గోదావరిగుండు. రూ. గోదారి గుండగ, గోదావరిగుండి. అన్నం, కూరలు వండడానికి వాడే నిలువుగా ఉండే లోహపుపాత్ర. (కో. 4, 9, 17, 18; తె. 6, 17).

గోదురేకు: చూ. పర్యా. గల్ల[3]. మట్టిఅచ్చుకట్టడానికి, పాత్రఅచ్చు కదలిపోకుండ పైన మూయడానికి ఉపయోగించే గుండ్రనిరేకు. అచ్చుపూర్తిగా కట్టిన తర్వాత పాత్ర అచ్చుతోపాటు ఈ బిళ్ళను కూడా తీసివేస్తారు. (రా. 15).

గోనెపీసు: చూ. పర్యా. గనపుపురి. శిల్పపనిలో లోహపుఅచ్చు, మట్టిఅచ్చు విడిపోకుండా దళంగా ఉండడానికి మట్టిలో కలిపే జనపనార తాడు. (కో. 28).

గోపురంముక్క ఆకురాయి: చూ. పర్యా. ఆకురాయి ఇనపసామాన్లు రాసుకోడానికి వాడే పరికరం. (కో. 11, 15).

గోరుఉలి: ఎద్దుగిట్టలలోకి గుంతవేసి అదమడానికి వాడే పరికరం (రా. 3).

గోరుకంటానీ: పర్యా. గోరుబల. విగ్రహంలో వంపును చదును చేయడానికి వాడే పరికరం. (కో. 21, 28, 29).

గోరుగుల్ల: చూ. పర్యా. గోరుగుండు. గోళ్ళు కత్తరించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 93. (తె. 24).

గోరుగుండు: పర్యా. గోరుగుల్ల, నెయిల్‌కట్టర్. గోళ్ళు కత్తరించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 93. (కో. 24).

గోరుచానం : ఉ. గోరుశానం. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 10, 12, 15).

గోరుపోగర[1]: రూ. గోలుపోగర. చూ. పర్యా. గీతపోగర. విగ్రహంపై డిజైను గీతలుగీసే పరికరం. (కో. 8; తె. 25).

గోరుపోగర[2]: గోరు ఆకారంలో ఉండే పరికరం. కంచాలకు, మట్టుగిన్నెలకు, పరాతాలు పాలిష్ చేయడానికి, దీపంబుడ్లకు రంధ్రాలు చేయడానికి, వంపుగా లైను వేసుకోడానికి, రౌనుతిప్పడానికి ఉపయోగం. (కో. 4, 7–10, 15, 20, 22).

గోరుబల: చూ. పర్యా. గోరుకంటానీ విగ్రహంలో వంపును చదును చేయడానికి వాడే పరికరం. (కో. 2).

గోరుమూల: చూ. పర్యా. గీతపోగర. విగ్రహం డిజైన్లు చిత్రించే పరికరం. (తె. 10, 11).

గోరులేగ: పర్యా. నైసులేగ, మట్టంపోగర. గీట్లు వేయడానికి, మరచెంబు పీకభాగంలోను, మట్టు భాగంలోను, మెరుగు రావడానికి వాడే పరికరం. (కో. 10, 24; తె. 10, 11, 24).

గోరువంపుపోగర: చూ. పర్యా. గీతపోగర. విగ్రహం డిజైన్లు చిత్రించే పరికరం. (కో. 3).

గోరుశానం: చూ. గోరుచానం. (కో. 10, 21, 23; తె. 18).

గోలుచిప్ప: (< ఇం. Goal + హిం. చిప్ప) చూ. పర్యా. గోలుపట్కార. లావుపాటి లోహపు ముక్కల్ని పట్టుకోడానికి వాడే పరికరం. (తె. 6).

గోల్‌ఫైల్: (ఇం.) రంధ్రాల పరిమాణం మార్చడానికి, శుభ్రం చేయడానికి వాడే పరికరం. (తె. 3).

గోల: చూ. పర్యా. ఉండగడ్డపార, గోలుడాకలి లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అడుగు భాగాలు సాపుచేయడానికి వాడే పరికరం. (రా. 14).

గోలం: చూ. గోళం[2]. (రా. 4)

గోలుచేయు: (క్రి.) ఉ. గోల్‌చేయు. పర్యా. గోలు మడుపు, గోలువంచు. లోహపురేకును, కడ్డీని గుండ్రంగా చేయడం. (తె. 8; రా. 14).

గోలుడాకలి: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి వాడే పరికరం. చూ. చిత్రం 83. (తె. 10, 11).

గోలుపట్కార: పర్యా. గొడ్డలిపట్టకార, గోల్‌చిప్ప, గుండ్రని వస్తువుల్ని, తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి వాడే పరికరం. (తె. 7, 22).

గోలుపోగర: చూ. గోరుపోగరు[1]. (కో. 6; తె. 17).

గోలుమడువు: (క్రి.) చూ. పర్యా. గోలుచేయు. లోహపురేకును, కడ్డీని గుండ్రంగా వంచడం. (తె. 4).

గోలువంచు: (క్రి.) చూ. పర్యా. గోలుచేయు. లోహపురేకును, కడ్డీని గుండ్రంగా చేయడం. (తె. 1).

గోలుసాంచ: పర్యా. రౌండుమెరిను, రౌనుదిమ్మ, రౌనుసాంచ. ఇనుమును సాపుచేయడానికి కొలిమి పనిలో ఉపయోగించే పనిముట్టు. (తె. 1).

గోలుసుత్తి: రూ. గోడుసుత్తి. చూ. పర్యా. గుండుసుత్తి. లోహపురేకును కత్తిరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (కో. 16; తె. 3, 6).

గోల్డర్: (< ఇం. Holder). వెల్డింగ్‌చేసే మిషన్ విడిభాగం. (రా. 6).

గోళం[1]: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపులా పిడిని అమర్చిన లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (రా. 8, 15).

గోళం[2]: రూ. గోలం. చూ. పర్యా. గమేలం. ఇటుకలు, రాళ్ళు, మట్టి మొదలైనవి మోయడానికి వాడే ఇనపపాత్ర. (కో. 19, 23; తె. 1-4, 19, 21, 24; రా. 12-14, 16).

గోళెం[1]: ఉ. గోళెము. చూ. పర్యా. గచ్చు. వేడిగా ఉన్న లోహపు వస్తువులను చల్లబరచడానికి ఉపయోగపడే నీటిపాత్ర. (కో. 17, 18).

గోళెం[2]: చూ. పర్యా. గల్ల[3]. మట్టి అచ్చు కట్టడానికి, పాత్ర అచ్చు కదలిపోకుండ పైన మూయడానికి ఉపయోగించే గుండ్రనిరేకు. అచ్చు పూర్తిగా కట్టినతర్వాత పాత్ర అచ్చుతోపాటు ఈ బిళ్ళను కూడా తీసివేస్తారు. (కో. 25).

గోళ్ళు: (క్రి.) నూనెలోంచి పిండిపదార్థాలు పైకి తీయడం. (రా. 13).

గౌజి: చూ. పర్యా. పోగరు. లోహపురేకులపై, కడ్డీలపై రంధ్రాలు తీయడానికి గుర్తులుపెట్టే పరికరం. చూ. చిత్రం 165. (కో. 4).

గౌడి అచ్చు: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు. కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (కో. 1).

గౌల్లకత్తి: కల్లుగీయడానికి వాడే సాధనం. (తె. 22).

గౌరా: ఉ. గౌర. చూ.పర్యా. లడిగ. సీసాల్లో, స్టౌలలో నూనె పోయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 201. (తె. 9, 17, 20, 21, 22, 24, 25).

గ్యాండర్: (< ఇం. Glinder). పప్పుచేసుకోడానికి ఉపయోగించే పరికరం. (రా. 7).

గ్యాస్‌పిన్: స్టౌ, పెట్రొమాక్స్‌లైట్ టాంకి లోపలి గ్యాస్‌ను అదుపులో ఉంచడానికి టాంకి బిరడాపై ఉండే కీస్క్రూ. (తె. 18).

గ్యాస్‌పొయ్యిల స్టాండు: (< ఇం. Gas + పొయ్యిల + ఇం. Stand). చూ. గ్యాస్‌పొయ్యి స్టాండు. (కో. 9).

గ్యాస్‌పొయ్యి స్టాండు: రూ. గ్యాస్‌పొయ్యిల స్టాండు. గ్యాస్‌పొయ్యిలు ఉంచుకోవడానికి ఉపయోగపడే చట్టచదరపు పరికరం. (కో. 4).

గ్యాస్‌ప్లేయర్: (< ఇం. Gasplier). చూ. పర్యా. గేర్. సైకిల్‌చక్రం తిరగడానికి వాడే పరికరం. (కో. 1).

గ్యాస్‌లైటు: చూ. పర్యా. పెట్రోమాక్స్ లైటు. దుకాణాల్లో, శుభకార్యాల్లో కరెంటు లేనప్పుడు వాడే కిరోసిన్ దీపం. చూ. చిత్రం 162. (కో. 2).

గ్యాస్‌వెల్డింగ్ మిషను: (ఇం.) చూ. పర్యా. గ్యాస్ వెల్డింగు. లోహపురేకులను, పైపులను వెల్డింగ్ చేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 2; రా. 3, 7).

గ్యాస్ వెల్డింగు: (ఇం.) పర్యా. గ్యాస్ వెల్డింగ్ మిషను, గ్యాస్ సిలిండరు. లోహపురేకులను, పైపులను వెల్డింగ్ చేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 4, 6-9; తె. 8, 13, 25; రా. 4, 6, 8).

గ్యాస్ సిలిండరు: (ఇం.) చూ. పర్యా. గ్యాస్ వెల్డింగు. లోహపు రేకులను, పైపులను వెల్డింగ్ చేయడానికి ఉపయోగించే పరికరం. (రా. 4).

గ్యాస్ స్టౌ: ఇత్తడిగాజుల తయారీలో అతుకులను అతికే పరికరం (కో. 6).

గ్యాసుపొయ్యి: గ్యాస్‌తో వంటచేసుకోడానికి వాడే స్టీలుపొయ్యి. చూ. చిత్రం 94. (రా. 3, 5).

గ్యాసులైటరు: గ్యాస్‌పొయ్యి వెలిగించుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 95. (రా. 8, 11).

గ్రావరు: శిల్పి విగ్రహాలు దిద్దుకోడానికి తురుముకొనే పరికరం. (కో. 28).

గ్రిల్‌వర్కు: (ఇం. Grill work). ఉ. గ్రిల్‌వర్క్, గ్రిల్స్‌పని, జాలివర్కు, డిజైనువర్కు, డ్రిల్లువర్కు, ఫ్యాబ్రికేషన్‌వర్కు, ఫ్రేమువర్కు, వెల్డింగు

పని. డిజైనుచేసి ఇనుపవస్తువులు తయారుచేసే పని. (కో. 23, 25; తె. 4).

గ్రిల్స్‌పని: (< ఇం. Grills + పని). చూ. పర్యా. గ్రిల్‌వర్కు. డిజైనుచేసి ఇనపవస్తువులు తయారు చేసే పని. (కో. 30).

గ్రీనింగు: (< ఇం. Grinding). రూ. గ్రైనింగు. చూ. పర్యా. గరుకురాయి[1]. వెల్డింగ్ అతుకులను శుభ్రంచెయ్యడానికి వాడే రాయి. (రా. 15).

గ్రీనింగురాయి: (< ఇం. Grinding + రాయి). చూ. పర్యా. గరుకురాయి[2]. మొద్దుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడానికి వాడే రాయి. (రా. 10).

గ్రీమ్‌లివర్ : చూ. పర్యా. గేర్. సైకిల్‌చక్రం తిరగడానికి ఉపయోగపడే పరికరం. (తె. 8, 12).

గ్రీసు: (< ఇం. Grease). మిషన్‌లో రేకు సులువుగ వంగడానికి పూతగా వాడే పదార్థం. (కో. 22, 26; రా. 8, 16).

గ్రైండరు: (< ఇం. Grinder). ఉ. గ్రాండరు, గ్రేండరు. పర్యా. గ్రైండింగు, గ్రైండింగుమిషను, టేబుల్‌గ్రైండరు, చేతిపానమిషను, పన[3], పిక్‌బజిల్ గ్రైనింగు, ప్రెస్‌కేబుల్, ప్లెక్సిబుల్ గ్రైండరు, ఉల్ఫ, హ్యాండ్‌గ్రైండరు. వెల్డింగ్ ఉబ్బులను శుభ్రపరచడానికి వాడే యంత్రం. (కో. 5, 7, 18, 21, 22; తె. 2, 6, 8, 12, 13, 21, 22; రా, 15).

గ్రైండింగ్‌చేయు: (క్రి.) (< ఇం. Grinding + చేయు). ఉ. గ్రైండింగుచేయు. అతుకులు కనపడకుండ సాపుచేయడం. (కో. 25; రా. 3).

గ్రైండింగ్‌స్టాండు: (< ఇం. Grinding stand). గ్రైండర్‌పైరు కిందపడకుండ ఎత్తుగ ఉంచడానికి ఉపయోగపడే కుదురు. (తె. 21).

గ్రైండింగ్‌స్టాండు: గ్రైండర్ వైరు క్రిందపడకుండ ఎత్తుగ ఉండడానికి వాడే సాధనం. (తె. 21).

గ్రైండింగ్‌స్టోను: (< ఇం. Grinding stone). చూ. పర్యా. గరుకురాయి[1]. వర్కుషాపుల్లో వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడే రాయి. (తె 21).

గ్రైండింగు: రూ. గ్రైనింగు. చూ. పర్యా. గ్రైండరు. వెల్డింగ్ ఉబ్బులను శుభ్రపరచడానికి వాడే యంత్రం. (తె. 3, 6).

గ్రైండింగుమిషను: (ఇం.) చూ. గ్రైనింగుమిషను. చూ. గ్రైండరు. వెల్డింగ్ ఉబ్బులను శుభ్రపరచ డానికి వాడేయంత్రం. (కో. 8, 10, 19, 24, 26, 28–30; తె. 24).

గ్రైనింగు: (ఇం.) చూ. గ్రైండింగు. (కో. 4, 9, 16, 17, 23, 25; రా. 7).

గ్రైనింగుమిషను: చూ. గ్రైండింగు మిషను. (కో. 2, 3, 15, 25; రా. 3–7, 11).

గ్రోము: గొడుగు పిడిలో ఉండే లాక్. (రా. 12).

గ్లాస్‌స్టాండు: (ఇం.) లోటాలు పెట్టుకోడానికి వాడే పరికరం. (తె. 10, 11).

గ్లాసు[1]: (< ఇం. Glass). పర్యా. జామ్‌గ్లాసు, జాము, డిస్‌గ్లాసు, తిరుపుర లోట, నీళ్ళగ్లాసు, ప్లెయిన్‌గ్లాసు, లోట, వాటర్‌గ్లాసు, సాదాగ్లాసు, సాదాలోట, సాధారణగ్లాసు, సోడాగ్లాసు, నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215. (కో. 1, 2, 5, 15, 16, 19–21, 24–27, 29, 30; తె. 2, 4–6, 11, 18, 19; రా. 6, 11–14).

గ్లాసు[2]: పెట్రొమాక్స్‌లైటు మెంటల్‌కు బయటగాలి సోకకుండ ఉండడానికి ఉపయోగించే అద్దాలఫ్రేము. (తె. 21, 22, 24).

గ్లాసు[3]: చూ. పర్యా. గిండి. పూజా సమయంలో తీర్థానికై వాడే రాగిపాత్ర. (కో. 28; రా. 13, 16).

గ్లాసు[4] : చూ. పర్యా. అద్దం[1]. వెల్డింగుపనిలో కంటికి రక్షణగా వాడే పరికరం. (కో. 9; తె. 20).

గ్లాసుకరవాయి: (< ఇం. Glass + కరవాయి). గ్లాసులు తయారుచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 19; రా. 2).

గ్లోసు: (< ఇం. Glove). ఉ. గ్లౌసు. చూ. పర్యా. కవరు[1]. వెల్డింగ్ చేసేటప్పుడు కరెంటుషాక్ కొట్టకుండ ఉండడానికి చేతులకు వేసుకొనే చర్మపు తొడుగు. (తె. 5, 17, 21, 22).

గ్లోబుదాగలి: (< ఇం. Globe + దాగలి). చూ. పర్యా. రౌనుదాగలి. కంచాలు మొదలైనవాటికి రేకులు తిరగ్గొట్టుకోడానికి, తాటదళాన్ని సరిపెట్టుకో డానికి వాడే గుండ్రంగా, లింగాకారంగా, విడిగా ఉండే దిమ్మ. (కో. 21).

## ఘ

ఘన్: చూ. గన్. (తె. 2, 24).

ఘరను: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడేదిమ్మ. (తె. 24).

చ

చక్కడిబద్ద: చూ. పర్యా. పట్టి[1]. రేకుపై కొలతలు వేసుకోడానికి వాడే స్కేలు చూ. చిత్రం 71. (తె. 14, 15).

చక్కి[1]: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గులపొయ్యిలో బూడిద రాలడానికి వాడే రంధ్రాల బిళ్ళ. చూ. చిత్రం 59. (కో. 19, 23, 24, 26).

చక్కి[2]: రూ. ఛక్కి. కడ్డీలు వంచడానికి, గోళాలు తయారుచేయడానికి వాడే రింగులాంటి పనిముట్టు. (రా. 15).

చక్కిలంపావు: రూ. చక్లిపావు. చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరాపదార్థాలు తయారు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (రా. 12).

చక్కివల్లు (కన్నడం): చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (రా. 15).

చక్కెడపోగర: విగ్రహంపై ఉండే పీసులు తెగ్గొట్ట డానికి పనికివచ్చే పరికరం. (కా. 1).

చక్రలేగ: పర్యా. రెంపిలేగ, రేకులేగ, రౌనులేగ. పాత్ర లోపలవైపు మెరుగుపెట్టడానికి వాడే పరికరం. (కో. 29).

చక్రం[1]: పర్యా. రిమ్ము[2], సైకిల్‌పయ్య. సానరాయి తిరగడానికి బెల్టుద్వారా కలిపిన సైకిలు చక్రం. (రా. 1).

చక్రం[2]: చూ. పర్యా. అడుగుగొడుతు. గొడుగు పుల్లలను బిగించడానికి గొడుగుకర్ర పైభాగాన ఉండే గుండ్రని ఇత్తడి పరికరం (కో. 8, 20, 26, 29, 30; తె. 5, 6, 17, 20, 23).

చక్రం[3]: చూ. పర్యా. అసగోలు. లోహపు రేకులు, కడ్డీలు సాపు చేయడానికి వాడే దిమ్మ. (కో. 6; తె. 10, 12).

చక్రం[4]: చూ. పర్యా. గిలక[2]. సంగడిదిండు తిరగ డానికి వాడే పరికరం. (కో. 1, 2, 4, 8, 9, 24, 26-30; తె. 1, 4, 17, 18, 21, 22, 24, 25, 26; రా. 1, 9).

చక్రం[5]: పోతపనిలో చేసిన విష్ణుచక్రం. (కో. 8).

చక్రం[6]: చెంబులు తయారు చేసేటప్పుడు ఉపయోగించే పరికరం. (కో. 10).

చక్రం[7]: కుట్టుమిషన్‌ను నిలపడానికి సహాయపడే చక్రం. (రా. 6).

చక్రాలగిద్దె[1]: చూ. పర్యా. కారాచాచ, వాంపోడి, మురుకులు వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50 (తె. 21).

చక్రాలపావు: చూ. పర్యా. కారాచాచ. కారాలు, వాంపోడి, మురుకులు వగైరా పదార్థాలు పిండుకోడానికి వాడే జల్లెడలాగా ఉండే లోహపు పరికరం. చూ. చిత్రం 50 (తె. 15, 19).

చక్లిపావు: చూ. చక్కిలంపావు. (రా. 14).

చంకబిందె: ఉ. శంకబిందె, సంకబింది. పర్యా. కుంబకోణంకడవ, కూజాబిందె, మద్రాసుబిందె. మూతి పొడుగ్గా అడుగు పట్టంగా క్రిందిభాగం వెడల్పుగా ఉండే లోహపుపాత్ర. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. దక్షిణ ప్రాంతం వాళ్ళు ఎక్కువ వాడ్తారు. (కో. 13, 24, 29; తె. 17).

చటంబరం: ఉ. చాటంబరం, చెటాంబరం, చూ. చెటాంబరు. (కో. 4, 11; తె. 17, 20, 24).

చటారు: చూ. పర్యా. శటగోపురం. దేవాలయల్లో భక్తుల వలమీద పెట్టడానికి వాడే సాధనం. చూ. చిత్రం 209. (కో. 13).

చట్టం[1]: ఉ. చెట్టం. చూ. చట్రం[1]. (కో. 2, 8, 13; తె. 17, 22; రా. 1, 4, 5, 8).

చట్టం[2]: లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే పరికరం. (తె. 3, 4; రా. 3, 11).

చట్టంబరు: చూ. చెటాంబరు. (కో. 8; తె. 8, 9, 12; రా. 6-8).

చట్టాం: చూ. చట్రం. (కో. 27, 30).

చట్టి: (బ). చట్టిలు, చట్లు. ఉ. సట్టి. పర్యా. కూర సట్టి, పప్పుచిట్టి. అన్నం, కూరలు వండడానికి ఉపయోగపడే చిన్న లోహపు పాత్ర. (తె. 3).

చట్టిన్‌తూగు: పర్యా. చెట్న అతుక్కు. రసం తెచ్చుకో డానికి వాడే చిన్న పాత్ర. (కో. 8).

చట్నితుక్కు: పర్యా. మల్లితూగు, ముక్కుగిన్నె. నూనె తేవడానికి, ఏవైన పదార్థాలు ఉంచుకోడానికి ఉపయోగించే నిలువు పాత్ర. హాండిల్, మూత ఉంటాయి. (కో. 27).

చట్నిప్లేటు: (< హిం. చట్ని + ఇం. Plate). పర్యా. చిన్న కూరగిన్నె, చిన్న గిన్నె, చిన్న పళ్లెం, వైనాప్లేటు, డీలక్సు, డైమన్ కప్పు. చట్నీ, కూరలు వేసుకోడానికి పనికివచ్చే చిన్న పళ్లెం. (కో. 17).

చట్రం[1]: రూ. చట్టం[1]. పర్యా. డాకలి[1], తండోలం, తుండు[1], దాగలిదిమ్మ, నిలువుదాగలి, మొద్దు[3], మోపు[2], లెవల్‌డాకిలీ, లెహి, వెరన్, లోహపు

రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 10, 13; తె. 8, 9).

చ(క్రం²: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గుల పొయ్యిలో బూడిద రాలడానికి వాడే రంధ్రాల బిళ్ళ, చూ. చిత్రం 59. (కో. 18).

చ(క్రం³: చూ. పర్యా. కానా. డిజైన్ ఫ్రేములో ఉండే ఒక్కొక్క డిజైను అర. (తె. 18).

చ(క్రం⁴: రూ. చట్టాం, సత్రం, సెట్రం. చూ. పర్యా. రంధ్రాల గరిటె. నూనెలోనుండి పిండి వంటకాలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న గరిట. చూ. చిత్రం 107. (కో. 14, 15, 22).

చండూరుబిందె: నీళ్ళు తెచ్చుకోవడానికి ఉపయోగించే ఇత్తడి బిందె. వెడల్పుగా ఉంటుంది. చండూరులో తయారయింది. (తె. 24).

చత్రం: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గులపొయ్యిలో బూడిద రాలడానికి వాడే రంధ్రాల బిళ్ళ. చూ. చిత్రం 59. (కో. 16).

చత్రికపెట్టు: (క్రి.) పదునుచేయడానికి కడ్డీనికాల్చి నున్నగ సాపుచేయడం. (కో. 29).

చదరగిన్నెలేగ: పర్యా. చదరంలేగ, చిన్న కమ్మి, చిన్నలేగ, చిరులేగ, చెంబులేగ, జిలకమ్మి, తరమానంలేగ, తరుంజారు, వంపుదట్ట, వాలుమొల సదరం, సాపుకమ్మి, సాపులేగ, సాపుసదరం, సుడి కమ్మి, స్మూత్‌కమ్మి. లోహపు పాత్రలను మెరుగు పట్టడానికి వాడే పనిముట్టు. (కో. 15).

చదరపచ్చు: చూ. చదరప్పచ్చు. (కో. 1).

చదరపు ఆకురాయి: విగ్రహాల పనిలో చదరంగా రుద్దుకోడానికి ఉపయోగించే పరికరం. (కో. 3).

చదరపుచానం: చూ. పర్యా. గుజారను. విగ్రహానికి డిజైన్లు కొట్టడానికి వాడే పరికరం. (కో. 3).

చదరపు పట్టకార: చూ. పర్యా. చదరంకరవాయి. విగ్రహంపనిలో వాడే పరికరం. (కో. 3).

చదరపుపంచు: పర్యా. చమ్మి, చిన్నసిజిలు, చిన్న సీర్నం, చీర్ణం, ఛానం, ఛెన్ని, తెగవఛాణం, పల్చనిశానం, ముతుచానం, వెట్రం, సిజలు, సన్న శానం. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (రా. 3).

చదరప్పచ్చు: రూ. చదరపచ్చు. చూ. పర్యా. కారు¹. కాల్చిన ఇనప బద్దీలను సాపుచేయడానికి వాడే దిమ్మ. (కో. 3).

చదరంకరవాయి: పర్యా. చదరపుపట్టకార. విగ్రహం పనిలో వాడే పరికరం. (కో. 3).

చదరం కొబ్బరితురుము: కొబ్బరి తురమడానికి వాడే పరికరం. చదరంగా ఉంటుంది. (కో. 4).

చదరంచేయు: (క్రి.) కొలిమిలో ఇనుమును శుద్ధం చేయడం. (రా. 4).

చదరందిమ్మె: చూ. పర్యా. కారు¹. కాల్చిన ఇనప బద్దీలను సాపుచేయడానికి వాడేదిమ్మ. (రా. 4).

చదరంపూలబుట్ట: దేవాలయానికి పూజాసామగ్రి తీసుకెళ్ళడానికి వాడే పరికరం. (కో. 4).

చదరంలేగ: ఉ. చెదరంలేగ. రూ. సదరంలేగ. చూ. పర్యా. చదరగిన్నెలేగ. లోహపుపాత్రలను మెరుగు పట్టడానికి వాడే పనిముట్టు. (కో. 27, 29).

చదురు: (క్రి.) కళాయిపనిలో తగరాన్ని కరిగించడం. (కో. 5).

చన్ద్వా: చూ. ఛందన్. (తె. 17, 23).

చంద: చూ. ఛందన్. (కో. 29).

చందనకప్పు: (<చందన + ఇం. Cup). చూ. పర్యా. గంధంగిన్నె. గంధపు బిళ్ళలు వేసుకోడానికి వాడే చిన్నగిన్నె. చూ. చిత్రం 74. (కో. 1).

చందమామ అచ్చు: చూ. పర్యా. గుండు అచ్చు. కాగిన ఇనుమును గుండ్రంగా చేయడానికి ఉపయోగించే అర్ధచంద్రాకృతి(గా ఉన్న) పరికరం. (కో. 3).

చంద్రలేఖ: చూ. పర్యా. కూజా. నీళ్ళు తెచ్చుకో డానికి ఉపయోగించే కూజా ఆకారమున్న లోహపు బిందె. (కో. 30).

చపట ఆకురాయి: పర్యా. చిన్న ఆకురాయి, చౌకం ఆకురాయి. బీగం గాడి కోయడానికి వాడే పనిముట్టు. (రా. 12).

చపాతిడబ్బా: చపాతీలు తీసుకువెళ్ళడానికి వాడే పరికరం. (తె. 1).

చపాతీప్రెస్: (చపాతీ + ఇం. Press). చపాతీలు చేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 96. (కో. 17).

చప్పాతిగిన్నె: చపాతీలు ఉంచుకోడానికి వాడే చిన్న పాత్ర. (కో. 6).

చముక్: (హిం.) చూ. పర్యా. గుత్తిగిన్నె. కూరలు వడ్డించడానికి వాడే నాల్గు లేదా అయిదు గిన్నెలు గుత్తిగాచేసి పైన పట్టుకోడానికి కాడ ఉండే లోహపుపాత్ర. చూ. చిత్రం 87. (తె. 1, 6).

చమ్మి: (హి). చూ. పర్యా. చదరపు పంచు. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (రా. 11).

చర్చిబొమ్మ: (< ఇం. Church + బొమ్మ). క్రైస్తవుల ప్రార్థనలో ఉపయోగించుకోడానికి వాడే బొమ్మ. (కో. 8).

చలాక: చూ. సలాక[1]. (తె. 25; రా. 7, 8).

చల్పగతట్టు: (క్రి.) చూ. పర్యా. సరుసు. పదును పెట్టడానికి వీలుగా పనిముట్ల బద్దను పల్చగచేయడం. (రా. 12).

చల్ల: మజ్జిగ పోసుకోడానికి ఉపయోగించే పాత్ర. (కో. 8, 9).

చల్లకవ్వం: ఉ. చల్లాకవ్వం. రూ. సల్లకవ్వం. చూ. పర్యా. కవ్వం. మజ్జిగ చిలకడానికి వాడే సాధనం. చూ. చిత్రం 45. (కో. 14, 15; తె. 10, 11, 14–16).

చల్లగరిట: చూ. పర్యా. కవ్వం. మజ్జిగ చిలకడానికి వాడే సాధనం. చూ. చిత్రం 45. (తె. 13).

చల్లచిక్కం: చూ. కవ్వం. మజ్జిగ చిలకడానికి ఉపయోగపడే సాధనం. చూ. చిత్రం 45. (తె.12).

చల్లార్చు: (క్రి.) కొలిమిలో వేడెక్కిన లోహపు వస్తువుల్ని చల్లచేయడం. (తె. 16; రా. 1, 4, 5).

చవల్: అచ్చులలో మన్ను పోయడానికి ఉపయోగపడే రేకు. (రా. 11).

చాక్‌పీసు: (< ఇం. Chalk piece). ఉ. చాక్‌పీస్. లోహపు కడ్డీలపై, రేకులపై గుర్తులు గీయడానికి ఉపయోగించే సుద్దముక్క. (కో. 25, 28).

చాక్‌పౌడరు: (< ఇం. Chalk Powder). పర్యా. పుట్టి, మక్కు, లప్పం. రివిట్లు, అతుకులు కనపడకుండ (బీరువాపై) పూయడానికి వాడే తెల్లని పదార్థం .(తె. 22).

చాకా(లు): పెట్టె కిందమోపకుండ అడుగున ఉండే బొడిపె(లు). (కో. 26).

చాకు[1]: చూ. పర్యా. కత్తి[1]. కూరగాయలు తరగడానికి ఉపయోగపడే పరికరం. చూ. చిత్రం 97. (కో. 23, 24, 28, 29; తె. 7, 11, 18, 92–24. రా. 11, 14, 16).

చాకు[2]: స్టౌపైనున్న మట్టిని శుభ్రంచేయడానికి వాడే పరికరం. (కో. 28).

చాకెటు: చూ. పర్యా. కాడగిన్నె. టీ తయారుచేయడానికి వాడే పొడవుకాడ ఉన్న పాత్ర. (తె. 1).

చాంచి: చూ. పర్యా. గీకుడుపట్టి. అచ్చులపై ఉండే మట్టిని శుభ్రంచేయడానికి వాడే పల్చని రేకు. (తె. 10, 11).

చాడీ: మడకకారు. (కో. 7).

చానపుకట్టు: చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోవడానికి ఉపయోగపడే పరికరం. చూ. చిత్రం 147. (కో. 18).

చానపుగార: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 16).

చానలు: రూ. చాన్సలు. రేకులను సరిచేయడానికి వాడే పరికరం. (తె. 9, 11, 12).

చానస్‌బద్ధి: డబ్బాలకు జవ్వలేసే పరికరం. (కో. 4).

చానం: చూ. శానం. (కో. 1–3, 5–15, 17, 22, 26–28, 30; తె. 3, 5–16; రా. 4, 6–8).

చానంకారు: రూ. శానంకారు, శానపుకారు. చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోవడానికి వాడే పరికరం. చూ. చిత్రం 147. (కో. 4, 11, 13–15, 27; తె. 21).

చానంపట్టుకారు: ఉ. చానం పట్టకార. రూ. ఛాణం పట్కార, శానంపట్టకార. చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువుల్ని తెగ్గొట్టేటపుడు శానాన్ని పట్టుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 147. (కో. 3–5, 7–9, 20; తె. 1, 3, 17, 19, 21, 22).

చాన్సలు: చూ. చానలు. (తె. 8).

చాందిన: (హిం.) చూ. ఛందన్. (తె. 26).

చాపకచిమ్ము: చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 147. (తె. 6).

చాపడాక: పర్యా. చాపలగిన్నె, చేపలసట్టి. చేపల కూర చేయడానిచి వాడే తక్కువ లోతుగల వెడల్పు పాత్ర. (తె. 17).

చాపన్‌కటర్: (< ఇం. Chape + Cutter). ఇనప పట్టీలను కట్‌చేయడానికి వెల్డింగ్ పనిలో ఉపయోగించే దిమ్మ. (తె. 25).

చాపన్‌కటింగు : (< ఇం. Chape + Cutting). ఇనుపపట్టీలను ఖచ్చితంగా త్వరగా కట్ చేయడానికి వెల్డింగ్‌పనిలో వాడే పరికరం. (తె. 25).

చాపను: ఉ. చాపాను. రూ. చాబనం. చూ. పర్యా. అడ్డగళ్ళి. రేకులు, కడ్డీలు తెగ్గొట్టేటప్పుడు వాడే దిమ్మ. (తె. 4–6, 8, 9).

చాపలగిన్నె: చూ. పర్యా. చాపడాక. చేపలకూర వండడానికి వాడే తక్కువ లోతుగల వెడల్పుపాత్ర. (తె. 19).

చాపు: చూ. పర్యా. అడ్డగళ్ళి. రేకులు, కడ్డీలు తెగ్గొట్టే

టప్పుడు వాడే దిమ్మ. (తె. 4).

చాబనం: చూ. ఛాపను. (తె. 5).

చాబి[1]: చూ. పర్యా. హేర్‌వాల్. స్టౌబర్నర్ గాలిని అదుపు చేయడానికి టాంక్ బిరడాపై ఉండే పరికరం. (తె. 4, 6, 17).

చాబి[2]: డ్రిల్లుబిట్లను ఊడదీయడానికి, బిగించడానికి వాడే పరికరం. (తె. 5).

చాబిబిళ్ల: చూ. పర్యా. కీమూత్. తాళం రంధ్రం అందంగా కనబడడానికి బీరువా తలుపుపై ఉండే తాళంబిళ్ళ. (తె. 20).

చాబిళ్ల: చూ. చావిబిళ్ళ. (తె. 17).

చాబిసాకెట్: నూనెను ఎక్కువ తక్కువ చేసుకోడానికి బర్నల్‌కింద అమర్చిన సాధనం. (తె. 5).

చామరం: (బ) చామరాలు, చాంబ్రాలు, ఉ. చేమరం, శామరం. చూ. పర్యా. వింజామరం. దేవునికి విసరడానికి వాడే సాధనం. లోహపు గొట్టంతో కస్తూరి మృగం, వెంట్రుకలు బిగించి దేవుని ప్రక్కన పెట్టారు. (కో. 10, 11, 13).

చాయ్‌కీట్లి: (< హిం. చాయ్ + ఇం. Kettle). రూ. చాయ్‌కేట్లి. పర్యా. చాయజాలి[1], టీకెటిలు. టీ తయారుచేయడానికి వాడే మూతఉన్న లోహపు పాత్ర. (తె. 15, 17, 18).

చాయ్‌కీత్లి : ఉ. చాయ్‌కెత్లి. చూ. చాయ్‌కేట్లి. (తె. 19, 25).

చాయ్‌గిన్నె: చూ. పర్యా. కాడగిన్నె. టీ తయారు చేయడానికి వాడే పొడవుకాడ ఉన్న పాత్ర. (తె. 3, 19).

చాయ్‌చెంచా: చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే పరికరం. (తె. 1, 5).

చాయ్‌జాడి: చూ. పర్యా. కాడగిన్నె. చాయ్ తయారు చేయడానికి వాడే పొడవుకాడ ఉన్న పాత్ర. (తె. 1).

చాయ్‌దాన్: (హిం.) టీ చేయడానికి వాడే కుక్కర్ లాంటి పాత్ర. (తె. 17).

చాయ్‌పోగర: అడుగుభాగం సన్నగా ఉండి చతురస్రాకారంగా ఉండే పరికరం. బండి ఇరుసుల మొనలకు రంధ్రాలు వేయడానికి ఉపయోగం. (తె. 24).

చాయ్‌బిళ్ల: చూ. చావిబిళ్ళ. (తె. 17).

చాయ్‌స్టాండు: (< హిం. చాయ్ + ఇం. Stard). చూ. పర్యా. టీస్టాండు. టీగ్లాసులు తీసుకువెళ్ళడానికి వాడే పరికరం.

చాయకచీక: చూ. పర్యా. టీస్టాండు, టీగ్లాసులు తీసుకెళ్ళడానికి వాడే స్టాండు. (తె. 11).

చాయగంటె[1]: చూ. పర్యా. గరిట. టీ కలుపుకోడానికి వాడే సాధనం. (తె. 12, 13).

చాయగంటె[2]: పర్యా. చాయజాలి[2], టీజల్లెడ, టీచిక్కం, టీజాలి, టీఫిల్టరు, టీ వడగట్టుకోవడానికి ఉపయోగించే లోహపు పరికరం. (తె. 12):

చాయచిక్కు: చూ. పర్యా. టీస్టాండు. టీగ్లాసులు తీసుకెళ్ళడానికి వాడేస్టాండు. (తె. 9).

చాయజాలి[1]: చూ. పర్యా. చాయ్‌కేట్లు. టీ తయారు చేయడానికి వాడే పరికరం. (తె. 8).

చాయజాలి: చూ. పర్యా. చాయగంటె. టీ వడగట్టుకోవడానికి ఉపయోగించే లోహపు పరికరం. (తె. 12).

చార్‌కోలు: (< ఇం. Char-Coal). పర్యా. బొగ్గు, లికోబొగ్గు. కొలిమిలో లోహపు వస్తువులు వేడిచేయడానికి వాడే పరికరం. (తె. 17).

చారుగంటె: చూ. పర్యా. కాడగంటె. చేత్తో పట్టుకోడానికి పొడవైన కాడ ఉండే చిన్నకప్పు. చలికేంద్రంలో నీళ్ళు పోయడానికి ఉపయోగం. చూ. చిత్రం 47. (తె. 2, 23).

చారుగిన్నె[1]: చూ. పర్యా. కళాయిగిన్నె. కూరలు నిలువ ఉంచడానికి ఉపయోగించే పొడవైన లోహపుపాత్ర. (కో. 25; తె. 5).

చారుగిన్నె[2]: చూ. పర్యా. గోకర్ణం. చారు వడ్డించడానికి వాడే పైభాగాన గాడిరేకు అమిర్చిన పాత్ర. చూ. చిత్రం 92. (కో. 2; రా. 3).

చారుగోకర్ణం: చూ. పర్యా. గోకర్ణం. చారు వడ్డించడానికి వాడే పైభాగాన గాడిరేకు అమర్చిన పాత్ర. చూ. చిత్రం 92. (తె. 22).

చారుజగ్గు: చూ. పర్యా. గోకర్ణం. చారు వడ్డించిడానికి వాడే పైభాగాన గాడిరేకు అమర్చిన పాత్ర. చూ. చిత్రం 92. (కో. 30).

చారుదార: చూ. పర్యా. గోకర్ణం. చారు, సాంబారు వడ్డించడానికి వాడే పైభాగాన గాడిరేకు అమర్చిన పాత్ర. చూ. చిత్రం 92. (కో. 18).

చాలుచేయు: (క్రి.) బీరువా బీగం సులువుగాపడేటట్లు చేయడం. (కో. 22, 24; రా. 8, 16).

చాల్నీ[1]: ఉ. చాలిని. పర్యా. చిల్లిబుట్ట, జంగిడి, జల్లెడ[3], బియ్యంబుట్ట. ఉడకబెట్టిన పదార్థాలను (కూరగాయలు వగైరా) వడబోసుకోడానికి వాడే సాధనం. (కో. 17).

చాల్ని[2]: దిబ్బరొొట్టెలు తయారుచేయడానికి ఉపయోగించే పళ్లెంలాంటి సాధనం. చూ. చిత్రం 93. (కో. 7-17).

ఛావిబిళ్లు: రూ. చాప్‌బిళ్ళ, చాబిళ్ళ. బీరువాతలుపుపై బిగించడానికి బీరువా కంపెనీపేరుఉండే రంధ్రపు బిళ్ళ. (రా. 8).

ఛాస్‌పాను: (< హిం. చాయ్ + ఇం. Pan). రూ. సాస్‌పాను. చూ. పర్యా. కాడగిన్నె. కాఫీ, టీ తయారుచేయడానికి వాడే పొడవుపాటి కాడఉన్న పాత్ర. (కో. 17).

చిక్కం[1]: చూ. పర్యా. ఉల్లిపాయలబుట్ట. ఉల్లిగడ్డలు ఆరబెట్టుకోడానికి కమ్మలతో చుట్టబడిన సాధనం. చూ. చిత్రం 29. (తె. 14, 15).

చిక్కం[2]: (బ). చిక్కాలు. ఎద్దులమూతికి వాడే తీగలబుట్ట. (కో. 4, 9).

చికుక్కు: చూ. పర్యా. కంచాలస్టాండు. తట్టలు, గ్లాసులు, గరిటెలు ఉంచడానికి ఉపయోగించే ఇనుప పట్టీలస్టాండు. చూ. చిత్రం 220. (తె. 8, 9, 19, 24).

చిచ్చు: చూ. సిచ్చు. (తె. 22, 23, 25).

చించకట్ట: చూ. పర్యా. కుంచు. కాక బాగారావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే గుడ్డచుట్టిన కట్టెముక్క. (కో. 30).

చించకొట్టు: (క్రి.) కొలిమిలోని అగ్గి పైకి ఎగరకుండ నీళ్ళు చల్లడం. (కో. 30).

చిట్టి[1]: లోహపు పాత్ర మూతిభాగం. (రా. 9).

చిట్టి[2]: ధాన్యం కొలుచుకోడానికి వాడే ఇనప పరికరం. చిన్నదిగా ఉంటుంది. ఎనిమిది చిట్లు అయితే ఒక శేరు. (రా. 2).

చిట్టిపొయ్యి: ఉ. చిట్టుపొయ్యి, చుట్టుపొయ్యి. పర్యా: ఉనకపొయ్యి, పొట్టుపొయ్యి. పొట్టుతో వంటచేయడానికి ఉపయోగపడే ఇనపపొయ్యి. (తె. 3, 9, 14-18, 23).

చిట్టెం: ఉ. చిట్టం. రూ. చిట్టం, చిట్లం, సట్ట. చూ. పర్యా. కుట్టు. కొలిమిలో ఇనుము కాలగా మిగిలిన పనికిరాని బొగ్గు, ఇనుము మిశ్రమం. (కో. 27, తె. 1, 20, 25).

చిట్నడితుకుక్కు: చూ. చెట్న అతుక్కు. (కో. 19).

చిట్టం: చూ. చిట్టెం. (కో. 29).

చిట్టాయి: చూ. పర్యా. కుట్టు. కొలిమిలో ఇనుము కాలగా మిగిలిన పనికిరాని బొగ్గు, ఇనుము మిశ్రమం. (కో. 24).

చిట్లం: ఉ. చిట్లాం, చిల్లెం. చూ. చిట్టెం. (కో. 16, 18; తె. 21; రా. 8).

చిట్లితొట్లు: దూడలకు తవుడు కలిపిపెట్టడానికి వాడే చిన్న లోహపు తొట్టికలు. (కో. 15).

చిట్లుపేయు: (క్రి.) చూ. పర్యా. తరుము[2]. లోహపు రేకుపై రంధ్రాలు వేయడం. (రా. 2).

చితకగొట్టు: (క్రి.) ఉండగా ఉన్న లోహాన్ని మూసలో కరగబెట్టి బాగా కలియబెట్టడం. (కో. 19).

చితకొక్కొట్టు: (క్రి.) రూ. చితగ్గొట్టు. గట్టిగ ఉండే పదార్థాలను మెత్తగచేయడం. (కో. 27).

చితగ్గొట్టు: (క్రి.) చూ. చితకొక్కొట్టు. (కో. 18).

చిత్తి: పర్యా. తిత్తి, బత్తా[1]. కొలిమికి గాలి రావడానికి ఉపయోగించే చర్మపుసంచి. (రా. 16).

చిత్రకారుపని: పర్యా. చెకనంపని, శిల్పపని. ఇత్తడి రేకుతో విగ్రహాలు, వాహనాలు మొదలైన వస్తువులు చేసేపని. (రా. 13).

చినగెడ్డపార: చూ. చినగెడపార, చిన్నగడారు. చూ. పర్యా. గెడ్డపార. చెంబుల అడుగులు సాపు చేయడానికి వాడే పరికరం. (కో. 4, 9, 11, 14, 16; రా. 1, 9).

చినగెంటె: చూ. పర్యా. గరిటె[2]. మూసలో కరిగిన లోహపు తేటను తీయడానికి వాడే పరికరం. (రా. 2).

చినమట్లారిసుత్తి: చెంబులు తట్టడానికి వాడే పరికరం. (రా. 1).

చినసుత్తి: చూ. చిన్నసుత్తె. చూ. చిన్నసుత్తె. (రా. 1-3).

చిన్నఅడ్డగన్నెసుత్తి: ఉ. చిన్నగన్నెసుత్తి. రూ. చిన్న అడ్డగానిసుత్తి. పర్యా. చిన్న అడ్డంసుత్తి. లోహపు బిందెల, చెంబుల మెడభాగం తట్టడానికి రేకును సమపట్టం చేయడానికి వాడే పరికరం. (కో. 5, 21, రా. 7).

చిన్నఅడ్డగానిసుత్తి: చూ. చిన్న అడ్డగన్నెసుత్తి. (కో. 21).

చిన్నఅడ్డంసుత్తి: చూ. పర్యా. చిన్న అడ్డగన్నెసుత్తి. లోహపు బిందెల, చెంబుల మెడభాగం తట్టడానికి వాడే పరికరం. (రా. 1).

చిన్నఅంచుగిన్నె: పర్యా. చిన్నమట్టుగిన్నె. భోజనాల దగ్గర కూరలు ఉంచుకోడానికి ఉపయోగపడే చిన్న పాత్ర. (తె. 8, 9, 13).

చిన్నఆకురాయి: చూ. పర్యా. చపట ఆకురాయి. బీగం చెవులు రాసుకోడానికి వాడే పరికరం.

(కో. 11; తె. 2; రా. 8).

చిన్నకటకలసుత్తి: పర్యా. చిన్నగన్‌సుత్తి, చిన్న గుండుసుత్తి, చిన్నసమ్మెట, చిన్నసుత్తె, చెయ్యిసుత్తి, చేతిపట్ర, చౌక, చౌకసుత్తి, తాళాలసుత్తి, నడిపిసుత్తి, నాలుగుపచ్చాల సుత్తి, నాలుగు పలకలసుత్తి, నాల్గుమూలల హతోడె, పలకసుత్తి, మార్కోలు, సన్నసుత్తె, ససటాసుత్తి, సాదాసుత్తి, సాఫ్‌చేతిసుత్తి, సాపుసుత్తి, సుత్తిఉలి, సుత్తికి, సెట్టింగ్‌సుత్తి, స్ట్రేట్‌హామర్, హతోడ, హంబర్. లోహపురేకులను, కడ్డీలను బెండ్‌చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 1).

చినకత్తెర: ఉ. చినకత్తిర, చిన్నకత్తిర, చిన్నకత్తిరి. పర్యా. చేయికత్తిరి, హాండ్‌టూల్సు[2], హాండ్‌కత్తెర. చిన్నచిన్న రేకుల్ని కత్తిరించడానికి వాడే పనిముట్టు. (కో. 2–6, 3, 9, 11, 15–19, 22, 23, 26; తె. 14, 15, 25; రా. 1, 5, 7, 8, 10, 15).

చిన్నకన్నుసుత్తి: రేకుపై చిన్నసంపులు చేయడానికి వాడే పనిముట్టు. (కో. 21).

చిన్నకమ్మి: చూ. పర్యా. చదరగన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగుపట్టడానికి వాడే పనిముట్టు. (కో. 26).

చిన్నకరవాయి: చిన్నచిన్న లోహపుపాత్రలు చేయడానికి వాడే పరికరం. (కో. 15, 24, 28; తె. 5, 15, 18).

చిన్నకళాయిడేక్సా: అన్నం చేసుకోడానికి వాడే పాత్ర. (కో. 1).

చిన్నకాగు: పర్యా. చిన్నబిందె, నీళ్ళు తేవడానికి వాడే గుండ్రని లోహపుబిందె. పైభాగంలో చుట్టూ మెరుగుచుక్క లుంటాయి. (రా. 16).

చిన్నకారు: చూ. పర్యా. అతికేకాడ. నిప్పును, వేడి లోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 20; తె. 14, 16, 18, 21, 25, 29).

చిన్నకూరగిన్నె: చూ. పర్యా. చట్నీప్లేటు. చెట్నీ, కూరలు వేసుకోడానికి వాడే చిన్నపళ్లెం. (కో. 2).

చిన్నకైవారం: చిన్నబిళ్ళలు తవ్వడానికి వాడే పనిముట్టు. (రా. 2).

చిన్నకొయ్యసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికం. చూ. చిత్రం 63. (కో. 10, 12).

చిన్నకొరాం: ఉ. చిన్నకొరం, చిన్నకోరం. చూ. పర్యా. గెడ్డపార. చెంబులు అడుగులు సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 88. (తె. 14–16, 22).

చిన్నగడార: చిన్న గెడ్డపార. (రా. 10).

చిన్నగన్‌సుత్తి: చూ. పర్యా. చిన్న కటకలసుత్తె, లోహపు రేకులను, కడ్డీలను వంచడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 14).

చిన్నగరిట: చూ. పర్యా. గిరిజాల స్పూను. టీపొడి వేసుకోడానికి వాడే చిన్నస్పూను. (తె. 10).

చిన్నగరిటె: చూ. పర్యా. గరిటె[2]. మూసలో కరిగిన లోహపుతేటను తీయడానికి వాడే పరికరం. (కో. 26).

చిన్నగిన్నె: చూ. పర్యా. చట్నీప్లేటు. చట్నీ, కూరలు వేసుకోడానికి వాడే చిన్నపళ్లెం. (కో. 17, 26).

చిన్నగుట్టంమొల: రేకుపై చిన్నమొగ్గలు, ఆకులు చెక్కడానికి శిల్పపనిలో వాడే చిన్న గోరులాంటి పనిముట్టు. (తె. 17).

చిన్నగునపం: చూ. పర్యా. గెడ్డపార. చెంబులు అడుగులు సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 88. (కో. 4, 9, 14, 25, 27, 28; రా. 3, 4).

చిన్నగుండుకరవాయి: దుత్తల అడుగు వేయడానికి వాడే పనిముటు. చూ. చిత్రం. (రా. 1).

చిన్నగుండుసు_: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను వంచడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 13, 21).

చిన్నగెడ్డపార: విగ్రహం హస్తాలు, పాదాలు, కిరీటాలు చేయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 88. (కో. 3).

చిన్నచిక్కు: కప్పు, సాసర్లు పెట్టుకోడానికి ఉపయోగించే పరికరం. (తె. 8, 9).

చిన్నచీదపట్టి: చూ. పర్యా. పట్టి[1]. బీరువా రేకుపై చక్కగా గీతలు గీసుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 71. (తె. 8).

చిన్నడాకలు: చిన్నచిన్న కొరముట్లు తట్టుకోడానికి పనికివచ్చే పరికరం. (కో. 1; తె. 1).

చిన్నతాపాల: పర్యా. చుక్కలగిన్నె, తపాలగిన్నె. కూరలు చేయడానికి వాడేపాత్ర. చుట్టూ ముక్కలు కొట్టి అందంగా తయారుచేస్తారు. (కో. 22).

చిన్నతంతె: చూ. పర్యా. ఇనుపతంతె. గొడుగు

ఫుల్లలను పళ్ళ చక్రానికి బిగించడానికి వాడే సన్నని ఇనపతీగ. (కో. 28).

చిన్నదట్టసుత్తి: రేకులు వంచడానికి, పోగర్ల మీద కొట్టడానికి ఉపయోగించే పరికరం. (కో. 3).

చిన్నదిమ్మె: చూ. పర్యా. అడగోలు. లోహపురేకులు, కడ్డీలు సాపుచేయడానికి వాడే పరికరం. (రా. 4).

చిన్నదుకాణం: పర్యా. చిన్నబట్టి. పాత్రల అతుకుల్ని సరిచేయడానికి ఉపయోగించే చిన్నకొలిమి. (కో. 29).

చిన్నదేశ్‌మట్‌సుత్తి: చూ. పర్యా. మట్నుసుత్తె. లోహపు పాత్రలకు మట్నువేయడానికి వాడే సాధనం చూ. చిత్రం 189. (తె. 1).

చిన్నపట్కార: చూ. చిన్నపట్టుకారు. (రా. 10).

చిన్నపట్టుకారు: ఉ. చిన్నపట్టకార. రూ. చిన్న పట్కార. చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 2, 3, 20; రా. 5, 9).

చిన్నపళ్లెం: చూ. పర్యా. చట్నీప్లేటు. చెట్నీ, కూరలు వేసుకోడానికి వాడే చిన్నపళ్లెం. (కో. 17, 26).

చిన్నపులేల్: బీడువారేకులను వంచడానికి వాడే పరికరం. (కో. 28).

చిన్నపెదసుత్తి: చూ. చిన్న పెద్ద సుత్తి. (కో. 29).

చిన్నపెద్దసుత్తి: రూ. చిన్నపెదసుత్తి. లోహపు పాత్రలపై ఎక్కువ తక్కువలు సరిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 28).

చిన్నపైలు: చూ. చిన్నఫైలు. (తె. 8, 9).

చిన్నపోగరు: పర్యా. డోలపోగరు. తొలిపోగరు, నాటుపోగరు, పిట్టర్‌చానం, సన్నపోగరు, సూదిపోగర. లోహపురేకులపై, కడ్డీలపై చిన్న రంధ్రాలు కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 3; తె. 8, 19; రా. 4).

చిన్నఫైలు: (< చిన్న. ఇం. File) రూ. చిన్నపైలు. చూ. పర్యా. అకురాయి. తయారైన లోహపు వస్తువులను సాపు చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 18. (తె. 7, 17).

చిన్నబకెటు: (< చిన్న + ఇం. Bucket) పేరంటాల్లో దానం ఇవ్వడానికి ఉపయోగించే మూతఉన్న చిన్న బకెట్టు. దీని అడుగున 'కట్టు' ఉండదు. (తె. 18).

చిన్నబట్టి: ఉ. చిన్నబట్టీ. పాత్రల అతుకులను సరిచేయడానికి ఉపయోగించే చిన్నకొలిమి. (కో. 14, 19; రా. 15).

చిన్నబాండ్లి: చూ. పర్యా. కడాయి. పిండివంటలు తయారుచేయడానికి వాడే ఇరువైపులా హాండిల్సు అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం 163. (రా. 12).

చిన్నబింది: చూ. పర్యా. చిన్నకాగు. నీళ్ళు తేవడానికి వాడే గుండ్రని లోహపు బిందె. (కో. 30).

చిన్నబుగ్గకారు: గొడుగులు, బీగాలు రిపేరిపనిలో ఉపయోగించే పట్టకార. (కో. 18).

చిన్నమట్టుగిన్నె: చూ. పర్యా. చిన్న అంచుగిన్నె. భోజనాలదగ్గర కూరలు ఉంచుకొనడానికి ఉపయోగించే పాత్ర. (కో. 23).

చిన్నమట్నుసుత్తి: పర్యా. చిన్నమడ్సుత్తె. అడుగు భాగం సన్నగ కొంచెం ముందుకు పొడుచుకొని ఉండే పనిముట్టు. ఇత్తడిబిందెల భుజాలను, జవ్వ రేకులను లోపలిభాగంనుండి సాపుచేసుకొంటూ రావడానికి ఉపయోగం. (కో. 11).

చిన్నమడ్సుత్తె: చూ. పర్యా. చిన్నమట్నుసుత్తి. ఇత్తడిబిందెల భుజాలను, జవ్వరేకులను లోపలి భాగంనుండి సాపుచేసుకొంటూ రావడానికి ఉపయోగించే పరికరం. దీని అడుగుభాగం సన్నగ కొంచెం ముందుకు పొడుచుకొని ఉంటుంది. (తె. 25).

చిన్నమూకుడు: పర్యా. ఫ్రైపాను, ఫ్రైస్ట్రే, మెరకదాకలి. కోడిగుడ్డు అట్లుచేయడానికి ఉపయోగించే కాడఉన్న గుంటరేకు పరికరం. (కో.14,15).

చిన్నమూలమట్టం: ఉ. సన్న మూలమట్టం. పర్యా. చిన్నమెట్ను, బై స్క్వేయరు, నూలుమట్నం. లోహపురేకును లెవల్‌కు కొలతవేయడానికి వాడే పనిముట్టు. (రా. 12).

చిన్నమూస: చెంబులు పోత పోయడానికి వాడే పరికరం. (కో. 14).

చిన్నమెట్ను: చూ. పర్యా. చిన్న మూలమట్టం. లోహపురేకులు లెవల్‌కు కొలతలు వేయడానికి వాడే పనిముట్టు. (తె. 8, 9, 11, 12).

చిన్నమెరగసుత్తి: బిందె మెడభాగంలో సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 14).

చిన్నరింగు: (< చిన్న + ఇం. Ring) యంత్రపు బిళ్లపైఉండే చిన్నరంధ్రం. దీనిద్వారా దారం దూర్చుకోవచ్చు. (కో. 13).

చిన్నలేగ: చూ. పర్యా. చదరగిన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగుపట్టడానికి వాడే పనిముట్టు. (కో. 28).

చిన్నవంకలాగ: ఇత్తడిబిందెను మెరుగుపట్టడానికి వాడే పడగ ఆకారపుకడ్డీ. (తె. 18).

చిన్నవంపు గోరుపోగరు: చూ. పర్యా. గుజాదను. విగ్రహం తీర్చైను చెక్కడానికి వాడే పరికరం. (కో. 3).

చిన్నవాలుమొల: ఆకారంలో పెద్దవాలుమొల మాదిరే ఉండి పరిమాణంలో చిన్నదిగ ఉంటుంది. శిల్పి పనిలో చెక్కడానికి ఉపయోగం. (తె. 21).

చిన్నసమ్మెట: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపురేకులను, కడ్డీలను వంచడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 2; రా. 6).

చిన్నసిజిలు: (< చిన్న + ఇం. Chisel) చూ. పర్యా. చదరపుపంచు. లోహపురేకులను. కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (తె. 21).

చిన్నసీర్నం: రూ. చిన్నశానం. చూ. పర్యా. చదరపు పంచు. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (రా. 2).

చిన్నసుత్తె: ఉ. చిన్నసుత్తి. రూ. చినసుత్తి. చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపురేకులను, కడ్డీలను వంచడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం. (కో. 20, 28–30; తె. 2, 8, 11; రా. 30).

చిన్నసూప్ప్లేట్: (< చిన్న + ఇం. Soup plate). తినుబండారాలు ఉంచుకోడానికి ఉపయోగించే చిన్న లోహపుపాత్ర. (కో. 1).

చిన్నస్పానరు: (< చిన్న + ఇం. Spanner). మిషన్ నట్లు బిగించడానికి ఉపయోగించే పరికరం. (రా. 6).

చిన్నచెంబు: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారంలో చేసిన చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 84. (తె. 13).

చింతపండు: లోహపుపాత్రలు తెల్లగ తోమడానికి ఉపయోగించే పదార్థం. పుల్లగా ఉంటుంది. (కో. 3, 10, 17, 24, 25, 27; తె. 1, 2, 4, 5, 8, 14–17, 23, 24, 25).

చింతామణి టిఫిను: పట్టుకోడానికి పిడులు ఉండే టిఫనుగిన్నె. చింతామణిలో తయారయింది. (కో. 13).

చిప్‌చేయు: (క్రి.) (< ఇం. Chip + చేయు) చూ. పర్యా. అగరుగొట్టు. వెల్డింగ్ అయిన తర్వాత బుడిపెలను తీసివేయడం. (తె. 7).

చిప్ప[1]: చూ. పర్యా. కుడక. టంకంపొడి వేసుకోడానికి వాడేపాత్ర. (కో. 17, 23, 25, 28).

చిప్ప[2]: చూ. పర్యా. గిలకి[2]. సంగటిపిండి తిరగడానికి వాడే పరికరం. (కో. 32).

చిప్ప[3]: అన్నం తినడానికి ఉపయోగించే లోతైన రాతెండి పాత్ర. (తె. 25).

చిప్పింగ్‌చేయు: (క్రి.) (< ఇం. Chipping + చేయు). రూ. చిపింగ్‌చేయు, చిపంగ్‌చేయు, సిప్పింగ్‌చేయు, సిపంగ్‌చేయు, షిప్పింగ్‌చేయు. చూ. పర్యా. అగరుగొట్టు. వెల్డింగ్ అయిన తర్వాత బుడిపెలను తీసివేయడం. (కో. 25, 28, 30; తె. 5, 21).

చిప్పింగ్‌హామరు: (< ఇం. చిప్పింగ్ + Hammer). రూ. సిప్పింగ్‌హామరు. చూ. పర్యా. కత్తి[1]. వెల్డింగ్ ఉబ్బులను కొట్టడానికి వాడే పరికరం. (కో. 23; తె. 1. 5–7, 9, 21, 25).

చిమటా: ఉ. చిమ్మట, చిమటా, చిమ్టా, చిప్టా, చుప్టా. రూ. సిమ్మట. చూ. పర్యా. అతికేకారు. చిప్పను, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (తె. 1–4, 11, 17, 19, 21, 22; రా. 16).

చిప్టా: ఉ. చుప్టా. చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు దాన్ని పట్టుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 147. (తె. 6).

చిమ్ముటించు: (క్రి.) పాత్రలు అతికి చల్లార్చిన తర్వాత అతుకుమధ్య టంకం పొరలుగా ఏర్పడడం. (తె. 7).

చిరతలకత్తి: చూ. పర్యా. కుంచు. కాక బాగా రావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే గుడ్డచుట్టిన కర్రముక్క. (తె. 17).

చిరుతేగ: చూ. పర్యా. చదరగిన్నెతేగ. లోహపు పాత్రలను నొక్కుపట్టడానికి వాడే పనిముట్టు. (కో. 7).

చిలకకొట్టు: (క్రి.) రెండు వేరువేరు ద్రవపదార్థాలను కలియబెట్టడం. (కో. 1).

చిలికేక్యాన్: (< చిలక + ఇం. Can). ఇది బక్కెట్ లాగా ఉండే పాత్ర. నది నుంచి ద్రవపదార్థం తెచ్చుకోడానికి ఉపయోగం. (కో. 2).

చిలుకదోటి: పొడుగాటి వెదురుకర్రకు అమర్చిన చిన్న కొడవలి. చెట్ల పైభాగంలో ఉండే కాయలను అరుసు కోసుకోడానికి ఉపయోగం. (రా. 4).

చిలుకుడబ్బా: చూ. పర్యా. కడిదబ్బా. పొలందగ్గరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే పిడి, మూతఉన్న పాత్ర. (తె. 2).

చిలుము: రూ. సిలుం. పర్యా. జంగు[2], జిడ్డు, తుక్కు, తుప్పు[1], పింపురు, బూజు, మకిల, మైల. లోహపు రేకులపై, కడ్డీలపై పట్టిన తుప్పు. (తె. 2, 17).

చిల్లిగరిట: రూ. చిల్లులగరిటె, జల్లిగరిట, జల్లిగరట్టు. చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనెలోనుండి పిండి వంటకాలు ఎత్తుకొనడానికి వాడే రంధ్రాలుకలిగిన గరిట. చూ. చిత్రం 107. (కో. 1, 2, 4, 9, 14, 15; తె. 8, 10, 13, 18, 20, 21).

చిల్లిప్లేటు: (< చిల్లి + ఇం. Plate). చూ. పర్యా. అన్నంబుట్ట. అన్నం వంచుకోవడానికి వాడే అడుగున రంధ్రాలున్న లోహపు పాత్ర. చూ. చిత్రం 11. (కో. 2).

చిల్లిబుట్ట: చూ. పర్యా. చాల్ని[1]. ఉడకబెట్టిన పదార్థాలను (అన్నం, కూరగాయలు వగైరా) వడబోసుకోడానికి ఉపయోగపడే పరికరం. (తె. 24).

చిల్లు: చూ. పర్యా. కన్నం. జల్లెడలకుండే రంధ్రం. (కో. 1).

చిల్లులగరిటె: చూ. చిల్లిగరిట. (కో. 3).

చీకిపోవు: (క్రి.) ఛత్రిగుడ్డ చెమ్మపట్టి చిరిగిపోవడం. (తె. 18).

చీప్‌మెటల్‌వర్కు: (< ఇం. Chief metal work) పర్యా. టిన్‌గర్‌పని, టిన్‌గర్‌వర్కు, టిన్‌మేకరుపని టిన్‌మేకర్సువర్కు, టిన్‌స్మిత్తు, తగరంపని, సాల్డ్రింగు, సాల్డ్రింగ్‌పని, లోహపు పాత్రలు రిపేరు చేసేపని. (కో. 21).

చీపింగ్‌చేయు: (క్రి.) చూ. చిప్పింగ్‌చేయు. (తె. 6).

చీపింగ్‌సుత్తి: (< ఇం. Chipping + సుత్తి) చూ. పర్యా. కత్తి[8]. వెల్డింగ్ ఉబ్బులను కొట్టడానికి వాడే పరికరం. (రా. 14).

చీపు: కాగబెట్టిన ఇనుము (రా. 14).

చీపురుపుల్ల: మట్టిఅచ్చుల అతుకులు కనపడకుండ శుభ్రంచేసే బోదపుల్ల. (కో. 22).

చీరు[1]: గొడుగుగుడ్డ రంధ్రాలు పడడం. (కో. 30).

చీరు[2]: (క్రి.) చూ. చీలు. (కో. 16).

చీర్ణం: రూ. చాణి, చీర్ణి, చూ. పర్యా. చదరపు పంచు. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (రా. 14).

చీల[1]: రూ. శీల, సీల[1]. పర్యా. ములికి, మేకు, ముల[8]. గొడుగు టోపను ఊడిరాకుండ కొట్టేందుకు వాడే మేకు. (కో. 18, 27).

చీల[2]: పర్యా. మర, రివిట్టు. రేకు జాయింట్లు విడిపోకుండ ఉండడానికి వాడే సాధనం. (తె. 17).

చీలు: (క్రి.) రూ. చీరు[2], చీల్చు, సీడు. ఇనపబద్దను రెండుగా ముక్కలు చేయడం. (కో. 26).

చీల్చు: చూ. చీలు. (రా. 10, 15).

చీవాటంపెట్టు: (క్రి.) చూ. పర్యా. ఏట్లుఏయు. పూర్తయిన విగ్రహాన్ని మెరుగుపరచడం. (రా. 1).

చుక్కకొట్టు: (క్రి.) పర్యా. పైన్‌వేయు, మకిరికొట్టు, మట్నఏయు, మట్నకొట్టు, మతారకొట్టు, మలట్‌ఏయు, మెరుగుకొట్టు, సాటు. పూర్తిగ అతికిన తర్వాత బిందెపై వంకర్లులేకుండ నున్నగ సాపుచేసి మెరుగుచుక్క కొట్టడం. (తె. 6).

చుక్కడాంబరు: టింకరుపనిలో జాయింట్లవద్ద కారకుండ పూసే నల్లనిపదార్థం. (తె. 2).

చుక్కపోగరు: ఉ. చుక్కపోగరి. పర్యా. డల్లుమొల. నెక్కెమొల, బిట్టుమొల, సుక్కుమొల. విగ్రహం పనిలో చుక్కలుగా గీతైను కొట్టడానికి ఉపయోగించే పరికరం. దీని అడుగుభాగం గుండ్రంగ ఉండి మధ్యలో చిన్నచుక్క ఉంటుంది. (కో. 6, 8, 16).

చుక్కబిందె: చూ. పర్యా. కాగు. నీళ్ళు తేవడానికి వాడే వెడల్పు మూతిగల లోహపుపాత్ర. చూ. చిత్రం 46. (తె. 1).

చుక్కబొట్టుపెట్టె: చూ. పర్యా. బొట్టుపెట్టె. బొట్టూ కాటుక పెట్టుకోడానికి వాడే కుంకుమపుల్ల వగైరా సామానులు ఉంచుకొనే మూత ఉండే చిన్నలోహపు పెట్టె. చూ. చిత్రం 132. (రా. 3).

చుక్కలగిన్నె: చూ. పర్యా. చిన్నతపాల. చుట్టూ చుక్కలుకొట్టి అందంగా తయారుచేసిన లోహపు పాత్ర. కూరలు వండడానికి ఉపయోగం. (కో. 26).

చుక్కలపళ్లెం: వేడి పదార్థాలు చల్లారబోసుకోడానికి, పిండి కలుపుకోడానికి వాడే వెడల్పైన తట్ట. (కో. 24, 30).

చుక్కలబిందె: చూ. పర్యా. గుండుబిందె. నీళ్ళు తేవడానికి, వంట చేయడానికి వాడే వెడల్పుమూత ఉన్న గుండ్రని బిందె. చూ. చిత్రం 85. (తె. 3).

చుక్కలసుత్తి: బిందెలకు చుట్టూ చుక్కలు కొట్టడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం. (రా. 3, 7, 9).

చుకుక్కపెట్టె: చూ. పర్యా. బొట్టుపెట్టె. బొట్టూ కాటుక పెట్టుకోడానికి వాడే కుంకుమపుల్ల వగైరా సామాన్లు ఉంచుకొనే మూత ఉండే చిన్న లోహపు పెట్టె. చూ. చిత్రం 182. (కో. 1).

చుట్టు: చూ. పర్యా. గుల్లమోపు. లోహపు రేకులపై, పట్టీలపై సులువుగ రంధ్రాలు వేయడానికి వాడే

దిమ్మ. (రా. 3).

చుట్టకత్తెర: చూ. పర్యా. ఆకులకత్తెర. చుట్టలు, బీడి ఆకులు కత్తిరించడానికి వాడే పనిముట్టు. (కో. 24).

చుట్టకుదురు: చూ. పర్యా. గద్దె[1]. పాత్రలు ఎత్తుగా ఉంచడానికి వీలుగా క్రిందిభాగంలో అమర్చిన గుండ్రటి లోహపురింగు. చూ. చిత్రం 99. తె. 17, రా. 4).

చుట్టు: (క్రి.) రేకు అంచులలో కడ్డీనిపెట్టి మూయడం. (రా. 12).

చుట్టుకొను: (క్రి.) పర్యా. సుట్టు. గొడుగుపుల్లలు ఊడకుండ తంతెతో కంగన్‌లో బిగించడం. (కో. 28).

చుట్టుకొలత: పొయ్యిచుట్టూ ఉండేభాగం. (రా. 1).

చుట్లసాలిగ: చూ. పర్యా. కారాపాచ. వాంబొడి, మురుకులు వగైరా చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (రా. 4).

చుబ్బు: త్రాసుకు ఉపయోగించే ప్లేటు. (రా. 16).

చుమ్మ: పర్యా. అమ్మూరు పట్టుకార. అతికేటప్పుడు పాత్రలను పట్టుకోడానికి వాడే పనిముట్టు. (తె. 3, 8; (రా. 7).

చురా: రేకు అంచు. (రా. 16).

చువేకకట్టిక: (< హిం. చూహా + కట్టల్). చూ. పర్యా. ఎలకల బోను. ఇనుపచెక్కకు కమ్మలు చుట్టబడి ఉంటాయి. ఎలుకలు పట్టుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 30. (తె. 11).

చువ్వ: పర్యా. రాడ్డు[4]. బీరువా తయారీలో వాడే పరికరం. (కో. 7).

చూర: పర్యా. టంకం, టంకంపొడి, పొడి, బెసకి, బ్లోలాము, ముదరటంకం, రవ్వ, రావడి, లేతి టంకం, సూరు[2], లోహపు పాత్రలను అతకడానికి వాడే ఇత్తడి, సత్తు ఎల్లిగారం కలిసిన మిశ్రమ పదార్థం. (తె. 4).

చూరకత్తి: మాంసం వగైరాలు కోసుకోడానికి వాడే పనిముట్లు. చేత్తో పట్టుకోడానికి పిడి ఉంటుంది. చూ. చిత్రం 100. (రా. 3, 4, 8, 10).

చూరగిన్నె: అన్నం తినడానికి వాడే పాత్ర. అంచు కూచిగా ఉంటుంది. (కో. 28).

చెకనంచెంబు: వివాహాది శుభకార్యాల్లో పెద్దల కాళ్ళు కడగడానికి వాడే పెద్ద చెంబు. (తె. 17).

చెకనంపని: రూ. షెకనంపని. చూ. పర్యా. చిత్రకారు పని. ఇత్తడిరేకుతో విగ్రహాలు, వాహనాలు మొదలైన వస్తువులుచేసే పని. (తె. 25).

చెకనంసుత్తె: ఉ. చెక్కనంసుత్తి. విగ్రహాల నగిషి పనిలో ఉపయోగించే సుత్తి. సన్నగా పొడవుగా ఉంటుంది. (తె. 17, 25).

చెక్క[1]: లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 2, 4, 11, 16, 19, 22, 23; తె. 4).

చెక్క[2]: టింకరుపనిలో తగరం, నవాసారం కలిపి ఉంచుకోడానికి ఉపయోగించే కొయ్య. (కో. 29; తె. 4, 19, 20).

చెక్కడపొగరు: విగ్రహం పైభాగాన ఉండే పిసుర్లు తెగ్గొట్టడానికి ఉపయోగించే పరికరం. (రా. 5).

చెక్కతొట్టి: పర్యా. బాక్సు[2]. పోత పాత్రను తయారు చేయడానికి వాడే కొయ్యచట్రం. (తె. 23).

చెక్కదొడ్డి: పోత పాత్రను తయారుచేయడానికి వాడే కొయ్యచట్రం. (కో. 8).

చెక్కపిడి: చూ. పర్యా. ఉప్ షెపెలు. సానరాయి తిరగడానికి చక్రాన్ని కాలితో తొక్కడానికి అమర్చిన సాధనం. (రా. 11).

చెక్కపుల్ల: విగ్రహం తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 6).

చెక్కప్లాటిండ్లు: సైజుప్రకారం పాత్రను తయారు చేయడానికి వాడే చెక్క. (రా. 8).

చెక్కమొద్దు: లోహపు పనిలో మోపుగా వాడే కొయ్య పరికరం. (కో. 8).

చెక్కరదీపం: ఉ. చక్కెరదీపం. చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 58. (కో. 23; రా. 15).

చెక్కలసుత్తి: చూ. చెక్కసుత్తి. (రా. 7).

చెక్కలు: పోతచెంబులు చేయడానికి ఉపయోగించే చట్రం. ఇవి 2 నుంచి 4 వరకు ఉంటాయి. (తె. 7).

చెక్కసుత్తి: ఉ. చెక్కసుత్తె. రూ. చెక్కలసుత్తి. చూ. పర్యా. ఉడన్ హేమర్. రేకులను సాపు చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 2-8, 10-12, 19, 23; తె. 2-6, 8, 12, 22, 25; రా. 1, 2, 4, 6-8, 10, 14, 16).

చెక్కు: (క్రి.) ఉ. సెక్కు. చూ. పర్యా. ఖండించు. రేకును కాల్చి మధ్యలో కొద్దిగచీల్చడం. పోతవిగ్రహానికుండే హెచ్చును తీసివేయడం. (కో. 16, 18, 29).

చెక్కుకొటు: (క్రి.) చూ. పర్యా. అగరుగొట్టు. వెల్డింగ్ అయినతర్వాత బుడిపెలను తీసివేయడం. (కో. 21).

చెక్కుడుపార: గద్దాడం చెక్కవేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 101. (రా. 3, 5, 8).

చెక్కునట్టుస్పానర్ : (< చెక్కు + ఇం. Nut spanner) పర్యా. బాటంపాన, బాటంరెంచి, బాటంస్పానర్. సైకిల్‌హ్యాండిల్ నట్టును బిగించడానికి వాడే పరికరం. (రా. 6).

చెక్కుడుబార: బొమ్మను చెక్కడానికి ఉపయోగించే (రా. 5).

చెంచా: (హిం.) ఉ. చంచ, చెంచే. పర్యా. స్పూను[2]. కాఫీ కలుపుకోడానికి, పొన్ను వేసుకోడానికి వాడు చిన్నగంటె. చూ. చిత్రం 102. (కో. 7, 12, 21, 23, 28; తె. 1-3, 12, 13; రా. 13, 15).

చెంచాకారేజి: (< హిం. చెంచా + ఇం. Carriage) గిన్నెలు కిందపడకుండ పట్టుకోడానికి పైభాగంలో చెంచా బిగించి ఉంచే భోజనం క్యారేజి. (కో. 21).

చెంచాకాస్టాండు: (< హిం. చెంచా + ఇం. Stand) ఉ. చంచకాస్టాండు. గరిటలుపెట్టుకోడానికి వాడే లోహపుస్టాండు. (తె. 11).

చెటాంబరు: రూ. చటంబరం, చట్టంబరు, చెడాంబరు, సెటంబరు, షెటాంబరు. చూ. పర్యా. అడగోలు. లోహపురేకును, కడ్డీలను సాపుచేయడానికి వాడే లోహపుదిమ్మ. (తె. 22; రా. 12).

చెట్నిఅతుక్కు: రూ. చిట్నిడితుక్కు. చూ. పర్యా. చట్టిన్‌తూగు. రసంతెచ్చుకోడానికి వాడే చిన్నపాత్ర. (కో. 17).

చెడాంబరం: చూ. చెటాంబరు. (కో. 28),

చెండ్లు: రంగులువేసుకొని వసంతం ఆడడానికి వాడే గుండ్రని సాధనం. (తె. 9).

చెప్టసుత్తె: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (తె. 5).

చెప్టాచేయు: (క్రి.) చూ. పర్యా. ఎలుముచేయు. పదును పెట్టడానికి వీలుగా కత్తులను వెడల్పు చేయడం. (తె. 5).

చెప్పుకొట్టు: ట్రంకుపెట్టె మూత డిజైను చేసేటప్పుడు రేకును అణగగొట్టడం. (రా. 11).

చెమ్మెలు: ఉ. సెమ్మెలు. పర్యా. జ్యోతులు, దీపం సెమ్మెలు, దీపారాధన్లు, దీపాంతెలు, మాణిక్యాలు. దీపం వెలిగించడానికి వాడే లోహపు సాధనాలు. చూ. చిత్రం 103. (కో. 12-15, 21, 28; తె. 6, 7, 17, 21, 25; రా. 16).

చెంబర్ : మెంటల్ మట్టికుండను బిగించడానికి పెట్రొమాక్సులైటు దోపను క్రిందిభాగాన ఉండే ఇత్తడిరింగు. (తె. 24).

చెంబు: నీళ్ళు తాగడానికి ఉపయోగించే కూజా ఆకారపు లోహపుపాత్ర. (కో. 29; రా. 11).

చెంబుకరవాయి: రూ. చెంబులకరవాయి. చెంబులు తయారుచేయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 2-4, 11, 18, 19, 28; రా. 1, 7, 11).

చెంబుగెడ్డపార: రూ. చెంబులగెడపార. చూ. పర్యా. గెడ్డపార. చెంబులు అడుగులు సాపుచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 88. (కో. 3, 6).

చెంబులకరవాయి: ఉ. చంబలకరవాయి, చెంబుల కరపై. చూ. చెంబుకరవాయి. (కో. 2, 5, 6, 8-10, 12, 16, 23, తె. 6, 12, 14-16, 20; రా. 9, 15, 16).

చెంబులగెడపార: చూ. చెంబుగెడ్డపార. (కో. 10, 12).

చెంబులేగ: చూ. పర్యా. చవరగన్నెలేగ. చెంబులను మెరుగుపట్టడానికి వాడే పనిముట్టు. (రా. 9).

చెంబుసుత్తి: చెంబులకు బిళ్ళ వేయడానికి వాడే పరికరం. (రా. 1).

చెయ్యి: ఉ. చెయ్య. రూ. చేయి. చూ. పర్యా. హస్తం. అన్నం వడ్డించడానికి వాడే పెద్దస్పూను చూ. చిత్రం 223. (కో. 24, 30; తె. 2, 3, 6).

చెయ్యిగంటె: చూ. చేయిగంటె. చూ. పర్యా. హస్తం. అన్నం వడ్డించడానికి వాడే గరిటె. చూ. చిత్రం 223. (తె. 17).

చెయ్యిసుత్తి: రూ. చేతిసుత్తి, చేయిసుత్తి, చేసుత్తె. చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపురేకులను, కడ్డీలను బెండ్ చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (రా. 10).

చెరవ: ఉ. చరవ, చెర్వ. చూ. పర్యా. అండా[1]. అన్నం వండడానికి, నీళ్ళు తోడడానికి ఉపయోగించే పాత్ర. చూ. చిత్రం 8. (కో. 2; తె. 8; రా. 11).

చెరవలకరవాయి: రూ. సెర్వలకరవాయి. పర్యా. పానకరవాయి. అండా, తపేలాలు తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 2).

చెలికిపార: చూ. పర్యా. గంటె[2]. కొలిమిలో బొగ్గులు వేయడానికి వాడే పొడవుకాడ ఉన్న వెడల్పురేకు. (రా. 14).

చెలికిరేకు: పాకీ పనివాళ్ళు ఉపయోగించే రేకు. (రా. 14).

చెవు: చూ. పర్యా. కీసెట్టు. బీరువా లాకింగ్‌సెట్టు

(రా. 4).

చెవుల అండా: ఉ. చెవుల అండ. నీళ్ళ నిలవ ఉంచ డానికి వాడే ఇరువైపుల పిడులు, వెడల్పుమూతి ఉన్న పెద్ద లోహపుపాత్ర. చూ. చిత్రం 104. (కో. 6, 10; రా. 5).

చెవులకడీలు: పర్యా. చెవులు[1]. కొప్పెరను పట్టుకోవ డానికి వీలుగా పైభాగాన ఇరువైపుల అమర్చిన ఇత్తడి రింగులు. (తె. 25).

చెవులకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమి దగ్గర వాడే పనిముట్టు. (తె. 23).

చెవులగిన్నె: టీ కాగబెట్టడానికి వాడే అల్యూమినియం పాత్ర. (కో. 17).

చెవులబాణలి: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపులా పిడులు అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం 163. (రా. 11).

చెవులు[1]: చూ. పర్యా. చెవుల కడీలు. బ్రమ్మకు ఇరువైపుల పట్టుకోవడానికి వీలుగా అమర్చిన ఇత్తడి రింగులు. (తె. 6; రా. 1).

చెవులు[2]: బకెట్ పిడిని అమర్చడానికి ఏర్పాటుచేసిన భాగాలు. (రా. 11).

చేకారు: రూ. సేకారు. చూ. చేతికారు. (తె. 18, 22).

చేకొలిమి: చూ. పర్యా. కరుగు కొలిమి. లోహాలను వేడిచేయడానికి ఉపయోగించే పొయ్యి. చూ. చిత్రం 69. (తె. 19, 21, 22).

చేకొలిమి సలాక: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమి లోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవు కడ్డీ. (తె. 21).

చేట: ఉ. చాట. పర్యా. రేకుచేట. బియ్యం చెరగడానికి. చెత్తాచెదారం ఎత్తడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 198. (కో. 2, 4, 9, 15, 17, 18, 22, 23; రా. 2-4, 6, 11).

చేతికత్తెర: చూ. చేయికత్తిరి. (కో. 2, 8, 13; రా. 1).

చేతికారు: ఉ. చేతకారు. రూ. చేకారు. చూ. పర్యా. కమ్మరకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. చూ. చిత్రం 147. (కో. 22, 24; తె. 6,14, 16-19,24).

చేతికోరం: ఉ. చేతికోరాం. చూ. పర్యా. కుడక.. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (కో. 19, 22; తె. 22).

చేతిగరిట: చూ. పర్యా. చేయిగరిటె. (తె. 7-10, 12, 13).

చేతిచిమ్మ: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (తె. 6).

చేతిడ్రిల్‌మిషన్: పర్యా. చేతి డ్రిల్లు, బర్మా, హాండిలిన్, హాండ్ డ్రిల్లింగ్, హాండ్ డ్రిల్లుమిషను, హెడ్ కప్లింగ్, హోల్స్ ప్లేయను. కరెంటు లేనపుడు లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి ఉపయోగపడే పరికరం. (తె. 8, 9, 12).

చేతిడ్రిల్లింగ్‌మిషను: (< చేతి+ఇం. Drilling machine). పర్యా. చేతిబర్మా, చేతిమిషను, మిషను బీరువా రేకులపై రంధ్రాలు వేయడానికి ఉపయోగించే పరికరం. (రా. 4).

చేతిడ్రిల్లు: (< చేతి+ఇం. Drill). చూ. పర్యా. చేతి డ్రిల్‌మిషన్. కరెంటు లేనపుడు లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (8, 9, 12).

చేతిపట్రు: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను బెండ్‌చేయడానికి, రివిట్ చేయ డానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (రా. 10).

చేతిపానమిషను: (< చేతిపాన+ఇం. Machine). చూ. పర్యా. గ్రైండరు. వెల్డింగ్ ఉబ్బులను శుభ్ర పరచడానికి వాడే యంత్రం. చేత్తో సానపట్టడానికి వీలయింది. (తె. 12).

చేతిపిడి: చూ. చేయిపిడి. (రా. 1).

చేతిబర్మా: చూ. పర్యా. చేతిడ్రిల్లింగ్ మిషను. బీరువా రేకులపై దుంకలువేయడానికి ఉపయోగించే పరికరం. (రా. 5).

చేతిబ్యాటరు: (< చేతి + ఇం. Battery). చూ. పర్యా. టార్చిలైటు. రాత్రిసమయాల్లో వెలుతురు కోసం వాడే బ్యాటరీల సహాయంతో వెలిగే లైటు. (కో. 2).

చేతిమంగను: పర్యా. హాండ్‌మంగను, హాండ్‌వైసు, హాండ్లసు. రిపేరి చేసేటప్పుడు తాళంచెవిని కదలకుండా పట్టి ఉంచడానికి ఉపయోగించే పనిముట్టు. (తె. 24).

చేతిమిషను: (< చేతి+ఇం. Mechine). చూ. పర్యా. చేతి డ్రిల్లింగ్‌మిషను. బీరువారేకులపై రంధ్రాలు వేయడానికి ఉపయోగించే మిషను. (రా. 8).

చేతిరేకు: చూ. పర్యా. గీకుడుపట్టి. అచ్చులపై ఉండే మట్టిని శుభ్రం చేయడానికి వాడే పల్చనిరేకు.

(రా. 2).

చేతిలైటు: (< చేతి + ఇం. Light). చూ. పర్యా. రాత్రిసమయాల్లో వెలుతురుకోసం వాడే బ్యాటరీల సహాయంతో వెలిగేలైటు. (తె. 19).

చేతిసుత్తి: చూ. చెయ్యిసుత్తి. (కో. 3; రా. 10).

చేతిహ్యాండిల్: (< చేతి + ఇం. Handle). డీజైను వంచుకోడానికి వాడే స్కేలులాంటి పరికరం. (కో. 15).

చేద: బావిలోంచి నీళ్ళు తోడడానికి వాడే చిన్న వాల్చా. (కో. 18).

చేదు: (క్రి.) దబ్బాలోనుండి కిరోసిన్‌వంటి పదార్థాన్ని పైకి తీయడం. (రా. 5).

చేదుగోగర్ల: చూ. పర్యా. ఉగ్గుగిన్నె. చిన్నపిల్లలకు ఉగ్గుపోయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 26. (కో. 27).

చేదేలాడకి: చూ. పర్యా. పంపు³. డ్రమ్ముల్లోనుండి నూనెను పైకి తోడుకోడానికి ఉపయోగపడే సాధనం. (తె. 3).

చేపలసట్టి: చూ. పర్యా. చాపడాక. చేపలకూర చేయడానికి వాడే తక్కువ లోతుగల వెడల్పుపాత్ర. (కో. 7).

చేపుడితుండు: చూ. పర్యా. కైపిడి. పెట్టెను పట్టుకోడానికి వీలుగా అమర్చిన నిర్మాణం (తె. 21).

చేమసు: చూ. పర్యా. కాఫీజల్లెడ. కాఫీవడగట్టుకోడానికి వాడే సాధనం. (తె. 8).

చేయి: చూ. చెయ్యి. (కో. 26, 29; తె. 6; రా. 11).

చేయికత్తిరి: రూ. చేతికత్తెర. చూ. పర్యా. చిన్నకత్తెర. చిన్న చిన్న రేకుల్ని కత్తిరించడానికి వాడే సాధనం. (కో. 22; తె. 21, 22; రా. 5).

చేయిగరిటె: చూ. పర్యా. హస్తం. అన్నం వడ్డించడానికి వాడే పెద్దస్పూను. చూ. చిత్రం 223. (కో. 21, 23).

చేయిగంటె: చూ. చెయ్యిగంటె. (తె. 1; రా. 7, 12).

చేయిచంచా: చూ. పర్యా. హస్తం. అన్నంవడ్డించడానికి వాడే చేయిగరిటె. చూ. చిత్రం 223. (తె. 17).

చేయిపిడి: రూ. చేతిపిడి, సేపిడి. చూ. పర్యా. కైపిడి. పెట్టెను పట్టుకోడానికి వీలుగా అమర్చిన నిర్మాణం. (రా. 4).

చేయిసుత్తి: ఉ. చేయిసుత్తె. చూ. చెయ్యిసుత్తి. (తె. 5; రా. 3, 4, 7, 14).

చేరుశెంబు: పర్యా. మూరచెంబు. నీళ్ళు తాగడానికి వాడే గుండ్రని పొడవాటి చెంబు. (కో. 2).

చేర్సు: (ఇం.) ఇనపకుర్చీలు (తె. 10).

చేల్‌పట్టుకార: చూ. పర్యా. కమ్మరకారు. అతికేటప్పుడు లోహపుపాత్రలు పట్టుకోడానికి, సాగ్గొట్టేటప్పుడు కాలిన లోహపుముక్కలను పట్టుకోడానికి తగ్గొట్టేటప్పుడు దానాన్ని పట్టుకోడానికి, కరిగిన లోహాన్ని అచ్చులో పోసేటప్పుడు, మూసను పట్టుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 147. (కో. 27).

చేసినగంజ: పోతపనిలో తయారయిన కూరడబ్బ, (తె. 15).

చేసుత్తె: చూ. చెయ్యిసుత్తె. (తె. 18).

చైన్‌కవర్: (ఇం.) సైకిల్‌చక్రం కాళ్ళకు తగలకుండా కాపాడే రేకు. తె. (12).

చైన్‌పాన: పర్యా. ఝూలాపానా, నిప్పల్‌రించి, నిప్పల్‌స్పానరు. స్టౌ నిప్పల్‌ను ఊడదీయడానికి, బిగించడానికి వాడే పరికరం. (తె. 17).

చైనలు: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే పరికరం. (తె. 3).

చైనాప్లేటు: (ఇం.) చూ. పర్యా. చట్నిప్లేటు. చెట్నీ, కూరలు వేసుకోడానికి వాడే వెడల్పైన చిన్న పళ్లెం. (8, 10, 11).

చైనీస్‌ప్లేటు: (ఇం.) విస్తరాకు ఆకారంలో ఉండే టిఫను తినడానికి వాడే చిన్నపళ్లెం. (తె. 1).

చైను: (ఇం. Chain). సానదిండును లాగడానికి ఉపయోగించే సైకిల్‌చైను. (తె. 8, 12 13, 18).

చొక్క: చూ. పర్యా. కవరు². గొడుగు లోపలికి నీళ్ళు పడకుండా పైభాగాన అమర్చిన చిన్న ప్లాస్టిక్ గుడ్డ. (కో. 30).

చోదకానపాన: సైకిల్ రిపేరు మొత్తానికి వాడే స్పానరు. ఇందులో వివిధరకాల రంధ్రాలుంటాయి. (తె. 8, 13).

చోరిఖానా: (హిం.) బీరువా తిజోరీలాకరు (Safe lockers)లో కనపడకుండ ప్రక్కనఉండే మరొక అర. (తె. 17; రా. 16).

చౌక్‌పొయ్యి: బొగ్గులపొయ్యిగాను కట్టెలపొయ్యిగాను వాడే చదరపు రేకు పరికరం. (తె. 17).

చౌక: (హిం.) ఉ. చౌకా. చూ. పర్యా. చిన్న కటకల సుత్తి. లోహపురేకులను, కడ్డీలను బెండ్ చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం (కో. 22, 26, 28; తె. 7).

చౌకగడారి: రేకులను జోడించడానికి ఉపయోగపడే

మోపు. (రా. 13).

చౌకసుత్తి: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను బెండ్‌చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (రా. 14).

చౌకం ఆకురాయి: చూ. పర్యా. చపట ఆకురాయి. తాళంచెవి మొనలను అరగదీయడానికి వాడే పనిముట్టు. (తె. 17; రా. 15).

చౌకంకొరాం: మడిచిన రేకులను కీట వేయడానికి వాడే పరికరం. దీని తలభాగం చతురస్రాకారంగా ఉంటుంది. (తె. 17).

చౌకంచేయు: వెల్డింగ్ చేయవలసిన కడ్డీలను నలుచదరంగా అమర్చటం. (రా. 12).

చౌగడి: (హిం.) లవంగాలు, చెక్క మొదలయిన సుగంధద్రవ్యాలు పెట్టుకోడానికివాడే ఆరు అరలుండే లోహపు పరికరం. (కో. 28).

చౌపాని: (హిం.) రూ. చౌపానిళి. కూరలు వడ్డించడానికి వాడే గుత్తిగా 4 లేదా 5 గిన్నెలు అతికించి పైన పట్టుకోడానికి కాడ ఉండే లోహపు పాత్ర. చూ. చిత్రం 87. (తె. 14-16).

చౌపానిళి: చూ. చౌపాని. (తె. 16).

చౌపాళి: (హిం.) రూ. సౌపాలి. చూ. పర్యా. కుంకుం పేల. కుంకుమ, పసుపు వగైరా పూజా సామగ్రి ఉంచుకోడానికి ఉపయోగించే మూడు, నాల్గు లేదా అయిదు గిన్నెలు. (తె. 2, 4, 5, 17).

చౌరస్‌దిమ్మ: (< చౌరస్. హిం. + దిమ్మ). చూ. పర్యా. అడగోలు. లోహపు రేకులను సాపుచేయడానికి వాడేదిమ్మ. (తె. 17).

చౌరస్‌హతోడి: (హిం.) ట్రంకుపెట్టెపై టచ్చికొట్టడానికి వాడే పరికరం. (తె. 17).

చౌరసు: రేకులను ఏసైజు కాసైజు మలచుకోవడానికి ఉపయోగించే స్కేలులాంటి పరికరం. (తె. 14, 15).

చౌల్‌పట్టకార: చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి వాడే పరికరం. (రా. 10).

చౌళి ఇక్కళం: చూ. పర్యా. అతికేకారు. మేకులు చేసేటప్పుడు వాటిని పట్టుకోడానికి వాడే పరికరం. (రా. 13).

## ఛ

ఛక్కి: చూ. చక్కి[2]. (రా. 15).

ఛత్రి: చూ. పర్యా. గొడుగు. ఎండకు ఎండకుండా, వానకు తడవకుండా వాడే పరికరం. చూ. చిత్రం 89. (తె. 1, 5, 6, 17).

ఛత్రిపుల్లలు: చూ. పర్యా. కమానులు. గొడుగుకు అధారమైన సన్నని ఇనుపకడ్డీలు. (తె. 17).

ఛత్రిరాడు: చూ. పర్యా. కట్టె. ఛత్రికి ఆధారమైన పొడవాటి కడ్డి. (తె. 1, 25).

ఛన్ని: పర్యా. జల్లి, జల్లెడ[2], జాలి[4], నూకలజెల్లెడు, బియ్యపు జల్లెడ[2]. బియ్యం, నూకలు వగైరా జల్లించడానికి వాడే రంధ్రాలున్న రేకు పరికరం. చూ. చిత్రం 108. (తె. 10).

ఛందన్: (హిం.) రూ. చన్ద్వా, చంద, చాందిని. చూ. పర్యా. కవరు[2]. గొడుగు లోపలికి నీళ్ళు పడకుండా పైభాగాన అమర్చిన చిన్న ప్లాస్టిక్ గుడ్డ. (తె. 20).

ఛరకోట్టు: (క్రి.) చూ. పర్యా. గిరకొట్టు. పాలిష్ పనిలో ఆతుకులు కనపడకుండ సాపుచేయడం. (తె. 4).

ఛాణంపట్కార: చూ. చానం పట్టకారు. (రా. 15).

ఛానలు: చూ. పర్యా. కట్టర్‌దిమ్మ. ఇనుప కడ్డీలను కట్‌చేసి, లెవల్ చేయడానికి ఉపయోగించే దిమ్మ. దీన్ని అరుదుగా వాడ్తారు. (రా. 12).

ఛానం: ఉ. ఛైనం. రూ. చానం, చానలు, ఛాణం, సానం. చూ. పర్యా. చదరపు పంచు. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (తె. 1, 17, 21; రా. 10, 14-16).

ఛాపన్: చూ. పర్యా. అడగోలు. లోహపు రేకులు, కడ్డీలు సాపుచేయడానికి వాడే పరికరం. (రా. 15).

ఛీకా[1]: పర్యా. జాలి[1], జిబ్బి, తడకు, ప్రేము[1], స్టాండు[2], స్టౌప్లేటు, స్టౌరేకు. పాత్రలు పెట్టడానికి స్టౌబర్నర్‌పై ఉండే బొడిపెలున్న రేకు. (తె. 4).

ఛీకా[2]: కాంతి బాగా రావడానికి, బయటిగాలి మెంటల్‌కు తగులకుండ ఉండడానికి పెట్రొమాక్స్ లైట్‌లో ఉండే అద్దాలఫ్రేము. (తె. 19, 22).

ఛీపర్: (ఇం. Chopper). చూ. పర్యా. కత్తి[8]. వెల్డింగ్ ఉబ్బులను కొట్టడానికి ఉపయోగపడే పరికరం. (తె. 5).

ఛీపింగ్‌చేయు: చూ. చిప్పింగ్‌చేయు. (తె. 19).

ఛీపింగ్‌సిజల్: (< ఇం. Chipping sizzl) చూ. పర్యా. కత్తి[8]. వెల్డింగ్ ఉబ్బులను కొట్టడానికి వాడే పరికరం. (తె. 18).

ఛూరాచేయు: (< హిం. ఛూ. రా. + చేయు) ఉ. ఛూరచేయు. తయారుచేసిన ఇత్తడి టంకాన్ని

మెత్తగ సన్నని పలుకులుగ దంచడం. (తె. 17, 23, 25).

ఛెన్ని: రూ. ఛిన్నల్. చూ. పర్యా. పదనుపుపంచి. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (తె. 23, 25; రా. 15).

## జ

జగ్గు: (ఇం.) పర్యా. జగ్గుకూజా, డీజక్స్‌జగ్గు, నీళ్ళజగ్గు, మద్రాసుజగ్గు, వాటర్‌జగ్గు. నీళ్ళు ఉంచుకోడానికి ఉపయోగించే మూతివంకరగా ఉండి, పట్టుకోడానికి కాడ అమర్చిన మూతఉన్న పొడవాటి లోహపుపాత్ర. చూ. చిత్రం. 105. (కో. 2, 3, 17, 19, 20, 22-24, 26-30; తె. 1-11, 13, 15, 16, 18; రా. 6, 11-14).

జగ్గుకూజా: (< ఇం. Jug + హిం. కూజా) చూ. పర్యా. జగ్గు, నీళ్ళు ఉంచుకోడానికి వాడే మూతి వంకరగా ఉండి, పట్టుకోడానికి కాడ అమర్చిన మూతఉన్న పొడవాటి లోహపుపాత్ర చూ. చిత్రం 105. (కో. 20, 27; తె. 12; రా. 13).

జగ్గుచెంబు: (ఇం. Jug + చెంబు) మూతి పొడవుగా ఉండే లోహపుపాత్ర. నీళ్ళకు వాడ్తారు. చూ. చిత్రం 106. (కో. 2).

జగ్గుపాటను: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (తె. 17).

జంగిడి: చూ. పర్యా. చాల్ని[1]. ఉడకబెట్టిన పదార్థాలను (అన్నం, కూరగాయలు వగైరా) వడబోసుకోడానికి ఉపయోగపడే సాధనం. (తె. 29).

జంగు[1]: చూ. పర్యా. కిట్టు. కొలిమిలో ఇనుము కాలగా మిగిలిన పనికిరాని బొగ్గు, ఇనుము మిశ్రమం. (కో. 21).

జంగు[2]: చూ. పర్యా. చిలుము. లోహపు రేకులపై, కడ్డీలపై పట్టిన తుప్పు. (కో. 26; తె. 17, 26).

జడ్‌అంగ్లేర్: (< ఇం. Z Angler) గ్లాస్‌డోర్‌ల చుట్టూ అమర్చే ఇనుపపట్టి. (తె. 25).

జడిగెక్కర: పొలాల్లో విత్తనాలు వేయడానికి వాడే సన్నని ఇనుపగొట్టం. (తె. 23).

జంటిగొత్తం: చూ. జంతికగొట్టం. (తె. 16).

జంటించు: పర్యా. జమాయించు, జుడాయించు, జోడించు, టచ్‌చేయు[1], తగిలించు[1], తాయు, దూర్చు, పాకింగ్‌చేయు, పొందికచేయు, ఫిట్ చేయు, బిగించు, బిగింపుపెట్టు, బిగ్గొట్టు, మాత్లేయు, ఘూటు, మెరిగించు, రివిట్ ప్రెసింగ్‌చేయు, సాడర్ చేయు. రెండు లోహపు రేకులను అతకడం. రెండు విగ్రహాలను కలిపి కట్టడం. (రా. 5).

జత: పర్యా. డక్కి[2], భుజం, మూగ. వాయి, జవ్వ కలిసిన బిందెభాగం. (తె. 3, 25).

జంతర్ ఏయు: (క్రి.) పర్యా. వాలేయు[3]. పాలిష్ బిందెపై సన్నని గీతలు వేయడం. (తె. 4).

జంతికగిద్దె: చూ. పర్యా. కారాచావ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 21).

జంతికగొట్టం: రూ. జంటిగొత్తం, జంతికలగొట్టం, దంతికలగొట్టం. చూ. పర్యా. కారాచావ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (కో. 15, 18, 19, 20, 22, 23, 28, 30; తె. 22).

జంతికలగొట్టం: చూ. జంతికగొట్టం. (కో. 17, 23).

జబ్బ[1]: చూ. పర్యా. స్మాల్‌బేసను. అన్నం ఆరబోసుకోడానికి, పిండి కలుపుకోడానికి ఉపయోగపడే లోతైన వెడల్పుపాత్ర. (తె. 7, 19, 23-25).

జబ్బ[2]: ఉ. జబ్బా. చూ. పర్యా. గమేలం. ఇటుకలు, రాళ్ళు, మట్టి మోయడానికి వాడే ఇనపపాత్ర. చూ. చిత్రం. (తె. 18, 23).

జమాయించు: (క్రి.). చూ. పర్యా. జంటించు. రెండు లోహపు రేకులను అతికించడం. (తె. 17).

జమ్ము: ట్రంకుపెట్టె మూతభాగపు పక్కరేకు. (కో. 2).

జంపర: ముక్కల్ని తెగ్గొట్టడానికి, సాగదీయడానికి వాడే పరికరం. (కో. 17).

జర్దడబ్బీ: (హిం.) పొగాకు వేసుకోడానికి వాడే చిన్న మూత ఉన్న పాత్ర. (తె. 19).

జర్మన్‌సిల్వరు: (< ఇం. German Silver). చూ. పర్యా. సిల్వరు. పాత్రలు తయారుచేయడానికి వాడే ఒకరకం లోహం. వెండి. బంగారుకు బదులుగా కూడా కొందరు దీన్ని ఆభరణాలకు ఉపయోగిస్తారు. (రా. 3, 5, 8).

జలకొట్టు: (క్రి.) నీళ్ళలో పాలమట్టిని కలపడం. (రా. 2).

జల్లి: చూ. పర్యా. ఛన్ని. బియ్యం, నూకలు వగైరా జల్లించడానికి వాడే రంధ్రాలున్న రేకు పరికరం. (తె. 17).

జల్లిగరట్టు: ఉ. జెల్లెగరట్టు. చూ. చిల్లిగరిటె. (తె. 11).

జల్లిగంటె: రూ. జల్లీలగంటె, జాలిగంటె. చూ.

పర్యా. రంధ్రాలగరిటె. నూనెలో నుండి పిండి పదార్థాలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న పరికరం. చూ. చిత్రం 107. (తె. 2, 5, 6, 12, 17–19, 21, 24, 25; రా. 2, 4, 7, 8).

జల్లిగిన్నె: చూ. పర్యా. అన్నంబుట్ట. అన్నం వడబోసుకోవడానికి వాడే అడుగున రంధ్రాలు అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం 11. (తె. 25).

జల్లివబ్బు: చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనెలో నుండి పిండి వంటలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాల పరికరం. (రా. 3, 7). చూ. చిత్రం 107).

జల్లిపట్టు[1]: (క్రి.) చూ. పర్యా. జల్లించు[1]. పోత పోయడానికిముందు మట్టిని పిండి, రవ్వను జల్లెడతో పట్టడం. (తె. 7).

జల్లిపట్టు[2]: (క్రి.) ఉ. జెల్లిపట్టు. చూ. పర్యా. జల్లించు. పిండి, రవ్వను జల్లెడతో పట్టడం. (కో. 15; తె. 16, 17; రా. 4, 6, 7).

జల్లిప్లేటు: (< జల్లి+ఇం. Plate) చూ. పర్యా. కళ్ళసిబ్బి. అన్నాన్ని, ఉడకబెట్టిన కాయగూరల్ని వార్చడానికి వాడే సగభాగం రంధ్రాలు కలిగిన పళ్లెం. (తె. 18).

జల్లిసిబ్బి: చూ. పర్యా. అన్నంబుట్ట. బియ్యం వగైరా వడబోసుకోవడానికి వాడే అడుగుభాగంలో రంధ్రాలున్న లోహపుపాత్ర. చూ. చిత్రం 11. (కో. 16).

జల్లిసెట్లు: చూ. పర్యా. అన్నంబుట్ట. బియ్యం. వగైరా వడబోసుకోడానికి వాడే అడుగుభాగంలో రంధ్రాలున్న లోహపుపాత్ర. చూ. చిత్రం 11. (కో. 16).

జల్లించు[1]: (క్రి.) రూ. జల్లింపు. పర్యా. జల్లి పట్టు[1]. తాల్చు[1], వస్త్రకాళితంచేయు. పోతపోయడానికి ముందు మట్టిని మెత్తగా శుభ్రపరచడం. (కో. 17, 27, 29; రా. 5).

జల్లించు[2]: (క్రి.) పర్యా. వేరుచేయు, శుభ్రపరచు. టీ పొడిలో ఆకులాంటి చెత్తా చెదారాన్ని జల్లెడ సహాయంతో శుభ్రపరచడం. (కో. 1).

జల్లించు[3]: (క్రి.) ఉ. జెల్లించు. పర్యా. జల్లిపట్టు[2]. జెల్లెడపట్టు. పిండి, రవ్వను జల్లెడలో పట్టడం. (కో. 19, 28, 29; తె. 8, 15: రా. 8).

జల్లిలగంటె: చూ. జల్లిగంటె. (తె. 19).

జల్లుమట్టు: చూ. పర్యా. కుంచు. కాక బాగారావడానికి కొలిమిపై నీళ్లు చల్లడానికి వాడే గుడ్డచుట్టిన కట్టెముక్క. (కో. 20).

జల్లెడ[1]: పోతపనిలో మట్టిని సున్నగా జల్లించడానికి వాడే పరికరం. (కో. 9, 28, 29; తె. 10, 16; రా. 4).

జల్లెడ[2]: ఉ. జల్లెడు. చూ. పర్యా. ఛన్ని. బియ్యం, నూకలు వగైరా జల్లించడానికి వాడే రంధ్రాలున్న రేకు పరికరం. చూ. చిత్రం 108. (కో. 4; తె. 8–12, 16).

జల్లెడ[3]: చూ. పర్యా. చాల్ని[1]. ఉడకబెట్టిన పదార్థాలను (అన్నం, కూరగాయలు వగైరా) వడబోసుకోడానికి ఉపయోగపడే సాధనం. (కో. 21; తె. 3, 6).

జల్లెడపట్టు: (క్రి.) చూ. పర్యా. జల్లించు[3]. పిండి, రవ్వ సున్నగువాటిని జల్లెడతో పట్టడం. (కో. 27–29; రా. 7, 15).

జల్లి: వేరుసెనగ విత్తనాన్ని జల్లిపోయడానికి వాడే జల్లెడ. (రా. 11).

జవకర: పర్యా. నోస్‌ప్లేయర్, ప్లాస్క్ పట్టకారు, బాతుముట్టుకారు, సన్నముట్టుకారు, సన్నమూతి పట్టకార, సూదికారు, సూదిప్లేయరు, సూది ముట్టు కారు, సూది మూతికారు. చిన్న చిన్న లోహపు వస్తువులను పట్టుకోడానికి, రిపేరి చేయడానికి వాడే పరికరం. (కో. 29).

జవగారు: చూ. జవ్వకారు. (కో. 5, 15).

జవబుద్దీ: పర్యా. బిందె. అంచు చిన్నదిగా ఉండే బిందె. (కో. 21, 24).

జవ్వ[1]: పర్యా. డొల్ల[2], సిరస, సుక్క, సూరు[1], సెలుసు[1]. బిందెయొక్క అంచుభాగపు రేకు. (కో. 20, 22, 24, 27–29).

జవ్వ[2]: చూ. పర్యా. అడ్డ[1]. బిందె మధ్యభాగపు రేకు. (కో. 21; తె. 1–3, 10–11, 23–26).

జవ్వ[3]: చూ. పర్యా. కోరు[2]. కాగితాలు వగైరా చిన్న చిన్న వస్తువులను ఉంచడానికి ట్రంకుపెట్టె మూతకు అమర్చిన అర. (కో. 17, 22, 23; రా. 8, 10, 11).

జవ్వ[4]: చూ. పర్యా. లడిగ. సీసాల్లో, స్టౌలలో నూనె పోయడానికి ఉపయోగపడే పరికరం. చూ. చిత్రం 201. (కో. 28).

జవ్వకమ్మి: చూ. పర్యా. కంకణం. పాత్రల అంచులు దట్టంగా ఉండడానికి ఉపయోగించే లోహపు కడ్డీ. (తె. 24).

జవ్వకారు: ఉ. జవ్వగారు. రూ. జవగారు. చిన్న చిన్న వస్తువులను పట్టుకోడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 5, 15, 20).

జవ్వకమ్మి: దట్టమైన అంచుగలిగిన నీళ్ళు తాగే చెంబు. (కో. 22).

జవ్వబిందె: చూ. పర్యా. ఆకుబిందె. నీళ్ళు, తెచ్చుకో డానికి వాడే వెడల్పైన అంచుఉన్న ఇత్తడి బిందె. చూ. చిత్రం 17. (కో. 21).

జవ్వబుడ్డీ: సీసా ఆకారంలో ఉన్న చెంబు. క్రింది భాగంలో కుదురు అమర్చి ఉంటారు. (కో. 20).

జవ్వలకరవాయి: పర్యా. జవ్వసుత్తి, పొట్టకరవాయి, వంచేకరవాయి. బిందె జవ్వభాగం సాపుచేయడానికి వాడే అడుగుభాగం వెడల్పుగా గుండ్రంగా ఉండే పనిముట్టు. (కో. 6).

జవ్వసుత్తి: చూ. పర్యా. జవ్వలకరవాయి. బిందెజవ్వ భాగం సాపుచేయడానికి వాడే, అడుగుభాగం వెడల్పుగా గుండ్రంగా ఉండే సుత్తి. (కో. 10, 12; తె. 23, 25; రా. 2).

జస్: పర్యా. తుత్తునాగం, వైట్, సత్తు, సత్తురేకు. ఇత్తడి పాత్రల కళాయిపనికి వాడే యాసిడ్‌తో కలిపే పదార్థం. (తె. 4).

జస్‌కికాడి: (< హిం.) పర్యా. తేదాపుల్ల. డబ్బా రేకులపై తేజాపును పూయడానికి టిన్‌గర్ పనిలో వాడే చిన్న రేకుముక్క. (తె. 22).

జాం అవు: (క్రి.) (< ఇం. Jam + అవు). పర్యా. జాంపట్టు. స్లాలో మంటవచ్చే ద్వారం మూసుకొని పోవడం. (కో. 20).

జాకి: (< ఇం. Jockey) చూ. పర్యా. కుక్కారు. బండిచక్రానికి కమ్ములను ఎక్కించడానికి ఉపయో గించే పరికరం. (తె. 1, రా. 13, 14, 16).

జాజిసుత్తి: కాల్చిన ముక్కలను సాపుచేయడానికి వాడే సాధనం. (కో. 17).

జాజాకు: జాజిఆకు ఆకారంలోఉన్న అంచులేని భోజనంప్లేటు. (కో. 19, 19).

జాజు: పర్యా. జిగురు; జోగురు, రాగిపూల్, సర్వీసు. రాగిపాత్రలపై పూతగవాడే ఎర్రని రంగుపదార్థం. (తె. 3, రా. 15).

జాడి: ఉ. జాడీ. ఊరగాయ వంటి పదార్థాలు వేసుకోడానికి ఉపయోగించే పాత్ర. (కో. 2, 3, 22).

జాతిసుత్తి: చూ. పర్యా. గుండుసుత్తి. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (కో. 13).

జాన: మూరెడులో అర్ధం. ముట్టివేసే కర్ర జానె డుండాలి. (రా. 5).

జామ్‌గ్లాసు: చూ. పర్యా. గ్లాసు[1]. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215. (కో. 13, 15).

జాము: ఉ. జాం. చూ. పర్యా. గ్లాసు[1]. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215 (తె. 1, 3).

జాంపట్టు: (క్రి.) చూ. పర్యా. జాంఅవు. స్టౌలోమంట వచ్చేద్వారం మూసుకొని పోవడం. (కో. 25).

జాంబు: మరచెంబులో పెట్టడానికి వాడే చిన్నగ్లాసు (తె. 9, 16, 21).

జాయింట్‌చేయు: (క్రి.) (< ఇం. Joint + చేయు) చూ. పర్యా. అతుకు. రెండు రేకులనుగాని, కమ్ములనుగాని, పట్టాలనుగాని ఒకటిగా అతకడం. (కో. 1-4, 8, 26; తె. 5-8, 21).

జాయింట్‌మట్టిపుల్ల: (< ఇం. Joint + మట్టిపుల్ల) జాయింట్‌చేసేటప్పుడు వాడే పనిముట్టు. (రా. 10).

జార: చూ. పర్యా. కొళాయిబక్కెట్టు. కొళాయి అమర్చిన ఇనుపనీళ్ళపాత్ర. (తె. 10, 11).

జారు[1]: లోహపుపాత్రలపై ఉండే మెరుగుభాగం. (కో. 26).

జారు[2]: (క్రి.) టంకం, కమ్మి సరియైనస్థలంలో ఉండక దొర్లిపోవడం. (కో. 28; రా. 6).

జారుచేయు: (క్రి.) పర్యా. తెగుడువచ్చు. మొద్దుబారిన మెరుగు కమ్ములను పదును చేయడం. (కో. 24).

జారుమద్దులి: కజ్జతెగ్గొట్టడానికి, లెవెల్ చేయడానికి వాడే పనిముట్టు. (కో. 22).

జారుశానం : లోహపురేకులను కత్తరించడానికి, రంధ్రాలు చేయడానికి వాడే పరికరం. (కో. 26).

జార్ని: చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనెలోనుండి పిండివంటకాలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న గరిట. చూ. చిత్రం 107. (తె. 23).

జాల్: చూ. పర్యా. అంగ్లేరు. వెల్డింగ్ డిజైన్లుఫ్రేము చుట్టూ వేసే బలమైన 'L' లేదా 'V' ఆకారపుకడ్డీ. (కో. 25).

జాలరు: రూ. జాల్ర, చూ. పర్యా. రంధ్రాలగంటె. నూనెలోనుంచి పిండివంటకాలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న గరిట. చూ. చిత్రం 107. (తె. 3, 6, 11).

జాలి[1]: చూ. పర్యా. ఛీకా[1]. పాత్రలుపెట్టడానికి స్టౌబర్నర్ పైభాగాన అమర్చిన బొడిపెలున్న రేకు. (తె. 19).

జాలి[2]: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గులపొయ్యిలో బూడిద రాలడానికి వాడే రంధ్రాల బిళ్ళ. చూ.

చిత్రం 59. (తె. 3; రా. 11, 15).

జాలి[3]: చూ. పర్యా. కాలువచక్కి. చెత్తా చెదారం కాలువల్లోకి వెళ్ళకుండ అడ్డం పెట్టడానికి వాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 51. (తె. 2, 6, 21; రా. 14).

జాలి[4]: చూ. పర్యా. ఛన్ని. బియ్యం, నూకలువగైరా జల్లించిడానికి వాడే రంధ్రాలున్న రేకు పరికరం. (తె. 12).

జాలి[5]: రేకులు కత్తిరించడానికి, వంచడానికి కింద ప్లేట్‌లాగా ఉపయోగపడే సిల్. (రా. 12).

జాలి[6]: పెట్రొమాక్స్ లైటులో మంట బయటికి రాకుండ ఉండడానికి వత్తులచుట్టు అమర్చిన రంధ్రాల రేకు. (తె. 3, 4, 17, 19).

జాలి[7]: చూ. పర్యా. అన్నంబుట్ట. బియ్యం వడబోసు కోవడానికి వాడే అడుగున రంధ్రాలు అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం 11. (తె. 4).

జాలికడ్డి: మందంగా ఉండే ఛత్రిపుల్ల. కొన్ని కడ్డీలను కలిపి బిగించితే 'పద్మం' ఆకారం వస్తుంది. (తె. 1).

జాలిగడ్డ: పర్యా. మట్టికుండ, మట్టిజాలి, మిషినెల్ టాప్, మెంటల్‌గడ్డ, మేండర్, పెట్రొమాక్స్ లైటుకు గ్యాస్‌ను అందించడానికి వత్తికి పైభాగాన అమర్చిన రంధ్రాల దిమ్మ. (తె. 18).

జాలిగంటె: చూ. జల్లిగంటె. (తె. 1-4, 10, 12, రా. 12, 15, 16).

జాలిగంప: పశువులకు కుడితిని త్రాగించడానికి వాడే లోహపుపాత్ర. (తె. 4).

జాలిప్లేటు: (< జాలి + ఇం. plate) పర్యా. ప్లేటు[2], రంధ్రాలబిళ్ళ. పెట్రొమాక్స్ లైటు భాగాలు కదలకుండ బిగించడానికి ఉపయోగించే సాధనం. (తె. 24).

జాలిబిళ్ళ: చూ. పర్యా. కాలువచక్కి. చెత్తాచెదారం కాలువల్లోకి వెళ్ళకుండ అడ్డం పెట్టడానికి వాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 50. (తె. 18).

జాలిబుక్సు: (< జాలి + ఇం. books). చూ. పర్యా. కాట్‌లెటరు. డిజైన్లను తయారుచేయడానికి ఉపయోగించే బొమ్మల పుస్తకం. (తె. 20).

జాలివర్కు: (< జాలి + ఇం. work). చూ. పర్యా. గ్రిల్‌వర్కు. వెల్డింగ్ డిజైన్లుచేసి ఇనుముతో గేట్లు, కిటికీలు, వరండా వగైరాలు తయారుచేసే పని. (తె. 1).

జాలీచెంబు: రూ. జాలీసెమ్మె. పట్టుకోడానికి పైన వలయంపెట్టి చేసిన చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 109. (తె. 5. 8).

జాలీసెమ్మె: చూ. జాలీచెంబు. (తె. 11).

జాలు: చూ. పర్యా. టీస్టాండు. టీగ్లాసులు తీసుకెళ్ళడానికి వాడే స్టాండు. (కో. 24).

జాల్రు: చూ. జాలరు. (తె. 6).

జావా: దీపంబుడ్డి పైమూత. దీనిద్వారా వత్తిని అమర్చి ఉంటారు. (తె. 17).

జాస్తి: బీరువా రేకుపై మెటల్ ఎక్కువగా వుండడం. (రా. 6).

జి. ఐ. చేట: కళాయిరేకు చేట. ఇంట్లో పనికి ఉపయోగం. (కో. 1).

జిగుమానం: చూ. పర్యా. జాజు. రాగిపాత్రలపై పూతగవాడే ఎర్రని రంగుపదార్థం. (కో. 21).

జిగురు: చూ. పర్యా. గొగ్గిలం. విగ్రహం నగిషీపనికి వాడే పదార్థం. (కో. 28).

జిగురుమట్టి: పర్యా. జింకమట్టి, నైసుమట్టి, పాలమట్టి, పోతమట్టి, బంకమట్టి, మట్టి, వాగుమన్ను, సన్నమన్ను, పోతపాత్రను తయారుచేయడానికి ఉపయోగించే మట్టి. (కో. 10).

జిగ్గు: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (రా. 3).

జింకమట్టి. చూ. పర్యా. జిగురుమట్టి. శిల్పి పనిలో విగ్రహం అచ్చుపైన కప్పడానికి ఉపయోగించే బంకమన్ను. (కో. 28).

జింకుపైపు: (< ఇం. Zink pipe) నీళ్ళు కాచుకోడానికి ఉపయోగించే తుత్తినాగం పరికరం. (కో. 15).

జింకుసెడ్డురేకు: (< ఇం. Zink shed + రేకు) డ్రమ్ములు తయారుచేయడానికి వాడే రేకు. (రా. 8).

జిడ్డు: చూ. పర్యా. చిలుము. లోహపు రేకులపై, కడ్డీలపై పట్టిన తుప్పు. (లా. 6).

జిబ్బి: చూ. పర్యా. ఛీరా[1], పాత్రలు పెట్టడానికి స్టౌ బర్నర్ పైభాగాన అమర్చిన బొడిపెలున్న ప్లేటు. (కో. 30).

జిబ్బిరేకు: రూ. సిబ్బిరేకు. చూ. పర్యా. అన్నంబుట్ట. బియ్యం వగైరా వడబోసుకోవడానికి వాడే అడుగుభాగంలో రంధ్రాలున్న లోహపు పాత్ర. చూ. చిత్రం 11. (కో. 19, 29).

జింబు: ఉ. జుంబు. చూ. పర్యా. లెటరు కాగితాలు వగైరా చిన్నచిన్న వస్తువులను ఉంచడానికి ట్రంకుపెట్టె మూతకు అమర్చిన అర. (కో. 17, 26).

జిరకాకతీయు: (క్రి.) చూ. పర్యా. కాక ఎక్కు.

ఇనుమును సాగ్గొట్టడానికి, అతకడానికి వీలుగా కొలిమిలో ఎర్రగా కాల్చడం. (తె. 22, 23).

జిరలేగ: చూ. జిర్రులేగ. (తె. 17).

జిర్రగతీయు: చూ. పర్యా. కాక ఎక్కు. ఇనుమును సాగ్గొట్టడానికి, అతకడానికి వీలుగా కొలిమిలో ఎర్రగా కాల్చడం. (తె. 21).

జిర్రులేగ: ఉ. జిర్రులాగ. రూ. జిరలేగ, జిర్లాగ. చూ. పర్యా. అమురువాలేగ. పాలిష్ పాత్రలపై డిజైనులు వేయడానికి వాడే పరికరం. (తె. 17, 19, 20).

జిర్లాగ: చూ. జిర్రులేగ. (తె. 19).

జిలకమ్మి: చూ. పర్యా. చదరగన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగుపట్టడానికి వాడే పనిముట్టు. (కో. 10, 14, 19).

జిలకంట్రాని: నిగ్రహాలకు పూర్తి మెరుగు వేయడానికి వాడే పరికరం. (కో. 23, 28, 29).

జిలవచ్చు: పర్యా. నిగారింపు. పాత్రలకు మెరుగు పెట్టినపుడు తెల్లబడటం జిలవస్తుంది అంటారు. (కో. 21, 26).

జిలాబీకంచం: అడుగుభాగంలో పీటకోళ్ళు, గుండ్రని గుబ్బలు అతికిచేసిన భోజనంప్లేటు. (కో. 23).

జిలేబి: పెట్రొమాక్స్‌లైటు మెంటల్‌కు గ్యాస్‌ను అందించడానికి ఉపయోగించే పరికరం. (తె. 19, 20, 21).

జిలేబిటవ్వ: జిలేబీలు తయారు చేయడానికి ఉపయోగించే పెద్ద ఇనపకలాయి. (కో. 17).

జిల్లకరవాయి: పాలిష్‌పనిలో డిజైను కొట్టడానికి వాడే పనిముట్టు. (తె. 10).

జిల్లకొట్టు: (క్రి.) చూ. పర్యా. గిర్రకొట్టు. పాలిష్ పాత్రలపై డిజైనులు వేయడం. (తె. 11).

జీచెంబు: చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యి లాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపు పాత్ర. (తె. 7).

జీడికాయమరచెంబు: చూ. పర్యా. జీడిమామిడి మరచెంబు. మధ్యభాగంలో సన్నగా లావుకడుపుతో ముంతమామిడికాయ ఆకారంతో ఉండే ఒకరకం మరచెంబు. (కో. 16, 17, 21, 24, 29).

జీడిమామిడి మరచెంబు: పర్యా. జీడికాయ మరచెంబు, ముంతమామిడి మరచెంబు. మధ్య భాగంలో సన్నగా లావుకడుపుతో ముంతమామిడి కాయ ఆకారంతో ఉండే ఒకరకం మరచెంబు. (కో. 10, 13, 15, 18, 20).

జీనం: ఉ. జిన. చూ. పర్యా. అడుగు. ఇత్తడి ఇనుప పాత్రం అడుగుభాగపు రేకు. (కో. 14, 15, 20–28; తె. 1, 12, 21, 23).

జీనంబెండు: బిందె బిందె మధ్యభాగాన్ని అడుగు భాగాన్ని కలుపుతూ ఉండే అతుకు. (కో. 21).

జీర్: రేకును కత్తిరించుకోడానికి ముందు స్కేలుతో వేసే గీత. (తె. 12).

జీర: మెరుగు పాత్రలపై వేసే సన్నటి డిజైను గీత. (కో. 24, 27).

జీలిబెండు: చూ. జీలుగబెండు. (కో. 21).

జీలుగ: పర్యా. జీలుగబెండు. స్టౌబర్నర్‌కు గాలిని అందించడానికి అమర్చిన చిన్న రబ్బరుముక్క. (కో. 29).

జీలుగబెండు: చూ. జీలిబెండు. చూ. పర్యా. జీలుగ. స్టౌబర్నర్‌కు గాలిని అందించడానికి అమర్చిన చిన్న రబ్బరు వాషరు. (కో. 25).

జుడాయించు: (క్రి.) చూ. పర్యా. జంటించు. వెల్డింగ్ చేయడానికి డిజైను ప్రకారం లోహపు పట్టీలను, రేకులను అమర్చడం. (తె. 17).

జులక: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (రా. 14).

జూసెకషర్: (< ఇం. Juice crusher). పర్యా. క్రెషరు, జ్యూస్‌పడగ, ట్విస్టర్, పల్లిగాని మిషన్, ప్రెషర్, రసంమిషన్, రాంపాల. పండ్లరసం తీయడానికి వాడే సాధనం. (కో. 28).

జెల్లిగరిట: చూ. పర్యా. కారాచాప. కారాను, ముడుకులు వగైరా పదార్థాలు చేయడానికి వాడె లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 10,11).

జెల్లిగంటె: అన్నం కలియపెట్టడానికి ఉపయోగించే ఇనపకాడ. (కో. 1).

జెల్లెడ: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గులపొయ్యిలో బూడిద రాలడానికి వాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 59. (రా. 2).

జేగురు: చూ. జోగురు. పర్యా. జాజు. రాగిపాత్రల పైపూతకు వాడే ఎర్రని రంగుపదార్థం.

జేగంట: ఉ. జాగంటె. రూ. జైగంట. పూజా సమయంలో హారతి ఇచ్చేటప్పుడు వాయించే ఇత్తడి పరికరం. చూ. చిత్రం 110. (కో. 19, 29; రా. 15).

జైగంట: చూ. జేగంట. (కో. 23).

జోగురు: చూ. జేగురు. పర్యా. జాజు. రాగి పాత్రలపై పూతగ వాడే ఎర్రనిరంగు పదార్థం. (కో. 21,22).

జోడ: రూ. జోళ. చూ. పర్యా. అండా[1]. నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల పిడులు, వెడల్పు మూతి ఉన్న పెద్ద లోహపుపాత్ర. చూ. చిత్రం 8. (రా. 12).

జోడతాళి: చూ. పర్యా. అండా[1]. నీళ్ళు నిలవ ఉంచడానికి వాడే ఇరువైపుల పిడులు, వెడల్పు మూతి ఉన్న పెద్ద లోహపుపాత్ర. చూ. చిత్రం 8. (కో. 25; రా. 15).

జోడించు: చూ. పర్యా. జంటించు. రెండు రేకు భాగాలను కలపడం. (కో. 19; రా. 13).

జోడుతపెల: పర్యా. దోడితపేల. నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే వెడల్పుమూతి ఉన్న నిలువుపాత్ర. చూ. చిత్రం 111. (కో. 1, 7; తె. 11, 12. 14, 15: రా. 2, 3).

జోడుతపెల కరవాయి: జోడుతపెలను తయారుచేయడానికి వాడే దిమ్మ పరికరం. (తె. 12. రా. 1).

జోడుతాల్ సెట్టు: (< జోడుతాలు + ఇం. Set). చూ. పర్యా. అండా[1]. నీళ్ల నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల పిడులు, వెడల్పు మూతి ఉన్న పెద్ద లోహపు పాత్ర. చూ. చిత్రం 8. (కో. 2).

జోళ: చూ. జోడ. (రా 11).

జౌగరు: రేకుపల్లు కత్తిరించడానికి వాడే పనిముట్టు. (కో. 18).

జ్యూస్‌ఫిల్టరు: (< ఇం. Juice filter). నిమ్మరసం పడకట్టుకోడానికి వాడే సాధనం. చూ. చిత్రం 112. (రా. 4).

జ్యూస్‌వడగర: (< ఇం. Juice + వడగట్టు) చూ. పర్యా. జ్యూస్‌కషటు. పండ్లరసం వడగట్టుకోడానికి వాడే సాధనం. (కో. 1).

జ్యోతి: చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 58. (కో. 1).

జ్యోతులు: చూ. పర్యా. చెమ్మెలు. దీపం వెలిగించడానికి వాడే లోహపు సాధనాలు. చూ. చిత్రం 103. (రా. 7).

## ఝ

ఝరా: (< హిందీ) చూ. పర్యా. రంధ్రాల గరిటె. నూనెలోనుండి పిండివంటకాలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న గరిట. చూ. చిత్రం 107. (రా. 14).

ఝాలాపానా: (హిం.) చూ. పర్యా. చైన్‌పాన్. స్టైనిప్పల్‌ను ఊడదీయడానికి, బిగించడానికి వాడే పరికరం. (తె. 4).

## ట

టకారం[1]: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపులా హాండిల్సు అమర్చిన గోళంలాగా ఉండే లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (రా. 2, 3).

టకారం[2]: రూ. దకారం. చూ. పర్యా. గమేలం. ఇటుకలు, రాళ్ళు, మట్టి మొదలైనవి మోయడానికి, వాడే ఇనప పాత్ర. (కో. 1).

టక్కు: ఉ. టక్కూ. రూ. టంక. చూ. పర్యా. ఉడన్ హేమర్. రేకులను సాఫుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 12, 14–16, 19, 20; తె. 12, 13, 17; రా. 15).

టక్కుబాణి: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపులా హాండిల్సు అమర్చిన లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (రా. 2).

టంక: చూ. టక్కు. (కో. 19).

టంకం: ఉ. టెంకం. చూ. పర్యా. చూర. లోహపు పాత్రలను అతకడానికి వాడే పదార్థం. (కో. 9, 10, 16, 18, 23, 24, 26–30; తె. 2, 5, 6, 20, 21).

టంకంకడ్డి: చూ. పర్యా. కడ్డీ[1]. ఇత్తడి పాత్రలను రవ్వతో అతకడానికివాడే కడ్డి. (తె. 4,5; రా.7,13).

టంకంకమ్మి: చూ. పర్యా. కడ్డీ[1]. ఇత్తడి రేకులను రవ్వతో అతకడానికి వాడే కడ్డి. (కో. 28, 29).

టంకంగడ్డపార: చూ. పర్యా. ఊస. టంకాన్ని రవ్వ చేయడానికి వాడే పరికరం. (తె. 4).

టంకంచిప్ప: చూ. పర్యా. కుడక. టంకంపొడిని వేసుకోడానికి వాడే పాత్ర. (తె. 22).

టంకంచేయు: (క్రి.) వెల్డింగ్‌చేయడం. (రా. 7).

టంకంపుల్ల: చూ. పర్యా. కడ్డీ[1]. ఇత్తడిరేకులను రవ్వతో అతకడానికి వాడే కడ్డి. (రా. 6, 14, 16).

టంకంపొడి: చూ. పర్యా. చూర. లోహపు పాత్రలను అతకడానికి వాడే పదార్థం. (కో. 2, 4, 12, 14; తె. 12; రా. 5. 7).

టంకుమాడల్ డై: (< ఇం. Trunk model die) ట్రంకుపెట్టె ఏ మాడల్ రావాలంటే ఆవిధంగా రావడానికి సహకరించే పరికరం. (రా. 7).

టచ్‌చేయు[1]: (క్రి.) (< ఇం. Touch + చేయు) చూ. పర్యా. జంటించు. విండె భాగాలన్నింటిని ఒకదానిలో ఒకటి కలపడం. (తె. 23).

టచ్‌చేయు[2]: (క్రి.) రిపేరికివచ్చిన వస్తువులో రిపేరి పని ఏమివుందో తనిఖీచేయడం. (కో. 17).

టచ్‌పిన్: (< ఇం. Touch pin) పర్యా. స్టౌపిన్. స్టౌ లోపలి బర్నర్ నిప్పుల్‌ను శుభ్రంచేయడానికి ఉపయోగపడే పరికరం. (తె. 24).

టచ్చింగ్‌చేయు: (క్రి.) (< ఇం. Touching + చేయు) చివరిగా జీపువాలో రంగులేనిచోట్ల రంగు పూసి నొక్కులుంటే సరిచేయడం. (తె. 2).

టించర్‌లివర్: (ఇం.) సైకిలుట్యూబును బయటికి తీయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 113. (రా. 3, 5).

టన్నర్‌స్క్రూ: (< ఇం. Turner Screw) చూ. టర్నిస్క్రూ. (కో. 16, 18).

టన్నిస్క్రూలు: చూ. టర్నిస్క్రూ. (కో. 13).

టన్నుపోగరు: చూ. పర్యా. పోగరు. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలు వేయడానికి గుర్తులు పెట్టే పరికరం. చూ. చిత్రం 165. (కో. 19).

టపకలు: చూ. టాకాలు[1]. (తె. 4).

టప్ప: చూ. పర్యా. కారు[1]. కాల్చిన లోహపు వస్తువులను సాపుచేయడానికి ఉపయోగపడే దిమ్మ. (కో. 26).

టమేటాకట్టర్: (< ఇం. Tomato cutter) పర్యా. స్లైయిసర్. టమేటాపండ్లుతరగడానికి వాడే పరికరం. (కో. 1; తె. 11).

టర్నిస్క్రూ: (< ఇం. Turner screw) ఉ. టన్నిస్క్రూ. రూ. టన్నర్‌స్క్రూ, టన్నిస్క్రూలు. పర్యా. త్రిపులి, మరతోడు, సిజర్‌స్ట్రైట్‌కమ్మి, స్క్రూ[1], స్క్రూడ్రైవరు, స్క్రూపోగరు, స్క్రూలను ఊడదీయడానికి, బిగించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 219. (కో. 13, 18, 19).

టర్నింగ్‌మోపు: (< ఇం. Turning + మోపు) చూ. పర్యా. మోపు[3]. పాలిష్‌పట్టేటపుడు పాత్రలను కదలకుండా పట్టిఉంచే పరికరం. (రా. 15).

టస్సాగిన్నె: (ఇం. Tass + గిన్నె) లెవల్‌గా ఉన్న చిన్న పాత్ర. (తె. 19).

టాకాలిచ్చు: (క్రి.) (< హిం. టాకా + లు + ఇచ్చు) పర్యా. టాకాలుపెట్టు, టాకాలు వెల్డింగ్‌చేయు, టాకాలేయు, టాకింగ్‌పెట్టు. పూర్తి వెల్డింగ్ చేయడానికి ముందు డిజైనును సరిచేయడానికి పట్టీలపై, రేకులపై చిన్న అతుకులుపెట్టడం. (తె. 21–25).

టాకాలు[1]: రూ. టపకలు. పూర్తి వెల్డింగ్ చేయడానికి ముందు డిజైన్లను సరిచేయడానికి లోహపురేకులపై, పట్టీలపై పెట్టే వెల్డింగ్ గుర్తులు. (కో. 23, 26, 27, 30; తె. 7; రా. 16).

టాకాలు[2]: రూ. టాకెలు. గొడుగుబట్ట లేచిపోకుండా కుట్టడానికి కమాన్లకు ఉండే రంధ్రాలు. (కో. 26, 29, 30; తె. 22; రా. 11).

టాకాలుపెట్టు: (క్రి.) చూ. పర్యా. టాకాలిచ్చు. పూర్తి వెల్డింగ్ చేయడానికి ముందు డిజైనును సరిచేయడానికి పట్టీలపై చిన్న అతుకులుపెట్టడం. (కో. 24, 28, 29; తె. 5).

టాకాలు వెల్డింగ్‌చేయు. (క్రి.) (< హిం. టాకా + లు + ఇం. Welding + చేయు). పూర్తి వెల్డింగ్ చేయడానికి ముందు డిజైనును సరిచేయడానికి పట్టీలపై, రేకులపై చిన్న అతుకులు పెట్టడం. (తె. 19).

టాకాలేయు[1]: (క్రి.) రూ. టాకావేయు. చూ. పర్యా. టాకాలిచ్చు. పూర్తి వెల్డింగ్ చేయడానికి ముందు డిజైనును సరిచేయడానికి పట్టీలపై, రేకులపై చిన్న అతుకులు పెట్టడం. (కో. 20; తె. 2, 7, 18).

టాకాలేయు[2]: (క్రి.) బట్ట ఊడిపోకుండ గొడుగు పుల్లలతో కలిపి కుట్లు వేయడం. (తె. 20).

టాకావేయు: (క్రి.) చూ. టాకాలేయు. (తె. 5; రా. 2).

టాకి[1]: చూ. టాంక్[1]. (తె. 5).

టాకి[2]: చూ. పర్యా. పోగర. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలు వేయడానికి గుర్తులుపెట్టే పరికరం, చూ. చిత్రం 165. (తె. 4).

టాకి[3]: చూ. పర్యా. కొళాయి. మంచినీళ్ళు నిల్వ ఉంచడానికి క్రిందిభాగాన కొళాయి అమర్చిన పరికరం. చూ. చిత్రం 124. (తె. 3).

టాకి[4]: పర్యా. టాప్‌హోల్‌మిషను, టాపు[3], టాపుసెట్, టాపుహాండిలు, త్రిసుకి, మరపోగరు. మరలు బిగించడానికి బీరువాపనిలో వాడే 'T' ఆకారపు పరికరం. (తె. 4).

టాకింగ్‌పెట్టు: (క్రి.) చూ.పర్యా. టాకాలుపెట్టు. పూర్తి వెల్డింగ్ చేయడానికి ముందు డిజైనును సరిచేయడానికి పట్టీలపై చిన్న అతుకులు పెట్టడం. (తె. 6).

టాకింగ్‌రాడ్: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలో బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (కో. 8).

టాకెలు: చూ. టాకాలు[2]. (కో. 29; రా. 11).

టాంక్‌లెట్: (ఇం. Tanklet) స్టౌ నూనెటాంకిపైన అమర్చిన బిరడ. (తె. 3).

టాంక్‌లెట్‌సాకెటు: (< ఇం. Tanklet socket) చూ. పర్యా. టాంకికాలరు. స్టౌపర్‌కీని లైట్ చేయడానికి టాంక్‌పైన అమర్చిన గొట్టం. (తె. 3, 17).

టాంకి[1]: రూ. టాకి[1], టాంకు. పర్యా. స్టౌటాకి. స్టౌపక్కభాగాన గాని, కిందిభాగాన గాని, పెట్రొమాక్స్‌లైటు కిందిభాగాన కిరసనాయిలు నిల్వ ఉంచడానికి ఉపయోగపడే సాధనం. (కో. 28, 29 తె. 3, 6, 17, 19, 21-24).

టాంకి[2]: చూ. పర్యా. టాపు[2]. డ్రమ్ము, డబ్బా వగైరా లోహపు వస్తువుల పైభాగం. (రా. 8).

టాంకి[3]: ఉ. టేంకు. నీళ్ళు నిల్వ ఉంచడానికి ఉపయోగించే కొలాయి అమర్చిన నిలువుపాత్ర. (కో. 6, 21; తె. 2).

టాంకికాలరు: (< ఇం. Tank coller) పర్యా. టాంక్‌లెట్‌సాకెటు, టాంక్‌సాకెటు, టాంకిగడ్డ. ఆయిల్‌కాప్ నమర్చడానికి టాంకిపై బిగించిన చిన్న గొట్టం. (తె. 21).

టాంకిగడ్డ: (< ఇం. Tank + గడ్డ). చూ. పర్యా. టాంకికాలరు. టాంకి బిరడాను అమర్చడానికి టాంకిపై నుండే చిన్నగొట్టం. (తె. 18).

టాంకిబిరడా: (< ఇం. Tank + బిరడా). వాల్‌లోపలి గాలిని అదుపులో ఉంచే సాధనం. ఇది టాంకి పైభాగాన ఉంటుంది. (తె. 18).

టాంకు: చూ. టాంకి[1]. (కో. 30; తె. 7).

టాంగ్: (< ఇం. Tank) చూ. పర్యా. కమ్మరకారు. లోహపువస్తువులను తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 147. (తె. 3).

టాప్: స్ప్రేయర్ విడిభాగం. (కో. 8).

టాప్‌అండీలు: (< ఇం.Top handle) చూ. టాపు హాండిలు. (రా. 6).

టాప్‌హోల్‌మిషను: (< ఇం. Top hole machine) చూ. పర్యా. టాకి[4]. బీరువాపనిలో మరలు బిగించడానికి డబ్బాపై రంధ్రాలు వేయడానికి వాడే 'T' ఆకారపు పరికరం. (రా. 7).

టాపు[1]: పర్యా. టోపను[1], టోపి[1], డిప్ప, లైటు టోపను. పెట్రొమాక్స్ లైటును వెలిగించడానికి లైటుపైభాగాన అమర్చిన పరికరం. (తె. 22).

టాపు[2]: పర్యా. టాంకి[2]. బీరువా, డబ్బా, డ్రమ్ము, పెట్రొమాక్స్‌లైటు వగైరా లోహపువస్తువుల పైభాగం. (కో. 2; రా. 1, 4. 6, 7).

టాపు[3]: రూ. ట్యాపు. చూ. పర్యా. టాకి[4]. మరలు బిగించడానికి బీరువా పనిలో వాడే 'T' ఆకారపు పరికరం. చూ. చిత్రం. (కో. 4, 11, 17, 19, 23; రా. 10, 11, 15).

టాపుసెట్: (< ఇం. Top Set). ఉ. టాప్‌సెట్. చూ. పర్యా. టాకి[4]. మరలు బిగించడానికి బీరువా పనిలో వాడే 'T' ఆకారపు పరికరం. (తె. 2, 26).

టాపుహాండిలు: (< ఇం. Top Handle). చూ. పర్యా. టాకి[4]. మరలు బిగించడానికి బీరువాపనిలో వాడే 'T' ఆకారపు పరికరం. (రా. 10).

టాంప్లేట్: (ఇం.) ఇనుప కడ్డీలను వంపుపెట్టడానికి ఉపయోగించే దిమ్మ. వెడల్పైన దిమ్మపై రెండు బద్దీలను 'U' ఆకారంలో అమర్చి ఉంటారు. (కో. 25).

టాయ్‌లెట్‌బాక్సు: (ఇం.) టాయ్‌లెట్ సామానులు ఉంచుకోడానికి ఉపయోగించే పెట్టె. (కో. 19, 22).

టారు ఉలి: పర్యా. నయం ఉలి. పాత్రను మెరుగు పట్టడానికి ఉపయోగించే పనిముట్టు. (రా. 2).

టార్చి: (ఇం.) పర్యా. ఓలరు, ఓల్డరు, హోల్డరువైరు. వెల్డింగు చేసేటప్పుడు వెల్డింగు కడ్డీని పట్టుకోడానికి వాడే పరికరం. (కో. 7, 20. 25, 27).

టార్చిలైటు: (ఇం.) పర్యా. చేతిబ్యాటరు, చేతిలైటు, బాటరి. చీకట్లో వెలుతురుకోసం వాడేలైటు. బ్యాటరీలు సహాయంతో వెలుగుతుంది. చూ. చిత్రం 114. (కో. 2; తె. 3, 4, 19, 22, 24).

టిక్కచేయు: (క్రి.) పాత్రను పాలీష్ చేయడం. (రా. 8).

టింకరుపని: (< ఇం. Tinker + పని). చూ. టినగర్‌పని. (కో. 20, 21; తె. 1, 3, 21, 22; రా. 10-12).

టింకరుసుత్తి: (< ఇం. Tinker + సుత్తి). పర్యా. నాటుసుత్తి. కొలిమిపనిలో చిన్నపనులు చేయడానికి వాడే పరికరం. (కో. 28)

టిజెల్లెడ: (< ఇం. Tea+జెల్లెడ). చూ. పర్యా. చాయగంటె. టీ వడగట్టుకోడానికి వాడే లోహపు పరికరం. (కో. 1).

టిస్టైనరు: (< ఇం. Tea Stunner). చూ. టీస్టన్నరు. (కో. 6).

టినగర్‌పని: (< ఇం. Tinker+పని). రూ. టింకరు పని, టిన్నిన్‌పని. చూ. పర్యా. షీప్‌మెటల్ వర్కు. లోహపుపాత్రలు రిపేరుచేసే పని. (తె. 22).

టినగర్‌వర్కు: చూ. పర్యా. షీప్‌మెటల్ వర్కు. లోహపుపాత్రలు రిపేరుచేసే పని. (తె. 24).

టిన్‌మేకరుపని: (< ఇం. Tin maker + పని).

చూ. పర్యా. షీట్‌మెటల్ వర్కు. లోహపు పాత్రలు రిపేరుచేసే పని. (కో. 27, 29).

టిన్‌మేకర్సువర్కు: చూ. పర్యా. షీట్‌మెటల్ వర్కు. లోహపుపాత్రలు రిపేరుచేసే పని. (కో. 22).

టిన్‌స్మితు: (ఇం.) చూ. పర్యా. షీట్‌మెటల్ వర్కు. లోహపుపాత్రలు రిపేరుచేసే పని. (కో. 23).

టిన్నిస్‌పని: చూ. టిన్‌గర్ పని, (రా. 15).

టిపన్‌కారేజి: చూ. పర్యా. టిఫెన్ క్యారీరు. టిఫను తీసుకెళ్ళడానికి వాడే పాత్ర. (కో. 26).

టిపిను¹: చూ. పర్యా. కడీడబ్బా. పొలందగ్గరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే పిడి, మూత ఉన్న పాత్ర. (తె. 3).

టిపను²: రూ. టిప్పను, టిఫెను. చూ. పర్యా. టిఫెన్‌క్యారీరు. టిఫను తీసుకెళ్లడానికి వాడేపాత్ర. (రా. 12, 14).

టిపనుప్లేటు: చూ. టిఫెన్‌ప్లేటు. (కో. 20).

టిపిన్ను: పర్యా. టికారేజి, టీ డబ్బా. టీ తెచ్చుకోడానికి వాడేమూత ఉన్న స్టీలుపాత్ర. చిన్నాపెద్ద సైజులుంటాయి.

టి పిల్టరు: చూ. టీ ఫిల్టరు. టీ వడగట్టడానికి వాడే పరికరం. (కో. 2).

టిపులేల్: బీరువాగోడలను వంపుపెట్టడాని వాడే పనిముట్టు. (తె. 20, 25).

టిప్పను: చూ. టిపను². (కో. 1).

టిఫిన్‌కారియరు: చూ. పర్యా. టిఫిన్‌క్యారీరు. టిఫిను తీసుకెళ్లడానికి వాడేపాత్ర. (తె. 4).

టిఫిన్‌డబ్బా¹: పర్యా. టిఫేన్‌బాక్సు. టిపను ఉంచుకోడానికి వాడే పరికరం. (తె. 12, 13).

టిఫిన్‌డబ్బా²: (< ఇం. Tiffin + డబ్బా). చూ. పర్యా. కడీడబ్బా. పొలం దగ్గరకు అన్నం తీసుకెళ్లడానికి వాడే పిడి, మూత ఉన్నపాత్ర. (తె. 20).

టిఫిన్‌బాక్సు: చూ. పర్యా. టిఫిన్‌డబ్బా¹. టిపను ఉంచుకోడానికి వాడే పరికరం. (కో. 8, 12; రా. 13).

టిఫిను: (బ). టిపిన్ను. చూ. టిపను². (కో. 1, 3, 7; తె. 21, 22, 25).

టిఫినులు: పాలు, పెరుగు ఉంచుకోడానికి వాడే గిన్నెలు. (తె, 8, 9).

టిఫెన్‌క్యారీ: చూ. పర్యా. టిఫెన్‌క్యారీరు. టిఫను తీసుకెళ్లడానికి వాడేపాత్ర. (తె. 10, 11).

టిఫెన్‌క్యారీరు: పర్యా. టిపన్‌కారేజి, టిపను, టిఫిన్‌కారియరు, టిఫెన్‌క్యారీ. టిఫను తీసుకెళ్లడానికి వాడేపాత్ర. (కో. 5; తె. 14, 16).

టిఫెన్‌ప్లేటు: ఉ. టిఫనుప్లేటు, టిఫిన్‌ప్లేటు. రూ. టిపనుప్లేటు, టిఫెన్‌ప్లేట్సు. పర్యా. సాదాటిఫిన్. టిఫిన్ తినడానికి ఉపయోగపడే స్టీలుప్లేటు. (కో. 20, 26; తె. 16; రా. 7).

టిఫెన్‌బాక్సు: చూ. పర్యా. కాలిడబ్బా. టిఫెన్ పెట్టుకోవడానికి వాడే బాక్సు. చూ. చిత్రం 115. (తె. 14).

టిఫెనుప్లేట్సు: చూ. టిఫెన్‌ప్లేటు. (తె. 14, 15).

టీఉట్టు: చూ. పర్యా. టీ స్టాండు. టీ గ్లాసులు తీసుకెళ్లడానికి వాడే పరికరం. (కో. 26).

టీకట్లి: (< ఇం. Tea Kettle). కమండలం ఆకారంలో ఉండేపాత్ర. టీ, పాలు వంచుకోడానికి వీలుగా మూతి ఉంటుంది. లోపల చెయ్యిపెట్టి కడుక్కోడానికి వీలుగా కాడకి మధ్యలో రంధ్రం ఉంటుంది. (కో. 19).

టీకారేజి: చూ. పర్యా. టిపిన్ను. టీ తెచ్చుకోడానికి వాడేమూత ఉన్న స్టీలుపాత్ర. (కో. 26, 30).

టీకెటిలు: చూ. పర్యా. చాయ్‌కేట్లి. టీ చేయడానికి వాడే పరికరం. (కో. 2, 15; తె. 21, 22; రా. 7).

టీక్యాను: కాచిన టీ లేదా కాఫీ ఉంచుకోడానికి వాడే లోహపుపాత్ర. పైనమూత. ప్రక్కల్లో పట్టుకోడానికి కాడ, టీ పోయడానికి కొమ్ములాంటి గొట్టం అమర్చి వుంటారు. చూ. చిత్రం 116. (రా. 3, 9, 11).

టీగ్లాసు: టీ, కాఫీ, పాలు తాగడానికి వాడే స్టీల్ గ్లాసు. (కో. 25; తె. 18).

టీచిక్కం: చూ. పర్యా. చాయగంటె. టీ వడగట్టుకోవడానికి ఉపయోగించే లోహపు పరికరం. (కో. 18).

టీజగ్గు: టీ చల్లార్చడానికి వాడే పాత్ర. (కో. 30).

టీజార: చూ. టీజాలి. (కో. 25).

టీజాలి: చూ. టీజార. చూ. పర్యా. చాయగంటె. టీ వడగట్టడానికి ఉపయోగించే లోహపు పరికరం. (కో. 23, 30; తె. 17).

టీటిఫిన్: చూ. పర్యా. టిపిన్ను. టీ తెచ్చుకోడానికి వాడే మూతఉన్న స్టీలుపాత్ర. (కో. 2).

టీడబ్బా: చూ. పర్యా. టిపిన్ను. టీ తెచ్చుకోడానికి వాడే మూతఉన్న స్టీలుపాత్ర. (కో. 4).

టిపిడిబ్బా: పర్యా. లలితజాడి. పిండి పదార్థాలు, పప్పులు వగైరా నిలువ ఉంచుకోడానికి వాడే పరికరం. (కో. 1, 5).

టీపొయ్యి: టీ తయారుచేయడానికి వాడే సాధనం. (కో. 26).
టీఫిల్టరు: (< ఇం. Tea filter) రూ. టీ పిల్టరు. చూ. పర్యా. చాయగంటె. టీ వడగట్టడానికి వాడే పరికరం. (కో. 24).
టీమగ్గు: (< ఇం. Tea mug) రూ. టీ మగ్సు. టీ తయారుచేయడానికి ఉపయోగించే పరికరం. (రా. 16).
టీమగ్సు: చూ. టీ మగ్గు. (తె. 15).
టీస్టన్నరు: రూ. టీస్టైనరు. చూ. పర్యా. చాయగంటె. టీ వడగట్టడానికి ఉపయోగించే పరికరం. (తె. 15, 16).
టీస్టాండు: పర్యా. చాయ్‌స్టాండు, చాయకచీక, చాయ చిక్కా, జాలు టీ ఉట్టి. టీ గ్లాసులు తీసుకెళ్ళడానికి వాడే పరికరం. (కో. 14, 15; తె. 22; రా. 7).
టీస్పూను: రూ. టీ స్పూన్సు. టీ పొడి వేసుకోడానికి వాడే చిన్న గరిట. (కో. 1; తె. 11, 16).
టీస్పూన్సు: చూ. టీ స్పూను. (కో. 10, 14, 15).
టుంగు: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండాపట్టి ఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (తె. 19; 22).
టుంగుమొద్దు: చూ. తుంగుమొద్దు. (తె. 18, 21).
టూగుకరవాయి: పర్యా. టెల్లికరవాయి. తయారైన లోహపు వస్తువులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 117. (రా. 1).
టూబ్: (< ఇం. Tube) సైకిల్ రిపేరుచేయడానికి వాడే గ్యాస్‌టూబు. (కో. 7).
టూలు: రేకును వంచి పాత్ర ఆకారం తయారు చేయడానికి వాడే పరికరం. (రా. 8).
టెక్రాలిచెంబు: పైభాగం గుండ్రంగ, క్రిందిభాగం చదరంగ ఉండి, నీళ్ళు త్రాగడానికి వాడే ఇత్తడి పాత్ర. (కో. 26).
టెంక: కొలకుండ అడుగుభాగపు రేకు. (తె. 24).
టెంకె[1]: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపులా పిడి అమర్చిన గోళంలాంటి లోహపుపాత్ర. చూ. చిత్రం 163. (తె. 7).
టెంకె[2]: చూ. పర్యా. గమేలం. ఇటుకలు, రాళ్లు, మట్టి. వగైరా మోయడానికి వాడే ఇనపపాత్ర. (తె. 24).
టెప్పు: ఇనపపొయ్యి(లు) తయారు చేయడానికి వాడే పెద్ద ఇనుప చీల. (తె. 10, 11).
టెంపర్‌ఎక్కించు: (క్రి.) (< ఇం. Temper + ఎక్కించు) పర్యా. టెంపర్ తగ్గు, టెంపర్‌పెట్టు, టెంపరించు, దోకుపేయు, నీళ్ళతాపు, పదునుచేయు, పదునుతాపు, పదునుపెట్టు, పదునుమోపు, పదును వేయు. కాల్చి తయారుచేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్ళలో వేయడం. (కో. 27).
టెంపర్‌డౌన్‌చేయు: (< ఇం. Temper down + చేయు). పాత్రను తయారు చేయడానికి, కురే మెత్తబడడానికి కొలిమిలో ఎర్రగా కాల్చడం. (తె. 3).
టెంపర్‌తగ్గు: (క్రి.) (< ఇం. Temper + తగ్గు) చూ. పర్యా. టెంపర్ ఎక్కించు. కాల్చి తయారు చేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్లలో వేయడం. (రా. 7).
టెంపర్‌పెట్టు: (క్రి.) (< ఇం. Temper పెట్టు) చూ. పర్యా. టెంపర్ ఎక్కించు. కాల్చి తయారు చేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్లలో వేయడం. (కో. 18, 25, 26; తె. 4).
టెంపరించు: (క్రి.) (< ఇం. Temper + ఇంచు) చూ. పర్యా. పర్యా. టెంపర్‌ఎక్కించు. కాల్చి తయారుచేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్ళలో వేయడం. (తె. 5, 17, 18, 21).
టెంప్లేటు: పర్యా. పేటుదాగలి. ప్లాట్‌ఫారం, ప్లేటు[1], బెండింగ్‌ప్లేటు[1], మొద్దు[2], రేకు[4], లెవలింగ్‌ప్లేటు, షీటు. ముందుగ డిజైను గీయడానికి వెల్డింగ్‌పనిలో వాడే లోహపురేకు. (కో. 20).
టెల్లికరవాయి: చూ. పర్యా. టూగుకరవాయి. తయారైన లోహపు వస్తువులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 117. (కో. 2; రా. 1, 5).
టేక్సాచెంబు: మరచెంబులాగా వుంటుంది. నీళ్ళు త్రాగడానికి ఉపయోగం. ఇందులో పైజాలుంటాయి. (కో. 1).
టేపర్: (< ఇం. Taper) వంకరటింకర ఉండే ఇనుపపట్టి (తె. 18).
టేపు[1]: (< ఇం. Tape) రూ. టేబు. లోహపు రేకులపై, కడ్డీలపై కొలతలు తీయడానికి వాడే పరికరం. (కో. 2, 4, 5, 9, 10, 12, 15, 17, 21–28; తె. 1, 2, 4, 6, 8, 14–17, 21, 24, 25; రా. 4, 7, 8, 10).
టేపు[2]: చూ. పర్యా. గుడ్డటేపు, గుడ్డలు కొలతలు తీయడానికి ఉపయోగపడే స్కేలు. చూ. చిత్రం 118.

(తె. 3, 20, 21, 23).

టేపు[2]: ఖూసినపుడు గొడుగుగుడ్డను కట్టిఉంచే రబ్బరు ముక్క. (కో. 26).

టేబు: చూ. టేపు[1]. (రా. 2).

టేబుల్ : లోహపుసామాన్లు రిపేరి చేసేటప్పుడు ఉపయోగించే ఎత్తయిన సాధనం. (తె. 3).

టేబుల్‌గ్రైండరు: వెల్డింగ్ అతుకులను, బొడిపెలను సాపుచేయడానికి వాడే యంత్రం. టేబుకు అమర్చి వుంటుంది. (తె. 19).

టేబుల్‌డీసు: (< ఇం. Table Dish). ఉ. టేబిల్‌డీస్. చూ. పర్యా. కూరగాయ గిన్నె. చేసిన వంటకాలను టేబిల్‌పై ఉంచుకోడానికి వాడే మూత ఉన్న పాత్ర. (కో. 1, 2).

టేబుల్‌మంగన్: కుట్టుమిషన్ సామాన్లు గట్టిగ పట్టుకోడానికి ఉపయోగపడే పరికరం. (రా. 6).

టేబుల్‌స్టాండు: డైనింగ్ టేబిల్‌పై పాత్రలుంచుకోడానికి వాడే చిన్నదిమ్మ. ఒక రింగుకు నాల్గుకాళ్ళు బిగించి ఉంటారు. (తె. 1).

టేబుల్‌స్పూను: చూ. పర్యా. గరిట. టేబుల్‌పైన ఉండే పొడిపదార్థాలను వేసుకోడానికి వాడే చిన్న గెరిట. (కో. 6, 11; తె. 5).

టైపరం: రేకుకు కాటుపెట్టడానికి వాడే సాధనం. (రా. 15).

టైర్‌బెల్ట్: సానరాయి తిరగడానికి రిమ్‌ద్వారా రాయికి తగిలించిన రబ్బరుపట్టి. (తె. 21).

టైర్‌లివర్సు: (< ఇం. Tyre livers). రూ. టైలవర్లు. పర్యా. లివరు[2]. సైకిల్‌టైర్లు ఊడదీయడానికి వాడే కడ్డీలాంటి పరికరం. (కో. 3).

టైలర్‌కత్తెర: (< ఇం. Tailor + కత్తెర). చూ. పర్యా. గుడ్డకత్తెర. గుడ్డలు కత్తరించడానికి టైలర్ ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 78. (కో. 22; తె. 2, 22, 23).

టైలర్‌సిజరు: చూ. పర్యా. గుడ్డకత్తెర. గుడ్డలు కత్తరించడానికి టైలరు వాడే సాధనం. చూ. చిత్రం 78. (కో. 24; తె. 21; రా. 16).

టైలవర్లు: చూ. టైర్ లివర్సు. (రా. 8).

టైస్క్వయరు: చూ. పర్యా. చిన్న మూలమట్టం. లోహపురేకులు లెవల్‌కు కొలత వేయడానికి వాడే పనిముట్టు. (కో. 7).

టొంకె: పొలాల్లో గడ్డి గోక్కోడానికి వాడే సాధనం. (కో. 16).

టోకరు: (ఉర్దూ.) చూ. పర్యా. గమేలం. ఇటుకలు, రాళ్ళు, మట్టి మోయడానికి వాడే ఇనపపాత్ర. (తె. 23).

టోచన్: బ్యాటరీ గడ్డను రిపేరుచేసే పనిముట్టు. (తె. 2).

టోప్: రూ. టోప్పు. చూ. పర్యా. కూరగిన్నె. లోతు కలిగిన చిన్నగిన్నె. చూ. చిత్రం 64. (కో. 1).

టోప్‌గిన్నె: చూ. పర్యా. కూరగిన్నె. లోతుగా ఉన్న చిన్నగిన్నె. చూ. చిత్రం 64. (కో. 6).

టోపను[1]: (< ఇం. Topan) చూ. పర్యా. టాపు[1]. పెట్రొమాక్స్ లైటును వెలిగించడానికి లైట్ పైభాగాన అమర్చిన పరికరం. (తె. 3, 18, 21, 23, 24).

టోపను[2]: చూ. పర్యా. కప్పు[2]. గుడ్డ జారిపోకుండా, నీళ్ళు దిగకుండా ఉండడానికి గొడుగు పైభాగాన అమర్చిన చిన్నరేకు తొడుగు. (కో. 28; తె. 1, 2, 4-6, 17, 19, 21, 23-25; రా. 11, 15).

టోపి[1]: చూ. పర్యా. టాపు[1]. పెట్రొమాక్స్‌లైటు మెంటల్ రక్షణకు ఉపయోగపడే పరికరం. చూ. చిత్రం. (తె. 24).

టోపి[1]: ఉ. టూపి. చూ. పర్యా. కప్పు[2]. గుడ్డ జారిపోకుండా, నీళ్ళు దిగకుండా ఉండడానికి గొడుగు పైభాగాన అమర్చిన చిన్నరేకు తొడుగు. (కో. 18, 26, 28-30; తె. 20).

టోపుకవరు: పర్యా. పెంకు, మూతరేకు[2], మూస ముక్క, రేకు[5]. కాకపోకుండ కొలిమిపై మూతకు వాడేరేకు. (కో. 26).

టోప్పు: చూ. టోప్. (కో. 1).

టోస్టర్: చూ. పర్యా. నిమ్మకాయచెక్క. నిమ్మకాయల రసం తీయడానికి వాడే సాధనం (తె. 10).

ట్యూబు: చూ. పర్యా. కట్టె. ఛత్రికి ఆధారమైన పొడవాటి కడ్డీ. (తె. 6).

ట్రంకుపెట్టె: పర్యా. బట్టలపెట్టె. వస్తువులు పెట్టుకోడానికి వాడేపెట్టె. చూ. చిత్రం 119. (కో. 2, 28; తె. 17; రా. 17).

ట్రాన్స్‌ఫారం: రూ. ట్రాన్స్‌ఫార్మర్, ట్రాన్ఫారం. పర్యా. వెల్డింగ్ ట్రాన్స్‌ఫరం, వెల్డింగ్‌ప్లాంటు, వెల్డింగ్‌మిషను. ఇనుపరేకులను, కడ్డీలను వెల్డింగ్ చేయడానికి వాడే యంత్రం. (కో. 20).

ట్రాన్స్‌ఫార్మర్: చూ. ట్రాన్స్‌ఫారం. (తె. 18, 25).

ట్రాన్ఫారం: చూ. ట్రాన్స్‌ఫారం. (రా. 10).

ట్రికుల్లు: చిన్న అండా పాత్రలు. (తె. 8).

ట్రే[1]: రూ. ట్రై, ట్రేటీ. చూ. పర్యా. కిష్టిల్. ఆహార

పదార్థాలు సరఫరా చేయడానికి, శుభకార్యాల్లో వస్తువులు తీసుకెళ్ళడానికి వాడేపాత్ర. చూ. చిత్రం 55. (కో. 4, 9, 15, 20, 24, 28; తె. 10, 11, 18).
ట్రే[2]: స్పిన్నింగ్‌మిషన్‌లో వచ్చిన ఆకారాన్ని పాత్ర లాగా తయారుచేసే పరికరం. (కో. 5).
ట్రై: చూ. ట్రే[1]. (రా. 5, 14).

## డ

డకారం: చూ. టకారము. (కో. 1).
డక్కన్[1]: (< హిందీ) చూ. పర్యా. కాప్. టార్చి లైట్ గొట్టాన్ని మూయడానికి అమర్చిన బిరడ. (తె. 2).
డక్కన్[2]: పర్యా. డబరా, డబ్రాగిన్నె, డాక[1]. నీళ్ళు కాచడానికి, అన్నం చేయడానికి వాడే వెడల్పు మూతి ఉన్న లోహపుపాత్ర. (తె. 12, 13).
డక్కను[1]: ఉ. డెక్కన్. చూ. పర్యా. కవరు[3]. పాత్రలపై మూతగా వాడే పళ్లెం. (తె. 4, 6, 7).
డక్కను[2]: ట్రంకుపెట్టె మూతరేకు. (తె. 6).
డక్కి[1]: చూ. పర్యా. కుక్కారు. బండి చక్రానికి కమ్ములను ఎక్కించడానికి వాడే సాధనం. (కో. 20, 21, 24).
డక్కి[2]: చూ. పర్యా. జత. వాయి, జవ్వ కలిసిన బిందెభాగం. (కో. 27).
డంగ: రూ. దాగు[1]. చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు. కడ్డీలు వంపు పెట్టడానికి వాడే దిమ్మ. (కో. 23).
డచ్‌వాల్ పోగర: డీజైన్‌లో ప్రక్కప్రక్క వచ్చిన రెండుగీతలను ఒకేసారి చెక్కడానికి చెకనంపనిలో ఉపయోగించే పరికరం. (తె. 25).
డగ్గా: పర్యా. గనగ. ఇనుపకడ్డీలను వంపుపెట్టడానికి వాడే పెట్టెలాగా ఉండే పరికరం. (కో. 28).
డబరా: ఉ. డబ్రి. చూ. పర్యా. డక్కన్[2]. నీళ్ళు కాచడానికి, వంటచేయడానికి వాడే వెడల్పు మూత ఉన్న లోహపు పాత్ర. (7, 13).
డబరాగిన్నె: చూ. పర్యా. డక్కన్[2]. నీళ్ళు కాచ దానికి, వంట చేయడానికి వాడే వెడల్పు మూతి ఉన్న లోహపు పాత్ర. (తె. 24).
డబరామూత: చూ. పర్యా. కవరు[3]. పాత్రలపై మూతగా వాడే పళ్ళెం. (రా. 7).
డబల్‌గ్లాసు: చూ. పర్యా. డబల్ టమ్మరస్. కాఫీ, పాలు త్రాగడానికి వాడే లోతు తక్కువ మందం ఎక్కువ ఉన్న స్టీలు గ్లాసు. (కో. 4, 6).
డబల్‌టమ్మరస్: చూ. పర్యా. డబల్‌గ్లాసు. కాఫీ, పాలు తాగడానికి వాడే లోతు తక్కువ మందం ఎక్కువ ఉన్న స్టీలుగ్లాసు. (కో. 1).
డబల్ టిఫన్‌బాక్సు: టిఫన్ తీసుకెళ్ళడానికి వాడే హాండిల్ అమర్చిన రెండుకప్పుల పాత్ర. (తె. 20).
డబల్‌ఫోల్డింగు: పర్యా. డబల్‌స్టోను, మలకట్. రేకు అంచుమడుపులను ఒకదానిలో ఒకటి ఎక్కించి గట్టిగచేసిన బిగింపు. (తె. 21).
డబల్‌స్టోను: చూ. పర్యా. డబల్‌ఫోల్డింగు. రెండు రేకులను కలిపి ఒకటిగావేసిన మడత. (కో. 21).
డబుల్ క్యారేజి: ఇద్దరికంటె ఎక్కువమందికి అన్నం తీసుకొనివెళ్ళడానికి ఉపయోగపడే సాధనం. (కో. 15).
డబుల్‌డక్కర్: చూ. పర్యా. కూరగాయగిన్నె. చేసిన వంటకాలను టేబిల్‌పై ఉంచుకోడానికి వాడే మూతఉన్న పాత్ర. (కో. 6).
డబుల్ పంచింగ్‌మిషన్: కాగితానికి ఒకవైపున ఒకేసారి రెండు రంధ్రాలువేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 120. (రా. 3, 5, 8, 11).
డబుల్‌సుత్తి: (< ఇం. Double + సుత్తి). ఉ. డబల్ సుత్తి. చూ. పర్యా. సమ్మెట. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాగ్గొట్టడానికి వాడే పెద్ద సైజు సుత్తె. (కో. 6, 8, 10, 12).
డబ్బా[1]: పర్యా. ఉబ్బుడబ్బా, డీపుడబ్బా, దినుసుడబ్బా, పప్పుడబ్బా, పసుపులడబ్బా, పాలిష్‌డబ్బా, పిండి డబ్బా, పౌడుగుడబ్బా, పౌడర్‌బాక్సు[2], రొట్టెడబ్బా. పప్పులు, పిండి వగైరా పదార్థాలు నిల్వ ఉంచుకోడానికి వాడే మూతఉన్న లోహపు పాత్ర. చూ. చిత్రం 121. (కో. 3, 4, 9-11, 16, 18, 19, 22, 23, 26, 30; తె. 28-10, 12-18, 23; రా. 8, 11-13, 15).
డబ్బా[2]: పర్యా. డొక్కు[4]. మేకులు, రివిట్లు, నట్లువేసి ఉంచుకోడానికి వాడే రేకుపాత్ర. (కో. 24).
డబ్బా[3]: జొట్లు, సాదు ఉంచుకోడానికి వాడే పరికరం. (కో. 4).
డబ్బా[4]: బియ్యం కొలవడానికి ఉపయోగపడే కొలత పాత్ర. (తె. 2, 4).
డబ్బాగిన్నె: చూ. పర్యా. దబరాగిన్నె[3]. పొలాల్లోకి అన్నం తీసుకెళ్ళడానికి వాడే మూత-చిలుకు అమర్చిన పాత్ర. (తె. 1, 7).
డబ్బాటిఫెను: (< డబ్బా + ఇం. Tiffin). టిఫెన్

ఉంచుకోడానికి వాడే చిన్న లోహపుపాత్ర. (కో. 13, 15).

డబ్బారేకు: పర్యా. డోము[1]. మంటపైకి ఎగరకుండా కొలిమి పైభాగంలో మూతగా ఉంచడానికి వాడే రేకు. (రా. 2).

డబ్బాసెట్టు: (డబ్బా+ఇం. Set). రూ. డబ్బాసెట్లు. వస్తువులు నిల్వ ఉంచుకోడానికి వాడే లోహపు పాత్ర. పైజువారిగ ఉంటాయి. (కో. 24).

డబ్బాసెట్లు: చూ. డబ్బాసెట్టు. (కో. 2).

డబ్బీ: మరకూజాలపై పెట్టడానికి పాలమట్టితో తయారుచేసిన మూత. (రా. 2).

డబ్బులసుత్తి: చూ. పర్యా. మెరకసుత్తె. రెండోసారి ఇంకా సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 5).

డమ్మి: చూ. పర్యా. గుల్లమోపు. లోహపురేకులపై, పట్టీలపై సులువుగ రంధ్రాలు వేయడానికి వాడే దిమ్మ. (కో. 23).

డల్లింగ్‌చేయు: (క్రి.) ముక్కు పూర్తిగ పోకుండ బీరువాను నీళ్ళతో కడుగుతూ షైనింగ్ తేవడం. దీని తర్వాతనే రంగువేస్తారు. (తె. 20).

డల్లుచేయు: (క్రి.) డిజైన్‌గీసిన ఇత్తడిరేకును విగ్రహ ఆకారం కనపడేటట్లు చేయడం. డిజైన్ తప్ప మిగిలిన ఖాళీభాగాన్ని అణగగొట్టడం. (తె. 17).

డల్లుమొల: చూ. పర్యా. చుక్కపోగరు. విగ్రహం రేకుపై చుక్కలు కొట్టడానికి వాడే పరికరం. (తె. 17).

డాక[1]: చూ. పర్యా. డక్కన్[2]. నీళ్ళు కాచడానికి, వంట చేయడానికి వాడే వెడల్పు మూతి ఉన్న లోహపుపాత్ర. (కో. 15).

డాక[2]: ఉ. డాకా. చూ. దాక. (కో. 7, 8, 10, 12, 16-18; తె. 3, 5, 21, 22, 24; రా. 14).

డాకలకరవాయి: చూ. దేక్సాకరవాయి. (కో. 14).

డాకలా: చూ. పర్యా. కొమ్ముదాకలి. ఇనుపప్లాట్లు తట్టుకోడానికి వాడే దిమ్మ. (రా. 2).

డాకలి[1]: ఉ. డాకల, డాకిల. రూ. డాగల. చూ. పర్యా. చట్రం[1]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 3-6, 9, 12; తె. 1-4, 6, 12. 17-19, 21, 22, 23, 25).

డాకలి[2]: పర్యా. పటం. టంకరపనిలో రేకులు కత్తిరించడానికి వాడే సాధనం. (కో. 3).

డాకలి[3]: చెంబుల అడుగులు, గొంతులు సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 8; తె. 3).

డాకలి[4]: చూ. దాగలి[1]. (కో. 5, 7, 12).

డాకలి[5]: ఎద్దుకాళ్ళకు లాడంకొట్టడానికి ఉపయోగించే త్రిభుజాకారపు లేదా రౌండు పనిముట్టు. రా. 3, 6, 7).

డాకలిమొద్దు: పర్యా. పాదెట్టి. పనిచేసేటప్పుడు డాకలిని కదలకుండ బిగించడానికి ఉపయోగపడే కొయ్య. (తె. 19, 25).

డాకిలి: పర్యా. సాల్డ్రింగ్‌డాకిలీ. ఇనపవస్తువులు తయారుచేయడానికి వాడే ఇనపకడ్డీ. (రా. 6).

డాగల: చూ. డాకలి. (కో. 17).

డాగలగునపం: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగు భాగాలు సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 83. (కో. 12).

డాగు[1]: చూ. డంగ. (కో. 17, 18).

డాగు[2]: సలాకలు సక్కచేయడానికి వాడే కమ్మి. ఈ కమ్మికి రెండు కొమ్ములలాగా సీలలుంటాయి. (తె. 15).

డాగు[3]: పర్యా. డొంక[2], డొలక[1]. లోహపుపోతపై ఉండే రంధ్రం. (కో. 8).

డాబరు: చూ. డాంబరు. రా. 15).

డాబు: పర్యా. నడికట్టు, బాత్, రోకు. ట్రంకుపెట్టె మూత వంగకుండ లోపలి భాగంలో కొట్టిన నిలువు రేకు. (తె. 17).

డామరు: బకెట్లు అతికిన తర్వాత పైభాగాన పూసే నల్లని పదార్థం. (రా. 12).

డాంబరు: రూ. డాబరు. పర్యా. అట్టెం, లక్క, లక్కట్టు, పాడకీలు. బిందెను సుంగడి మోపుకు అంటించడానికి వాడే జిగురు పదార్థం. (తె. 1, 3-5), 24, 25).

డాలుసుత్తె: చూ. పర్యా. డొల్కసుత్తె. రేకును దొడ్డుచేయడానికి వాడే పరికరం. (తె. 17).

డాల్డడబ్బా: (< ఇం. Dalda + హిం. డబ్బా) ఉ. డాల్డడబ్బా, డాల్డీడబ్బా, డాల్డాడబ్బి. నూనె, నెయ్యివంటి ద్రవ పదార్థాలను నిల్వ ఉంచుకోడానికి ఉపయోగించే మూత ఉన్న లోహపుపాత్ర. (కో. 1, 3, 6, 8, 10, 11, 21, 27).

డిగోడ: చెక్కపెట్టె తయారుకు వాడే పరికరం. (తె. 9).

డిజైన్‌గరిట: (< ఇం. Design + గరిట). చూ. పర్యా. గిరిజల స్పూను. టి పొడి వేసుకోడానికి వాడే చిన్నగరిట. (తె. 11).

డిజైన్‌రైన్‌స్పూను: చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే సాధనం. (కో. 6).

డిజైను[1]: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపు పెట్టడానికి వాడే దిమ్మ. (రా. 6).

డిజైను[2]: చూ. పర్యా. కానా. డిజైను ఫ్రేములో ఉండే ఒక్కొక్క డిజైను అర. (రా. 8).

డిజైనుపట్టి: సైకిల్ బాక్సుకు, ట్రంకుపెట్టెకు డిజైను కొట్టడానికి వాడే రంపపుపట్టి. (రా. 7, 8).

డిజైనుపరాతం: (< ఇం. Design + పరాతం) చూ. పర్యా. పరాతం. శుభకార్యాల్లో వస్తువులు తీసుకెళ్ళడానికి, పిండి కలపడానికి, వేడివస్తువులు చల్లార్చడానికి వాడే వెడల్పుపాటి పళ్ళెం. చూ. చిత్రం 150. (రా. 7).

డిజైనుపుస్తకం: చూ. పర్యా. కాట్‌లెటరు. డిజైన్లను తయారుచేయడానికిఉపయోగించే బొమ్మలపుస్తకం. (తె. 23; రా. 2).

డిజైనుపోగరు: చూ. పర్యా. గుజారను. విగ్రహంపై డిజైను కొట్టడానికి వాడే పరికరం. (కో. 8).

డిజైనుప్లేటు: చూ. పర్యా. కవరు[3]. పాత్రలపై మూతగా వాడే పళ్ళెం. (కో. 2, 12, 13, 15, 25, 29).

డిజైనువర్కు: చూ. పర్యా. గ్రిల్‌వర్కు. వెల్డింగ్ డిజైన్లుచేసి ఇనుంతో గేట్లు, కిటికీలు, వరండా వగైరాలు తయారుచేసే పని. (16, 29).

డిన్నర్‌ట్రే: చూ. పర్యా. కుటకల కంచం. డిన్నర్ ట్రేసు, డిన్నర్ ప్లేటు కూరలు వేసుకోవడానికి ఉపయోగపడే గుంటలుకలిగిన లోహపు భోజన పాత్ర. చూ. చిత్రం 57. (కో. 3, 4, 6, 8, 9, 11, 12, 15, 12).

డిన్నరుట్రేసు: చూ. డిన్నర్ ట్రే. (9, 12).

డిన్నర్‌ప్లేటు: చూ. పర్యా. కుటకల కంచం. కూరలు వేసుకోవడానికి వీలుగా గుంటలు అమర్చి చేసిన లోహపు భోజన పాత్ర. చూ. చిత్రం 57. (కో. 17; తె. 24).

డిప్ప[1]: పర్యా. పౌన్. గుడ్డ ఊడిరాకుండ గొడుగు పైభాగాన అమర్చిన చిన్న రేకు తొడుగు. (తె. 22).

డిప్ప[2]: పర్యా. డైల్. బల్బు వెలగడానికి వీలుగా బ్యాటరీ వెనక మూత లోపల అమర్చిన చిన్న తంతె. (తె. 23).

డిప్ప[3]: చూ. పర్యా. కుడక. టంకంపొడి వేసుకోడానికి వాడే పాత్ర. (కో. 19).

డిప్ప[4]: చూ. పర్యా. టూపు[1]. పెట్రొమాక్స్ లైటును వెలిగించడానికి లైట్ పైభాగాన అమర్చిన పరికరం. (తె. 3, 18, 23).

డివైడరు: (< ఇం. Divider) చూ. పర్యా. కంపర్ బాక్సు. లోహపు రేకుపై, పట్టీపై గుండ్రని గీతలు గీయడానికి వాడే పరికరం. (తె. 21).

డిష్: (< ఇం. Dish) రూ. డిస్సు. దిష్. చూ. పర్యా. కూరగాయ గిన్నె. చేసిన వంటకాలను టేబిల్‌పై ఉంచుకొనడానికి ఉపయోగపడే మూతగల పాత్ర. (కో. 19–23, 25, 29, 30; తె. 3, 5, 6, 18–20, 23, 25).

డిస్‌గ్లాసు: చూ. పర్యా. గ్లాసు[1]. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215. (కో. 19).

డిస్సు: (బ). డిస్సులు. చూ. డిష్. (కో. 4, 9; తె. 2, 8, 12–16).

డీచ్‌కొట్టు: (క్రి.) డబ్బా రెండంచులు కలిపి మడత వేయడం. (తె. 21).

డీప్‌ట్రే: తీపు పదార్థాలను నిల్వ ఉంచుకోడానికి వాడే వెడల్పుపాటి పళ్లెం. (కో. 23).

డీపుడబ్బా: ఉ. డీప్‌డబ్బా. చూ. పర్యా. డబ్బా[1]. పిండిపదార్థాలు ఉంచుకోడానికి వాడే లోహపుపాత్ర. చూ. చిత్రం 121. (కో. 6, 10, 11, 19; తె. 1).

డీపుప్లేటు: ఇడ్డీపాత్రలో ఉపయోగించే ఇడ్లీలప్లేటు. (రా. 14).

డీలక్స్‌జగ్గు: (< ఇం. deluxe jug). చూ. పర్యా. జగ్గు. నీళ్ళు ఉంచుకొనడానికి ఉపయోగించే డిజైన్ ఆకారంలో ఉండే మూతలేని లోహపుపాత్ర. చూ. చిత్రం 105. (కో. 6, 8, 10, 11).

డీలక్సు: చూ. పర్యా. చట్నీప్లేటు. చెట్నీ కూరలు వేసుకోడానికి పనికివచ్చే చిన్నపళ్లెం. (కో. 2).

డీసు: (బ.) డీసులు. మూతి వెడల్పుగా పింగాణీ పాత్రలాగా ఉండే నిలువుపాత్ర. చూ. చిత్రం 122. (కో. 2, 3).

డుంగ: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండా పట్టి ఉంచడానికి వాడే కొయ్యమొద్దు. (తె. 10, 11, 25).

డూం: (< ఇం. dome). పర్యా. రింగు[2], హెడ్. టార్చిలైట్ బల్బుచుట్టూ ఉండే అద్దం, పోకస్‌గిన్నె అమర్చిన మూత. (తె. 21, 23).

డూము: ఉ. డూమ్, డోము, డూము. చూ. పర్యా. అద్దం[1]. కంటికి రక్షణగా వెల్డింగుపనిలో వాడే

పరికరం. (కో. 13, 16, 17, 18, 19, 22, 23, 26, 27; తె. 2, 7, 17, 21, 22, 23, 24, 25).

డెకోరం: రూ. డెక్కోరాం. చూ. పర్యా. డెక్కకొరాం, డెక్కడాకలి, బిందెల అతుకులను మక్కు వేయ డానికి వాడే పనిముట్టు. దీనితల ఆవు కాలిగిట్ట ఆకారంలో ఉంటుంది. (తె. 19).

డెక్కకొరాం: పర్యా. డెకోరం, డెక్కడాకలి, డెక్కమొల, పట్టాకొరాం. పడిగదుండగ, పడిగమొల, పల్లగిద్దపార' రౌండుకొరాం. బిందెల అతుకులను మక్కు వేయడానికి వాడే పనిముట్టు. దీనితల ఆవు కాలిగిట్ట ఆకారంలో ఉంటుంది. (తె. 17, 19, 21, 22).

డెక్కడాకలి: చూ. పర్యా. డెక్కకొరాం. బిందెల అతుకులను మక్కు వేయడానికి వాడే పనిముట్టు. దీనితల ఆవు కాలిగిట్ట ఆకారంలో ఉంటుంది. (తె. 1, 3).

డెక్కమ్మి: చెంబులలోపల అడుగు నైసుగ రావడానికి ఉపయోగించే పరికరం. (కో. 19),

డెక్కసమ్మెట: చూ. పర్యా. సమ్మెట. పాత్రల బొద్దు కొట్టుకోడానికి వాడే పెద్దసైజు సుత్తి. (తె. 8, 9).

డెక్కమొల: చూ. పర్యా. డెక్కకొరాం. బిందెల అతుకులను మక్కు వేయడానికి వాడే పనిముట్టు. దీనితల ఆవు కాలిగిట్ట ఆకారంలో ఉంటుంది, (తె. 25).

డెక్కొరాం: చూ. డెకోరం. (తె. 21).

డెచ్: చూ. పర్యా. కావ్. టార్చిలైట్ గొట్టాన్ని మూయడానికి అమర్చిన బిరడ. (తె. 3).

డెప్ప: బుంగ పైభాగం. (కో. 8).

డేక్చా: చూ. డేక్షా. (తె. 19; రా. 13).

డేక్షా: రూ. డేక్చా, డేక్చి, డేక్సా, డేగిషా, డేషి. పర్యా. కలాయిడేక్షా, కాసన్‌డేక్షా, గంజు, దబరా[2], వలావ్ అండి, పలావ్‌డేక్షా, పెద్దరైస్ అండ, మంఘాల్, మరవై, సరప. వంటలు చేయడానికి వాడే లోహపుపాత్ర. ఏటవాలు భుజాలతో అడుగు భాగం వెడల్పుగ చదరంగా ఉంటుంది. అంచు వాలినట్లుగా అండా ఆకారంలో నిలువుగా ఉంటుంది. చూ. చిత్రం 123. (కో. 16, 26; తె. 3, 7, 14-23; రా. 12-16).

డేక్షాకరవాయి: చూ. డేక్షాకరవాయి. (రా. 16).

డేక్సా: ఉ. డేక్సీ. చూ. డేక్షా. (కో. 1-11); తె. 8, 9, 12-16; రా. 2, 3, 8, 9).

**డేక్సాకరవాయి:** రూ. డాకలకరవాయి, డేక్సాల కరవాయి, డేక్షాలకరవాయి, డేగిషలకరవాయి. పర్యా. డేక్సాలమట్టు కరవాయి, పవాల్‌డేక్సా కరవాయి, పెడకరవాయి. డేక్సాలు మెరుగు పెట్టడానికి వాడే పరికరం. (కో. 3; రా. 1).

డేక్సాగుల్ల: చూ. పర్యా. అకండం అడుగుభాగం లేని డేక్సా (కో. 14).

డేక్సాలకరవాయి: చూ. డేక్సాకరవాయి. (కో. 4, 8, 9, 11; రా. 9).

డేక్సాలమట్టు కరవాయి: చూ. పర్యా. డేక్సా కరవాయి. డేక్సాలు మెరుగు పరచడానికి వాడే పరికరం. (కో. 13, 14).

డేగిషలకరవాయి: చూ. డేక్సాకరవాయి. (తె. 3).

డేగిషా: చూ. డేక్షా. (కో. 19-22, 24, 24-29; (తె. 7, 25).

డేగిస: చూ. డేక్షా. (తె. 24).

డేవ్‌టోప్: లోతుగిన్నె. (కో. 8).

డేషి: చూ. డేక్షా. (కో. 26).

డ్రై[1]: చూ. పర్యా. గటంచి లోహపురేకులు, కడ్డీలు వంపు పెట్టడానికి వాడే దిమ్మ. (కో. 17, 18; తె. 3, 6, 18, 20, 21, 22, 25; రా. 3).

డ్రై[2]: చూ. పర్యా. కానా. డిజైన్ ఫ్రేములో ఉండే ఒక్కొక్క డిజైను అర. (రా. 12).

డ్రై[3]: ట్రంకుపెట్టె బొద్దె. (కో. 15).

డ్రై[4]: అల్యూమినియం కరిగేమూస. (రా. 7).

డ్రై[5]: కమ్మరంపనిలో కమ్ములకు మరలు వేయడానికి వాడే సాధనం. (కో. 14; తె. 12, 15).

డ్రై[6]: బిందెరేకులకు గుంతలు కొట్టడానికి వాడే పరికరం. (రా. 6, 7).

డ్రై[7]: పర్యా. డైస్. పాత్రను తయారుచేయడానికి వాడే కొయ్య అచ్చు. (కో. 26; రా. 14, 16).

డ్రై[8]: బీరువా తాళాల స్క్రూలు బిగించడానికి వాడే ట్యాపు (కో. 21).

డైఉలి: అల్యూమినియం పాత్రలను సైజులవారీగా తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 6).

డైకొట్టు: (క్రి). పెట్టెకు రేకు అడుగుభాగాల్లో వంపులు కొట్టడం. (రా. 8).

డైగరటి: రూ. డౌగరటి. చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికివాడే సాధనం. (కో. 11).

డైనింగు: బీరువా రేకును కొలతలప్రకారం చేసిన కత్తరింపు. (రా. 4).

డైపట్టి: పెట్టెకు రేకు అడుగుభాగాల్లో వంపులు కొట్ట

డానికి వాడే పనిముట్టు. (రా. 8).

డైపాన: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, పట్టీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (తె. 18).

డైబిట్స్: చిన్నచిన్న స్పేయర్ ముక్కలు. (కో. 8),

డైమన్‌కప్పు: చూ. పర్యా. చట్నిప్లేటు. చెట్నీ, కూరలు వేసుకోడానికి పనికివచ్చే చిన్న పళ్లెం. (కో. 1).

డైమీటరు: పర్యా. నచ్చోగం. డబ్బారేకు చుట్టుకొలత. (తె. 21).

డైల్: చూ. పర్యా. డిప్ప[2]. బల్బు వెలగడానికి వీలుగా బాటరివెనక మూత లోపల అమర్చిన స్ప్రింగు. (తె. 3).

డైస్: చూ. పర్యా. డై[4]. పాత్రను తయారుచేయడానికి వాడే కొయ్య అచ్చు. (కో. 8, 10; రా. 7).

డైస్‌సెట్టు: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే పరికరం. (రా. 3).

డొక్క[1]: రూ. డొక్కు[6], డోక, డోకి, డోకు. చూ. పర్యా. కాడగంటె. చలివేంద్రంలో నీళ్ళు పోయడానికి ఉపయోగించే పరికరం. చిన్న కప్పుకు పొడవాటి కాడ అతికించి ఉంటారు. చూ. చిత్రం 47. (కో. 27).

డొక్క[2]: నూనెవేసే కాడఉన్న చిన్న రేకుగిన్నె. దుకాణాల్లో వాడ్తారు. (కో. 26).

డొక్కు[1]: మంట బయటరాకుండ స్టౌచుట్టూ మూతగ వాడే సాధనం. (కో. 26).

డొక్కు[2]: ధ్వజస్తంభంకింద గుండ్రని రేకు భాగం. (కో. 28).

డొక్కు[3]: అచ్చును చేయడానికి వాడే కొయ్య అచ్చు. (కో. 29).

డొక్కు[4]: చూ. పర్యా. డబ్బా[2]. పనిముట్లను ఉంచుకోడానికి వాడే పెట్టె. (కో. 24, 26).

డొక్కు[5]: చూ. పర్యా. గచ్చు. వేడిగాఉన్న లోహపు వస్తువులను చల్లపరచడానికి ఉపయోగపడే నీటి పాత్ర. (కో. 29).

డొక్కు[6]: చూ. డొక్క[1]. (కో. 16).

డొంక[1]: చూ. పర్యా. కన్నం. దీపం పైభాగంలోపెట్టే రంధ్రం. (రా. 15).

డొంక[2]: చూ. పర్యా. డాగు[3]. లోహపు పాత్రపైఉండే రంధ్రం. (రా. 2).

డొప్పకారు: చూ. పర్యా. గుబ్బకారు. చిన్న చిన్న వస్తువుల్ని పట్టుకోడానికి పనికివచ్చే పట్టకారు. మేకులు పీకడానికి, నట్లు తిప్పడానికి, సన్నకమ్మిని తెంచడానికి ఉపయోగం. (కో. 4, 9, 15).

డొప్పకొట్టు: (క్రి.) పర్యా. డోంగచేయు. రేకును పళ్లెంలాగ కొద్దిగ లోతుచేయడం. (తె. 21).

డొప్పపట్టుకార: చూ. పర్యా. గుబ్బకారు. చిన్నచిన్న వస్తువుల్ని పట్టుకోడానికి పనికివచ్చే పట్టుకారు. మేకులు పీకడానికి, నట్లు తిప్పడానికి, సన్నకమ్మిని తెంచడానికి ఉపయోగం. (రా. 10).

డొప్పసుత్తి: కడవ మూతిభాగం కొట్టడానికి వాడే పరికరం. (కో. 6).

డొలక[1]: చూ. పర్యా. డాగు[3]. లోహపు పాత్రపై ఉండే రంధ్రం. (కో. 29).

డొలక[2]: ఉ. డొల్క. చూ. పర్యా. అడ్డ. బిందె మధ్య భాగపురేకు. (కో. 1, 8; తె. 5, 8, 12, 17, 22; రా. 7, 9, 16).

డొలక[3]: అడ్డ[1], మడ, గల్ల కలిపిన లోహపుపాత్ర ఆకారం. (తె. 14, 16).

డొలచుట్టు: రూ. డొలసుట్టు. చూ. పర్యా. గుల్లమోపు. లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడేదిమ్మ. (తె. 5, 6, 9, 12).

డొలచేయు: (క్రి.) పర్యా. డొలపెట్టు, దుంకపొడుచు, దుంకవేయు, దొండిపెట్టు. పిడి వేయడానికి వీలుగా ఇనప పనిముట్లకు రంధ్రాలు చేయడం. (కో. 25).

డొలదుక్క: రూ. దొలదుక్క. చూ. పర్యా. అడ మొద్దు. కరవాయిని కదలకుండ పట్టి ఉంచడానికి వాడే కొయ్యమొద్దు. (తె. 22).

డొలనట్టు: చూ. పర్యా. గుల్లమోపు. లోహపురేకులపై, పట్టీలపై సులువుగ రంధ్రాలు వేయడానికి వాడే దిమ్మ. (కో. 28).

డొలపెట్టు: (క్రి.) చూ. పర్యా. డొలచేయు. కాగిన ఇనప కడ్డీలపై బెజ్జాన్ని పెట్టడం. (కో. 29).

డొలపొగరు: చూ. పర్యా. చిన్నపొగరు. లోహపు రేకులపై, కడ్డీలపై చిన్నరంధ్రాలు కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 21).

డొలసుట్టు: చూ. దొలచుట్టు. (కో. 29, 50).

డొలుపు[1]: చూ. పర్యా. అడ్డ[1]. బిందె మధ్యభాగపు రేకు. (తె. 6).

డొలుపు[2]: పక్షికారంగా ఉండే ఇరుసు మధ్యభాగం. (తె. 21).

డొలుపు[3]: వంపుభాగం. (తె. 21).

డొలుపుకట్లు: ఇరుసు ఊడిరాకుండ బండికర్రకి ఇరువైపుల బిగించే కప్పులు. (తె. 23).

డొల్కకరవాయి: చూ. డొల్లల కరవాయి. (తె. 20, 22).

డొల్కచేయు: పర్యా. నమూనా తీర్చిదిద్దు, నీసుడు చేయు, భుజంపెట్టు, మలచు, లోతుచేయు. ఇత్తడి బిందె రేకులను ఒక ఆకారంగా మార్చడం. (తె. 7, 17, 19, 25).

డొల్కలాగ: బిందెడొల్కను పాలిష్ పెట్టడానికి వాడే పనిముట్టు. (తె. 21).

డొల్కసుత్తె: పర్యా. డొలుసుత్తె, బగులుసుత్తె, బరువు సుత్తి. బిందెడొల్కను తయారుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 22).

డొల్ల[1]: చూ. పర్యా. అడ్డ[1]. బిందె మధ్యభాగపు రేకు. (కో. 1; తె. 5, 12; రా. 9, 16).

డొల్ల[2]: చూ. పర్యా. జవ్వ[1]. గంగాళాల మూతిరేకు. (తె. 3).

డొల్లలకరవాయి: ఉ. డొల్లలుకరవాయి. రూ. డొల్క కరవాయి. లోహపుపాత్రల మధ్యభాగాన్ని సరిచేయ డానికి వాడే పరికరం. (తె. 12; రా. 9).

డొల్లిచ్చు: (క్రి.) పెట్టెను చేయడానికి పక్క రేకులతో పెద్దరేకుపై దొర్లిస్తూ కొలతవేయడం. (తె. 21).

డోక: చూ. డొక్క. (కో. 21).

డోకి: చూ. డొక్క[1]. (కో. 18, 22, 28).

డోకు: చూ. డొక్క[1]. (కో. 17, 19, 21, 22).

డోకు వేయు: (క్రి.) చూ. పర్యా. టెంపర్ ఎక్కించు. కాల్చి తయారుచేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్ళలో వేయడం. (కో. 20).

డోగన్‌చెంచా: చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించ డానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే పరికరం. (రా. 14).

డోంగ: ఉ. డోంగా. చూ. పర్యా. కొండిగిన్నె[1]. చలి వేంద్రంలో నీళ్ళు ఛోయడానికి వాడే సాధనం. (తె. 1, 3, 5, 6, 17, 25; రా. 7).

డోంగచేయు: (క్రి.) చూ. పర్యా. డొప్పకొట్టు. పాత్రల అడుగురేకును గుంతలాగ తయారు చేయడం. (తె. 3).

డోన్: పాత్రల కంఠం ముందుభాగం. (రా. 14).

డోము[1]: చూ. పర్యా. డబ్బారేకు. మంట పైకెగర కుండా కొలిమి పైభాగంలో మూతగా ఉంచడానికి వాడేరేకు. (కో. 26).

డోము[2]: మధ్యాహ్నం పల్లెప్రజలు అన్నం తినడానికి వాడే లోతుగిన్నె. (కో. 2).

డోర్‌పిన్ను: (< ఇం. door pin). బీరువా తలుపులు సులువుగా తిరగడానికి పైభాగాన అమర్చిన చిన్న కడ్డీలుగల పట్టి. (కో. 4, 11; తె. 20, 22).

డోర్‌హాండిలు: (< ఇం. door handle). పర్యా. హ్యాండిలు[1], బీరువాతలుపు తెరవడానికి, మూయ డానికి వీలుగా బీరువాతాళం పక్కన అమర్చిన వంపు సాధనం. (తె. 20).

డోరియాగిన్నె: చిన్న పలకలుండే చిన్న లోహపు పాత్ర. (కో. 11, 15, 18).

డోరియాగ్లాసు: బయటి ఆకారం (Shape). లోపలికి నొక్కబడి ఉండే నీళ్ళలోటా. (కో. 11, 15).

డోరియాచెంబు: సన్నని పలకఉండే మరచెంబు. (కో. 18).

డోరియాహరివేణం: దేవాలయాల్లో తీర్థం ఉంచుకో డానికి వాడే పలకలుగా ఉన్న హరివేణి పాత్ర. (కో. 12).

డోలుడ్రమ్ము: పర్యా. పీపాడ్రమ్ము. మంచినీళ్ళు నిల్వచేయడానికి క్రిందిభాగాన కొళాయి అమర్చిన వెడల్పయిన పెద్దపాత్ర. డోలు ఆకారంతోఉంటుంది. (కో. 22).

డౌగరటి: చూ. డైగరటి. (కో. 11).

డ్రమ్ము[1]: నిలువు లోహపు రేకుపాత్ర. (తె. 24, రా. 8, 16).

డ్రమ్ము[2]: చూ. పర్యా. కొలాయి. మంచినీళ్ళు నిల్వ ఉంచడానికి కిందిభాగాన కొళాయి అమర్చిన లోహపు పరికరం. చూ. చిత్రం 124. (కో. 5, 17, 19, 20, 22, 28, 29; రా. 13, 14).

డ్రస్సింగ్‌సైపు బీరువా: చూ. పర్యా. డ్రస్సింగు. బీరువాలో గుడ్డలు తగిలించడానికి, పెట్టుకోడానికి వీలుగా తయారుచేయబడిన భాగం. (తె. 24).

డ్రస్సింగు: (< ఇం. Dressing) పర్యా డ్రస్సింగ్ సైపు బీరువా. బీరువాలో గుడ్డలు పెట్టుకోడానికి, తగిలించడానికి వీలుగా తయారుచేయబడిన భాగం. (తె. 2).

డ్రాపొయ్యి: బొగ్గులపొయ్యి, కట్టెలపొయ్యి కలిసి ఉండే పొయ్యి. చూ. చిత్రం (రా. 11).

డ్రాయింగు[1]: (< ఇం. Drawing) కొలతలప్రకారం రేకును బొమ్మగా చేయడం. (రా. 5).

డ్రాయింగు[2]: కావలసినవిధంగా ఇనుపముక్కలను డిజైనులాగా వంచుకోవడం. (కో. 2).

డ్రిల్: (< ఇం. Drill) రూ. డ్రిల్లింగ్, డ్రిల్లు, డ్రిల్స్. పర్యా. డ్రిల్లుబిట్టు, పెద్దపోగరు, బిట్టు, బెజ్జా కడ్డి. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలు వేయ డానికి వాడే డ్రిల్‌మిషనులో త్రాడులాంటి మర కడ్డి. (తె. 8, 9, 15).

డ్రిల్ కీ: బిజ్జాలువేసే కడ్డీని బిగించడానికి వాడే పనిముట్టు. (రా. 16).
డ్రిల్ చెక్కు: చూ. పర్యా. కరెంటు డ్రిల్ మిషన్. లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే కరెంటు యంత్రం. (కో. 7; తె. 1).
డ్రిల్ బిట్స్: చూ. డ్రిల్లు బిట్టు. (కో. 5; రా. 7).
డ్రిల్ బూత్: చూ. పర్యా. కరెంటు డ్రిల్ మిషన్. లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే కరెంటు యంత్రం. (కో. 8).
డ్రిల్ మిషను: చూ. డ్రిల్లుమిషను. (కో. 13; తె. 8, 12, 13).
డ్రిల్లింగ్: చూ. పర్యా. కరెంటు డ్రిల్ మిషన్. లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే సాధనం. (కో. 4, 7; తె. 21, 22, 24).
డ్రిల్లింగ్ మిషను: రూ. డ్రిల్లుమిషను. పర్యా. స్టాండ్ డ్రిల్లింగ్ మిషను, స్టాండింగ్ మిషను, స్టాండు డ్రిల్లింగు. రేకుపై చిన్న చిన్న రంధ్రాలు వేసుకోడానికి ఉపయోగించే కరెంటు యంత్రం. (కో. 2, 4–6, 9, 11, 16, 17, 29; తె. 3, 14–17; రా. 2–9, 11–14).
డ్రిల్లింగ్ మోటారు: చూ. పర్యా. కరెంటు డ్రిల్ మిషన్. లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే సాధనం. (కో. 5).
డ్రిల్లు: చూ. డ్రిల్. (కో. 16–19, 21, 22, 26, 30).
డ్రిల్లుబిట్టు: రూ. డ్రిల్ బిట్స్. చూ. పర్యా. డ్రిల్. లోహపు రేకులపై కడ్డీలపై రంధ్రాలు వేయడానికి వాడే మరకడ్డీ. (తె. 1, 20; రా. 16).
డ్రిల్లుమిషను: చూ. డ్రిల్లింగ్ మిషను. (కో. 18–22, 26; తె. 4, 5, 17–20, 25; రా. 15, 16).
డ్రిల్లువర్కు: చూ. పర్యా. గ్రిల్ వర్కు. వెల్డింగ్ డిజైను చేసి ఇనుంతో గేట్లు, కిటికీలు, వరండాలు వగైరా వస్తువులు తయారుచేసే పని. (కో. 27).
డ్రిల్స్: చూ. డ్రిల్. (తె. 8. 9, 15).

## త

తక్కు: చూ. పర్యా. ఉడన్ హేమర్. రేకులను సాపు చేయడానికి వాడే పరికరం. (రా. 10).
తక్కుసుత్తి: చూ. పర్యా. ఉడన్ హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 5, రా. 1)
తక్కెడ: పర్యా. త్రాసు. చెంబులు, బిందెలు మొదలయిన లోహపు సామగ్రిని తూకం వేయడానికి వాడే సాధనం. ఇరువైపులా రెండు సిబ్బిలు దండేనికి గొలుసుల ద్వారా వ్రేలాడుతుంటాయి. చూ. చిత్రం 130. (రా. 3, 5, 8, 11).
తక్కెడజిబ్బిలు: త్రాసుకు ఇరువైపులా వ్రేలాడే కొంచెంలోతైన రెండుగుండ్రని ఇనపరేకులు. చూ. చిత్రం 130. (కో. 28).
తక్: అన్నంతిన్న తర్వాత చేతులు కడగడానికి వాడే సాధనం. (రా. 11).
తగడ్: (< హిం.) ఇత్తడిరేకు. (రా. 13).
తగడిటోపను: చూ. పర్యా. కప్పు[2]. గుడ్డ జారిపోకుండా ఉండానికి గొడుగుపై భాగాన అమర్చిన చిన్నరేకుతొడుగు. (రా. 14).
తగరం: చూ. పర్యా. రవ్వలో కలపడానికి, డబ్బా రేకులను అతకడానికి ఉపయోగపడే పదార్థం. మెత్తగా బరువెక్కువగా ఉంటుంది. (కో. 1, 3–5, 14, 15, 22, 23, 25, 27, 29; తె. 1, 3–6, 17, 19, 21–24; రా. 7, 12, 13, 15).
తగరంపని: చూ. పర్యా. షీట్ మెటల్ వర్కు. లోహపు పాత్రలు రిపేరు చేసేపని. (తె. 21).
తగిలించు[1]: (క్రి.) రూ. తగిలించు. చూ. పర్యా. జంటించు. రెండురేకులను జాయింట్ చేయడం. (కో. 5; తె. 12; రా. 5, 10).
తగిలించు[2]: (క్రి.) బీరువాపై లప్పం పూయడం. (తె. 2).
తగిలింపు: చూ. పర్యా. తగిలించు[1]. (కో. 12, 16).
తగ్గుచేయు: (క్రి.) రేకును కట్టెపైన ఉంచి వంపు చేయడం. (రా. 13).
తంజీల: ఇరుప్రక్కకు కదలకుండా కింద ఉండే బండి దిమ్మకు బిగించిన లావుపాటి కడ్డీ. (తె. 18).
తట్ట[1]: చూ. పర్యా. పరాతం. శుభకార్యాల్లో వస్తువులు తీసుకువెళ్ళడానికి, పిండి కలపడానికి, వేడి వస్తువుల్ని చల్లారదీయడానికి వాడే వెడల్పు పళ్ళెం. చూ. చిత్రం 150. (కో. 1, 7, 9, 10, 23, 25, 27; తె. 14–16, 19; రా. 11).
తట్ట[2]: రూ. తట్టె. చూ. పర్యా. కంచం. అన్నం తినడానికి ఉపయోగించే లోహపుపాత్ర. చూ. చిత్రం 214. (రా. 3, 4, 13, 16; తె. 7, 10).
తట్ట[3]: చూ. పర్యా. అరివేణి. పూజాసామగ్రి ఉంచుకునే రాగి పళ్ళెం. (కో. 18, 19; రా. 10, 12).
తట్ట[4]: పెట్టె క్రిందిభాగం. ఎనిమిది గదులుంటాయి. (రా. 5).

తట్ట[5]: వంపుగా ఉండే బిందె క్రింది రేకుభాగం. (తె. 8).

తట్టె: (బ.) తట్టెలు. చూ. పర్యా. తట్ట[2]. అన్నం తినడానికి వాడే లోహపుపాత్ర. (తె. 13).

తట్టు[1]: (క్రి.) పర్యా. పొదుగు, మెత్తు, మోల్డు చేయు. మైనం విగ్రహంచుట్టూ బంకమట్టిని అతికించడం. (తె. 18).

తట్టు[2]: (క్రి.) చూ. పర్యా. కొట్టు. కాల్చిన తర్వాత లోహపురేకులను, కడ్డీలను మట్టంగ అదరగొట్టడం. (కో. 1; రా. 1, 5, 6, 10, 14).

తట్టుసుత్తి: పర్యా. తిన్నటికరవాయి, తోండికరవాయి. పాత్రల అడుగుభాగాలు తట్టడానికి వాడే పనిముట్టు. (రా. 2).

తడకు: చూ. పర్యా. ఛీకా[1]. పాత్రలు పెట్టడానికి స్టౌ బర్నర్ పైభాగాన అమర్చిన బొడిపెలున్న రేకు. (తె. 17).

తడిపొట్టు: కావు వచ్చేందుకు కొలిమిలో వాడే పదార్థం. (రా. 14).

తడుచు: (క్రి.) పాత్రకు కళాయిపూయడం (రా. 6).

తండవాలంపెనుము: చూ. పర్యా. తండోలపెనం. (రా. 10).

తండోలదోసెరేకు: చూ. పర్యా. అట్లపెనుం. దోసెలు, రొట్టెలు చేయడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (కో. 27, 30; తె. 9).

తండోలపెనం: రూ. తండవాలం పెనము. చూ. పర్యా. అట్లపెనం. దోసెలు, రొట్టెలు చేయడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (కో. 27, 30; తె. 9).

తండోలం: చూ. పర్యా. చట్రం[1]. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (రా. 3).

తనంపట్టుకారు: చూ. పర్యా. కమ్మకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోవడానికి పనికివచ్చే పరికరం. చూ. చిత్రం 147 (రా. 7).

తనీగాచెక్కు: (క్రి.) (< తమి. తనిగా + చెక్కు) ప్రత్యేకంగా లోహాన్ని చెక్కడం. (రా. 5).

తంతె: ఉ. తంతి. చూ. పర్యా. ఇనుపతంతె. గొడుగు పుల్లలను పళ్ళచక్రానికి బిగించడానికి వాడే ఇనుప వైరు. (కో. 25; రా. 7).

తపాల[1]: రూ. తపాళ, తపిల. వంటచేయడానికి వాడే పాత్ర. (కో. 15-17, 20-30; తె. 10, 11, 21, 22; రా. 3, 14).

తపాల[2]: శవందగ్గర ప్రసాదం ఉంచుకోడానికి వాడే చిన్న ఇత్తడికప్పు. (కో. 24).

తపాలకరవాయి: తపేల తయారుచేయడానికి వాడే పరికరం. (తె. 6).

తపాలగిన్నె: చూ. పర్యా. చిన్న తపాల. కూరలు చేయడానికి వాడే లోహపుపాత్ర చుట్టూ చుక్కలు కొట్టి అందంగా తయారుచేస్తారు. (కో. 11).

తపాళ: చూ. తపాల[1]. (కో. 24, 29).

తపిల: ఉ. తెపెలి, తెపేల, తెపేలా, తేపాల. చూ. తపాల[1]. (కో. 15, 17, 20, 22, 23, 25, 27, 28, 30; తె. 21, 22; రా. 14).

తపుకు: ఉ. తప్కు, తప్పుకు. శుభకార్యాల్లో వస్తువులు తీసుకువెళ్ళడానికి, ఫలహారాలు పెట్టుకోడానికి, వేడి వస్తువుల్ని చల్లార్చడానికి వాడే వెడల్పు పళ్లెం. చూ. చిత్రం 150. (తె. 1, 5, 10, 11, 12).

తపుకూస్త్రాలి: చూ. పర్యా. తీర్థపుగిన్నె. తీర్థం పెట్టుకోడానికి వాడే చిన్నపాత్ర. మట్టుండదు. నిలువుగా అడుగు సన్నగా ఉంటుంది. మధ్యలో నామం, ప్రక్కల్లో శంఖుచక్రాలు ఉంటాయి. (తె. 23).

తపేళాగిన్ని: ఇత్తడి తపాలాలాగా ఉండే చిన్న లోహపు పాత్ర. (కో. 24).

తప్పుకు: పర్యా. పూజాసామాణి. దేవునిదగ్గర తీర్థానికి వాడే చిన్న చెంబు. (తె. 8, 9).

తబకు: (హిం.) ఉ. తబక్, తబుకు. చూ. పర్యా. పరాతం. శుభకార్యాల్లో వస్తువులు తీసుకెళ్ళడానికి, పిండి కలపడానికి, వేడివస్తువుల్ని చల్లార్చడానికి వాడే వెడల్పు పళ్లెం. (కో. 29).

తంపి: బండి కమ్ములను కాకచేయడానికి కమ్ములపై ఉపయోగించే ఎండిన పేడముక్కల పొయ్యి. (తె. 18).

తంబాలు: దీపంబుడ్లు ఎత్తుగా ఉండడానికి కొట్టిన నిలువు కడ్డీలు. (కో. 20).

తమలపాకుపళ్ళెం: తాంబూళం తట్ట (కో. 7).

తమ్మచెక్క: తయారుచేసే విగ్రహపు రేకుకు ఆధారాన్నిచ్చే కొయ్య. కొయ్యపై రేకును అంటించిన తర్వాత నగిషీ చెక్కుతారు (తె. 17).

తరగదీయు: (క్రి.) పర్యా. పాము[1], ఫైల్‌చేయు, రఫ్‌చేయు, రాకు[1], రాపనంచేయు, రాపు, రాపుడుచేయు, రాయు[1], రద్దు[2]. కుట్టుమిషన్ సామాన్లను ఆకురాయితో అరగదీయడం. (రా. 6).

తరడాకు: రూ. తరవడి ఆకు. చూ, పర్యా. తరవడి. వెనక్కి వంచబడిన బిందెమూతి అంచు. (తె. 18).

తరణం: చూ. తరణి. (కో. 25, 27).

తరణంపట్టు: (క్రి.) రూ. తరణంపెట్టు, తరమణం పెట్టు. చూ. పర్యా. ఏట్లుఏయు. పూర్తయిన లోహపు పాత్రలను మెరుగుపెట్టడం. (కో. 25, 27).

తరణంపెట్టు: (క్రి.) చూ. తరణంపట్టు. (కో. 27).

తరణి: రూ. తరణం, తరమణం. పర్యా. తరణిపని, తరమాత, పాలిష్ పని. తయారైన లోహపు పాత్రలకు పాలిష్‌పెట్టే పని. (కో. 29).

తరణిచక్రం: చూ. పర్యా. గిలక[2]. సంగడిదిండు తిరగడానికి వాడే చక్రం. (కో. 21, 24).

తరమణం: చూ. తరణి. (కో. 26).

తరమణంపెట్టు: (క్రి.) చూ. తరణంపెట్టు. (కో. 26).

తరమనికట్టె: పర్యా. తరిచెక్క, తరిపీట, తోమల్ చెక్క, ముసిడికర్ర, మొద్దుబారిన పోగర్లు, లేగలు మొదలయిన పనిముట్లు నూరుకోడానికి వాడే కొయ్య. (తె. 25).

తరమాత: చూ. పర్యా. తరణి. తయారైన లోహపు పాత్రలను పాలిష్‌పెట్టే పని. (కో. 27, 29).

తరమాతపెట్టు: (క్రి.) చూ. పర్యా. ఏట్లు ఏయు. పూర్తయిన లోహపు పాత్రలను మెరుగుపెట్టడం. (కో. 27, 29).

తరమానంలేగ: చూ. పర్యా. చదరగన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగుపెట్టడానికి వాడే పనిముట్టు. (తె. 17).

తరవడి: పర్యా. తరడాకు. వెనక్కి వంచబడిన బిందె మూతి అంచు. (తె. 25).

తరవడి ఆకు: చూ. తరడాకు. (తె. 21, 25).

తరి: పర్యా. రాయిపొడి. మొద్దుబారిన పనిముట్లను పదునుపెట్టడానికి ఇత్తడి పనిలో ఉపయోగపడే గరుగ్గాఉన్న తెల్లని పొడి. (తె. 24).

తరిగ: మాదిరి. పాత్రను ఒక తరిగ లెవల్ చేస్తారు. (తె. 25).

తరిగుండరాయి: చూ. పర్యా. గీటురాయి. లేగలను నూరడానికి ఉపయోగించే రాయి. (కో, 27).

తరిచ్చి: చూ. పర్యా. గిలక[2]. సంగడిదిండు తిరగడానికి వాడే చక్రం. (కో. 26).

తరిచెక్క: చూ. పర్యా. తరమనికట్టె. మొద్దులేగలను పదునుపెట్టడానికి వాడే కొయ్య. (తె. 3, 17, 18, 20, 24).

తరిణిపొడి: ఇత్తడిపాత్రను పాలిష్ చేసేటపుడు రాలే పొడి. (రా. 1).

తరిణిమిషను: (< తరిణ + ఇం. Machine) లోహాలను తరిణివేయడానికి వాడే పరికరం. (రా. 5).

తరిపీట: చూ. పర్యా. తరమనికట్టె. మొద్దులేగలను పదునుపెట్టడానికి వాడే కొయ్య. (తె. 17).

తరుగు[1]: పర్యా. కట్‌చేయు, కటింగ్‌చేయు, తెగబెట్టు, తెగువచేయు, తెగ్గొట్టు, నరుకు[1]. పొడవాటి మందం గలరేకులను, ఇనుపకడ్డీలను సైజుప్రకారం ముక్కలుగా చేయడం. (కో. 28).

తరుగు[2]: (క్రి.) లోహపు పాత్రలను తరిణిపనిలో నైసుగా చేయడానికి చెక్కడం. (కో. 1; రా. 2, 5).

తరుము[1]: (క్రి.) చూ. పర్యా. ఏట్లుఏయు. తయారైన లోహపుపాత్రకు మెరుగుపెట్టడం. (కో. 23, 27).

తరుము[2]: (క్రి.) పర్యా. చిట్లువేయు, తూటుపెట్టు, తూట్లువేయు, తొలవేయు. లోహపురేకులకు రంధ్రాలు వేయడం. (రా. 5).

తరువు: పాత్రపైభాగం. (కో. 4).

తరుంజారు: చూ. పర్యా. చదరగన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగుపట్టడానికి వాడే పనిముట్టు (తె. 12).

తర్కారీకత్తి: చూ. పర్యా. కత్తి[1]. కూరగాయలు తరగడానికి వాడే పరికరం. (రా. 11).

తర్పనపాత్ర: తర్పనం వదిలేటప్పుడు వాడే పాత్ర. (తె. 7).

తర్వడిచేయు: (క్రి.) పర్యా. వెనకువేయు. ఇత్తడి పాత్రరేకులను అడ్డగానిసుత్తితో మడవడం. (తె. 14, 16).

తల: గొడ్డలి పట్టుకోడానికి కొయ్యనువేసే రంధ్రం భాగం. (కో. 28).

తలకాయ: పర్యా. తలవడి[2], పెడ[1], వైపడ, పైరేకు, మీదుగు, మూతబిళ్ళ, మూతరేకు[1], మూతి[1], మొగ, వాయి[1]. బిందె పైభాగపు రేకు. (కో. 10).

తలకాయలసుత్తి: కాగుల తలకాయలు తయారు చేయడానికి ఉపయోగపడే ఇనప పనిముట్టు. (కో. 10, 12).

తలకాయి: గంటలో పైనఉండే భాగం. (రా. 5).

తలదుంగ: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండ పట్టిఉంచడానికి వాడే కొయ్యమొద్దు. (కో. 16).

తలగెడపార: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు

కొట్టడానికి వాడే గుండుతల కలిగిన పరికరం. (రా. 3).

తలబల్ల: తరణిచక్రానికి బిందెను అంటించడానికి వాడే పరికరం. దీనిని చక్రానికే బిగించి ఉంటారు. (కో. 29).

తలపడి[1]: చూ. పర్యా. కంకణం. పాత్రల అంచులు దట్టంగా ఉండడానికి ఉపయోగించే లోహపుకడ్డీ. (తె. 3).

తలపడి[2]: చూ. పర్యా. తలకాయ. బిందెమూతి భాగపు రేకు (తె. 8, 9, 24).

తబకు: ఉ. తబుకు. చూ. పర్యా. తాంబూలంతట్ట. ఆకులు ఒక అరలో పెట్టుకోడానికి వీలుగా, గుండ్రం లేదా చౌకం లేదా ముక్కోణం ఆకారాల్లో ఉండే అరల స్టీలుపాత్ర. చూ. చిత్రం 127. (కో. 5; రా. 12).

తలుపుబందులు: తలుపులకు ప్రక్కభాగంలో ఉండేవి. కొలిమిపనిలో తయారుచేస్తారు. (కో. 28).

తలుపుపొయ్యి: కాఫీ హోటల్‌లో వాడే ఇనపపొయ్యి. (కో. 4, 9).

తలుపులస్టాండు: (< తలుపుల ఇం. + Stand) పాలు, పెరుగు పెట్టుకోడానికి తలుపులమర్చిన లోహపు పరికరం. (కో. 4, 9,).

తలె: చూ. తెల్లె. (తె. 18).

తళంకట్టు: (క్రి.) బిందెల అడుగు రేకులు బిగించడం. (రా. 13).

తవ్వ: నూనె, ధాన్యం కొలవడానికి వాడే లోహపు పాత్ర. సోలకన్నా పెద్దది. అరకిలో పడ్తుంది. (కో. 18; తె. 9).

తవ్వి: జిలేబి తయారు చేసేటప్పుడు ఉపయోగించే పరికరం. (కో. 18).

తవ్వు: (క్రి.) కొలిమిలో మంట వేడెక్కడానికి మట్టిని త్రవ్వడం. (రా. 4).

తస్సు: నీళ్ళు కాచుకోడానికి వాడే రాగిపాత్ర చూ. చిత్రం 125. (రా. 14).

తాటకం: దళసరిగాఉన్న పోగరుముక్క. (కో. 19).

తాటలి : తినేపదార్థాలు పెట్టుకోడానికి వాడే ప్లేటు. (తె. 15).

తాటించు: (క్రి.) రేకును సమానంగా అణగ్గొట్టడం. (తె. 21).

తాటు: (కన్నడ). చూ. పర్యా. కంచం. అన్నం తినడానికి ఉపయోగించే వెడల్పయిన గుండ్రని లోహపుపాత్ర. చూ. చిత్రం 214. (తె. 4).

తాడు : పర్యా. సంగడితాడు. సంగడిదిండును లాగడానికి వాడే సాధనం. (కో. 5, 21, 22, 26; తె. 7, 8, 17, 19, 20; రా. 15).

తాడుకట్టు: చూ. పర్యా. కన్నం. యంత్రపుబిళ్ళ పైభాగంలో ఉండే రంధ్రం. (కో. 13).

తాండవాలం: ఆరెకాగులో కింద ఉంకడానికి వాడే ఉక్కు గోళం. (రా. 10, 11).

తాండవాలంజాలి: ఆరెకాగులో తాండవాలంక్రింద ఉంచడానికి వాడే రంధ్రాలున్న అచ్చు. (రా. 13).

తాపడంచేయు: (క్రి.) మడిచిన రేకులపై చీలలను దిగ్గొట్టడం. (కో. 16).

తాపడంపెట్టు: (క్రి.) చూ.పర్యా. కాగచెట్టు. కొలిమిలో లోహపు పాత్రల్ని, కడ్డీలను బాగా ఎర్రగా వేడి చేయడం. (తె. 26).

తాపనం: (క్రి.) ధ్వజస్తంభంపై చెక్కిన భాగాలను, విగ్రహాలను అమర్చడం. (కో. 28).

తాపి: పోతపనిలో అచ్చుకట్టేటప్పుడు మన్ను రాలి పోకుండ నైసుగా సాపుచేయడానికి వాడే చిన్న ఇత్తడి చెంచా. (కో. 29; తె. 25).

తాపు: (క్రి.) జాయింట్లు ఊడిపోకుండ రివిట్లుకొట్టడం. (కో. 18).

తాపుదాలు: చూ. పర్యా. కోవ. పట్టీమాదిరి వెనక్కి మడిచిన బిందె పైభాగపు అంచు. (కో. 6).

తాఫీ: బేలుదారుపనికి వాడే పరికరం. చూ. చిత్రం 126. (రా. 6).

తామరప్లేటు: (< తామర + ఇం. Plate) చూ.పర్యా. తామరాకు కంచం. తామరాకు ఆకారంతో అంచున్న భోజనం ప్లేటు. (కో. 29).

తామరాకు: ఉ. తామ్రాకు. తామరాకు ఆకారంలో ఉన్న అంచులేని భోజనం ప్లేటు. (కో. 3–7, 9–12, 15, 18–22, 26).

తామరాకుకంచం: పర్యా. తామర ప్లేటు, తామరాకు తట్ట. తామరాకు ఆకారంలో అంచున్న భోజనం ప్లేటు. (కో. 15, 18, 21).

తామరాకుతట్ట: చూ. పర్యా. తామరాకు కంచం. తామరాకు ఆకారంలో అంచున్న భోజనం ప్లేటు. (రా. 7, 8).

తామ్రం: ఉ. తామరం. రూ. తాంబరం. చూ. పర్యా. రాగి. పాత్రలకు, గుళ్ళవస్తువులకు వాడే ఎర్రగా ఉండే ఒకరకం లోహం. (రా. 11, 12).

తాంబరం: ఉ. తాంబ్రం. చూ. తామ్రం. (రా. 7, 11).

తాంబాణం: చూ. తాంబాళం. (తె. 17).

తాంభాణి: చూ. తాంబాళం. (తె. 2; రా. 15).

తాంభాని: చూ. తాంబాళం. (తె. 3).

తాంబాలం: ఉ. తంబలం. చూ. తాంబాళం. (తె. 6–9, 13–15; 17–20, 21).

తాంబాళం: బ. తాంబాలాలు. రూ. తాంబాని, తాంభాణి, తాంబాణం, సాంబాళం, స్తాంబాణి, స్తాంబాళం. తట్టలాగా ఉండే వెడల్పు పళ్లెం తీసుకువెళ్ళడానికి, పిండి కలపడానికి, వేడివస్తువుల్ని చల్లార్చడానికి ఉపయోగం (తె. 4, 5, 17, 22).

తాంబిని: చూ. పర్యా. కంచం. అన్నం తినడానికివాడే లోహపు పాత్ర. చూ. చిత్రం 214. (తె. 12, 13).

తాంబూలంతట్ట: పర్యా. తబకు, తాంబూలం పళ్లెం, వక్కాకుతట్ట, వక్కాకు ప్లేటు. ఆకులు ఒక ఒరలోను, పోకలు ఒక ఒరలోను, చెక్కలు మరొక ఒరలోను పెట్టుకోడానికి వీలుగా, గుండ్రం లేదా చౌకం లేదా ముక్కోణం ఆకారాల్లో ఉండే పళ్ళెం. చూ. చిత్రం 127. (కో. 1, 5; తె. 19; రా. 8, 12).

తాంబూలంపళ్ళెం: చూ. పర్యా. తాంబూలం తట్ట. ఆకులు ఒక ఒరలోను, చెక్కలు ఒక ఒరలోను, పెట్టుకోడానికి వీలుగా గుండ్రంగా లేదా చౌకం లేదా ముక్కోణం ఆకారాల్లో ఉండే పాత్ర. చూ. చిత్రం. 127. (కో. 12).

తాయు: (క్రి.) చూ. పర్యా. జంటించు. రెండు రేకు భాగాలను జాయింట్ చేయడం. (కో. 25, 27, 29).

తారుడబ్బు: కూరలు వడ్డించడానికి వాడే స్టీలు బక్కెట్టు. (తె. 10).

తారుడ్రమ్ము: (< తారు+ఇం. Drum) టంకు పెట్టె రేకులకు వాడే సాధనం. (రా. 4).

తారకట్టు: చూ. పర్యా. తాళికట్టు. దీపస్తంభంపైన మోల్డుపోసిన తర్వాత ఏర్పడే పీసులు. (రా. 5).

తాల్చు¹: (క్రి.) పర్యా. జల్లించు¹. పోతపోయడానికి ముందు మట్టిని మెత్తగా జల్లించడం. (కో. 17).

తాల్చు²: (క్రి.) గుడ్డతో మైనాన్ని వడగట్టడం. (కో. 28).

తాల్పుఏయు: (క్రి.) పర్యా. పోసుపెట్టు, భాగారించు. తయారైన వంటకాలకు తిరగమూతపెట్టడం. (తె. 6).

తాళం¹: చూ. పర్యా. కీసెట్టు. బీరువా లాకింగ్‌సెట్టు. (రా. 16).

తాళం²: వెల్డింగ్‌పనిలో బిట్లు బిగించడానికి వాడే పరికరం. (కో. 4).

తాళం³: (బ.) తాళాలు. భజనచేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 128. (కో. 23, 24, 30; తె, 5, 6).

తాళం⁴: పర్యా. బీగం. భద్రతకోసం తలుపుకు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 129. (కో. 8).

తాళంకారేజి: తాళం వేసుకోడానికి వీలున్న భోజనం కారేజి. (కో. 22).

తాళంచెవి: పర్యా. బీగంచెవ్వు. తాళం తీయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 129A. (కో. 3, 5).

తాళండబ్బా: చూ. పర్యా. గొళ్లెండబ్బా. పిండి, నూనె పదార్థాలు తెచ్చుకోడానికి వాడే మూతవున్న లోహపు పాత్ర. మూతకు గొళ్లెం అమర్చివుంటారు. చూ. చిత్రం 91. (కో. 26).

తాళాలసుత్తి: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపురేకులను, కడ్డీలను బెండ్ చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 17).

తాళి¹: (ఒరియా). చూ. పర్యా. కంచం. అన్నం తినడానికి వాడే లోహపుపాత్ర. చూ. చిత్రం 214. (కో. 30).

తాళి²: చూ. పర్యా. గిండి. పూజాసమయంలో తీర్థానికై వాడేపాత్ర. (తె. 7).

తాళికట్టు: పర్యా. తాలకట్టు. దీపస్తంభంపైన మోల్డు పోసిన తర్వాత ఏర్పడే పీసులు (రా. 5).

తాళు: చూ. పర్యా. కన్నం. కాగిన మెటల్‌ను పోయడానికి మట్టి అచ్చుపైపెట్టే రంధ్రం. (రా. 2)

తావలు: (< హిం. తవ్వా). రూ. తావా. చూ. పర్యా. అట్లపెనం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (తె. 12, 13).

తావా: చూ. తావలు. (కో. 24).

తావు: బీరువాలో గుర్తుపెట్టే సాధనం. (రా. 4).

తిక్కు¹: (క్రి.) చూ. పర్యా. నలుపు అచ్చుల్లో కూరడానికి గట్టిగా, ముద్దగా ఉండే మట్టిని చేత్తో మెత్తగా నున్నగాచేయడం. (రా. 11).

తిక్కు²: (క్రి.) చూ. పర్యా. తీయు¹. బిందెను అతికిన తర్వాత ఆసిడ్‌తో రుద్దడం. (రా. 13).

తిత్తి: రూ. తిది. చూ. పర్యా. చిత్తి. కొలిమికి గాలి రావడానికి ఉపయోగించే చర్మపు సంచి. (1, 4, 9, 28; తె. 1, 5, 6, 17–19, 21–23; రా. 2, 6–8, 10).

తిత్తికట్టె: పర్యా. బొంగు. కొలిమి తిత్తులను ఊపడానికి వాడే పొడుపుపాటి వెదురుకట్టె. (తె. 6).

తిధి: చూ. తిత్తి. (రా. 13, 14).

తిన్నటికరవాయి: చూ. పర్యా. తట్టుసుత్తి. పాత్రల అడుగుభాగాలు తట్టడానికి వాడే పరికరం. (కో. 30).

తిన్నటికారు: చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోవడానికి పనికివచ్చే పరికరం. చూ. చిత్రం 147. (కో. 28, 30).

తిమ్మిడి: గోడకు ఉండే కడ్డీలో అమర్చడానికి తలుపు వెనుకవేసిన రింగు. ఇనుపపట్టి. (తె. 25).

తింపు: (క్రి.) బోర్లనుచేత్తో త్రిప్పడం. నట్లు బిగించడానికి స్క్రూడ్రైవర్‌తో తిప్పడం. (తె. 7, 19).

తిరగవాతగంటె: రూ. తిరవాతగంటె. తిరగవాత వేయడానికి వాడే ఇనుపగరిటె. (తె. 1).

తిరగేయు: (క్రి.) అచ్చుకట్టిని తర్వాత లోపలుండే పాత్ర అచ్చును తీయడానికి కొయ్య అచ్చును తీసి బోర్లించడం. (కో. 21).

తిరవాతగంటె: చూ. తిరగవాతగంటె. (రా. 16).

తిరుగిన్నె: పర్యా. తిరుపురు తపాల, తిరుపూరు డేక్సా, వంటతపాల, వంటచేయడానికి వాడేపాత్ర. (కో. 7).

తిరుగుడి: కోడికాలుకువేసే రాగి లేదా ఇత్తడితో చేసిన ఆభరణం. (కో. 21).

తిరుచూర్ణంపెట్టె: పర్యా. తిరుచూర్ణంకాయి. తెల్ల నామాలు పెట్టుకోడానికి వాడే లోహపుపెట్టె. (కో. 12).

తిరుచూర్ణంకాయి: చూ. పర్యా. తిరుచూర్ణంపెట్టె. తెల్లనామాలు పెట్టుకోడానికి వాడే లోహపుపెట్టె. (కో. 12).

తిరుపతిబిందె: చూ. పర్యా. కూజా. నీళ్ళు తెచ్చుకోడానికి వాడే కూజా ఆకారమున్న లోహపుపాత్ర. (తె. 3).

తిరుపురు అండి: నీళ్ళు కాచుకోడానికి వాడే గుండ్రంగా కడవలాగా ఉన్న స్టీలుపాత్ర. (తె. 10, 11).

తిరుపురుచెంబు: ఉ. తిరుపూరుచెంబు. నీళ్ళు తాగడానికి వాడే గుండ్రని స్టీలుపాత్ర. (కో. 2; 5, 11, 17, 19, 29; తె. 14, 16, 18).

తిరుపురుడేక్సా: వంటలు చేయడానికి వాడే మూతి వెడల్పుగా, అంచు వాలినట్లుగా, అడుగు చదరంగా పెద్దగా ఉంది అంటే ఆకారంలో నిలువుగా ఉండే పాత్ర. తిరుపూరులో తయారయింది. (కో. 6, 8, 11).

తిరుపురుతపాల: చూ. పర్యా. తిరుగిన్నె. వంటచేయడానికి వాడేపాత్ర. (కో. 13).

తిరుపురుతపాల: చూ. పర్యా. గుండుతపాళ. కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కివంచి మూతి వెడల్పుగా చేసినట్టి లోహపుపాత్ర. వంటలు చేయడానికి ఉపయోగం. (కో. 12, 15).

తిరుపురులోట: చూ. పర్యా. గ్లాసు[1]. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215. (తె. 10, 11).

తిరుపూరుడేక్సా: చూ. పర్యా. తిరుగిన్నె. వంటచేయడానికి వాడేపాత్ర. (రా. 12).

తివ్వ: చూ. పర్యా. ఇనుపతంతె. గొడుగు పుల్లలను పళ్ళ చక్రానికి బిగించడానికి వాడే సన్నని ఇనపతంతె. (కో. 26, 27; తె. 24).

తిస్తీ: పర్యా. తొట్టి[1]. తీపి పదార్థాలను ఉంచడానికి వాడేట్రే. (తె. 2).

తీగ: ఉ. తీగి, తీగె. చూ. పర్యా. ఇనుపతంతె. గొడుగు పుల్లలను పళ్ళచక్రానికి బిగించడానికి వాడే సన్నని ఇనుపతంతె. (కో. 28; తె. 4, 5, 19, 20, 21, 22, 24; రా. 15).

తీగకట్టు: (క్రి.) గొడుగు కడ్డీ లన్నిటిని కలిపి కమ్మితో బిగించడం. (కో. 17).

తీగటిపిను: చూ. తీగటిఫెను. (తె. 3).

తీగటిఫెను: (< తీగ + ఇం. Tiffin). రూ. తీగటిపిను. పర్యా. తూగు. నూనె, టీ, మజ్జిగ వగైరా ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే పిడులు ఉన్న గుండ్రనిపాత్ర. (తె. 17).

తీగబుట్ట: చూ. పర్యా. ఉల్లిపాయల బుట్ట. ఉల్లిగడ్డలు, కాయగూరలు నిల్వ ఉంచుకోడానికి కమ్ములతో అల్లిన ఉట్టి. చూ. చిత్రం 29. (కో. 26).

తీగబోనె: చూ. పర్యా. ఎలకలబోను. ఎలుకలు పట్టడానికి ఇనుపతంతెతో తయారుచేసిన పరికరం. చూ. చిత్రం 30. (కో. 25).

తీయు[1]: (క్రి.) పర్యా. తిక్కు[2], పాము[2], మలుచు[1], రాయు[2], వాషింగ్‌చేయు. తరణి పట్టేముందు బిందె పైమట్టి పోయేందుకు సల్ఫరుతో కడగడం. (కో. 21).

తీయు[2]: (క్రి.) పర్యా. మడతగొట్టు, మడత ఎట్టు,

మడత ఏయు[2], మడుక్కొను, సూరుకొట్టు, సూరు వంచు, సూరువేయు, పల్‌కట్ వేయడానికి వీలుగా లోహపురేకు అంచుల్ని గాడిలాగా మడచడం. (తె. 14; రా. 11).

తీర: ఇనుప కమ్మలను చక్కగా చేయడం. (రా. 8).

తీరుమానం: బిందె అంతా చివరిదశ దాకా తయారు కావడం. (కో. 10).

తీరువ: పర్యా. వస్తువ, శాస్త్రీ. పూర్తయిన లోహపు పాత్ర. (తె. 1),

తీర్చుకొను: (క్రి.) చూ. పర్యా. కూచోబెట్టు. ఆకారాన్ని తయారుచేసేందుకు కొలత ప్రకారం డిజైను కడ్డీలను అమర్చడం. (కో. 23).

తీర్థపుగిన్నె: పర్యా. తపుకూస్తాలి. తీర్థం పెట్టుకోడానికి వాడే చిన్నపాత్ర. మట్టుండదు. నిలువుగా అడుగు సన్నగా ఉంటుంది. మధ్యలో నామం, ప్రక్కల్లో శంఖుచక్రాలు ఉంటాయి. (కో. 10, 11, 13).

తీర్థంస్పూను: (< తీర్థం + ఇం. spoon). చూ. పర్యా. ఉద్ధరిణి. తీర్థాని కుపయోగించే స్టీలుచెంచా. (కో. 24).

తీర్పుచేయు: (క్రి.) ఇత్తడిపాత్రలను సాపుచేయడం. (తె. 14, 15).

తీర్పుతీర్చు: (క్రి.) పర్యా. తీర్మానంచేయు, తేల్చు[1]. ఇత్తడి విగ్రహం ఆకారాన్ని స్పష్టంగా కనబడేటట్లు చెక్కడం. (కో. 18).

తీర్మానంచేయు: (క్రి.) చూ. పర్యా. తీర్పుతీర్చు. ఇత్తడి విగ్రహం ఆకారాన్ని స్పష్టంగా కనబడేటట్లు చెక్కడం. (తె. 17).

తీర్వానం : బొమ్మెయకుండా ఉండే బిందెవాయి. (తె. 21).

తీర్వానంసుత్తె: పర్యా. దవురుసుత్తె. బిందెపైభాగాన రేకును సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 21).

తుక్కు: చూ. పర్యా. చిలుము. లోహపు రేకులపై, కడ్డీలపై పట్టిన తుప్పు. (తె. 26).

తుంగుమొద్దు: రూ. టుంగుమొద్దు. చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని పట్టిఉంచడానికి వాడే కొయ్యమొద్దు. (తె. 14-16, 19).

తుడికమ్మి: చూ. పర్యా. లేగ. పూర్తయిన లోహపు పాత్రలను, విగ్రహాలను మెరుగు పెట్టడానికి వాడే పరికరం. (కో. 14).

తుడువు: (క్రి.) చూ. పర్యా. పూయు. లోహపుపాత్ర భాగంలో కళాయిని పూసి శుభ్రపరచడం. (తె. 5).

తుడువేగిచెన్ని: పర్యా. ఫిల్టరు, వడపోత, వడపోత గంటె, స్టెయినరు, కాఫి, టీ వడగట్టడానికి వాడే పరికరం. (తె. 10, 11).

తుంట[1]: రూ. తుండు[2]. పర్యా. తెగవలు, ముక్క[1]. తెగ్గొట్టబడిన లోహపుముక్కలు. (రా. 8, 11).

తుంట[2]: చూ. పర్యా. అదరువాలేగ. పాలిష్ పాత్రలపై డిజైన్‌లు వేయడానికి వాడే పరికరం. (రా. 4).

తుండు[1]: చూ. పర్యా. చట్రం[1]. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి ఉపయోగపడే మోపు. (కో. 4, 9, 11; తె. 24; రా. 5).

తుండు[2]: చూ. తుంట[1]. (రా. 11, 12).

తుండైపోవు: (క్రి.) బండిచక్రం కమ్మిజాయింట్‌ను విడగొట్టడం. (కో. 13).

తుండైపోవు : (క్రి.) బండిచక్రం జాయింట్‌ను విడగొట్టడం. (రా. 13).

తుత్తునాగం: చూ. పర్యా. జస్. ఇత్తడిపాత్రల కళాయిపనికి వాడే యాసిడ్‌తో కలిపే పదార్థం. (రా. 1, 5).

తుప్పు[1] : రూ. త్రుప్పు. చూ. పర్యా. చిలుము. లోహపు రేకులపై , కడ్డీలపైపట్టిన జిడ్డు. (కో. 28; తె. 22).

తుప్పు[2]: గొడుగు మూసినపుడు పుల్లలను పట్టిఉంచే భాగం. (కో. 28).

తుప్పుకొట్టు: (క్రి.) రంగువేయడానికి ముందు బీరువా రేకుకు ఉండేమైలను పోగొట్టడం. (కో. 24).

తుమ్మూరుకత్తెర: బీడిఆకులు కత్తరించడానికి వాడే సాధనం. (రా. 15).

తుమ్మొద్దు: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండా పట్టిఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (తె. 20).

తుంపాలంబింది: మూతిచుట్టూ అంచుకడ్డీ బిగించి ఉండే దళసరి ఇత్తడిబిందె. పాలుతేవడానికి ఉపయోగం. (కో. 25).

తురిమేఈలపీట : చూ. పర్యా. కుడ్క. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (రా. 13).

తురిమేచెక్క: చూ. పర్యా. కుడ్క. కొబ్బరి తురమడానికి వాడే పరికరం.

తురిమేపీట: చూ. పర్యా. కుడ్క. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (తె. 5).

తురుము[1]: చూ. పర్యా. కుడ్క. కొబ్బరితురమడానికి వాడే పరికరం. (కో. 9; రా. 14).

తురుము[2]: (క్రి.) చూ. పర్యా. తొలుచు, టింకర

పనిలో చిన్నరంధ్రాన్ని వెడల్పుచేయడం. (కో. 25, 28).

తురుము[3]: (క్రి). అచ్చుకుపెట్టిన పోతబెజ్జాన్ని కచ్చులు లేకుండ గుండ్రంగా, నున్నగా సాపు చేయడం. (కో. 20, 22).

తురుముకత్తి. చూ. పర్యా. కుడ్క. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (రా. 16).

తులసికోటపొయ్యి: నలుచదరంగా ఉండే రేకు. బొగ్గులపొయ్యి. (తె. 22).

తూగు: చూ. పర్యా. తీగ టిఫెను. నూనె, టీ, మజ్జిగ వగైరా ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే పిడి ఉన్న గుండ్రని పాత్ర. (తె. 1, 2).

తూటి: వత్తిని అమర్చడానికి దీపంబుడ్డీపై ఉండే చిన్న గొట్టం. (తె. 17).

తూటికిల: రేకులమధ్యలో రంధ్రాలువేయడానికి వాడే గోరులాంటి అడుగు ఉన్న పోగరు. (తె. 17).

తూటిచెంబు: రూ. తూతిచెంబు. పర్యా. తూటి లోట. అడుగుభాగాన నీళ్ళు బయటికిరావడానికి గొట్టం అమర్చిన లోహపు పాత్ర. మహమ్మదీయులు నీళ్ళు తాగడానికి వాడ్తారు. (తె. 20, 23).

తూటిలోట: చూ. పర్యా. తూటిచెంబు. అడుగుభాగాన నీళ్ళు బయటికిరావడానికి గొట్టం అమర్చిన లోహపు పాత్ర. మహమ్మదీయులు నీళ్ళు తాగడానికి వాడ్తారు. (తె. 17).

తూటు: చూ. పర్యా. కన్నం. పోతలోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి ఏర్పాటుచేసిన రంధ్రం. (తె. 6).

తూటుపెట్టు: (క్రి.) చూ. పర్యా. తరుము[2]. లోహపు రేకులకు రంధ్రాలు వేయడం. (రా. 4).

తూట్లువేయు: (క్రి.) చూ. పర్యా. తరుము[2]. లోహపు రేకులకు రంధ్రాలు వేయడం. (రా. 3).

తూడ్చు: (క్రి.) పాత్రలపై తేమలేకుండా చేయడం. (తె. 14, 16).

తూతిచెంబు: చూ. తూటిచెంబు. (తె. 1).

తూనిక: వెల్డింగ్‌పనిలో తయారైన ఇనుపగేట్లను తూకంవేసే పరికరం. (రా. 7).

తూప్‌దాన్: (హిం.) చూ. పర్యా. ఒగల్‌దాన్ని, థూక్‌దాన్. ఉమ్మివేసుకొనే పెద్దలోహపుపాత్ర. (తె. 17).

తూము: ఉ. తూం. చూ. పర్యా. కన్నం. గొడ్డలికి వేసే రంధ్రం. (తె. 5; రా. 10, 11).

తూముపెట్టు: (క్రి.) పర్యా. గుండీపెట్టు, ముద్దచేసిన గొడ్డలి. తలపై కట్టె పెట్టుకోడానికి రంధ్రం చేయడం. (తె. 25).

తూర్పుబిందె: నీళ్ళు తెచ్చుకోడానికి వాడే కూజా ఆకారపు పల్చని ఇత్తడిరేకు బిందె. నల్గొండకు తూర్పుదేశంవాళ్లు ఎక్కువగా వాడుతారు కాబట్టి ఈ పేరు వచ్చింది. (తె. 25).

తెగవాయి ఏయు: (క్రి.) చూ. పర్యా. సరుసు. మొద్దుబారిన పనిముట్లని తెగడానికి వీలుగా కూచిగ చేయడం. (తె. 21).

తెగబెట్టు: (క్రి.) చూ. పర్యా. తరుగు[1]. పొడవాటి మందంగల రేకులను, ఇనుపకడ్డీలను సైజుప్రకారం ముక్కలుగా కట్‌చేయడం. (తె. 1).

తెగవఛాణం: రూ. తెగేశానం. చూ. పర్యా. చదరపు పంచు. పచ్చి ఇనుమును చీల్చడానికి వాడే సాధనం. (రా. 10).

తెగవలు: చూ. పర్యా. తుంట[1]. తెగ్గొట్టబడిన లోహపు ముక్కలు. (రా. 10).

తెగుడువచ్చు: (క్రి.) చూ. పర్యా. జారుచేయు. మొద్దుబారిన మెరుగు కమ్ములను పదునుపెట్టడం. (కో. 24).

తెగువచేయు: (క్రి.) చూ. పర్యా. తరుగు[1]. పొడవాటి మందంగల రేకులను, ఇనుపకడ్డీలను సైజుప్రకారం ముక్కలుగా కట్‌చేయడం. (కో. 21).

తెగ్గొట్టు: (క్రి.) చూ. పర్యా. తరుగు[1]. పొడవాటి మందంగల రేకులను, ఇనుపకడ్డీలను సైజుప్రకారం ముక్కలుగా చేయడం. (కో. 17-130; తె. 2, 3, 7, 18, 20; రా. 2, 5, 6, 11, 12, 15, 16).

తెనాలి అండి: అన్నం వండుకోడానికి వాడేపాత్ర. (కో. 2).

తెనాలిబిందె: నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగపడే మూతి కూచిగా ఉన్న స్టీల్‌పాత్ర.

తెరాయి: పర్యా. నురుగు, సరుకు[2], సొమ్ము. మూసలో కరిగిన లోహం. (రా. 2).

తెలవాయి: రూ. తెలివాయిర. చూ. పర్యా. గుండు సుత్తి. లోహపురేకును కత్తిరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం. 86. (తె. 17).

తెలివాయిర: చూ. తెలివాయి. (తె. 25).

తెల్లపని: పర్యా. సానపని, సిజర్ షార్పెంగ్ పని. మొద్దుబారిన కత్తులు కటార్లు మొదలయిన పనిముట్లను పదునుపెట్టే పని. (కో. 24).

తెల్లగుడ్డ: ఇత్తడిపాత్రను శుభ్రపరిచిన తర్వాత తేమ లేకుండా చేయడానికి వాడే వస్త్రం. (కో. 16, 25, 27, తె. 14).

**తెల్లె:** ఉ. తల్లి, తల్లె. రూ. తలె, తెళ్ళి. చూ. పర్యా. కంచం. అన్నం తినడానికి ఉపయోగించే లోహపు పాత్ర. చూ. చిత్రం 214. (తె. 2-7, 12).

**తెళ్ళి:** చూ. తెల్లె. (రా. 12).

**తేజ్:** చూ. పర్యా. జారు. లోహ పాత్రలపై మెరుగు. (కో. 26).

**తేజ్‌చేయు:** చూ. పర్యా. సరుసు. మొద్దుబారిన పని ముట్లను తెగడానికి వీలుగా కూచిగా చేయడం. (తె. 3, 6, 18).

**తేజ్‌వచ్చు:** (క్రి.) చూ. పర్యా. సరుగు. మొద్దుబారిన పరికరాలు సానపట్టినపుడు కొస్సిగ అవడం. (తె. 2).

**తేజాప్:** పర్యా. నైట్రిక్ తేజాప్. ఇత్తడి, రాగి పాత్రలకు పాలిష్ రావడానికి వాడే ద్రవపదార్థం. (రా. 14).

**తేజాప్‌బుడ్డి:** పర్యా. తేజాప్‌సీసా. కొలిమిదగ్గర అసిడ్‌ను నిల్వ ఉంచుకోడానికి వాడే గాజుపాత్ర. (తె. 19).

**తేజాపు:** చూ. పర్యా, ఆసిడ్. టింకరపనిలో పాత్రలను అతకడానికి ముందు రేకుమడుపులపై పూయడానికి, లోహపుపాత్రల మైలను పోగొట్టడానికి వాడే ద్రవ పదార్థం. (తె 24),

**తేజాబ్‌సీసా:** చూ. పర్యా. తేజాబ్‌బుడ్డి. కొలిమిదగ్గర ఆసిడ్‌ను నిల్వ ఉంచుకోడానికి వాడే గాజుపాత్ర. (తె. 22).

**తేదాపుల్ల:** చూ. పర్యా. జస్‌కికాడి. డబ్బారేకులపై తేజాపును పూయడానికి టిన్‌గర్‌పనిలో వాడే చిన్న రేకుముక్క. (తె. 24).

**తేనెతీయు:** (క్రి.) అచ్చులో అతకడానికి మట్టిలో బెల్లపునీళ్ళు కలపడం. (కో. 29).

**తేనెమైదం:** చూ. తేనెమైనం. (తె. 17).

**తేనెమైనం:** రూ. తేనెమైదం. పర్యా. బందకం, బందకల, బందకళాయి, బందగాలుపొట్లం, మైనం. లోహపుపాత్రలపై రంధ్రాలను చూడ్డానికి పూతగా పూసే జిగురుపదార్థం. (కో. 10; తె. 17).

**తేల్చు[1]:** (క్రి.) చూ. పర్యా. తీర్పుతీర్చు. ఇత్తడి విగ్రహం ఆకారాన్ని స్పష్టంగా కనబడేటట్లు చెక్కడం. (కో. 18).

**తేల్చు[2]:** (క్రి.) కొలిమిలో ఉన్న మూసను పైకి తీయడం. (కో. 17, 20).

**తేల్చు[3]:** (క్రి.) రేకుపైనున్న గుర్తులను పైకి ఉబుకు నట్లుగ చేయడం. (కో. 16),

**తేల్పు:** (క్రి.) పర్యా. తేల్పుకొను, మబ్బు, సొబ్బు. బిందె మధ్యరేకును లోతుగా గుండ్రంగా మిగతా భాగాలకు అతికించడానికి వీలుగా తయారుచేయడం. (తె. 23).

**తేల్పుకొను:** (క్రి.) చూ. పర్యా. తేల్పు. జన్వభాగానికి అతికించడానికి వీలుగ బిందె మూతి రేకును సాగ్గొట్టడం. (తె. 24).

**తొక్కు:** (క్రి.) కత్తులు పదును రావడానికి సైకిల్ చక్రాన్ని తొక్కడం. (రా. 1).

**తొక్కుగంటె:** చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించ డానికి, పదార్థాలు ఎత్తుకోవడానికి వాడే సాధనం. (తె. 2).

**తొక్కుడుసాన:** మొద్దుగా ఉన్న కత్తులు పదును పెట్టడానికి వాడే కాలితో తొక్కడానికి వీలున్న పరికరం. (తె. 21-24; రా. 12).

**తొక్కేచెక్క:** చూ. పర్యా. ఉట్‌పెడిలు. సానరాయి తిరగడానికి చక్రాన్ని కాలితో తొక్కడానికి అమర్చిన సాధనం. మొద్దుగా ఉన్నకత్తులు, కత్తెరలు మొదలయిన వాటిని పదునుపెట్టడానికి ఉపయోగం. (రా. 12, 16).

**తొట్టాను:** చూ. పర్యా. ఉయ్యాల. పిల్లలను పరుండ బెట్టి ఊచే ఊయల. చూ. చిత్రం 27. (తె. 9, 11).

**తొట్టి[1]:** చూ. పర్యా. తిస్తీ. మిఠాయిలు పెట్టుకోడానికి వాడే ట్రే. (తె. 22).

**తొట్టి[2]:** పెట్రొమాక్స్‌లైటు టాంకి పైభాగం. (తె. 23).

**తొట్టి[3]:** (బ.) తొట్లు. పోతపాత్రను తయారుచేయ డానికి వాడే కొయ్య చట్టం. ఇవి రెండునుంచి నాలువరకు ఉంటాయి. (తె. 17, 19, 21).

**తొట్టి[4]:** చూ. పర్యా. గచ్చు. వేడిగావున్న లోహపు వస్తువులను చల్లబరచడానికి ఉపయోగపడే లోహపు పాత్ర. (తె. 23).

**తొట్టిగిన్నె:** చూ. పర్యా. కడీడబ్బా. పొలం దగ్గిరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే హాండిల్, మూత ఉన్నపాత్ర. (కో. 7).

**తొట్టిమట్టు:** చూ. పర్యా. కుంచు. కాక బాగా కావ డానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే కొబ్బరి మట్టచుట్టిన కర్రముక్క. (కో. 28).

**తొట్టె:** ఉ. తొట్టి. పర్యా. దోసె, దోసెరాయి, నీటి పాత్ర, నీళ్ళకుండి, నీళ్ళగిన్నె, నీళ్ళచెంబు, నీళ్ళ తొట్టి, నీళ్ళపాత్ర, నీళ్ళరాయి, మూకుడు[2], రాయితొట్టి. పనిముట్లను పదునుపెట్టడానికి, కాక

కావడానికి, నీళ్ళు చల్లడానికి వాడే నీటిపాత్ర. (కో. 24, 28, 30; తె. 16; రా. 2, 13, 15).

తొట్రలు: చూ. పర్యా. ఉయ్యాల. చిన్నపిల్లల్ని నిద్ర ఊపడానికి వాడే లోహపుతొట్టి చూ. చిత్రం 27. (తె. 10, 11).

తొడప¹: ధాన్యం కొలవడానికి వాడే కుంచం, లేదా ముంత. (కో. 28).

తొడప²: ఇరుసు తిరగడానికి ఉపయోగించే చక్రంలో బిగించిన గొట్టం. (కో. 24, 30).

తొడి: పిడీ విరిగిపోకుండ కత్తులకువేసే ఇనుపరింగు. (కో. 24).

తొడిగించు¹: (క్రి.) గొడుగు కడ్డీలకు గుడ్డను కట్టడం. (రా. 11).

తొడిగించు²: (క్రి.) పచ్చికొట్టేముందు రేకుల అంచులను ఒకదానిలో ఒకటిపెట్టి ఎక్కించడం. (తె. 22).

తొడుగు¹: (క్రి.) అకుగురేకును డ్రమ్ముకు కలిపి బిగించడం. (కో. 18).

తొడుగు²: (క్రి.) పర్యా. దింపు¹. బండి రొదాకు ఇరుసును బిగించడం. (తె. 21).

తొడుగు³: (క్రి.) బీరువా ఆకారాన్ని చేయడంకోసం రేకులన్నింటిని ఒకదానితో ఒకటి కలిపి బిగించడం. (కో. 17, 19, 22, 26; రా. 12, 14).

తొడుగు⁴: (బ.) తొడుగుల్లు. చూ. పర్యా. కవచం. దేవుని విగ్రహానికి ముఖం తప్పించి మిగతా శరీర భాగమంతటికీవేసే లోహపువస్త్రం. (తె. 7, 9, 14, 16, 18, 20).

తొండం¹: పర్యా. ముక్కు. కొలిమిగాలి బాగా రావడానికి బ్లోర్‌కు అమర్చిన గొట్టం. (తె. 25).

తొండం²: డబ్బాలకు వేసే గొళ్ళెం. (కో. 23).

తొండం సుత్తి: నడిగట్టు కొట్టడానికి వాడే సాధనం. (కో. 17).

తొల: ఉ. తొలి. చూ. పర్యా. కన్నం. పోతలోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి ఏర్పాటుచేసిన రంధ్రం. (కో. 1; తె. 1, 6, 7, 17–19).

తొలచుట్టు: ఉ. తొలిచుట్ట, తొలుచుట్ట. రూ. తొలిసుట్ట. చూ. పర్యా. గుల్లమోపు. లోహపురేకులపై, పట్టీలపై సులువుగ రంధ్రాలేయడానికి వాడే దిమ్మ. (తె. 5, 6, 9, 12).

తొలలేయు: (క్రి.) చూ. పర్యా. తరుము². లోహపు రేకుకు రంధ్రాలు వేయడం. (రా. 1).

తొలిపోగరు: చూ. పర్యా. చిన్నపోగరు. లోహపు రేకులపై కడ్డీలపై చిన్నతొలలు కొట్టడానికి వాడే పనిముట్టు. (తె. 19).

తొలిబిళ్ళ: చూ. పర్యా. గుల్లమోపు. లోహపురేకులపై పట్టీలపై రంధ్రాలేయడానికి వాడే దిమ్మ. (తె. 18).

తొలిసుట్ట: ఉ. తొల్సుట్ట. చూ. తొలిచుట్ట. (తె. 2, 17–19, 24, 25).

తొలుచు: (క్రి.) పర్యా. తురుము². లోహపురేకులపై చిన్నరంధ్రాలను వెడల్పుచేయడం. (కో. 29; రా. 10).

తొలువువచ్చు: (క్రి.) కొలిమిపై కరుగుతున్న ఇత్తడి ద్రావకం పచ్చగారావడం. (రా. 5).

తొల్లపట్ట: పనిచేసేటప్పుడు కొరాంను గట్టిగ పట్టిఉంచడానికి ఉపయోగపడే గుండ్రని దిమ్మ. మధ్య భాగంలో రంధ్రం ఉంటుంది. (తె. 22).

తోకకరువాయి: చూ. పర్యా. కోవలసుత్తి. పాత్రల అంచులు మలచడానికి వాడే కడ్డి. కొద్దిగ ముందుకు వంచబడి పక్షికారంగా ఉంటుంది. (కో. 21, 28).

తోకగొడిశలు: తలుపులను బిగించడానికి ద్వారాలకు వేసిన సాధనాలు. (కో. 17).

తోకబందు: క్యానుకు మూత ఊడిపడకుండా నిరోధించడానికి పాట్లాకు లాగాఉండే సాధనం. (రా. 2).

తోకసుత్తి: చూ. పర్యా. కొమ్ముసుత్తి. రివిట్లుకొట్టడానికి వీలుగా రంధ్రాలు వేయడానికి వాడే పనిముట్టు. (కో. 19).

తోటికొయ్యదుక్క: తరిణిపట్టేటప్పుడు ఇసుకవేసి లేగలు నూరుకోడానికి వాడే కర్రముక్క. (కో. 16).

తోడు: (క్రి.) మూసలో ఉండే సరుకునుపైకి తీయడం. (కో. 24).

తోడుమూస: కరిగించిన లోహాన్ని అచ్చుల్లో పోయడానికి వాడే చిన్నమూస. (కో. 29).

తోండికరవాయి: చూ. పర్యా. తట్టుసుత్తి. చిన్న దుత్తల్ని పట్టడానికి వాడే పరికరం. (రా. 1).

తోపడ: ఎద్దుకు బిళ్ళలు కట్టేముందు శుభ్రంచేసే పరికరం. (రా. 6).

తోపడజబ్బు: చూ. పర్యా. కుడ్క. కొబ్బరితురమడానికి వాడే పరికరం. (రా. 16).

తోమల్‌చెక్క: చూ. పర్యా. తరమనికట్టె. మొద్దుబారిన పోగర్లు, లేగలు మొదలయిన పనిముట్లను పదును చేయడానికి వాడే కొయ్య. (తె. 27).

తోము: (క్రి.) విగ్రహంపై పాలిష్‌మ బ్రష్‌తో పూయడం. (కో. 5, 10, 12, 17, 24, 28; తె. 8, 14–16; రా. 1, 3, 6, 12).

తోరణం: గడపలకు పైభాగంలో కట్టడానికి ఆకులలాగా ఉండే ఇత్తడిరేకులు. (రా. 15).

తోలుముక్క: గొడుగుగుడ్డలో నీళ్ళుదిగకుండ గిన్ని కిందఉండే వాచరు. (కో. 28).

తోలువారు: పర్యా. బెల్టు¹, వారు. సానరాయిని చేతితో లాగడానికి వాడే చర్మపుపట్టి. (తె. 23).

తౌగోళం: చూ. పర్యా. కక్కుకొడవలి. పొలాల్లోగడ్డి గోక్కునే సాధనం. (కో. 19).

త్రాసు: చూ. పర్యా. తక్కెడ. చెంబులు, బిందెలు మొదలయిన లోహపు సామగ్రిని తూకంవేయడానికి వాడే సాధనం. దండేనికి ఇరువైపులా రెండుసిబ్బులు గొలుసుల ద్వారా వ్రేలాడుతుంటాయి. చూ. చిత్రం 130. (కో. 3, 8; రా. 12).

త్రిజోడిలాకరు బీరువా : (< త్రిజోడి + ఇం. locker+బీరువా) లోపలిభాగాన సైడ్లోమరొక అరఉండే బీరువా. (తె. 17).

త్రిపురచెంబు: కొంచెం నలుచదరంగ ఉండే స్టీలు పాత్ర. నీళ్ళుతాగడానికి ఉపయోగం. (కో. 18).

త్రిపులి: చూ. పర్యా. టర్న్‌స్క్రూ. స్క్రూలను ఊడదీయడానికి బిగించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 219. (రా. 4).

త్రిశున్నాలు: దేవాలయంలో దేవుని కొలిచేటప్పుడు ఊదడానికి వాడే పరికరం. (కో. 12).

త్రుప్పు: చూ. తుప్పు¹. (కో. 26, 28-30).

త్రూ వేయు: (క్రి.) ఫ్రేములో డిజైన్ల మూలలను సరిగ కూచోబెట్టడం. (తె. 3).

త్రెడ్: (< ఇం. Thread) స్టౌ రిపేరులో టాంక్‌కు బిగించిఉండే ఆయిల్ కాప్‌ను అమర్చడానికి ఏర్పాటు చేసిన గొట్టం. (కో. 28).

త్రెడ్‌కటోర: (< ఇం. Thread + హిం. కటోర) బల్బును వెలిగించడానికి టార్చిలైటు వెనుక మూతలో ఉండే స్ప్రింగు కడ్డీ. (తె. 25).

త్రొవ్వు: (క్రి.) మట్టిని పాత పాత్రనుండి వేరు చేయడం. (రా. 2).

త్రోమిషను: (< ఇం. Throw mechine) సైకిల్ గ్రీమ్ అవుట్ తీయడానికి ఉపయోగపడే పరికరం. (తె. 8, 13).

## థ

థార్: చూ. పర్యా. ఎక్కువదిమ్మ. లోహపు రేకుల జాయింట్లకు రివిట్లు కొట్టడానికి వాడే సాధనం. (తె. 17).

## ద

దంచు¹: (క్రి.) రూ. దొంపు. పర్యా. దూళచేయు, నలగొట్టు. గట్టిగఉన్న నవాసారాన్ని మెత్తగా పొడి చేయడం. (రా. 6).

దంచు²: (క్రి.) శిల్ప పనిలో మట్టిని మెత్తగా చేయడం. (కో. 28).

దట్టనచేయు: (క్రి.) చూ. పర్యా. కూరు. పోత పాత్రను తయారుచేయడానికి అచ్చుల్లో మట్టిని గట్టిగా కూరడం. (కో. 29).

దట్టపోగరు: ఉ. దట్టిపోగరు. శిల్ప పనిలో విగ్రహాన్ని చదరం చేయడానికి వాడే పరికరం. (కో. 2, 3, 6, 8; తె. 17; రా. 5).

దట్టించు:¹ (క్రి.) చూ. పర్యా. కూరు. పోతపాత్రను తయారుచేయడానికి అచ్చుల్లో మట్టిని గట్టిగా కూరడం. (కో. 21, 22, 24).

దట్టించు²: (క్రి.) చూ. పర్యా. గుద్దు². మైనంతో చేసిన మూర్తి విగ్రహాన్ని బంకమట్టిలో గట్టి పర్చడం. (కో. 6).

దట్టించు³: (క్రి.) పాత్రలకు అతుకులు కనపడకుండా సాపుచేయడం. (కో. 20).

దట్టించుసుత్తి: పర్యా. మట్నె. అతుకులు కనపడకుండ సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 20).

దట్నపెట్టు: (క్రి.) బిందెపై సుత్తితో దెబ్బవేయడం. (కో. 21).

దట్నపోగర: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 16).

దట్నపోగరి: పర్యా. దబుల్ చుక్కపోగరు, దొడ్డు పోగరు. లోహపు రేకులో ఉబ్బెత్తుగా ఉన్నదాన్ని సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 18).

దట్నశానం: లోహపు ముక్కల్ని సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 30).

దట్నెకొర్రు: చూ. పర్యా. కర్రగూటం. అచ్చుల్లో మట్టిని కూరడానికి వాడే సాధనం. (కో. 29).

దడిఏయు: (క్రి.) బండికమ్మల చుట్టూ దెబ్బలేస్తూ సుత్తితో సాపుచేయడం. (కో. 20).

దండి¹: పెట్టె మధ్యభాగం. పది గదులుంటాయి. (రా. 5).

దండి²: గంట పైభాగం. (రా. 5).

దండిబోగన: చూ. పర్యా. కాడగిన్నె. కాఫీ, టీ తయారుచేయడానికి వాడే పొడవుకాడ ఉన్నపాత్ర.

(తె. 3).

దండుకట్టు: (క్రి.) పర్యా. దింపు, దింపు[2], దింపు కొను. రేకు పైభాగాలను అంచులాగ మడచడం. (కో. 23).

దండెం: త్రాసులో మధ్యలో తూకాన్ని సూచించే ముల్లు. గొలుసులు వ్రేలాడదీయడానికి, రెండు వైపులా చివర్లో కొండ్లు అమర్చిన అడ్డకర్ర. చూ. చిత్రం 130.2. (రా. 3, 5, 8, 11).

దత్తాగిన్నె: ఉ. దత్తాగిన్ని. రూ. దస్తాగిన్ని. తపేల దాక లాగ ఉండే లోహపుపాత్ర. బియ్యం కడుక్కోడానికి పాలు కాచుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 131. (కో. 20. 21).

దనగా: చూ. పర్యా. కట్టర్‌దిమ్మ. ఇనుపకడ్డీలను కట్ చేసి, లెవల్ చేయడానికి ఉపయోగించే దిమ్మ. (తె. 19).

దనియా: చూ. పర్యా. చెక్కతొట్టి. పోతపాత్రను తయారుచేయడానికి వాడే కొయ్యచట్రం. (తె. 17).

దన్నెపెట్టు: (క్రి.) బిందెను పాలిష్ చేసేటప్పుడు కదలకుండ క్రింద చెక్కలను అమర్చడం (కో. 19).

దంతికలగొట్టం: చూ. జంతిక గొట్టం. (తె. 15).

దంతె: ఎరువును తీయడానికి వాడే ఇనప సాధనం. (రా. 16).

దపము: రేకు మందం. (రా. 3).

దప్పం: చెవులకు రంధ్రాలువేసే పనిముట్టు. (రా. 11).

దప్పంరాయి: చూ. పర్యా. గరుకురాయి[1]. వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడేరాయి. (రా. 11).

దబడసుత్తి: చూ. దబరసుత్తి. (కో. 21).

దబరసుత్తి: ఉ, దబర్సుత్తి, దిబరాసుత్తి. రూ. దబడ సుత్తి. చూ. పర్యా. మెరకసుత్తి. అరివేడానికి, డోర్యాలు వేయడానికి, పళ్లేలు మట్నంవేయడానికి, రెండవసారి ఇంకా సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 7, 10, 12).

దబరా[1]: (హిం.) (బ.) దబరాలు. రూ. దబరి. పర్యా. దబరాగిన్నె[1]. కొలత శేరులాగ, కాఫీ గిన్నెలాగా ఉండే వంటపాత్ర. (కో. 2, 3. 5, 12, తె. 14-16; రా. 7, 16).

దబరా[2]: చూ. పర్యా. దేక్షా. వంట చేయడానికి వాడే పాత్ర. ఏటవాలు భుజాలతో అడుగుభాగం వెడల్పుగ ఉంటుంది. చూ. చిత్రం 123. (తె. 12, 18, 19).

దబరాగిన్నె[1]: చూ. పర్యా. దబరా[1]. కొలత శేరులాగ, కాఫీగిన్నెలాగ ఉండే వంటపాత్ర. (కో. 25; రా. 8).

దబరాగిన్నె[2]: ఉ. దబ్రాగిన్నె. రూ. దబరిగిన్నె, దవిరిగిన్నె. పచ్చడికి వాడే లోహపుపాత్ర. (కో. 7, 10; తె. 21).

దబరాగిన్నె[3]: చూ. పర్యా. డబ్బాగిన్నె. పొలాల్లోకి అన్నం తీసుకెళ్ళడానికి వాడే మూత - చిలుకు అమర్చిన పాత్ర. (కో. 15).

దబరాగిన్నెలకరవాయి: పర్యా. వంటగిన్నెల కరవాయి. కూరగిన్నెలు తయారుచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 4, 9, 11).

దబరాలగునపం: చూ. పర్యా. గెడ్డపార. చెంబుల అడుగులు సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 88. (కో. 7).

దబరి: చూ. దబరా[1]. (రా. 12).

దబరిగిన్నె: చూ. దబరాగిన్నె[2]. (తె. 21).

దబాయించు: (క్రి.) రూ. దబ్బాయించు. పర్యా. దులగొట్టు[2]. అచ్చులోనుండే పాత్రను తీయడానికి పోతపాత్రను చిన్నగ కదిలిస్తూ కొట్టడం. (తె. 23, 25).

దబాయించేసుత్తె: లోహాన్ని పోసినతర్వాత పోత పాత్రను తీసేటప్పుడు అచ్చును దబాయించడానికి వాడే పరికరం. (తె. 25).

దబుల్‌చుక్కరపోగరు: (< ఇం. Double + చుక్కపోగరు). చూ. పర్యా. దట్నపోగరి. విగ్రహాన్ని డిజైనులాగా చేయడానికి వాడే పరి కరం. (కో. 6).

దబ్బ[1]: వెల్డింగ్‌పనిలో ఇనపపట్టీలను డిజైన్లుగా వంపుచేయడానికి వాడే F ఆకారపుకడ్డీ. (రా. 12).

దబ్బ[2]: పర్యా. బెల్‌కట్టు. బెల్‌పట్టి[1]. లోహపురేకు లను కత్తిరించడానికి వాడే పరికరం. (రా. 10).

దబ్బ[3]: చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనుంపైనుండి తీయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 5. (రా. 11).

దబ్బ[4]: కొలిమిలో ఉండే సిమిడి, దుమ్మును ఎత్తి వేయడానికి వాడే సాధనం. (రా. 4).

దబ్బకాయగిన్నె: పర్యా. కోసుగిన్నె, మెరకగిన్నె. మట్టులేని చిన్న లోహపుపాత్ర. (కో. 13. 16).

దబ్బణం: గోతాలు కుట్టుకోడానికి ఉపయోగపడే పెద్దసైజు సూది చూ. చిత్రం 132. (కో. 14, 15; రా. 6).

దబ్బపోగరు: చూ. పర్యా. కట్టుశిలపోగరు. బండి

ం కొనభాగాన రంధ్రం వేయడానికి ఉపచే పరికరం. (రా. 4).
ు: (క్రి.) చూ. దెబ్బవేయు. (కో. 23, 3).
ంచు: (క్రి.) చూ. దబాయించు. (తె. 17).
ుత్తి: కట్నలు చేయడానికి వాడే సాధనం. ).
పొయ్యికి గాలిరావడానికి ఏర్పాటుచేసిన ం. ఒక డబ్బాలో నీళ్ళుపోసి దానిలో మరొక బోర్లించి పైకి, క్రిందికి అంటూంటే ద్వార గాలి వస్తుంది. (కో. 23).
: చూ. దిమిసె. (రా. 12).
ఇనపకత్తిపీట, కొడవలి. (తె. 10, 11).
పట్టె: పోతపాత్రను తయారుచేయడానికి కొయ్య చట్రం. (తె. 8, 9).
: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువుల ండే బొడిపెలు. (కో. 22, 26, 28).
ర్యా. నిప్పుప్లేట్, బాయలర్‌బిళ్ళ, బాయిలర్ బాయిలర్‌తట్ట, బాయిలర్‌ప్లేటు, బాయిలర్ , బాయిలేర్‌గెంట, నిప్పును, బూడిద రాల బాయిలర్ అడుగుభాగాన అమర్చిన రంధ్రాల చూ. చిత్రం 173.1. (తె. 3).
: చూ. పర్యా. గుడ్డకత్తెర. గుడ్డలు కత్త డానికి దర్జీ వాడే సాధనం. చూ. చిత్రం 78. 7).
చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై బొడిపెలు (తె. 24).
యు: (క్రి.) చూ. పర్యా. కలగొట్టు. పాత్రల రంధ్రాలను మూసేయడం. (తె. 17).
న్నె: చూ. దబరాగిన్నె[2]. (తె. 20).
సుత్తె: ఉ. దవిరిసుత్తె, దవుర్‌సుత్తె, దవురి . చూ. పర్యా. తీర్వానంసుత్తె. బిందె గాన రేకును సాపుచేయడానికి వాడే పనిముట్టు. 19, 21, 25).
చూ. పర్యా. కన్నం. పాత్రలకుండే రంధ్రం. 8).
న్నె[1] : చూ. పర్యా. గుత్తిగిన్నె. నాల్గు లకూరలు వేసుకొని ఒకేసారి వడ్డించడానికి గా చేసినట్టి లోహపుపాత్ర. చేత్తో పట్టుకోడానికి కాడవుంటుంది. చూ. చిత్రం 87. (కో. 25,
న్నె[2]: చూ. పర్యా. కూరదాక. కూరలు చేయడానికి వాడే కొద్దిపాటి పొడవు, వెడల్పు ఉన్న పాత్ర. చూ. చిత్రం 65. (కో. 18; తె. 17, 18).
దస్తానా: చూ. పర్యా. కవరు[1]. వెల్డింగ్ చేసేటప్పుడు కరెంట్ షాక్ కొట్టకుండ ఉండడానికి చేతులకు వేసుకొనే చర్మపుతొడుగు. (తె. 4).
దస్తాపెట్టు: (క్రి.) సైజువారిగా ఒక గిన్నెలో మరొకటి దిగేటట్లు పెట్టడం. (కో. 12).
దస్తిగిన్నె: ఏవైన పదార్థాలను నిల్వ ఉంచుకోడానికి వాడే టిఫిన్. ఇవి సైజుప్రకారం ఉంటాయి. పాత్రపై మూత, హాండిల్ ఉంటాయి. (తె. 17).
దాక: రూ. డాక[2]. చూ. పర్యా. కూరదాక. కూరలు చేయడానికి వాడే కొద్దిపాటి పొడవు వెడల్పు ఉన్న పాత్ర. చూ. చిత్రం 65. (కో. 20-23, 27-30).
దాకలి: ఉ. దాకల, దాకాల. చూ. పర్యా. కూరదాక. కూరలు చేయడానికి వాడే కొద్దిపాటి పొడవు, వెడల్పు ఉన్న పాత్ర. చూ. చిత్రం 65. (కో. 14, 16, 19, 27; తె. 6, 18-20).
దాఖని: రూ. దాగిని. చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకనుచూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవు కడ్డీ. (రా. 10).
దాగరి: చూ. పర్యా. దనగా. ఇనుపకడ్డీలను కట్ చేసి, లెవలు చేయడానికి వెల్డింగ్‌పనిలో ఉపయోగించే దిమ్మ. (కో. 13, 14, 16-30).
దాగలి[1]: రూ. డాకలి[4]. పర్యా. ఇనపమొద్దు, పట్టెడ, రైలుకమ్మి దాగలి, రైలుపట్టా దాగలి, రైలుబడ్డీ దాగలి, రైల్వేగాడి దాగలి. లోహపు కమ్మిని రేకు బిళ్ళల్ని సాగ్గొట్టడానికి వాడే రైలుకమ్మిలాగా ప్లాటుగాఉండే ఇనప దిమ్మ. (కో. 11, 13, 18, 19-21, 24, 28, 29, 39).
దాగలి[2]: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 26; రా. 15).
దాగలిదిమ్మ: చూ. పర్యా. చట్రం[1]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 25).
దాగిని: చూ. దాఖని. (తె. 1; రా. 6, 10, 13).
దాట్లు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (తె. 1).
దాణి: సన్నకారాలు పిండుకోడానికి వాడే లోహపు అచ్చు. చూ. చిత్రం 133. (రా. 14).
దానంగ్లాసు: (< దానం + ఇం. Glass) పర్యా.

రాంపాత్ర గ్లాసు. చావు కర్మలు చేసేటప్పుడు దానం ఇవ్వడానికి వాడే పల్చని ఇత్తడిరేకు గ్లాసు. (తె.19).

దానంచెంబు: చూ. పర్యా. కుంబకోణం చెంబు. దానం చేయడానికి ఉపయోగించే చిన్న లోహపు పాత్ర. (తె. 19; రా. 16).

దానాబుట్ట: పశువులకు తవుడుపెట్టడానికి ఉపయోగపడే లోహపు తట్ట. చూ. చిత్రం 134. (కో. 4, 9).

దాయ: చూ. పర్యా. దాలి. బండిపట్టాను వేడి చేయడానికి వాడే వలయాకారపు నుగ్గులబట్టీ. (కో. 19).

దారం: గొడుగుపుల్లను, గొడుగుగుడ్డను కలిపి ఉంచడానికి ఉపయోగించే తాడు. (కో. 23, 28; తె. 25).

దారం ఉలి: నలిగినదారాన్ని నరకడానికి వాడే పరికరం. (రా. 2).

దారిమోపు: బీరువాకాళ్లు సరిచేయడానికి వాడే గుండ్రని పరికరం. (కో. 4, 9, 11).

దారు: పదునుపెట్టడానికి వీలుగా కత్తులకు చేయబడిన భాగం. (కో. 20, 21).

దారు ఏయు: (క్రి.) చూ. పర్యా. సరుసు. మొద్దు కత్తులను పదునుపెట్టడానికి వీలుగా ఏటవాలుగ పల్చగ అదరగొట్టడం. (కో. 28, 29).

దారుచేయు: (క్రి.) చూ. పర్యా. సరుసు. పదును పెట్టడానికి వీలుగా ఇనుపకడ్డీని వెడల్పుగ, పల్చగ చేయడం. (కో. 23, 24, 27).

దారుపట్టు: (క్రి.) చూ. పర్యా. సరుసు, కత్తుల, కత్తెరల అంచుల్ని పదునుపెట్టడానికి వీలుగా ఏటవాలుగా, పల్చగా అదరగొట్టడం. (కో. 23).

దారుశానం: చూ. పర్యా. అడ్డగళ్ళి. రేకులు, కడ్డీలు తెగ్గొట్టడానికి ఉపయోగించే దిమ్మ. (కో. 21).

దార్లబద్దీ: రూ. దార్లీబద్ద. పర్యా. దార్లేపట్టి, పట్టీ[2], బద్ది, బారదరుపట్టీ, బార్లపట్టీ, లెవల్‌బద్దీ, లేవిడిబద్దీ. బీరువాఅంచులు వంపులు లేకుండ సరిచేయడానికి వాడే పనిముట్టు. (కో, 18, 26).

దార్లీబద్ద: చూ. దార్లబద్దీ. (కో. 26).

దార్లేపట్టి: చూ. పర్యా. దార్లబద్దీ. బీరువాఅంచులు వంపులులేకుండ సరిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 17).

దాలి: చూ. పర్యా. దాయ. బండిపట్టాను వేడీ చేయడానికి వాడే వలయాకారపు నుగ్గులబట్టీ. (తె. 23, 24).

దాలికాల్చు: (క్రి.) ఇనుపపట్టాను రోదకెక్కించడానికి వీలుగా పట్టాను మెతువుచేయడానికి పిడకల్తో కాల్చడం. (తె. 19).

దిగేయు: (క్రి.) బండికుంచంలో ఉలవపాదును కదలకుండ గట్టిగ కూర్చోబెట్టడం. (కో. 19).

దిగ్గొట్టు[1]: (క్రి.) బండిచక్రంలో తయారుచేసిన భాగాలు కదలకుండ బిగించికొట్టడం. (తె. 21, 28).

దిగ్గొట్టు[2]: (క్రి.) ఎద్దులగిట్టలలోనికి సీలలు దిగేటట్లు కొట్టడం. (రా. 6).

దిగోడ: పెట్టెలు తయారుచేయడానికి ఉపయోగించే ఇనపపరికరం. (తె. 8, 9).

దించు: (క్రి.) ఉ. దంచు. చూ. పర్యా. దండుకట్టు. పాత్రఅంచులోపల ఒక కడ్డీని ఉంచి దట్టంగ బిగించడం. రేకుభాగాలు ఊడిపోకుండ గట్టిగ బిగించడం. (కో. 5; తె. 7, 12; రా. 4).

దించుకొను: (క్రి.) విగ్రహాన్ని తయారుచేయడానికి ముందు కాగితం. (తె. 4).

దిండు[1]: పర్యా. దుండ్రడ. తరిణిపనిలో ఉపయోగించే ఒక అడ్డుకొయ్య. దీనికి ఒక చివరగ్లాసులు మొదలయినవి అతికిస్తారు. (తె. 7, 18, 21; రా. 16).

దిండు[2]: చూ. పర్యా. కట్టర్‌దిమ్మ. ఇనుపకడ్డీలను కట్‌చేసి, లెవల్ చేయడానికి ఉపయోగించే దిమ్మ. (తె. 8, 9).

దిండ్లకరవాయి: చూ. పర్యా. కూజాకరవాయి. కూజా ఆకారపు బిందెలను తయారుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 177. (తె. 24).

దినుసుడబ్బా: చూ. పర్యా. డబ్బా[1]. పప్పులు, పిండి వగైరా పదార్థాలు నిల్వఉంచడానికి వాడే మూతఉన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 121. (కో. 7).

దిబ్బడసుత్తి: చూ. దిబ్బసుత్తి. (కో. 16).

దిబ్బసుత్తి: రూ. దిబ్బడసుత్తి. చూ. పర్యా. మేరకసుత్తె. సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 24).

దిమిసె: ఉ. దమసు. రూ. దమ్మసు. పర్యా. దొడ్డుసుత్తె, పన[2]. లోహపురేకులను, కడ్డీలను చదరం చేయడానికి వాడే పరికరం. (కో. 2, 10, 13; రా. 4, 10).

దిమిసెవేయు: (క్రి.) టంకపెట్టెల రేకులు శుద్ధం చేయడం. (రా. 4).

దిమ్మ[1]: చూ. పర్యా. కట్ట. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి ఉపయోగపడే మోపు. (కో. 5, 6, 15, 16, 20, 22, 29; తె. 1-4, 7, 14, 17-24; రా. 3, 4, 7).

దిమ్మ[2]: చూ. పర్యా. గద్ద. టార్చిలైట్‌లో బల్బును ఉంచడానికి అమర్చిన దిమ్మ. (తె. 1, 3, 4, 10, 17, 21, 22, 23, 25).

దిమ్మ[3]: ఉ. దిమ్మె. చూ. పర్యా. గుల్లమోపు. లోహపు రేకులపై, పట్టీలపై సులువుగ రంధ్రాలేయడానికి వాడే సాధనం. (కో. 2, 8, 22; తె. 4, 17, 25; రా. 3. 16).

దిమ్మె: చూ. పర్యా. ఎక్కువదిమ్మ. లోహపురేకుల జాయింట్లకు రివిట్లు కొట్టడానికి వాడే సాధనం. (రా. 4, 15).

దిమ్మెగొడ్డలి: వంటకట్టెలు చీల్చుకోడానికి ఉపయోగ పడే సాధనం. (రా. 4).

దిమ్మెసమ్మెట: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడేమోపు. (కో. 6).

దింపు[1]: (క్రి.) చూ. పర్యా. తొడుగు[2]. బండిరొదాకు ఇరుసును బిగించడం. (తె. 21).

దింపు[2]: (క్రి.) చూ. పర్యా. దండుకట్టు. పెట్టె మూతకు బార్‌కొట్టడం. (రా. 15).

దింపుకొను: (క్రి.) చూ. పర్యా. దండుకట్టు. రేకును అంచులాగ వంచుకోవడం. (కో. 5).

దింపుడుసుత్తి: చూ. పర్యా. సమ్మెట. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడే పెద్దసైజు సుత్తి. (కో. 6, 12).

దిష్: చూ. డిష్. (కో. 28).

దిసేసుకొను: (క్రి.) సైకిల్‌పిన్నులు దించుకోవడం. (కో. 14).

దీపపుకుండె: దీపంకుంది. (కో. 7).

దీపపుప్రమిద: చూ. దీపప్రమిద. (తె. 1, 6).

దీపపుసెమెయ్: చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 58. (తె. 24).

దీపపుస్తంభం: చూ. దీపస్తంభం. (కో. 11; తె. 6, 7, 25).

దీపప్రమిద: రూ. దీపపుప్రమిద, దీపంప్రమిద. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 135. (కో. 1).

దీపస్తంభాలు: చూ. పర్యా. కుందులు. దీపారాధనకు వాడే ఇత్తడి లేదా స్టీలుతో చేసిన చిన్నస్తంభాలు. (కో. 1; రా. 12, 13).

దీపస్తంభం: రూ. దీపపుస్తంభం. దీపం వెలిగించ డానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 136. (కో. 1, 16; తె. 8-10, 13, 21; రా. 12).

దీపం: పర్యా. దీపాంతాలు. నూనెవేసి దీపం వెలిగించే ప్రమిద (రా. 11, 13).

దీపంకుంది: రూ. దీపపుకుండె. చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి ఉపయోగపడే లోహపు పరికరం. చూ. చిత్రం 58. (కో. 2, 18, 29; రా. 6).

దీపంచెమ్మె: ఉ. దీపంచెమ్మ. చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 58. (కో. 26, 28; తె. 5).

దీపంప్రమిద: చూ. దీపప్రమిద. (కో. 28; తె. 24).

దీపంబుడ్డి[1]: చూ. పర్యా. నందాదీపం. మధ్యలో ఒక గొట్టం వుండి దానిద్వారా వత్తిని ఎక్కించి వెలిగిం చడానికి వీలుగా రేకుతో చేసిన బుడ్డి. చూ. చిత్రం 141. (రా. 3, 5, 10)

దీపంబుడ్డి[2]: రంగుతో డిజైను వేయడానికి ఉపయోగ పడే పనిముట్టు. (కో. 28).

దీపంసెమ్మెలు: చూ. పర్యా. చెమ్మెలు. దీపంవెలిగించ డానికి వాడే లోహపు సాధనాలు. చూ. చిత్రం 103. (కో. 12, 25; రా. 8).

దీపాదులు: దీపంపెట్టుకోడానికి వాడే లోహపు పరికరం. (తె. 9).

దీపారాదన్లు: చూ. పర్యా. చెమ్మెలు. దీపం వెలిగించ డానికి వాడే లోహపు సాధనాలు. చూ. చిత్రం 103. (రా. 7).

దీపారాధన: చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించ డానికి వాడే లోహపు పరికరం. (తె. 10, 11).

దీపారాధన కుందులు: చూ. పర్యా. కుందులు. దీపారాధనకు వాడే ఇత్తడి లేదా స్టీలుతోచేసిన చిన్న స్తంభాలు. (కో. 4, 5, 9, 12).

దీపాంతాలు: చూ. పర్యా. దీపం. నూనెవేసి దీపం వెలిగించే ప్రమిదలు. (తె. 17).

దీపాంతెలు: చూ. పర్యా. చెమ్మెలు. దీపంవెలిగించే డానికి వాడే లోహపు సాధనాలు. చూ. చిత్రం 103. (రా. 13).

దీపింత: చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. (తె. 4).

దుకాణం: చూ. పర్యా. కరుగుకొలిమి. లోహాలను వేడిచేయడానికి ఉపయోగించే పొయ్యి. చూ. చిత్రం 69. (కో. 16-30).

దుక్క[1]: ఉ. దొక్క. చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండ పట్టి ఉంచడానికి వాడే కొయ్యమొద్దు. (కో. 8, 16, 20, 21-29).

దుక్క[2]: పర్యా. దుంగ[2]. పనిముట్లకింద ఎత్తుగ ఉంచడానికి వాడే కొయ్యతుండు. (కో. 4, 8, 19, 21, 22).

దుక్క[2]: రేకులను గొయ్యిలాగ చేయడానికి వాడే సాధనం. (కో. 17).

దుంక: చూ. పర్యా. కన్నం. పాత్రల్లో ఏర్పడే రంధ్రం. (రా. 5).

దుంకపొడుచు: (క్రి.) చూ. పర్యా. డొలచేయు. మట్టిలోరంధ్రం చేయడం. (రా. 5).

దుంకలు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (కో. 8).

దుంకవేయు: (క్రి.) చూ. పర్యా. డొలచేయు. దీపస్తంభాల్లో రంధ్రాలు చేయడం. (రా. 5).

దుంగ[1]: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండా పట్టిఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (తె. 18).

దుంగ[2]: చూ. పర్యా. దుక్క[2]. పనిముట్లక్రింద ఎత్తుగా ఉంచడానికి వాడే కొయ్యతుండు. (కో. 14, 16).

దుడ్డీ: టింకరపనిలో ఉపయోగపడే కొయ్యపరికరం. (కో. 28).

దుడ్డు: చూ. పర్యా. క్రగూటం. అచ్చుల్లో మట్టిని కూరడానికి వాడే సాధనం. (కో. 21).

దుండి: పోతపాత్రలను మట్నవేయడానికి వాడే సాధనం. (కో. 29).

దుండు[1]: బిందెల అడుగులు సాపుచేయడానికి వాడే దిమ్మ. (కో. 28, 29).

దుండు[2]: ఇత్తడిపాత్రలను అతికినతర్వాత సాపు చేయడానికి వాడే పరికరం. (కో. 27, 28).

దుండుచేయు: (క్రి) ఇనుమును బండి ఇరుసులాగ లావుచేయడం. (రా. 13).

దుండె: స్టౌ పంపు బారల్‌ను సరిచేయడానికి వాడే లావుపాటి గుండ్రనికొయ్య. (తె. 3).

దుండ్రడ: చూ. పర్యా. దిండు[1]. తరిణిపనిలో ఉపయోగించే ఒక అడ్డుకొయ్య. దీనికి ఒకచివర గ్లాసులు మొదలయినవి అతికిస్తారు. (తె. 21).

దుత్త: నీళ్ళు తేవడానికి ఉపయోగించే చిన్న లోహపు బిందె. (కో. 6).

దుద్దు: (క్రి.) చూ. పర్యా. పూయు. పాత్రలో భాగాలలో కళాయిపూయడం. (రా. 3).

దుంబు: చూ. పర్యా. లెటరు. కాగితాలు వగైరా చిన్న చిన్న వస్తువులను ఉంచడానికి ట్రంకుపెట్టె మూతకు అమర్చిన అర. (రా. 15).

దులగొట్టు[1]: (క్రి.) పర్యా. రుద్దు.[1] గట్టిగఉన్న మట్టిని మెత్తగాచేయడం. (కో. 19).

దులగొట్టు[2]: (క్రి.) చూ. పర్యా. దబాయించు. అచ్చులోఉండే పాత్రను తీయడానికి పోతపాత్రను చిన్నగ కదిలిస్తూకొట్టడం. (కో. 26).

దూకుడు: బ్యాటరీ సెల్సుచుట్టూఉండే రింగు. (కో.29).

దూది[1]: మైనం అచ్చువిగ్రహంచుట్టూ పుంతమట్టిని అతికించడానికి మట్టిలోకలిపే పత్తి. (తె. 17).

దూది[2]: కళాయిని బిందెకు పూయడానికి ఉపయోగించే గుడ్డ. (కో. 1).

దూదిగుండి: పైభాగాన కొళాయిఉన్న నిలువుపాత్ర. (తె. 13).

దూపహార్తి:- చూ. దూపారతి. (కో. 28).

దూపారతి: (< దూప + సం. హారతి). రూ. దూపహార్తి; దూపార్తి, దో ఆర్తి. పర్యా. ఏకార్తి. దీపం వెలిగించి హారతిపట్టడానికి వాడే చిన్న గరిట. చూ. చిత్రం 137. (తె. 2).

దూపార్తి: చూ. దూపారతి. (కో. 13).

దూర్చు: (క్రి.) చూ. పర్యా. జంటించు. రెండు రేకులను ఒకదానితో ఒకటి ఎక్కించి ఆకారాన్ని చేయడం. (కో. 24).

దూళుచేయు: (క్రి.) చూ. పర్యా. దంచు[1]. గట్టిగ ఉన్న నవాసారాన్ని మెత్తగా పొడిచేయడం. (రా. 3).

దెబ్బ ఏయు: (క్రి.) రూ. దెబ్బవేయు. చూ. పర్యా. సమ్మెటేయు. సాగగొట్టడానికి వీలుగా కాలిన ఇనుమును సమ్మెటతో బలంగా కొట్టడం. (కో. 22, 28).

దెబ్బకొట్టు: (క్రి.) చూ. పర్యా. సమ్మెటేయు. కాగిన ఇనుమును సాగగొట్టడానికి సమ్మెటతో కొట్టడం. (కో. 26; తె. 19).

దెబ్బలసుత్తి: బిందెపై మట్నచుక్కలు కొట్టడానికి వాడే పరికరం. (కో. 24).

దెబ్బలు: బిందె సాపుగారావడానికి వేసే పోట్లు. (కో. 24).

దేక్చి: చూ. దేక్షా. (రా. 13, 14).

దేబద్దీ: పర్యా. బద్దులు, బొద్దుచట్టం, రేకులపై బొద్దులు కొట్టడానికి ఉపయోగపడే పరికరం. (కో. 23).

దేవు: (క్రి.) కాలే నూనెలోని పిండిపదార్థాలను జల్లి గంటెతో పైకితీయడం. (తె. 3, 15).

దేశంబిందె: చూ. పర్యా. మొద్దుబిందె. వెడల్పుగా ఉండే ఇత్తడిబిందె. ఒకొక్క దేశంలో ఒకొక్క రకంగా ఉంటుంది. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. (తె. 23).

దొంచు: (క్రి.) పాత సిల్వర్‌సామానులు ముద్దగా

అణగ్గొట్టడం. (రా. 14).

దొడ్డసాన: చూ. పర్యా. గరకురాయి[2]. మొదుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడానికి వాడేరాయి. (తె. 23).

దొడ్డి[1]: చూ. పర్యా. కరుగుకొలిమి. లోహాలను కరగబెట్టడానికి ఉపయోగించే పొయ్యి. చూ. చిత్రం 69. (కో. 4).

దొడ్డి[2]: ఉ. దొడ్డు పోతపాత్రను తయారుచేయడానికి వాడే కొయ్యచట్రం. (కో. 8, 11, 14, 16, 19, 20, 24, 26).

దొడ్డి[3]: కరిగిన అల్యూమినియాన్ని పోసుకొనే పాత్ర. (కో. 2).

దొడ్డి[4]: తలుపులు లేకుండ ఉండే బీరువా భాగం. (కో. 21).

దొడ్డి[5]: పైమూతలేని ట్రంకుపెట్టె మిగతాభాగం. (కో. 19).

దొడ్డు: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడేమోపు. (తె. 6).

దొడ్డుకంకర: చూ. పర్యా. గరుకురాయి[1]. వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడేరాయి. (తె. 20; రా. 14, 16).

దొడ్డుపోగరు: చూ. పర్యా. దట్నపోగరి. విగ్రహంలో ఉబ్బెత్తుగా ఉన్నదాన్ని సాపుచేయడానికి వాడే పరికరం. (తె. 18).

దొడ్డుఫైలు: (< దొడ్డు + ఇం. file). వాచర్‌లను రాకడానికి వాడే పరికరం. (తె. 4).

దొడ్డుసుత్తె: చూ. పర్యా. దిమిసె. లోహపురేకులను, కడ్డీలను చదరం చేయడానికి వాడే పరికరం. (తె. 18).

దొడ్డె: ఉ. దొడ్డి, దొడ్డు. చూ. పర్యా. అడ్డ[1]. బిందె మధ్యభాగపు రేకు. (కో. 14, 15, 19–21, 23, 25, 26, 28; తె. 16).

దొడ్లుకరవాయి: బిందె జప్పరేకు అణచడానికి ఉపయోగించే పనిముట్లు. (కో. 5).

దొండిపెట్టు: (క్రి.) చూ. పర్యా. దొలచేయు. పొట్టు పొయ్యికి రంధ్రం పెట్టడం. (రా. 1).

దొనెదట్టు: విగ్రహంలో ఉబ్బును సాపుచేసే పరికరం. (కో. 3).

దొప్ప: చూ. పర్యా. అడుగు, ఇత్తడి. ఇనుపపాత్రల కొంచెం గుంతగా ఉండే అడుగుభాగపు రేకు. (కో. 6, 9).

దొంపు: (క్రి.) చూ. దంచు[1]. (రా. 13).

దొర్లించు: (క్రి.) పర్యా. పర్మాతీయు, లపేటతిప్పు. లోహపు రేకుపై స్కేలుతో కొలతలు వేయడం. (కో. 23).

దొలకడ్డి: ఇనుప కడ్డీలపై రంధ్రాలు చేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 27).

దొలదుక్క: చూ. డొలదుక్క. (కో. 13).

దోఆర్తి: చూ. దూపారతి. (కో. 11).

దోటికత్తి: మండలు, చెట్టుపైనున్న ఆకులు కోసుకోడానికి ఉపయోగపడే సాధనం. పొడుగాటి కర్రకు కొడవలి అమర్చిఉంటారు. (రా. 2).

దోడితపేల: చూ. పర్యా, జోడుతపిలె. నీళ్ళు ముంచుకోడానికి వాడే వెడల్పుమూతి ఉన్న నిలువు పాత్ర. చూ. చిత్రం 111. (రా. 3, 4).

దోనె: చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదునుపెట్టడానికి, కాక రావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే నీటిపాత్ర. (కో. 29).

దోనెపోగరు: చూ. పర్యా. కొరుపోగరి. విగ్రహం కోణాల్లో, చిన్నభాగాల్లో మెరుగుగీతలు కొట్టడానికి ఉపయోగించే మొల. (కో. 3).

దోనెరాయి: ఉ. దోనిరాయి. చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదునుపెట్టడానికి, కాక రావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే నీటిపాత్ర (కో. 21; తె. 2).

దోపుటు: చూ. దోపుట్. (తె. 3).

దోపుట్: (హిం.) రూ. దోపుటు. చూ. పర్యా. అడికోలు. లోహపురేకులపై, కడ్డీలపై కొలతలు వేయడానికి వాడే పరికరం. అంగుళాలు, అంగుళాం భాగాలు గుర్తించిన రెండడుగుల పొడవుంటుంది. (తె. 6).

దోసకాయాకుపరా: చూ. పర్యా. దోసకాయచెంబు, దోసకాయ ఆకారంతో ఉండే సాదాచెంబు. (కో. 16, 29).

దోసకాయచెంబు: పర్యా. ఆకుపరాచెంబు, ఆకుపార, దోసకాయాకు పరాచెంబు, దోసచెంబు. దోసకాయ ఆకారంతో చేసిన లోహపుపాత్ర. క్రిందిభాగంలో మట్టుపైఅంచుకి తలభాగం మీద బొద్దు ఉంటుంది. (కో. 7, 10, 24, 29, 37).

దోసచెంబు: చూ. పర్యా. దోసకాయచెంబు. దోసకాయ ఆకారంతో ఉండే సాదాచెంబు. (కో. 12).

దోసెకాడ: చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనంపైనుండి తీయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 5. (రా. 4).

దోసెగంటి: చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనుంపైనుండి తీయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 5. (రా. 2).

దోసెగరటు: చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనుంపైనుండి తీయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 5. (కో. 1).

దోసెతుడప: దోసెపోయడానికి ముందు పెనుంమీద తుడచడానికి వాడే చమురుతోకూడిన గుడ్డ. దీన్ని చిన్న ఇనపకమ్మికి కట్టి ఉంటారు. (కో. 1).

దోసెపెనుం: చూ. పర్యా. అట్లపెనుం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. (కో. 1; తె. 10, 11; రా. 4, 6, 7, 8, 12, 13).

దోసెపెంక: చూ. పర్యా. అట్లపెనుం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (తె. 7).

దోసెపెంచు: చూ. పర్యా. అట్లపెనుం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (రా. 1, 3).

దోసెప్లేటు: (< దోసె+ఇం. Plate) చూ. పర్యా. గులాబిప్లేటు. కొద్ది లోతుఉన్న పళ్ళెం, పాత్రలపై మూయడానికి ఉపయోగం. అంచులు వొంకీలుగ ఉంటాయి. (కో. 23).

దోసెరేకు: చూ. పర్యా. అట్లపెనుం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (కో. 1, 2; రా. 2).

దౌరుగిన్ని: కూరలు నిల్వచేసుకోడానికి వాడే పొడవాటి స్టీలుపాత్ర. (తె. 2).

ద్రావకం: చూ. పర్యా. ఆసిడ్. విగ్రహాన్ని మెరుగు పరచడానికి ఉపయోగించే ద్రవపదార్థం. (కో. 3).

ద్రాక్షాకు: ద్రాక్ష ఆకు ఆకారంలో ఉన్న అంచులేని భోజనం ప్లేటు. (కో. 12).

ద్వాపరతోరణం: దేవాలయంలో తలుపుదగ్గర ఉండే అలంకరణ. (కో. 6).

## ధ

ధడ్: పైమూతలేని ట్రంకుపెట్టె మిగతాభాగం. (తె.6)

థర్మాస్: పర్యా. ప్లాస్కు. కాచిన పాలు, కాఫీ పోసుకోడానికి వాడే పరికరం. వేడి చల్లారకుండా నిరోధించడానికి వీలుంటుంది. చూ. చిత్రం 172. (తె. 8).

ధార్[1]: పొడుగ్గా లావుగాఉన్న పట్టి. పచ్చికొట్టడానికి ఉపయోగం. (తె. 6).

ధార్[2]: రేకు మడుపు. (తె. 3).

ధార్‌చేయు: (క్రి.) రేకును చక్కగ బెండ్‌చేయడం. (తె. 2).

ధార్‌మాడు: (క్రి.) పదునుపెట్టేటప్పుడు కత్తుల అంచులు నల్లగ మాడిపోవడం. (తె. 22).

ధారాపాత్ర: శివునికి అభిషేకం చేయడానికి వాడే పైభాగం వెడల్పుగా ఉండేపాత్ర. దీని అడుగు భాగంలో నంది తలలాగచేసి దాని బెజ్జంనుంచి శివలింగంపై అభిషేకానికి నీటి బిందువులు పడేటట్లు ఏర్పాటు వుంటుంది. చూ. చిత్రం 138. (కో. 10, 11, 12, 13, 16; తె. 1-2, 17, 19, 24; రా. 11, 13).

ధూతి: చూ. పర్యా. అడకత్తెర. పచ్చివక్కలను కత్తిరించడానికి ఉపయోగించే సాధనం. (తె. 22).

ధూపకం: పర్యా. ధూపంచెంచా, ధూపహారతి, పంచధూపహారం. ధూపహారతివ్వడానికి వాడే పరికరం. చూ. చిత్రం 139. (రా. 5).

ధూపహారతి: ఉ. ధూపహార్తి. రూ. ధూపార్తి. చూ. పర్యా. ధూపకం. సాంబ్రాణి హారతివ్వడానికి వాడే పరికరం. చూ. చిత్రం 139. (తె. 21; రా. 15).

ధూపంచెంచా: చూ. పర్యా. ధూపకం. ధూపహారతివ్వడానికి వాడే పరికరం. చూ. చిత్రం 139. (కో. 24).

ధూపార్తి: చూ. ధూపహారతి. (తె. 4).

ధ్వజస్తంభం తొడుగు: దేవాలయాల్లో ధ్వజస్తంభానికి కప్పిన లోహపురేకు. (కో. 12).

## న

నకల్: (< హిందీ) చూ. పర్యా. కుక్కారు. బండి చక్రానికి పట్టాలను ఎక్కించడానికి ఉపయోగించే పనిముట్టు. (తె. 4).

నక్క: చూ. పర్యా. కుక్కారు. బండి చక్రానికి కమ్ములను బిగించడానికి ఉపయోగించే సాధనం. (తె. 18).

నక్కలుతీయు: (క్రి.) రూ. నగ్గులుతీయు. రేకును కొంచెం గుంతగాచేయడం. (రా. 13).

నక్కు: ఉ. నొక్కు. భూమిని దున్నడానికి వాడే నాగలికి బిగించిన ఇనపపరికరం. (కో. 24, 26, 27, 29).

నక్షత్రంమాల: చూ. పర్యా. నక్షత్రార్తి. దేవుని గుడిలో ఇరవైఏడు దీపాలుపెట్టి వెలిగించడానికి వాడే గుంటలున్న లోహపు సాధనం. (కో. 12).

నక్షత్రార్తి: చూ. పర్యా. నక్షత్రంమాల. దేవుని

గుడిలో ఇరవైఏడు దీపాలుపెట్టి వెలిగించడానికి వాడే గుంటలున్న లోహపు సాధనం. (కో. 12).

నక్సప్లేటు: అన్నం తినడానికి ఉపయోగపడే డిజైన్లున్న పళ్లెం. (తె. 5).

నక్సీప్లేటు: (< హిం. నక్సీ + ఇం. Plate) చూ. పర్యా. రాగిపళ్లెం. పూజాసామగ్రి తీసుకెళ్ళడానికి వాడే రాగిపళ్లెం. (రా. 12).

నగాను: (క్రి.) విగ్రహానికి ముక్కు, చెవులు ఏర్పర్చడం. (రా. 1, 5).

నగిషీసుత్తి: ఇత్తడినగలు నగిషీ కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 6, 12).

నగుఉలి: పర్యా. లోపగిదరిలేగ, లోపట్టుకమ్మి, లోపలిలేగ, లోభాగంపట్టి. లోహపుపాత్ర లోభాగాన పాలిష్‌పనిలో మెరుగుపెట్టడానికి వాడే పనిముట్టు. (రా. 2).

నగ్గులుతీయు: (క్రి.) చూ. నక్కులుతీయు. (రా. 13).

నచ్చొగం: చూ. పర్యా. డైమీటరు. డ్రమ్ము చుట్టు కొలత. (రా. 8).

నంజుడుతట్ట: భోజన సమయంలో నంజుకొనే తాలింపులు ఉంచుకోడానికి వాడే చిన్నప్లేటు. చూ. చిత్రం 140. (రా. 3, 5).

నట్టు[1]: చూ. పర్యా. రోలు. ఇనపరేకులను అడుగు బిళ్ళలుగా కుదించడానికి మోపుగా వాడే 'L' ఆకారంతో లావుగా గుండ్రంగా బోలుగా ఉండే ఇనపదిమ్మ. (తె. 24).

నట్టు[2]: చూ. పర్యా. గుల్లమోపు. లోహపురేకులపై, పట్టీలపై సులువుగ రంధ్రాలు వేయడానికి వాడే దిమ్మ. (కో. 1, 2, 5. 12–20, 22, 23, 25, 26, 28; తె. 1, 3, 4, 7–12, 17, 20, 21; రా. 1, 6–8, 16).

నట్టురాడ్డు: (< ఇం. Nut Rod). పర్యా. బ్రెష్‌నట్టు. సానరాయిపై ఉన్నమైలను తొలగించడానికి ఉపయోగపడే సాధనం. కడ్డీమధ్యలో రెండు బోల్టులను బిగించి ఉంటారు. (తె. 22).

నడికట్టు: రూ. నడిగట్టు. చూ. పర్యా. డాబు. ట్రంకుపెట్టె మూత వంగకుండ లోపలిభాగాన కొట్టిన నిలువురేకు కట్టు. (కో 2. 10, 13, 18, 23; తె. 17; రా. 4, 8).

నడికట్టుపోగరు: పర్యా. నడికట్టుసుత్తి. ట్రంకుపెట్టె నడికట్టు భాగం తయారుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 2).

నడికట్టుసుత్తి: చూ. పర్యా. నడికట్టుపోగరు. ట్రంకుపెట్టె నడుకట్టు భాగం తయారుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 8).

నడిగట్టు: చూ. నడికట్టు. (కో. 17; రా. 10),

నడిపిసుత్తి: చూ. పర్యా. చిన్నకటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను బెండ్ చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 30).

నడుచు: (క్రి.) గొడుగుకర్రపై ఉండే గొట్టంపైకి క్రిందికి సులువుగ తిరగడం, (కో. 24; తె. 11).

నడుపు: (క్రి.) బిందెను అతికేటప్పుడు లోపల మెల్లగా టంకం పుల్లతో టంకాన్ని కలియ త్రిప్పడం. (కో. 19).

నడుమభాగం: బిళ్ళ, జవ్వకలిసిన పాత్రభాగం. (తె. 10).

నందాదీపం: పర్యా. దీపంబుడ్డి[1]. మధ్యలో ఒకగొట్టం ఉండి, దానిద్వారా వత్తిని ఎక్కించి వెలిగించడానికి వీలుగా రేకుతో చేసినబుడ్డి. చూ. చిత్రం 141. (కో. 19, 23; రా. 15).

నప్పు[1]: (క్రి.) పర్యా. లాగు[2]. లోహపురేకును పాత్ర లాగా మిషనుపై వంచడం. (కో. 22).

నప్పు[2]: (క్రి.) చూ. పర్యా. గుద్దు, మట్టిఅచ్చులు ఊడిరాకుండ గట్టిగ కూరి పోతఅచ్చును బిగించడం. (కో. 26).

నప్పు[3]: చెడిపోయిన తాళంచెవిని సరిచేసి బిగించేయడం. (కో. 18).

నప్పుకొను: డిజైన్ప్రకారం కడ్డీలను తయారుచేయడం. (కో. 16).

నమూనాతీర్చిదిద్దు: చూ. పర్యా. దొక్కుచేయు. ఇత్తడిబిందె రేకులను ఒక ఆకారంగా మార్చడం. (తె. 17).

నయమిదుం: చూ. పర్యా. కారు[1]. కాల్చిన ఇనప బద్దీలను సాపుచేయడానికి వాడే దిమ్మ. (రా. 4).

నయంఉలి: చూ. పర్యా. టారుఉలి. పాత్రను నున్నగా పట్టడానికి వాడే పనిముట్టు. (రా. 2).

నయంచేయు: (క్రి.) ఇనపవస్తువులను కొలిమిలో శుద్ధంచేయడం. (రా. 6).

నయంపట్టు: (క్రి.) పాత్రలకు మెరుగుపట్టడం. (రా. 2).

నయంసుత్తి: నయంచేయడానికి వాడే పరికరం. (కో. 2).

నరాలసుత్తి: ఉ. నరాల్‌సుత్తి. రూ. నర్రల్‌సుత్తి. ఫగులగొట్టిన లోహపుడ్రమ్ముల రేకు అంచులు

సరిచేయడానికి వాడే పనిముట్టు. (రా. 8, 10).

నరాలుతీయు : (క్రి.) రేకుఅంచులను చక్కగా విడదీయడం. (రా. 8, 15).

నరుకు[1]: చూ. పర్యా. తరుగు[1]. పొతవాటి మందంగల రేకులను, ఇనుపకడ్డీలను సైజుప్రకారం ముక్కలుగా కట్‌చేయడం. (కో. 16–23, 30; తె. 4–6, 17–25; రా. 5, 13–15).

నరుకు[2]: (క్రి.) గోతంసంచిని కత్తితో ముక్కలుగా కత్తిరించడం. (రా. 2).

నర్మద: చూ. పర్యా. ఇంజిస్. తలుపులు తిరగడానికి ఫ్రేముకుబిగించే బందులు. (తె. 3).

నర్రల్‌సుత్తి: చూ. నరాలనుత్తి. (రా. 15).

నలగొట్టు: చూ. పర్యా. దంచు[1]. గట్టిగఉన్న టంకాన్ని మెత్తగా పొడిచేయడం. (కో. 19).

నలగ్గొట్టు: (క్రి.) ఎద్దులగిట్టలనుండి పక్కకువచ్చిన సీలలను అణగ్గొట్టడం. (రా. 6).

నలికంఆకుపరా: పైభాగం సన్నగా అడుగుభాగం వెడల్పుగా ఉండే సాదాచెంబు. (కో. 29).

నలికంపంచపాత్ర: మధ్యలో నగిషీ పెట్టిచేసిన పంచపాత్ర. (కో. 29).

నలుపు: (క్రి.) పర్యా. తిక్క[1]. అచ్చుల్లో కూరడానికి గట్టిగ ఉండే మట్టిని చేత్తోమెత్తగా నున్నగా చేయడం. (కో. 20–22, 24, 29; తె. 19, 21; రా. 15).

నల్ల: ఉ. నల్లి. నూనెగుంజే గొట్టంలో నూనె బయటికి రావడానికి ఏర్పాటుచేసిన సాధనం. (తె. 3, 6).

నల్లెలు: పోతచెక్కతొట్లను ఒకటిగా కలిపిఉంచే మడతబందులు. (తె. 23).

నవాచారం: రూ. నవాసాగరం, నవాసారం, నౌసారం. పర్యా. వన్‌సాగరం. కళాయిపనికి వాడే తెల్లని పొడిపదార్థం. (కో. 1, 3–5, 15, 28; రా. 1, 3, 5, 7).

నవాసాగరం: ఉ. నవ్‌సాగర్, నవసాగరం, నవే సాగరం. చూ. నవాచారం. (తె. 3, 4, 6, 12, 17, 19, 20, 21; రా. 12).

నవాసారం: చూ. నవాచారం. (కో. 17, 22, 23, 25–27; 29; రా. 15).

నవిసీచేయు: (క్రి.) రూ. నవుషిచేయు. పూర్తయిన విగ్రహాన్ని మెరుగుపెట్టడం. (కో. 28).

నవుషిచేయు: చూ. నవిసీచేయు. (కో. 16).

నశ్యండబ్బి: పర్యా. ముక్కుపొడుంకాయ. నశ్యం వేసుకోడానికి వాడే డబ్బా. (కో. 3).

నష్టపోవు: (క్రి.) బీగాల రిపేరిలో ఒకటి. రెండు తాళంచెవులు వేస్ట్‌చేయడం. (కో. 19)

నసిగరిట: నశ్యంపొడి ఎత్తుకోడానికి ఉపయోగపడే చిన్న చెంచా. (రా. 6).

నసింబడబ్బి: ఉ. నశింబడబ్బి. నసింపొడి ఉంచుకోడానికి వాడే డబ్బా. (తె. 10, 11; రా. 6).

నసుకు: (క్రి.) రేకు మొనలను సుత్తితో కొట్టడం. (రా. 10).

నాక్కొయ్య: తరిణిపట్టేటప్పుడు అడ్డు నిలవడానికి వాడే నాగుపడిగమాదిరి ఉండే కొయ్య. (కో. 5).

నాగధార: పైనుంచి ధారగా నీళ్ళుపడడానికి ఉపయోగించే నాగుపడిగలాంటి లోహపు సాధనం. (కో. 2).

నాగపూర్‌గిన్ని: చూ. పర్యా. పూనా గిన్ని. అడుగు భాగంలోమట్టుకు మారుగా చక్రం అతికిచేసిన గిన్నె. (కో. 10).

నాగవాసం: కత్తి మడచడానికి, పైకి తీయడానికి అమర్చిన ఏర్పాటు. (కో. 19).

నాగాభరణం: శివునికి ఆభరణంగాపెట్టే అయిదు శిరస్సుల నాగుపాముతలలాగా ఉండే లోహపు పరికరం. (కో. 12, 13, 16).

నాగు: (క్రి.) చూ. పర్యా. లాగు[1]. బండిచక్రాలకు పట్టాలను ఎక్కించి లాగడం. (కో. 27).

నాజిల్: పెట్రమాక్స్‌లైటుకు క్రిందిభాగంలో ఉండే పరికరం. (కో. 2).

నాజిల్‌పిన్ను: స్ప్రేయర్‌నుండి మందు పోవడానికి ఉపయోగపడే పరికరం. (కో. 8).

నాటంవేయు: (క్రి.) పర్యా. సీగలేయు[1], సీసుడు పెట్టు, బగులుకొట్టు, బగులుచేయు, బగులుతీయు, సరిపించు, సొక్కపెట్టు. లోహపు రేకును పాత్ర ఆకారంగా తయారుచేయడం. (కో. 8).

నాటురైజర్: (< నాటు + ఇం. Razor) చూ. పర్యా. మంగలికత్తి. మంగలిషాపుల్లో షేవింగ్‌కు వాడే పరికరం. చూ. చిత్రం 185. (రా. 16).

నాటుకత్తి: ఉ. నాటికత్తి. చూ. పర్యా. మంగలికత్తి. మంగలిషాపుల్లో షేవింగ్ చేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 185. (తె. 2, 21–24; రా. 12).

నాటుకత్తెర: చూ. పర్యా. మంగలికత్తి. మంగలిషాపుల్లో షేవింగ్‌కు వాడే పనిముట్టు. చూ. చిత్రం 185. (తె. 23, 24).

నాటుపోగరు: ఉ. నాటుపోగర. చూ. పర్యా. చిన్న పోగరు. లోహపురేకులపై, కడ్డీలపై చిన్నరంధ్రాలు కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 8; తె. 4, 5,

6, 12).

నాటుసుత్తె: చూ. పర్యా. టింకరుసుత్తి. కొలిమి పనిలో చిన్నపనులు చేయడానికి వాడే పరికరం. (కో. 28).

నాట్లు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (కో. 17).

నాట్లుపెట్టు: (క్రి.) లోహపు కడ్డీలపై, రేకులపై కత్తరించడానికి ముందు గుర్తులు పెట్టడం. (కో. 16, 17, 22, 24).

నానబెట్టు: (క్రి.) పర్యా. నానవేయు. అచ్చు కట్టడానికి మట్టిని నీళ్ళలో తడపడం. (కో. 1; తె. 11; రా. 1).

నానవేయు: చూ. పర్యా. నానబెట్టు. అచ్చు కట్టడానికి మటిని నీళ్ళలో తడపడం. (తె. 10).

నానిమొద్దు: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడేదిమ్మ. (తె. 10, 11).

నాపరాయి: వెల్డింగుపనిలో డిజైను గీయడానికి వాడే వెడల్పయిన దిమ్మ. (తె. 22).

నాబు: బీరువాలోపల చిన్నతలుపులు వేయడానికి వాడే పరికరం. (రా. 4).

నారసా: అచ్చును పట్టుకోడానికి వాడేకడ్డి. (కో. 29).

నార్సంకమ్మి: కొలిమిలో ఇత్తడి కరిగిందా లేదా అని చూడడానికి ఉపయోగించే సాధనం. (రా. 5).

నాలికమొద్దు: పాలకాన్లకు కింద కట్టుకొట్టడానికి వాడే పనిముట్టు (రా. 11).

నాలు: పర్యా. లాడం. ఎద్దుల కాళ్ళగిట్టలు కొట్టడానికి ఉపయోగించే ఇనుపపట్టి. (కో. 25, 26).

నాలుక: గంట లోభాగాన ధ్వనించడానికి ఉపయోగపడే పరికరం. (రా. 5).

నాలుకారు: చూ. పర్యా. ఇడకారు. కొలిమిలో నుండి కాగే లావుపాటి ఇనప ముక్కల్ని బయటికి తీయడానికి ఉపయోగించే సాధనం. (కో. 26).

నాలుగడుగుల గెడ్డపార: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అడుగు భాగాలు కొట్టడానికి వాడే పరికరం. (కో. 14).

నాలుగుగిన్నెలు: చూ. పర్యా. గుత్తిగిన్నె. నాల్గు వైపుల నాల్గు లోహపుచిప్పలు గుత్తిగా అతికించి ఉండి, పైన పట్టుకోడానికి కాడ ఉన్నపాత్ర. కూరలు వడ్డించడానికి ఉపయోగం. చూ. చిత్రం 87. (తె. 8, 9, 13).

నాలుగుడోర్స్ బీరువా: (< నాలుగు + ఇం. Doors + బీరువా). పైనరెండు, కిందరెండు తలుపులున్న బీరువా. (తె. 25).

నాలుగుపచ్చాల పోగర: రేకు తలుపులకు గడెలు బిగించడానికి వాడే పరికరం. (కో. 4, 9).

నాలుగుపచ్చాలసుత్తి: చూ. పర్యా. చిన్నకటకల సుత్తి. లోహపు రేకులను, కడ్డీలను వంచడానికి, రివిట్‌చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (రా. 2).

నాలుగుపలకలసుత్తి: చూ. పర్యా. చిన్న కటకల సుత్తి. లోహపు రేకులను, కడ్డీలను వంచడానికి, రివిట్‌చేయడానికి సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 14).

నాల్గుమూలల హతోడి: చూ. పర్యా. చిన్నకటకల సుత్తి. లోహపు రేకులను, కడ్డీలను వంచడానికి, రివిట్‌చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 6).

నిఖిని: చూ. పర్యా. లిఖిని. రేకులపై గీతలు వేయడానికి వాడే పరికరం. (కో. 23).

నిగారింపు: (క్రి.) చూ. పర్యా. జిలవచ్చు. పాత్రలకు మెరుగుపెట్టినపుడు తెల్లగా నిగనిగమనడం. (కో. 21, 26).

నిడిల్‌పిన్ను: (< ఇం. Need e pi..) స్ప్రేయర్ గొట్టాలు బిగించడానికి వాడే పరికరం. (కో. 8).

నిప్పల్: (< ఇం. Ni pl ) ఉ. నెప్పుల్. రూ. నిప్పల్స్. స్టౌబర్నర్‌కు పెట్రొమాక్స్‌లైటు వొత్తికి నూనెను, గాలిని అందించడానికి అమర్చిన చిన్న రంధ్రంగల పరికరం. (కో. 21, 25, 26, 28–30; తె. 3–6).

నిప్పల్‌కీ: రూ. నిప్పల్లికి. పర్యా. నిప్పల్‌గిన్నె, నిప్పల్‌రింజి. సైకిల్‌కమ్ములు బిగించడానికి ఉపయోగపడే సాధనం. (కో. 3).

నిప్పల్‌గిన్నె: (< ఇం. N pple + గిన్నె చూ. పర్యా. నిప్పల్‌కీ. సైకిల్‌కమ్ములు బిగించడానికి ఉపయోగపడే గిన్నె. (కో. 13).

నిప్పల్‌పాన: చూ. నిప్పల్‌స్పానరు. (తె. 6, 8, 13, 22).

నిప్పల్‌రించి: ఉ. నిప్పల్‌రెంచి, నిప్ప్రెంచి, నిప్పల్‌రేంచి. చూ. పర్యా. చైన్‌పాన. స్టౌనిప్పల్‌ను ఊడదీయడానికి, బిగించడానికి వాడే పరికరం. (కో. 20, 21, 28, 29, 30; తె. 21).

నిప్పల్‌రింజి: చూ. పర్యా. నిప్పల్‌కీ. సైకిల్ ఊసలు బిగించడానికి ఉపయోగపడే పరికరం. (కో. 14).

నిప్పల్‌స్పానరు: (< ఇం. Nipple spanner)

ఉ. నిప్పల్‌స్పానరు. రూ. నిప్పల్‌పాన, నిప్పల్ స్పానల్. చూ. పర్యా. చైన్‌పాన. ట్రైనిప్పల్‌ను ఊడదీయడానికి బిగించడానికి వాడే పరికరం. (కో. 2; తె. 5; రా. 5).

నిప్పల్‌స్పానలు: చూ. నిప్పల్‌స్పానరు. (తె. 3).

నిప్పులపోయు: (క్రి.) చూ. పర్యా. కగ్గించు[1]. ఇత్తడి పాత్రలకు పాలిష్ చేసేటపుడు పచ్చదనాన్ని తేవడానికి లోపల నిప్పులువేయడం. (తె. 15).

నిప్పల్లికి: చూ. నిప్పల్‌కీ. (రా. 8).

నిప్పల్స్: చూ. నిప్పల్. (కో. 2).

నిప్పకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమదగ్గర వాడే పనిముట్టు. (తె. 19, 21).

నిప్పుగంటె: చూ. పర్యా. అగ్గిగంటె. నిప్పు తెచ్చుకోడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 3. (తె. 22, 23; కో. 3; రా. 2).

నిప్పుపట్కారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును పట్టుకోడానికి, వస్తువుల్ని అందులోనుండి తీయడానికి వాడే పనిముట్టు. (తె. 22).

నిప్పుప్లేట్: (< నిప్పు + ఇం. Plate). చూ. పర్యా. దర్జ. నిప్పులు, బూడిదరాలకుండా బాయిలర్ అడుగుభాగాన అమర్చిన రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 173. 1. (కో. 2).

నిబ్బరంకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 19).

నిమ్మకాయకసర్: (< నిమ్మకాయ + ఇం. Crusher) నిమ్మకాయరసం తీయడానికి వాడే సాధనం. (తె.10).

నిమ్మకాయచెక్క: పర్యా. నిమ్మకాయపిల్టర్, నిమ్మకాయప్రెస్, లెమన్‌ప్రెజర్, లెమన్‌ప్రెసింగ్, లెమన్‌స్క్వీజర్. నిమ్మకాయరసం పిండుకోడానికి ఉపయోగించే పరికరం. (రా. 16).

నిమ్మకాయపిల్టర్: (< నిమ్మకాయ + ఇం. Filter) చూ. పర్యా. నిమ్మకాయచెక్క. నిమ్మకాయలరసం పిండుకోడానికి వాడే సాధనం. (తె. 10).

నిమ్మకాయప్రెస్: (< నిమ్మకాయ + ఇం. Peess) చూ. పర్యా. నిమ్మకాయచెక్క. నిమ్మకాయరసం పిండడానికి ఉపయోగించే సాధనం. (కో. 1).

నిమ్మనబొద్దుఆకురాయి: చూ. నిమ్మబద్ద ఆకురాయి. చూ. పర్యా. అకురాయి. ఇరుకుభాగాల్లో సాపుచేయడానికి, అరగదీయడానికి వాడే పనిముట్టు. (కో. 18).

నిమ్మబద్ధు ఆకురాయి: చూ. నిమ్మనబద్ద ఆకురాయి. (కో. 20).

నిరంజన్: రూ. నీలాంజన్. చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. (తె. 4).

నిర్మల్‌బిందె: చూ. పర్యా. గుండుబిందె. నీళ్ళు తేవడానికి, వంటచేయడానికి వాడే నిర్మల్ అనే ప్రదేశంలో తయారయ్యే వెడల్పు మూతిఉన్న గుండ్రని బిందె. రూ. చిత్రం 85. (తె. 4, 12).

నిలవ: చూ. పర్యా. కన్నం. అతికిన పాత్రలకుండే కన్నం. (కో. 20).

నిలవకొలుచు: (క్రి.) పర్యా. పెండలపడేయు, మారతుకు, మారుబెట్టు. బిందెను ఒకసారి అతికిన తర్వాత కన్నాలుంటే మరల మరల రవ్వచేసి అతకడం. (కో. 29).

నిలుపకారు: రూ. నిలువుకారు. చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. తె. (23).

నిలువు అడుగు: పర్యా. వంటగిన్నె. నీళ్ళు తాగడానికి, వంటలు ఉంచుకోడానికి పనికివచ్చే నిలువు పాత్ర. (కో. 1).

నిలువు అండ: చూ. పర్యా. అండా[1]. నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల హాండిల్సు, వెడల్పు మూతిఉన్న పెద్ద లోహపు పాత్ర. చూ. చిత్రం 8. (కో. 1; రా. 4).

నిలువుకళాయి: చూ. పర్యా. అండా[1]. నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల హాండిల్సు వెడల్పు మూతిఉన్న పెద్ద లోహపు పాత్ర. చూ. చిత్రం 8. (కో. 17).

నిలువుకారు: రూ. నిలుపకారు. (కో. 26).

నిలువుకైవారం: రేకులమీద గీతలు గీసుకోడానికి వాడే పరికరం. (కో. 10).

నిలువుగంగాళం: చూ. పర్యా. అండా[1]. నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల హాండిల్సు, వెడల్పు మూతిఉన్న పెద్ద లోహపు పాత్ర. చూ. చిత్రం 8. (కో. 7).

నిలువుగిన్నె: చూ. పర్యా. అండా[1]. నీళ్ళునిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల పిడి, వెడల్పు మూతి ఉన్న పెద్ద లోహపుపాత్ర. (కో. 1-11, 17, 29; రా. 16).

నిలువుచెంబు: చూ. పర్యా. వైష్ణవచెంబు, అడుగు తక్కువగా మూతి పొడుగ్గా మరచెంబు ఆకారంతో ఉండే చెంబు. చూ. చిత్రం 208. (కో. 13;

తె. 2, 7).

నిలువుధాగలి: చూ. పర్యా. చట్రం[1]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 27).

నిలువుపట్కార: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమి దగ్గర వాడే పనిముట్టు. (కో. 5).

నిలువుసుత్తె: ఇత్తడి పాత్రల పైభాగాన్ని మూల భాగాల్లో వంకర్లులేకుండా సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 25).

నివాళి: చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. (తె. 24).

నిహిని: చూ. పర్యా. కంఠాణి. లోహపు పాత్రలను మెరుగుపట్టడానికి వాడే పరికరం. (కో. 30).

నీగలేయు[1]: (క్రి.) చూ. పర్యా. నాటంలువేయు. లోహపురేకును పాత్ర ఆకారంగా తయారు చేయడం. (తె. 9).

నీగలేయు[2]: (క్రి.) పాత్రరేకు కొక్కిర్లు ఒకటి కిందికి ఒకటి పైకి వచ్చేటట్లు చేయడం (తె. 8).

నీగించు: చూ. పర్యా. ఇప్పు[2]. ఇత్తడిరేకును గుండ్రంగా వంచి కుతికి ఆకారంగా తయారు చేయడం. (కో. 20-23; తె. 2, 3; రా. 2).

నీటితొట్టి: పూర్తయిన అల్యూమినియం రేకుపాత్రలను శుభ్రంచేయడానికి ఉపయోగపడే నీటిపాత్ర. (కో. 22, 26).

నీటిపాత్ర: చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదును పెట్టడానికి, కాకరావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే నీళ్ళపాత్ర. (తె. 25).

నీటుపెట్టు: (క్రి.) రేకును కొలతలుతీయడం. (రా. 10).

నీరుకారు: రూ. నీళ్ళకారు. చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (తె. 2. 25).

నీలాంజన్: చూ. నిరంజన్. (రా. 14, 15).

నీళ్ళ అండి: చూ. పర్యా. అండా. అన్నం వండటానికి నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల పిడులు, వెడల్పుమూత ఉండే నిలువైన లోహపు పాత్ర. చూ. చిత్రం 8. (కో. 8, 29; రా. 6, 8).

నీళ్ళకుండి: చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదును పెట్టడానికి, కాకరావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే నీళ్ళపాత్ర. (కో. 19, 22, 25).

నీళ్లకొలాయి: చూ. పర్యా. కొలాయి. మంచినీళ్ళు నిల్వ ఉంచడానికి కిందిభాగాన కొళాయి అమర్చిన లోహపు పరికరం. చూ. చిత్రం 124. (కో. 26).

నీళ్లగంటె: చూ. పర్యా. కాదగంటె. చలివేంద్రంలో నీళ్ళు పోయడానికి, హోటళ్ళలో కూరలు వేయడానికి వాడే కాడ ఉండే చిన్నకప్పు. చూ. చిత్రం 47. (తె. 24).

నీళ్ళగిన్నె: చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదును పెట్టడానికి, కాకరావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే నీళ్ళపాత్ర.

నీళ్ళగ్లాసు: (< నీళ్ళ + ఇం. Glass). చూ. పర్యా. గ్లాసు[1]. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215. (తె. 8, 9, 12).

నీళ్లచెంబు: నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారంతో చేసిన చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 142. (తె. 19).

నీళ్ళజగ్గు: (< నీళ్ళ + ఇం. Jug) చూ. పర్యా. నీళ్ళు ఉంచుకొనడానికి ఉపయోగించే మూతలేని లోహపు పాత్ర. మూతివంకరగా ఉంటుంది. పట్టుకోడానికి పిడి అమర్చివుంటారు. చూ. చిత్రం 105. (తె. 17).

నీళ్ళటాంకి: (< నీళ్ళ + ఇం. Tank) ఉ. నీళ్ళటాంకు. చూ. పర్యా. కొలాయి. మంచినీళ్ళు నిల్వ ఉంచడానికి కిందిభాగాన కొళాయి అమర్చిన పరికరం. చూ. చిత్రం. 124. (తె. 5, 10, 11, 19, 22, 23; రా. 14).

నీళ్ళడబ్బా: చూ. పర్యా. కొలాయి. మంచినీళ్ల నిల్వ ఉంచడానికి కిందిభాగాన కొళాయి అమర్చిన లోహపు పరికరం. చూ. చిత్రం 124. (తె. 3, 6, 7, 17, 24).

నీళ్ళడ్రమ్ము: (< నీళ్ళ + ఇం. Drum) చూ. పర్యా. కొలాయి. మంచినీళ్ళు నిల్వఉంచడానికి కిందిభాగాన కొళాయి అమర్చిన లోహపు పరికరం. చూ. చిత్రం 124. (కో. 30).

నీళ్ళతొట్టి: చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదును పెట్టడానికి కాకరావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే నీళ్ళపాత్ర. (కో. 20; తె. 3, 21, 22, 25).

నీళ్ళబిందె: చూ. పర్యా. గుండుబిందె. నీళ్ళు తేవడానికి, వంటచేయడానికి వాడే వెడల్పుమూతి ఉన్న గుండ్రని బిందె. చూ. చిత్రం 85. (కో. 1, తె. 8: 9, 13, 16; రా. 2, 7).

నీళ్ళబాంబు: కాచినలోహపు నీళ్ళు వంచుకోడానికి వాడే పరికరం. దీనికి గొట్టం అమర్చి ఉంటుంది. (తె. 12).

నీళ్ళరాయి: చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదును పెట్టడానికి కాకరావడానికి కొలిమిలో నీళ్ళు చల్లడానికి వాడే నీళ్ళపాత్ర. (కో. 24).

నీళ్ళుఅవ్వు: (క్రి.) కొలిమిలో నవాచారం, తగరం కరిగిస్తే నీళ్ళమాదిరి ద్రవరూపం చెందడం. (రా. 4, 6).

నీళ్ళుచెంబు: చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదునుపెట్టడానికి, కాకరావడానికి కొలిమిలో నీళ్ళు చల్లడానికి వాడే నీళ్ళపాత్ర. (కో. 17, 21; రా. 15).

నీళ్లుతావు: (క్రి.) చూ. పర్యా. టెంపర్ ఎక్కించు. కాల్చి తయారుచేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్ళలో వేయడం. (రా. 4, 12, 13).

నీసుడుచేయు: (క్రి.) చూ. పర్యా. డొల్కచేయు. బిందెరేకులను ఒక ఆకారంగా చేసుకోవడం. (తె. 17).

నీసుడుపెట్టు: (క్రి.) చూ. పర్యా. నాటంచేయు. లోహపురేకును పాత్ర ఆకారంగా తయారు చేయడం. (తె. 21).

నుగ్గులు: పర్యా. పిడకలు, వంటలు. కొలిమిలో ఇనపవస్తువులు వేడిచేయడానికి వాడే ఎండిన పేడముక్కలు. (కో. 20, 23; తె. 1, 2).

నుడుచు: (క్రి.) పెద్దపనులకు ఉపయోగపడడం. (తె. 11).

నునుపుచేయు: (క్రి.) చూ. పర్యా. మోపుచేయు[2]. బిందెరేకులను చక్కచేసుకోవడం (రా. 7).

నున్నకొట్టు: (క్రి.) బిందెలకు ఉండే నొక్కులను నున్నగా సాపుచేయడం. (కో. 21).

నున్నచేయు[1]: (క్రి.) చూ. పర్యా. అద్దలించు. మట్టి అచ్చుపై కప్పుగిసినతర్వాత చేత్తో నున్నగా చేయడం. (కో. 20).

నున్నచేయు[2]: (క్రి.) చూ.పర్యా. కొట్టు. బీరువారేకుపై సిలుంలేకుండా నైసుచేయడం. (రా. 6).

నున్నచేయు[3]: (క్రి.) పర్యా. సపాయిచేయు, సద్దు, సాపింగ్‌చేయు, సాపుచేయు, సాపుపట్టు, సాపు మోపు. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడం. (తె. 8, 20).

నురుగు: చూ. పర్యా. తెరాయి. మూసలో కరిగిన అల్యూమినియం లేదా ఇత్తడిలోహం. (కో. 11).

నులుపు: పర్యా. మెలిపెట్టు, మోడ్‌నా, వడితిప్పు. గొడుగుపుల్లలను ఇనపవైరుతో బిగించి మెలి తిప్పడం. (కో. 29, 30; తె. 5).

నూకలజల్లెడు: చూ. పర్యా. ఛన్ని. బియ్యం, నూకలువగైరా జల్లించడానికి వాడే రంధ్రాలున్న రేకు పరికరం. (కో. 14, 15).

నూకు: (క్రి.) పర్యా. నూకుచేయు. చెల్లాచెదరుగా ఉండే బొగ్గులను కొలిమిలో ఒకచోట కుప్పగా చేర్చడం. (తె. 1, 3, 5).

నూకుచేయు: (క్రి.) చూ. పర్యా. నూకుచూ. చెల్లా చెదరుగ ఉండే బొగ్గులను కొలిమిలో ఒకచోట కుప్పగాచేయడం (తె. 1).

నూనె: ఉ. నూని. చూ. పర్యా. అయిలు. లోహపు పాత్రలకు మెరుగు పెట్టడానికి వాడే ద్రవపదార్థం. (కో. 24, 28; తె. 8)

నూనెకాను: చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యి లాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపు పాత్ర. (తె. 21).

నూనెకొసగు: చూ. పర్యా. క్యాను. నూనె పోసు కోడానికి వాడేపాత్ర. (తె. 15).

నూనెగంటె: చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించ డానికి పదార్థాలు ఎత్తుకోడానికి వాడే సాధనం. తె. 27).

నూనెగిన్నె: ఉ. నూనెగిన్నె. పర్యా. గిబరిణి, జీచెంబు, నూనెకాను, నూనెచెంబు, నూనెడబ్బా, నూనెబుడ్డి, నెయ్యిగిన్నె, నెయ్యిచెంబు, నెయ్యి పావు, నేతిగిన్నె, పెటోల్, బుడ్డీకాను, రాయపూరు కాను, రాయపూరుజాడి, రాయపూరుబుడ్డి. నూనె, నెయ్యిలాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపుపాత్ర. (కో. 23; తె. 2, 12, 13).

నూనెగరిట: చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించ డానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే పరికరం. (తె. 17).

నూనెచెంబు: చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యిలాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపుపాత్ర. (కో. 1; తె. 12, 16).

నూనెడబ్బా: చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యిలాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపు పాత్ర. (కో. 27; తె. 12, 20).

నూనెడబ్బి: మిషన్ పార్ట్స్ బాగా పనిచేయడానికి నూనెను వదలే డబ్బి. (రా. 6).

నూనెడొక్క: చూ. పర్యా. నూనెపాత్ర. నూనెను కొలవడానికి ఉపయోగపడే లోహపు పాత్ర. (కో. 21).

నూనెపాత్ర: పర్యా. నూనెడొక్క, నూనెపావు,

సత్తెలి. నూనెలాంటి ద్రవపదార్థాలు కొలవడానికి ఉపయోగించే స్టీలుపాత్ర (తె. 11)..

నూనెపావు: చూ. పర్యా. నూనె పాత్ర. నూనెలాంటి ద్రవపదార్థాలను కొలవడానికి ఉపయోగించే స్టీల్ పాత్ర. (తె. 10, 14, 16).

నూనెపెనుం: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి ఉపయోగించే ఇరుపైపులా హాండిల్సు అమర్చిన లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (రా. 4).

నూనెపైపు: (< నూనె + ఇం. Pipe) చూ. పర్యా. గొట్టం². స్టౌ బర్నర్‌కు టాంకిద్వారా నూనెను అందించడానికి అమర్చిన గొట్టం (తె. 5).

నూనెబట్టు: పాత్రకు ఉండే మడ్డిని కరగబెట్టడానికి వాడే పనిముట్టు. (రా. 13).

నూనెబుడ్డి: చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యి లాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపు పాత్ర. (తె. 18).

నూనెసిద్దె: దేవాలయాల్లో అఖండం వెలిగించేటప్పుడు నూనె పోయడానికి, దివిటీలకు నూనె పోయడానికి వాడే సాధనం. పట్టుకోడానికి కాడ ఉంటుంది. సన్న గొట్టంద్వారా నూనె వంచుకోవచ్చు. (కో. 12, 13; తె. 3).

నూనెస్పూను: (< నూనె + ఇం. Spoon) చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే సాధనం. (కో. 1).

నూరనాకు: (క్రి.) చూ. పర్యా. నూరు¹. మొద్దుగ ఉండే పనిముట్లను పదునుచేయడం. (కో. 27).

నూరు¹: (క్రి.) పర్యా. నూరనాకు, నూరుకోను. మొద్దుబారిన పనిముట్లను పదునుచేయడం. (కో. 20; తె. 17; రా. 6).

నూరు²: (క్రి.) మెరుగురావడానికి బిందెను వరి పొట్టుతో రుద్దడం. (రా. 16).

నూరుకోను: (క్రి.) చూ. పర్యా. నూరు¹. మొద్దుబారిన పనిముట్లను పదునుచేయడం. (రా. 8).

నూరేరాయి: పర్యా. నైస్ స్టోను, నైసు రాయి, మంగలిరాయి. మంగలిషాపుల్లో కత్తులు, కత్తెరలు సానపట్టడానికి వాడే రాయి. (తె. 24).

నూలు దళసరిబద్దు: బిందెలలో అన్నిభాగాల్లో కొట్ట డానికి వాడే పరికరం. (కో. 18).

నూలుమట్టం: చూ. పర్యా. చిన్న మూలమట్టం. లోహపురేకులు లెవల్‌కు కొలతలు వేయడానికి వాడే పనిముట్టు. (రా. 11).

నెక్కల్ రాడు: (< ఇం. Nickel rod) చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటికడ్డీ. (తె.18).

నెటుకుతీయు: (క్రి.) విగ్రహాన్ని చెక్కడానికి వీలుగా ఇత్తడిరేకును సున్నగ సాపుచేయడం. (తె. 17).

నెట్టు: లోహపురేకును గుంతగా కొట్టడానికి వాడే సాధనం. (రా. 11).

నెట్నెమొల: ఉ. నెట్నెమూల. చూ. పర్యా. చుక్క పోగరు. విగ్రహం రేకుపై చుక్కలుకొట్టడానికి వాడే పరికరం. (తె. 8, 9, 13, 17).

నెంబరురాయి: (< ఇం. Number + రాయి). చూ. పర్యా. గరుకురాయి¹. వెల్డింగ్ అతుకులను శుభ్రం చేయడానికి వర్కుషాపుల్లో వాడేరాయి. (కో. 24).

నెంబర్‌వన్ టాంక్ స్టౌ: (< ఇం. Number one Tank Stove). ఇమపస్టౌ. బర్నర్-టాంక్ ప్రక్క ప్రక్కనే అమర్చి ఉండే గ్యాస్‌స్టౌ. హోటళ్ళలో ఉపయోగం. (తె. 3).

నెయిల్‌కట్టర్: (< ఇం. Nail Cutter). చూ. పర్యా. గోరుగుండు. గోళ్ళు తీయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 93. (తె. 21).

నెయ్యిపావు: చూ. నేతిపావు. నూనె, నెయ్యిలాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపుపాత్ర. (తె. 10, 13, 18).

నెనువుతీయు: (క్రి.) ఇత్తడిరేకుపై అడ్డకొలత తీయడం. (తె. 18).

నేటు: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదల కుండ పట్టి ఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (రా. 11).

నేతిగరటి: చూ. పర్యా. గరిట. నెయ్యి వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే చెంచా. (కో. 6, 16).

నేతిగిన్నె: చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యి లాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపు పాత్ర. (కో. 1, 3, 12, 24).

నేతిచెంబు: నెయ్యి పోసుకోడానికి వాడేకొమ్ము ఉండే లోహపుపాత్ర. (కో. 2, 7, 10, 16).

నేతిజాడీ: నెయ్యి పోసుకోడానికి వాడే లోహపు పాత్ర. చూ. చిత్రం 143. (కో. 5).

నేతిపావు: చూ. నెయ్యిపావు. (తె. 2).

నేయివడి: నెయ్యి వడగట్టుకోడానికి ఉపయోగించే పరికరం. (రా. 8).

నేర్పుకోను: (క్రి.) అచ్చు కట్టేటప్పుడు పోతపాత్ర అచ్చుచుట్టూ సందులు లేకుండ మట్టిని పూర్తిగా

సరిచేయడం. (తె. 17).

నైట్రిక్ అసిడ్: (< ఇం. Nitric Acid) శిల్ప పనిలో విగ్రహాన్ని శుభ్రపరిచే పదార్థం. (కో. 6).

నైట్రిక్‌తేజాబ్: (< ఇం. Nitric + హిం. తేజాబ్) చూ. పర్యా. తేజవ్. కలాయి వేసేముందు పాత్రను కడగడానికి ఉపయోగించే ద్రవపదార్థం. (రా. 15).

నైవేద్యంకప్పులు: అనేక డిజైన్లుండే స్టీలుగిన్నెలు. నైవేద్యం పెట్టడానికి ఉపయోగం. (కో. 24).

నైస్‌స్టోను: (< ఇం. Nice Stone). చూ. పర్యా. నూరేరాయి. మంగలిషాపుల్లో, కత్తులు, కత్తెరలు సానపట్టడానికి వాడేరాయి. (తె. 21).

నైసుఫైలు: (ఇం. Nice file). చూ. పర్యా. ఆకురాయి. రంధ్రాలు శుభ్రం చేయడానికి వాడే ఆకురాయి. (రా. 15).

నైసుమట్టి: (< ఇం. Nice + మట్టి). చూ. పర్యా. జిగురుమట్టి. బొగ్గుమూసమట్టి, పాలమట్టి కలిపితే వచ్చేమట్టి. పోతపనిలో ఉపయోగం. (రా. 2)

నైసురాయి: (< ఇం. Nice + రాయి). చూ. పర్యా. నూరేరాయి. మంగలిషాపుల్లో కత్తులు, కత్తెరలు సానపట్టడానికి వాడేరాయి. (రా. 10, 11, 12, 14-16, 20).

నైసులేగ: (< ఇం. Nice + లేగ). చూ. పర్యా. గోరులేగ. బిందెను పూర్తిగ నునుపుచేసే పరికరం. (తె. 3).

నొక్కు[1]: (క్రి.) పాత్రలు తయారుచేసేటప్పుడు చక్రం, ఇరుసుకోపును దాటి, రాకుండేటట్లు పాత్ర ఒంపు భాగాన్ని కొద్దిగ అణగ్గొట్టడం. (తె. 21).

నొక్కు[2]: (క్రి.) అంచుగట్టిగ ఉండడానికి లోపల కడ్డీని పెట్టి గట్టిగా బిగించడం. (కో. 17).

నొక్కులకరవాయి: చూ. పర్యా. గుండుకరవాయి. బిందెల అంచు భాగాలను తయారుచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 82. (తె. 1).

నొక్కులు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉంతే బొడిపెలు. (కో. 26; రా. 1).

నొత్తలు: చూ. పర్యా. గరుకులు[2]. రేకుపై ఉండే నొక్కులు. (కో. 23, 25. 27).

నొసటిబొట్టు: పర్యా. శివబొట్టు. శివుని ఫాలభాగంలో విబూది మాదిరి చేసిపెట్టడానికి వాడే లోహపుబొట్టు. (కో. 12).

నోసపిలేరు: చూ. నోస్‌ప్లేయర్[1]. (తె. 5, 6).

నోస్‌ప్లేయర్[1]: (< ఇం. Nose plier) ఉ. నూస్‌ప్లేయర్, నైస్‌ప్లేయర్, నోస్‌ప్లేయరు, రూ. నోస్పిలేరు, నోస్‌ప్లేర్, న్యూస్‌ప్లేయర్, చూ. పర్యా. జవకర. చిన్నచిన్న లోహపు వస్తువులను పట్టుకోడానికి, రిపేరిచేయడానికి వాడే పరికరం. (కో. 2, 7, 14, తె. 5, 6, 17 18, 21; 22-24; రా. 3, 12, 14, 15).

నోస్‌ప్లేయర్[2]: టార్చిలైట్ల గడ్డలు సరిచేయడానికి వాడే పరికరం. (తె. 1).

నోస్‌ప్లేర్: చూ. నోస్‌ప్లేయర్[1]. (తె. 25).

నౌసారం: చూ. నవాచారం. (తె. 17).

న్యూటైప్‌గ్లాసు: (< ఇం. New type glass) కాఫీతాగడానికి వాడే కొత్తరకం లోటా. పెద్దదిగా కనిపిస్తున్నా అందులోని కాఫీ మాత్రం తక్కువ మోతాదులో ఉంటుంది. (కో. 4).

న్యూస్‌ప్లేయర్: చూ. నోస్‌ప్లేయర్[1]. (రా. 7).

## ప

పక్క: చూ. పర్యా. అడ్డ. బిందె మధ్యభాగపు రేకు. (తె. 1).

పక్కమిరియం: పర్యా. పడిముక్క, పులేలు, పుల్లి, పేటర్‌టప్ప, పొడసుత్తె, ప్లాట్‌సుత్తి, మట్టప్పచ్చు, మట్టమెరిన్, మిరిన్, సాపుటప్ప, సైడ్‌మెరిమ్, సైడీసు, సైడుదిమ్మ. లోహపు రేకులను, కడ్డీలను వంచుకోడానికి చక్కగ సాపుచేయడానికి వాడే పరికరం. (రా. 5).

పక్కరేకు: చూ. పర్యా. అడ్డ. బిందె మధ్యభాగపు రేకు. (తె. 18, 19).

పక్షాల్‌లోటా: చూ. పర్యా. పలకలగ్లాసు. క్రిందనుంచి సగందాక పెద్దసైజు పక్షాలుండే నీళ్ళగ్లాసు. (రా. 8).

పగులగొట్టు: (క్రి.) ఉ. పగలగొట్టు. రూ. పలగొట్టు, పలగ్గొట్టు. లోహపు వస్తువుల భాగాలను రెండుగా వేరుచేయడం. (కో. 25; రా. 12).

పగుళ్ళు: అల్యూమినియం పాత్రపై ఉండే హెచ్చుతగ్గులు. (కో. 4).

పంకా: ఉ. పంక. రూ. ఫంకా. పర్యా. బ్లోయరు. కొలిమికి గాలి రావడానికి అమర్చిన సాధనం. (కో. 14, 27, 29, 30; తె. 8, 17, 18).

పంగనాలపెనుము: చూ. పర్యా. గుంటపొంగడాలపెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంతలు ఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (రా. 6).

పంగల్: చూ. పర్యా. అడమొద్దు. కరవాయినిపట్టి ఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (రా. 15).

ఫంగల్‌కొయ్య: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని

కదలకుండ పట్టిఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (తె. 13).

పంగల్‌నట్టు: కుట్టుమిషన్‌లోని నట్టు. (రా. 6).

పంగలదుక్క: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండ పట్టి ఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (కో. 5).

పంగలమొద్దు: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండ పట్టి ఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (తె. 2).

పంగుకట్టి: చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండ పట్టి ఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (రా. 14).

పచ్చడిగుత్తు: చూ. పర్యా. గుత్తిగిన్నె. నాల్గువైపుల నాల్గు లోహపుచిప్పలు గుత్తిగా అతికించిఉండి పైన పట్టుకోడానికి కాడఉన్న పాత్ర. కూరలు, పచ్చళ్ళు వడ్డించడానికి ఉపయోగం. చూ. చిత్రం 87. (కో. 1).

పచ్చడిప్లేటు: (< పచ్చడి + ఇం. Plate) రూ. పచ్చళ్ళప్లేటు. పచ్చళ్ళు పెట్టుకోడానికి వాడే చిన్న పళ్లెం. (కో. 24).

పచ్చబిందె: పర్యా. పట్వా, పాలబింది, పోతపట్వ, పోతబింది. నీళ్ళు, పాలు తెచ్చుకోడానికి వాడే గుండ్రని లోహపు కడవ. (కో. 18)

పచ్చళ్ళప్లేటు: చూ. పచ్చడిప్లేటు. (కో. 2).

పచ్చాలగలాసు: (< పచ్చాల+ఇం. Glass) చూ. పర్యా. పలకల గ్లాసు. క్రిందనుంచి సగందాక పెద్ద సైజు పళ్లెలుండే నీళ్ళ లోటా. (రా. 7).

పచ్చాలగిన్నె: పెద్దసైజు పళ్లెలుండే చిన్న లోహపు పాత్ర. (రా. 7).

పచ్చికొట్టు: ఉ. పచ్చీకొట్టు. చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపు రేకులనుకలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (కో. 10, 17, 19, 28; తె. 2, 6, 17, 20, 22, 25; రా. 6, 12, 15).

పచ్చికొబ్బరిపీట: పర్యా. గుండ్రం కొబ్బరితురుము. పచ్చి కొబ్బెరను చేత్తో తురుమడానికి వాడే పరికరం. చూ. చిత్రం 144. (కో. 3; రా. 3. 11)

పచ్చిపని: చూ. పర్యా. కమ్మరం. లోహాలతో పాత్రలను, పనిముట్లను తయారుచేసే పని. (కో. 16).

పచ్చిమలుపు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపు రేకులనుకలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (తె. 3).

పచ్చివట్టు: ట్రంకుపెట్టెలు జాయింట్ చేయడానికి వాడే పరికరం. (రా. 7).

పచ్చివంచు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపు రేకులనుకలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (తె. 24).

పంచ్: (ఇం) రూ. పొంచు. చూ. పర్యా. పోగరు. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలేయడానికి గుర్తులుపెట్టే పరికరం. చూ. చిత్రం 165. (కో. 21, 24, 25, 27; తె. 3, 4, 14, 19, 21; రా. 4).

పంచధూపహారం: చూ. పర్యా. ధూపకం. ధూప హారతివ్వడానికి వాడే పరికరం. చూ. చిత్రం 139. తె. 21).

పంచపాత్ర: ఉ. పంచ్‌పాత్ర. పర్యా. అరిగెపాత్ర, పూజలోట, లోటాచెంబు, సటి, స్థాళీ. దేవాలయాల్లో తీర్థానికి వాడే లోహపు పాత్ర. (కో. 1–7, 10–13, 16–22, 24, 27–29; తె. 2, 8–10, 12, 17, 20, 21, 23; రా. 2, 10–13, 15).

పంచపాత్రచెంబు: వైష్ణవచెంబు. పైభాగంలో పంచ పాత్ర ఆకారముండే లోహపు పాత్ర. చూ. చిత్రం 145. (కో. 19, 20).

పంచపాని: చూ. పంచపాలి. (తె. 9).

పంచపాల: చూ. పంచపాలి. (తె. 10, 11).

పంచపాలి: (బ.) పంచపాలీలు. రూ. పంచపానీ, పంచపాళి, పంచపాండి. పర్యా. అక్షింత కుడకలు. అయిదువైపులా అయిదు లోహపుచిప్పలు గుత్తిగా అతికించి ఉండి పైన పట్టుకోడానికి కాడ ఉన్న పాత్ర. శుభకార్యాల్లో కుంకుమ, అక్షింతలు, పసుపు, గంధం పట్టుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 146. (కో. 21; తె. 3, 7, 14, 17).

పంచపాళి: చూ. పంచపాలి. (తె. 3, 6, 18, 21, 24, 25).

పంచపాండి: చూ. పంచపాళి. (తె. 1).

పంచహారతి: ఐదు దీపాలతో హారతి ఇవ్వడానికి ఉపయోగించే సాధనం. (రా. 15).

పంచార్తి: ఐదు దీపాలు వెలిగించడానికి గుంటలు అమర్చి చేసిన లోహపు సాధనం. (కో. 12).

పంజా: ఉ. పంజ. చూ. పర్యా. హస్తం. అన్నం వడ్డించడానికి వాడే చేయిగరిటె. (కో. 26; తె. 10–13, 18).

పంజాబ్ హస్తం: పర్యా. బాజీస్పూను. కూరలు వడ్డించడానికి వాడే కోడిగుడ్డు ఆకారపుగరిటె. మహమ్మదీయులు వాడ్తారు. (కో. 24).

పటం: చూ. పర్యా. డాకలి². టింకరపనిలో రేకులు

కత్తరించడానికి వాడే సాధనం. (కో. 3).

పట్కార: పర్యా. పండ్లపుల్ల, పండ్లొంచేపుల్ల, పల్లియిరుపు, పల్లొంచే ముక్క, పల్లొంచే మొల, పళ్ళకారు, పళ్ళునిగేసుత్తి, పాలగడలేగ, పింఛేన్, బిద్ద[3], బిరం, ముట్టి[2]. లోహపురేకులకు జాయింట్లు చేసే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగు భాగం కొద్దిగ చీలి వుంటుంది. (రా. 10).

పట్కారు: ఉ. పట్కార. చూ. పట్టుకారు. (కో. 19; తె. 3–7, 20, 25; రా. 11, 12, 15, 16).

పట్టి[1]: పర్యా. పతలాకమ్మి, పెదముక్క, ప్రెసింగ్ బిద్దె, ప్లాట్‌పొంచు, బిద్ద[1], బారు[1], బైంట్. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లావుపాటి ఇనపదబ్బ. (కో. 8–12, 21–27; తె. 1–6, 9, 17–23; రా. 2, 7, 10, 15).

పట్టి[2]: పర్యా. బార్‌మట్టపుల్ల, బీడింగు, బొద్దుపట్టీ, మట్టపలక[2]. రేకుపై బొద్దుకొట్టడానికి వాడే పొడవుపాటి పట్టి. (కో. 26).

పట్టి[3]: పర్యా. పూతరేకు, బెల్టు[2]. లోహపు రేకుపై గ్రీసును పూయడానికి వాడే సాధనం. (రా. 16).

పట్టి[4]: సానరాయిని లాగడానికి చక్రంద్వారా అమర్చిన చర్మపుబెల్టు. (తె. 18).

పట్టి[5]: దబ్బగా ఉండే చిన్నచిన్న లోహపు రేకులు. (కో. 4; తె. 3; రా. 2).

పట్టి[6]: చూ. పట్టి. (కో. 9).

పట్టుకరు: ఉ. పట్టుకర్ర. చూ. పట్టుకారు[1]. (కో. 13, 30; తె. 1; రా. 2).

పట్టుకారు[1]: రూ. పట్టుకర, పట్కారు. చూ. పర్యా. కమ్మరకారు. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. చూ. చిత్రం 147. (కో. 1–6, 10, 12, 17, 18, 20, 22, 24, 28; తె. 2, 4, 6–8, 11–15, 17, 20, 21; రా. 1, 3, 5–8; 12–16).

పట్టుకారు[2]: చూ. పర్యా. కటింగ్‌కారు. మరల తిప్పడానికి, బిగించడానికి, సాడర్‌పనిలో వస్తువులను కదలకుండా పట్టుకోడానికి, గొడుగుపుల్లలకు వైరు చుట్టడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 16; రా. 2).

పట్టుగాని: పాత్రను శుభ్రపరచడానికి వాడే పొడిలాంటి పదార్థం. (రా. 8).

పట్టుపుల్ల: పెట్టె ప్రక్కభాగాన్ని కొట్టడానికి ఉపయోగించే సాధనం. (రా. 10).

పట్టుముక్క: చూ. పర్యా. అడగోలు. లోహపురేకులు, కడ్డీలు సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 26).

పట్టర: ట్రంకుపెట్టెను జాయింట్‌చేసే పరికరం. (రా. 8).

పట్టలేగ: చూ. పర్యా. అదురువాలేగ. పాలిష్‌పాత్రలపై డిజైనులు వేయడానికి వాడే పరికరం. (కో. 14; తె. 12).

పట్టంలేగ: పర్యా. పొడవుకమ్మి, పొడవులేగ, పైకమ్మి, పైలేగ. లోహపు పాత్రలపై ఉన్న మైలను పోగొట్టడానికి వాడేకమ్మి. (కో. 2).

పట్టా: చూ. పర్యా. కమ్మ. బండి చక్రానికి చుట్టూ వేయడానికి వాడే ఇనుపబద్దె. (కో. 17; తె. 5; (రా. 14).

పట్టాకరవాయి: చూ. పర్యా. కరవాయి. లోహపు పాత్రలను సాపుచేయడానికి వాడే పరికరం. (తె. 12).

పట్టాకొరాం: ఉ. పట్టాకొరం. చూ. పర్యా. డెక్కకొరాం. బిండెల అతుకులను మన్నె వేయడానికి వాడే పనిముట్టు. దీనితల ఆవు కాలిగిట్ట ఆకారంలో ఉంటుంది. (తె. 17).

పట్టాగ్లాసు: (< పట్టా + ఇం. Glass). రూ. పట్టిగ్లాసు. మధ్యలో కుంటుకలిగిన పొడవు స్టీలు లోటా. నీళ్ళు తాగడానికి వాడ్తారు. (కో. 2; తె. 8, 9, 12, 14–16).

పట్టాటిఫెన్: (< పట్టా + ఇం. Tiffin). తీపిపదార్థాలు ఉంచుకోడానికి బక్కెట్టులాగా ఉండేపాత్ర. (కో. 15).

పట్టాబీడింగ్: నీళ్లు ఉంచుకోడానికి వాడే పొడవైన గిన్నె. (తె. 10).

పట్టాలదాలి: చూ. పర్యా. దాయ. బండిపట్టాను వేడిచేయడానికి వాడే వలయాకారపు నుగ్గులపొయ్యి. (తె. 21).

పట్టాలేగ: ఉ. పట్టలేగ. రూ. పాల్లేగ. పర్యా. కంతాణి. లోహపు పాత్రలకు మెరుగుపెట్టడానికి వాడే పరికరం. (తె. 8, 9; రా. 9).

పట్టాసుత్తి: చూ. పర్యా. సమ్మెట. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడే పెద్దసైజు సుత్తి. (కో. 7).

పట్టి[1]: ఉ. పట్టీ. రూ. పట్టి[6], పట్రి. పర్యా. ఒద్దిబద్దె, ఒరిజబద్ద, గజం[2], గజంకట్టి, గజంబద్ద, గీతరేకు[1], చెక్కడిబద్ద, చిన్నచీదపట్టి, పుట్రాలు, పూటుబద్ద, బద్ద[1], మీటరుపుల్ల. ఇత్తడిరేకులపై కొలతలను గుర్తించడానికి, గీతలుగీయడానికి వాడే మూడడి

గుల పొడవు ఉండే రేకుస్కేలు. చూ. చిత్రం 71. (రా. 10, 11, 15).

పట్టి[2]: పర్యా. బుర్ర[4]. లాపాల్. బీరువా తలుపురేకు వంగకుండ లోపలిభాగాన బిగించినపట్టి. (కో. 24, 26, 28; తె. 2, 24; రా. 12).

పట్టి[3]: చూ. పర్యా. ఇనుపదుక్క. డిజైన్లు చేయడానికి ఉపయోగపడే చిన్న ఇనపబద్ద. (తె. 1, 5).

పట్టి[4]: గుండ్రని ఇనపచట్రం. (రా. 3).

పట్టి[5]: పోతపాత్రపై ఉండే మరుగులను తొలగించే సాధనం. (తె. 25).

పట్టి[6]: పెట్టెబొద్దు కొట్టడానికి ఉపయోగపడే రెండు పైపు ఆకారంతో ఉన్న పరికరం. (రా. 4).

పట్టిగ్లాసు: చూ. పట్టాగ్లాసు. (తె. 12).

పట్టిసీక్రెట్: (< పట్టి + Secret) బీరువాకాళ్ళ భాగంలో అమర్చిన రహస్యపు అర. (తె. 24).

పట్టీ[1]: కాగితాలువగైరా చిన్నచిన్న వస్తువులను ఉంచ డానికి ట్రంకుపెట్టె మూతకు అమర్చిన అర. (కో. 22).

పట్టీ[2]: చూ. పర్యా. దార్లబద్దీ. బీరవా అంచును వంపులులేకుండ సరిచేయడానికి వాడే పనిముట్టు. (రా. 14).

పట్టీకంచం: పర్యా. బీడింగ్‌కంచం, బీడింగ్‌పళ్లెం, సూరుగిన్ని. అన్నం తినడానికి వాడే పట్టీలాగా వంగిన అంచుకలిగిన పళ్లెం. (కో. 11, 12, 15).

పట్టీఫ్రేముబీరువా: (< పట్టీ + ఇం. Frame + బీరువా) కాళ్ళులేకుండ బాడీరేకులోనే కాళ్ళుచేసిన అల్మార. (తె. 24).

పట్టీరాయు: (క్రి.) పోతపాత్ర చుట్టూఉండే గరుకులను కొట్టివేయడం. (రా. 15).

పట్టు[1]: (క్రి.) చూ. పర్యా. అనుచు. రేకును గుండ్రంగా అతికించి బిందె మధ్యభాగాన్ని బొర్ర లాగ చేయడం. (తె. 3).

పట్టు[2]: (క్రి.) విప్పిన కోర్లను సాపుచేయడం. (రా. 15).

పట్టుగోలు: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డరింగ్ చేయడానికి వాడే ఇనుపకమ్మి పరికరం. (రా. 3).

పట్టుమైనం: చూ. పర్యా. గొగ్గిలం. విగ్రహం నగిషీ పనికి వాడే పదార్థం. (కో. 28).

పట్టెకుంజప్లేటు: (< పట్టె + కుంజ + ఇం. Plate) చూ. పర్యా. పరాతం. అన్నం ఆరబోసుకోడానికి వాడే వెడల్పు పళ్లెం. చూ. చిత్రం 150. (తె. 11).

పట్టెడ: చూ. పర్యా. దాగలి[1]. లోహపు కమ్మిని, రేకు బిళ్ళల్ని సాగ్గొట్టడానికి వాడే రైలుకమ్మిలాగా ప్లాటుగా ఉండే ఇనపదిమ్మ. (కో. 7, 16, 24; తె. 17).

పట్టెడమొద్దు: పట్టెడను బిగించడానికి ఉపయోగించే కొయ్యదిమ్మ. (తె. 17).

పట్నంబిందె: సన్ననిమూతి, వెడల్పుపొట్ట ఉన్న ఇత్తడిబిందె. పల్లెల్లోకంటె పట్టణాల్లో ఎక్కువగా నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 148. (కో. 4, 9; తె. 25).

పట్రు: చూ. పర్యా. పాలిష్‌మిషను. లోహాన్ని సాన బట్టడానికి వాడే యంత్రం. (రా. 5).

పట్రుం: పర్యా. పాతికబద్దె, బొద్దుపాటా. పెట్టెలకు రూట్లుగా కొట్టడానికి వాడే పరికరం. (రా. 5).

పట్రి: చూ. పట్టి. (తె. 17).

పట్వ: చూ. పర్యా. పచ్చబిందె. నీళ్ళు, పాలు తెచ్చుకో డానికి ఉపయోగపడే గుండ్రని కడవ. (తె. 24, 25).

పట్వాలకరవాయి: చూ. పర్యా. ఉండకవాయి. గంగాళాలను, గుండు ఇత్తడిబిందెలను చేయడాని కుపయోగించే సాధనం. తలభాగం గుండ్రంగా ఉంటుంది. (తె. 24, 25).

పడ: పాత్ర మూతితోపాటు డొల్కకు అతకడానికి చేసిన భుజపురేకు. (తె. 4).

పడచ్చు: చూ. పర్యా. గుండుఅచ్చు. కాగిన ఇనుమును గుండ్రంగా చేయడానికి ఉపయోగించే అర్ధచంద్రాకృతిగా ఉన్న పరికరం. (కో. 24).

పడవు: (క్రి.) చూ. పర్యా. పోయు[1]. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలువేయడం. (కో. 20).

పడవేయు: (క్రి.) పాలమట్టిపై గోనిముక్కలను వేయడం (రా. 2).

పడిగదుఅడగ: చూ. పర్యా. డెక్కకోరాం. బిందెల అతుకులను మచ్చె వేయడానికి వాడే పనిముట్టు. దీనితల ఆవుకాలిగిట్ట ఆకారంలో ఉంటుంది. (తె. 25).

పడిగమొుల: చూ. పర్యా. డెక్కమొుల. బిందెల అతుకులను మచ్చెవేయడానికి వాడే పనిముట్టు. దీని తల ఆవుకాలిగిట్ట ఆకారంలో ఉంటుంది. (తె. 25).

పడిగం: పర్యా. గుమ్మడితట్ట, గుమ్మడికాయతట్ట, పడిగెలతట్ట. కోవెలలో తీర్థం ఉంచడానికివాడే గుమ్మడికాయ ఆకారంతో ఉన్న లోహపుపాత్ర. (కో. 28).

పడిగెలతట్ట: చూ. పర్యా. పడిగం. కోవెలలో తీర్థం ఉంచడానికి వాడే గుమ్మడికాయ ఆకారంతో ఉన్న లోహపుపాత్ర. (రా. 8).

పడిముక్క: చూ. పర్యా. పక్కమిరియం. లోహపు రేకులను, కడ్డీలను వంచుకోడానికి, సాపుచేయడానికి వాడే దిమ్మ. (కో. 29).

పడవకారు: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి. కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (రా. 4).

పడుసుత్తి: డబ్బాలపై రివిట్లుకొట్టడానికి వాడే పొడవు సుత్తి. (తె. 21).

పణ: చూ. పన¹. (కో. 12, 13).

పండ్లపుల్ల: రూ. పళ్ళపుల్ల. చూ. పర్యా. పట్కార. లోహపు రేకులకు జాయింట్లు చేసే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలి వుంటుంది. (తె. 2, 25).

పండ్లు: రూ. పల్లు, పళ్లు. చూ. పర్యా. కక్కులు. ఇత్తడిబిందె భాగాలను అతకడానికి రేకు అంచులపై అక్కడక్కడ చేసిన చిన్న కత్తిరింపులు. (తె. 9).

పండ్లొంచేపుల్ల: చూ. పర్యా. పట్కార. లోహపు రేకులకు జాయింట్లుచేసే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలివుంటుంది. (తె. 3, 23, 25).

పతలాకమ్మి: చూ. పర్యా. పట్ట¹. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లావుపాటి ఇనపకమ్మి. (రా. 8).

పత్తికట్టుకడ్డి: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డరింగ్ చేయడానికి ఉపయోగించే ఇనుపకమ్మి (కో.14;15).

పత్తికోలు: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డరింగ్ చేయడానికి వాడే ఇనుపకమ్మి. (రా. 4).

పత్తిచాకు: చూ. పర్యా. మంగలికత్తి. మంగలి షాపుల్లో షేవింగ్ చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 185. (తె. 24).

పత్తిపెట్టు: (క్రి.) ఏదైనా లోహానికి డొంకలుంటే నవాచారం, సీసంకాచిపెట్టడం. (రా. 5).

పదంపేల: (< హిం. ప్యాలా) పర్యా. పౌడర్‌గిన్నె. పౌడర్ డబ్బా, పౌడర్ బాక్సు¹. పౌడర్ ఉంచుకోడానికి వాడే స్టీలుపెట్టె. చూ. చిత్రం 166. (తె. 10, 11).

పదును: చూ. పర్యా. జారు. లోహపాత్రలపై మెరుగు. (కో. 26).

పదును ఏయు: (క్రి.) చూ. పర్యా. పిసుకు. అచ్చులకు పనికివచ్చేవిధంగా మట్టిలో నీళ్ళుపోసి కలపడం. (రా. 15).

పదునుచేయు: (క్రి.) చూ.పర్యా. టెంపర్ ఎక్కించు. కాల్చి తయారుచేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్ళలో వేయడం. (కో. 29).

పదునుతాపు: (క్రి.) చూ. పర్యా. టెంపర్ ఎక్కించు. కాల్చి తయారుచేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్ళలో వేయడం. (కో. 19; రా. 15).

పదునుపెట్టు: (క్రి.) చూ. పర్యా. టెంపర్ ఎక్కించు. కాల్చి తయారుచేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్ళలో వేయడం. (కో. 20, 25, 29, 30; తె. 2, 6, 7, 19-25; రా. 18).

పదునుమోపు: (క్రి.) చూ.పర్యా. టెంపర్ ఎక్కించు. కాల్చి తయారుచేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్ళలో వేయడం. (కో. 29).

పదునువేయు: (క్రి.) చూ.పర్యా. టెంపర్ ఎక్కించు. కాల్చి తయారుచేసిన ఇనపవస్తువు గట్టిపడడానికి నీళ్ళలో వేయడం. (కో. 28).

పద్మసెట్టు: (< పద్మ + ఇం. Set) గొడుగుపుల్లలను విడదీస్తే పద్మంలాగవచ్చే అమరిక కలిగిన పుల్లల సెట్టు. (కో. 28).

పన¹: రూ. పణ. చూ. పర్యా. రౌనుదాగలి. ఇనప ప్లాట్‌ను వంపుతట్టుకోడానికి, గుండ్రంగా వంచుకోడానికి, కట్ చేసుకోడానికి, కంచాలు మొదలైనవాటికి రేకులు తిరగ్గొట్టుకోడానికి తాట దళసరి సరిపెట్టుకోడానికి వాడే గుండ్రంగా, లింగాకారంగా, విడిగా ఉండే దిమ్మ. (కో. 1, 2, 7, 16; రా. 1-5, 14).

పన²: చూ. పర్యా. దిమిసె. లోహపు రేకులను, కడ్డీలను చదరంచేయడానికి వాడే పరికరం. (కో. 2).

పన³: చూ. పర్యా. గ్రైండరు. వెల్డింగు ఉబ్బులను శుభ్రపరచడానికి వాడే యంత్రం. (రా. 2).

పనమాటిసుత్తె: సాగ్గొట్టిన కంచుపాత్రను ఎచ్చు తగ్గులులేకుండ సమంగా సాపుచేయడానికి వాడే పరికరం. దీని అడుగుభాగం వెడల్పుగ మొద్దుగ ఉంటుంది. (తె. 17).

పనమాటుకొట్టు: (క్రి.) కంచుపాత్రను హెచ్చు తగ్గులు లేకుండ సమంగా తయారుచేయడం. (తె. 17).

పనసపిక్కసుత్తి: రేకులను పొక్కించడానికి, లావు చేయడానికి వాడే పరికరం. (కో. 21).

పన్నీరుచెంబు: చూ. పర్యా. అత్తరుదాని. పన్నీరు చల్లడానికి వీలుగా మధ్యలో కాయలు కాయలుగా

నగిషీచెక్కి చేసిన లోహపుపాత్ర. చూ. చిత్రం 9. (కో. 1, 21, 28).

పన్నీరుదాని: చూ. పర్యా. అత్తరుదాని. పన్నీరు చల్లుకోడానికి వాడే స్టీల్‌పరికరం. సీసా ఆకారంలో ఉంటుంది. చూ. చిత్రం 9. (తె. 8, 9).

పన్నీరుబుడ్డి: చూ. పర్యా. అత్తరుదాని. పన్నీరు చల్లుకోడానికి వాడే పన్నగా పొడుగాటి పీక ఉండే సాధనం. అడుగున మట్టు మధ్యలో కాయ ఉంటుంది. చూ. చిత్రం 9. (కో. 2, 11-15, 18-31; తె. 1-3, 18, 19, 21; రా. 11, 13).

పన్నీరుసీసా: చూ. పర్యా. అత్తరుదాని. పన్నీరు చల్లుకోడానికి వాడే స్టీల్ పరికరం. సీసా ఆకారంలో ఉంటుంది. చూ. చిత్రం 9. (తె. 8).

పప్పరు: బీగంలోపల ఉండే పొడైనస్థలం. (కో. 19).

పప్పుకసు అండ: పప్పుకూర వండడానికి వాడే చిన్న లోహపుపాత్ర. (తె. 12).

పప్పుగిన్నె: కూరలు వండడానికి వాడే చిన్న లోహపు పాత్ర. (కో. 17).

పప్పుగుండిగ: కూరలు వండడానికి ఉపయోగపడే చిన్న లోహపుపాత్ర. (కో. 19, 20).

పప్పుచిట్టి: చూ. పర్యా. చట్టి. కూరలు వండడానికి ఉపయోగపడే చిన్న లోహపుపాత్ర. (కో. 22).

పప్పుడబ్బా: రూ. పప్పులడబ్బా. చూ. పర్యా డబ్బా[1]. పిండిపదార్థాలు ఉంచుకోడానికి వాడే లోహపుపాత్ర. చూ. చిత్రం 121. (కో. 4, 5, 7; తె. 9, 17, 19, 21, 24).

పప్పుతపాల: పర్యా. వేల్పురిగిన్నె. పప్పు వండడానికి ఉపయోగించే లోహపుపాత్ర. కొంచెం ఎత్తుగా, గుండ్రంగా. అంచు వెనక్కివంచి మూతి వెడల్పుగా చేసి ఉంటారు. (కో. 12, 13, 15).

పప్పులడబ్బా: ఉ. పొప్పులడబ్బా. చూ. పర్యా. డబ్బా. పిండిపదార్థాలు ఉంచుకోడానికి వాడే లోహపు పాత్ర. (కో. 6, 17).

పప్పులడబ్బాసెట్టు: (< పప్పుల + హిం. డబ్బా + ఇం. Set). పప్పులు పోసుకోడానికి ఉపయోగపడే డబ్బా. ఒకడబ్బాలో మరొకడబ్బా అమరి ఉంటుంది. (కో. 15).

పంథాకొట్టు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపు రేకులను కలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (కో. 22; తె. 6).

పంపకం ఏయు: (క్రి.) చూ. పర్యా. కూచోబెట్టు. ఆకారాన్ని తయారుచేసేందుకు కొలతప్రకారం డిజైను కడ్డీలను అమర్చడం. (కో. 26, 27).

పంపు[1]: చూ. పర్యా. గాలిపంపు. స్టౌకు, పెట్రొమాక్స్ లైటుకు గాలి కొట్టడానికి టాంకికి అమర్చిన సాధనం. (కో. 2, 26, 28, 29; తె. 3-6, 17, 21, 23, 24).

పంపు[2]: సైకిల్‌కు గాలి కొట్టడానికి వాడే పరికరం. చూ. చిత్రం 149. (కో. 1, 3, 7, 8, 13-15).

పంపు[3]: పర్యా. కవంగము, కిరోసిన్ ఇంజను, కొలత పైపు, గుంజె ఇంజను, గుంజెగరాటు, గుంజెలాడకి, చేదెలాడకి, బొంబాయిలాడకి. డ్రమ్ముల్లోనుండి నూనెను పైకి తోడడానికి ఉపయోగపడే సాధనం. చూ. చిత్రం 53. (కో. 4, 9; తె. 1; రా. 4, 6).

పంపుగొట్టం: (< ఇం. Pump + గొట్టం) బర్నర్‌కు గాలిని అందించే సాధనం. (కో. 29).

పంపుబారల్: (ఇం.) బర్నల్‌కు గాలి ఎక్కడానికి టాంక్‌లోపల అమర్చి ఉండే సాధనం. (తె. 3).

పంపువాసర్: (ఇం.) పెట్రొమాక్స్‌లైట్‌లో పంపుకు బిగించి ఉండే నట్టు. (కో. 2).

పంపుసెట్: (ఇం.) చూ. పర్యా. గాలిపంపు. స్టౌకు, పెట్రొమాక్స్‌లైటుకు గాలికొట్టడానికి టాంకికి అమర్చిన సాధనం. (తె. 18, 19).

పంపుసెట్టు: (ఇం.) జీలుగబెండును విప్పడానికి వాడే సాధనం. (కో. 25).

పయ్య[1]: చూ. పర్యా. కమ్మి[1]. బండిచక్రం చుట్టువేసే ఇనపబద్ద. (తె. 5).

పయ్య[2]: చూ. పర్యా. అడగోలు. లోహపురేకులు, కడ్డీలు సాపుచేయడానికి వాడే దిమ్మ. (తె. 17, 19, 21).

పయ్య[3]: (< హిం. పహియా) ఉ. పెయ్య. చూ. పర్యా. గిలక[2]. సంగడిదిండును తిప్పడానికి ఉపయోగపడే చక్రం. (తె. 4, 7, 8).

పరపుగెంటె: చూ. పర్యా. గరిటె[2]. మూసలో కరిగిన లోహపుతేటను తీయడానికి వాడే పరికరం. (తె. 23, 25).

పరబాతా: చూ. పర్యా. అడకత్తెర. పచ్చివక్కలు కత్తరించే సాధనం (తె. 4).

పరమట్టు: పర్యా. పీట[1]. లోహపుపాత్రలు తయారు చేసేటప్పుడు పనివాళ్ళు కూర్చోడానికి వాడే కొయ్యపీట. (రా. 2).

పరంద: రేకులను సూరు వంచడానికి ఉపయోగపడే 'L'ఆకారపు పరికరం. (కో. 22, 23).

పరాతం: ఉ. పరాతు. పర్యా. డిజైనుపరాతం, తట్ట[1],

తపుకు, పట్టెకుంజప్లేటు, పళ్ళెం[1], ప్లేటు[7], మూత ప్లేటు, రౌండుప్లేటు, సాదాకిస్తి, సాదాపళ్లెం సాదాప్లేటు, సిబ్బి[1]. వెడల్పుమూతి ఉన్న లోహపు పాత్ర. శుభకార్యాల్లో వస్తువులు తీసుకెళ్ళడానికి, పిండికలపడానికి, వేడి వస్తువుల్ని చల్లార్చడానికి ఉపయోగం. చూ. చిత్రం 150. (కో. 6-11, 19, 26, 30; తె. 6, 10, 11, 17, 18; రా. 13, 14, 17, 18).

పరిగేయు: (క్రి.) పర్యా. పొడుసు, పోట్లుపెట్టు, సమ్మెటివేయు, సాగదీయు, సాగబీకు, సాగబెట్టు, సాగించు, సాగేయు, సాగ్గొట్టు. కాల్చినలోహపు రేకులను, కడ్డీలను సమ్మెటతో కావలసిన రీతిలో సాగ్గొట్టడం. (కో. 16).

పరిమాణం: పొట్టుపొయ్యి మొత్తంకొలత. (రా. 1).

పరుపచట్టి: పప్పు నానబెట్టుకోనికి వాడే గిన్నెలాంటి పరికరం. (కో. 1).

పరుపు: ఉ. పరపు. పర్యా. పిట్టు, మరుగు. కరిగే లోహంపై ఉండే మైలపదార్థం. (తె. 17, 21, 23).

పరుపుతొట్టి: ఇత్తడిపనిలో కరుగుతున్న లోహంపైని మైలను భద్రపరచడానికి వాడే చిన్నపాత్ర. (తె.25).

పరుపుబూడిద: చూ. పర్యా. కవరుబూడిద. అచ్చుకు మన్ను అంటుకోకుండా ఉండడానికి చల్లే పొడి. (కో. 29).

పర్లా: చూ. పర్యా. గూన, వర్షపునీరు కిందపడడానికి వీలుగా మిద్దెల పైభాగాన అంచుల్లో అమర్చిన పల్చనిరేకు గొట్టం. (తె. 23).

పర్నవేసు: పాత అల్యూమినియంను కడాయిలో కరిగించడానికి ఉపయోగపడే పాత్ర. (రా. 7).

పర్మా: రూ. ఫర్మ. ట్రంకుపెట్టె. కొలతలు తీయ డానికి ఉపయోగపడే రేకు. (తె. 17).

పర్మాతీయు: (క్రి ) చూ. పర్యా. దొర్లించు. లోహపు రేకుపై స్కేలుతో కొలతలు తీయడం. (కో. 28; తె. 3, 21).

పల్‌చేయు: (క్రి.) చూ. పల్లుచేయు. (రా. 11).

పలకఅక్కురాయి: విగ్రహం ఏటవాలు ప్రదేశాల్లో సాపుచేయడానికి శిల్పపనిలో వాడే పరికరం. (తె. 17).

పలకఊయల: ఇద్దరు లేదా ముగ్గురు కూర్చొని ఊగడానికి వీలుగా పలక అమర్చిచేసిన ఉయ్యాల. చూ. చిత్రం 151. (రా. 3, 5).

పలకకడ్డీ: చూ. పర్యా. కత్తెమొల. లోహపురేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 18).

పలకగ్లాసు: పొడవైన డిజైన్లున్న స్టీల్‌గ్లాసు. నీళ్ళు తాగడానికి ఉపయోగం. చూ. చిత్రం 152. (కో. 5, 6, 8, 10, 11, 20).

పలకపుల్ల: చూ. పర్యా. కనికపుల్ల. రేకులపై గుర్తులు వేయడానికి వాడే సుద్దముక్క. (కో. 27; రా. 10).

పలకరేంజి: చూ. పర్యా. రించి. నట్లు బిగించడానికి వాడే సాధనం. చూ. చిత్రం 197. (కో. 25).

పలకలగలాసు: ఉ. గలాస, — గిలాస. చూ. పలకలగ్లాసు. (తె. 3, 7, 14, 17, 19).

పలకలగిన్నె: చూ. పర్యా. కూరగిన్నె. కూరలు వండడానికి, వేసుకోడానికి వాడే లోహపుపాత్ర. పలుకలుగా ఉండే మట్టును అమర్చి వుంటారు. చూ. చిత్రం 64. (కో. 10, 16, 18-20; తె. 8, 9).

పలకలగునపం: కాగులకు పైరేకు చదరం చేసుకొన డానికి వాడే పరికరం. (కో. 5).

పలకలగ్లాసు: ఉ. పలకలగాసు. రూ. పలకలగలాసు. పర్యా. పక్షాల్‌లోటా, పచ్చాలగ్లాసు. క్రిందనుంచి నగందాక పెద్దసైజు పక్షాలుండే నీళ్ళలోటా. (కో. 7, 11, 2, 13, 15-18, 19-24; తె. 15).

పలకలచెంబు: చూ. పర్యా. పలకల మరచెంబు. వెడల్పు పలకలుండే ఒకరకం చెంబు. (కో. 21).

పలకలటిఫన్: (< పలకల + ఇం. Tiffin) చుట్టూ పెద్ద డిజైన్లుకలిగి మూతతో ఉండే స్టీలుపాత్ర. పదార్థాలు తీసుకెళ్ళడానికి ఉపయోగం. (కో. 18).

పలకలపోగరు: చూ. పలవలపోగారు. (కో. 5).

పలకలమరచెంబు: పర్యా. పలకలచెంబు. వెడల్పు పలకలుండే ఒకరకం మరచెంబు. (కో. 10).

పలకసుత్తి: రూ. పలకలసుత్తి, పలగసుత్తి. చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను బెండ్‌చేయడానికి, రివిట్‌చేయడానికి, సాపు చేయడానికి నాల్గు పలకల్లాగా వచ్చేటట్టు కొట్టడానికి వాడే కంచు పనిముట్టు. (కో. 5, 7, 10, 15, 17-22).

పలకలసుత్తి: చూ. పలకసుత్తి. (కో. 26, 29).

పలకేయు: (క్రి.) ఇనుమును కాల్చి చదరంగా చేయడం. (కో. 28).

పలగసుత్తి: చూ. పలకసుత్తి. (కో. 4).

పలగొట్టు: (క్రి.) చూ. పగులగొట్టు. (తె. 4).

పలగ్గొట్టు: (క్రి.) చూ. పగులగొట్టు, (తె. 23).

పలచగకొట్టు: (క్రి.) చూ. పర్యా. సరుసు. సాగ్గొట్టినే

తర్వాత పదునుపెట్టడానికి వీలుగా పనిముట్ల అంచుల్ని ఏటవాలుగ, పల్చగ అవరగొట్టడం. (రా. 4).

పలచనిసుత్తె: పర్యా. పాలపుసుత్తి, పెద్ద గన్‌సుత్తె, పెద్ద మట్నసుత్తె, పెద్ద మడ్సుత్తె, పెద్ద సుత్తె[1]. పైరేకుల సుత్తె, పొడుగు మడిసుత్తి, పొడుగు ముట్టిసుత్తి, ప్రెస్ సుత్తి, బాడిసుత్తె, భుజాల్సుత్తె, మెరకమట్‌సుత్తె, సన్నకన్నుసుతె, సుడిసుత్తి. బిందెగొంతు, అడుగుభాగాలు, సాపుచేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 153. (కో. 3).

పలవలపొగారు: రూ. పలవలపోగరు. గుండ్రనితనం చెడకుండా ఉబ్బెత్తులు కొట్టడానికి వాడే పరికరం. (కో. 15, 20).

పలావ్ అండి: చూ. పర్యా. దేక్సా. పలావ్ చేయడానికి వాడే పెద్ద పాత్ర. చూ. చిత్రం 123. (కో. 2).

పలావ్స్గౌట్: (ఇం) స్ప్రింగ్‌లాగా ఉండే ఇనప తడిక. (రా. 8).

పలావ్ట్రే: (< హిం. - ఇం. T[illegible]) అన్నం ఆరబోసుకోడానికి ఉపయోగపడే లోహపు పాత్ర. (రా. 8).

పలావ్‌దేక్షా: (హిం.) చూ. పర్యా. దేక్షా. పలావు చేయడానికి వాడే పెద్ద లోహపు పాత్ర. చూ. చిత్రం 123. (కో. 2, 8, 25; రా. 2, 7, 8).

పలావ్‌దేక్సా కరవాయి: రూ. పలావ్ దేక్సాల కరవాయి. చూ. పర్యా. దేక్సా కరవాయి. పలావ్ దేక్సాలు తయారుచేయడానికి వాడే సాధనం. (రా. 2).

పలావ్‌దేక్సాలకరవాయి: చూ. పలావ్ దేక్సా కరవాయి. (కో. 2).

పలుకులు: చూ.పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బుడిపెలు. (కో. 22).

పలుగు: పర్యా. పావుడ, రేకు[1]. బిందెపై గీతలువేసే గెడ్డపారలాంటి పరికరం. (తె. 5; రా. 7).

పలుగుడు: లోహపు పాత్రలపైఉండే దార్లు. (తె. 8, 9, 12).

పలుగురౌతు: చూ. పర్యా. గీటురాయి. మొద్దుబారిన పనిముట్లను పదునుపెట్టడానికి ఇత్తడిపనిలో ఉపయోగపడే గరుగ్గాఉన్న తెల్లని పొడి. (తె. 17).

పల్చనిశానం: చూ. పర్యా. చదరపు పంచు. పల్చని లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి ఉపయోగపడే పరికరం. (కో. 21).

పల్టలు: (హిం.) చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనుంపైనుండి తీయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 5. (తె. 4).

పల్టాయించు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపురేకులను కలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (తె. 16; రా. 15).

పల్లకట్టు: చూ. పర్యా. కక్కులు. ఇత్తడిబిందె భాగాలను అతకడానికి రేకు అంచులపై అక్కడక్కడ చేసిన చిన్న కత్తిరింపులు. (తె. 6).

పల్లగడ్డపార: చూ. పర్యా. డెక్కకొరాం. బిందెల అతుకులను మత్నువేయడానికి వాడే పనిముట్టు. దీనితల ఆవు కాలిగిట్ట ఆకారంలో ఉంటుంది. తె. 3).

పల్లపుమెరకసుత్తి: చూ. పర్యా. మెరకమట్టిసుత్తి. సాపుకలపడానికి వాడే పరికరం. (కో. 21).

పల్లంమట్నసుత్తి: సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 21).

పల్లి: తాల్పువేయడానికి వాడే గరిట. తె. 6).

పల్లిగానిమిషను: (< పల్లిగాలి + ఇం. Machine) చూ. పర్యా. జూస్‌కషరు. పండ్లరసం తీయడానికి వాడే సాధనం. (తె. 10, 11).

పల్లు: కమానులో పుల్లలను బిగించడానికి ఉండే గది. (కో. 18; తె. 19).

పల్లుచేయు: (క్రి.) రూ. పల్‌చేయు. పర్యా. పల్లు తీయు, పళ్ళుపెట్టు, పెట్టుకొను, విడదీయు. అతకడానికి వీలుగా రేకును పల్లు కత్తిరించడం. (కో. 16).

పల్లుయిరుపు: రూ. పళ్ళయిరుపు, పళ్ళిరుపు. చూ. పర్యా. పటాక్కర. లోహపురేకులకు జాయింట్లుచేసే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలి వుంటుంది. (తె. 21).

పళ్లెం[1]: చూ. పర్యా. అరివేణి. పూజకు ఉపయోగించే రాగితట్ట. (కో. 24).

పళ్లెం[2]: చూ. పళ్ళెం[2]. (తె. 18, 20, 21).

పళ్లాంచేముక్క: చూ. పర్యా. పటాక్కర. లోహపు రేకులకు జాయింట్లుకలిపే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలి వుంటుంది. (కో. 5, 24, 28).

పళ్లాంచేమొల: చూ. పర్యా. పటాక్కర. లోహపు రేకులకు జాయింట్లుకలిపే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలి వుంటుంది. (కో. 19).

పళ్లకారు: చూ. పర్యా. పట్కార. లోహపు రేకులకు జాయింట్లుచేసే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలి వుంటుంది. (కో. 22).

పళ్లచక్రం: చూ. పర్యా. అతుగుగొడుతు. గొడుగు పుల్లలను బిగించడానికి గొడుగు కర్రపైభాగాన ఉండే గుండ్రని పరికరం. (కో. 24; తె. 21).

పళ్లపుల్ల: చూ. పండ్లపుల్ల. (తె. 8, 9).

పళ్లయిరుపు: చూ. పల్లుయిరుపు. (తె. 17).

పళ్లపుకంటానీ: రూ. పాళపుకంటానీ. పర్యా. పళ్ళపు లేగ, పాళం కంట్రానీ, పాలీలేగ. పళ్ళపుభాగాల్లో పాపుమీద మెరుగేయడానికి వాడే పరికరం. (కో. 16, 20).

పళ్లశానం: విగ్రహాన్ని దట్న కొట్టడానికి వాడే పరికరం. (కో. 17).

పళ్లిరుపు: చూ. పల్లుయిరుపు. (తె. 22).

పళ్లుకత్తెర: ఉ. పళ్ళుకత్తిరి. ఇత్తడి పాత్రలకు పళ్ళు వంచుకోడానికి ఉపయోగించే పరికరం. (కో. 7, 13, 14; తె. 10, 11).

పళ్లుచక్రం: పొగాకు అచ్చులు తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 8).

పళ్లునిగేసుత్తి: చూ. పర్యా. పట్కార. లోహపు రేకులను కలిపే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలివుంటుంది. (రా. 1).

పళ్లుపెట్టు: (క్రి.) చూ. పర్యా, పల్లుచేయు. అతకడానికి వీలుగా రేకును పళ్ళు కత్తరించడం. (తె. 8).

పళ్లెం[1]: రూ. పళ్ళెరం. చూ. పర్యా. పరాతం. శుభకార్యాల్లో వస్తువులు తీసుకువెళ్ళడానికి, పిండి కలపడానికి, వేడివస్తువుల్ని చల్లార్చడానికి వాడే వెడల్పు మూతి ఉన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 150. (కో. 9, 11, 12, 15, 19, 20, 22, 23, 25-30; తె. 1-4, 6, 7 18, 20, 21, 22, 24, 25; రా. 13, 14, 18).

పళ్లెం[2]: (బ.) పళ్లేలు. రూ. పల్లెం[2]. చూ. పర్యా. కంచం. భోజనంప్లేటు. చూ. చిత్రం 214. (కో. 12, 20; తె. 7, 9. 14-19).

పళ్లెరం: చూ. పళ్ళెం[1]. (కో. 5).

పవాలి: (హిం.) చూ. పవాళీ. (తె. 7, 10, 18).

పవాలిడ్రమ్ము: (< హిం + ఇం. Drum). మంచి నీళ్ళు ఉంచడానికి ఉపయోగించే డిజైనుమూత ఉన్న పెద్దపాత్ర. (కో. 22).

పవాళి: (ఉర్దూ.) రూ. పవాలి. చూ. పర్యా. కొళాయి. మంచినీళ్ళు నిల్వ ఉంచడానికి కొళాయి అమర్చిన లోహపు పరికరం. చూ. చిత్రం. 124. (తె. 3, 6, 17).

పసుపులడబ్బా: చూ. పర్యా. డబ్బా[1]. ఏవైన పదార్థాలు నిల్వ ఉంచుకోడానికి వాడే మూత ఉన్న పొడవు లోహపుపాత్ర. చూ. చిత్రం 121. (తె. 7).

పాకింగు: (ఇం.) స్టౌలో రెగులేటర్ అమర్చి ఉండే మరొకభాగం. (కో. 28).

పాకింగ్‌చేయు: (క్రి.) (< ఇం. Packing + చేయు) చూ. పర్యా. జంటించు. రెండురేకుల అతుకులను కలపడం చేయడం. (కో. 26).

పాకెట్: (ఇం.) ఉ. పాకిట్. చూ. పర్యా. జవ్వ. కాగితాలు వగైరా చిన్న చిన్న వస్తువులను ఉంచడానికి ట్రంకుపెట్టె మూతకు అమర్చిన అర. (తె. 6, 17).

పాకొల్లు: చూ. పావుకోళ్ళు. (తె. 13).

పాగ: రేకును లోతుగా ఒద్దుకోడానికి ఉపయోగించే దిమ్మ. (కో. 20).

పాట: దీర్ఘచతురస్రాకారంలో ఉండే ఇనుపదిమ్మె. (కో. 20).

పాట: దీర్ఘచతురస్రాకారంలో ఉండే ఇనుపదిమ్మె. వెల్డింగ్ చేసేటపుడు దీన్ని రేకుకింద పెట్టి వెల్డింగ్ చేస్తే హోల్స్‌పడవు. (రా. 8).

పాటన్: (< ఇం. Pattern). పర్యా. సాంచ[1]. ఇనప బద్దలతో డిజైన్‌లు చేయడానికి వాడే అచ్చుదిమ్మ. (తె. 17).

పాటా[1]: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి ఉపయోగపడే మోపు. (కో. 23, 26, 28).

పాటా[2]: పెట్టెరేకును జాయింట్ చేయడానికి, మడత వేయడానికి వాడే పరికరం. (కో. 28).

పాటా[3]: రెండుబిందెలను తయారుచేయడానికి వీలుగా ఉండే పెద్ద ఇత్తడిరేకు. (తె. 25).

పాటాపనిచేయు: (క్రి.) పెట్టెమూత అడుగుభాగంపై కూర్చోడానికి వీలుగా అడుగుభాగానికి గాడిలాగ చేయడం. (కో. 26).

పాటారేకు: చూ. పర్యా. అడ్డ. బిండె మధ్యభాగపు రేకు. (తె. 25).

పాటుపెట్టు: (క్రి.) అతకడానికి వీలుగా పట్టాలను పతేలగ చేయడం. (తె. 5).

పాటీషన్: చూ. పార్టీషన్లు. (రా. 15).

పాట్లా: చూ. పర్యా. కీసెట్టు. బీరువాకుండే లాక్‌సెట్టు. (కో. 18, 22, 28; తె. 20, 24).

పాట్లాకు[1]: (ఇం.) ఉ. పాట్లాక్. చూ. పర్యా. కీసెట్టు. బీరువాకుండే లాకర్‌సెట్టు. (తె. 2; రా. 4, 16).

పాట్లాకు[2]: డ్రమ్ముకు పైభాగంలో ఉండే పరికరం. (రా. 1).

పాట్లేగ: ఉ. పాటిలాగ, పాట్లాగ. చూ. పట్టాలేగ. (తె. 13, 19, 21, 25).

పాణికాజార: నీళ్ళు తీసుకొనివెళ్ళడానికి వాడే బక్కెట్టు లాంటి పరికరం. (తె. 11).

పాతపెల్లు: గింజలు కొలవడానికి వాడే పాత్ర. (కో.4).

పాతర: బీరువాసేఫ్ లాకర్‌లో అమరిఉండే ఒక అర. ఇది కనపడకుండ ఉంటుంది. (రా. 16).

పాతాళగరిగ: పర్యా. పాతాళగరూకి. బావిలోంచి బొక్కెన తీయడానికి వాడే ఇనపకొక్కెల పరికరం. (తె. 8, 9, 13; రా. 4).

పాతాళభైరవి: చూ. పర్యా. పాతాళగంగ గాలం. బావిలోపడిన వస్తువులను పైకితీయడానికి ఉపయోగించే కొక్కెలున్న పరికరం. చూ. చిత్రం 154. (కో. 4, 15).

పాతికబద్దె: చూ. పర్యా. పట్రం. రేకుపై బొద్దు కొట్టడానికి వాడే పరికరం. (కో. 4, 9, 11, 15).

పాతికలావు అకురాయి: బీరువా రేకుపై పైజువారీగా రంధ్రాలువేయడానికి వాడే పరికరం. (కో. 28).

పాతికలావుచానం: కళాయిరేకులు కొట్టుకోడానికి వాడే పరికరం. (కో. 12, 15).

పాతిపోగరు: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలువేయడానికి వాడే పరికరం. (కో. 5).

పాతిలోకకడ్డి: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలువేయడానికి వాడే పరికరం. (కో. 15).

పాతుడుదుండు: బిందెవలము సాపుచేయడానికి వాడే సాధనం. (కో. 28).

పాత్ర: వంటకువాడే పెద్ద చెంబు. (రా. 3).

పాదట్టె: బోతపాత్రను తయారుచేయడానికి వాడే కొయ్యచట్రం. (తె. 25).

పాదస్టే: చూ. పర్యా. గద్దె[2]. విగ్రహంయొక్క అడుగు భాగం. (కో. 3; తె. 17).

పాదు: చూ. పర్యా. కంటుదిమ్మె. ఇరుసును అమర్చడానికి వాడే బండిచక్రం మధ్యలోఉండే కొయ్య దిమ్మె. (కో. 21).

పాదుకలు: ఉ. పాదుకులు. పర్యా. పావుకోళ్ళు. దేవాలయాల్లో దేవుని కాళ్ళదగ్గర పెట్టడానికి తయారు చేసిన లోహపు పాదరక్షలు. భక్తులను ఆశీర్వదించడానికి ఉపయోగం. (కో. 20; తె. 21).

పాదెట్టి: చూ. పర్యా. డాకలిమొద్దు. పని చేసేటప్పుడు డాకలిని కదలకుండ బిగించడానికి ఉపయోగపడే కొయ్య. (తె. 25).

పాన్‌దాను: (హిం.) ఉ. పందను, పాన్‌దానా, పాందాని. పర్యా. పాన్‌బాక్సు. పాన్‌మసాల డబ్బి. వక్కడబ్బా. తాంబూలం సామగ్రి పెట్టుకోడానికి వాడే పెట్టె. (తె. 1, 2, 6, 10, 11, 17).

పాన్‌దీపం: అగరుకడ్డీలు ఉంచేందుకు, దీపం వెలిగించడానికి వాడే కాడఉన్న ఇత్తడి పరికరం. (కో. 23; రా. 15).

పాన్‌బాక్సు: (< హిం.+ఇం. Box) చూ. పర్యా. పాన్‌దాను. వక్కాకు సామగ్రి పెట్టుకోడానికి ఉపయోగపడే డబ్బా. (తె. 14, 16).

పాన్‌మసాలడబ్బి: (హిం.) చూ. పర్యా. పాన్‌దాను. తాంబూలసామగ్రి పెట్టుకోడానికి ఉపయోగపడే లోహపుపెట్టె. (రా. 6).

పాన్‌స్పూను: (హిం.+ఇం. Spoon) వక్కపొడి ఎత్తుకోడానికి వాడే గరిట. (తె. 10, 11).

పాన: చూ. స్పానరు. (తె. 7-9, 11, 13, 17).

పానకరవాయి: తపేలాలు తయారు చేయడానికి వాడే పనిముట్టు. (రా. 1).

పానమట్టం: పర్యా. పావనీవాటం. శివలింగం చుట్టూ ఉండే లోహపు తొడుగు. (కో. 13).

పానర్: చూ. స్పానరు. (తె. 5).

పానం: చూ. స్పానరు. (తె. 11).

పానస్పానరు: సైకిల్‌సెంట్రల్ కాడ సరిచేయడానికి వాడే పరికరం. (కో. 1).

పానీడబ్బా: బట్టీపై నీళ్ళుచల్లడానికి వేడిగా ఉండే పనిముట్లను చల్లార్చడానికి వాడే నీటిరేకుపాత్ర. (తె. 4).

పాన్సీకిస్తి: చూ. ప్యాన్సీకిస్తీ. (తె. 15, 16).

పాందాను[1]: (హిం.) చూ. పర్యా. కుటకల కంచం. కూరలు వేసుకోడానికి వీలుగా గుంటలు అమర్చి చేసిన భోజనపాత్ర. చూ. చిత్రం 57. (తె. 12, 13).

పాందాను[2]: హిం. ఉ. పాందాన్, పాందాన, పాందాని. ఆకులు ఒకఒరలోను, పోకలు ఒకఒరలోను, చెక్కలు మరొక ఒరలోను పెట్టుకోడానికి వీలుగా

గుండ్రం లేదా చౌకం లేదా ముక్కోణం ఆకారాల్లో ఉండే అరలస్టీలు పెట్టె. చూ. చిత్రం 155. (కో. 7, 25, 28; తె. 3, 9, 12-15).

పాము[1]: (క్రి.) చూ. పర్యా. తరగదీయు. ఆకురాయితో లోహపు పాత్రలను అరగదీయడం. (కో. 28).

పాము[2]: చూ. పర్యా. తీయు[1]. రేకుపై ఆసిడ్‌ను పూయడం. (కో. 23, 24, 25, 27).

పాయసంకప్పు: పాయసం పోసుకోడానికి ఉపయోగపడే గిన్నె. (కో. 6, 11).

పాయింట్‌చేయు: (క్రి.) (< ఇం. Point+చేయు) చూ. పర్యా. సరుసు. పనిముట్లు తెగడానికి వీలుగ కొస్సిగచేయడం. (తె. 7, 21).

పార: పర్యా. సలికె. కొలిమిదగ్గర మట్టిని, బొగ్గులను ఎగదోసుకోడానికి చిన్నగుంతలు చేయడానికి ఉపయోగించే సాధనం. చిన్న రేకుకు పొడవాటి కడ్డీ అతికించి ఉంటుంది. చూ. చిత్రం 156. (కో. 18; తె. 4, 19, 21).

పారక్: సైకిల్ ముందుచక్రానికి బిగించిన హ్యాండిల్ భాగం. (తె. 8, 12, 13).

పారరేకు: పర్యా. సలికరేకు, పారతయారు చేయడానికి ఉపయోగించే దీర్ఘ చతురస్రాకారపు ఇనుపప్లేటు. (తె. 1).

పారు: (క్రి.) 1. అచ్చురంధ్రాల ద్వారా లోహం ప్రవహించడం. 2. బిందెలను అతికేటప్పుడు లోపలవేసిన టంకం కరిగి ప్రవహించడం. (కో. 24; తె. 6).

పార్టీషన్‌చేయు: (క్రి.) (< ఇం. Partition+చేయు) చూ. పర్యా. కూచోబెట్టు. ఆకారాన్ని తయారుచేయడానికి కొలతప్రకారం డిజైను కడ్డీలను అమర్చడం. (కో. 22).

పార్టీషన్లు: రూ. పాటీషన్. బీరువాలాకరు ప్రక్కభాగాలు. (రా. 8).

పార్సీ: (హిం.) అన్నం చేసుకోడానికి వాడేపాత్ర. (కో. 5).

పార్సీచెంబు: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారంతో చేసిన చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 84. (తె. 8, 11).

పాలకలాయి: పర్యా. పాలకాగు. పాలగిన్నె[2], పాలదేక్షా, పాలతపాల, పాపదాక. పాలు కాచుకోడానికి ఉపయోగపడే లోహపుపాత్ర. (కో. 18).

పాలకాగు: చూ. పర్యా. పాలకలాయి. పాలు కాచుకోడానికి వాడే లోహపుపాత్ర. (కో. 49).

పాలకాను: (< పాల+ఇం. Can) చూ. పాలక్యాను. (కో. 22, 23, 25; తె. 3, 5, 20, 23-25; రా. 14).

పాలకుక్కరు: (< పాల ఇం. Cooker) పాలు కాచుకోడానికి ఉపయోగపడే లోహపుపాత్ర. (తె. 8, 9).

పాలకొలిమి: మట్టిమోల్డును వేడిచేసే వామి. (రా. 2).

పాలక్యాను: రూ. పాలకాను. పర్యా. కేను, పాలటిఫిని, పాలపాత్ర, పాలబుడ్డి[1], పాలిష్‌కాను, సాదాక్యాను. పాలుతీసుకొని వెళ్ళడానికి ఇనుపరేకుతో చేసిన పెద్దపాత్ర. పట్టుకోడానికి పొడుగుపాటి కమ్మి. పైమూత, తాళం వేయడానికి గొళ్ళెం ఉంటాయి. చూ. చిత్రం 157. (కో. 1, 12, 15; తె. 10, 11; రా. 4, 7).

పాలగడలేగ: చూ. పర్యా: పట్కార. లోహపు రేకులు కలిపే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలి వుంటుంది. (తె. 12).

పాలగరిటె[1]: చూ. పర్యా. కాడగంటె. పాలు కలియబెట్టడానికి వాడే పొడవాటి కాడ ఉండే చిన్నకప్పు. చూ. చిత్రం 47. (కో. 19, 20, 26).

పాలగరిటె[2]: పర్యా. గళ్ళ[2], సవక. చిన్నపిల్లలకు పాలుపట్టడానికి వాడే ఉగ్గుగంటె. (కో. 16).

పాలగంటె: చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 47. (రా. 14).

పాలగిన్నె[1]: చూ. పర్యా. ఉగ్గుగిన్నె. చిన్నపిల్లలకు ఉగ్గుపట్టడానికి వాడే మట్టు ఉండే చిన్నపాత్ర. చూ. చిత్రం 26. (రా. 14).

పాలగిన్నె[2]: చూ. పర్యా. పాలకలాయి. పాల కాచుకోడానికి వాడే లోహపుపాత్ర. (కో. 23, 26)

పాలగిన్నె[3]: పాలు కొలుచుకోడానికి పిడి ఉండేపాత్ర. చూ. చిత్రం 158. (కో. 28).

పాలగుండి: పర్యా. పాలిష్‌చెంబు. నీళ్ళు తాగడానికి, పాలు తెచ్చుకోడానికి వాడే పోతపోసిన గుండ్రని లోహపుపాత్ర. (తె. 5).

పాలగెంటె: చూ. పర్యా. కాడగంటె. పాలు-నీళ్ళు పోయడానికి వాడేకాడ ఉండే చిన్నకప్పు (తె. 18, 19).

పాలగ్లాసు: పాలు పోసుకోడానికి ఉపయోగపడే లోటా. (తె. 8, 9).

పాలచెరవ: రూ. పాల్సెరవ. చూ. పర్యా. పాలచెంబు

పాలు తెచ్చుకోడానికి వాడే గుండుచెంబు. (కో. 4).

పాలచెంబు[1]: పర్యా. పాలతపెలా, పాలచెరవ. పాలు తెచ్చుకోవడానికి వాడే గుండుచెంబు. (కో. 2, 20, 28; తె. 3, 14, 16).

పాలచెంబు[2]: ఉ. పాల్చెంబు. పర్యా. కొమ్ముచెంబు. పాలబుడ్డీ[2], బుడ్డిచెంబు, బొడ్డుచెంబు. ఒకవైపు కొమ్ములాంటి గొట్టం మరోవైపు పిడి అతికి చేసిన చెంబు. పిల్లలకు పాలుపట్టడానికి ఉపయోగం. (కో. 12, 13, 15-21).

పాలజెగ్గు: పర్యా. మూతచెంబు. పాలు తెచ్చుకోడానికి వాడే చిన్నపాత్ర. (రా. 15).

పాలటిఫిని: చూ. పర్యా. పాలక్యాను. నూనె, పాలు తెచ్చుకోడానికి ఉపయోగించే పొడవుపాత్ర. పై మూత, పట్టుకోడానికి హాండిల్ ఉంటుంది. చూ. చిత్రం 157. (తె. 18).

పాలడబ్బా[1]: పర్యా. మిల్కుకాను, మిల్కుపడి[1], లస్సీపాట్, లస్సీబుడ్డీ. పాలు, నూనె తెచ్చుకోడానికి వాడే గుండ్రని లోహపుపాత్ర. చేత్తో పట్టుకోడానికి హాండిల్ ఉంటుంది. పైమూతకు గొళ్లెం ఉంటుంది. (కో. 24; తె. 2, 8, 10-12, 17).

పాలడబ్బా[2]: పాలపొడి ఉంచుకోడానికి ఇనుపరేకుతో తయారుచేసిన పాత్ర. (తె. 9).

పాలడి: (బ) పాలళ్ళు. చూ. పర్యా. ఉగ్గుగిన్నె. చిన్నపిల్లలకు ఉగ్గుపట్టడానికి వాడే చిన్నగిన్నె. (కో. 1).

పాలడేక్షా: చూ. పర్యా. పాలకలాయి. పాలుకాచుకోడానికి వాడే లోహపు పాత్ర. (కో. 27).

పాలతపాల: చూ. పర్యా. పాలకలాయి. పాలు కాచుకోడానికివాడే లోహపు పాత్ర. (కో. 18, 25).

పాలతపాలకరవాయి: పాలచెంబులు తయారుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 14).

పాలతపెలా: ఉ. పాలతపాల. చూ. పర్యా. పాలచెంబు[1]. పాలు తెచ్చుకోడానికి వాడే గుండుచెంబు. (కో. 15, 16).

పాలదాక: చూ. పర్యా. పాలకలాయి. పాలు కాచుకోడానికి వాడే లోహపు పాత్ర. (కో. 29).

పాలపాత్ర: చూ. పర్యా. పాలక్యాను. పాలు, నూనె మున్నగునవి తెచ్చుకోడానికి వాడే క్యాను. పట్టుకోడానికి పొడుగుపాటి కమ్మ, పైమూత, తాళం వేయడానికి గొళ్లెం ఉంటాయి. చూ. చిత్రం 157. (రా. 11).

పాలపునుత్తి: విగ్రహం చదరంగా కొట్టడానికి వాడే పరికరం. చూ. చిత్రం 153. (కో. 6).

పాలపొయ్యి: పాలు కాచుకోడానికి ఉపయోగపడే పొయ్యి. (రా. 2).

పాలబిందె: చూ. పర్యా. పచ్చడిబిందె. నీళ్ళు, పాలు తెచ్చుకోడానికి వాడే గుండ్రని లోహపు పాత్ర. (కో. 6, 26, 30).

పాలబుడ్డీ[1]: చూ. పర్యా. పాలక్యాను. పాలు, నూనె తెచ్చుకోడానికి ఉపయోగించే క్యాను. చూ. చిత్రం 157. (కో. 21).

పాలబుడ్డీ[2]: చూ. పర్యా. పాలచెంబు[2]. చిన్నపిల్లలకు పాలు త్రాపడానికి వాడే హాండిలు, గొట్టం అతికి ఉండే చిన్నచెంబు. (కో. 28, 48).

పాలబుడ్డీ[3]: పర్యా. పాలసీసా, పిడింగ్‌బటను. చిన్నపిల్లలకు పాలుపట్టడానికి ఉపయోగపడే స్టీలుపాత్ర. పొడవుగా సీసా ఆకారంలో ఉంటుంది. (కో. 22).

పాలమట్టి: చూ. పర్యా. జిగురుమట్టి. పోతపాత్రను తయారు చేయడానికి ఉపయోగించే జిగురుగా ఉండే మట్టి. (రా. 2).

పాలవెల్లి: దేవునిమీద ఏలకట్టడానికి లోహంతో తయారుచేసిన పందిరి. (కో. 29).

పాలసరవ: చూ. పర్యా. పాలకలాయి. పాలుకాచుకోడానికి వాడే లోహపుపాత్ర. (తె. 24).

పాలసీసా: చూ. పర్యా. పాలబుడ్డీ[3]. చిన్నపిల్లలకు పాలు పట్టడానికి ఉపయోగపడే స్టీలుపాత్ర. పొడవుగా సీసా ఆకారంలో ఉంటుంది. (కో. 1, 2, 12, 15).

పాలం[1]: చూ. పర్యా. అడగోలు. లోహపురేకులు, కడ్డీలు సాపుచేయడానికి వాడే దిమ్మ. (రా. 4, 10, 12).

పాలం[2]: ఇత్తడిరేకుపై డిజైను చెక్కబడని నునుపైన భాగం. (తె. 25).

పాలంఅకురాయి: అతికిన భాగాలను సాపుచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 16).

పాలంకొయ్యసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 12).

పాలంగొడ్డలి: సన్ననిమాను నరుకోడానికి పనికి వచ్చే సాధనం. (రా. 4).

పాలంసుత్తె: చూ. పర్యా. పలచనిసుత్తి. బిందె గొంతుభాగం, అడుగుభాగం సాపుచేయడానికి వాడే సుత్తి. (తె. 10, 11).

పాలాడి: ఉ. పాలాడ, పాలాడ. చూ. పర్యా. ఉగ్గుగిన్నె.

చిన్నపిల్లలకు ఉగ్గుపోయడానికి వాడే చిన్నపాత్ర. చూ. చిత్రం 26. (కో. 1; తె. 10, 11; రా. 14).

పాలిష్‌కమ్మి: (< ఇం. P[illegible] కమ్మి) చూ. కంఠాణి. లోహపు పాత్రలకు మెరుగు పట్టడానికి వాడే పరికరం. (కో. 10).

పాలిష్‌కాను: చూ. పర్యా. పాలక్యాను. పాలు తెచ్చేందుకు వాడే ఇండాలియం పాత్ర. చూ. చిత్రం 157. (తె. 1).

పాలిష్‌కాయితం: చూ. పర్యా. ఎమరీపేపరు. మచ్చె కొట్టేటప్పుడు పాలిష్‌సుత్తెను మెరుగు పెట్టడానికి ఉపయోగించే గరుక్కాగితం. (తె. 17).

పాలిష్‌కేక్ : (ఇం.) చూ. పర్యా. కమల్‌సోపు. లోహపుపాత్రలకు పాలిష్ చేయడానికి ఉపయోగపడే సోపు. (కో. 8).

పాలిష్‌గిన్నె: చూ. పర్యా. కూరగిన్నె. కూరలు వండడానికి, వేసుకోడానికి వాడే లోహపుపాత్ర. చూ. చిత్రం 64. (తె. 17).

పాలిష్‌చెంబు : చూ. పర్యా. పాలగుండి. నీళ్ళు తాగడానికి వాడే గుండ్రని చిన్నలోహపు పాత్ర. (తె. 18).

పాలిష్‌డబ్బా: చూ. పర్యా. డబ్బా[1]. పప్పులు, పిండి వగైరా పదార్థాలు నిల్వఉంచుకోడానికి వాడే మూత ఉన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 121. (తె. 5, 8, 18, 25)

పాలిష్‌పని: చూ. పర్యా. తరణి. తయారైన లోహపు పాత్రలను పాలిష్ పెట్టేపని. (కొ. 19, 26; తె. 3; రా. 1, 2).

పాలిష్‌పెట్టు: (క్రి.) చూ. పర్యా. ఏట్లుఏయు. పూర్తయిన లోహపు పాత్రలను మెరుగుపెట్టడం. (తె. 18, 19, 23, 25).

పాలిష్‌బేసను: చూ. పర్యా. బేసను. వెడల్పుమూతి, లోతుఉన్న లోహపుపాత్ర. అన్నం ఆరబోసుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 179. (తె. 18).

పాలిష్‌బ్రెస్సు : (ఇం.) చూ. పర్యా. కుంచె. లోహాలకు పాలిష్ చేయడానికి ఉపయోగపడే పనిముట్టు. (రా. 2).

పాలిష్‌మూలు: విగ్రహానికి మెరుగుపెట్టడానికి వాడే పోగర. (తె. 10, 11).

పాలిష్‌మోటారు: (ఇం.) పర్యా. మోటారు. లోహపు పాత్రల పాలిష్‌పనికి వాడే పరికరం. (తె. 10).

పాలిష్‌రింగు: (ఇం.) పర్యా. పూత. పాలిష్‌కు ఉపయోగపడే పరికరం. లోహపు వస్తువులకు, పాలిష్ చేసేటప్పుడు వాడే గుండ్రనికమ్మి. (తె. 8).

పాలిష్‌లేగ: చూ. పర్యా. కంఠాణి. లోహపు పాత్రలకు మెరుగుపెట్టడానికి వాడే పరికరం. (తె. 1,24).

పాలిష్‌సుత్తె: చూ. పర్యా. మట్నసుత్తె. లోహపు పాత్రలకు మట్న వేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 188. (తె. 17).

పాలిస్‌కటోర: చూ. పర్యా. కటోరి[1]. వెలుతురు బాగా రావడానికి టార్చిలైట్ బల్బుచుట్టు ఉండే తెల్లనిరేకు. (తె. 25).

పాలిస్‌డబ్బా: అల్యూమినియం పాత్రలను శుభ్రపరచడానికి వాడే పాలిష్ ఉన్న రేకుపాత్ర. (కో. 4).

పాలిస్‌బిందె: చూ. పర్యా. కూజా. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగించే కూజా ఆకారమున్న లోహపు పాత్ర. (తె. 3).

పాలిస్‌మిషను: (ఇం.) పర్యా. పట్ర, పాలీష్ మోటారు, పినీషింగ్ మిషను. లోహాన్ని సానబట్టడానికి వాడే యంత్రం. (కో. 2, 10; రా. 7).

పాలీష్‌మోటారు: (ఇం.) చూ. పర్యా. పాలీష్ మిషను. లోహపు పాత్రలను మెరుగుపరిచే యంత్రం. (కో. 5, 8; తె. 20).

పాలీష్‌సుత్తె: చూ. పర్యా. మెరుగుసుత్తి. బిందెలపై మెరుగుచుక్కలు కొట్టడానికి వాడే పనిముట్టు. (తె. 14, 15, 22; రా. 8, 9, 16).

పాలీష్‌సోపు: (ఇం.) చూ. పర్యా. కమల్‌సోపు. లోహపు పాత్రలకు పాలిష్ చేయడానికి ఉపయోగపడే సోపు. (రా. 2).

పాల్చెరవ: చూ. పాలచెరవ. (తె. 17, 21, 22).

పాళ: మట్టి అచ్చు పైభాగం. (రా. 2).

పాళంకంట్రానీ: చూ. పర్యా. పళ్ళపుకంటానీ. పళ్ళపుభాగాల్లో సాపుమీద మెరుగువేయడానికి వాడే పరికరం. (కో. 7).

పాళంకొట్టు: (క్రి.) కుట్టంపెట్టిన రేకు లోపలిభాగాన్ని నున్నగా సదరం చేయడం. మద్రాస్ బిందెలకు ఈరేకును బిగిస్తారు. (తె. 3).

పాళపుకంటానీ: చూ. పళ్ళపుకంటానీ. (కో. 12).

పాళీలేగ: చూ. పర్యా. పళ్ళపుకంటానీ. పళ్ళపు భాగాల్లో సాపుమీద మెరుగేయడానికి వాడే పరికరం. (కో. 17).

పావనీవాటం: చూ. పర్యా. పానమట్టం. శివలింగం చుట్టూ ఉండే లోహపుతొడుగు. (రా. 13).

పావుకోళ్ళు: రూ. పాకోల్లు. చూ. పర్యా. పాదుకలు. దేవాలయాల్లో దేవుని కాళ్ళదగ్గర పెట్టడానికి తయారు

చేసిన లోహపు పాదరక్షలు. (కో. 21).

పావుడ: చూ. పర్యా. పలుగు. పారరేకు. (తె. 5).

పిక్‌బజిల్‌గ్రైనింగు: (ఇం.) చూ. పర్యా. గ్రైండరు. వెల్డింగు ఉబ్బులను శుభ్రపరచడానికి వాడే యంత్రం. ఊబులకు అమర్చివుంటుంది. (రా. 6).

పికానిని: వెల్డింగ్ రాడ్ను కొట్టడానికి వాడే పరికరం. (కో. 15).

పిక్కలిసాటు: పచ్చళ్లు వేసుకోడానికి వాడే స్పూను. (కో. 1, 2).

పింగాణి ఇనుపప్లేటు: (< పింగాణి + ఇనుప + ఇం. plate) పర్యా. పింగాణిప్లేటు. అన్నం తినడానికి వాడే గిన్నె. (కో. 2).

పింగాణిప్లేటు: చూ. పర్యా. పింగాణి ఇనుప ప్లేటు. అన్నం తినడానికి వాడే గిన్నె. (కో. 12, 15).

పిచ్చికాయస్ప్రేయరు: (< పిచ్చికాయ + ఇం. sprayer) పొలానికి మందుకొట్టే పరికరం. (కో. 8).

పిచ్చిగీయు: (క్రి.) చూ. పర్యా. పద్దించు. బిందె మధ్యరేకును బొద్దుగ డొల్లవలెచేయడం. (తె. 5).

పించెన్: చూ. పర్యా. పట్కార. లోహపు రేకులకు జాయింట్లుచేసే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలివుంటుంది. (రా. 14).

పింజు: కుంచంలో పాదు కదలకుండ బిగించిపట్టుకునే సాధనం. (కో. 21).

పిటప్‌బొందు: (< ఇం. Fitup + బొందు) పెట్టె క్రింది అడుగు, పెట్టె పైమూతను పిటప్‌చేసే కీలు. (కో. 2).

పిటి: బీరువా వెనకవైపుఉండే రేకు. (కో. 28).

పిట్టర్‌చానం: చూ. పర్యా. చిన్నబోగరు. కడ్డీలపై, లోహపురేకులపై చిన్న రంధ్రాలుకొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 3, 15).

పిట్టు: చూ. పర్యా. పరుపు. కరిగే లోహంపై ఉండే మైలపదార్థం. (కో. 20, 26; తె. 17, 22).

పిత్రేకు: కొయ్య అచ్చులలోనుండి మట్టిని తీయడానికి వాడే పనిముట్టు. (కో. 16).

పిడకలటంపు: చూ. పర్యా. దాయ. బండిపట్టాలను వేడిచేయడానికి వాడే వలయాకారపు నుగ్గులపొయ్యి. (కో. 28).

పిడకలదాయ: చూ. పర్యా. దాయ. బండికమ్ములను కాకపెట్టడానికి వాడే వలయాకారపు నుగ్గులపొయ్యి. (కో. 21).

పిడకలదాలి: చూ. పర్యా. దాయ. బండిపట్టాలను వేడిచేయడానికి వాడే వలయాకారపు నుగ్గులపొయ్యి. (తె. 22, 23).

పిడకలబట్టి: చూ. పర్యా. దాయ. బండిపట్టాను వేడి చేయడానికి వాడే వలయాకారపు నుగ్గులపొయ్యి. (తె. 25).

పిడకలబూడిద: చూ. పర్యా. కవరుబూడిద. మట్టి అచ్చులు ఒకదానితో ఒకటి అంటుకొనకుండ చుట్టూ చల్లడానికి వాడే బూడిద. (కో. 28).

పిడకలు: చూ. పర్యా. నుగ్గులు. కొలిమిలో ఇనప వస్తువులు వేడిచేయడానికి వాడే ఎండిన పేడ ముద్దలు. (కో. 20, 30; తె. 4, 5, 19, 21, 24; రా. 1).

పిడత¹: చూ. పర్యా. కూరగిన్నె. కూరలు వండడానికి వేసుకోడానికి వాడే లోహపు పాత్ర. చూ. చిత్రం 64. (కో. 19).

పిడత²: కరిగించిన మైనాన్ని పట్టడానికి అచ్చుక్రింద ఉంచిన పాత్ర. (కో. 18).

పిడస¹: చూ. పర్యా. కుంచె. కాక బాగా రావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికివాడే గుడ్డచుట్టిన కర్ర ముక్క. (తె: 24).

పిడస²: ఇనుప ప్లాట్లపైఉండే వంపు. (కో. 15).

పిడసాన: కొయ్యచెక్కలకు దుంకలు వేసుకోడానికి ఉపయోగపడే పరికరం. (రా. 4).

పిడసేయు: (క్రి.) పోత అచ్చువాయిని తీయడానికి ముందు మట్టిపై నీళ్ళు చిలకరించడం. (తె. 25).

పిడి¹: పర్యా. ముట్టి¹, వంకబెండు, హాండిలు¹. గొడుగును పట్టుకోడానికి వాడే 'L' ఆకారపు పరికరం. (కో. 20, 26; తె. 1, 4, 6, 21, 25).

పిడి²: కొడవలికి, కత్తికి ఇతరపరికరాలకు వేసే కొయ్య. దీనివల్ల కత్తులుచేత్తో పట్టుకొని నరుకోవచ్చు. (కో. 28; రా. 4).

పిడికి: పిడివేయడానికి వీలుగా ఉండే కొడవలి వెనుకభాగం. (తె. 17).

పిడికిలి: చిన్నపిల్లలు ఆడుకోడానికి వాడే లోహపు వస్తువు. (తె. 7).

పిడిసెలు: వెల్డింగ్ తలుపులను ఫ్రేములకు బిగించడానికి ఉపయోగపడే ఇనుప మడతబందులు. (తె. 17, 21).

పిడింగ్‌బటను: (ఇం. feeding bottle) చూ. పర్యా. పాలబుడ్డి³. చిన్నపిల్లలకు పాలు పట్టడానికి వాడే స్టీలుపాత్ర. పొడవుగా సీసా ఆకారంలో ఉంటుంది. (తె. 15, 16).

పిండిజల్లెడ: పిండి, రవ్వను జల్లించడానికి వాడే రంధ్రాలున్న రేకు పరికరం. (కో. 1; తె. 15; రా. 4, 6, 7, 8).

పిండిడబ్బా: చూ. పర్యా. డబ్బా[1]. పిండిపదార్థాలు ఉంచుకోడానికి వాడే లోహపు పాత్ర. చూ. చిత్రం 121. (తె. 6).

పితికేయు: (క్రి.) పర్యా. పితిగ్గొట్టు. బిందె జవ్వకు అతికించడానికి వీలుగా పోతజీనం అంచుల్ని పల్చగ సాగ్గొట్టడం. (తె. 21, 23).

పితెగ్గొట్టు: (క్రి.) చూ. పర్యా, పితికేయు. పోత అడుగు బిళ్ళను దొల్కుకు అతికేందుకు అంచులు పల్చగ చేయడం. (తె. 22).

పిన్: (ఇం.) పర్యా. పిన్‌చక్రం, పిన్‌రాడ్, పిన్‌సెట్, స్లోపాస్ట్‌రాడ్, పెట్రొమాక్స్‌లైటు, స్టౌకు అందే గాలిని కంట్రోలు చేయడానికి బర్నర్ కిందిభాగాన అమర్చిన చక్రం. (తె. 19).

పిన్‌కుషన్: (ఇం.) గుండుపిన్నులు గుచ్చడానికి వాడే సాధనం. చూ. చిత్రం 159. (రా. 3, 9).

పిన్‌చక్కర్: చూ. పిన్‌చక్రం. (తె. 18).

పిన్‌చక్రం : (< ఇం. Pin + చక్రం) రూ. పిన్‌చక్కర్. చూ. పర్యా. పిన్. పెట్రొమాక్స్‌లైటు, స్టౌబర్నర్‌కు అందే గాలిని కంట్రోలు చేయడానికి బర్నర్ కిందిభాగాన అమర్చిన చక్రం.(తె. 19, 22).

పిన్‌రాడ్: (ఇం.) చూ. పర్యా. పిన్. బర్నర్‌కు అందే గాలిని కంట్రోలు చేయడానికి బర్నర్ కిందిభాగాన అమర్చినచక్రం. (కో. 2; తె. 18, 24).

పిన్‌సెట్: (ఇం.) చూ. పర్యా. పిన్. స్టౌబర్నర్‌కు అందే గాలిని కంట్రోల్ చేయడానికి బర్నర్ కిందిభాగాన అమర్చిన చక్రం. (తె. 19, 22).

పిన్నిషింగ్‌ఉలి: చూ. ఫీనిషింగ్‌ఉలి. (కో. 8).

పిన్ని: చూ. పర్యా. కక్కులు. ఇత్తడిబిందె భాగాలను అతకడానికి రేకు అంచులపై అక్కడక్కడ చేసిన చిన్న కత్తిరింపులు. (కో. 19).

పిన్నీలు: చూ. పిన్ను. (కో. 26).

పిన్ను[1]: చూ. పర్యా. కమ్మి[2], లోహపు రేకులను, కడ్డీలను వంచడానికి వాడే మోపు. (రా. 15).

పిన్ను[2]: రూ. పిన్నీలు. చూ. పర్యా. కూసం. బీరువా, సేఫ్, లాకర్, తలుపు సులభంగా తిరగడానికి, గట్టిగ ఉండడానికి అమర్చిన లోహపు కడ్డీ. (కో. 28).

పిన్ను[3]: సైకిల్‌పెడల్, రిమ్ములు బెండ్ చేయడానికి వాడే పరికరం. (రా. 8).

పిన్ను[4]: వెల్డింగ్ పనిలో ఇనుపబిట్టు ఊడదీయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 4, 5).

పిన్ను[5]: నిప్పుల్‌కుండే రంధ్రాన్ని శుభ్రం చేయడానికి వాడే పరికరం. (కో. 29, 30; తె. 17; రా. 5).

పిన్ను[6]: ట్రాక్టరు క్రిందిభాగంలో ఉంచుకొనే కొరముట్టు, లారీలో బుష్ లేపడానికి కూడా వాడ్తారు. (కో. 7; రా. 4).

పిన్నుదాగలి: చూ. పర్యా. కట్ల. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 22).

పిన్నుపోగరు: పర్యా. పోనస్. రివిట్లు కొట్టడానికి వాడే అడుగుభాగం. లోతుగ రంధ్రం కలిగిన పొడవాటి కడ్డీ. (కో. 5, 9, 18, 19).

పిన్నుస్టాండు: (< ఇం. Pins Stand). క్లిప్పులు, పిన్నులు ఉంచుకోడానికి వాడే సాధనం. (రా. 3,9).

పిపాగ్లాసు: (< హిం. + ఇం. Glass). పీపా ఆకారంలో పొడవుగా ఉన్న లోట. నీళ్ళు తాగడానికి వాడ్తారు. (కో. 6, 10, 11).

పింపురు: చూ. పర్యా. చిలుము. లోహపు రేకులపై, కడ్డీలపై పట్టినతుప్పు. (కో. 26, 28).

పిరంగిధిసుత్తి: విగ్రహం పనిలో అందని భాగాల్లో కొట్టుకోడానికి వాడే పరికరం.

పిలకలు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (కో. 2).

పీలేట్: (ఇం.) చూ. పర్యా. అడగోలు. లోహపు రేకులు, కడ్డీలు సాపుచేయడానికి వాడే దిమ్మ. (తె. 5).

పిలేలు: చూ. పర్యా. కటింగ్‌కారు. మరలు తిప్పడానికి, బిగించడానికి, సాడర్ పనిలో వస్తువులను కదలకుండా పట్టుకోడానికి, గొడుగుపుల్లలకు వైరు చుట్టడానికి ఉపయోగించే పనిముట్టు. (తె. 7).

పిల్టరు: చూ. ఫిల్టరు. (కో. 8, 11, 28).

పిల్లరు: చూ. పర్యా. కటింగ్‌కారు. మరలు తిప్పడానికి, బిగించడానికి, సాడర్‌పనిలో వస్తువులను కదలకుండా పట్టుకోడానికి, గొడుగుపుల్లలకు వైరు చుట్టడానికి ఉపయోగించే పనిముట్టు. (తె. 8).

పిసరు: చూ. పర్యా. ఇనుపతంతె. గొడుగుపుల్లలను పళ్ళచక్రానికి బిగించడానికి వాడే సన్నని ఇనపతంతె. (కో. 20).

పిసుకు: (క్రి.) చూ. పర్యా. వదును ఏయు. అచ్చులకు పనికివచ్చే విధంగా మట్టిలో నీళ్ళుపోసి కలపడం. (తె. 10, 11; రా. 1).

పిసుర్లు: కాగిన లోహంపై ఉండే పీసులు (రా. 2).

పిస్టన్: (ఇం.) స్టౌ ఆయిల్ పంపుకు లోపల ఉండే వాచరు కలసిన భాగం. (కో. 28).

పిస్టిని: చిన్నచిన్న రేకుబిళ్ళలు లోతు వేయడానికి వాడే సాధనం. (రా. 2).

పీక్‌దాన: (హిం.) చూ. పర్యా. ఒగల్‌దాన్ని. ఉమ్మి వేసుకునే పెద్ద లోహపుపాత్ర. (కో. 17).

పీక[1]: చూ. పర్యా. కంఠం. బిందె గొంతుభాగపు రేకు. (కో. 5, 20, 22, 23, 25).

పీక[2]: టింకరపనిలో వత్తిని ఉంచే గొట్టం. (కో. 28, 29).

పీకుదాన: ఉమ్మివేసుకోడానికి వాడే చిన్న పాత్ర. (కో. 25, 28).

పీకేయు: (క్రి.) ట్రంకుపెట్టె తయారుచేసేటపుడు పనికిరాని పీసులు తీసివేయడం. (రా. 4).

పీగలలేగ: బిందె గొంతులదగ్గర పాలిష్ చేయడానికి వాడే పరికరం. (కో. 4, 9).

పీట[1]: చూ. పర్యా. పరమట్టు. పోతపనిలో పనివాళ్ల కూర్చోడానికి ఉపయోగపడే చెక్క. (కో. 26; రా. 2, 6).

పీట[2]: ఎద్దుకాళ్ళు చెక్కడానికి వాడే పీట. (రా. 3).

పీటకత్తి: చూ. పర్యా. కట్టిపీట. కూరగాయలు తరిగే దానికి ఉపయోగించే పరికరం. (రా. 6).

పీఠం: పర్యా. సింహాసనం, సింహాసనంతొట్టి. ఉత్సవ విగ్రహాన్ని ఉంచడానికి ఉపయోగించే ఇత్తడితొట్టి. (కో. 24; తె. 7, 21).

పీపాడ్రమ్ము: ఉ. పిపాడ్రమ్ము. చూ. పర్యా. డోలు డ్రమ్ము. మంచినీళ్ల నిల్వచేయడానికి కిందిభాగాన అమర్చిన పెద్దపాత్ర. డోలు ఆకారంతో వెడల్పుగా ఉంటుంది. (కో. 14, 19).

పీపాతుక్కు: సీసా ఆకారంలో ఉండే స్టీలుపాత్ర. ఏవైన వస్తువులు తెచ్చుకోడానికి ఉపయోగం. (కో. 17).

పీలికలు: అచ్చుభాగాలు. (రా. 15).

పీస్: పాత్రల తయారీలో పాత్ర లోతుగా రావడానికి వాడే అచ్చు. (రా. 16)

పీసు: పర్యా. షేప్. అల్యూమినియం పాత్ర ఆకారం. (రా. 8, 14).

పీసు ఎత్తుకొను: (క్రి.) ఇనుప ప్లాట్‌ముక్కలను వేసుకోవడం. (రా. 2).

పీసులేగ: చూ. పర్యా. అదురువాలేగ. పాలిష్ పాత్రలపై డిజైన్‌లు చేయడానికి వాడే పనిముట్టు. (కో. 15).

పుంజీ: చూ. పర్యా. కక్కులు. ఇత్తడిబిందె భాగాలను అతకడానికి రేకు అంచులపై అక్కడక్కడ చేసిన చిన్న కత్తిరింపులు. (కో. 17).

పుంజీలు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (కో. 17).

పుటం: చూ. పర్యా. దాయ. ఇత్తడిని కరిగించడానికి వాడే పిడకలపొయ్యి. (కో. 16).

పుటంపెట్టు: (క్రి.) విగ్రహాన్ని పిడకలతో ఎర్రగా కాల్చడం. (కో. 18).

పుట్టి: చూ. పర్యా. చాక్‌పౌడరు. రివిట్లు, అతుకులు కనపడకుండ బీరువాపై పూయడానికి వాడే తెల్లని పదార్థం. (తె. 25).

పుట్రూలు: (< ఇం. Foot rule) చూ. పర్యా. వట్టి[1]. రేకులపై కొలతలు గుర్తించడానికి వాడే పొడవాటి రేకు స్కేలు. చూ. చిత్రం 71. (తె. 21).

పుడక[1]: చూ. పర్యా. కట్ట. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 29).

పుడక[2]: పోత రంధ్రాలను పెట్టడానికి ఉపయోగపడే సాధనం. (కో. 29).

పుత్తడి: బిందెపై పూతగ మట్టివేయడానికి ముందు వాడే మట్టి. (కో. 29).

పునహాగ్లాను: పైన అంచుఉండే నీళ్ళలోటా. (కో.13).

పులిగోరపళ్ళెం: చూ. పులిహోర పళ్లెం. (తె. 17, 23).

పులిహోరపళ్లెం: ఉ. పులిహారపళ్లెం. రూ. పులుగోర పళ్లెం. పిండి కలపడానికి, వేడి వస్తువులు చల్లార్చడానికి వాడే వెడల్పు పళ్లెం. (కో. 10, 12; తె. 17, 19).

పులు ఉంట్లపెనం: చూ. పర్యా. గుంట పొంగడాల పెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంతలు ఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (రా. 4).

పులుసుకళాయి: చూ. పర్యా. కడాయి. వంటలు చేయడానికి వాడే ఇరువైపులా పిడి అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం 163. (కో. 7, 8, 10, 12).

పులుసుమట్టు: సిల్వరుపూసిన బిందెరేకుపై మాసిపోకుండా కొట్టినచుక్కలు. (తె. 20).

పులేల్‌పట్టి: చూ. పర్యా. ఇనుపదుక్క. డిజైన్లు చేయడానికి వాడే చిన్న ఇనపబద్ద. (రా. 11).

పులేల్‌బద్దె: చూ. పర్యా. ఇనుపదుక్క. డిజైన్లు చేయడానికి వాడే చిన్న ఇనపబద్ద. (కో. 18).

పుల్ల[1]: పర్యా. రాడ్ వెల్డింగ్ పుల్ల, వెల్డింగ్‌రాడ్డు

లోహపు వస్తువులను వెల్డింగ్ చేయడానికి ఉపయోగించే కర్బనపుకడ్డీ. (తె. 4).

పుల్ల[2]: ఉ. పల్ల. చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (కో. 30; రా. 15).

పుల్ల[3]: సానెపట్టేటప్పుడు చేయి రాలకుండ ఉపయోగపడే కొయ్యముక్క. (తె. 2).

పుల్లర్: వెల్డింగ్‌పనిలో రేకును సక్కగ చేయడానికి వాడే పరికరం. (తె. 25).

పుల్లరి: చూ. పుల్లి[1]. (తె. 22).

పుల్లరు: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపు పెట్టడానికి వాడేదిమ్మ. (కో. 23).

పుల్లలపొయ్యి: చూ. పర్యా. ఇనుపపొయ్యి. అడుగుభాగం క్రింద మోపకుండ కొంచెం ఎత్తుగా అమర్చి చేసినట్టి లోహపుకొయ్య. కట్టెలుపెట్టి వంటచేయడానికి వాడ్తారు. (కో. 16, 17, 19).

పుల్లలసెట్: చూ. పర్యా. కమాన్లు. గొడుగుకు అవసరమైన సన్నని కడ్డీలు. ఇవి 16 ఉంటాయి. 8 నిలువు కడ్డీలు, 8 అడ్డకడ్డీలు. (తె. 24).

పుల్లలు[1]: చూ. పర్యా. కమాన్లు. ఛత్రికి ఆధారమైన సన్ననికడ్డీలు. ఇవి విడిగా ఉండేవి. డబల్ కడ్డీలుండి విడదీసినపుడు పద్మంలాగ వచ్చేవి. అని రెండు రకాలు. వీటిని కప్పుతూ పైన నల్లనిబట్ట ఉంటుంది. (కో. 30; తె. 2, 4–6, 18, 19, 23).

పుల్లలు[2]: చూ. పర్యా. కమ్మిలు. సైకిలుకు అమర్చిన చిన్న కడ్డీలు. (తె. 8).

పుల్లి[1]: (బ.) పుల్లెలు, పులేలు. రూ. పుల్లరి. పర్యా. ప్లాట్ పులేలు, మూడలి. రేకుగాడులను మడుపులను కచ్చితంగా కొట్టడానికి వాడే పరికరం. (కో. 4, 7, 9, 18; తె. 2, 3, 6, 8, 9, 12, 24, 25; రా. 4–8, 10–12, 14–17, 19, 22–24, 26, 28).

పుల్లి[2]: అడ్డతిరగడానికి వీలుగా బెల్టుద్వారా అడ్డకు తగిలించి ఉండే చక్రం. (కో. 26, 28).

పుల్లి[3]: చూ. పర్యా. కన్నం. అతికిన పాత్రలకుండే రంధ్రం. (కో. 29).

పువ్వు[1]: పర్యా. మురుకు. పదునుపెట్టిన తర్వాత ప్రక్కల్లో వచ్చే చిన్నచిన్న భాగాలు. (తె. 7).

పువ్వు[2]: పర్యా. బర్నరు. స్టౌలో మంటరావడానికి, పెట్రొమాక్స్‌లైటులో మెంటల్‌కు గ్యాస్‌ను అందించడానికి అమర్చిన పరికరం. (కో. 25).

పువ్వులసజ్జ: రూ. పూలసజ్జ. చూ. పర్యా. గుండ్రం పూలబుట్ట. దేవాలయానికి పూజాసామగ్రి తీసుకెళ్ళడానికి వాడే పరికరం. (కో. 23),

పువ్వొత్తిదీపం: పువ్వొత్తి పెట్టుకోడానికి ఉపయోగపడే గిన్నె లాంటి ప్రమిద. (కో. 19).

పుష్పకవిమానం : ధ్వజస్తంభంపై ఉండేభాగం. (కో. 28)..

పూజగుత్తి: ఉ. పూజాగుత్తి. చూ. పర్యా. కుంకుంపేల. కుంకుమ, పసుపు వగైరా పూజాసామగ్రి ఉంచుకోడానికి ఉపయోగించే మూడు, నాల్గు, లేదా అయిదు స్టీలుగిన్నెలు. (కో. 18–20, 28; తె. 20, 23).

పూజతపుకు: చూ. పర్యా. అరివేణి. పూజసమయంలో వాడే చిన్న రాగిపళ్లెం. (తె. 4).

పూజలతట్ట: చూ. పూజాతట్ట. (రా. 15).

పూజలోట: చూ. పర్యా. పంచపాత్ర. దేవాలయాల్లో తీర్థానికి వాడే లోహపుపాత్ర. (తె. 6).

పూజసెట్టు: పర్యా. సంధ్యావనంసెట్టు. పూజలోట, పూజతపుకు, ఉద్ధరిణి–వీటిని కలిపి ఈ పేరుతో పిలుస్తారు. (తె. 6).

పూజాగరటు: చూ. పర్యా. ఉద్ధరిణి. దేవాలయాల్లో పూజలకు ఉపయోగించే రాగి చెంచా. (కో. 7).

పూజాతట్ట: రూ. పూజలతట్ట. పూజసమయంలో ఉపయోగించే రాగిపళ్లెం. (రా. 16).

పూజామొల: రేకుపై 'X' ఆకారపు డిజైన్‌లు, అర్ధచంద్రాకారపు గుర్తులు కొట్టడానికి శిల్పిపనిలో వాడే పనిముట్టు. ఈ మొల అడుగుభాగం 'ఎక్స్' ఆకారంలో ఉంటుంది. (తె. 17).

పూజాసామాణి: చూ. పర్యా. తప్పుకు. దేవునిదగ్గర తీర్థానికి వాడే చిన్న చెంబు. (తె. 8, 9).

పూజాహారతి: పూజచేసేటపుడు హారతికి వాడే చిన్న గంటె. (కో. 1, 11; రా. 10).

పూటి: చూ. పర్యా. కట్ట. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (తె. 23, 25).

పూటుబద్ద: (< ఇం. foot+బద్ద) రూ. పూడుదబ్బ. చూ. పర్యా. పట్టి[1]. రేకులపై కొలతలేయడానికి ట్రంకుపెట్టెల తయారీలో ఉపయోగించే పొడవాటి ఇనుపరేకుస్కేలు. చూ. చిత్రం 71. (తె. 17).

పూడుదబ్బ: చూ. పూటుబద్ద. (తె. 1).

పూడ్చు: (క్రి.) మట్టిలో కరుగనుబెట్టి పాకివేయడం. (రా. 5).

పూత: చూ. పర్యా. పాలిష్‌రింగు. లోహపు వస్తువులకు పాలిష్ చేసేటప్పుడు వాడే గుండ్రని కమ్మి.

(రా. 8).

పూతపూయు: (క్రి.) అచ్చువిగ్రహానికి మట్టిని పూయడం. (కో. 28).

పూతరేకు: చూ. పర్యా. పట్టి[3]. బీరువారేకుపై మక్కు- పూయడానికి వాడే పరికరం. (కో. 24).

పూతాతీయు: (క్రి.) రివిటులో పాత్రరంధ్రాన్ని పూడ్చి రివిటు కనపడకుండ పాత్రకు సరిచేయడం. (కో. 29).

పూనసత్తారి: పూజకు వాడే గుండ్రని నీళ్ళచెంబు. (తె. 9, 11).

పూనాకంచం: చూ. పర్యా. రౌనుకంచం. గుండ్రని భోజనంప్లేటు. నిలబడడానికి దీని అడుగుభాగంలో మూడు గుబ్బలుంటాయి. (కో. 12; తె. 20).

పూనాగిన్ని: పర్యా. నాగపూర్ గిన్ని. అడుగుభాగంలో మట్టకు మారుగా చక్రం అతికిచేసిన గిన్ని. (కో. 10).

పూనాగ్లాసు: ఆరంగుళాల పొడవుండే నీళ్ళలోటా. (కో. 2, 12).

పూనాచెంబు: చూ. పర్యా. గుండుచెంబు. పైభాగం గుండ్రంగా ఉండే చెంబు. చూ. చిత్రం 84. (కో. 12).

పూనాడేక్షా: చూ. పర్యా. కుంబకోణం చెంబు. దానం చేయడానికి ఉపయోగించే చిన్న లోహపుపాత్ర. (రా. 16).

పూనాతట్ట: చూ. పర్యా. రౌనుకంచం. గుండ్రని భోజనంప్లేటు. నిలబడడానికి దీని అడుగుభాగంలో మూడు గుబ్బలుంటాయి. (రా. 13).

పూనాప్లేటు: చూ. పర్యా. రౌనుకంచం. భోజనం చేయడానికి వాడే గుండ్రని పళ్లెం. నిలబడడానికి దీని అడుగుభాగంలో మూడు గుబ్బలుంటాయి. (కో. 19).

పూయు: (క్రి.) పర్యా. తుడుపు, దుద్దు. పాత్రకు కళాయి పూయడం. (రా. 5, 7).

పూరిడబ్బా: ఉ. పూరీడబ్బా. పర్యా. పూరిబాక్సు. పూరివంటి పదార్థాలు ఉంచుకోడానికి వాడే పరికరం. (కో. 1, 4, 5, 9, 27-30; తె. 4-9, 12-14, 16. 17, 19).

పూరిబాక్సు: (< హిం+ఇం. Box). ఉ. పూరీడబ్బా. చూ. పర్యా. పూరిడబ్బా. పూరివంటి పదార్థాలు ఉంచుకోడానికి వాడే పరికరం. (కో. 2, 3, 6-8, 10, 11, 15, 16).

పూరీచంచా: (హిం.) చూ. పర్యా. రంధ్రాల గరిటె. నూనెలోనుంచి పూరీలు తీయడానికి వాడే చిల్లుల గరిట. చూ. చిత్రం 107. (తె. 10, 11).

పూరీపకడ: పూరీలు తయారుచేయడానికి వాడే సాధనం. (కో. 18; తె. 10, 11),

పూరీప్రెసర్: (< హిం + ఇం. Presser). పూరీలు చేసుకోడానికి వాడే సాధనం. (తె. 15).

పూరేకు: అరడపై ఉండే పువ్వులాగ చేసినగొట్టం. (కో. 20).

పూలతట్ట: చూ. పర్యా. పూలబుట్ట. దేవుని దగ్గరకు పూలు తీసికొని పోవడానికి వాడే సాధనం. తొట్టిలాగ ఉంటుంది. పైన పట్టుకోడానికి హ్యాండిల్ ఉంటుంది. చూ. చిత్రం 161. (కో. 18).

పూలపాగులు: చూ. పూసపాగు. (తె. 9).

పూలబుట్ట: ఉ. - బుట్టి, - బుట్టె. పర్యా. పూలతట్ట, బేసన్‌బుట్ట, బేసిన్‌సజ్జ. దేవుని దగ్గరకు పూలు తీసికొని పోవడానికి వాడే సాధనం. తొట్టిలాగ ఉంటుంది. పైన పట్టుకోడానికి హ్యాండిల్ ఉంటుంది. చూ. చిత్రం 161. (కో. 1-12, 17, 28; రా. 8).

పూలసజ్జ: చూ. పువ్వులసజ్జ, పూవ్వులసజ్జ. (కో. 11, 12, 15, 17, 19-27).

పూలువేయు: (క్రి.) ఇనుపప్లాట్లు డిజైనుగా వంచడం. (రా. 4).

పూవ్వులసజ్జ: చూ. పూలసజ్జ. (కో. 18).

పూసగొట్టం: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు వేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 17).

పూసపాగు: రూ. పూలపాగులు. చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 8).

పూసపాపు: చూ. పర్యా. కారాచాచ, మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 8).

పెంక: ఉ. పింకా, పెంకు. చూ. పర్యా. అట్లపెనం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (తె. 2, 6, 8, 9 14-18).

పెంకు: చూ. పర్యా. టోపుకవరు. అగ్గి చెదిరిపోకుండ కొలిమిపై మూయడానికి వాడే సాధనం. (కో. 27).

పెచ్చు: కొలతకన్న ఎక్కువ ఉండే భాగం. (కో. 5, 29).

పెంచిలోట: స్టీలు మరచెంబు. (తె. 10, 11).

పెంచు: చూ. పర్యా. అట్లపెనం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ.చిత్రం 6. (తె. 1, 4, 7; రా. 14).

పెటోల్: చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యి లాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపు పాత్ర. (తె. 12).

పెట్టు: (క్రి.) రేకు వంగుటకు సలువుగా గ్రీసును పూయడం. (రా. 14).

పెట్టుకొను: (క్రి.) చూ. పర్యా. పల్లుచేయు. అతకడానికి వీలుగా రేకును పల్లుచేయడం. (కో. 22).

పెట్టె: పోతపాత్రను తయారుచేయడానికి వాడే కొయ్యచట్రం. (కో. 22; రా. 4, 5).

పెట్రమాసులైట్టు: చూ. పెట్రొమాక్స్‌లైటు. (కో. 2).

పెట్రొమాక్స్‌లైటు: (ఇం.) రూ. పెట్రమాసులైట్టు, పెట్రొమాక్స్‌లైటు. పర్యా. గ్యాస్‌లైటు. దుకాణాల్లో, శుభకార్యాల్లో కరెంటు లేనప్పుడు వాడే కిరోసిన్ లైటు. చూ. చిత్రం 162. (తె. 3, 6).

పెట్రొమాన్స్‌లైటు: (ఇం.) చూ. పెట్రొమాక్స్ లైటు. (తె. 5).

పెడ[1]: చూ. పర్యా. తలకాయ. బిందె పైభాగపు రేకు. (తె. 12).

పెడ[2]: గొడుగు పైభాగం. (కో. 27).

పెడకరవాయి: చూ. పర్యా. దేక్సాకరవాయి. దేక్సా, కూరసట్లు, పళ్లెలు వగైరా తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 13).

పెడముక్క: చూ. పర్యా. పట్ట[1]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లావుపాటి ఇనప బద్ద. (కో. 13).

పెడల్‌రింజి: (ఇం.) రూ. పెడరింజ, పెడల్‌రింజి, సైకిల్‌పెడిల్ నట్లు బిగించడానికి వాడే స్పానరు. (కో. 13, 15).

పెడిల్: (ఇం.) సైకిల్ తొక్కేటప్పుడు కాళ్లు పెట్టుకోడానికి ఉపయోగపడే భాగం. (తె. 8).

పెండమన్ను: చూ. పర్యా. ఊరువెంజి. కాల్చేటప్పుడు బిందెకు మసికాకుండ చుట్టూ పూయడానికి ఉపయోగపడే పేడ, మన్ను కలిపిన మిశ్రమం. (తె. 25).

పెండలపడేయు: (క్రి.) చూ. పర్యా. నిలవకాలుచు. బిందెను ఒకసారి అతికినతర్వాత రంధ్రాలుంటే మరల మరల రవ్వవేసి అతకడం. (తె. 21).

పెడుముమంచు: (క్రి.) రేకుపై అంచులను పట్టే భాగ వెనక్కి వంచడం. (తె. 23).

పెద్ద అడ్డగనెసుత్తి: లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడే సుత్తి. ఒకపక్క గుబ్బగా మరోపక్క పాళంగా ఉంటుంది. (తె. 1).

పెద్ద అడగన్నుసుత్తి: రేకును సాగదీయడానికి వాడే పనిముట్టు. (కో. 21).

పెద్ద ఆకురాయి: బిందెల అతుకులు కనపడకుండ నున్నగ చేయడానికి వాడే పనిముట్టు. (తె. 6).

పెద్ద ఇక్కళం: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (రా. 13).

పెద్ద ఊస: మూసలోకి టోకును దించడానికి వాడే పరికరం. (కో. 26).

పెద్దఎడసుత్తి: పర్యా. పెద్దదబ్బరసుత్తి. బిందె మూతులు కొట్టుకోడానికి వాడే పరికరం. (కో. 14).

పెద్దకట్టెసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్ రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (రా. 10).

పెద్దకత్తెర: పర్యా. పొడుగుకత్తెర. పెద్దపెద్ద రేకులను కత్తిరించడాని వాడే పనిముట్టు. (కో. 2-7, 8-12, 15; తె. 1, 2, 10 11, 15, 16, 25; రా. 1, 2, 4-8).

పెద్దకన్నుసుత్తి: లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడేసుత్తి. ఒకపక్క గుబ్బగా మరోపక్క పాళంగా ఉంటుంది. (కో. 21).

పెద్దకరవాయి: చూ. పర్యా. కూజాకరవాయి. కూజా ఆకారపుబిందెలను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 177. (కో. 21; తె 14, 15, 18 22, రా. 7).

పెద్దకంచుసుత్తి: కంచాలను సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 23).

పెద్దకాగులకరవాయి: చూ. పర్యా. కాగుకరవాయి. లోహపుకాగులు సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 4, 9, 11).

పెద్దకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 23).

పెద్దకుంది: పెద్దపెద్ద బిందెలకు రేకుల అడుగులు వేసుకోడానికి వాడే పరికరం. (కో. 3).

పెద్ద కైవారం: పెద్దబిళ్ళలు తవ్వడానికి పనికివచ్చే పనిముట్టు. (రా. 2).

పెద్దకొయ్యసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 2; రా. 3).

పెద్దగడార: చూ. పెద్దగడ్డపార. (రా. 10).

పెద్దగడ్డపలుగు: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అడుగు భాగాలు సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 2).

పెద్దగన్‌సుత్తె: (< పెద్ద + Gun + సుత్తె) చూ. పర్యా. పలచనిసుత్తి. బిందెగొంతు, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడేసుత్తె. చూ. చిత్రం 153. (తె. 15).

పెద్దగుట్టలమొల: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (తె. 17).

పెద్దగునపం: చూ. పర్యా. లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు సాపు చేయడానికి వాడే పరికరం. (కో. 15, 16, 19).

పెద్దగుండా: పెద్దపెద్ద హోటళ్ళలో అన్నం పోసుకోడానికి వాడే పాత్ర. (కో. 1).

పెద్దగెడపార: చూ. పెద్దగెడ్డపార. (రా 4).

పెద్దగెడ్డపార: రూ. పెద్దగడార, పెద్దగెడపార. చూ. పర్యా. ఉంకిగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుభాగాలు సాపు చేయడానికి వాడే పరికరం. (కో. 3; రా. 9).

పెద్దచెమ్మ: బొటరిళ్లైట్ల గడ్డలు తిప్పడానికి పనికివచ్చే సాధనం. (తె. 20).

పెద్దచెక్కసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 5).

పెద్దచెంబు: గుమ్మడికాయ ఆకారంలో ఉండే చెంబు. పెళ్లిళ్ళలో పెద్దలకాళ్ళు కడగడానికి వాడ్తారు. (తె. 18).

పెద్దటేపు: (< పెద్ద + ఇం. Tape) పొడవాటి కొలతబద్ద. (తె. 3).

పెద్దడాగలి: లోహపురేకులు, కడ్డీలు సాపుచేయడానికి వాడే దిమ్మ. (కో. 19).

పెద్దదబ్బరసుత్తి: చూ. పర్యా. పెద్దఎడసుత్తి. బిందె మూతిభాగం కొట్టుకోడానికి వాడే పరికరం. (కో. 14).

పెద్దదిమ్మె: చూ. పర్యా. అడగోలు. లోహపురేకులు, కడ్డీలు సాపుచేయడానికి వాడే దిమ్మ. (రా. 4, 10).

పెద్దదేశ్‌మట్‌సుత్తి: చూ. పర్యా. అమరు. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాగ్గొట్టడానికి వాడే పరికరం. (తె. 1).

పెద్దపట్కార: చూ. పెద్దపట్టకార. (తె. 2).

పెద్దపట్టకార: రూ. పెద్దపట్కార. చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 2-5; రా. 2, 9, 10).

పెద్దపట్టకారు: చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి పనికివచ్చే పరికరం. చూ. చిత్రం 147. (రా. 2, 6).

పెద్దపెడసుత్తి: బిందెఅడుగు రేకులను సాపు చేసుకోడానికి వాడే సాధనం. (కో. 28).

పెద్దపోగరు: చూ. పర్యా. డ్రిల్. లోహపురేకులపై, కడ్డీలపై రంధ్రాలు వేయడానికి వాడే డ్రిల్లుమిషను లోని మరకడ్డి. (కో. 3; తె. 24; రా. 4).

పెద్దమట్నుసుత్తి: చూ. పర్యా. పలచనిసుత్తి. బిందె గొంతు, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 153. (కో. 14, 28).

పెద్దమట్నంసుత్తి: పెద్ద బిందెలలో అన్నిభాగాల్లో కొట్టడానికి వాడే పరికరం. (రా. 7).

పెద్దమద్నుసుత్తె: చూ. పర్యా. పలచనిసుత్తె. బిందె గొంతు, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 153. (తె. 25).

పెద్దమరసుత్తె: లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడే పరికరం. (తె. 4).

పెద్దమంగన్: చేతులతో పట్టుకోను వీలుకాని సామాన్లను, రిపేరిచేసేటప్పుడు కదలకుండ గట్టిగ బిగించడానికి ఉపయోగించే సాధనం. ఇది ఒక టేబులుకు బిగించి ఉంటుంది. (తె. 17).

పెద్దమెరిమ్: చూ. పర్యా. ఇనుపదుక్క. డిజైన్లు చేయడానికి వాడే చిన్న ఇనుపబద్ద. (రా. 11).

పెద్ద రైస్ అండ: (< పెద్ద + ఇం. Rice + అండ) చూ. పర్యా. దేక్షా. పలావు చేయడానికి వాడే పెద్ద పాత్ర. చూ. చిత్రం 123. (రా. 5).

పెద్దలాగ: చూ. పర్యా. కంతాణి. లోహపు పాత్రలకు మెరుగుపట్టడానికి వాడే పరికరం. (తె. 22).

పెద్దవంకలాగ: చూ. పర్యా. కంతాణి. లోహపు పాత్రలకు మెరుగుపట్టడానికి వాడే పరికరం. (తె. 18, 21).

పెద్దవంకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 18).

పెద్దవంపుగోరుపోగరు: ఇత్తడిరేకును వంపుగా గీతలుకొట్టుకోడానికి వాడే సాధనం. (కో. 3).

పెద్దవంపుపోగరు: పర్యా. పేడిలేగ, పేడుపోగరు, వంకసాపుపోగరు. విగ్రహం వంకభాగాల్లో చెక్కడానికి వాడే పరికరం. (తె. 25).

పెద్దవాలుమొల: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (తె. 25).

పెద్దశానం: పెద్దతాళాలు విరగ్గొట్టడానికి, లావు కడ్డీలను నరకడానికి, రేకును మొటమడానికి వాడే సాధనం. (కో. 17, 19, 20, 28).

పెద్దసీదపట్టి: చూ. పర్యా. లెవల్‌పట్టి. రేకుపై సక్కని గీరలు గీసుకోడానికి వాడే రంపంలాంటి పరికరం. (తె. 8, 12).

పెద్దసీర్నం: రేకులను కత్తరించడానికి వాడే పనిముట్టు. (రా. 2)

పెద్దసుత్తి: రూ. పెద్సుత్తి, పెన్సుత్తి. బిల్లకొట్టిన తర్వాత రేకుల్ని సాగగొట్టడానికి చెంబులకు గొట్టు, లోతు కొట్టడానికి వాడే పనిముట్టు. (తె. 9).

పెద్దసమ్మెట: రూ. పెద్సమ్మెట. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడే పెద్ద సైజుసుత్తి. (రా. 2, 6, 8).

పెద్దసుత్తె[1]: చూ. పర్యా. పలచనిసుత్తి. బిందెగొంతు, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 153. (తె. 14, 15, 18).

పెద్దసుత్తె[2]: చూ. పర్యా. గుండుసుత్తి. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (తె. 8, 9, 15, 22).

పెద్దసుత్తె[3]: ఉ. పెద్దసుత్తి. చూ. పర్యా. సమ్మెట. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపు చేయడానికి వాడే పెద్దసైజు సుత్తి. (కో. 1, 3, 4, 9, 10, 12, 17–20, 25, 26; తె. 5–7, 12, 17; రా. 2–4, 8, 11, 13–15).

పెద్సమ్మెట: చూ. పెద్దసమ్మెట. (తె. 25).

పెద్సుత్తె: (< పెద్ద+సుత్తె). పర్యా. మద్దెలసుత్తి, మూకుళ్ళసుత్తి. రేకును లావుచేయడానికి, కుదింపు చేయడానికి వాడే ఇనప పనిముట్టు. (కో. 22; తె. 24).

పెన్‌నైఫు: (< ఇం. Pen Knife). జేబుల్లో పెట్టుకోడానికి మడతపెట్టిన చాకు. (కో. 20).

పెనాము: చూ. పెనం[1]. (తె. 8, 9).

పెనికకరవాయి: పర్యా. సూరుకరవాయి, సూరుపోరు కరవాయి, సూర్లేసేకరవాయి, సూరొంపుకరువాయి, సేవ్‌కరవాయి లోహపు పాత్రల అంచులను మడచడానికి వాడే పరికరం. (తె. 3).

పెనం[1]: ఉ. పెనం. రూ. పెనాము. చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపులా హేండిల్సు అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం 163. (కో. 20–22, 30; తె. 8).

పెనం[2]: ఉ. పెనము. పెనం, పేనం. చూ. పర్యా. అట్లపెనం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (కో. 4, 9; తె. 3, 8, 9, 17, 19, 21, 22; రా. 11, 13, 15).

పెన్సిలు: ఇత్తడి రేకులపై డిజైన్‌లు గీయడానికి వాడే సాధనం. (తె. 17, 25).

పెమిద: చూ. ప్రమిద. (కో. 24).

పెరగొట్టు: (క్రి.) పాత్రపై ఎక్కువగా ఉండే రేకును పాత్ర లెవల్‌కు సరిపోయేటట్లుగ సరిచేయడం. (కో. 27).

పెరిగెయు: (క్రి.) చూ. పర్యా. పొడుగేయు. గ్లాసులను అడ్డసుత్తితో సాగొట్టి వెడల్పు చేయడం. (కో. 7).

పెరుకు: (క్రి.) పర్యా. ఊడదీయు. ఊడదీయడం. (తె. 1).

పెరుగుగిన్నె: చూ. పర్యా. కటోరి. పెరుగు పేరబెట్టడానికి వాడే అంచులేని చిన్నకప్పు. (కో. 23).

పెరుగు గుండిగ: కూరలు, పెరుగువేసి ఉంచుకోడానికి ఉపయోగపడే రాగి అండా. ఆకారంలో నిలువుగా ఉన్న చిన్న లోహపుపాత్ర. (తె. 6).

పెన్సుత్తి: చూ. పెద్దసుత్తి. (కో. 15, 28).

పేట్ జాయింట్: సమానంగా ఉన్న రేకుముక్కలపై మరొక ముక్కపెట్టి చేసిన జాయింటు. (కో. 19).

పేటన్: పోతపాత్రను తయారు చేయడానికి వాడే కొయ్యచట్రం. (తె. 10, 11; రా. 5).

పేటర్‌టప్పు: చూ. పర్యా. పక్కమిరియం. లోహపు రేకులను, కడ్డీలను వంచుకోడానికి. సాపుచేయడానికి వాడే దిమ్మ. (కో. 23).

పేటుదాగలి: చూ. పర్యా. టెంప్లేటు. ముక్కలను డిజైన్లుగా అమర్చడానికి వాడే వెడల్పుగా నున్న ఇనపప్లేటు. (కో. 19).

పేడిలేగ: పర్యా. పెద్దవంపు పోగరు. విగ్రహం వేళ్ళు శుభ్రపరచడానికి వాడే పరికరం. (కో. 10).

పేడుపోగరు: చూ. పర్యా. పెద్దవంపుపోగరు. విగ్రహం వేళ్ళు చెక్కడానికి వాడే పరికరం. (తె. 10).

**పేనాకత్తి**: చిన్న వస్తువులు కోయడానికి వాడే పరికరం. (రా. 11).

**పేపరు**: విగ్రహాన్ని శుద్ధం చేయడానికి వాడే గరుక్కాయలు. (కో. 6).

**పేపరుచెత్తుకర్ర**: కర్ర. చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటి కర్ర. (కో. 29).

**పేర్చు[1]**: (క్రి.) చూ. పర్యా. కూచోబెట్టు. ఆకారాన్ని తయారు చేసేందుకు కొలతప్రకారం డిజైను కడ్డీలను అమర్చడం. (కో. 18. 21).

**పేర్చు[2]**: (క్రి.) అల్యూమినియం పాత్రలను ఒకచోట కూర్చడం. (రా. 7).

**పేకెట్‌గ్లాసు**: (< ఇం.) పడపడానికి వీలుగా ఉండే నీళ్ళలోటా. (రా. 13).

**పేన్సిల్గ్లాసు**: డిజైను ఉండే నీళ్ళలోటా. (కో. 13,21).

**పైకట్టర్**: (< పై ఇం. Cutter) చూ. పర్యా. కటింగ్‌పానం. ఇనుపకడ్డీలను ఖచ్చితంగా కట్ చేయడానికి ఉపయోగించే పరికరం. (రా. 7, 22).

**పైకమ్మి**: చూ. పర్యా. పట్టంలేగ. లోహపు పాత్రలపై ఉన్న మైలను పోగొట్టడానికి వాడే కమ్మి. (కో. 4).

**పైకాంత**: బియ్యపుడబ్బా పైభాగం తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 4).

**పైగిన్నె[1]**: చూ. పర్యా. గిన్నె[8]. స్టౌలో బర్నర్ మంటను అదుపులో ఉంచడానికి అమర్చిన రింగు. (తె. 24).

**పైగిన్నె[2]**: స్రామాణి వేయడానికి ఉపయోగపడే గిన్నె లాంటి పరికరం. (రా. 5).

**పైడినట్టుపాన**: చూ. పర్యా. పెడల్‌రించి. సైకిల్ పిడిల్‌నట్టు బిగించడానికి వాడే స్పానరు.(తె. 8, 13).

**పైడిప్ప**: చూ. పర్యా. ఎడ. పాత్ర మధ్యభాగం. (కో. 22).

**పై డై**: ట్రంకుపెట్టె పైభాగం బార్డర్ కొట్టడానికి వాడే పరికరం. (రా. 4).

**పైన్‌తీయు**: (క్రి.) చూ. పర్యా. చుక్కకొట్టు. పూర్తిగ అతికిన తర్వాత బిందెపై వంకర్లులేకుండ నున్నగ సాపుచేసి మెరుగు చుక్కలు కొట్టడం. (తె. 21).

**పైపట్టుకమ్మి**: చూ. పర్యా. కంతాణి, లోహపు పాత్రలకు మెరుగుపట్టడానికి వాడే పరికరం. (కో. 14; రా. 15).

**పైపడ**: చూ. పర్యా. తలకాయ. బిందె పైభాగపురేకు. (తె. 1).

**పైపర్**: స్టీల్ పాత్రలకు పాలీష్ చేయడానికి వాడే పరికరం. (కో. 8).

**పైపు[1]**: చూ. పర్యా. గొట్టం[4]. లోహపు వస్తువుల రిపేరులో మోపుగా ఉపయోగపడే సాధనం (కో. 1, 5, 12, 14, 15, 16; తె. 2 17, 22, 25; రా. 4, 5, 7, 10, 12, 15).

**పైపు[2]**: చూ. గొట్టం[2]. స్టౌబర్నర్‌కు టాంకిద్వారా నూనెను అందించడానికి అమర్చిన గొట్టం. తె. 3, 4).

**పైపు[3]**: చూ. పర్యా. గొట్టం[3]. టార్చిలైట్‌లో బాటరీలను ఉంచడానికి ఉపయోగపడే స్విచ్ ఉన్నభాగం. (తె. 23).

**పైపు[4]**: పెట్రోమాక్స్ లైటులో అతిముఖ్యమైన భాగం. (కో. 2).

**పైపు[5]**: మంచం తయారీకి ఉపయోగించే గుండ్రని ఇనపగొట్టం. (రా. 2).

**పైపు[6]**: అలగాత్తిని పెట్టుకోడానికి, బర్నర్ శుభ్ర పరచడానికి, పొయ్యిల, బొయిలర్‌ల పొగపోవడం కోసం అతికించడానికి వాడే పరికరం. (కో. 26; రా. 5).

**పైపుబెండింగ్‌మిషను**: (ఇం.) పర్యా. మోటారు గ్రైండింగు, రాట్ బెండింగు. పైపు వంచడానికి పనికివచ్చే పరికరం. (కో. 5; రా. 8).

**పైపుమంగన్**: గుండ్రని కడ్డీలను గొట్టాలను బిగించ డానికి వాడే పనిముట్టు. (తె. 5).

**పైపురించి**: సైకిల్ పోర్కును సరిచేయడానికి వాడే స్పానరు. (కో. 3, 13, 15).

**పైప్సు**: ఇది నలచదరంగా ఉండే చట్టం. పంపు అచ్చులు తయారుచేయడానికి ఉపయోగం. (కో. 2).

**పైభాగం**: చూ. పర్యా. తలకాయ. బిందె పైభాగపు రేకు. (తె. 5).

**పైమిదిని**: క్రింది మిదినిని పట్టుకోడానికి వాడే కడ్డీ. (రా. 14).

**పైమూత**: ట్రంకుపెట్టె పైభాగం - ఇది కొంచెం చిన్నదిగా ఉంటుంది. (రా. 4).

**పైయల్**: చూ. పర్యా. కమ్ములు. సైకిలుకు అమర్చిన చిన్న కమ్మీలు. (తె. 8, 13)

**పైరంధ్రం**: చూ. పర్యా. కన్నం. కరుగు పైభాగంలో ఉండేబొక్క. (రా. 5).

**పైర్‌రాయి**: (< ఇం. Fire + రాయి) కొలిమిలో అగ్గిమండడానికి వాడే పనిముట్టు. (రా. 5).

**పైరేకు**: చూ. పర్యా. తలకాయ. బిందె పైభాగపు రేకు. (తె. 3, 7, 8, 21, 24).

**పైరేకులసుత్తె**: ఉ. పైరేకులసుత్తి. చూ. పర్యా.

పలచనిసుత్తి. బిందెగొంతు, అడుగుభాగాలు సాపు చేయడానికి వాడే సుత్తి. చూ. చిత్రం 153. (కో. 10, 12, 13; తె. 22).

పైల్‌చేయు: (క్రి.) గొడుగుల్ని బిగించడం. (కో. 2, 8; రా. 8, 9).

పైలు: ఉ. పైల్. బీరువాతాళాలు పట్టకపోతే సరిచేసుకోడానికి, బీరువారేకులను రాయడానికి, మొద్దుబారిన పరికరాలను పదునుపెట్టడానికి, చిన్న రంధ్రాలను పెద్దదిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 2, 4, 7, 11, 15, 28; తె. 11, 14, 15; రా. 6, 7, 8).

పైలుచెక్క: సైకిల్ ట్యూబ్‌లు సాప్‌చేసుకోడానికి వాడే పరికరం. (కో. 14).

పైలేగ: చూ. పర్యా. పట్టంలేగ. లోహపు పాత్రలపై ఉన్న మైలను పోగొట్టడానికి వాడే కమ్మి. (కో.28).

పొక్క: చూ. బొక్క. (తె. 4, 7, 27, 18).

పొక్కించు[1]: (క్రి.) చూ. పర్యా. ఒడ్డు. గుండ్రని రేకును పాత్ర అడుగుభాగం ఆకారం వచ్చేటట్లు బిళ్ళలాగావంచి గుంతలాగా చేయడం. (కో. 8, 10, 20-24, 28; తె. 24, 25; రా. 2).

పొక్కించు[2]: (క్రి.) రేకులను జాయింట్ చేయడం. (కో. 5).

పొక్కించుసుత్తి: చూ. పొక్కింపుసుత్తి. (కో. 13).

పొక్కించేమొద్దు: ఇత్తడిబిందె జవ్వరేకును మిర్రుగ చేయడానికి వాడే కొద్దిలోతు ఉండే బండ. (తె. 23).

పొక్కింపు: (క్రి.) బిందెరేకులు జాయింట్‌చేయడం. (కో. 13).

పొక్కింపుకర్రసుత్తి: రూ. పొక్కుడు కర్రసుత్తి. చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికివాడే పరికరం. చూ. చిత్రం 68. (కో.10,12).

పొక్కింపుకొయ్యసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 8).

పొక్కింపుదుంగ: ఇడ్లీపాత్రలకు అడుగులు కొట్టడానికి, గుంటలుకొట్టడానికి, పాత్రల సొట్టలను తీర్చడానికి వాడే కొయ్యతుండు. (కో. 10, 12, 13, 15).

పొక్కింపురాయి: రేకు సర్కిట్‌లను కుదించడానికి వాడే మోపు. (కో. 24).

పొక్కింపుసుత్తి: రూ. పొక్కించుసుత్తి. చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 8, 24).

పొక్కు: అల్యూమినియం పాత్రలపై బెజ్జాలువేసిన తావున పైకిలేచిన రేకు. (కో. 10, 12).

పొక్కుడుకర్రసుత్తి: చూ. పొక్కింపు కర్రసుత్తి. (కో. 13).

పొక్కుడుతొక్కు: అల్యూమినియం పాత్రలపై రంధ్రాలు వేయడానికి వాడే కొయ్యదిమ్మలాంటి పరికరం. (కో. 4).

పొక్కుడుదుక్క: పాత్రల బిళ్ళలు కొట్టుకోడానికి వాడే తుండు. (కో. 13).

పొగుపుడబ్బా: చూ. పర్యా. గదులపెట్టె. మసాలా దినుసులు వేసి ఉంచుకోడానికి వాడే పరికరం. 3,5, 6, 7 లేదా 8 గిన్నెలు కలిపి ఒక వెడల్పుపాత్రలో అమర్చిఉంటారు. చూ. చిత్రం 73. (కో. 22).

పొంగడాలపళ్లెం: చూ. పర్యా. గుంట పొంగడాల పెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంతలుఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (తె. 22).

పొంగనాలపెనుం: ఉ. పొంగనాల్ పెనుం. చూ. పర్యా. గుంటపొంగడాల పెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంతలుఉన్న లోహపు అచ్చురేకు. చూ.చిత్రం 80. (రా. 7, 8, 16).

పొంగనాలపెంచు: రూ. పొంగళాల పెంచు. చూ. పర్యా. గుంటపొంగడాల పెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంతలుఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (తె. 1, 3).

పొంగనాలమూకుడు: చూ. పర్యా. గుంటపొంగడాల పెనం. పొంగనాలు చేయడానికి వాడే గుంతలుఉన్న లోహపు అచ్చురేకు. చూ. చిత్రం 80. (తె. 19).

పొంగళాలపెంచు: చూ. పొంగనాల పెంచు. (తె.19).

పొంచ్‌పోగరు: చూ. పర్యా. పోగరు. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలేయడానికి గుర్తులుపెట్టే పరికరం. చూ. చిత్రం 165. (కో. 9, 10, 12, 16-18, 20, 25; తె. 2, 20, 21).

పొంచింగ్‌చేయు: (క్రి.) (< ఇం. Punching + చేయు). రంధ్రాలు వేయడానికి ముందు రేకుపై గుర్తులు పెట్టడం. (కో. 28).

పొంచు: చూ. పంచ్. (కో. 23).

పొంచుపోగరు: (< ఇం. Punch + పోగరు). డబ్బా రేకుల్ని గుండ్రంగా చేసే పరికరం. (కో. 6).

పొటాటోకట్టర్: (ఇం.) పర్యా. పొటాటోపిల్లరు, బంగాళాదుంపలు తరగడానికి వాడే సాధనం. (కో. 27).

పొటాటోపిల్లర్: (ఇం.) చూ. పర్యా. పొటాటోకట్టర్.

బంగాళాదుంపలు తరగడానికి వాడే సాధనం. (కో. 6).

పొట్ట: చూ. పర్యా. అడ్డ. బిందె మధ్యభాగపు రేకు. (కో. 20-22, 24, 25, 27; తె. 14).

పొట్టకరవాయి: చూ. పర్యా. జవ్వలకరవాయి. బిందె జవ్వభాగం సాపుచేయడానికి వాడే అడుగుభాగం వెడల్పుగా గుండ్రంగా ఉండే పనిముట్టు. (కో. 5).

పొట్టగిన్నె[1]: చూ. పర్యా. ఉగ్గుగిన్నె. చిన్నపిల్లలకు ఉగ్గుపట్టడానికి వాడే చిన్నగిన్నె. చూ. చిత్రం 26. (కో. 5; తె. 20).

పొట్టగిన్నె[2]: చూ. పర్యా. కూరగిన్నె. కూరలు వండడానికి, వేసుకోడానికి వాడే లోహపుపాత్ర. (కో. 5).

పొట్టచేయు: (క్రి.) పర్యా. సూరొంచు. బిందె మధ్యభాగాన్ని లావుగచేసి అతకడానికి వీలుగా తయారుచేయడం. (తె. 22).

పొట్టరేకు: చూ. పర్యా. అడ్డ. బిందె మధ్యభాగపు రేకు. (కో. 5).

పొట్టు: చూ. పర్యా. ఊక. కొలిమిలో కాక బాగుగా రావడానికి, పాత్రలను తోమడానికి వాడే పదార్థం. (తె. 21, 23).

పొట్టుపొయ్యి: చూ. పర్యా. చిట్టిపొయ్యి. పొట్టుతో వంట చేయడానికి ఉపయోగపడే ఇనుపపొయ్యి. (కో. 2-4, 9, 16, 22-24, 26; తె. 1-4, 18-20, 21, 22, 23, 25; రా. 2, 5-7, 11, 12).

పొట్లంసుత్తె: చిన్న ఇనప వస్తువులను కొట్టడానికి వాడే పనిముట్టు. (రా. 16).

పొట్లంహతోడి: చూ. పర్యా. ఆమరు. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాగ్గొట్టడానికి వాడే పరికరం. (తె. 2).

పొడచ: రంధ్రాలు వేసుకోడానికి ఉపయోగించే ప్లేటు. (కో. 15).

పొడదుంగ: కొలిమిపనిలో మేకులు దిగ్గొట్టుకోడానికి పాత్రలకు సొట్టలేకుండా చేయడానికి వాడే కొయ్యతుండు. (కో. 11, 15).

పొడవుకమ్మి: చూ. పర్యా. పట్టంలేగ. లోహపు పాత్రలపై ఉన్నమైలను పోగొట్టడానికి వాడేకమ్మి. (కో. 26).

పొడవుగంజు: పదార్థాలు ఉంచుకోడానికి వాడే పొడవైన స్టీల్‌పాత్ర. (తె. 14-17).

పొడవులేగ: చూ. పర్యా. పట్టంలేగ. లోహపు పాత్రలపై ఉన్నమైలను పోగొట్టడానికి వాడేకమ్మి. (కో. 28).

పొడసుత్తి: చూ. పర్యా. పక్కమిరియం. లోహపు రేకులను, కడ్డీలను వంచుకోడానికి, సాపుచేయడానికి వాడేదిమ్మ. (కో. 12, 15-18, 20, 25, 27, 29, 50).

పొడి: చూ. పర్యా. చూర. లోహపు పాత్రలను అతకడానికి వాడే పదార్థం. (కో. 4, 9, 10, 14; తె. 14; రా. 1, 5, 7).

పొడికమ్మి: చూ. పర్యా. కడ్డి[1]. ఇత్తడి పాత్రలను రవ్వతో అతకడానికి ఉపయోగించే కడ్డి. (రా. 1).

పొడికొలిమి: వేస్ట్‌అయిన మెటల్‌పొడిని మూసలలో కరగబెట్టే కొలిమి. (రా. 2).

పొడిగిన్నె: చూ. పర్యా. కుడక, టంకంపొడిని వేసుకోడానికి వాడే పాత్ర. (రా. 1).

పొడిపొడిగాచేయు: (క్రి.) ఎక్కువతేమ లేకుండా కొంతతేమ ఉండునట్లు మెటల్‌పొడిని తయారుచేయడం. (రా. 5).

పొడిసుత్తె: చూ. పర్యా. మెరకసుత్తె. దెబ్బదెబ్బకు కన్నులాగా కొట్టడానికి వాడే పరికరం. (తె. 24).

పొడుగుకత్తెర: చూ. పర్యా. పెద్దకత్తెర. పెద్దపెద్ద రేకులను కత్తరించడానికి వాడే పనిముట్టు. (కో. 4).

పొడుగుకూరపుగిన్నె: చూ. పర్యా. కళాయిగిన్నె. కూరలు వేసుకోవడానికి ఉపయోగించే పొడవైన లోహపు పాత్ర. (కో. 21).

పొడుగుగిన్నె: ఉ. పొడుగ్గిన్నె. చూ. పర్యా. కళాయగిన్నె. కూరలు వేసుకోవడానికి ఉపయోగించే లోహపుపాత్ర. నిలువుగా ఉంటుంది. నీళ్ళు తాగడానికి కూడా వాడ్తారు. (కో. 30; తె. 8, 9).

పొడుగుగెడ్డపార: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగు భాగాలు సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 3).

పొడుగుచానం: పొడవైన ఇనుపముక్కలను తెగ్గొట్టడానికి ఉపయోగపడే కొరముట్టు. (రా. 4).

పొడుగుడబ్బా: చూ. పర్యా. డబ్బా[1]. పప్పులు, పిండి పదార్థాలు నిల్వఉంచుకోడానికి వాడే మూతఉన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 121. (తె. 12, 13).

పొడుగుపోగర: పిన్నును కొట్టడానికి ఉపయోగించే పరికరం. (రా. 4).

పొడుగుమట్నకరవాయి: రూ. పొడుగు మట్టకరవాయి. బిందెకు చుక్కలు కొట్టడానికి వాడే పనిముట్టు. తలభాగం గుండుగా పెద్దదిగా ఉంటుంది. (తె. 10, 11).

పొడుగుమట్టకరవాయి : చూ. పొడుగుమట్ల కరవాయి. (తె. 8).

పొడుగుమడిసుత్తి: చూ. పర్యా. పలచనిసుత్తి. బిందె గొంతు, అడుగుభాగాలు సాపు చేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 153. (కో. 27).

పొడుగుముట్టిసుత్తె: చూ. పర్యా. పలచనిసుత్తి. బిందెగొంతు, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 153. (కో. 23).

పొడుగుమూతులపట్టకార: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (రా. 4).

పొడుగుమొపు: చూ. పర్యా. ఇనుపముక్క. డిజైన్లు చేయడానికి వాడే చిన్న ఇనపబద్ద. (కో. 18, 28).

పొడుగులు: బిందెపై ఉండే పైపెచ్చురేకు. (కో. 5).

పొడుగుసుత్తి: పర్యా. బారుసుత్తి. లోతుకొట్టడానికి వాడే పరికరం. (కో. 4, 6, 9, 12, 30; తె. 2, 8–11, 17, 19; రా. 2, 7).

పొడుగోయు: (క్రి.) పర్యా. ఉరవేయు, పెరిగేయు. గ్లాసులను అడ్డసుత్తెతో సాగ్గొట్టి వెడల్పుచేయడం. (కో. 15).

పొడుచు[2]: (క్రి.) కొలిమిలో సన్నని ఇనుపకడ్డీలను కాల్చి మేకులుగ తయారుచేయడం. (కో. 11, 15, 22, 26, 28).

పొడుచు[2]: (క్రి.) మూస కరిగి బట్టీ చల్లారినాక ఆ బట్టీని గునపంతో చెల్లాచెదరు చేయడం. (కో. 19).

పొడుచుకొను: (క్రి.) పోగరుతో రంధ్రాలు వేయడం. (కో. 28).

పొడులక్యాను: కందిపొడి, పప్పుపొడి మొదలయినవి ఉంచుకోడానికి మూత, హాండిలు ఉండే పాత్ర. చూ. చిత్రం 164. (రా. 3).

పొడుసు: (క్రి.) చూ. పర్యా. పరిగేయు. కాల్చిన లోహపుముక్కలను కావలసినరీతిలో సాగ్గొట్టడం. (కో. 17).

పొతకపెట్టు: (క్రి.) రూ. పొత్కు. పోతలోహాన్ని తయారుచేయడానికి పాత ఇత్తడిపాత్రలను ముద్దగా చేయడం. ఈ ముద్దను మూసలోవేసి కరిగిస్తారు. (తె. 17).

పొత్కు: రూపాంతరం, పోతరపెట్టు. పాత ఇత్తడిని మూసల్లోపట్టేవిధంగా ముద్దగా చేయడం. (తె. 23).

పొదుగు: (క్రి.) చూ.పర్యా. తట్టు[1]. మైనం విగ్రహం మట్టూ బంకమట్టిని గట్టిగా అతికించడం. (కో. 18).

పొద్దువట్టు: విగ్రహాన్ని చదరంగా చెక్కడానికి వాడే పరికరం. (కో. 10).

పొన్: (< హిం.) చూ. పర్యా. డిప్ప[1]. గుడ్డ ఊడిరాకుండ గొడుగు పైభాగాన అమర్చిన చిన్నరేకు తొడుగు. (తె. 22).

పొన: చూ. పర్యా. కట్ట. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (రా. 10).

పొన్ను: ఉ. పన్ను. ధాన్యం దంచుకోడానికి రోకలికి అమర్చిన ఇనపతొడుగు. చేతికర్రచివరన అమర్చే తొడుగు. (కో. 4, 9).

పొంత: నీళ్ళు కాగపెట్టుకోడానికి ఆరెరాగులాగా వాడే పెద్ద రాగిపాత్ర. (రా. 8, 16).

పొంతకరవాయి: రాగిపొంతలు చేసేటప్పుడు వాడే పనిముట్టు. (రా. 16).

పొందికచేయు: (క్రి.) చూ. పర్యా. జంటించు. రెండు రేకు భాగాలను కలపడం. (రా. 13).

పొందించు: (క్రి.) పోతపనిలో అచ్చు కట్టేటప్పుడు పాత్రల భాగాలను ఒకదానిపై మరొకదానిని సరిపోయేటట్లు కూర్చోబెట్టడం. (తె. 25).

పొందు: (క్రి.) పనిచేసేటప్పుడు రేకును, పనిముట్లను కదలకుండ బిగించడం. (తె. 17).

పొయ్యి[1]: పర్యా. బ్లోయర్‌లాంపు, బ్లోలాంపు. స్ప్రేయర్ సామాన్లు వేడిచేయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 8).

పొయ్యి[2]: చూ. పర్యా. ఇనుపపొయ్యి. కట్టెలతో వంటచేయడానికి ఉపయోగించే అర్ధచంద్రాకారపు నిలువు ఇనుపరేకు పొయ్యి. (కో. 5, 20, 21; తె. 6).

పొయ్యి[3]: ఉ. పొయ్యి. చూ. పర్యా. కరుగుకొలిమి లోహాలను వేడిచేయడానికి ఉపయోగించే కొలిమి. చూ. చిత్రం 69. (కో. 4, 16, 27, 29; రా. 13).

పొయ్యి[4]: చూ. పర్యా. కుంపటి[1]. బొగ్గులతో వంట చేయడానికి వాడే లోహపుపొయ్యి. చూ. చిత్రం 181. (కో. 28).

పొయ్యి[5]: టంకరుపనిలో రేకులను అతకడానికి ఉపయోగపడే చిన్నకొలిమి. (కో. 1, 3, 21–23, 25–27; తె. 19–21).

పొయ్యిగొట్టం: చూ. పర్యా. కొళివి. కట్టెలపొయ్యికి గాలి ఊదడానికి ఉపయోగించే పరికరం. (తె. 17, 25).

పొయ్యిజాలి: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గుల

పొయ్యిలో బూడిద రాలడానికి వాడే రంధ్రాల బిళ్ళ. చూ. చిత్రం. 59. (తె. 2).

పొయ్యిబిళ్ళ: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గుల పొయ్యిలో బూడిద రాలడానికి వాడే రంధ్రాల బిళ్ళ. చూ. చిత్రం 59. (కో. 28).

పొయ్యిముక్కోణం: పర్యా. ముక్కోణం². పొయ్యి పైపాత్రలు మోపకుండ ఎత్తుగ ఉంచడానికి ఉపయోగపడే త్రిభుజాకారపు పరికరం. (తె. 22).

పొలవుపుల్ల: చూ. పర్యా. కనికపుల్ల. రేకుపై గీతలు వేయడానికి వాడే సుద్దముక్క. (కో. 26).

పొలంగిన్నె: చూ. పర్యా. కడీడబ్బా. పొలందగ్గరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే హాండిల్, మూతఉన్న పాత్ర. (కో. 2, 4, 6-9, 11, 13, 22, 26, 28; తె. 3, 17, 18, 21).

పొలండేక్సా: చూ. పర్యా. కడీడబ్బా. పొలందగ్గరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే హాండిల్, మూత ఉన్న పాత్ర. (కో. 10, 12).

పొలుసుపోగరు: విగ్రహం తయారీలో పాముడిజైను బాగా వేయడానికి వాడే పరికరం. (కో. 6).

పొలెలపెంచు: చూ. పర్యా. అట్లపెనం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. (తె. 4).

పొల్తి: విగ్రహాన్ని పూర్తిగ చెక్కడం. (కో. 28).

పోకస్‌గిన్నె: (< ఇం. Focus + గిన్నె) చూ. పర్యా. కటోరి¹. వెలుతురు బాగా రావడానికి టార్చిలైట్ బల్బుచుట్టూఉండే తెల్లని రేకు. (తె. 23).

పోకరు: చూ. పోగరు. (తె. 3, 7, 17, 19, 23, 25).

పోకిచెంబు: పర్యా. బుడిగె¹, బుజిడి, బొడ్డుగురిగి, బొడ్డుమాలి, ముక్కుచెంబు, సొంగమాలి. చిన్న పిల్లలకు నీళ్ళు తాగించడానికి వాడే చిన్న పాత్ర. చూ. చిత్రం 191. (తె. 10, 11).

పోక్సుకమ్మి: పర్యా. బర్నల్‌కమ్మి. స్టౌ బర్నల్‌ను శుభ్రంచేయడానికి వాడే పరికరం. (రా. 5).

పోక్సులు: చూ.పర్యా. కమ్ములు. సైకిలుకు అమర్చిన చిన్న కడ్డీలు. (రా. 8).

పోగర్‌ఫంచ్‌డై: (< పోగర్ + ఇం. Punch die) చూ. పర్యా. గుల్లమోపు. లోహపురేకులపై, పట్టీలపై రంధ్రాలేయడానికి వాడే దిమ్మ. (తె. 6).

పోగరమూల: విగ్రహం మూలభాగాల్లో చెక్కడానికి వాడే పరికరం. (తె. 10, 11).

పోగరు: ఉ. పోకర, ఫోగర, పోగారు, పోగురు, ఫోగారు, రూ. ఫోకరు, పర్యా. అడ్డి, ఉలిపెం, గాజి, టన్నుపోగరు, టాకి², పంచ్, పొంచ్‌పోగర, ఫోగరుమొల, బెండు², మార్కిన్, మార్కుపోగరు, ముల్లు, మొల², వరడుబి, సెంటర్‌పంచు, సెంటర్‌పోగర, హోల్‌పంచు, హోల్‌ఫోగరు. లోహపు రేకులపై, కడ్డీలపై వేసిన రంధ్రాలను సరిచేయడానికి వాడే పనిముట్టు చూ. చిత్రం 165. (కో. 1-29; తె. 1-4; 9-25; రా. 2-16).

పోగరుమొల: చూ. పర్యా. పోగరు. లోహపురేకులపై, కడ్డీలపై, రంధ్రాలేయడానికి గుర్తుకుపెట్టే పరికరం. చూ. చిత్రం 165. (తె. 17).

పోటుసుత్తి: పోతపాత్రల అంచులు సరిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 29).

పోట్లుపెట్టు: (క్రి.) చూ. పర్యా. పరిగేయు. ఇనుప ముక్కల్ని కాల్చి సమ్మెటతో కొట్టడం. (కో. 27).

పోతకంచం: పర్యా. పోతచిప్ప. అన్నం తినడానికి వాడే అల్యూమినియం పోతగిన్నె. (కో.16; తె.19).

పోతకాడ: చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనుంపైనుండి తీయడానికి వాడే పోతపనిలో తయారుచేసిన సాధనం. చూ. చిత్రం 5. (కో. 13, 15).

పోతకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 22, 25, 28, 29; తె. 3. 17, 19, 20, 22; రా. 15).

పోతకాలు: చూ. పర్యా. గాడికాలు, పోతమొల, మొలకాడ. కరిగే లోహాన్ని పోయడానికి, అచ్చుకు రంధ్రం పెట్టడానికి ఉపయోగపడే పరికరం. (కడ్డీ). (కో. 2-20, 24, 26, 28).

పోతకుంపటి: చూ. పర్యా. కుంపటి¹. బొగ్గులతో వంట చేయడానికి వాడే లోహపు పొయ్యి. చూ. చిత్రం 181. (తె. 22).

పోతకొలిమి: చూ. పర్యా. కరుగుకొలిమి. లోహాలను వేడిచేయడానికి ఉపయోగించే పొయ్యి. చూ. చిత్రం 69. (తె. 20).

పోతచిప్ప: చూ. పర్యా. పోతకంచం. అన్నం తినడానికి ఉపయోగపడే అల్యూమినియం పోతగిన్నె. (తె. 19).

పోతచెంబు: చూ. పర్యా. కాకినాడచెంబు. కూజా ఆకారమున్న పోతపోసిన లోహపుపాత్ర. నీళ్ళు తాగడానికి ఉపయోగం. (కో. 18, 22; తె. 5-7, 18, 24, 25).

పోతదొడ్డి¹: పర్యా. అచ్చుదొడ్డి. పోతవస్తువులు

పోసుకోడానికి వాడే చౌకం ఆకారంలో ఉండే ఇనపకట్టు. ఇవి రెండు ఉంటాయి. అడుగుభాగంలో పెట్టినదొడ్డికి పైన మేకులు బిగిస్తారు. దానిపైన పెట్టేదొడ్డికి ఆ మేకులు సరిపోయేటట్లు రంధ్రాలు ఉంటాయి. (కో. 7).

పోతదొడ్డి²: చూ. పర్యా. కన్నం. కరిగిన లోహాన్ని అచ్చులో పోయడానికి మట్టి అచ్చుపై ఉండే రంధ్రం. (తె. 19).

పోతపట్వ: చూ. పర్యా. పచ్చబిందె. నీళ్ళు, పాలు తెచ్చుకోడానికి ఉపయోగపడే గుండ్రని లోహపు కడవ. (తె. 25).

పోతపని: పర్యా. మోల్డింగ్ పని. మట్టితో అచ్చుకట్టి లోహాన్ని కరిగించిపోసి పాత్రను తయారుచేసే పని (కో. 19-22, 25, 26, 27, 29; రా. 9, 15).

పోతపోయు: (క్రి.) మట్టిఅచ్చులో కరిగించిన ఇత్తడిని దాయాలుగా పోయడం. (రా. 5).

పోతబింది: చూ. పర్యా. పచ్చబిందె. నీళ్ళు, పాలు తెచ్చుకోడానికి ఉపయోగపడే గుండ్రని లోహపు పాత్ర. (కో. 28).

పోతమట్టి: చూ. పర్యా. జిగురుమట్టి. మట్టిమూసను తయారు చేయడానికి ఉపయోగించే మట్టి. (కో. 8, 10).

పోతమాత: చూ. పర్యా. కన్నం. అచ్చులో పోత పోయడానికి వాడే రంధ్రం. (రా. 5).

పోతమూల: చూ. పర్యా. కన్నం. మట్టివిగ్రహానికి పైభాగంలో ఉండే రంధ్రం. (రా. 1).

పోతమొల: చూ. పర్యా. పోతకాలు. కరిగే లోహాన్ని పోయడానికి, అచ్చుకు రంధ్రం పెట్టడానికి వాడే పరికరం. (తె. 17, 21, 23).

పోతవేయు: (క్రి.) చూ. పర్యా. తట్టు. విగ్రహం ఆకారాన్ని చేయడానికి మైనాన్ని చేత్తో ఒత్తి దాని చుట్టు బంకమట్టిని బలంగా పూయడం. (కో. 18).

పోనస్: ఉ. పోన్సు. చూ. పర్యా. పిన్నుపోగరు. రివిట్ చేయడానికి వాడే తొలఉండే పోగరు. (కో. 16-18, 22, 28; తె. 21; రా. 4, 8, 10).

పోపులడబ్బా: చూ. పర్యా. గదులపెట్టె. మసాల దినుసులు వేసి ఉంచుకోడానికి వాడే పరికరం. 4, 5, 6, 7 లేదా 8 గిన్నెలు కలిపి ఒక వెడల్పు పాత్రలో అమర్చి ఉంటారు. చూ. చిత్రం 73. (కో. 18, 19, 21, 22, 24, 25; తె. 1).

పోపులపెట్టె: చూ. పర్యా. గదులపెట్టె. మసాల దినుసులు వేసి ఉంచుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 73. (కో. 28).

పోయు¹: (క్రి.) చూ. పర్యా. పడవు. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలు వేయడం. (కో. 16).

పోయు²: (క్రి.) మూస రంధ్రంలో కాచిన లోహాన్ని పోయడం. (రా. 2, 4).

పోర్కు: (ఇం. Fork) మాంసం ముక్కలను గుచ్చి తినడానికి వాడే సాధనం. (కో. 2, 6, 11).

పోర్కుకడ్డి: సైకిల్ పోర్కును వంపుతీయడానికి వాడే పరికరం. (కో. 14).

పోర్కుకారు: సైకిల్, రిక్షాలముందు చక్రాలపై ఉన్న పోర్కును సరిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 13-15).

పోలుమూస: చూ. పర్యా. మూస. లోహాన్ని కరిగించడానికి ఉపయోగించే పాత్ర. (తె. 1).

పోసు: చూ. పర్యా. కూరగరిటె. తిరగవాత వేయడానికి, కూరలు వడ్డించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63.. (తె. 9).

పోసుపెట్టు: (((క్రి.) చూ. పర్యా. తాల్పువేయు. తయారైన వంటకాలకు తిరగమాత పెట్టడం. (తె. 18).

పౌడర్‌గిన్నె: (< ఇం. Powder + గిన్నె) చూ. పర్యా. పదంపేల. పౌడర్ వేసుకోడానికి వాడే గిన్నె. చూ. చిత్రం. 166. (కో. 11).

పౌడర్‌డబ్బా: (< ఇం. పౌడర్ + డబ్బా) చూ. పర్యా. పదంపేల. పౌడర్ వేసుకోడానికి ఉపయోగపడే స్టీలుడబ్బా. చూ. చిత్రం. 166. (కో. 15, 19; తె. 17).

పౌడర్‌బాక్సు¹: చూ. పర్యా. పదంపేల. పౌడర్ ఉంచుకోడానికి వాడే స్టీల్‌పెట్టె. చూ. చిత్రం 166. (కో. 1, 2, 6, 8; తె. 2, 8, 9, 13-16).

పౌడర్‌బాక్సు²: చూ. పర్యా. డబ్బా¹. పిండిపదార్థాలు ఉంచుకోడానికి వాడే లోహపుపాత్ర. చూ. చిత్రం 121. (కో. 12; తె. 9).

పౌన్‌పాండ్‌పట్కార: ఏసైజు స్క్రూలనైనా బిగించుకోడానికి వాడే మంకీప్లేయర్‌లాగా ఉండే పరికరం. (తె. 3).

పౌనులసుత్తి: చూ. పౌనుసుత్తి. (కో. 16, 22, 24; రా. 7).

పౌనుసుత్తి: (< ఇం. Pound + సుత్తి) రూ. పౌనుల సుత్తి. చూ. పర్యా. సమ్మెట. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడే పెద్ద సైజు సుత్తి. (కో. 4, 16).

ప్యాన్సీకత్తెర: (< ఇం. Fancy + హిం.) చూ. పర్యా. కాడగిన్నె. చాయ్ తయారుచేయడానికి వాడే పొడవుకాడ ఉన్న పెద్దగిన్నె. (తె. 15).

ప్యాన్సీకస్తి: రూ. ప్యాన్సీకిస్తి. అన్నం ఆరబోసుకోడానికి ఉపయోగపడే వెడల్పు మూతి ఉండే లోహపుపాత్ర. (తె. 14).

ప్యాన్సీప్లేటు: (ఇం.) కూరలు ఉంచుకోడానికి ఉపయోగపడే డిజైను ప్లేటు. (కో. 6, 10, 11).

ప్యాన్సీబాక్సు: (ఇం.) పౌడరు, కుంకుమ మొదలైన సామగ్రి వేసుకోడానికి వాడేపెట్టె. (రా. 6).

ప్యాన్సీబేసను: (ఇం.) చూ. పర్యా. బేసను. వెడల్పుమూతి, లోతుఉన్న లోహపుపాత్ర. అన్నం ఆరబోసుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 179. (కో. 3).

ప్యారిసిజర్: జువాలజీ డిసెక్షన్ బాక్సులో ఉండే చిన్నకత్తెర. (కో. 20).

ప్రజంటేషన్‌కప్పు: చూ. పర్యా. ప్రైజుకప్పులు. బహుమతులివ్వడానికి చేసిన లోహపు సాధనాలు, (కో. 19).

ప్రణిత: చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. (రా. 15).

ప్రభావళి: దేవతావిగ్రహం వెనుక ఉండే లోహంతో చేసిన గుండ్రటి పరికరం. పైభాగం మధ్యలో సింహం ముఖంలాగా చెక్కివుంటుంది. చూ. చిత్రం 167. (తె 2; రా. 11, 13).

ప్రమిద: రూ. పెమిద. దీపం వెలిగించడానికి ఉపయోగపడే గుండ్రని చిన్నపళ్లెం. (కో. 19, 23, 29; తె. 18, 21).

ప్రిజ్‌బాటల్: (ఇం.) రూ. ఫ్రిజ్‌బాటల్. పర్యా. సీసా. పొడవుగా మూతి సన్నగా సీసా ఆకారమున్న స్టీలుపాత్ర. ఫ్రిజ్‌లో నీళ్ళుపెట్టుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 168. (తె. 15, 16).

ప్రివీల్: (< ఇం. Prewheel) ఉ. పిరివీల్. సైకిల్ పరిగెత్తడానికి ఉపయోగపడే చైన్ కిందిభాగం. చూ. చిత్రం 169. (కో. 1; తె. 8, 13).

ప్రివీల్‌రింజి: (ఇం.) పర్యా. ప్రివీల్ స్పానర్. సైకిల్ ప్రివీల్‌నట్టు విప్పడానికి వాడే పరికరం. (కో. 7).

ప్రివీల్‌స్పానర్: (ఇం.) చూ. ప్రివీల్‌రింజి. సైకిల్ ప్రివీల్‌నట్టు విప్పడానికి వాడే పరికరం. (కో. 13).

ప్రెంట్‌వీల్‌రింజి: (< ఇం. Front wheel rinch) సైకిలుముందు చక్రం ఊడదీయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 15).

ప్రెమరిరంగు: (< ఇం. Primery + రంగు) పర్యా. ప్రేమరి, రెడాక్సైడు, వార్నిషు, వార్నిష్ రంగు. పూర్తయిన బీరువాలు, గేట్లు వగైరా ఇనప వస్తువులకు మొదటిసారిగా వేయడానికి ఉపయోగపడే ఎర్రని రంగుపదార్థం. (తె. 18).

ప్రెస్: స్ప్రేయర్‌లో కప్పులు ఊడదీయడానికి వాడే పరికరం. (కో. 8).

ప్రెస్‌కటింగ్: (ఇం.) పర్యా. ప్లాట్‌కటింగ్‌మిషను. కడ్డీలను ఖచ్చితంగ కతుకులులేకుండ కట్‌చేయడానికి వాడే పరికరం. (కో. 17).

ప్రెస్‌కేబుల్: (ఇం.) చూ. పర్యా. గ్రైండరు. వెల్డింగుఉబ్బులను శుభ్రపరచడానికి వాడే యంత్రం. (రా. 16).

ప్రెస్‌చేయు: (క్రి.) (< ఇం. Press + చేయు) (1.) ఇనపకడ్డీలను ఎక్కువలులేకుండ ఖచ్చితంగా ముక్కలుచేయడం. (2). రేకును మిషన్‌లో గిన్నెలాగా వంచడం. (కో. 17, రా. 14).

ప్రెస్‌సుత్తి: (< ఇం. Press + సుత్తి) చూ. పర్యా. పలచనిసుత్తి. బిందెమూతలు, అడుగులు సాపుచేయడానికి వాడే సుత్తి. చూ. చిత్రం 153. (రా. 9).

ప్రెసింగ్: (క్రి.) రేకుల్ని అణగ్గొట్టడం. (రా. 8).

ప్రెసింగ్‌ప్లేయర్: (ఇం.) సైకిల్‌నట్లు బిగించుకోడానికి వాడే పరికరం. (కో. 7).

ప్రెసింగ్‌బద్దె: (< ఇం. Pressing + బద్దె) చూ. పర్యా. పట్ట[1]. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లావుపాటి ఇనపబద్ద. (కో. 13).

ప్రెస్పింగ్ ఎక్కు: చూ. పర్యా. ఎక్కు. గొడుగు తెరచిఉంచినపుడు కమానగొట్టాన్ని పట్టుకొనే సాధనం. ఇది ఇనపరాడ్డుకు బిగించి ఉంటుంది. (కో. 23).

ప్రేమరి: చూ. పర్యా. ప్రెమరిరంగు. పూర్తయిన ఇనుప వస్తువులకు మొదటిసారిగా వేయడానికి ఉపయోగపడే ఎర్రనిరంగుపదార్థం. (తె. 18).

ప్రేము[1]: చూ. పర్యా. ఛీకా[1]. పాత్రలు పెట్టడానికి స్టౌబర్నర్ పైభాగాన అమర్చిన బొదిపెలున్న రేకు. (తె. 5).

ప్రేము[2]: పూర్తిగా తయారయిన సైకిల్ మొత్తం. (తె. 8, 13).

ప్రేముచేయు: (క్రి.) (< ఇం. Frame + చేయు) కొలతలప్రకారం ఇనుప ప్లాట్‌లను కట్టుకోవడం. (రా. 8).

ప్రైజుకప్పులు: (ఇం.) పర్యా. ప్రజంటేషన్ కప్పులు, రేస్ కప్పులు. బహుమతులివ్వడానికి చేసిన లోహపు సాధనాలు. (కో. 18, 21).

ప్రైపాను: (ఇం.) చూ. ఫ్రైపాను. (తె. 14-16).

ప్రైఫెను: (ఇం.) చూ. ఫ్రైపాను. (తె. 17).

ప్లక్స్‌కొట్టు: (క్రి.) చూ. పర్యా. అసురుగొట్టు. వెల్డింగ్ అయినతర్వాత బుడిపెలను తీసివేయడం. (కో. 21).

ప్లపర్ కుంకుమభరిణి: (< ఇం. + Flower + కుంకుమభరిణి) కుంకుమ పోసుకోడానికి వాడే పువ్వు ఆకారంతో ఉండే డబ్బి. (కో. 6).

ప్లవర్‌వాజు: (< ఇం. Flower Vas ) రూ. ప్లవర్ వైజు. (కో. 6).

ప్లవర్‌వైజు: రూ. ప్లవర్‌వాజు. టేబిల్‌పై పూలు ఉంచుకోడానికి ఉపయోగించే సాధనం. చూ చిత్రం 170. (కో. 23).

ప్లాంచ్: డైకి ఉండే మడలు. (రా. 16).

ఫ్లాట్: డై తయారుచేయడానికి వాడే ఇనుపరేకు. (రా. 5).

ఫ్లాట్ ఆకు: విగ్రహాన్ని చెక్కే పరికరం. (కో. 10).

ఫ్లాట్ ఆకురాయి: (< ఇం. Flat + ఆకురాయి) పలుచని రేకులాగా పొడవుగా ఉండే పనిముట్టు. బీరువా పైమూలలను, రంధ్రాలను శుద్ధం చేయడానికి, శిల్పపనిలో చదరంగా ఉండే స్థలాల్లో రుద్దడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 171. (కో. 6, 17, 23; తె. 3, 10).

ఫ్లాట్ కటింగ్ మిషను: (ఇం.) చూ. పర్యా. ప్రెస్ కటింగ్. కడ్డీలను సులువుగ ముక్కలు చేయడానికి వాడే పరికరం. (రా. 14).

ఫ్లాట్ కరవాయి: పర్యా. బక్కెట్లు కరవాయి, వాలు కరవాయి. బక్కెట్లు సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 8).

ఫ్లాట్‌కారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును. వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమి దగ్గర వాడే పనిముట్టు. (కో. 23).

ఫ్లాట్‌దిమ్మె: చూ. పర్యా. ఇనుపదుక్క. డిజైన్లు చేయడానికి వాడే చిన్న ఇనపబద్ద. (రా. 6).

ఫ్లాట్‌పన: చూ. పర్యా. అడగోలు. లోహపురేకులు, కడ్డీలు సాపు చేయడానికి వాడే దిమ్మ. (రా. 2).

ఫ్లాట్‌పులేలు: రూ. ఫ్లాట్‌పుల్లెలు. చూ. పర్యా. పుల్లి. రేకుగాడులను ఖచ్చితంగా కొట్టడానికి వాడే పరికరం. (తె. 17, 20, 22).

ఫ్లాట్‌పుల్లెలు: చూ. ఫ్లాట్‌పులేలు. (కో. 8).

ఫ్లాట్‌పొంచు: చూ. పర్యా. పట్ట[1]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లావుపాటి ఇనపబద్ద. (కో. 21).

ఫ్లాట్‌పైలు: చూ. ఫ్లాట్‌ఫైల్. (రా. 6).

ఫ్లాట్ పోగరు: విగ్రహానికి ప్రక్కభాగాలు మట్టంగా చేయడానికి ఉపయోగించే పనిముట్టు. (రా. 13).

ఫ్లాట్‌ఫైల్: రూ. ఫ్లాట్‌పైలు, చూ. పర్యా. ఇనుప ఆకురాయి. బీరువాల వెల్డింగ్ అతుకులు కనపడకుండ సాపుచేసే పనిముట్టు. (తె. 17, 22).

ఫ్లాట్‌ఫారం: చూ. పర్యా. టెంప్లేటు. ముందుగా డిజైను గీయడానికి వెల్డింగుపనిలో వాడే లోహపు రేకు. (కో. 13, 18; తె. 19).

ఫ్లాట్‌మోపు: రూ. పర్యా. ఇనుపదుక్క. డిజైన్లు చేయడానికి వాడే చిన్న ఇనుబద్ద. (తె. 21).

ఫ్లాట్‌వెల్డింగ్: సాధారణంగా చేసే వెల్డింగ్. (తె. 17)

ఫ్లాట్‌సుత్తి: చూ. పర్యా. పక్కమిరియం. లోహపు రేకులను, కడ్డీలను చక్కగ సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 7; రా. 2).

ఫ్లాటు: చూ. పర్యా. ఇనుపదుక్క. డిజైన్లు చేయడానికి ఉపయోగపడే చిన్న ఇనుపబద్ద. (తె. 1, 3).

ఫ్లాంటేషను: బీరువాబాడీ వంగకుండ లోపల అమర్చిన అరలు. (కో. 19, 22).

ఫ్లాస్క్ పట్టకారు: చూ. పర్యా. జనకర. చిన్నచిన్న లోహపువస్తువులను పట్టుకోడానికి, రిపేరు చేయడానికి వాడే పరికరం. (కో. 29).

ఫ్లాస్కు: ఉ. ఫ్లాస్కో. పర్యా. థర్మాస్. కాచినపాలు, కాఫీ పోసుకోడానికి వాడే పరికరం. వేడి చల్లారకుండా నిరోధించడానికి వీలుంటుంది. చూ. చిత్రం 172. (కో. 1, 4, 20; తె. 9, 12).

ఫ్లాస్కుమరచెంబు: (< ఇం. Flask + మరచెంబు) ఫ్లాస్కు ఆకారంతో ఉండే మరచెంబు. (కో. 23).

ఫ్లాస్కుమాడల్ మరచెంబు: నీళ్ళు తెచ్చుకోడానికి వాడే ఫ్లాస్కుఆకారంతో తయారు చేసిన పాత్ర. (కో. 6).

ప్లాస్టర్ ఆఫ్ పారిస్ డై: (ఇం.) ఒకసారి చేసిన విగ్రహాన్ని మరల చేయడానికి వీలుగా తయారు చేసిన అచ్చు. విగ్రహం ఆకారాన్ని బట్టి అచ్చులు ముందుగానే చేయబడి ఉంటాయి. (తె. 17).

ప్లాస్టిక్: (ఇం.) చూ. పర్యా. కవరు[2]. గొడుగులోపలికి నీళ్ళు రాకుండా పైభాన అమర్చిన చిన్న ప్లాస్టిక్‌గుడ్డ. (తె. 2).

ప్లాస్టిక్ ఇంజెక్షన్: (ఇం.) స్ప్రేయర్‌వాళరుకు ఉపయోగించే సాధనం. (కో. 8).

ప్లాస్టిక్‌కవరింగ్‌స్టాండు: (ఇం.) గ్లాసులు, కంచాలు ఉంచుకోడానికి ఉపయోగించే పరికరం. (తె. 4, 9).

ప్లేక్స్: (ఇం.) చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (కో. 2).

ప్లెక్సిబుల్ గ్రైండరు: (ఇం.) చూ.పర్యా. గ్రైండరు. వెల్డింగు ఉబ్బులను శుభ్రపరచడానికి వాడే పరికరం. (రా. 8).

ప్లెయిన్‌గ్లాసు: (ఇం.) చూ. పర్యా. గ్లాసు[1]. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215. (కో. 6, 10, 11).

ప్లెయిన్‌ట్రే: (ఇం.) అంచు లేకుండా మామూలుగ ఉండే తట్ట. (కో. 19).

ప్లెయిన్‌లాకరుబీరువా: (< ఇం. Plain locker + బీరువా) సెల్ఫ్‌మధ్యలో తలుపు అరఉండే బీరువా. (తె. 20).

ప్లేట్: (ఇం.) ఇనుప వస్తువులకు మెరుగుపరచడానికి వాడే పరికరం. (కో. 4).

ప్లేట్‌స్టాండు: (ఇం.) ప్లేట్లు పెట్టుకోడానికి వాడే స్టాండు. (రా. 7).

ప్లేటు[1]: (ఇం.) చూ. పర్యా. టెంప్లేటు. ముందుగ డిజైను గీయడానికి వెల్డింగుపనిలో వాడే పెద్ద లోహపు రేకు. (కో. 2, 6, 8, 10, 12, 15, 22, 28; తె. 24; రా. 4, 10, 12, 14, 15).

ప్లేటు[2]: చూ. పర్యా. జాలిప్లేటు. పెట్రొమాక్స్‌లైటు భాగాలు ఊడిరాకుండ బిగించడానికి ఉపయోగించే సాధనం. (తె. 22).

ప్లేటు[3]: చూ. పర్యా కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి ఉపయోగపడే మోపు. (కో. 18).

ప్లేటు[4]: చూ. పర్యా. కంచం. అన్నం తినడానికి వాడే లోహపు పాత్ర. చూ. చిత్రం 214. (కో. 1, 29; తె. 15).

ప్లేటు[5]: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గులపొయ్యిలో బూడిద రాలడానికి వాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 59. (రా. 13).

ప్లేటు[6]: చూ. పర్యా. అట్లపెనం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (కో. 4, 9).

ప్లేటు[7]: ఉ. ప్లేట్. చూ. పర్యా. పరాతం. శుభకార్యాల్లో వస్తువులు తీసుకెళ్ళడానికి, పిండి కలపడానికి, వేడి వస్తువుల్ని చల్లార్చడానికి వాడే వెడల్పు పళ్ళెం. చూ. చిత్రం 150. (కో. 3, 13, 16, 20, 27–30; తె. 13; రా. 4, 6, 8, 12, 14).

ప్లేటు[8]: చూ. పర్యా. అరివేణి. సంధ్యావార్చుకునేటప్పుడు పూజాసామగ్రిని ఉంచుకోడానికి ఉపయోగించే రాగిపళ్ళెం. (కో. 21; రా. 16).

ప్లేమ్‌రింగు: చూ. ఫ్లేమ్‌రింగు. (కో. 28).

ప్లేయర్: సైకిల్‌చైను పిడి చేయడానికి వాడే సాధనం. (తె. 13).

ప్లైప్రెస్: వెల్డింగ్‌పనిలో బెండింగ్‌చేయడానికి వంచుకోడానికి పనికివచ్చే పరికరం. (రా. 7).

ప్లోరు: చూ. ఫ్లోరు. (రా. 11).

## ఫ

ఫక్కా: చూ. పర్యా. అడ్డ. ట్రంకుపెట్టె అడుగుభాగపు ప్రక్కరేకు. (కో. 22).

ఫంకా: చూ. పంకా. (కో. 16, 18–26; తె. 25).

ఫణ: చూ. పన. (రా. 13).

ఫర్మా: చూ. పర్మా. (కో. 26).

ఫ్యాన్సీగ్లాసు: (< ఇం. Fancy glass) రకరకాల డిజైన్లున్నగ్లాసు. (కో. 18).

ఫ్యాన్సీప్లేటు: పర్యా. బీడింగ్‌ప్లేటు, బొంబాయిప్లేటు[2]. పాత్రలపై మూతగా ఉపయోగపడే డిజైన్లున్న పళ్లెం. (కో. 25).

ఫ్యాన్సీబేసిన్: రకరకాల డిజైనులుండే బేసిన్. (తె. 2).

ఫిట్‌చేయు: (క్రి.) (< ఇం. Fit + చేయు) చూ. పర్యా. జంటించు. రిపేరుచేసిన తాళంకప్పును ఘరల బిగించడం. (కో. 16).

ఫినిషింగ్: (ఇం.) బీరువాను పూర్తిగా తయారుచేసిన స్థితి. (రా. 6).

ఫినిషింగ్‌ఉలి: (< ఇం. Finishing + ఉలి) రూ. పినీషింగ్‌ఉలి. అండాల తయారీలోను, స్పిన్నింగ్ పనిలో షేపువచ్చిన రేకును పూర్తిగా ఆకారం తేవడానికి వాడే పరికరం. (రా. 14, 16).

ఫిల్టరు: (ఇం.) రూ. పిల్టరు. చూ. పర్యా. తుడువేగి చెన్ని. కాఫి, టీ పడగట్టడానికి వాడే పరికరం. (కో. 20, 24, 27; రా. 11).

ఫెడరింజి: (ఇం.) చూ. పెడల్‌రింజి. (కో. 7).

ఫెడల్‌రింజి: (ఇం.) చూ. పెడల్‌రింజి. (కో. 3).

ఫెడలు: (ఇం.) చూ. పర్యా. ఉడ్‌ఫెడిలు. సానరాయి తిరగడానికి చక్రాన్ని కాలితో తొక్కడానికి అమర్చిన సాధనం. (తె. 22, 24; రా. 14).

ఫెడిలు: చూ. పెడలు. (తె. 23; రా. 14).

ఫేసు: వెల్డింగ్‌మిషన్‌కు అమర్చి ఉండే హోల్డరువైరు. (తె. 6).

ఫైట్‌చేయు: (క్రి.) రేకును మోటుపేయడం. (కో. 18).

ఫైబరు: పెట్రొమాక్స్‌లైట్‌లో పిన్ను ఎక్కించడానికి, తగ్గించడానికి ఉపయోగించే నల్లనిప్లాస్టిక్ నట్టు. (తె. 1).

ఫైల్‌చేయు: (క్రి.) పర్యా. మైలతీయు. లోహపు రేకులపై హెచ్చుతగ్గులుండే ఆకురాయితో సరిచేయడం. (తె. 21).

ఫైలింగ్‌బీరువా: ఫైళ్ల పెట్టుకోడానికి కార్యాలయాల్లో వాడే అనేక అరలున్న బీరువా. (తె. 25).

ఫైలు: (ఇం.) చూ. పర్యా. ఆకురాయి. పూర్తయిన లోహపు వస్తువులను రాయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 18. (కో. 18, 19, 25, 26; తె. 5; రా. 12, 16).

ఫైలుచేయు: (క్రి.) చూ. పర్యా. తరగదీయు. పాత్రల అతుకులను కనపడకుండ ఆకురాయితో సాపు చేయడం. (తె. 6).

ఫైవర్: అర్తుకాకుండ టార్చిబల్బుచుట్టూ అమర్చిన ఎర్రని రింగు. (తె. 2).

ఫోక్సింగ్‌కటోర: (< ఇం. Focussing + కటోర) చూ. పర్యా. కటోరి[1]. వెలుతురు బాగా రావడానికి టార్చిలైట్ బల్బుచుట్టూ ఉండే తెల్లనిరేకు. (తె.17).

ఫోర్‌బాక్సు: ఇం. మట్టిని మెత్తగా చేయడానికి వాడే పనిముట్టు. (రా. 11).

ఫోల్డింగ్‌ప్లేయర్: (ఇం.) రేకులను, కడ్డీలను మడత వేయడానికి, తీయడానికి ఉపయోగించే పనిముట్టు. (తె. 24).

ఫ్రాకేషన్‌వర్కు: (ఇం.) చూ. పర్యా. గ్రిల్‌వర్కు. డిజైన్‌చేసి ఇనపవస్తువులు తయారుచేసే పని. (కో. 22; తె. 6, 19).

ఫ్రిజ్‌బాటిలు: (ఇం.) చూ. ప్రిజ్‌బాటలు. (కో. 18, 19, 22).

ఫ్రేము: (ఇం.) చూ. పర్యా. ఆంగ్లేరు. వెల్డింగ్ డిజైన్ల ఫ్రేముచుట్టూ అమర్చే 'V' లేదా 'L' ఆకారపు కడ్డీ.

ఫ్రేములేపు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. వంచిన డిజైను పట్టీలన్ని కలిపి ఒక ఫ్రేముకు తయారు చేయడం. (తె. 21).

ఫ్రేమువర్కు: (ఇం.) చూ. పర్యా. గ్రిల్‌వర్కు. డిజైన్‌చేసి ఇనపగేట్లు, వరండాలు వగైరాలు తయారుచేసే పని. (కో. 23).

ఫ్రైపాను: (ఇం.) రూ. ప్రైపాను, ప్రైపెను. చూ. పర్యా. చిన్నమూకుడి. కోడిగుడ్డు అట్లు చేయడానికి ఉపయోగించే కాడఉన్న గుండురేకు పరికరం. (కో. 17, 23).

ఫ్లక్సుఊడగొట్టు: (క్రి.) చూ. పర్యా. అగరుగొట్టు. వెల్డింగ్ అయినతర్వాత బుడిపెలను తీసివేయడం. (తె. 22).

ఫ్లక్సుతీయు: (క్రి.) చూ. పర్యా. ఇదిరించు. పాత్రలకు వెల్డింగ్ పూర్తయిన తర్వాత పైనఉండే బొడిపెలను తీసివేయడం. (తె. 7).

ఫ్లక్సురాలగొట్టు: (క్రి.) (ఇం.) చూ. పర్యా. అగరుగొట్టు. వెల్డింగ్ అయిన తర్వాత బుడిపెలను తీసివేయడం. (తె. 19).

ఫ్రింటుపేపరు: (ఇం.) గరుకుగా ఉండే కాగితం. పాత్రలకు మెరుగుపెట్టడానికి ఉపయోగం. (కో.28).

ఫ్లేమ్‌రింగు: (ఇం.) రూ. ప్లేమ్‌రింగు. చూ. పర్యా. గిన్నె[2]. స్టౌలో బర్నర్‌మంటను అదుపులో ఉంచడానికి అమర్చిన రింగు. (తె. 5, 17, 21).

## బ

బకిట్: (ఇం.) చూ. బకెటు. నీళ్ళు తోడడానికి వాడే బొక్కెన. (కో. 13, 25).

బకెటు: (ఇం.) ఉ. బకీట. బకీటు. రూ. బకిట్, బకెట్టు, బక్కెటు, బక్కెట్టు, బక్కెట్స్. పర్యా. బాల్చి, బొక్కెన, బోలెం, సాదాబక్కెట్లు. నూతిలో నుంచి నీళ్ళు చేదడానికి వాడే సాధనం. (కో. 2, 4, 17, 20-27, 29, 30).

బకెట్టు: చూ. బకెటు. (కో. 19, 28).

బక్కెటు: ఉ. బక్కెట్; బక్కెటి. చూ. బకెటు. (కో. 2, 5, 6, 10; తె. 16).

బక్కెట్టు: చూ. బకెటు. (కో. 1, 3, 4, 7-12; 14, 15).

బక్కెట్లకరవాయి: చూ. పర్యా. ప్లాట్‌కరవాయి. బక్కెట్లు తయారుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 6, 10, 12).

బక్కెట్స్: చూ. బకెటు. (కో. 14, 15).

బగవోని: చూ. బొగాని. (తె. 3).

బగారించు: (క్రి.) చూ. పర్యా. తాల్పుఏయు. తయారైన వంటకాలను తిరగమాత పెట్టడం. (తె. 3).

బగులుకొట్టు: (క్రి.) చూ. పర్యా. వాటంవేయు. పాత్ర అడుగుభాగం తయారీకి రేకును భోలు

దిమ్మెతో కుదించి గుంతగా చేయడం. (తె. 20 21).
బగులుచేయు: (క్రి.) చూ. పర్యా. నాటంవేయు. లోహపురేకును పాత్ర ఆకారంగా తయారుచేయడం. (తె. 17, 19).
బగులుతీయు: (క్రి.) చూ. పర్యా. నాటంవేయు. లోహపురేకును పాత్ర ఆకారంగా తయారుచేయడం. (తె. 18, 20).
బగులుసుత్తె: చూ. పర్యా. డొల్కసుత్తె. ఇత్తడి రేకును బగులుతీయడానికి వాడే పనిముట్టు. అడుగు భాగం కొద్దిగ చదరంగ ఉంటుంది. (తె. 21).
బగోనాస్టాండు: (< హిం. + ఇం. Sand) చూ. పర్యా. కంచాలస్టాండు. పళ్ళాలు, గ్లాసులు, గరిట్లు ఉంచడానికి ఉపయోగించే ఇనుపపట్టీల పరికరం. చూ. చిత్రం 220. (కో. 20, 29).
బగోని: కూజా ఆకారంలో ఉండే చిన్న స్టీలుపాత్ర. నూనె పోసుకోడానికి ఉపయోగం. (కో. 29).
బగ్గీలదిమ్మ: కడ్డీలను 'L' ఆకారంగా వంచడానికి వాడే సాధనం. (కో. 23).
బంకమట్టి: చూ. పర్యా. జిగురుమట్టి. శిల్పపనిలో మైనంతో తయారయిన మూర్తిపై ఉపయోగించే మట్టి. (కో. 6).
బంగళాసుత్తి: రూ. బంగాలీసుత్తి. మోట సాపు చేయడానికి వాడే దిమ్మె ఆకారంలోఉండే పరికరం. (కో. 21).
బంగాలీసుత్తి: చూ. బంగళాసుత్తి. (కో. 20).
బంగిడి: ఉ. బంగిది. చూ. బంగోడి². (తె. 6, 10, 17).
బంగోడి¹: పర్యా. ముక్కుసుత్తె. నూనెపెనెలు తయారు చేయడానికి వాడే పనిముట్టు. (తె. 11).
బంగోడి²: (హిం.) రూ. బంగిడి. రేకులను కుదించడానికి ఉపయోగించే ఇనపరోలు. (తె. 3, 10).
బచ్చలిప్లేటు: (< బచ్చలి + ఇం. Plate) చూ. పర్యా. కాలువచక్కి. కాలువల్లోకి చెత్తాచెదారం వెళ్ళకుండ అడ్డంపెట్టడానికి వాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 51. (రా. 10).
బచ్చాలపెనం: చూ. పర్యా. అట్లపెనం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (రా. 14, 16).
బచ్చాలరేకు: చూ. పర్యా. అట్లపెనం. దోసెలు, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 6. (తె. 2).
బట్‌జాయింటు: రెండురేకులను ఎదురెదురుగ జాయింటుచేయడం. (కో. 19).
బటన్: పర్యా. బెట్టు, మీట, మీటకమాను, పెక్కు. గొడుగును తెరచినపుడు పుల్లల రింగును పట్టడానికి గొడుగుమువ్వపై ఉండే పరికరం. (తె. 23, 25).
బటన్‌చాకు: (< ఇం. Button + చాకు) గుండీ నొక్కినపుడు తెరచుకొనే కత్తి. (కో. 20).
బటన్-రబ్బరు: (ఇం.) మూసినపుడు గొడుగుపై బట్టను చుట్టడానికి ఉపయోగించే సాధనం. (తె. 17).
బటను: టార్చిలైట్ వెలగడానికి వాడే స్విచ్‌మధ్యలో ఉండే నల్లనిబిళ్ళ. (తె. 17, 21).
బట్ట: పర్యా. గుడ్డ¹. గొడుగు పుల్లలను కప్పుతూ పైభాగాన అమర్చిన నల్లనిగుడ్డ. మీద నీళ్ళు పడకుండా ఆపుతుంది. (తె. 2, 4, 6).
బట్టకత్తెర: రూ. బట్టలకత్తెర. చూ. పర్యా. గుడ్డకత్తెర. బట్టలను కత్తరించడానికి వాడే సాధనం. చూ. చిత్రం 78. (తె. 1).
బట్టమొలు: చూ. పర్యా. చుక్కపోగరు. రేకు విగ్రహంపై చుక్కలు కొట్టడానికి వాడే పరికరం. (తె. 17, 25).
బట్టలకత్తెర: చూ. బట్టకత్తెర. (తె. 4).
బట్టలపెట్టె: చూ. పర్యా. ట్రంకుపెట్టె. బట్టలు ఉంచుకోడానికి వాడే పెట్టె. చూ. చిత్రం 119. (తె. 10, 11).
బట్టస్కేలు: (< బట్ట + ఇం. Scale) చూ. పర్యా. గుడ్డటేపు. బట్టలు కొలతలు వేయడానికి వాడే స్కేలు. చూ. చిత్రం 118. (తె. 20, 21, 23).
బట్టి¹: రూ. భట్టి. చూ. పర్యా. కరుగుకొలిమి. లోహాలను వేడిచేయడానికి ఉపయోగించే పొయ్యి. చూ. చిత్రం 69. (కో. 10, 14, 19, 21, 26; తె. 1–4, 6, 20–22; రా. 15).
బట్టి²: బీడీలు చేయడానికి వాడే సాధనం. (తె. 10, 11).
బతాణీజల్లెడ: బట్టీదగ్గర బతాణీలు జల్లి పట్టడానికి ఉపయోగించే సాధనం. (కో. 19).
బండ: నవాసాగరం, తగరం కలిపి ఉంచుకోడానికి ఉపయోగపడే రాయి. (తె. 1, 21).
బండపోగరు: లావుపాటి రివిట్లు తెగిపోకుండా, పప్పరు రేగకుండ కొట్టడానికి ఉపయోగించే సాధనం. (కో. 19).
బండిఇరుసు: పెద్దరింగులను రౌండు చేసుకోడానికి వాడే పరికరం. (కో. 15).
బండిగిల్లు: చూ. పర్యా. గిలక². సంగడిదిండు తిరగడానికి వాడే పరికరం. (తె. 23).
బండిచక్రం: చూ. పర్యా. గిలక². సంగడిదిండు

తిరగడానికి వాడే పరికరం. (తె. 17, 19, 23, 30).

బత్తాయి: చూ. పర్యా. కత్తి[1]. కూరగాయలు తరగడానికి వాడే పరికరం. (తె. 7, 18, 22; రా. 12, 16).

బత్తా[1]: రూ. భాతు. చూ. పర్యా. చిత్త. కొలిమికి గాలి రావడానికి ఉపయోగించే చర్మపుసంచి. (తె. 5).

బత్తా[2]: పొయ్యికి గాలి రావడానికి అమర్చిన పరికరం. ఒకడబ్బాలో నీళ్ళుపోసి మరొక డబ్బా బోర్లించి పైకి క్రిందికీ అంటూంటే గొట్టంద్వారా గాలి వస్తుంది. (కో. 23).

బత్తా[3]: రూ. భత్తా. టిన్‌గర్‌పనిలో కొలిమికి గాలిని అందించడానికి ఉపయోగపడే సాధనం. (తె. 23).

బత్తానికస్టాండు: (< బత్తానిక + ఇం. Stand) చూ. పర్యా. కంచాలస్టాండు. పళ్లాలు, గ్లాసులు, గరిట్లు ఉంచడానికి ఉపయోగించే ఇనుపపట్టీల పరికరం. చూ. చిత్రం 220 (తె. 11).

బత్తాయిచాకు: చూ. పర్యా. కత్తి[1]. కూరగాయలు కోయడానికి వాడే పరికరం. (కో. 21).

బత్తిస్టాండు: చూ. పర్యా. అగరుబత్తి. అగరుబత్తులు వెలిగించి గుచ్చి ఉంచడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 2. (కో. 1; తె. 1, 2).

బత్తీలగడ్డ: స్టౌలో వత్తులు అమర్చడానికి ఉపయోగపడే దిమ్మ. (తె. 3, 4).

బత్తీలస్టౌ: (< బత్తీల + ఇం. Stove) చూ. బత్తీస్టౌ. (తె. 17).

బత్తీస్టౌ: రూ. బత్తీలస్టౌ. పర్యా. వత్తులస్టౌ. వత్తుల ద్వారా మంటరావడానికి ఉపయోగపడేస్టౌ. (తె. 4)

బదర్‌రింజి: ఉ. బాదర్‌రింజి. సైకిల్‌పెడల్‌నట్టు బిగించడానికి ఉపయోగపడే స్పానరు. (కో. 13, 15).

బద్ద[1]: ఉ. బద్ది, బద్దీ, బద్దె. చూ. పర్యా. పట్ట[1], లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లావుపాటి ఇనుపముక్క. చూ. చిత్రం 71. (కో. 2, 10, 11, 20, 26, 29, 30; తె. 1, 3, 5, 17, 21; రా. 2).

బద్ద[2]: రూ. బద్దీ, బద్దె[1]. చూ. పర్యా. పట్టి[1]. రేకుపై కొలతలు తీయడానికి ఉపయోగించే రేకుస్కేలు. (కో. 2, 4–6, 9, 11, 19, 24, 25; రా, 2, 7, 8).

బద్ద[3]: ఉ. బద్దె. చూ. పర్యా. పట్కార. లోహపు రేకులకు జాయింట్లుచేసే పల్లును వంచడానికి వాడే సాధనం. (కో. 14).

బద్ద[4]: పర్యా. బేల్‌కట్టు. అచ్చుకట్టేటప్పుడు పోత అచ్చులపై ఉండే మట్టిని సాపుచేయడానికి ఉపయోగపడే పల్చని ఇనుపపట్టి. (కో. 19; తె. 23).

బద్దఆకురాయి: శిల్పపనిలో విగ్రహం అడుగుభాగం రాయడానికి వాడే పరికరం, (తె. 9, 13).

బద్దకుసి: కాగిన ఇనుపబద్దలపై రంధ్రాలు వేయడానికి ఉపయోగించే సాధనం. (కో. 20).

బద్దపోగరు: కంటి అద్దాలకు, రివిట్లు తీయడానికి ఉపయోగించే పరికరం. (కో. 2).

బద్దలుచేయు: (క్రి.) రిపేరికోసం బీగాన్ని పగులగొట్టడం. (కో. 16).

బద్దవాలుపోగరు: విగ్రహాన్ని డిజైనుగా చేయడానికి ఉపయోగపడే కడ్డీ. (కో. 6).

బద్ది. చూ. పర్యా. దార్లబద్దీ. బీరువా అంచులు వంపులు లేకుండ సరిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 15).

బద్దీ: చూ. బద్ద[2]. (కో. 26).

బద్దులు: చూ. పర్యా. దేబద్దీ. ట్రంకుపెట్టెలో బొద్దులు దింపడానికి ఉపయోగపడే పరికరం. (కో. 5).

బద్దె[1]: చూ. బద్దీ[2]. (కో. 8; తె. 20).

బద్దె[2]: చూ. పర్యా. ఇనుపదుక్క. డిజైన్లు చేయడానికి ఉపయోగపడే చిన్న ఇనపబద్ద. (కో. 4).

బద్దె[3]: ఉ. బద్ది, బద్దీ. రేకుపై బొద్దుకొట్టడానికి వాడే పొడవుపాటిపట్టి. (కో. 8, 10, 13, 17–19, 28; తె. 17, 21; రా. 15).

బద్దె[4]: ఉ. బద్దీ. చూ. పర్యా. కత్తి[8], వెల్డింగ్ ఉబ్బలను కొట్టడానికి వాడే పరికరం. (కో. 22; తె. 22).

బంతికమ్మి: పర్యా. బల్ల, వళాఉలి. లోహపు పాత్రలకు పాలిష్ పట్టడానికి ఉపయోగపడే రింగు కమ్మి. (కో. 10, 14, 19).

బందకల: ఉ. బందకాల. రూ. బందకళ. చూ. పర్యా. తేనెమైనం. లోహపు పాత్రలపై రంధ్రాలను చూడ్డానికి పూతగాపూసే జిగురుపదార్థం. (కో. 26; తె. 1).

బందకలాయి: చూ. బందకళాయి. (తె. 2).

బందకళ: చూ. బందకల. (కో. 16, 20; తె. 8, 7).

బందకళాయి: రూ. బందకలాయి. చూ. పర్యా. తేనెమైనం. లోహపు పాత్రలపై రంధ్రాలను చూడ్డానికి పూతగాపూసే జిగురుపదార్థం. (కో. 16, 20; తె. 7).

బందకం: చూ. పర్యా. తేనెమైనం. లోహపు పాత్రలపై రంధ్రాలను చూడ్డానికి పూతగాపూసే జిగురుపదార్థం (తె. 3).

బందగాలుపొట్లం: చూ. పర్యా. తేనెమైనం. లోహపు

పాత్రలపై రంధ్రాలను మూడ్డానికి పూతగాపూసే జిగురుపదార్థం. (కో. 25).

బందులు: (ఏ.) బందు. చూ. పర్యా. కబ్జాలు. పెట్టె అడుగుభాగాన్ని, మూతభాగాన్ని కలిపే సన్నని కీళ్ళు. (కో. 16, 18).

బందోబస్తు: చూ. పర్యా. కమాని. పెట్టెను తెరిచి నపుడు మూత పడిపోకుండ ఉండటానికి ఇరుమూలల అమర్చిన పట్టీ(లు). (రా. 12).

బఫ్పింగ్ మోటారు: (ఇం.) లోహపు పాత్రలను పాలిష్ చేయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 4, 6, 9).

బంపర్: పర్యా. మాండల్. పాత్ర ఆకారాన్ని తయారు చేయడానికి స్పిన్నింగ్ మిషన్‌కు అతికిఉండే అచ్చు. (రా. 14).

బంబర్ చట్టం: అల్యూమినియం పాత్రల తయారీలో ఉపయోగపడే పరికరం. (కో. 6).

బయలరు: (< ఇం. Boiler) ఉ. బయిలర్, బాయ్లర్, బాయిలర్, బాయిలెర్, బైలరు. రూ. బాయిలర్లు. చూ. పర్యా. గప్పకా. నీళ్ళు కాచుకో డానికి వాడే సాధనం. చూ. చిత్రం 173. (తె. 3, 8, 9, 11, 12, 17, 20, 25; రా. 9, 12, 14).

బరకట్ గెడ్డపార: బకెట్లు జాయింట్ చేసే పరికరం. (కో. 5).

బరం: చూ. పర్యా. పట్కారు. లోహపు రేకులకు జాయింట్లుచేసే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలివుంటుంది. (కో. 17; తె. 24).

బరిణె: ఉ. బరిణి. చూ. బరిణె. (కో. 25-27; 29).

బరిషి: చూ. భరిణె. (కో. 28).

బరువు: తిరిగేటప్పుడు బర్మాను పట్టుకోడానికి ఆధారంగా పైభాగంలో ఉండే దిమ్మ. (తె 18).

బరువుసదరం: పర్యా. రెండో పట్టుకమ్మి. తరిణి పనిలో రెండోసారి సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 28).

బరువుసుత్తి: చూ. పర్యా. దొల్కసుత్తె. బిందె దొడ్డి భాగం అణచడానికి వాడే పనిముట్టు. అడుగుభాగం కొద్దిగ చదరంగా ఉంటుంది. (కో. 23).

బర్తన్: (< హిం.) మధ్యలో కొద్దిగ లోతు ఉండే పళ్లెం. మహమ్మదీయులు అన్నంతినడానికి వాడ్తారు. (తె. 5).

బర్నర్‌కప్పు: చూ. పర్యా. గిన్నె⁶. స్టౌలో బర్నర్ మంటను అదుపులో ఉంచడానికి అమర్చిన రింగు. (కో. 4, 9).

బర్నర్‌సాకెటు: (< ఇం.) బర్నర్‌ను అమర్చడానికి పైపుకు బిగించబడిన పరికరం. (తె. 3).

బర్నరు: (ఇం.) రూ. బర్నలు. చూ. పర్యా. పువ్వు². స్టౌలో మంట రావడానికి, పెట్రొమాక్స్‌లైట్‌లో మెంటల్‌కు గ్యాస్‌ను అందించడానికి అమర్చిన పరికరం. (కో. 21, 25, 26, 28-30; తె. 3).

బర్నర్‌గడ్డ: బర్నర్‌ను బిగించడానికి బర్నర్‌కింద అమర్చిన దిమ్మ. (తె. 4).

బర్నల్‌కమ్మి: (< ఇం. బర్నర్ + కమ్మి) చూ. పర్యా. పోక్సుకమ్మి. స్టౌబర్నల్‌ను శుభ్రం చేయడానికి వాడే పరికరం. (రా. 5).

బర్నల్‌గిన్నె: చూ. పర్యా. గిన్నె⁶. స్టౌలో బర్నర్ మంటను అదుపులో ఉంచడానికి అమర్చిన రింగు. (తె. 19).

బర్నల్‌చాబి: బర్నర్‌మంటను అదుపులో ఉంచడానికి బర్నర్‌కింద అమర్చిన పరికరం. (తె. 4).

బర్నల్‌పాన: చూ. బర్నల్‌స్పానరు. చూ. చిత్రం 197. (తె. 19, 22-24).

బర్నల్‌పైపు: స్టౌబర్నర్‌ను శుభ్రం చేయడానికి ఉపయోగపడే పరికరం. (తె. 17).

బర్నల్‌రింగు: చూ. పర్యా. గిన్నె⁶. స్టౌలో బర్నర్ మంటను అదుపులో ఉంచడానికి అమర్చిన రింగు. (తె. 5).

బర్నల్‌స్పానరు: రూ. బర్నల్‌పాన. చూ. పర్యా. రించి. స్టౌ బర్నర్‌నట్లు బిగించడానికి వాడే సాధనం. చూ. చిత్రం. 197. (కో. 2).

బర్నలు: చూ. బర్నరు. (తె. 4-6, 17-24).

బర్నీ[1]: చూ. భరిణె. (కో. 15).

బర్నీ[2]: టిఫెన్ ఉంచుకోడానికి వాడే క్యారీరు. (కో. 12).

బర్మ: ఉ. బర్మా. రూ. బరం. చూ. పర్యా. కరెంటు డ్రిల్‌మిషన్. లోహపురేకులపై, పట్టీలపై రంధ్రాలేయడానికి వాడే కరెంటు యంత్రం. (కో. 24; తె. 18, 22).

బర్మల్: చూ. పర్యా. కన్నం. కరిగిన లోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి ఏర్పాటుచేసిన రంధ్రం. (తె. 8, 9).

బర్మా: చూ. పర్యా. చేతి డ్రిల్‌మిషన్. కరెంటు లేనపుడు లోహపురేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే చేతి పరికరం. (తె. 22).

బర్సులు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బొడిపెలు. (తె. 17).

బల్‌పాన : వెల్డింగ్‌పనిలో వడివేయడానికి వాడే పరికరం. (తె. 6).

బల: (బ.) బలలు. బండి ఇరుసును అమర్చడానికి చక్రం మధ్యలో ఉండే ఇనపగొట్టం. (తె. 1, 5).

బలపపిండి : విగ్రహం తయారీలో వాడ్తారు. (తె. 8, 13).

బలపం: చూ. పర్యా. కనికపుల్ల. రేకుపై డిజైన్‌ను, కొలతలను వేయడానికి వాడే సుద్దముక్క. (తె. 23; రా. 8).

బలించు[1]: (క్రి.) చూ. బల్లించు. (తె. 16, 18).

బలించు[2]: (క్రి.) సుత్తితో గంగాళాలకట్లు తయారు చేయడం. (తె. 8, 9).

బలింపుచేయు: (క్రి.) తయారైన కంచుతల్లె మధ్య భాగాన్ని అడుగునుండి కొద్దిగ ఉబ్బెత్తు చేయడం. (తె. 17).

బలింపుసుత్తి : రేకులోపలనుంచి లోతుకొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 7).

బలీయు: చూ. పర్యా. బల్లించు. విడిగా ఉన్న రెండు రేకులను కలిపి ఒకటిగా బిగించడం. (తె. 21).

బల్ల[1]: చూ. పర్యా. బంతికమ్మి. లోహపుపాత్రలకు పాలిష్ పట్టడానికి ఉపయోగపడే రింగుకమ్మి. (రా. 1, 2, 4-6, 8-10, 12).

బల్ల[2]: బొద్దుపని చేసేటపుడు ఉపయోగించే వెడల్పయిన కొయ్య. (కో. 28).

బల్ల[3]: బోతపనిలో గంటంకు అమర్చి ఉండే కొయ్య. దీని పైననే మట్టిఅచ్చు నిలబడుతుంది. (కో. 28).

బల్ల[4] : గింజలు కొలవడానికి వాడే ఇనపముంత. (రా. 3).

బల్ల[5]: నవాచారం. తగరం కలిపి ఉంచుకోడానికి ఉపయోగపడే పరికరం. (కో. 28).

బల్లకట్టమెరుగు: చూ. పర్యా. క్లాత్ ఎమిరీపేపరు. మెరుగు రుద్దడానికి ఉపయోగించే కాగితం. (రా. 1).

బల్లపైస్: తాళంచెవిని కోసేటప్పుడు బిగువుగ ఉండడానికి వాడే పనిముట్టు. (కో. 19).

బల్లిచ్చు: చూ. బల్లించు. (తె. 14).

బల్లించు: (క్రి.) ఉ. బల్లెంచు. రూ. బలిచ్చు, బలించు[1]. పర్యా. బలీయు, మోపుచేయు. విడిగాఉన్న రెండు రేకులనుకలిపి ఒకటిగా బిగించడం. (కో. 22-24, 26; తె. 3, 17).

బల్లింపుదుంగ: చూ. పర్యా. కట్ట. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 14).

బల్లింపుసుత్తె: చూ. పర్యా. కమ్మరసుత్తె. లోహపు రేకులను సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 8; తె. 17).

బళ: చేతికి తొడగడానికి దేవునిబిళ్ళ కలిగిన రాగి కడియం. (రా. 15).

బవుల్స్: ఉ. బౌల్స్. చూ. బౌల్. (కో. 2; తె. 15,16).

బహుమతికప్పులు: (< బహుమతి + ఇం.Cup + లు) చూ. పర్యా. ప్రైజుకప్పులు. బహుమతులివ్వడానికి చేసిన లోహపు సాధనాలు. (కో. 19).

బాకిట్లు: (< ఇం.) చూ. పర్యా. కటోరి[3]. ట్రంకుపెట్టె కింద మోపకుండ చేసిన బుడిపెలు. (కో. 22).

బాక్సు[1]: (< ఇం.) చూ. పర్యా. కానా. డిజైన్ ఫ్రేములో ఉండే ఒక్కొక్క డిజైను అర. (కో. 25; తె. 6).

బాక్సు[2]: (ఇం.) చూ. పర్యా. చెక్కతొట్టి. పోత పాత్రను తయారుచేయడానికి వాడే కొయ్యచట్రం. (తె. 20).

బాగలకిస్తి: పెద్ద నీళ్ళపాత్ర. (తె. 8, 9).

బాగసుత్తె: రూ. భాగసుత్తె. ఇనుపవస్తువులు తయారు చేయడానికి వాడే పనిముట్టు. (తె. 10).

బాగాలడబ్బా: రూ. భాగాలడబ్బా. వక్కపొడి డబ్బా. (తె. 8, 9, 15).

బాజిల్: చూ. పర్యా. గరిటె[1]. కూరలు వడ్డించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63. (కో. 13, 15).

బాజీచెంజా: చూ. పర్యా. గరిటె[1]. కూరలు వడ్డించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63. (కో. 4).

బాజీస్పూను: చూ. పర్యా. పంజాబ్ హస్తం. కూరలు వడ్డించడానికి వాడే కోడిగుడ్డు ఆకారపు గరిట. మహమ్మదీయులు వాడ్తారు. (కో. 6; 11, 18).

బాటమ్‌చెక్క: (< ఇం. Bottom + చెక్క) సాన మిషన్‌ను ఉంచడానికి ఉపయోగపడే కొయ్య. (తె. 4).

బాటమ్‌సొరుగు: (< ఇం. Bottom సొరుగు) పర్యా. లెగ్‌స్క్రెట్. బీరువా అడుగుభాగంలో కాళ్ళకు ముందు ఉండే అర. ఇది బీరువా కాళ్ళరేకుతో కలిసిపోయి ఉంటుంది. (తె. 20).

బాటరి: (ఇం.) ఉ. బాటరీ, బ్యాటి. చూ. పర్యా. టార్చిలైటు. చీకట్లో వెల్తురుకోసం ఉపయోగపడే పరికరం. (తె. 3, 4, 22, 24).

బాటరిగిన్నె: (< ఇం. Battery + గిన్నె) చూ. పర్యా. కటోరి[1]. వెలుతురు బాగా రావడానికి వాడే టార్చిలైట్ బల్బుచుట్టూఉండే తెల్లటి రేకు. (తె.24).

బాటరి అంబోజింగ్‌మిషను: (ఇం.) పర్యా. బాడీ

అంబోజింగ్ మిషను. సాదా రేకును డిజైను వంచుకోడానికి ఉపయోగపడే మిషను. (రా. 7).

బాటంకార్నర్ కటింగ్ మిషను: (ఇం) పర్యా. బాడీకార్నర్ కటింగ్ మిషను. డబ్బాసైడ్సు రేకును కత్తరించడానికి వాడే మిషను. (రా. 7).

బాటంపాన: (ఇం.) చూ. పర్యా. చెక్కునట్టుస్పానర్. సైకిల్ కిందిభాగాన ఉన్న కప్పులను బిగించడానికి వాడే స్పానరు. (తె. 8, 11-13).

బాటంరింజి: (ఇం.) సైకిల్ కిందిభాగాన ఉన్న కప్పులను బిగించడానికి ఉపయోగపడే పరికరం. (కో. 7, 13-15).

బాటంస్పానర్: (ఇం.) చూ. పర్యా. చెక్కునట్టు స్పానర్. సైకిల్ కిందిభాగాన ఉన్న కప్పులను బిగించడానికి వాడే పరికరం. (కో. 1, 3).

బాడర్‌పుల్లి: పర్యా. రౌండుపులేలు. బీరువాల గోడలు గుండ్రంగా వంచడానికి ఉపయోగించే పడగ ఆకారమున్న పరికరం. (కో. 18).

బాడి[1]: (ఇం.) చూ. పర్యా. గొట్టం[4]. టార్చిలైట్‌లో బాటరీలను ఉంచడానికి ఉపయోగించే స్విచ్ ఉన్న భాగం. (తె. 22).

బాడి[2]: (ఇం.) పూర్తిగా తయారయిన బీరువా. (తె. 6-8).

బాడి[3]: (ఇం.) తాళం మధ్యభాగం. (కో. 23).

బాడి[4]: (ఇం.) సానరాయి, చక్రం అమరి ఉండడానికి ఉపయోగపడే చక్రం. (రా. 14).

బాడి అంబోజింగ్ మిషను: (ఇం.) చూ. పర్యా. బాటం అంబోజింగ్ మిషను. సాదారేకును డిజైను వంచుకోడానికి ఉపయోగపడే మిషను. (రా. 7)

బాడిచట్టంచరు: చూ. పర్యా. అచగోలు. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లోహపు దిమ్మ. (తె. 8, 9, 12).

బాడిసుత్తి: రూ. బాడ్సిసుత్తె. చూ. పర్యా. పలచని సుత్తి. బిందెమూతులు, అడుగుల సాపుచేయడానికి వాడేసుత్తి. చూ. చిత్రం 153. (తె. 17).

బాడిసె: లోహపురేకులు ఊడదీయడానికి, ముద్దగ చేయడానికి, కత్తిపిడులు చెక్కుకొనడానికి ఉపయోగపడే పనిముట్టు. (కో. 10, 15, 22; తె. 21; రా. 4).

బాడీకార్నర్ కట్టింగ్ మిషన్: (ఇం.) చూ. పర్యా. బాటంకార్నర్ కటింగ్ మిషన్. నూనెడబ్బా సైడ్సు రేకును కత్తరించడానికి ఉపయోగపడే మిషను. (రా. 7).

బాడ్సిసుత్తె: చూ. బాడిసుత్తె. (తె. 19).

బాడ్సెపట్టేకారు: కమ్మరం పనిలో బాడ్సెలు పట్టడానికి వాడే పనిముట్టు. తలభాగం వంపుతిరిగి ఉంటుంది. (తె. 23).

బాణ్ణవా: చూ. పర్యా. కడాయి. పిండి వంటలు చేయడానికి వాడే ఇరువైపులా పిడి అమర్చిన లోహపు పాత్ర. చూ. చిత్రం 164. (తె. 7).

బాండ్‌సెల్: బీరులో ముఖ్యమైన కాగితాలు పెట్టుకోడానికి సెల్ఫ్‌కింద అమర్చిన పరొక అర. (తె. 2).

బాండి: ఉ. బాండీ. చూ. బాండ్లి. (తె. 21; రా. 15).

బాండ్లి: ఉ. బాండల్, బాండాలు, బాండిల్, బాండెలి. రూ. బాండి. బాణలి. చూ. పర్యా. కడాయి. పిండి వంటలు చేయడానికి వాడే ఇరువైపులా పిడి అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం 163. (కో. 1-10; తె. 1-4, రా. 4, 6, 8, 10-12).

బాత్: చూ. పర్యా. డాబు. ట్రంకుపెట్టె మూత వంగకుండ లోపలిభాగాన కొట్టిన నిలువురేకు. (కో. 22).

బాత్‌కొట్టు: (క్రి.) పెట్టె వంగకుండ ఉండడానికి పొడవుగా పట్టీకొట్టడం. (కో. 22).

బాతుముట్టుకారు: చూ. పర్యా. జవకర. చిన్నచిన్న లోహపు వస్తువులను పట్టుకోడానికి, రిపేరి చేయడానికి వాడే పరికరం. (కో. 18).

బాదమాకు: రూ. బాదంఆకు, బాదామిఆకు. బాదంఆకు ఆకారంలో ఉన్న అంచులేని భోజనం పళ్లెం. (కో. 11, 12, 25, 28, 29).

బాదంఆకు: చూ. బాదమాకు. (కో. 4, 9, 20).

బాదంకంచం: చూ. బాదామికంచం. (కో. 5, 6, 10-12).

బాదంకాయకంచం: చూ. పర్యా. బాదామికంచం. బాదంకాయ ఆకారంతో తయారుచేసిన పళ్లెం. అన్నంతినడానికి ఉపయోగం. చూ. చిత్రం 175. (కో. 3, 4, 9).

బాదంకాయప్లేటు: (< బాదంకాయ + ఇం. Plate) పాత్రలపై మూతకు ఉపయోగపడే తట్ట. (కో. 3).

బాదంకాయపూలసజ్జ: పర్యా. బాదంపూలబుట్ట. దేవాలయానికి పూజాసామగ్రిని తీసుకెళ్ళడానికి ఉపయోగపడే బాదంకాయ ఆకారపు బుట్ట. (కో. 6).

బాదంకొబ్బరితురుము: కొబ్బరితురమడానికి వాడే పరికరం. బాదంకాయ ఆకారంలో ఉంటుంది. చూ. చిత్రం 174. (కో. 4).

**బాదంగిలాసా: (< బాదం + ఇం. Glass) బాదంకాయ ఆకారంతో ఉండే లోటా. (తె. 3).**

బాదంట్రే: (<బాదం+ఇం. Tray) బాదంఆకు అకారంతో ఉండే తట్ట. ఆకులు, వక్కలు ఉంచుకోడానికి కూడా ఉపయోగం. (కో. 4).

బాదంతట్ట: చూ. పర్యా. బాదామికంచం. బాదంకాయ ఆకారంతో ఉండే భోజనంప్లేటు. చూ. చిత్రం 175. (రా. 7, 11, 13).

బాదంతల్లె: చూ. పర్యా. బాదామికంచం. బాదంకాయ అకారంతో ఉండే భోజనంప్లేటు. చూ. చిత్రం 175. (తె. 3).

బాదంపళ్ళెం: రూ. బాదానిపళ్ళెం. చూ. పర్యా. బాదామికంచం. బాదంకాయ అకారంతో ఉంఢే భోజనంప్లేటు. చూ. చిత్రం 175. (కో. 7).

బాదంపూలబుట్ట: చూ. పర్యా. బాదంకాయపూలసజ్జ. దేవాలయానికి ఫలపుష్పాదులు తీసుకెళ్ళడానికిఉపయోగపడే బాదంకాయ ఆకారపు బుట్ట. (కో. 4, 8-11).

బాదంమొలు: రేకుపై బాదంగింజ ఆకారపు డిజైను కొట్టడానికి చెకనంపనిలో వాడే పరికరం. (తె. 25).

బాదంసేప్‌పోగరు: (<బాదం+ఇం. Shape+పోగరు) విగ్రహంపళ్ల చెక్కడానికి ఉపయోగపడే కడ్డీ. (కో. 6).

బాదానిపళ్ళెం: చూ. బాదంపళ్ళెం. (కో. 19).

బాదామి ఆకు: చూ. బాదమాకు. (కో. 20).

బాదామికంచం: రూ. బాదంకంచం. పర్యా. ఓవల్ కంచం, ఓవల్‌సేప్ కంచం, బాదంకాయ కంచం, బాదంతట్ట, బాదంతల్లె, బాదంపళ్ళెం. బాదంకాయ అకారంలో ఉంఢే భోజనంప్లేటు. చూ. చిత్రం 175. (కో. 11, 13, 15, 21, 24).

బాదియా: అంచు వెడల్పుగా, లోతుగా గిన్నెలాగ ఉండే లోహపు పాత్ర. కింద కుదురు ఉంటుంది. మహమ్మదీయులు అన్నంతినడానికి ఉపయోగిస్తారు. చూ. చిత్రం 176. (రా. 10, 12).

బాదు[1]: (క్రి.) పర్యా. మోటు ఏయు, మోదు. కడ్డీలను సాగ్గొట్టడానికి, మేకును బిగించడానికి సుత్తితో కొట్టడం. (కో. 20, 30).

బాదు[2]: (క్రి.) చూ. పర్యా. సమ్మెటేయు. కాలిన ఇనుమును సమ్మెటతో గట్టిగ కొట్టడం. (కో. 21, 25; తె. 24).

బాబరీలు: వెల్డింగ్ చేసినతర్వాత వచ్చిన వెల్డింగ్ ఉబ్బులు. (కో. 30).

బాంబే అన్నంగిన్నె: చూ. పర్యా. కుటకలకంచం. కూరలు వేసుకోవడానికి వీలుగా గుంటలమరి తయారుచేసిన లోహపు భోజనపాత్ర. చూ. చిత్రం 57. (కో. 1).

బాంబేక్యారీ: రూ. బాంబేక్యారీర్. అన్నం తీసుకెళ్ళడానికి ఉపయోగపడే క్యారియరు. (కో. 10).

బాంబేక్యారీర్: చూ. బాంబేక్యారీ. (కో. 6, 8, 11).

బాంబేగ్లాసు: నీళ్ళు తాగడానికి వాడే లోటా. (కో. 1).

బాంబేజగ్గు: త్రాగునీటికి ఉపయోగపడే పాత్ర. (కో. 1).

బాంబేడ్రమ్ము: పట్టుకోడానికి కాడలేనట్టి పాత్ర. నీళ్ళు కాచుకోడానికి వాడ్తారు. (కో. 15).

బోయలర్‌కరవాయి: చూ. పర్యా. గొలుసుకరవాయి. బాయలర్‌లను చేయడానికి వాడే పనిముట్టు. (కో. 2, 5; తె. 3, 12).

బాయలర్‌జాడి: బాయలర్ తయారీలో ఉపయోగపడే పరికరం. (తె. 10).

బాయలర్‌బిళ్ళ: చూ. పర్యా. దర్జ. బూడిద, నిప్పులు రాలకుండ బాయిలర్ అడుగుభాగాన అమర్చిన రంధ్రాలప్లేటు చూ. చిత్రం 173. 1. (కో. 14, 15).

బాయిలర్‌జల్లి: రూ. బాయిలర్‌జాలి. చూ. పర్యా. దర్జ. బూడిద, నిప్పులు రాలకుండా బాయిలర్ అడుగుభాగాన అమర్చిన రంధ్రాలప్లేటు. చూ. చిత్రం 173. 1. (తె. 25).

బాయిలర్‌జాలి: చూ. బాయిలర్‌జల్లి. (తె. 4).

బాయిలర్‌తట్ట: చూ. పర్యా. దర్జ. నిప్పులు, బూడిద రాలకుండ బాయిలర్ అడుగుభాగాన అమర్చిన రంధ్రాలప్లేటు. చూ. చిత్రం 173. 1. (రా. 2).

బాయిలర్‌ప్లేటు: ఉ. బాయిలర్‌ప్లేటు. చూ. పర్యా. దర్జ. నిప్పులు, బూడిద రాలకుండా బాయిలర్ అడుగుభాగాన అమర్చిన రంధ్రాలబిళ్ళ చూ. చిత్రం 173. 1. (కో. 2, 19).

బాయిలర్‌రింగు: బాయిలర్ తట్టలు వేసుకోడానికి ఉపయోగపడే పనిముట్టు. (రా. 2).

బాయిలర్‌సత్రం: చూ. పర్యా. దర్జ. బూడిద, నిప్పులు రాలకుండ బాయిలర్ అడుగుభాగాన అమర్చిన రంధ్రాలప్లేటు. చూ. చిత్రం 173. 1. (కో. 19, 23).

బాయిలర్‌స్టాండు: బాయలర్ పెట్టుకోడానికి ఉపయోగపడే స్టాండు. చూ. చిత్రం 173. 2. (కో. 2-4, 9).

బాయిలరుకరవాయి: బాయిలరు తయారుచేయడానికి వాడే పరికరం. (తె. 6).

బాయిలర్లు: చూ. బయలరు. (కో. 3).

బాయిలేర్‌గెంట: చూ. పర్యా. దర్జ. బూడిద, నిప్పులు రాలకుండ బాయిలర్ అడుగుభాగాన

అమర్చిన రంధ్రాలప్లేటు. చూ. చిత్రం 173. 1. (తె. 21).

బార్‌కత్రసుత్తి: అల్యూమినియం పాత్రను పెద్దసైజు చేసుకోడానికి వాడే పరికరం. (కో. 13).

బార్‌పట్టి: ట్రంకుపెట్టె మధ్యలో బార్ కొట్టడానికి వాడే గుండ్రనికడ్డీ. (రా. 8, 12, 15, 17).

బార్‌బర్‌కత్తెర: (< ఇం. Borber + కత్తెర) పర్యా. బార్‌బార్‌సిజర్, మంగలికత్తెర, వెంట్రుకలకత్తెర. మంగలిషాపులో కటింగ్ చేయడానికి వాడే పనిముట్టు. (తె. 2).

బార్‌బర్‌రేజర్: (ఇం.) చూ. పర్యా. మంగలికత్తి. మంగరిషాపుల్లో షేవింగ్ చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 185. (కో. 24).

బార్‌బర్‌సిజర్: (ఇం.) చూ. పర్యా. బార్‌బార్‌కత్తెర. మంగలిషాపుల్లో కటింగ్ చేయడానికి వాధే పనిముట్టు. (కో. 24; రా. 16).

బార్‌మట్టపుల్ల: చూ. పర్యా. పట్ట.[2] రేకుపై బొద్దు కొట్టడానికి వాడే పొడవుపాటి పట్టీలు. (రా. 10).

బారడరుపట్టీ: (< ఇం. border + పట్టీ) చూ. పర్యా. దార్లబద్దీ. బీరువా అంచులు వంపులు లేకుండ సరిచేయడానికి వాడే పనిముట్టు. (రా. 12, 16).

బారు[1]: చూ. పర్యా. పట్ట.[1] లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లావుపాటి ఇనుప బద్ద. (కో. 24).

బారు[2]: పర్యా. బొద్దు[2]. పెట్టెకు డిజైనులాగ ఉండే పొడవాటి ఉబ్బు. (రా. 15).

బారు[3]: లోహపు రేకు పొడవు. (కో. 5; తె. 21).

బారుగంగాలం: చూ. పర్యా. అండా[1]. నీళ్లు నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల పిడి, వెడల్పుమూతి ఉన్న పెద్ద లోహపు పాత్ర. చూ. చిత్రం 8. (తె. 25).

బారుసుత్తి: చూ. పర్యా. పొడుగుసుత్తి. లోతు కొట్టడానికి వాడే పరికరం. (కో. 12).

బార్లపట్టీ: చూ. పర్యా. దార్లబద్దీ. బీరువా అంచులు వంపులు లేకుండా సరిచేయడానికి వాడే పనిముట్టు. (రా. 11).

బాల్‌పిన్ను: (ఇం.) సైకిల్ చక్రానికి గాలి నింపడానికి వాడే పిన్ను. (తె. 12).

బాల్‌పెన్‌హామరు: (ఇం.) ఉ. బాల్‌పిన్‌హామరు. చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 19; తె. 19).

బాల్‌పేస్: క్లాంపులు తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 29).

బాల్చీ: ఉ. బాల్చి, బాల్చా. రూ. బాల్టి. చూ. పర్యా. బకెటు. బావిలోంచి నీళ్ళు తోడడానికి వాడే సాధనం. (కో. 18-25, 27).

బాల్టి: చూ. బాల్చి. (కో. 26, 28-30).

బాళిగ: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపులా హాండిల్సు అమర్చిన లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (రా. 13).

బావిగిలక: బావిలోనుంచి నీళ్ళు తోడుకోడానికి వాడే రాట్నం. (కో. 1).

బావిడీ: జాతరలోవాడే గరగ అనే ఒకవిధమైన కలశం. గొడుగుకు అలంకరణకై అమర్చిన లోలాకులు. (కో. 20).

బావు[1]: చూ. పర్యా. గుమ్మెకొయ్య. తరణిపనిలో చక్రాలు తిప్పడానికి పీలుగా తగిలించిన వంపుఉండే ఇనుపకడ్డీ. (కో. 18, 29).

బావు[2]: చూ. పర్యా. లివరు[1]. వెల్డింగ్‌పనిలో ఇనప పట్టీలను డిజైన్లుగా వంపుచేయడానికి వాడే 'F' ఆకారపు కడ్డీ. (కో. 17).

బావుదిమ్మ: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (కో. 17).

బాస్కప్పు: రూ. భాస్కప్పు. పర్యా. చిరకు, సట్, స్ప్రింగు గొడుగు. గొడుగు మూసినపుడు పుల్లలను పట్టిఉంచడానికి వాడే సాధనం. ఇది హాండిల్‌కు ఉంటుంది. (తె. 18).

బిగాంబర్: (ఉర్దూ) ఉ. బిగాంబరు. చూ. పర్యా. అంబుర్. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు కొనాన్ని పట్టుకోడానికి పనికివచ్చే పరికరం. చూ. చిత్రం 147. (రా. 10, 15).

బిగించు: (క్రి.) చూ. పర్యా. జంటించు. రేకుపై చీలలు ఎక్కించడం. బిందె రేకులను అతకడం. (కో. 8; రా. 1).

బిగింపుపెట్టు: (క్రి.) చూ. పర్యా. జంటించు. డ్రమ్ముకు మూతను బిగింపుపెట్టడం. (రా. 1).

బిగ్గొట్టు: (క్రి.) చూ. పర్యా. జంటించు. సైకిల్ విడి భాగాల్ని బిగించడం. (రా. 6).

బిగ్గాతోము: (క్రి.) మైల పోవడానికి పాత్రలను చింతపండుతో గట్టిగా రుద్దడం. (కో. 21).

బీట్టు: చూ. పర్యా. డ్రిల్. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలు వేయడానికి వాడే డ్రిల్లు మిషనులో ఉండే త్రాడులాంటి మరకడ్డీ. (కో. 2;

(రా. 6, 10, 12).

బిట్టులేగ: పాత్రపై ముడిభాగాల్లో మెరుగుపెట్టడానికి ఉపయోగపడే పరికరం. (కో. 10, 12).

బిందె: ఉ. బింది. చూ. పర్యా. జవబుడ్డి. మంచినీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగించే సన్నని మూతికల్గి, అడుగుభాగం వెడల్పుగా ఉండే లోహపుపాత్ర. (కో. 1–3, 5–8, 13, 15–17, 19, 20, 22, 23, 27, 29; తె. 2, 9, 10, 14, 15, 18, 19, 25; రా. 2, 4, 6, 11, 14–16).

బిందెకరవాయి: ఉ. బిందికరవాయి. చూ. పర్యా. కూజాకరవాయి. కూజా ఆకారపు బిందెలను సాపు చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 177; (కో. 1–11, 15–16, 18, 22, 27, 28; తె. 7–9, 23, 25; రా. 1, 5, 7, 11, 16),

బిందెకుదుర్లు: చూ. పర్యా. గద్దె[1]. పాత్రలు ఎత్తుగా ఉంచడానికి వీలుగా క్రిందిభాగంలో అమర్చిన గుండ్రటి లోహపురింగు, (కో. 1).

బిందెనడుం: బిందెబిళ్ళ, జవ్వ కలిపిన నడుంభాగం. (తె. 11).

బిందెలగడపార: చూ. బిందెల గెడ్డపార. (కో. 10).

బిందెలగెడ్డపార: రూ. బిందెల గెడపార. చూ. పర్యా. ఉండగడ్డపార. బిందెల అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 6, 12).

బిందెలమట్టుకరవాయి: చూ. పర్యా. కూజా కరవాయి. కూజా ఆకారపు బిందెలను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 177. (కో. 8).

బి.పి. సీటు: (ఇం.) ట్రంకుపెట్టెకు ఉపయోగపడే రేకు. (కో. 13).

బియ్యపుజల్లెడ: చూ. పర్యా. ఛన్ని. బియ్యం నూకలువగైరా జల్లించడానికి వాడే రంధ్రాలు ఉన్న రేకు పరికరం. (కో. 1).

బియ్యపుడబ్బా: చూ. బియ్యండబ్బా. (కో. 2).

బియ్యపుడ్రమ్ము: చూ. బియ్యండ్రమ్ము. (కో. 15).

బియ్యండబ్బా: రూ. బియ్యపుడబ్బా. పర్యా. బియ్యం డ్రమ్ము. బియ్యం నిల్వ ఉంచుకోడానికి వాడే సాధనం. (తె. 12).

బియ్యండ్రమ్ము: చూ. పర్యా. బియ్యండబ్బా. బియ్యం నిల్వ ఉంచుకోడానికి వాడే సాధనం. (కో. 1, 14).

బియ్యంబుట్ట: చూ. పర్యా. చాల్ని[1]. తడిబియ్యం, పప్పులు వడబోసుకోడానికి ఉపయోగపడే సాధనం. (కో. 26).

బిరకు: ఉ. బిరక్, బిరేక్, బ్రేక్. చూ. పర్యా. బాస్కప్పు. గొడుగు మూసినపుడు పుల్లలను పట్టి ఉంచడానికి వాడే సాధనం. (తె. 21).

బిరడాగిన్నె: పర్యా. లోహపుగిన్నె. టార్చిలైటు వెలగడానికి వాడే వెనుక టోపనులో ఉన్నరేకు. (తె. 18).

బిరడాచెంబు: ప్రయాణాల్లో ఉపయోగపడే మర చెంబు. (తె. 2).

బిరియానిడేక్సా: వంటపాత్ర. బిరియాని తయారు చేయడానికి వాడ్తారు. (రా. 4).

బిరుదుపట్టం: దేవతావిగ్రహం నొసటికి అలంకరించడానికి వాడే దోసగింజలాగా ఉండే సాధనం. (కో. 2).

బిలారిసుత్తి: లోహపుముక్కల్ని సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 17, 19).

బిళాతీఉక్కు: చిన్నదెబ్బకు తట్టుకోడానికి వీలుగా వెండిపనిలో వాడే సాధనాలను తయారుచేసే మెత్తని ఉక్కు. (కో. 28).

బిళ్ల[1]: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గులు పొయ్యిలో బూడిదరాలడానికి వాడే రంధ్రాల ప్లేటు చూ. చిత్రం 59. (రా. 2, 16).

బిళ్ల[2]: చూ. పర్యా. అడుగు. ఇత్తడి ఇనుపపాత్రల అడుగుభాగపు రేకు. (కో. 2, 4, 5, 8, 10; తె. 2–6, 10, 11, 17, 19, 20, 24, 25, 26; రా. 1–3, 5, 7).

బిళ్ల[3]: పాత్రలపై డిజైన్లకోసం ఉపయోగించే రింగు. (రా. 5).

బిళ్లలచెక్కరసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడేసుత్తి. (కో. 5).

బిళ్లలతక్కసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 5).

బిళ్లడాకిలి: ఇనుపదిమ్మె. ఇనుపవస్తువులుపెట్టి శుద్ధం చేయడానికి వాడే ఇనుపదిమ్మె. (రా. 4).

బిళ్లపోయు: (క్రి.) కంచాలతయారీకి ఇడ్లీ సైజున గుండ్రంగా లోహాన్నిపోయడం. (కో. 24).

బిళ్లబోను: చూ. పర్యా. పలకబోను. ఎలకలను పట్టుకోడానికి పరికరం. చూ. చిత్రం 30. (రా. 6).

బిళ్లరాయి: ఎద్దులకాళ్ళ బిళ్ళలు పట్టుకోడానికి ఉపయోగపడే సాధనం. (రా. 4).

బిళ్లలసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 6; రా. 9).

బిళ్లవేయు: (క్రి.) బిందె అడుగుభాగంలో బిళ్ళ

రేకును అమర్చడం. (రా. 2).

బిళ్లసాంచ: కాలిన ఇనుపకడ్డీని చౌకంగా చేయడానికి వాడే పరికరం. (తె. 1).

బిసింగ్‌హామర్: చూ. పర్యా. కత్తి[3]. వెల్డింగ్ ఉబ్బులను కొట్టడానికి వాడే పరికరం. (కో. 17).

బీగం: చూ. పర్యా. తాళం[4]. భద్రతకోసం తలుపుకు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 129. (రా. 3; 5).

బీగంచెవ్వు: చూ. పర్యా. తాళంచెవి. తాళం తీయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 129A. (రా. 5, 8).

బీటుమూకుడి: చూ. బీడుమూకుడి. (కో. 11).

బీడ్‌వెల్డింగ్: (ఇం.) ఉక్కుసామాన్లపై చేసే వెల్డింగ్ పని. (తె. 25).

బీడిమూకుళ్లు: చూ. బీడుమూకుడి. (కో. 14).

బీడింగ్ : బిందెపైభాగం. (కో. 5).

బీడింగ్‌కట్టె: చూ. పర్యా. బీడింగ్‌కర్ర. పాత్ర మూతిభాగం వంచడానికి వాడే పరికరం. (రా. 8,14).

బీడింగ్‌కర్ర: పర్యా. బీడింగ్‌కట్టె. రేకుతో పాత్ర ఆకారాన్ని చేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 26).

బీడింగ్‌కంచం: చూ. పర్యా. పట్టీకంచం. అన్నం తినడానికి వాడే అంచులు వంచబడిఉండే పళ్లెం. (కో. 6, 10, 11).

బీడింగ్‌కిస్తీ: బీడింగ్‌కలిగిన మూత. (తె. 8, 9).

బీడింగ్‌కూరగిన్నె: కూరలు ఉంచుకోడానికి వాడే అంచు వంగిఉండే గిన్నె. (తె. 8, 9, 13).

బీడింగ్‌గ్లాసు: నీళ్ళు తాగడానికి వాడే అంచుగలిగిన లోటా. (కో. 3, 4, 7).

బీడింగ్‌చేయు: (క్రి.) రేకును పెట్టెలాగా వంచుకోవడం. (కో. 2).

బీడింగ్‌పళ్లెం: చూ. పర్యా. పట్టీకంచం. అన్నం తినడానికి వాడే అంచులు వంచబడిఉండే కంచం. (తె. 8, 9).

బీడింగ్‌ప్లేటు: చూ. పర్యా. ఫాన్సీప్లేటు. పాత్రలపై మూయడానికి ఉపయోగపడే డిజైన్లున్న మూత. (కో. 8, 10, 11).

బీడింగ్‌మిషను: స్టీలుపాత్రల తయారీలో వైర్ బిగించుకోడానికి ఉపయోగపడే మిషను. (కో. 5).

బీడింగు: చూ. పర్యా. పట్టి[2]. రేకుపై బొద్దుకొట్టడానికి వాడే పొడవుపాటి పట్టి. (కో. 23).

బీడింగువేయు: (క్రి.) బిందె పైభాగాన్ని అంచులాగ వెనక్కి మడచడం. (రా. 16).

బీడు ఆకురాయి: తాళాలను రిపేరి చేయడానికి వాడే అర్ధచంద్రాకారపు ఆకురాయి. (తె. 17).

బీడుకత్తెర: అన్నిరకాల వస్తువులను కత్తిరించడానికి వాడే ఉక్కు లోహపు పనిముట్టు. (తె. 24).

బీడుకలాయి: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి ఉపయోగించే ఇరువైపులా హాండిల్సు అమర్చిన లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (కో. 23, 26).

బీడుచెక్క: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 14).

బీడుచెంబు: పోతచెంబు. (తె. 5).

బీడుజాలి: చూ. పర్యా. కాలువచక్కి. కాలువల్లోకి చెత్తాచెదారం వెళ్ళకుండ అడ్డంపెట్టడానికి వాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 51. (తె. 1).

బీడుపెనం: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి ఉపయోగించే ఇరువైపులా హాండిల్సు అమర్చిన లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (రా. 16).

బీడుపొయ్యి: పర్యా. బీడుబొగ్గుల పొయ్యి. బూన పొయ్యి. వంటచేయడానికి వాడే ఇనపబొగ్గుల పొయ్యి. (కో. 23, 24; రా. 16).

బీడుబొగ్గులపొయ్యి: చూ. పర్యా. బీడుపొయ్యి. వంటచేయడానికి వాడే ఇనపబొగ్గుల పొయ్యి. (తె. 21).

బీడుమూకుడి: ఉ. బీడుమూకుడు. రూ. బీటుమూకుడి. బీడిమూకుళ్ళు. చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి ఉపయోగించే ఇరువైపులా హాండిల్సు అమర్చిన లోహపు పాత్ర. చూ. చిత్రం 163. (కో. 15, 17, 19, 21).

బీడుమెటల్‌కత్తెర: చూ. పర్యా. గుడ్డకత్తెర. గుడ్డలు కత్తిరించడానికి వాడే సాధనం. చూ. చిత్రం 78. (కో. 20).

బీడె: తలుపు. (కో. 9).

బీరువా: ఉ. బీరవా, బీర్వా. వస్తువులు పెట్టుకోడానికి అరలతో తలుపులుపెట్టి ఇనుపరేకుతో తయారుచేసిన పెట్టె. చూ. చిత్రం. 178. (కో. 4, 8; తె. 1, 5, 7; రా. 3, 5, 8).

బీసు: చూ. పర్యా. బేసను. అన్నం ఆరబోసుకోడానికి వాడే వెడల్పుమూత, లోతుఉన్న లోహపు పాత్ర. చూ. చిత్రం 179. (కో. 2).

బుక్‌కేసు: (< ఇం. Book Case). పుస్తకాలతో

అమర్చడానికి లైబ్రరీలలో వాడే అరలబీరువా. ఈ రాక్‌కు తలుపులుండవు. ఇరువైపులనుండి పుస్తకాలను తీసుకోవచ్చు. (తె. 25).

బుక్‌సెల్ఫు: (< ఇం. Book Self) పుస్తకాలను అమర్చడానికి వాడే అరలరాక్. దీనికి తలుపులుండవు. ఇరువైపులనుండి పుస్తకాలను తీసుకోవచ్చు. (కో. 24, రా. 3).

బుక్కారు: చూ. బుగ్గకారు. (కో. 16, 20-26, 28, 29; తె. 8, 13).

బుగ్గకారు: రూ. బుక్కారు, బుగ్గలకారు. పర్యా. బుగ్గపట్టకారు, బుర్రపట్టకార, బెండింగ్‌కారు. మేకులు పీకడానికి, వంగిపోయిన మేకులు సరిచేయడానికి, వస్తువులను పట్టుకోడానికి వాడే పట్టకారు. చీలలు పట్టుకొనే తమరభాగంలో ఒకకాడకు కమానులాగా వంపు ఉంటుంది. (కో. 17-22, 24-28; తె. 1, 3, 6-9, 13, 17, 18, 22, 25, 26).

బుగ్గపట్కార: చూ. బుగ్గపట్టకారు. (తె. 5).

బుగ్గపట్టకారు: రూ. బుగ్గపట్కార. చూ. పర్యా. బుగ్గకారు. మేకులు పీకడానికి, వంగిపోయిన మేకులు సరిచేయడానికి, వస్తువులను పట్టుకోడానికి వాడే పట్టకారు. చీలలు పట్టుకొనే తమరభాగంలో ఒక కాడకు కమానులాగా వంపు ఉంటుంది. (తె. 2).

బుగ్గలకారు: చూ. బుగ్గకారు. (కో. 22; రా. 3, 5).

బుగ్గి: పర్యా. రద్దు¹. కరిగే లోహంపై ఉండే మలిన పదార్థం. (కో. 29).

బుగ్గు: చూ. పర్యా. కవరుబూడిద. అచ్చుకు మన్ను అంటుకోకుండ ఉండడానికి చల్లే బూడిద. (కో. 24).

బుంగ: చూ. పర్యా. కడవ. నీళ్ళు తేవడానికి వాడే చిన్న లోహపు బిందె. (కో. 3-5. 8, 9; తె. 18, 23-25).

బుంగకరవాయి: రూ. బుంగల కరవాయి. చూ. పర్యా. కడవల కరవాయి. గుండ్రని లోహపు పాత్రలను తయారుచేయడానికి, మెరుగుపెట్టడానికి వాడే పనిముట్టు. (కో. 3-5, 8).

బుంగలకరవాయి: చూ. బుంగకరవాయి. (కో. 4, 6, 9; తె. 9).

బుంగలగెడపార: చూ. బుంగలగెడ్డపార. (కో. 10).

బుంగలగెడ్డపార: రూ. బుంగలగెడపార. చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు సోపుచేయడానికి వాడే పరికరం. (కో. 6, 12).

బుజిడి: చూ. పర్యా. పోకిచెంబు. చిన్నపిల్లలకు నీళ్ళు త్రాగించడానికి వాడే చిన్నపాత్ర. చూ. చిత్రం 191; (తె. 1).

బుట్ట: చూ. పర్యా. స్మాల్‌బేసను. అన్నం ఆరబోసుకోడానికి, పిండి కలుపుకోడానికి ఉపయోగపడే వెడల్పు మూతి ఉన్న లోతైనపాత్ర. (కో. 7, 29).

బుట్టి: చూ. పర్యా. ఉల్లిపాయల బుట్ట. ఉల్లిపాయలు ఆరబెట్టుకోడానికి వాడే ఇనప కమ్ములతో చుట్టి అల్లిన ఉట్టి. (కో. 4, 9; తె. 8, 9).

బుడిగ¹: చూ. పర్యా. పోకిచెంబు. చిన్న పిల్లలకు నీళ్ళు త్రాగించడానికి వాడేచెంబు. చూ. చిత్రం 191. (కో. 2).

బుడిగె²: పర్యా. బుడ్డి². నీళ్ళు తెచ్చుకోడానికి వాడే చిన్న లోహపుబిందె. (తె. 9, 13).

బుడ్డ: చూ. పర్యా. ఊరువెంజి. కాక చేసేటప్పుడు మసికాకుండ పాత్రలపై పూయడానికి ఉపయోగపడే పేడ, ఎర్రమన్ను కలిసిన మిశ్రమం. (తె. 25).

బుడ్డకారాలగరిటె: చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనెపెనంలోనుండి కారాలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న పరికరం. చూ. చిత్రం 107. (రా. 6).

బుడ్డి¹: చూ. పర్యా. కంటుదిమ్మె. ఇరుసును అమర్చడానికి వాడే బండిచక్రం మధ్యలో ఉండే కొయ్య దిమ్మ. (తె. 23).

బుడ్డి²: చూ. పర్యా. బుడిగె². నీళ్ళు తేవడానికి వాడే చిన్నలోహపు బిందె. (కో. 15).

బుడ్డి³: పదహారుతవ్వలు. (తె. 9).

బుడ్డిచెంబు: చూ. పర్యా. పాలచెంబు². చిన్నపిల్లలకు పాలుత్రాపడానికి వాడే గొట్టంహాండిలు అతికిఉండే చిన్నలోహపు పాత్ర. పొట్ట ఎక్కువగా మూతి చిన్నదిగా ఉంటుంది. (కో. 6, 13, 21, 24).

బుడ్డీకాను: చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యి లాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపు పాత్ర. (కో. 20).

బుడ్డీచెంబు: పాలు, నూనేవంటి ద్రవపదార్థాలను తెచ్చుకోడానికి వాడే పాత్ర. సీసా ఆకారంలో ఉంటుంది. (కో. 22, 23).

బుండ్లకరవాయి : దుత్తలు తయారుచేయడానికి ఉపయోగపడే కొనభాగంపైకి ఉండే పనిముట్టు. (తె. 8).

బుదరవాసబిందె: కూజా ఆకారంలో ఉండి ఏటవాలు భుజాలు కలిగిన ఇత్తడిబిందె. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. (కో. 24).

బునుగులు: చూ. పర్యా. గజ్జెలు[2]. ఎద్దులమెడలకు, వాహనాలకు కట్టడానికి వాడే లావుగా వుండు ఇత్తడి గజ్జెలు. (తె. 22).

బురక: ఉ. బొరక. చూ. పర్యా. కన్నం. కరిగిన లోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి ఏర్పాటుచేసిన రంధ్రం. (రా. 6, 7, 10).

బురజ: రూ. బుర్జ, చూ. పర్యా. ఊరువెంజి. కాక చేసినప్పుడు మసికాకుండ పాత్రలపై పూయడానికి ఉపయోగపడే పేడ, ఎర్రమన్ను కలిపిన పదార్థం. (తె. 1, 3).

బుర్జ: చూ. బురజ. (తె. 2).

బుర్ర[1]: చూ. పర్యా. గొట్ట[4]. టార్చిలైట్‌లో బాటరీలను ఉంచడానికి ఉపయోగించే స్విచ్ ఉన్నభాగం. (తె. 4, 24, 25).

బుర్ర[2]: చూ. పర్యా. అడ్డ[1]. బిందెమధ్యభాగపు రేకు. (తె. 1, 10).

బుర్ర[3]: ఉ. బొర్ర. చూ. పర్యా. అడిగేమొద్దు. ఇత్తడి పాత్రలను పాలిష్ పెట్టడానికి ఉపయోగించే కొయ్యదిమ్మ. (కో. 27).

బుర్ర[4]: చూ. పర్యా. పట్టి[2]. బీరువాతలుపు రేకు వంగకుండ లోపలిభాగాన బిగించిన పట్టి. (కో. 24, 26).

బుర్ర[5]: మేకుపైభాగం. (కో. 22).

బుర్రకొట్టు: (క్రి.) కొలిమిలో ఉక్కును పల్చగా గుండ్రంగా చేయడం. (రా. 4).

బుర్రగంగాళం: చూ. పర్యా. అండా[1]. నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే ఇరువైపుల హాండిల్సు, వెడల్పు మూతిఉన్న పెద్దలోహపు పాత్ర. (కో. 7).

బుర్రపట్టుకార: చూ. పర్యా. బుగ్గకారు. మేకులు పీకడానికి, వంగిపోయిన మేకులు సరిచేయడానికి, వస్తువులను పట్టుకోడానికి వాడే పట్టుకారు. చీలలు పట్టుకొనే తమరభాగంలో ఒకకాడకు కమానులాగా వంపు ఉంటుంది. (రా. 3).

బుర్రసుత్తి: కడ్డీలను సాపుచేసే పరికరం. (కో. 23).

బూజు: చూ. పర్యా. చిలుము. లోహపురేకులపై, కడ్డీలపై పట్టినతుప్పు. (కో. 1, 3).

బూడిద: చూ. పర్యా. కవరుబూడిద. అచ్చుకు మన్ను అంటుకోకుండా ఉండడానికి చల్లే పొడిపదార్థం. (కో. 2, 4, 26; తె. 20).

బూడిదదేవుకి చట్రం: చూ. పర్యా. రంధ్రాలగరిటె నూనెలోనుండి పిండివంటలు తీయడానికి వాడే రంధ్రాలున్న కాడగల లోతుపళ్లెం. చూ. చిత్రం 107. (కో. 16).

బూంధిగంటె: చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనెలో నుండి పిండిపదార్థాలు తీయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 107. (తె. 22, 24).

బూందిచట్రం: చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనెలోనుండి పిండివంటకాలు తీయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 107. (కో. 14, 14).

బూందిజాల్ల: చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనెలో నుండి పిండివంటకాలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న సాధనం. చూ. చిత్రం 107. (రా. 12).

బూంధిపలక: చూ. పర్యా. రంధ్రాలగరిటె. నూనెలో నుండి పిండివంటకాలు తీయడానికి వాడే సాధనం. (రా. 15).

బూరకొమ్ము: లోహంతో చేసిన ఊదే వాద్యం. (తె. 14).

బూరిమూకుడి: రూ. బూరుముకిరి, బూర్లిమూకుడి, బూలెమూకుడు. చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి ఉపయోగించే ఇరువైపులా పిడి అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం. 163. (కో. 18, 19).

బూరుముకిరి: చూ. బూరిమూకిడి. (కో. 16).

బూర్లిమూకుడి: ఉ. బూర్లమూకుడు. చూ. బూరిమూకుడి. (కో. 17; తె. 24).

బూర్లెపెనం: చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి ఉపయోగించే ఇరువైపులా పిడి అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం 173. (కో. 20).

బూలెమూకుడు: చూ. బూరిమూకుడు. (తె. 22).

బూసపొయ్యి: చూ. పర్యా. బీడుపొయ్యి. వంట చేయడానికి వాడే ఇనపబొగ్గుల పొయ్యి. (తె. 12, 13).

బెక్కుమను: (క్రి.) స్టౌలో మంట సరిగారాకుండ ఆరిపోతూ వెలగడం. (కో. 30).

బెజవాడబిందె: మూతిపొడుగ్గా ఉండే లోహపుపాత్ర. నీళ్ళకు ఉపయోగం. (తె. 24).

బెజవాడసెరవ: గుండ్రని అండాలాగ నీళ్ళు కాచడానికి, అన్నం వండడానికి వాడే పొడవైన అల్యూమినియం పాత్ర. (తె. 18).

బెజ్జపోగర: చూ. బెజ్జంపోగర. (కో. 4).

బెజ్జం: చూ. పర్యా. కన్నం. కరిగిన లోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి చేయబడిన రంధ్రం. (కో. 3-6, 7, 8, 10, 12, 14, 19, 23; తె. 2; రా. 8).

బెజ్జంపోగర: రూ. బెజ్జపోగర. చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 28).

బెజ్జాకడ్డి: చూ. పర్యా. డ్రిల్. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలు వేయడానికి వాడే మరకడ్డి. (కో. 15).

బెంచివైస్: (ఇం.) ఇనుపవస్తువుల్ని బిగించడానికి వాడే తిరుసుడు. (కో. 7).

బెట్టం: రేకును గుండ్రంగా చేయడానికి వాడే పనిముట్టు. (రా. 11).

బెట్టు: చూ. పర్యా. బటన్. గొడుగును తెరచినపుడు పుల్లలరింగును పట్టుకోడానికి గొడుగుసువ్వపై ఉండే పరికరం. (తె. 19, 21, 22).

బెండ్ఏయు: (క్రి.) చూ. బెండ్‌చేయు. (తె. 21).

బెండ్‌చేయు: (క్రి.) (< ఇం. Bend + చేయు) రూ. బెండ్ ఏయు, బెండింగ్‌చేయు. పర్యా. బెండ్ పెట్టు, బ్యాండేజిచేయు, మడచేయు, మడతచేయు, మడుచు, మడుచుకొను, వంగొట్టు, వంచివేయు, వంచు, వంచుకొను, వంచుడుచేయు, వంపుపెట్టు, వాటంచేయు[3], వాలేయు[2]. కొలతప్రకారం లోహపు రేకులను, పట్టీలను వంపుచేయడం. (కో. 1, 2, 3; తె. 19, 20, 21; రా. 2, 4, 6, 7).

బెండ్‌పీసు: (ఇం.) చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (రా. 11).

బెండ్‌పెట్టు: (క్రి.) రూ. బెండింగ్‌పెట్టు. చూ. పర్యా. బెండ్‌చేయు కొలతప్రకారం లోహపు రేకులను పట్టీలను వంపుపెట్టడం. (కో. 22, 25; తె. 5; రా. 12).

బెండ్‌మిషను (ఇం.) ఉ. బెండ్‌మిషని. రూ.బెండింగ్ మిషను. పర్యా. బెండింగ్‌కట్టర్, సెటర్. లోహపు రేకులు, కడ్డీలు వంపుచేయడానికి వాడే యంత్రం. (కో. 3; తె. 17).

బెండింగ్‌కట్టర్: (ఇం.) చూ. పర్యా. బెండ్‌మిషను. లోహపురేకులు, కడ్డీలు వంపుచేయడానికి వాడే మిషను. (రా. 2).

బెండింగ్‌కడ్డీ: (< ఇం. Bending + కడ్డీ) చూ. పర్యా. లివరు. వెల్డింగ్‌పనిలో ఇనప పట్టీలను డిజైన్లుగ వంపుచేయడానికి వాడే 'F' ఆకారపు కడ్డి. (కో. 17).

బెండింగ్‌కారు: చూ. పర్యా. బుగ్గకారు. మేకులు పీకడానికి, వంగిపోయిన మేకులు సరిచేయడానికి, వస్తువులను పట్టుకోడానికి వాడే పట్టకారు. చీలలు పట్టుకొనే తమరభాగంలో ఒక కాడకు కమానులాగా వంపు ఉంటుంది. (కో. 23).

బెండింగ్‌గాలు: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (తె. 6).

బెండింగ్‌చిప్ప: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (తె. 23).

బెండింగ్‌చేయు: ఉ. బీడింగ్‌చేయు. చూ. బెండ్ చేయు. (కో. 8, 28–30; తె. 2, 22–24; రా. 12).

బెండింగ్‌టేబులు: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే సాధనం. (తె. 30).

బెండింగ్‌డాగలి: ఇనుపపట్టీలను వంచడానికి ఉపయోగించే బోలుదిమ్మ. (తె. 21).

బెండింగ్‌దొడ్డి: సైకిల్‌చక్రం వంపుతీయడానికి వాడే పరికరం. (కో. 14).

బెండింగ్‌పెట్టు: (క్రి.) చూ. బెండ్‌పెట్టు. (కో. 24).

బెండింగ్‌పోగరు: చూ. పర్యా. లివరు. వెల్డింగ్‌పనిలో ఇనప పట్టీలను డిజైన్లుగ వంపుచేయడానికి వాడే 'F' ఆకారపు కడ్డి. (కో. 28).

బెండింగ్‌ప్లేటు[1]: చూ. పర్యా. టెంప్లేటు. ముందుగ డిజైను గీయడానికి వెల్డింగ్‌పనిలో వాడే పెద్ద లోహపు రేకు. (రా. 7).

బెండింగ్‌ప్లేటు[2]: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (కో. 23).

బెండింగ్‌మిషను: (ఇం.) ఉ. బెండింగ్‌మిషను. చూ. పర్యా. బెండ్‌మిషను. లోహపు రేకులు, కడ్డీలు వంపు చేయడానికి వాడే సాధనం. (కో. 3, 4, 6, 7, 9, 13, 15, 21, 23; తె. 3, 22, 34; రా. 2–4, 6, 7).

బెండింగ్‌రాడ్ : (ఇం.) చూ. పర్యా. కమ్మి[2]. లోహపురేకులను కడ్డీలను వంచడానికి వాడే మోపు. (కో. 29; రా. 7).

బెండింగ్‌లివరు: (ఇం.) చూ. పర్యా. లివరు[1]. వెల్డింగ్‌పనిలో ఇనపపట్టీలను డిజైనుగ బెండ్‌చేయడానికి వాడే 'F' ఆకారపుకడ్డి. చూ. చిత్రం. (తె. 23; రా. 11).

బెండింగ్‌హామరు: (ఇం.) చూ. పర్యా. అమరు. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపు చేయడానికి వాడే పరికరం. (తె. 7).

బెండు[1]: గొడ్డలికి రంధ్రాలు వేయడానికి వాడే

లావుపాటి మొద్దుకడ్డి. (తె. 2, 3, 5-7, 18, 19, 21-25).

బెండు[2]: చూ. పర్యా. పోగరు. లోహపురేకుపై, కడ్డీలపై రంధ్రాలేయడానికి గుర్తులుపెట్టే పరికరం. చూ. చిత్రం 165. (తె. 22).

బెత్తాయించు: (క్రి.) కొలతప్రకారం రేకును కత్తరించడం. (కో. 17, 18. 26, 26, 28).

బెల్: (ఇం.) సైకిల్ హ్యాండిల్ భాగంలో ఉండి ధ్వనిని కలిగించే పరికరం. (తె. 8, 12).

బెల్‌కట్టు: చూ. పర్యా. దబ్బ[2], లోహపురేకులను కత్తరించడానికి వాడే పరికరం. (రా. 10).

బెల్‌రింజి: (ఇం.) పర్యా. బెల్‌స్పానరు. సైకిల్‌కు చిన్ననట్లు బెండ్‌చేయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 13).

బెల్‌స్పానరు: (ఇం) చూ. పర్యా. బెల్‌రింజి. సైకిల్‌కు చిన్ననట్లు బెండ్‌చేసుకోడానికి వాడే పరికరం. (రా. 6).

బెల్ట్‌క్యారీరు: (ఇం.) చూ. బెల్టుకారేజి. (కో. 3, 4, 12, 15).

బెల్టు[1]: (ఇం.) ఉ. బెల్ట్. చూ. పర్యా. తోలువారు. సానరాయిని చేతితో లాగడానికి వాడే చర్మపుపట్టి. (తె. 21, 24; రా. 5).

బెల్టు[2]: చూ. పర్యా. పట్ట[3]. లోహపురేకుపై గ్రీసును పూయడానికి వాడే సాధనం. (రా. 14).

బెల్టుకారేజి: (ఇం.) రూ. బెల్ట్‌క్యారీరు. అన్నం తీసుకెళ్ళడానికి ఉపయోగపడే గిన్నెలు పడిపోకుండ చుట్టి బెల్టుఉన్న లోహపు పాత్రలు. (కో. 21).

బెల్లపుపెనుం: చూ. బెల్లంపెనుం. (తె. 11).

బెల్లంకడైలు: పర్యా. బెల్లంపెనుం. బెల్లం తయారు చేయడానికి వాడే పెనుం. (తె. 10, 11).

బెల్లంపెనుం: రూ. బెల్లపుపెనుం. చూ. పర్యా. బెల్లంకడైలు. బెల్లం తయారుచేయడానికి వాడే పెనుం. (తె. 10).

బెల్లంనీళ్ళు: అచ్చుకు సరిపోయే విధంగా మట్టిని తడపడానికి ఉపయోగించే కొద్దిగ బెల్లం కలిపిన నీళ్ళు. (తె. 7).

బెళగారం: చూ. ఎలిగారం. (రా. 11).

బెసకి: చూ. పర్యా. చూర. లోహపు పాత్రలను అతకడానికి వాడే పదార్థం. (రా. 13).

బేటడబ్బా: చూ. పర్యా. కుంకుమకాయ. కుంకుమ పోసుకోడానికి ఉపయోగించే స్టీల్‌కప్పు గిన్నె. దీనికి మూత ఉంటుంది. చూ. చిత్రం 65. (తె. 10, 11).

బేపు: చూ. పర్యా. కుక్కారు. బండిచక్రానికి కమ్ములను ఎక్కించడానికి ఉపయోగించే సాధనం. (కో. 29).

బేపుకారు: చూ. పర్యా. కుక్కారు. బండికమ్ములను చక్రానికి ఎక్కించడానికి వాడే పనిముట్టు. (కో. 28).

బేబీక్యారీ: (< ఇం. Baby carriage) రూ. బేబీక్యారేజి. చిన్నపిల్లలకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే పరికరం. (కో. 1).

బేబీక్యారేజి: (ఇం.) చూ. బేబీక్యారీ. (కో. 15).

బేరాలు: పర్యా. బ్యార్నీగొట్టం. పొగాకుగొట్టం. (కో. 8).

బేరింగ్‌పాన: (ఇం.) చూ. బేరింగ్‌స్పానరు. (తె. 8, 11, 12).

బేరింగ్‌సువ్వ: సానరాయిపై ఉన్నమైలను పోగొట్టడానికి ఉపయోగపడే పరికరం. తె. 24).

బేరింగ్‌స్పానరు: (ఇం.) రూ. బేరింగుపాన. సైకిల్ బేరింగ్ బిగించడానికి వాడే పనిముట్టు. (తె. 8, 11).

బేరింగుబాల్: (ఇం.) సైకిల్ బేరింగుకు ఉపయోగపడే గుండ్రని పరికరం. (తె. 12).

బేరింగురింగు: (ఇం.) ఇడ్లీపాత్రకు గుంటలు కొట్టడానికి వాడే పరికరం. (కో. 10, 12).

బేల్‌కట్టు: చూ. పర్యా. బద్ద[4]. పోతపనిలో అచ్చులపై ఉన్న మట్టిని గీకడానికి వాడే సన్నటి పొడవుపాటి పచ్చని ఇనపపట్టీలు. (తె. 19).

బేల్‌పట్టి[1]: చూ. పర్యా. దబ్బ[2]. లోహపురేకులను కత్తరించడానికి వాడే పరికరం. (తె. 20).

బేల్‌పట్టి[2]: చూ. పర్యా. స్కేలు. అంగుళాలు, అంగుళాల భాగాలు గుర్తించిన అడుగు పొడవున్న కొలత బద్ద. (తె. 14, 16).

బేలన్: పూరీలు చేసుకోడానికి వాడే ఇనుపకడ్డీ. (తె. 11).

బేషను: ఉ. బేషన్. చూ. బేసను. (కో. 6, 25; తె. 21, 24).

బేస్‌డ్రిల్లు: (ఇం.) చూ. పర్యా. కరెంటు డ్రిల్ మిషన్. లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలేయడానికి వాడే కరెంటు యంత్రం. (తె. 1).

బేసన్‌తట్టు: (< ఇం. Besin + తట్ట). చూ. పర్యా. బేసను. అన్నం ఆరబోసుకోడానికి వాడే వెడల్పు మూతి, లోతు ఉన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 179. (తె. 8, 9).

బేసన్‌ప్లేటు: (ఇం.) చూ. పర్యా. బేసను. వెడల్పు

మూతి, లోతు ఉన్న లోహపుపాత్ర. అన్నం ఆరబోసుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 179. (తె. 4, 12).

బేసన్‌బుట్ట: చూ. పర్యా. పూలబుట్ట. దేవాలయానికి పూజా సామాగ్రిని తీసుకెళ్ళడానికి ఉపయోగపడే పూలబుట్ట. చూ. చిత్రం 161. (కో. 1).

బేసను: (బ.). బేసన్లు. ఉ. బేసని, బేసిన, బేసిని, బేసిను, బేసెను. రూ. బేషను. పర్యా. ప్యాన్సీబేసను, పాలిష్‌బేసను, బీసు, బేసన్‌తట్ట, బేసన్‌ప్లేటు, బోడిసె. వెడల్పుమూతి ఉన్న లోతైన లోహపుపాత్ర. అన్నం ఆరబోయడానికి, వడ్డించడానికి, పిండి కలుపుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 179. (కో. 1, 4_12, 15_30; తె. 2_8, 10_13, 15_20, 21, 25; రా. 6_8, 11. 13_16).

బేసరిగిన్నె: కూరలకు వాడే చిన్నపాత్ర. చూ. చిత్రం 180. (రా. 7).

బేసిన్‌సజ్జ: చూ. పర్యా. పూలబుట్ట. పూజాసామాగ్రిని తీసుకెళ్ళడానికి ఉపయోగపడే బేసిన్ ఆకారపు పూలబుట్ట. చూ. చిత్రం 161. (కో. 22).

బైంట్: చూ. పర్యా. పట్ట[1]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లావుపాటి ఇనపబద్ద. (రా. 13).

బైలరు: కాఫీ కాయడానికి వాడే పరికరం. (రా. 7).

బొక్క: చూ. పర్యా. కన్నం. కరిగిన లోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి చేయబడిన రంధ్రం. (కో. 1, 28; రా. 5).

బొక్కదుంగ: చూ. పర్యా. బొక్కనట్టు. వంపు ఆకారంలో వంచుకోడానికి వాడే రంధ్రముండే గుండ్రనిదిమ్మ. (కో. 15).

బొక్కనట్టు: పర్యా. బొక్కదుంగ. వంపు ఆకారంలో వంచుకోడానికి వాడే రంధ్రముండే గుండ్రని పరికరం. (కో. 15).

బొక్కలరింగు: పర్యా. బొక్కల స్పానరు. సైకిల్ రిపేరులో వాడే స్పానరు. (కో. 3).

బొక్కలుస్పానరు: చూ. పర్యా. బొక్కలరింగు సైకిల్ అన్నినట్లు బిగించడానికి ఉపయోగపడే పరికరం. (రా. 8).

బొక్కెన[1]: చూ. పర్యా. బకెటు. నూతిలోంచి నీళ్ళు చేదడానికి వాడే సాధనం. (కో. 4; తె. 1, 4, 6_9, 11_13).

బొక్కెన[2]: చూ. పర్యా. కడ్డీడబ్బా. పొలందగ్గరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే పిడి, మూత ఉన్న పాత్ర. (తె. 16).

బొగడసుత్తి: రేకులను గుంట కొట్టడానికి వాడే పరికరం. (కో. 16).

బొగదబ్బ: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (తె. 1).

బొగవాని: ఉ. బొగవాని. చూ. బొగాని. (తె. 7).

బొగాణి: చూ. పొగాని. (తె. 1).

బొగాని: (బ. బగోనాలు). రూ. బగవోని, బొగాండి, బొగవాని, బొవాని, బొవ్వాని. మూతి వెడల్పుగా లోతు తక్కువగా ఉండే లోహపుపాత్ర. వండిన అన్నం పెట్టుకోడానికి, ఆరబోసుకోడానికి ఉపయోగం. (తె. 2, 5; రా. 14, 15).

బొగాండి: చూ. బొగాని. (తె. 4).

బొగ్గు: చూ. పర్యా. చార్‌కోలు. కొలిమిలో లోహవస్తువులు వేడిచేయడానికి వాడే పదార్థం. (కో. 10, 22, 23, 26; తె. 15, 21; రా. 1,5).

బొగ్గుపొయ్యి: రూ. బొగ్గులపొయ్యి, బొగ్లపొయ్యి చూ. పర్యా. కుంపటి[1]. బొగ్గులతో వంటచేయడానికి వాడే లోహపుపొయ్యి. చూ. చిత్రం 181. (కో. 1, 16, 22; తె. 10, 20, 21; రా. 26).

బొగ్గుబిళ్ళ: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గుపొయ్యిలో బూడిదరాలడానికి వాడే రంధ్రాల ప్లేటు. చూ. చిత్రం 59. (కో. 22).

బొగ్గులకుంపటి: చూ. పర్యా. కుంపటి[1]. బొగ్గులతో వంటచేయడానికి వాడే లోహపుపొయ్యి చూ. చిత్రం 181. (కో. 1, 4, 15, 17, 19, 24, 26).

బొగ్గులగుండ: ముడిలోహము కరగడానికి అవసరమయ్యే వేడినిచ్చే పదార్థం. (రా. 15).

బొగ్గులపొయ్యి: చూ. బొగ్గులపొయ్యి. (కో. 1_4, 9, 14, 15, 19, 21, 23; తె. 1, 3, 4, 6, 8, 9, 11_17, 22, 23, 25).

బొగ్గుల పొయ్యిలబిళ్ళ: చూ. పర్యా. కుంపటిబిళ్ళ. బొగ్గులపొయ్యితో బూడిదరాలడానికి వాడే రంధ్రాల ప్లేటు. చూ. చిత్రం 59. (కో. 3).

బొగ్లపొయ్యి: చూ. బొగ్గుపొయ్యి, (కో. 18).

బొంగు: చూ. పర్యా. తిత్తికట్టె. కొలిమి తిత్తులను ఊపడానికి వాడే పొడవుపాటి వెదురుకట్టె. (తె. 17, 18; రా. 13, 14).

బొంగులకరవాయి: చూ. పర్యా. మట్టికరవాయి. లోహపు పాత్రలకు మెరుగుచక్కలు కొట్టడానికి

వాడే పరికరం. (కో. 3).

బొచ్చె: ఉ. బొచ్చు. చూ. పర్యా. గమేలం. ఇటుకలు, రాళ్లు, మట్టి మొదలైనవి మోయడానికి వాడే ఇనప పాత్ర. (కో. 4, 8; తె. 19, 21, 22).

బొట్టుపెట్టె: పర్యా. చుక్కబొట్టుపెట్టె. చుక్కపెట్టె. బొట్టూ కాటుక పెట్టుకోడానికి వాడే కుంకుమ, పుల్ల వగైరా సామాన్లు ఉంచుకొనే మూతఉండే చిన్న లోహపు పెట్టె. చూ. చిత్రం 182. (కో. 4, 5, 8, 9, 11, 12, 19-22, 28, 30; తె. 8, 9, 13, 19).

బొడగలు: చూ. పర్యా. గజ్జెలు[2]. ఎద్దులమెడకు వాహనాలకు కట్టడానికి వాడే లావు గుండు. ఇత్తడి గజ్జెలు. (కో. 22).

బొడిపెలు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపైఉండే గరుకులు[2], (కో. 23; తె. 1, 17, 19, 24, 25).

బొడిపై: పోతచెంబు మధ్యభాగం. (తె. 7).

బొడుసుకరవాయి: చూ. పర్యా. గుండుకరవాయి లోహపు పాత్రల అంచుభాగాలను తయారుచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 82. (తె. 5, రా. 10).

బొద్దుగంట: ఎద్దుకుమూపురం మీదపడేటట్టు అలంకారంగా వేయడానికి కోడిగొంతు కింద బోరకు వేయడానికి వాడే సాధనం. (రా. 7).

బొద్దుగిన్నె: చిన్నపిల్లల బొద్దుఆకారంలో ఉండే గుండుగిన్నె. దీనికి అడుగున బొద్దు ఉంటుంది. చిన్నపిల్లలకు అన్నం తినిపించడానికి ఉపయోగం. చూ. చిత్రం 175. (తె. 2, 17; రా. 7, 8).

బొద్దుగురిగి: చూ. పర్యా. పోకిచెంబు. చిన్నపిల్లలకు నీళ్ళు తాగించడానికి భోజన సమయంలో నెయ్యి వడ్డించడానికి వాడే చిన్నకప్పు. చూ. చిత్రం 191. (తె. 18, 24).

బొద్దుచెంబు: చూ. పర్యా, పాలచెంబు[2]. చిన్నపిల్లలకు పాలు తాపడానికి వాడే గొట్టం, హాండిలు అతికిఉండే చిన్నచెంబు. చూ. చిత్రం. (తె. 19, 20, 25).

బొద్దిమొల: రూ. బొద్దేలి. చూ. పర్యా. కన్నం. కరిగించిన లోహాన్ని అచ్చులో పోసేందుకు ఏర్పాటుచేసిన రంధ్రం. (కో. 24).

బొద్దుమోల: విగ్రహం మెడభాగంలో చెక్కడానికి ఉపయోగపడే పరికరం. (తె. 8, 9, 13).

బొద్దెలు: తాళాలకు ఉండే లావుపాటి రివిట్లు. (తె. 17).

బొద్దు[1]: పర్యా. లైనా, వంపు, సలాక[2]. ఇనుప వస్తువులకు బొద్దుకొట్టడానికి వాడే కమ్మిలాంటి పనిముట్టు. (తె. 10).

బొద్దు[2]: చూ. పర్యా. బారు[2]. పెట్టెకు డిజైనులాగ ఉండే పొడవాటి ఉబ్బు. (రా. 5, 10).

బొద్దు[3]: ట్రంకుపెట్టె గేడిభాగం. (కో. 2; రా. 5).

బొద్దు[4]: బాయిలర్ క్రిందిభాగం. (కో. 5).

బొద్దుఆకు: విగ్రహం వేళ్ళసందుల్లో చెక్కడానికి వాడే పరికరం. (కో. 10).

బొద్దుకడ్డీ: చూ. పర్యా. లివరు. వెల్డింగ్‌పనిలో ఇనప పట్టీలను డిజైన్లుగ వంపుచేయడానికి వాడే 'F' ఆకారపుకడ్డీ. (కో. 15, 19).

బొద్దుకన్నుసుత్తి: రేకు కొట్టడానికి వాడే పరికరం. (కో. 2).

బొద్దుకరవాయి: రేకును గుంతగా కొట్టడానికి ఉపయోగించే సాధనం. విగ్రహం లోతుగాఉండే తావు సాపుచేయడానికి కూడా వాడ్తారు. (కో. 3, 6, 11, 16; తె. 17).

బొద్దుకంటానీ: చూ. పర్యా. బొద్దులేగ. విగ్రహాలకు అంచుభాగాల్లోను, అర్ధచంద్రాకారపు చోట్లలోను, మెరుగు వేయడానికి వాడే పరికరం. (కో. 7, 12, 15, 21).

బొద్దుకొట్టు: (క్రి.) రేకు అడుగుభాగాన్ని కొంత ఉబ్బుగా వచ్చేటట్లు కొట్టడం. (కో. 2, 21; తె. 2; రా. 2, 4).

బొద్దుగెడ్డపార: విగ్రహం ముఖభాగంలో కొట్టుకోడానికి ఉపయోగించే పరికరం. (కో. 3).

బొద్దుచట్టం: చూ. పర్యా. దేబద్దీ. రేకులపై బొద్దులు కొట్టడానికి ఉపయోగపడే పరికరం. (కో. 2).

బొద్దుచదరం: చూ. పర్యా. కమ్మరసుత్తె. లోహపు రేకులను సాపుచేయడానికి వాడే పనిముట్టు.(కో. 3.)

బొద్దుచెక్కసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 10).

బొద్దుచేయు: (క్రి.) చేటపైభాగాన్ని వంచడం.(రా.1).

బొద్దుతుండు: బియ్యపు డబ్బాలపై బొద్దు కొట్టడానికి పనికివచ్చే సాధనం. (కో. 2).

బొద్దుదట్టు: చూ. పర్యా. మొద్దుపోగరు. విగ్రహాలకు బొద్దుకొట్టడానికి వాడే పరికరం. (కో. 3).

బొద్దుదించు: (క్రి.) పెట్టెపై డిజైనులాగ పొడవుగ బొద్దుకొట్టడం. (కో. 17).

బొద్దుపట్టీ: చూ. పర్యా. పట్ట[2]. రేకుపై బొద్దుకొట్టడానికి వాడే పొడవుపాటి పట్టీలు. (రా. 12).

బొద్దుపాటా: చూ. పర్యా. పట్రం. రేకుపై బొద్దుకొట్టడానికి వాడే సాధనం. (కో. 28).

బొద్దుపోగర: తీగలను తయారుచేయడానికి గుండ్రంగా ఉబ్బులను కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 16).

బొద్దుమాలి: చూ. పర్యా. పోకిచెంబు. చిన్న పిల్లలకు నీళ్ళు తాగించడానికి వాడే చిన్నపాత్ర. చూ. చిత్రం 191. (తె. 5).

బొద్దుమెరకసుత్తి: గాడి సాపుచేయడానికి వాడే కంచు పనిముట్టు. (కో. 22).

బొద్దుమొల: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి వాడే పరికరం. (తె. 2).

బొద్దులేగ: పర్యా. బొద్దుకంటానీ. విగ్రహాలకు అంచు భాగాల్లోను, అర్ధచంద్రాకారపు చోట్లలోను, మెరుగు వేయడానికి వాడే సాధనం. (కో. 10; తె. 25).

బొద్దులసుత్తి: చూ. బొద్దుసుత్తి. (కో. 5).

బొద్దులి: చూ. పర్యా. ఎక్కువదిమ్మ. లోహపు రేకుల జాయింట్లకు రివిట్లు కొట్టడానికి వాడే సాధనం. (కో. 19).

బొద్దువాలుపోగరు: విగ్రహంపనిలో హెచ్చుతగ్గుల్ని సరిచేసే పరికరం. (కో. 10).

బొద్దుశానం: లోహపు బద్దలను వంపుపెట్టడానికి ఉపయోగపడే అడుగుభాగం గుండ్రంగా ఉన్న పరికరం. (కో. 17, 19, 21, 26).

బొద్దుసుత్తి: రూ. బొద్దులసుత్తి. చూ. పర్యా. కమ్మరసుత్తె. లోహపు రేకులను సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 2, 3, 21; రా. 12).

బొన్కి: పాత్రలపై ఉండే బొడిపె. (తె. 5).

బొందలు: కాల్చిసాగగొట్టిన ఇనుముపై ఉండే హెచ్చుతగ్గులు. (తె. 21).

బొంబాయితపేల: బొంబాయిలో తయారయిన వంట పాత్ర. (కో. 29).

బొప్పాలీష్‌చేయు: (క్రి.) పాలీష్‌సోపు, రోసువడి పదార్థాలతో పాలీష్ చేయడం. (రా. 5).

బొప్పె: చూ. పర్యా. గమేలం. ఇటుకలు, రాళ్లు, మట్టి మొదలైనవి మోయడానికి వాడే ఇనపపాత్ర. (కో. 1, 4; తె. 10–13; రా. 4).

బొమ్మెసుత్తె: పర్యా. మరసుత్తె¹. బిందె అంచుకు బొమ్మెయడానికి ఉపయోగపడే పనిముట్టు. అడుగు భాగం ఏటవాలు చదరంగా ఉంటుంది. (తె. 17, 19, 21, 22).

బొమ్మెయు: (క్రి.) బిందె మూతిభాగం దట్టంగా ఉండటానికి కోవచుట్టూ కింద చిన్న గద్దెలాగ చేయడం. (తె. 19, 21, 22).

బొంబాయి: రూ. బొంబాయిలు. చూ. పర్యా. పంపు. డ్రమ్ముల్లో నుండి నూనెను పైకి తోడడానికి ఉపయోగపడే సాధనం. చూ. చిత్రం. (కో. 15. 17–26, 28).

బొంబాయిడొగర: చిన్న ఇనుప బొప్పె. (తె. 11).

బొంబాయిప్లేటు¹: చూ. పర్యా. కుటకలకంచం. కూరలు వేసుకోవడానికి వీలుగా గుంటలు అమర్చిచేసిన లోహపు భోజన పాత్ర. చూ. చిత్రం 57(తె. 12).

బొంబాయిప్లేటు²: చూ. పర్యా. ఫాన్సీప్లేటు. పాత్రల పైమూతగా ఉపయోగపడే డిజైన్లున్న పళ్లెం. (తె.13).

బొరిగి: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (కో. 26).

బొరుగు: చూ. పర్యా. కొత్తంపార. గడ్డి తవ్వడానికి వాడే పనిముట్టు. (కో. 20, 23, 30).

బొర్ర: చూ. పర్యా. కన్నం. పోతలోహాల్ని అచ్చుల్లోకి పోయడానికి ఏర్పాటు చేసిన రంధ్రం. (తె. 3; రా. 15, 16).

బొల్టులు: కత్తెరలభాగాల్ని బిగించే స్క్రూలు. (తె. 4).

బొవాని: చూ. బొగాని. (కో. 5, 8, 15; తె. 2, 11, 15; రా. 7).

బొవానిగిన్నె: ఉ. బొగానిగిన్నె. మూతి వెడల్పుగా లోతుతక్కువగా ఉండే లోహపు పాత్ర. కూరలు, అన్నం పెట్టుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం. 184. (తె. 15, 16).

బోకు: పర్యా. సరుకు.¹ పనికిరాని పాతలోహపు పాత్రలు. వీటిని కొలిమిలో కరిగించి మళ్లీ కొత్త పాత్రలు చేస్తారు. (కో. 22, 26, 28; రా. 8).

బోగుణి: చూ. బొగాని.

బోజొప్ప: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గునుకుదించడానికి కాకను చూడ్డానికి వాడే కొద్దిగా వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (తె. 3).

బోటుపాయ్యి: (< ఇం. Boat+పొయ్యి) పడవ ప్రయాణికులు ఉపయోగించే పొయ్యి. (కో. 23).

బోడిగిన్నె: ఒంగిన అంచుతో సాదాగా ఉండే గుండ్రని గిన్నె. మట్టుండదు. (కో. 16, 17, 20, 29).

బోడిలేగ: చూ. పర్యా. మెరకలేగ. బోడిగా గోరులాగా ఉండే పరికరం. కాయ వంపుల్లోనూ, జవల్లోనూ, మట్టుల్లోనూ మెరుగుపట్టడానికి, లోహం ఎక్కువగా

ఉన్నప్పుడు తగ్గించడానికి వాడే పరికరం. (కో. 21).

బోడిసె: ఉ. బోడ్సె. చూ. పర్యా. బేసను. వెడల్పు మూతి, లోతుఉన్న లోహపుపాత్ర. అన్నం ఆరబోసుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 179. (తె. 20).

బోడుసుత్తి: ఇనుపముక్కలను పదును పెట్టడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం. (కో. 20).

బోదులుకమ్మి: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమి లోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (కో. 30).

బోనస్: చూ. పర్యా. సన్నకత్తెర. లోహపు రేకులకు జాయింట్లు చేసే పల్లును వంచడానికి కత్తరించడానికి వాడే సాధనం. (రా. 11),

బోను: చూ. పర్యా. ఎలకలబోను. ఎలకలు పట్టుకోడానికి వాడే సాధనం. చూ. చిత్రం 30. (కో. 4, 9; రా. 5).

బోర్: రేకులో గుంతగ ఉండేభాగం. (రా. 12).

బోరాలు: పాత్రలను సరఫరా చేసేటపుడు వాడే గోనెసంచులు. (రా. 14, 16).

బోరింగ్‌బార్: (ఇం.) కమ్మరపనిలో ఉపయోగించే పరికరం. (కో. 7).

బోరు: చూ. బ్లోరు. (కో. 17, 18; తె. 21).

బోరుతీయు: (క్రి.) గుండ్రని ఇత్తడిరేకులను బిందె డొల్కకు అతకడానికి వీలుగ పళ్ళెంమాదిరి తయారు చేయడం. (తె. 19).

బోలట్: చూ. బోల్టు. (తె. 6).

బోలెం: చూ. పర్యా. బకెటు. నీళ్ళు నిల్వఉంచడానికి, నూతిలోంచి నీళ్ళు చేదడానికి వాడే సాధనం. (కో. 10).

బోల్టు: (ఇం.) రూ. బోలట్. చూ. పర్యా. గుల్లమోపు లోహపురేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే దిమ్మ. (రా. 12).

బోల్స్: చూ. బౌల్. (కో. 1).

బౌల్: రూ. బవుల్స్, బోల్స్. చూ. పర్యా. కూరగాయ గిన్నె. చేసిన వంటకాలను టేబిల్‌పై ఉంచుకోడానికి వాడే మూతఉన్న పాత్ర. (కో. 26; తె. 14).

బౌలు: గుండ్రని ఇత్తడిరేకు. (తె. 8).

బౌవ్వాని: చూ. బొగాని. (తె. 4).

బ్యాక్‌వీల్‌రింజి: (ఇం.) సైకిల్ వెనుకచక్రం ఊడదీయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 15).

బ్యాట్రీపైపు: (ఇం.) బెండ్‌అయిన బీగంచెవులను వంపులేకుండా చేయడానికి వాడే పరికరం. (రా. 3).

బ్యాండేజిచేయు: (క్రి.) (< ఇం. Bandage + చేయు) చూ. బెండ్‌చేయు. సమంగావుండే రేకును వంచడం. (రా. 4).

బ్యారిల్: (ఇం.) పెట్రొమాక్స్‌లైట్‌లో ఒకభాగం.

బార్శిగొట్టం: చూ. పర్యా. బేరాలు. దొరలువాడే పొగాకుగొట్టం. (కో. 30).

బ్రుష్‌బుష్: హాండిల్ ఊడిరాకుండ తలుపులోపల బిగించిన సాధనం. (తె. 20).

బ్రాస్‌రాడ్: (< ఇం. Brass rod) స్పేయర్‌గొట్టాలకు బిగించిన పరికరం. (కో. 8).

బ్రాస్‌సబ్బు: చూ. పర్యా. కమల్‌సోపు. లోహపు పాత్రలపై పాలిష్ చేయడానికి వాడే సబ్బు. (తె. 3).

బ్రాస్‌స్టౌ: ఇత్తడిటాంకిపై బర్నర్ అమర్చిన స్టౌ. (తె. 3, 17).

బ్రుష్: వెల్డింగ్‌పనిలో గొర్లు కొనభాగంలో ఉండే పరికరం. (కో. 7).

బ్రుస్కి: చూ. పర్యా. టాకి[4]. మరలు బిగించడానికి బీరువాపనిలో వాడే 'T' ఆకారపు పరికరం. (కో. 19).

బ్రెడ్‌అచ్చు: (< ఇం. Bread + అచ్చు) బ్రెడ్లు పెట్టుకోడానికి వాడే పరికరం. (రా. 5).

బ్రెష్‌నట్టు: (ఇం.) చూ. పర్యా. నట్టురాడ్డు. సానరాయిపై ఉన్న మైలను తొలగించడానికి ఉపయోగపడే సాధనం. కడ్డీమధ్యలో రెండుబోల్టులు బిగించి ఉంటారు. చూ. చిత్రం. (తె. 22).

బ్రెష్షు[1]. (ఇం.) ఉ. బ్రుష్. లోహపు వస్తువులపై ఉన్న మైలను పోగొట్టడానికి ఉపయోగపడే సాధనం. (కో. 28; తె. 20, 22, 24).

బ్రెష్షు[2]: ఉ. బ్రష్, బ్రుష్. రూ. బ్రెస్సు. లోహపు రేకులపై రంగుపూయడానికి ఉపయోగపడే కుంచె. (కో. 3. 8, 10, 16, 24, 28; తె. 8, 9, 17, 20).

బ్రెష్షు[3]: ఉ. బ్రష్. చూ. పర్యా. కుంచె. లోహపు వస్తువులకు పాలిష్‌చేయడానికి వాడే పనిముట్టు. (తె. 17; రా. 5).

బ్రెస్సు: ఉ. బ్రస్. చూ. బ్రెష్షు[2]. (కో. 26, 28).

బ్రేక్‌జులా: సైకిల్ వెనుకచక్రభాగంలో ఉండే కమ్మి. (తె. 12).

బ్రేక్‌షో: (ఇం.) చూ. పర్యా. బ్రేక్‌సట్. సైకిల్‌బ్రేకు వేయడానికి వాడే పరికరం. (తె. 12, 13).

బ్రేక్‌సట్: (ఇం.) పర్యా. బ్రేక్‌షో. సైకిల్‌బ్రేకు వేయడానికి వాడే పరికరం. (తె. 8).

బ్రేకుబటనుపాన: (ఇం.) ఉ. బిరక్ బటన్‌పాన. సైకిల్‌బ్రేకునట్టు టైట్ చేయడానికి వాడే స్పానరు. (తె. 8, 11, 13).

బ్రేకురింజి: (ఇం.) సైకిల్‌బ్రేకులు విప్పి, బిగించ డానికి వాడే పరికరం. (కో. 14).

బ్రోకసు: చూ. పర్యా. కుడ్క. కొబ్బరితురమడానికి వాడే పరికరం. (తె. 10, 11).

బ్లేడు[1]: చూ. పర్యా. కత్తి[1]. కూరగాయలు కోయడానికి వాడే పరికరం. (రా. 11, 15).

బ్లేడు[2]: రేకుపై కొలతలు గీయడానికి వాడే చిన్న రంపపుముక్క. (కో. 23; తె. 17, 24).

బ్లేడు[3]: పుస్తకాలు, పేపర్లు కటింగ్‌కి వాడే చాకు. (కో. 23).

బ్లేడు[4]: చూ. పర్యా. రంపం. టింకర్‌పనిలో కమ్ములు కోయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 195. (రా. 5).

బ్లేడుకత్తి: (<ఇం. Blade + కత్తి) చూ. పర్యా. మంగలికత్తి. మంగలిషాపుల్లో షేవింగ్ చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 185. (తె. 23).

బ్లోయరుకొలిమి: చూ. పర్యా. అతుకుడుకొలిమి. పాత్రల రేకులను అతకడానికి ఉపయోగించే చిన్న బొయ్యి. (తె. 14).

బ్లోయర్‌లాంపు: (ఇం.) చూ. పర్యా. బొయ్యి[1]. స్ప్రేయర్‌సామాన్లు వేడిచేయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 8).

బ్లోయరు: (ఇం.) ఉ. ప్లాయరు. ప్లోయరు. రూ. బ్లోరు. చూ. పర్యా. పంకా. కొలిమికి గాలి రావడానికి అమర్చిన సాధనం. (కో. 1–4, 6–10, 12, 13, 15–17, 19, 22, 23, 25, 28, 29; తె. 9–13, 15, 18; రా. 2, 4, 5, 6–9).

బ్లోరు: ఉ. బిలోరు, బులోరు, బులేరు. రూ. ప్లోరు, బోరు. చూ. పర్యా. పంకా. కొలిమికి గాలిరావడానికి అమర్చిన సాధనం. (కో. 16, 19–21, 30; తె. 1–4, 6, 7, 17, 20, 21, 22–24, 25; రా. 10, 12–15).

బ్లోలాము: చూ. పర్యా. చూర. లోహపు పాత్రలను అతకడానికి వాడే పదార్థం. (కో. 2).

బ్లోలాంపు: (ఇం.) చూ. పర్యా. బొయ్యి[1]. స్టౌబర్నర్‌లను స్ప్రేయర్ సామాన్లను వేడిచేయడానికి ఉపయోగపడే పరికరం. చూ. చిత్రం. (తె. 3)

బ్లోల్యాప్: (ఇం.) ఏవైనా వస్తువులు ఊడదీయడానికి వాడే పరికరం. (కో. 14).

బ్లోవల్సు: చూ. పర్యా. కన్నం. గాలాలు. (కో. 23).

బ్లౌజు: (ఇం.) చూ. పర్యా. కవరు[1]. వెల్డింగ్ చేసే టప్పుడు కరెంటుషాక్ కొట్టకుండ ఉండడానికి చేతులకు వేసుకొనే చర్మపుతొడుగు. (కో. 17, 21; తె. 18).

బ్లౌవాస్: (క్రి.) (ఇం.) చూ. ఫ్రేములపై ఒకసారి వెల్డింగు చేసిన తర్వాత మరల ఎక్కడైనా సందులున్నాయా లేవా అని తనిఖీచేయడం. (తె.25).

## భ

భజనతాళం: భజన చేసుకోడానికి వాడే సాధనం. (కో. 28, 29; తె. 10, 11).

భట్టి: చూ. బట్టి. (తె. 6).

భత్తా: రూ. బత్తా[2]. (తె. 24).

భరిణె: రూ. బరిణె, బరిషి, బర్నీ. చూ. పర్యా. కుంకుమ పోసుకోడానికి ఉపయోగించే స్టీల్‌కప్పు గిన్నె. దీనికి మూత ఉంటుంది. చూ. చిత్రం 56. (కో. 20).

భాగసుత్తె: చూ. బాగసుత్తె. (తె. 11).

భాగవతపట్టం: దేవతావిగ్రహం నొసటికి అలంకరించ డానికి వాడే మామిడికాయ వాటంగా ఉండే లోహపు సాధనం. (కో. 2).

భాగాలడబ్బా: చూ. బాగాలడబ్బా. (తె. 14, 16).

భాతు(మరాఠి): చూ. బత్తా[1]. (తె. 4).

భాస్కప్పు: చూ. బాస్కప్పు. (తె. 17).

భుజకీర్తులు: భుజానికి పెట్టడానికి వాడే లోహపు తొడుగులు. (కో. 12, 16; తె. 3).

భుజం: చూ. పర్యా. జత. లోహపుపాత్ర దొడ్డి, కుతిక కలిసిన భాగం. (కో. 2, 5, 26, 28; తె. 20; రా. 2).

భుజంపెట్టు: (క్రి.) చూ. పర్యా. దొల్కచేయు. ఇత్తడిబిందె రేకులను ఒక ఆకారంగా మార్చడం. (తె. 17).

భుజంవేయు: (క్రి.) మధ్యభాగానికి అతకడానికి బిందె కుతికని ఏటవాలుగ సాగగొట్టడం. (కో. 26).

భుజాలకరవాయి: బిందె భుజంభాగాన్ని తయారు చేయడానికి వాడే పనిముట్టు. (తె. 1, 3, 10, 11, 15–17, 22, 23, 25).

భుజాలకొరాం: పర్యా. భుజాలమొల. బిందె భుజం భాగం సాపుచేయడానికి వాడే పనిముట్టు. పొడవు కడ్డీలాగా కొద్దివంపు కలిగిఉంటుంది. (తె. 23, 25).

భుజాలకైవారం: బాణంచిల్లు ఆకారంలో ఉన్న

పనిముట్టు. బిందెభుజాల కొలతలను సరిచూడడానికి ఉపయోగం. (తె. 19).

భుజాలమొల: చూ. పర్యా. భుజాలకొరాం. బిందె భుజంభాగాలను సాపుచేయడానికి వాడే పరికరం. పొడవు కడ్డీలాగా కొద్దివంపు కలిగిఉంటుంది. (తె. 23, 25).

భుజాల్సుత్తి: చూ. పర్యా. పలచనిసుత్తి. బిందె మూతులు, అడుగులు సాపుచేయడానికి వాడే సుత్తి. చూ. చిత్రం 153. (తె. 17, 19, 21).

భోజనప్లేటు: రూ. భోజనంప్లేటు. చూ. పర్యా. కుటకల కంచం. కూరలు వేసుకోడానికి వీలుగా గుంటలు అమర్చిచేసిన లోహపు భోజనపాత్ర. చూ. చిత్రం 57. (తె. 2).

భోజనపాత్ర: చూ. పర్యా. కుటకలకంచం. కూరలు వేసుకోడానికి వీలుగా గుంటలు అమర్చిచేసిన భోజనపాత్ర చూ. చిత్రం 57. (తె. 1, 4, 10).

భోజనంకారేజి: చూ. పర్యా. కారియరు. అన్నం వగైరా పదార్థాలు తీసుకెళ్ళడానికి వాడే పాత్ర. (కో. 26).

భోజనంప్లేటు: చూ. పర్యా. కుటకలకంచం. కూరలు వేసుకోడానికి వీలుగా అమర్చిచేసిన లోహపు భోజనపాత్ర. చూ. చిత్రం 57. (కో. 28).

## మ

మకరతోరణం: పర్యా. సింహతలాటం. దేవాలయాల్లో విగ్రహం వెనుకవైపు మండపంలో చెక్కే అలంకరణ. మధ్యలో సింహంతల అమరుస్తారు. (కో. 5, 6, 8, 11–13, 16, 20, 28; తె. 1, 3, 9, 14, 19, 21, 22, 24; రా. 11, 13).

మకిరికొట్టు: (క్రి.) చూ. పర్యా. చుక్కకొట్టు. పూర్తిగ అతికిన తర్వాత బిందెపై వంకర్లు లేకుండ నున్నగ సాపుచేసి మెరుగుచుక్కలు కొట్టడం. (కో. 21).

మకిలి: రూ. మక్కిలి. చూ. పర్యా. చిలుము. లోహపు రేకులపై, కడ్డీలపై పట్టినతుప్పు. (తె. 22).

మకుటం: చూ. పర్యా. కిరీటం. దేవుని విగ్రహాలకు తలనెత్తిన పెట్టడానికి వాడే లోహపు సాధనం. (తె. 6).

మక్కిలి: చూ. మకిలి. (కో. 30).

మక్కు: చూ. పర్యా. చాక్‌పౌడరు. రివిట్లు, అతుకులు కనబడకుండ బీరువాపై పూయడానికి వాడే తెల్లని పదార్థం. (కో. 24, 28; తె. 20; రా. 7, 8).

మక్కుబ్లేడు: పర్యా. స్టీలుబ్లేడు. బీరువాకు మక్కును పూయడానికి వాడే విరిగిన రంపపుముక్క. (తె. 25).

మగ్గు: (ఇం.) చూ. పర్యా. కొండిపావు. నీళ్ళుపోసుకోడానికి, వేడిగా ఉండే ద్రవపదార్థాల్ని చల్లార్చడానికి వాడే లోహపుపాత్ర. చూ. చిత్రం 67. (కో. 17, 18, 22, 23, 26, 29; తె. 1–5, 12, 17, 18, 20–25; రా. 4, 6, 7, 12, 14, 15).

మంగన్‌మొద్దు: పాత్రల్ని రిపేరి చేసేటప్పుడు మంగన్‌ను కదలకుండ బిగించడానికి ఉపయోగించే కొయ్యదిమ్మ. (తె. 17).

మంగలికత్తి: రూ. మంగళకత్తి. పర్యా. నాటిరైజల్ నాటుకత్తి, నాటుకత్తెర, పత్తిచాకు. బార్‌బార్‌రేజర్, బ్లేడుకత్తి, రైజరు[2]. మంగలిషాపుల్లో షేవింగ్‌కు వాడే పనిముట్టు. చూ. చిత్రం 185. (కో. 20, 23; తె. 2, 4, 18).

మంగలికత్తెర: చూ. పర్యా. బార్‌బార్‌కత్తెర. మంగలిషాపుల్లో కటింగ్‌చేయడానికి వాడే పనిముట్టు. (తె. 7, 18, 21, 22; రా. 15).

మంగలిరాయి: చూ. పర్యా. నూరేరాయి. మంగలిషాపుల్లో కత్తులు, కత్తెరలు సానపట్టడానికి వాడే రాయి. (తె. 22).

మంగళకత్తి: చూ. మంగలికత్తి. (రా. 1).

మంగళహారతి: పర్యా. మంగళహార్తి తపుక. కర్పూరపు హారతి ఇవ్వడానికి వాడే గంట. (తె. 15).

మంగళారతి తప్పు: చూ. పర్యా. మంగళారతిపళ్లెం. ఆలయాల్లో హారతి ఇవ్వడానికి వాడే ఇత్తడిపళ్లెం. వెలుపుగా అంచుచుట్టూ డిజైన్ ఉంటుంది. చూ. చిత్రం 186. (తె. 16).

మంగళారతి పళ్లెం: పర్యా. మంగళారతి తపుక. దేవాలయాల్లో హారతి ఇవ్వడానికి ఉపయోగించే స్టీలుతట్ట. వెలుపుగా అంచుచుట్టూ డిజైను ఉంటుంది. చూ. చిత్రం 186. (తె. 17, 18).

మంగళహార్తి తప్పు: చూ. పర్యా. మంగళహారతి. హారతి ఇవ్వడానికి వాడే చిన్న గరిట. (తె. 14).

మచ్చలు: పాత్రలో తెల్లగఉండే ప్రదేశాలు. (కో. 28).

మచ్చుకత్తి: చూ. పర్యా. మచ్చుకొడవలి. కట్టెలు కొట్టడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 187. (రా. 11).

మచ్చుకొడవలి: పర్యా. మచ్చుకత్తి. చెట్లకొమ్మలు నరకడానికి వాడే పనిముట్టు. చేత్తో పట్టుకోడానికి పిడి ఉంటుంది. చూ. చిత్రం 187. (రా. 4).

మజ్జిగకవ్వం: చూ. పర్యా. కవ్వం. మజ్జిగ చిలక డానికి వాడే సాధనం. చూ. చిత్రం 45. (కో. 1, 2, 15; తె. 2, 11, 13-15; రా. 4).

మజ్జిగచెంబు: పర్యా. మజ్జిగదుత్త, మజ్జిగబుడత, మజ్జిగముడత, మిల్లిచెంబు, మోరుచెంబు. నీళ్ళకు, మజ్జిగకు వాడే చెంబు. (కో. 1, 4-7, 10, 11, 27).

మజ్జిగదుత్త: చూ. పర్యా. మజ్జిగచెంబు. నీళ్ళకు, మజ్జిగకు వాడే చెంబు (కో. 5).

మజ్జిగబుడద: చూ. పర్యా. మజ్జిగచెంబు. నీళ్ళకు, మజ్జిగకు వాడే చెంబు. (కో. 4).

మజ్జిగముడత: చూ. పర్యా. మజ్జిగచెంబు. నీళ్ళకు, మజ్జిగకు వాడే చెంబు. (కో. 5).

మంచంబెండిగ్ మిషన్ : (< మంచం + ఇం. Bending machine)లోహపు మంచాలు తయారు చేయడానికి వాడే మిషన్. (రా. 2).

మంచినూనె: చూ. పర్యా. ఆయిలు. లోహపు పాత్రలకు మెరుగుపెట్టడానికి వాడే ద్రవపదార్థం. (కో. 10, 24).

మంజరిపీట: చూ. పర్యా. కుడ్క. కొబ్బరిని తురమ డానికి వాడే పరికరం. (తె. 9, 17).

మంజన్: (హిం.) నాగలికారు. (రా. 13).

మట్ సుత్తి: చూ. మట్నసుత్తె. (కో. 29).

మటన్ దబరాగిన్నె: మాంసం వండుకోడానికి వాడే వెడల్పుగాఉన్న చిన్న లోహపుపాత్ర. (కో. 7).

మటం: (క్రి.) చెంబులను శుభ్రపరచడం. (కో. 10).

మట్ట¹: చూ. పర్యా. కుంచు. కాక బాగారావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే గుడ్డచుట్టిన కర్రముక్క. (కో. 20, 26).

మట్ట²: లోహపుపాత్రలపై ఆసిడ్‌ను పూయడానికి వాడే సాధనం. (కో. 22, 24).

మట్ట³: విగ్రహంపై కొట్టేముక్క. (కో. 3).

మట్టఉచి: రేకుమడుపులను చక్కగ చేయడానికి వాడే పనిముట్టు. (రా. 2).

మట్టఉలి: బిందె తరగడానికి ఉపయోగపడే పని ముట్టు. (కో. 1; రా. 1).

మట్టకన్నుసుత్తి: అంచులు ప్రక్కకు పెరగడానికి వీలుగా సాగదీయడానికి వాడే పరికరం. (కో. 2).

మట్టకరవాయి: చూ. బొంగుల కరవాయి. (తె. 15).

మట్టగానికరవాయి: పర్యా. మొగలకరవాయి. బిందె గొంతు, జవ్వలను జాయింట్ చేయడానికి వాడే పనిముట్టు. (రా. 5).

మట్టన్: కాగుపొట్ట. (కో. 5).

మట్టన: చూ. పర్యా. కరుడుమట్న. పాతపాత్రల్ని సాపుచేసే పని. (కో. 59).

మట్టనవేయు: (క్రి.) చూ. మట్నవేయు. (కో. 19).

మట్టనగరిట: పొడవైన రంధ్రాలుండే స్టీలుగంటె. (కో. 24).

మట్టపచ్చి: చూ. మట్టప్పచ్చు. (కో. 17).

మట్టపలక¹: చూ. పర్యా. అడికోలు. లోహపురేకులపై, కడ్డీలపై కొలతలు వేయడానికి వాడే పరికరం. రెండు లేదా మూడు అంగుళాల వెడల్పు అయిదు లేదా ఆరు అడుగుల పొడవు ఉన్న దృఢమైనకర్ర ముక్కతో కాని తళతళమెరిసే స్టీలుతో గాని తయారుచేస్తారు. (కో. 2; రా. 2, 3).

మట్టపలక²: చూ. పర్యా. పట్టె². రేకుపై బొద్దుకొట్ట డానికి వాడే పొడవుపాటి పట్టి. (రా. 5).

మట్టపుల్లి: పర్యా. హిందూస్తాన్‌ఉలి, హిందూస్తాన్ కమ్మి, హిందూస్తాన్‌పట్టి. పెట్టెమూతకు పైన బొద్దులు కొట్టడానికి ఉపయోగించే కడ్డీలాంటి పరికరం. (రా. 10).

మట్టపుసుత్తి: చూ. మట్నసుత్తె. (కో. 3).

మట్టప్పచ్చు: రూ. మట్టపచ్చి. చూ. పర్యా. పక్క మిరియం. రేకుమడుపులను చక్కగ చేయడానికి వాడే పరికరం. (కో. 4, 5, 9, 13, 15; రా. 2).

మట్టమిరియం: చూ. మట్టమెరిం. (రా. 10).

మట్టమెరిన్: రూ. మట్టమెరియం. చూ. పర్యా. పక్క మిరియం. రేకుమడుపులను చక్కగ చేయడానికి వాడే పరికరం. (రా. 3).

మట్టమెరిం: రూ. మట్టమిరియం. చూ. పర్యా. అపగోలు. లోహపురేకులను, కడ్డీలను సాపు చేయడానికి వాడే లోహపుదిమ్మ. (రా. 5).

మట్టసుత్తి: చూ. మట్నసుత్తె (కో. 3).

మట్టం¹: చూ. పర్యా. కారు¹. కాల్చిన ఇనపబద్దీలను సాపుచేయడానికి వాడే దిమ్మ. (తె. 21).

మట్టం²: గంట అడుగుభాగం. (రా. 5).

మట్టంఉలి: చూ. పర్యా. ఎక్కువ దిమ్మ. లోహపు రేకులజాయింట్లకు రివిట్లుకొట్టడానికి వాడే సాధనం (రా. 4).

మట్టంగునపం: పర్యా. మట్టందట్ట, మట్టంలేగ, మట్టంసాప్ గెడ్డపార, మట్నమొల, మోడల్‌ప్లేట్ రేకును లెవల్‌గా సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 13, 20).

మట్టంగెడపార: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగు భాగాలు

కొట్టడానికి వాడే పరికరం. (రా. 2).

మట్టంచివ్బల: విగ్రహం అడుగుభాగాన్ని పట్టడానికి వాడే పరికరం. (కో. 2).

మట్టంచెక్కసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 10).

మట్టందట్టు: చూ. పర్యా. పట్టంగునపం. రేకును లెవల్‌గా సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 10).

మట్టంపట్టకారు: చూ. పర్యా. అతికే కారు. నిప్పును, వేడి లోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమి దగ్గర వాడే పనిముట్టు. (కో. 20).

మట్టంపెట్టు: (క్రి.) ముద్దచేసిన ఇనుమను రంధ్రం వేయడానికి వీలుగా నున్నగ సమం చేయడం. (తె. 24).

మట్టంపోగరు: చూ. పర్యా. గోరులేగ. పాత్రలకు పాలిష్‌చేసే పరికరం. (కో. 16, 18).

మట్టంబద్ద: చూ. పర్యా. అడికోలు. ఇత్తడిపాత్రలపై, ఇనుపసామాన్లపై కొలతలను గీయడానికి ఉపయోగించే ఇనుపబద్ద. (కో. 16).

మట్టంలేగ: చూ. పర్యా. మట్టంగునపం. కంచాలు సాపుగా ఉండే భాగంలో మెరుగుపట్టడానికి వాడే పరికరం. (కో. 10, 24).

మట్టంశానం: అంగ్లర్లు తెగ్గొట్టడానికి వాడే పనిముట్టు. దీని చివరభాగం సూదిగ ఉంటుంది. (కో. 21).

మట్టంసాప్‌గెడ్డపార: చూ. పర్యా. మట్టం గునపం. రేకును లెవల్‌గా సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 4, 9, 11).

మట్టంసుత్తి¹: చూ. మట్నసుత్తి. (కో. 6, 10; 12, 16).

మట్టంసుత్తి²: విగ్రహంపనిలో రేకుపై లతలను సాపుచేయడానికి ఉపయోగించే సాధనం. చిన్న స్థలాలు ఉండేచోట్ల ఉపయోగం. (కో. 17).

మట్టాముపాడుచు: (క్రి.) పాత్రల కుతికను సాపుగ సాగగొట్టడం. (కో. 23).

మట్టి: చూ.పర్యా. జిగురుమట్టి. పోతపాత్రను తయారు చేయడానికి ఉపయోగించే జిగురుగాఉన్న బంక మన్ను. (కో. 4).

మట్టిఉండ: పోతపనిలో అచ్చును తీసివేసిన తర్వాత అచ్చుకు కరుచుకొనిఉన్న మట్టి. (కో. 2).

మట్టికుండ: చూ. పర్యా. జాలిగడ్డ. పెట్రొమాక్స్ లైటుకు గ్యాస్‌ను అందించడానికి వొత్తికి పైభాగాన అమర్చిన రంధ్రాల దిమ్మ. (తె. 23).

మట్టిజాలి: చూ. పర్యా. జాలిగడ్డ. పెట్రొమాక్స్ లైటుకు గ్యాస్‌ను అందించడానికి వొత్తికి పైభాగాన అమర్చిన రంధ్రాల దిమ్మ. (తె. 23).

మట్టితట్ట: చూ. పర్యా. గమేలం. మట్టి మోయడానికి వాడే ఇనపసాధనం. (రా. 2).

మట్టివేయు: (క్రి.) అచ్చుపీటలో దీపానికి పై భాగంలో మట్టిని వేయడం, (రా. 5).

మట్టు¹: చూ. పర్యా. గద్దె¹. పాత్రలు ఎత్తుగా ఉంచడానికి వీలుగా క్రిందిభాగంలో అమర్చిన గుండ్రటి లోహపురింగు. (కో. 20, 23, 26, 28, 29),

మట్టు²: కొడవలిపిడికి వాయికి మధ్యఉండే పలకవంటి భాగం. (తె. 23),

మట్టుచెక్క: మన్నును మెత్తగా కొట్టడానికి ఉపయోగపడే గూటం. (రా. 15).

మట్టుగిన్నె: పర్యా. గద్దెగిన్నె. అడుగుభాగంలో మట్టు (జవ) అతికిచేసిన లోతైన లోహపుపాత్ర. అన్నం తినడానికి ఉపయోగం. (కో. 4, 6, 8-11, 13, 15, 17-30).

మట్టుగ్లాసు: చూ. పర్యా. గద్దెగిలాసా. క్రింది భాగంలో గద్దెఉండే పలకలాంటి డిజైను ఉన్న లోహపులోటా. నీళ్ళు తాగడానికి ఉపయోగం. (కో. 19. 23, 24, 29, 30).

మట్టుచెంబు: చూ. పర్యా. గద్దెచెంబు. అడుగుభాగం కింద మోపకుండ ఎత్తయిన కట్టు అమర్చిన సన్న మూతి లోహపుచెంబు. (కో. 23, 27-29).

మట్టుటిఫెన్: తీపిపదార్థాలను ఉంచుకొనే లోహపు పాత్ర. (కో. 15).

మట్టెలకడ్డీ: కమ్మిని వంచడానికి జవ్వను తురమడానికి వాడే పొడవైన లోహపు సాధనం. (కో. 28).

మట్నఏయు. (క్రి.) ఉ. మట్నెఏయు. రూ. మట్టన ఏయు, మట్నవేయు. చూ. పర్యా. చుక్కకొట్టు. పూర్తిగ అతికిన తర్వాత బిందెపై వంకర్లు లేకుండ నున్నగ సాపుచేసి మెరుగుచుక్కలు కొట్టడం. (కో. 17, 19. 20, 24, 27, 29; తె. 17, 19; రా. 15).

మట్నకరవాయి: ఉ. మట్నకరువాయి. రూ. మట్ట కరవాయి. పర్యా. బొంగులకరవాయి, మరచెంబుల కరవాయి, మెరుగుదెబ్బల కరవాయి, మైలవరపు కరవాయి, మైలవరపుబిందె మెరుగుకరవాయి, మైల వరపు మూతికరవాయి. లోహపుపాత్రలకు మెరుగు చుక్కలు కొట్టడానికి వాడేపరికరం. (కో. 2, 4,

5, 7, 10, 12, 20, 22; రా. 16).

మట్నుకొట్టు: (క్రి.) చూ. పర్యా. చుక్కకొట్టు. పూర్తిగ అతికిన తర్వాత బిందెపై వంకర్లు లేకుండ నున్నగ సాపుచేసి మెరుగుచుక్కలు కొట్టడం. (తె. 2, 6, 14, 15, 18, 21–26).

మట్నుగన్ను: చూ. పర్యా. మట్నుసుత్తె. లోహపు పాత్రలకు మట్నుఏయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 188. (తె. 23).

మట్నుపని: ఉ. మట్నెపని. చూ. పర్యా. కరడుపని. లోహపు పాత్రలను సాపుచేసే పని. (కో. 7, 26).

మట్నుపలుగు: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 10).

మట్నుపోగర: పోతవిగ్రహాన్ని కుదింపుచేయడానికి వాడేపనిముట్టు. (కో. 17).

మట్నుమొల: చూ. పర్యా. మట్టంగునపం. రేకును లెవల్‌గా సాపుచేయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 20).

మట్నువేయు: (క్రి.) చూ. మట్నుఏయు. (కో. 7, 16, 25).

మట్నుసుత్తి: ఉ. మటనసుత్తి, మట్నుసుత్తి, మట్నాసుత్తి, మట్నెసుత్తి. రూ. మట్‌సుత్తి, మట్టపుసుత్తి, మట్టసుత్తి, మట్టంసుత్తి[1], మట్నంసుత్తి[2], మట్లంసుత్తి, మడసుత్తి, మరసుత్తె[2]. పర్యా. చిన్నదేశ్‌మట్‌సుత్తి, పాలిష్‌సుత్తి, మట్నుగన్ను, మేలిసుత్తి. లోహపు పాత్రలకు సాపుగా మట్ను వేయడానికి వాడే కంచు పరికరం. అడుగుభాగంలో నాలుగుపలకలుగా ఉంటుంది. చూ. చిత్రం 188. (కో. 3–13, 16–30; తె. 1–4, 14–15, 18–25; రా. 2, 9, 14–16).

మట్నంసుత్తి[1]: చూ. మట్నుసుత్తె. (కో. 1, 2, 4; తె. 12; రా. 5).

మట్నంసుత్తి[2]: చూ. పర్యా. గుండుసుత్తి. లోహపు రేకులను కత్తరించడానికి రంధ్రాలు చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (కో. 5).

మట్నె: చూ. పర్యా. దట్టిలచుసుత్తి. అతుకులు కనపడకుండ సాపుచేయడానికి వాడే సుత్తి. (రా. 12).

మట్నెకొట్టు: (క్రి.) పాత్రలకు అతుకులు కనపడకుండా సుత్తెతో సాపుచేయడం. (తె. 24).

మట్లంసుత్తి: చూ. మట్నుసుత్తె. (కో. 13).

మట్లాంసుత్తి: పర్యా. మర్పుత్తి, మునిసుత్తె. పాత్రల ఇరుకుభాగాల్లో సాపుచేయడానికి వాడే ముందుకు వంగిఉండే ఇనపసుత్తె. (రా. 1).

మట్లి: చూ. పర్యా. అడుగు. ఇత్తడి, ఇనుప పాత్రల అడుగుభాగపు రేకు. (కో. 15).

మతారకొట్టు: (క్రి.) చూ. పర్యా. చుక్కకొట్టు. పూర్తిగ అతికినతర్వాత బిందెపై వంకర్లు లేకుండ నున్నగ సాపుచేసి మెరుగుచుక్కలు కొట్టడం. (రా. 14).

మతారించు: (క్రి.) పర్యా. మొలచు. కాగబెట్టిన ఇనుపబద్దను వంపులులేకుండ నైసుగ చేయడం. (తె. 11, 12).

మడ్ ఉలిసట్టం: ట్రంకు మూతపై క్రిందిభాగంపై కూర్చోడానికి వీలుగా గాడికొట్టడానికి ఉపయోగించే సాధనం. (రా. 10).

మడ: పర్యా. మడబిళ్ళ. బిందెడొల్క (పక్కరేకు)కు అతికించిన భుజభాగపు రేకు. (తె. 17–22).

మడగల్లు: సైకిల్ చక్రాలుపైన ఉండే బొప్పెలు. (తె. 8, 13).

మడగొట్టు: (క్రి.) చూ. పర్యా. తీయు[2]. రేకులను గాడిలాగ మడచటం. (కో. 23).

మడచు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపు రేకులను కలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (కో. 28).

మడచేయు: చూ. పర్యా. బెండ్‌చేయు. కొలత ప్రకారం లోహపురేకులను, పట్టీలను వంపుపెట్టడం. (రా. 11).

మడత ఎట్టు: (క్రి.) చూ. పర్యా. తీయు[2]. రేకులను కలపడానికి వీలుగ గాడికొట్టడం. (కో. 18).

మడత ఏయు[1]: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపురేకులను కలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (కో. 28).

మడత ఏయు[2]: (క్రి.) చూ. పర్యా. తీయు[2]. మలకటో ఏయడానికి వీలుగా అంచులను గాడిలాగ కొట్టడం. (కో. 13).

మడతచేయు: (క్రి.) చూ. పర్యా. బెండ్‌చేయు. కొలతప్రకారం లోహపురేకులను, పట్టీలను వంపుపెట్టడం. (రా. 14).

మడతబెట్టు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపు రేకులను కలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (తె. 2).

మడతమాన్లు: గ్లాసులు. (8, 9).

మడపట్టు: (క్రి.) కంచుపళ్ళెం అంచులు నున్నగా వంకర్లులేకుండా సాపుచేయడం. (తె. 17).

మడపన్లు: చూ. పర్యా. కక్కులు. ఇత్తడిపాత్రల భాగాలను అతకడానికి రేకు అంచులపై అక్కడక్కడ చేసిన చిన్నకత్తిరింపులు. (తె. 14).

మడబిళ్ళు: చూ. పర్యా. మడ. బిందెగొల్క (పక్క రేకు)కు అతికించిన భుజభాగపు రేకు. (తె. 15).

మడసుత్తి: ఉ. మడిసుత్తి, మడుసుత్తె. చూ. మట్నుసుతె. (కో. 19, 27; తె. 17, 23, 24).

మడలలావుసుత్తి: వెల్డింగ్‌పనిలో మధ్యవంపులు సరిచేసే పరికరం. (కో. 11).

మడలెట్టు: (క్రి.) పొడుగ్గాఉన్న లోహపురేకును గుండ్రంగా కడ్డీలాగ వంచి తయారుచేయడం. (కో. 16).

మడవు: (క్రి.) కత్తెరకూసాన్ని వేళ్లపట్టే విధంగా వంచడం. (తె, 17).

మడిదలసుత్తి: చూ. పర్యా. ఆమరు. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 19).

మడుకొట్టను: (క్రి.) చూ. పర్యా. తీయు[2]. మల్‌కట్ ఏయడానికి వీలుగా అంచులను గాడిలాగ కొట్టడం. (కో. 18).

మడుగాటు: (< ఇం. Mud G a d). సైకిల్ పైకి మన్నురాకుండా నిరోధించే పరికరం. (తె. 12).

మడుగుబోలగిద్దె: చూ. పర్యా. కారాచాచ. వాంపొడి, మురుకులువగైరా పదార్థాలను చేయడానికి వాడే లోహపుపరికరం. చూ. చిత్రం 50. (తె. 4).

మడుగులపావు: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 14-17).

మడుచు (క్రి.) మరుచు. చూ. పర్యా. బెండ్‌చేయు. కొలతప్రకారం లోహపురేకులను, పట్టీలను వంపు పెట్టడం. (కో. 2; రా. 2-5).

మడుచుకొను: (క్రి.) చూ. పర్యా. బెండ్‌చేయు. కొలతప్రకారం లోహపురేకులను, పట్టీలను వంపు పెట్టడం.

మడుపు: చూ. పర్యా. రివిట్‌చేయు. రెండు రేకుఅంచుల్ని ఒకదానితో ఒకటి ఎదురెదురుగా అమర్చి ఊడిరాకుండ గట్టిగా కొట్టడం. (తె. 2; రా. 4, 10).

మడుపుకరవాయి: గోరులాగ ఏటవాలుగ ఉండే కరవాయి. పాత్రల అంచుల్ని మడవడానికి ఉపయోగం. (కో. 27).

మడుపుచేయు: (క్రి.) చూ. పర్యా. బెండ్‌చేయు. కొలతప్రకారం లోహపు రేకులను, పట్టీలను వంపు పెట్టడం. (కో. 6).

మడుపేయు[1]: (క్రి.) పర్యా. ముదురు, ముద్దాయించు. పాత్రల మూతి భాగాలను అంచులాగ దట్టంగా వెనక్కి మడచడం. (కో. 17; తె. 3).

మడుపేయు[2]: (క్రి.) చూ. పర్యా. అతుకు. రెండు లోహపు కమ్ములను కలిపి కాల్చి ఒకటిగ గుండ్రంగా అతకడం. (కో. 27).

మడ్డి: టంకుపెట్టి తయారైన తర్వాత లోభాగాన పూయడానికి వాడే పనికిరాని రంగు. (రా. 8).

మడ్డిజార: చెరకుపాకంమీది కసువును తీయడానికి వాడే పనిముట్టు. (రా. 11).

మద్రాసుబిందె: చూ. పర్యా. చంకబిందె మూతి పొడుగ్గా, అడుగుమట్టంగా క్రిందిభాగం వెడల్పుగా ఉండే లోహపుపాత్ర. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. (కో. 10, 24, 25; తె. 17, 19),

మంటిచిప్ప: చూ. పర్యా. కుడక. టంకంపొడి వేసుకోడానికి వాడేపాత్ర. (తె. 6).

మండుఉలి: చూ. మొద్దులి. (రా. 11).

మతార: వంటలు చేయడానికి వాడే అండా ఆకారంలో ఉన్న లోహపుపాత్ర. (రా. 7).

మత్తి: పిడిని వేయడానికి పాటరేకుకు బిగించిన పెద్ద రంధ్రం ఉండే ఇనపబద్ది. (కో. 29).

మదుంచక్కి: చూ. పర్యా. కాలువచక్కి. కాలువల్లోకి చెత్తాచెదారం వెళ్ళకుండ అడ్డంపెట్టడానికి వాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 51 (కో. 24).

మద్దు: కొయ్యదిమ్మకు మధ్యలో గాడి కొట్టడానికి ఉపయోగించే సాధనం. (రా. 13).

మద్దెలసుత్తి: చూ. పర్యా. పెద్దసుత్తె. రేకును లావు చేయడానికి, కుదింపు చేయడానికి వాడే ఇనప పనిముట్టు. (కో. 20).

మద్రాస్‌బిందె: ఉ. మద్రాస్‌బింది, మద్రాసుబింది. చూ. పర్యా. కూజా. నీళ్ళు తెచ్చుకోడానికి వాడే కూజా ఆకారమున్న లోహపుపాత్ర. (తె. 1, 3, 5-7, 10-12, 16, 17; కో. 13, 28, 29).

మద్రాసుచెంబు: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారమున్న చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 81. (కో. 3, 5, 6, 10, 11, 29; తె. 9, 18).

మద్రాసుజగ్గు: చూ. పర్యా. జగ్గు. నీళ్ళు ఉంచుకోవడానికి ఉపయోగించే డిజైన్ ఆకారంతో చేసిన

లోహపుపాత్ర. చూ. చిత్రం 105. (తె. 14, 16).

మద్రాసుద్రమ్ము: నీళ్ళు కాచుకోడానికి ఉపయోగపడే పాత్ర. పట్టుకోడానికి కాడలుంటాయి. (కో. 15).

మద్రాసుబిందెలకరవాయి: చూ. పర్యా. కూజా కరవాయి. కూజా ఆకారపు బిందెలను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 177. (తె. 3, 4, 7, 10, 11; రా. 9).

మద్రాసుమీల్స్‌ప్లేటు: చూ. పర్యా. కుటకలకంచం. కూరలు వేసుకోడానికి వీలుగా గుంటలమర్చి చేసిన లోహపు భోజనపాత్ర. చూ. చిత్రం 57. (తె. 14-16).

మధ్యరేకు: చూ. పర్యా. అడ్డ[1]. బిందె మధ్యభాగపు రేకు. (తె. 7).

మనగొట్టు: (క్రి.) చూ. పర్యా. అణిగేయు. పొడవుగా ఉండే ఇనుపముక్కలను కొలిమిలో కాల్చి ముద్దగా చేయడం. (కో. 16).

మనిగిపోవు: (క్రి.) అణిగిపోవడం. (తె. 21).

మనుగుబాయి: తినుబండారాలు చేసుకోడానికి వాడే లోహపు పరికరం. (కో. 9).

మంత్రతదండం: చూ. పర్యా. కత్తి[3]. వెల్డింగ్ ఉబ్బులను కొట్టడానికి వాడే పరికరం. (కో. 22).

మంథాని: చూ. మాతాని. (రా. 16).

మంథార్: చూ. పర్యా. దేక్షా. వంటచేయడానికి వాడే లోహపుపాత్ర. ఏటవాలు భుజాలతో అడుగుభాగం వెడల్పుగా ఉంటుంది. చూ. చిత్రం 123. (తె. 1).

మందడి: రూ. మందద, మందరి, మందలి. రెండు లోహపు రేకులనుగాని కడ్డీలనుగాని ఒకటిగా అతికేపని. (కో. 21, 22, 28, 29).

మందడికాయు: (క్రి.) రూ. మందలికాయు. చూ. పర్యా. అతుకు. రెండు లోహపుకమ్ములను కలిపి కాల్చి ఒకటిగ గుండ్రంగా అతకడం. (కో. 21).

మందడిమూటు: (క్రి.) చూ. పర్యా. అతుకు. రెండు లోహపుకమ్ములను కలిపికాల్చి ఒకటిగ గుండ్రంగా అతకడం. (కో. 22).

మందడేయు: (క్రి.) ఉ. మందడి ఏయు. రూ. మందిరి ఏయు. చూ. పర్యా. అతుకు. రెండు లోహపుకమ్ములను కలిపి కాల్చి ఒకటిగ గుండ్రంగా అతకడం. (కో. 19, 20, 27-30).

మందర: చూ. మందడి. (కో. 17).

మందర అతుకు: (క్రి.) చూ. పర్యా. అతుకు. రెండు లోహపుకమ్ములను కలిపి కాల్చి ఒకటిగ గుండ్రంగా అతకడం. (కో. 17).

మందరి: చూ. మందడి. (కో. 17; రా. 14).

మందలికాయు: (క్రి.) చూ. మందడికాయు. (కో. 24; తె. 2).

మందం: పాత్రలకు జాయింట్ దగ్గరఉండే ఉబ్బు. (తె. 8, 9).

మందారాకు: మందరాకులాగా మందంగా ఉండే కంచం. అన్నం తినడానికి ఉపయోగం. (కో. 1).

మందాలగునపం: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి అడుగు భాగాలు కొట్టడానికి వాడే పరికరం. (కో. 7).

మందిరిఏయు: (క్రి.) చూ. మందడిఏయు. (రా. 14).

మప్పు: (క్రి.) రేకుపై సైజుప్రకారం కొలతలు వేయడం. (కో. 18).

మయం: చూ. పర్యా. అడ్డ[1]. బిందె మధ్యభాగపు రేకు. (కో. 21, 26, 27); తె. 21).

మయందొడ్డి: చూ. పర్యా. అడ్డ[1]. బిందె మధ్యభాగపు రేకు. (కో. 24).

మర: చూ. పర్యా. చీల[2]. రేకు జాయింట్లు విడిపోకుండ ఉండడానికి వాడే చిన్న చీల. (రా. 4).

మరకసుత్తి: బిందె గొంతుభాగం చేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 5).

మరగబెట్టు: (క్రి.) చూ. పర్యా. కాగబెట్టు. కొలిమిలో లోహపు పాత్రల్ని, కడ్డీలను బాగా ఎర్రగా వేడి చేయడం. (కో. 20, 28).

మరచెంబు[1]: ఉ. మర్చెంబు. చూ. పర్యా. కీలు చెంబు. ప్రయాణాల్లో నీళ్ళకువాడే లోహపు చెంబు. మూతికి మరలుకొని పట్టుకోడానికి హాండిల్ అమర్చి వుంటుంది. చూ. చిత్రం 189. (కో. 1-10, 19-30; తె. 1-6, 8, 14-21, 24, 25; రా. 2, 7, 14).

మరచెంబు[2]: పర్యా. రాగికలిశ, రాగిపాత్ర, రామపాత్ర, విష్ణుచెంబు. దేవాలయాల్లో తీర్థానికి ఉపయోగపడే రాగిపాత్ర. (తె. 9).

మరచెంబుల కరవాయి: చూ. పర్యా. మట్టి కరవాయి. మరచెంబులకు మెరుగుపట్టడానికి వాడే కరవాయి. (కో. 4, 9).

మరచ్చు: (< మర + అచ్చు). మరచెంబులకు దీపస్తంభాలకు మరచేయడానికి వాడే అచ్చు. (రా. 13).

మరతోడు: రూ. మరతోలు. చూ. పర్యా టన్ష్ స్క్రూ. స్క్రూలను ఊడదీయడానికి, బిగించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 219. (రా. 6).

మరతోలు: చూ. మరతోడు. (కో. 7).

మరపోగరు: చూ. పర్యా. టాకి[4]. మరలు బిగించడానికి బీరువాపనిలో వాడే 'T' ఇకారపు పరికరం. (కో. 18, 24).

మరపోర్‌హ్యాండిలు: వెల్డింగ్‌పనిలో మరలు కోసుకొనే పరికరం. (కో. 15).

మరముంత: నీళ్ళు తెచ్చుకోడానికి వాడే చెంబు. (తె. 10, 11).

మరవేయు: (క్రి.) పర్యా. తరుగు. లోహపురేకులపై, కడ్డీలపై గీతలువేయడం. (రా. 5).

మరవై: చూ. పర్యా. దేక్షా. వంట చేయడానికి వాడే పాత్ర. ఏటవాలు భుజాలతో అడుగుభాగం వెడల్పుగ ఉంటుంది. చూ. చిత్రం 123. (రా. 14).

మరసుత్తె[1]: చూ. బొమ్మెసుత్తె. బిందె అంచుకు బొమ్మెయడానికి ఉపయోగపడే పనిముట్టు. అడుగుభాగం ఏటవాలు చదరంగా ఉంటుంది. (తె. 10).

మరసుత్తె[2]: చూ. మట్నసుత్తె. (తె. 17).

మరసుత్తె[3]: పాత్రల మూతిభాగాలు వాటంగా రావడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 6).

మరాకులు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బుడిపెలు. (తె. 23).

మరాత్రిద్రావకం: పాత్రకుండే చిలుమును పోగొట్టడానికి వాడే ద్రవపదార్థం. (కో. 1-3; రా. 3-5).

మరామత్తుచేయు: (క్రి.) చెడిపోయిన లోహపు వస్తువుల్ని తిరిగి రిపేరుచేసి తయారుచేయడం. (కో. 24).

మరుగు: చూ. పర్యా. పరువు. కరిగే లోహంపై ఉండే మైలపదార్థం. (తె. 17, 21, 23).

మరుగులు: చూ. పర్యా. గరుకులు[2]. లోహపు పాత్రలపై ఉండే బొడిపెలు. (తె. 25, 28).

మరుచు: రూ. మడుచు. రేకు అంచులు పట్టీలాగ మడచటం. (రా. 16).

మర్చుత్తి: చూ. పర్యా. మట్లాంసుత్తి. పాత్రల ఇరుకు భాగాల్లో సాపుచేయడానికి వాడే ముందుకు వంగి ఉండే ఇనపసుత్తె. (కో. 25).

మర్రిచెంబు: చూ. పర్యా. మరచెంబు[1]. మరలు ఉన్న మూతపై హాండిల్ అమర్చిన చెంబు. ప్రయాణాల్లో నీళ్ళు తీసుకెళ్ళడానికి ఉపయోగం. చూ. చిత్రం 189. (తె. 3).

మర్రింజి: చిన్న నట్లు విప్పడానికి వాడే పరికరం. (కో. 13).

మర్రేకు: మర్రి ఆకు అకారంలో ఉన్న అంచులేని భోజనం ప్లేటు. (కో. 7, 11, 12; 13, 16, 20, 25, 29).

మలకట్: చూ. పర్యా. డబల్ ఫోల్డింగు. రెండురేకులను కలిపి ఒకటిగావేసిన మడత. (కో. 21).

మలకట్‌కొట్టు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపురేకులను కలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (కో. 16; తె. 17).

మల్‌కట్‌చేయు: (క్రి.) చూ. మల్‌కట్టు ఏయు. (కో. 5; రా. 8).

మల్‌కట్ డై: చూ. పర్యా. ఎక్కువ దిమ్మ. లోహపు రేకుల జాయింట్లను రివిట్లు కొట్టడానికి వాడే సాధనం. (రా. 7).

మల్‌కట్ దిమ్మ: ఉ. మల్‌కట్ దిమ్మె. రూ. మలకడ దిమ్మ. చూ. పర్యా. ఎక్కువ దిమ్మ. లోహపు రేకుల జాయింట్లకు రివిట్లు కొట్టడానికి వాడే సాధనం. (కో. 8; 12, 13, 15; తె. 21; రా. 4).

మల్‌కట్ ప్లేటు: సాల్డరింగ్‌పనిలో అతకడానికివాడే ప్లేటు. (కో. 14).

మల్‌కట్టు; మూత ప్రక్కరేకు. (రా. 11, 12).

మల్‌కట్టు ఏయు: (క్రి.) రూ. మల్‌కట్‌చేయు. పర్యా. కోరుచేయు. రెండు లోహపురేకులను కలిపి ఒకటిగా జాయింట్ చేయడం. (కో. 2, 18-23, 26, 28; తె. 17, 21; రా. 1, 2, 4, 11, 12, 15, 17).

మలకడదిమ్మ: ఉ. మలకాడదిమ్మ. రూ. మల్క దిమ్మ. చూ. మల్‌కట్ దిమ్మ. (కో. 18; తె. 17).

మలకంపోవు: (క్రి) కాలిన ఇనుపబద్ద **తనంతతానే** ముడిగిపోవడం. (తె. 2).

మలచు: చూ. పర్యా. డొల్కచేయు. బిందె రేకును ఒక ఆకారంగా చేసుకోవడం. (తె. 12).

మలట్ ఏయు: (క్రి) చూ. చుక్కకొట్టు. పూర్తిగ అతికినతర్వాత బిందెపై వంకర్లులేకుండ నున్నగ సాపుచేసి మెరుగుచుక్కలు కొట్టడం. (రా. 12).

మలాటు: ఉ. మలాట. చూ. పర్యా. ఆమురు. లోహపు రేకును, కడ్డీను తెగ్గొట్టడానికి, సాగ్గొట్టడానికి వాడే పరికరం. (కో. 5, 7; తె. 19).

మలుచు[1]. (క్రి) చూ. పర్యా. లోహపు రేకును శుభ్రపరచడం. (కో. 6; తె. 8, 14, 15).

మలుచు[2]: (క్రి.) కొలతప్రకారం రేకును గుండ్రంగా వంచడం. (తె. 17).

మలుచు[3]: (క్రి.) విగ్రహాల్ని చెక్కడం. (తె. 3; రా. 5).

మలుచు[4]: (క్రి.) రూ. మల్చు[2]. **పాత్రలకు మోషు**

చేసిన భాగాలవద్ద ఉండే అతుకుల బొడిపెలులేకుండ సమంగా అరగొట్టడం. (తె. 16).

మల్కడిమ్మ: చూ. మలకడదిమ్మ. (రా. 15).

మల్చు[1]: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపు రేకులను కలిపి ఒకటిగా అతకడం. (తె. 6).

మల్చు[2]: (క్రి.) చూ. మలుచు[4]. (తె. 7).

మల్చు[3]: (క్రి.) పెట్టెలోని రంధ్రాన్ని శుభ్రం చేయడం. (రా. 5).

మల్చుకొను: (క్రి.) ఎద్దుగిట్టలకు వేసిన ఖిళ్ళల్ని శుభ్రం చేయడం. (రా. 6).

మల్పు: (క్రి.) చూ. పర్యా. తేల్పు. లోహపురేకును గుండ్రంగ వంచి బిందె డొల్కను చేయడం. (తె. 4).

మల్లువచ్చు: (క్రి.) విగ్రహాలను అరబెట్టిన తర్వాత తెచ్చుకోపడం. (రా. 1, 5).

మల్లితూక్కు: ఉ. మల్లితుక్కు. చూ. మల్లితూగు. (కో. 17; తె. 10, 11).

మల్లితూగు: ఉ. మల్లెతూగు. రూ. మల్లితూక్కు. చూ. పర్యా. చట్నితుక్కు. నూనె, ఏవైనా పదార్థాలు ఉంచుకోడానికి ఉపయోగించే నిలువుపాత్ర. మూత ఉంటుంది. (కో. 6, 11; తె. 4; రా. 14).

మల్లిముల్లు: కాలిలోని ముల్లును తీయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 190. (రా. 3, 5, 10).

మళ: చూ. పర్యా. చీల[1]. ఘాతం వేయడానికి వాడే చీల. (రా. 11, 13).

మసకపోగరు: విగ్రహం పనిలో కాళ్ళు చెక్కడానికి వాడే పరికరం. (కో. 8, 10, 16, 18).

మసపోగరు: ఉ. మసపోగర. చూ. పర్యా. గుజారను. లోహపు రేకుపై డిజైన్లు కొట్టడానికి వాడే పరికరం. (కో. 6; తె. 25).

మసాలడబ్బా: చూ. పర్యా. గదులపెట్టె. మసాల దినుసులు వేసి ఉంచుకోడానికి వాడే పరికరం. 4, 5, 6, 7 లేదా 8 గిన్నెలు కలిపి ఒక వెడల్పు పాత్రలో అమర్చి ఉంటారు. చూ. చిత్రం 73. (కో. 1-4, 7, 9, 15, 17, 19, 23, 26, 30; తె. 8-11, 14, 16, 17, 19).

మసాలపొడిడబ్బా: చూ. పర్యా. గదులపెట్టె. మసాలపొడులు వేసి ఉంచుకోడానికి వాడే పరికరం. 4, 5, 6, 7 లేదా 8 గిన్నెలు కలిపి ఒక వెడల్పు పాత్రలో అమర్చి ఉంటారు. చూ. చిత్రం 73. (రా. 4).

మసాలబాక్సు: చూ. పర్యా. గదులపెట్టె. మసాల దినుసులు వేసి ఉంచుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం 78. (కో. 1; రా. 14).

మసాలస్పూను: మసాలపొడి వేసుకోడానికి ఉపయోగపడే గెరిట. (కో. 6, 11).

మహాద్రావకం: చూ. పర్యా. ఆసిడ్. అల్యూమినియం పాత్రలను తెల్లగాచేసే ద్రావకం. (కో. 8, 10, 16, 21).

మహారాష్ట్రిపళ్లెం: పదార్థాలు పెట్టుకోడానికి ఉపయోగపడే పరికరం. (తె. 10, 11).

మహాలక్ష్మిబుడ్డి: దేవునిమూలలో దీపం వెలిగించడానికి వాడే పరికరం. (తె. 24).

మాగ్నెట్: (ఇం.) ఇత్తలిపొడిలోని ఇనుమునుతీసి వేసే సాధనం. (కో. 19).

మాంజరి: చూ. పర్యా. కుడక. కొబ్బరిని తురమడానికి వాడే పరికరం. (తె. 12. 13).

మాటు: చూ. పర్యా. అతుకు. రెండు రేకులనుగాని, కమ్ములనుగాని పట్టాలనుగాని ఒకటిగా అతకడం. (రా. 3).

మాటుకొను: (క్రి.) రేకురంధ్రాల్లో ఇరుక్కోవడం. (రా. 3).

మాట్లుపని: చూ. పర్యా. కళాయిపని. పాత్రలను రిపేరు చేసి కలాయిచేసేపని. (కో. 17).

మాట్లేయు: (క్రి.) పర్యా. సాడర్‌చేయు. రెండు రేకులను జాయింట్ చేయడం. (తె. 22).

మాణిక్యాలు: రూ. మానిక్యాలు. చూ. పర్యా. చెమ్మెలు. దీపం వెలిగించడానికి వాడే లోహపు సాధనాలు. చూ. చిత్రం 103. (తె. 8, 9, 15, 17).

మాండల్: చూ. పర్యా. బంపర్. పాత్ర ఆకారాన్ని తయారుచేయడానికి స్పిన్నింగ్ మిషన్‌కు అతికి ఉండే అచ్చు. (రా. 14, 16).

మాతాని: రూ మాంథాని. పాత్ర ఆకారాన్ని చేసేటప్పుడు చేతికి ఆధారంగా వాడే మిషనుకు అమర్చిన సాధనం.

మానాకురాయి : సమ్మెటకట్టెలకు, సుత్తికట్టెలకు కాడ వలిపిడులకు బుడుపులుంటే రాయడానికి వాడే పనిముట్టు. (రా. 4).

మానిక: చూ. పర్యా. మానక ధాన్యం కొలవడానికి ఉపయోగపడే పాత్ర.

మానిక్యాలు: చూ. మాణిక్యాలు. (తె. 6, 17).

మానితుండు: చూ. పర్యా. కొయ్యతుండు. సామాన్లు పెట్టితట్టుకోడానికి వాడే కర్రముక్క. (రా. 3).

మూనిదుక్క: పాత్రల అడుగు రేకుల్ని గుంతగా కొట్టడానికి ఉపయోగించే దిమ్మ. (కో. 26).

మూనుసుత్తి: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (రా. 3).

మూన్కా: పర్యా. శేరు. మానిక ధాన్యం కొల్వడానికి ఉపయోగించే శేరు. చూ. చిత్రం 210. (తె. 24)

మూపు: పెట్టెమూత ప్రక్కభాగాన ఉండేరేకు. (రా.12).

మూఫ్: దీపంబుడ్డి తయారు చేసేటప్పుడు రేకు చుట్టు కొలత తీయడానికి వాడే చిన్నరేకు పట్టి. (తె. 17)

మామిడాకుబుట్ట: పూలు వేసుకోడానికి వాడే మామిడాకు అకారంతో తయారుచేసిన స్టీలుపాత్ర. (కో. 1).

మామిడిఅడి: మామిడికాయ లాగ ఉండే ఇత్తడిరేకు చెంబు. (కో. 22).

మారతుకు: (క్రి) చూ. పర్యా. నిలవకొలుచు. బిందెను ఒకసారి అతికిన తర్వాత రంధ్రాలుంటే మరల, మరల రవ్వవేసి అతకడం. (తె. 23).

మారుబెట్టు: (క్రి.) ఉ. మరబెట్టు. చూ. పర్యా. నిలవకొలుచు. బిందెను ఒకసారి అతికిన తర్వాత రంధ్రాలుంటే మరల, మరల రవ్వవేసి అతకడం. (తె. 21).

మారుసూచు: (క్రి.) నీళ్ళపాత్ర కారకుండా చూడడం. (తె. 8, 9).

మార్కుచేయు: (క్రి.) (< ఇం. Mark + చేయు) చూ. పర్యా. మార్కేయు. లోహపు రేకుపై గుర్తులు పెట్టడం. (తె. 2).

మార్కిన్: రూ. మార్కింగ్, మార్గిను. చూ. పర్యా. పోగరు. చూ. చిత్రం 165, (కో. 4, 11, 17-19, 23, 26, 28; తె. 3, 6, 17, 22, 24; 25; రా. 11, 12, 14, 16).

మార్కింగ్: చూ. మార్కిన్. (రా. 6).

మార్కింగ్‌చేయు: (క్రి.) (< ఇం. Marking + చేయు) చూ. పర్యా. మార్కేయు. లోహపురేకుపై గుర్తులుపెట్టడం. (కో. 24; రా. 7, 11).

మార్కు: బీరువారేకుపై వేసే కొలత. (రా. 4, 8).

మార్కుపోగరు: చూ. పర్యా. పోగరు. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలేయడానికి గుర్తులు పెట్టే పరికరం. చూ. చిత్రం 165. (కో. 10).

మార్కులువేయు: (క్రి.) చూ. మార్కేయు. (రా.4).

మార్కెట్టు: (క్రి.) చూ. పర్యా. మార్కేయు. లోహపు రేకుపై గుర్తులుపెట్టడం. (కో. 18, 26).

మార్కేయు: (క్రి.) రూ. మార్క్సువేయు, మార్కులు వేయు. పర్యా. మార్కుచేయు, మార్కింగ్‌చేయు, మార్కెట్టు. లోహపు రేకుపై గుర్తులుపెట్టడం. (కో. 18, 26).

మార్కోలు: (ఉర్దూ.) చూ. పర్యా. చిన్న కటకల సుత్తి. లోహపురేకులను, కడ్డీలను బెండ్‌చేయడానికి, రివిట్‌చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 23).

మార్క్సుపట్టి: చూ. పర్యా. అడికోలు. ఇత్తడి పాత్రలపై, ఇనుపసామాన్లపై కొలతలను గీయడానికి వాడే ఇనుపబద్ద. (రా. 16).

మార్క్సువేయు: (క్రి.) చూ. మార్కేయు. (రా. 6).

మార్గిను: చూ. మార్కిన్. (రా. 10).

మార్వాడిముంత: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారమున్న లోహపు పాత్ర. చూ. చిత్రం 84. (తె. 10-12).

మార్వాడిచెంబు: పర్యా. బొంబాయ్ అకుపరాచెంబు. మూతి పొడుగ్గాఉండే చెంబు. (కో. 7, 10, 12, 14, 20-22, 24, 29).

మాస్కిచేయు: (క్రి.) గొడుగు పైభాగంలో కమ్మీలు కనపడకుండా చుట్టూ గుడ్డకప్పి కుట్టడం. (కో. 20).

మించకొట్టు: (క్రి.) బిందెపై అతుకులు కనపడకుండ అణగ్గొట్టడం. (తె. 2).

మిట్టగన్నుసుత్తి: కచ్చులను కలపడానికి వాడే పరికరం. (కో. 10).

మిట్రంబాక్సు: నీళ్ళు ఉంచుకోడానికి వాడే డ్రమ్ము లాంటి పెట్టె. (తె. 10).

మిదిని: కొడవళ్ళకు పదునుపెట్టడానికి వాడే చిన్న ఇనపదిమ్మె. (రా. 4).

మిదిను: చూ. పర్యా. అడగోలు. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లోహపు దిమ్మ. (రా. 14).

మిరం: ఉ. మిరిం. చూ. పర్యా. అడగోలు. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లోహపు దిమ్మ. (కో. 17; రా. 12, 15).

మిరిన్: చూ. పర్యా. పక్కమిరియం. రేకు మడుపులను చక్కగ చేయడానికి పరికరం. (రా. 15).

మిరిన్‌గడ్డ: చూ. పర్యా. అడగోలు. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లోహపు దిమ్మ. (రా. 15).

మిర్రియం: ఉ. మెరియం. చూ. పర్యా. అడగోలు. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే లోహపు దిమ్మ. (కో. 10; రా. 8).

మిరియంబిళ్ళ: చూ. పర్యా. అడగోలు. లోహపు రేకులను, కడ్డీలను సాపు చేయడానికి వాడే లోహపు దిమ్మ. (తె. 2).

మిర్చికట్టర్: (< మిర్చి + Cutter) పర్యా. సిలీస్ కట్టర్, హవుస్‌మిషన్. మిరపకాయలు తరగడానికి ఉపయోగపడే స్టీలు సాధనం. ఒక గరిటె కింది భాగంలో కట్టర్‌ను అమర్చి ఉంటారు. (తె. 1. 2).

మిర్రు: చూ. పర్యా. అడ్డ[1]. బిందె మధ్యభాగపు రేకు. (తె. 23).

మిర్రుకరవాయి: ఏటవాలుగా గుండ్రనితల గలిగిన కరువాయి. బిందెదొల్ల చేయడానికి ఉపయోగం. (తె. 25).

మిల్క్‌కాను: (ఇం.) రూ. మిల్క్‌క్యాను. చూ. పర్యా. పాలడబ్బా[1]. నూనె, పాలు తెచ్చుకోడానికి వాడే హాండిల్ కలిగిన గుండ్రని లోహపుపాత్ర. (తె. 2, 9).

మిల్క్‌కుక్కర్: (ఇం.) పాలు కాచుకోడానికి వాడే లోహపుపాత్ర. (కో. 1).

మిల్క్‌క్యాను: (ఇం.) చూ. మిల్క్‌కాను. (కో. 7; తె. 12, 13).

మిల్క్‌గ్లాసు: (ఇం.) నీళ్ళు, పాలు తాగడానికి వాడే గ్లాసు. (కో. 6, 10, 11).

మిల్క్‌పడి[1]: (< ఇం. Milk + పడి) చూ. పర్యా. పాలడబ్బా[1]. నూనె, పాలు మొదలయిన వాటిని కొలుచుకోడానికి వాడే గుండ్రని పాత్ర. పట్టుకోడానికి కాడ ఉంటుంది. (కో. 6-8, 10, 11).

మిల్క్‌పడి[2]: చూ. పర్యా. కడీడబ్బా, పొలందగ్గరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే హాండిల్, మూతఉన్న పాత్ర. (తె. 19).

మిల్క్‌బకెట్: పాలు పోసుకోడానికి వాడే పాత్ర. (కో. 6, 8).

మిల్క్‌బైలరు: (ఇం.) పాలుకాచుకోడానికి వాడే లోహపు పాత్ర. (తె. 10).

మిల్ట్రీపాత్ర: (< ఇం. Military + పాత్ర) డిజైన్లు లేకుండా సాధారణంగా ఉండే ట్రంకుపెట్టె. (తె.17).

మిల్లిచెంబు: చూ. పర్యా. మజ్జిగచెంబు. నీళ్ళకు, మజ్జిగకు వాడే చెంబు. (కో. 1; తె. 8).

మిషన్: (ఇం.) ఇత్తడిగాజుల తయారీలో ఉపయోగపడే పరికరం. (కో. 6).

మిషన్‌కత్తెర: (< ఇం. Machine + కత్తెర) చూ. పర్యా. గుడ్డకత్తెర. బట్టలు కత్తిరించడానికి ఉపయోగించే పరికరం, చూ. చిత్రం 78. (కో. 23; తె. 24).

మిషన్‌స్టాండు: (ఇం.) కుట్టుమిషన్‌ను బిగించడానికి ఉపయోగపడే స్టాండు. (రా. 6).

మిషను: (ఇం.) చూ. పర్యా. చేతి డ్రిల్లింగ్‌మిషను. బీరువారేకులపై రంధ్రాలు వేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 10; రా. 7, 8).

మిషినెల్‌టాప్: (ఇం.) చూ. పర్యా. జాలిగడ్డ. పెట్రొమాక్స్‌లైటుకు గ్యాస్‌ను అందించడానికి వొత్తికి పైభాగాన అమర్చిన రంధ్రాల దిమ్మ. (తె. 22).

మీట: గొడుగును తెరచినపుడు కప్పును పట్టిఉంచే సాధనం. ఇదిగొడుగు కర్రకే ఉంటుంది. (కో. 28-30).

మీటర్: రేడియోను రిపేరు చేయడంలో వాడే పరికరం, (తె. 11).

మీటరుపుల్ల: చూ. పర్యా. పట్టి[1]. రేకులపై కొలతలను గుర్తించడానికి వాడే పొడవైన రేకుస్కేలు. చూ. చిత్రం 71. (తె. 18).

మీటుకమాను: చూ. పర్యా. బటన్. తెరచినప్పుడు గొడుగుపుల్లలను పట్టిఉంచే సాధనం. (కో. 18).

మీట్లకత్తెర: బిందెకొనలు సమానం చేయడానికి వాడే పరికరం. (తె. 10, 11).

మీట్లై: చూ. పర్యా. ఎలకలబోను. ఎలుకలు పట్టడానికి వాడే బోను. చూ. చిత్రం 30. (తె. 15, 16).

మీడియంరాయి: చూ. పర్యా. గరుకురాయి[1]. వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడే రాయి. (రా. 10).

మీదుగ: చూ. పర్యా. తలకాయ. బిందె పైభాగపు రేకు. (తె. 1).

మీల్సుకారియరు: (ఇం.) చూ. పర్యా. కారియరు. అన్నంవగైరా పదార్థాలు తీసుకెళ్ళడానికి వాడేపాత్ర. (తె. 2).

మీల్సుట్రే: (ఇం.) చూ. పర్యా. కుటకలకంచం. కూరలు వేసుకోడానికి వీలుగా గుంటలమర్చి చేసిన లోహపు భోజనపాత్ర. చూ. చిత్రం 57. (కో. 26, 29).

మీల్సుప్లేటు: (ఇం.) చూ. పర్యా. కంచం. అన్నం తినడానికి వాడే లోహపుపాత్ర. చూ. చిత్రం 214. (కో. 25; తె. 5, 14-16).

మీసాలకత్తెర: మీసాలు కత్తిరించడానికి మంగలి షాపుల్లో వాడే కత్తెర. (కో. 20).

ముకంబల్ల: ఉ. మూకంబల్ల, మోకంబల్ల. చూ. పర్యా. అడిగేమొద్దు. ఇత్తడిపాత్రలను పాలిష్ పెట్టడానికి ఉపయోగించే కొయ్యదిమ్మ. (కో. 20, 23, 24).

ముక్క[1]: చూ. పర్యా. తుంట[1]. తెగ్గొట్టబడిన లోహపు ముక్క. (రా. 8, 10, 11).

ముక్క[2]: చూ. పర్యా. ఉడన్‌హేమర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (కో. 5).

ముక్క[3]: కొలిమిపనిలో ఇనుపవస్తువులు తయారు చేయడానికి ఉపయోగపడే ఇనపకడ్డీ. (కో. 4, 5).

ముక్కలపీట: పోత అచ్చును తయారుచేసేటప్పుడు ఉపయోగపడే బల్ల. దీనిపైన ఉంచి అచ్చుకట్టారు. (కో. 21).

ముక్కాలు: నాల్గుభాగాల్లో మూడుభాగాలు. బిందెలో గొంతు, డొల్లను జాయింట్‌చేస్తే ముక్కాలుభాగం అవుతుంది. (కో. 1).

ముక్కు: చూ. పర్యా. తొండం[1]. కొలిమికి గాలి బాగా రావడానికి బ్లోరుకు అమర్చిన గొట్టం. (తె. 1).

ముక్కుగిన్నె[1]: చూ. పర్యా. గోకర్ణం. చేత్తో పట్టుకోడానికి కాడ, పాయసం, చారు మొదలయిన పదార్థాలను వడ్డించడానికి వీలుగా పైభాగాన గాడి రేకు అమర్చి ఉండే లోహపుపాత్ర. చూ. చిత్రం 92. (కో. 16, 18; తె. 8, 9).

ముక్కుగిన్నె[2]: చూ. పర్యా. చట్నీతుక్కు. రసం, మజ్జిగ ఉంచుకోడానికి ఉపయోగించే నిలువుపాత్ర. (తె. 11).

ముక్కుచెంబు: చూ. పర్యా. పోకిచెంబు. చిన్న పిల్లలు నీళ్ళు తాగడానికి వాడే సాధనం. చూ. చిత్రం 191. (కో. 1, 2; తె. 2, 6).

ముక్కుపన: చూ. పర్యా. కొమ్ముదాగలి. ఇనుప ప్లేట్లు తక్కుకోడానికి వాడేదిమ్మ. (రా. 2).

ముక్కుపొడిడబ్బా: ముక్కుపొడి పోసుకోడానికి వాడే చిన్నడబ్బి. (కో. 2).

ముక్కుపొడుంకాయ: చూ. పర్యా. నశండబ్బీ. నశం వేసుకోడానికి వాడే డబ్బా. (కో. 12).

ముక్కుమొల: రేకు, విగ్రహానికి చిన్నచిన్నొక్కులు కొట్టడానికి శిల్పపనిలో ఉపయోగించే పరికరం. (తె. 17).

ముక్కుసుత్తె: చూ. పర్యా. బంగోడి[1]. నూనె పెనేలు తయారుచేయడానికి వాడే పనిముట్టు. బిందె మధ్య భాగాన్ని లావు చేయడానికికూడా ఉపయోగం. (తె. 5, 11).

ముక్కోణపు ఆకురాయి: చూ. ముక్కోణం ఆకురాయి. (కో. 3, 21, 22).

ముక్కోణపుపోగరి: చూ. పర్యా. కౌరుపోగరి. విగ్రహంకోణాల్లో, చిన్న భాగాల్లో మెరుగు గీతలు కొట్టడానికి ఉపయోగించే మొల. (కో. 17, 18).

ముక్కోణం[1]: పరికరాల ఇరుకుప్రాంతాల్లో సాపు చేయడానికి వాడే పనిముట్టు. (కో. 23).

ముక్కోణం[2]: రూ. ముక్కాళం. పొయ్యిపై పాత్రలు మోపకుండ ఎత్తుగ ఉంచడానికి ఉపయోగపడే త్రిభుజాకారపు పరికరం. (కో. 2, 4, 9, 14, 15, 17, 19, 23, 24, 26, 28; తె. 21).

ముక్కోణం ఆకురాయి: రూ. ముక్కోణపు ఆకురాయి. చూ. పర్యా. మూల ఆకురాయి. విగ్రహం కోణాల్లో సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 192. (కో. 10, 16, 17; తె. 17).

ముక్కోణంలేగ: పర్యా. ముక్కోనం కితకడ్డీ, ముయ్యనులేగ. వాలేయడానికి, గీతలు వేయడానికి వాడే పరికరం. (కో. 17).

ముక్కోనం కీతకడ్డి: చూ. పర్యా. ముక్కోణంలేగ. వాలేయడానికి, గీతలు వేయడానికి వాడే పరికరం. (తె. 21).

ముక్కోనందాగలి: ఉలు, పళ్ళేలు మొదలైనవాటికి ఆకారాలను తీర్చడానికి వాడే పరికరం. (కో. 20).

ముగ్గుగొట్టం: ముగ్గులు పోసుకోడానికి వాడే గొట్టం. (కో. 14, 15).

ముగ్గుచుట్లు: ముగ్గులు పోసుకోడానికి పనికివచ్చే పరికరం. (రా. 6).

ముంచుత్తి: రూ. ముస్సుత్తి. మోటుకొట్టడానికి లోహపురేకును పెరిగేయడానికి వాడే పలచని పరికరం. (కో. 13).

ముంజెమ్మెట: అడుగుభాగం గుండ్రంఉండే పరికరం. రేకును త్వరగా సాగ్గొట్టడానికి వాడ్తారు. (తె. 25).

ముట్టి[1]: ఉ. మొట్టె. చూ. పర్యా. పిడి[1]. గొడుగును పట్టుకోడానికి వాడే 'L' ఆకారపు హాండిలు. (తె. 5, 17, 19, 24, 25).

ముట్టి[2]: చూ. పర్యా. పట్కార. లోహపు రేకులకు జాయింట్లుచేసే పల్లును వంచడానికి వాడే సాధనం. అడుగుభాగం కొద్దిగ చీలివుంటుంది. (రా. 25).

ముట్టికర్ర: బిందె ధోర్లకుండా ఉండడానికి పనికివచ్చే సాధనం. (రా. 5).

ముట్టిసుత్తె: ఉ. మట్టుసుత్తి. చూ. పర్యా. ఉడన్ ఘామర్. పెట్టెసూతకు సడికట్టు కొట్టడానికి వాడే పరికరం. రేకులను సాపుచేయడానికి కూడా ఉపయోగం. చూ. చిత్రం 68. (తె. 8, 9; రా. 4,5,10).

ముట్టె: ఉ. మిట్ట. చూ. పర్యా. ఉడన్‌ఘామర్. రేకులను సాపుచేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 68. (తె. 8, 17, 22, 23, 25).

ముడి: ఇత్తడిపాత్రలో హెచ్చుగా ఉండే క్రిందిభాగం. (కో. 2).

ముడిబీడు: ఇనుపచువ్వ. (కో. 8).

ముడియలాకరు: లాకరుపైభాగాన ఉండే చిన్న మూతరేకు. (కో. 26).

ముడిలేగ: పాలిష్‌పనిలో మొదట పాత్రలపై ఉండే మైలను పోగొట్టడానికి వాడే పరికరం. (కో. 6; తె. 1).

ముద్లి: త్రిభుజాకారంలో ఉండే పరికరం. ట్రంకు పెట్టెల తయారీలో ఉపయోగం. (కో. 8).

ముతకఆకురాయి: పర్యా. ముతకపైలు, ముల్లాకురాయి, ములాకురాయి. లోహపు వస్తువుల్ని అరగదీయడానికి వాడే పనిముట్టు. (కో. 21).

ముతకచానం: చూ. పర్యా. చదరపుపంచు. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (కో. 12, 15).

ముతకపోగరు: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తిరించడానికి రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 19).

ముతకపైలు: (< ముతక + ఇం. File) చూ. పర్యా. ముతక ఆకురాయి. లోహపు వస్తువుల్ని అరగదీయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం. (కో. 19).

ముతకరాయి: చూ. పర్యా. గరుకురాయి[1]. వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడే రాయి. (కో. 20).

ముదరకమ్మి: చూ. పర్యా.ముడిపట్లలేగ. పాలిష్ పనిలో మొదట పాత్రపై ఉండే మైలను పోగొట్టడానికి వాడే పరికరం. (కో. 22).

ముదరటంకం: చూ. పర్యా చూర. లోహపు పాత్రలను అతకడానికి వాడే పదార్థం. (కో. 23).

ముదుడు: (క్రి.) రేకుమూలల్ని కలిపి బిగించడం. (రా. 12).

ముదురు: (క్రి) చూ. పర్యా. మడుపేయు[1]. పాత్రల మూతిభాగాలను అంచులాగ దట్టంగా వెనక్కి మడచడం. (రా. 14).

ముదురులాగ: చూ. పర్యా. ముడిపట్లలేగ. పాలిష్ పనిలో మొదట పాత్రలపై ఉండే మైలను పోగొట్టడానికి వాడే పరికరం. (రా. 16).

ముదమామాగాయ: మామిడికాయలు తురుంపట్టడానికి వాడే పనిముట్టు. (కో. 22).

ముద్దాయించు: (క్రి.) చూ. పర్యా. మడుపేయు[1]. పాత్రల మూతిభాగాలను అంచులాగ దట్టంగా వెనక్కి మడచడం. (రా. 15).

మునిసుత్తె: ఉ. మునుసుత్తి. చూ. పర్యా. మట్లాం సుత్తి. పాత్రల ఇరుకుభాగాల్లో సాపు చేయడానికి వాడే ఇనపసుత్తె. ముందుకు వంగి ఉంటుంది. (తె. 12; రా. 11, 13).

మునుగుబుల్లుచిట్లు: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (కో.3).

మున్సుత్తి: చూ. ముంచుత్తి. (కో. 10).

ముంత[1]: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్లు కడగడానికి వాడే బిందె ఆకారంతో చేసిన లోహపుపాత్ర. చూ. చిత్రం 84. (కో. 24, 27, 28, 30; తె. 12, 13).

ముంత[2]: చూ. పర్యా. కంటుదిమ్మె. ఇరుసును అమర్చడానికి వాడే బండిచక్రం మధ్యలో ఉండే కొయ్యదిమ్మ.

ముంత[3]: గింజల కొలతకు ఉపయోగించే లోహపు పాత్ర. రెండుశేర్లు పట్టుతుంది. (రా. 2).

ముంతమామిడిమరచెంబు: చూ. పర్యా. జీడి మామిడి మరచెంబు. మధ్యభాగంలో సన్నగా లావుకడుపుతో ముంతమామిడికాయ ఆకారంతో ఉండే ఒకరకం మరచెంబు. (రా. 7, 8).

ముంతలకరవాయి: ముంతలను తయారుచేయడానికి వాడే పరికరం. (తె. 12).

ముందరిపైయ్య ఎక్సల్: సైకిల్ ముందు చక్రభాగంలో ఉండే పరికరం. (తె. 13).

ముందడిచెంబు: నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగించే చిన్నచెంబు. (కో. 6).

ముందడిజాడి[1]: చూ. పర్యా. ఊరగాయ జాడి. ఊరగాయ వేసుకోడానికి వాడే జాడి. (కో. 6, 7, 10, 11).

ముందడిజాడి[2]: రూ. ముందిరిజాడి. పాలు, నూనె వంటి ద్రవపదార్థాలను తెచ్చుకోడానికి వాడేపాత్ర.

(కో. 15).

ముందిరిజాడి: చూ. ముండిడిజాడి[2]. (కో. 19, 23).

ముందుమూత: టార్చిలైటు బల్బును కప్పి ఉంచే సాధనం. దీనిలోపల కటోరి, అద్దం ఉంటుంది. (తె. 19).

ముయ్యానలేగ: చూ. పర్యా. ముక్కోణం లేగ. వాలేయడానికి, గీతలువేయడానికి వాడే పరికరం. (తె. 24).

మురాదాబాద్‌లోటా: అంచు వెడల్పుగా ఉండే గ్లాసు. తాగడానికి ఉపయోగం. (కో. 2).

మురికిసెట్టు: చూ. పర్యా. కారాచాచ, మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50). (కో. 2).

మురుకు: చూ. పర్యా. పువ్వు[1]. పదునుపెట్టిన తర్వాత ప్రక్కల్లో వచ్చే చిన్నచిన్న భాగాలు. (తె. 7).

మురుకు అచ్చు: ఉ. మురికచ్చు, మురికచ్చు. చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలను చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (కో. 1; రా. 4).

మురుకుకోలాయి: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలను చేయ దానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 1).

మురుకుచిట్టి: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలను చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (రా. 12).

మురుకుపావు: రూ. మురుగుపావు. చూ. పర్యా. కారాచాచ. మురుకులు, కారాసు వగైరా పదార్థాలు పిండుకోడానికి ఉపయోగపడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 2, 3; రా. 15).

మురుకులకాచంచా: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలను చేయడానికి వాడే లోహపుపరికరం. చూ. చిత్రం 50. (తె 4,11).

మురుకులకాడ: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 1).

మురుకులగరిట: చూ. పర్యా. రంధ్రాల గరిటె. నూనెలోనుండి పిండివంటకాలు ఎత్తుకోడానికి ఉపయోగపడే రంధ్రాలున్న పరికరం. చూ. చిత్రం 107. (తె. 12, 13).

మురుకులగిద్దె: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలు చేయడానికివాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 25).

మురుకులపీట: ఉ. మురుక్కలపీట. చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ.చిత్రం 50. (తె. 5, 7).

మురుగుగొట్టం: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపోడి వగైరా పదార్థాలను చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (రా. 2).

మురుగుపావు: చూ. మురుకుపావు. (తె. 20).

ములికి: ఉ. ముల్కి. చూ. పర్యా. చీల[1]. గొడుగు లోపను ఊడిరాకుండా కొట్టడానికి వాడే చిన్న చీల. (రా. 4, 12, 15).

ముల్లంగిలేగ: చూ. పర్యా. అమరు. ఇత్తడిబిందెపై డిజైను గీతలు గీయడానికి వాడే పనిముట్టు. (కో.2).

ముల్లాకురాయి: రూ. మూలాకురాయి. చూ. పర్యా. ముతక ఆకురాయి. లోహపు వస్తువుల్ని అరగదీయ డానికి వాడే పనిముట్టు. (కో. 28).

ముల్లాగివర: చూ. పర్యా. అమరువాలేగ. పాలిష్ పాత్రలపై డిజైన్‌లు వేయడానికి వాడే పరికరం. (కో. 1).

ముల్లు: చూ. పర్యా. పోగరు. లోహపు రేకుపై, కడ్డీలపై వేసిన రంధ్రాలను సరిచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 165. (కో. 17).

ముల్లేక్రిమ్మి: పంపుభాగాలు మెరుగుపట్టడానికి వాడే సాధనం. చూ. చిత్రం (కో. 16).

ముల్లేగ: చూ. పర్యా. అమరులేగ. పాలిష్ పాత్రలపై డిజైన్‌లు వేయడానికి వాడే పరికరం. (కో. 26-29).

ముళ్ళస్పూను: (< ముళ్ళ + ఇం. Spoon) ముక్కలను గుచ్చుకొనితినడానికి వీలుగా ముళ్ళరెక్కలుండే చెంచా. ఇంగ్లీషువాళ్ళు వాడ్తారు. చూ. చిత్రం 193. (కో. 7, 12).

మువ్వలు: చూ. పర్యా. గజ్జెలు[2]. ఎద్దులమెడకు, వాహనాలకు అలంకారానికి కట్టడానికి వాడే లావు గుండు ఇత్తడిగజ్జెలు. (కో. 6, 7, 22, 28, 29; తె. 2, 5-11, 22, 23; రా. 12).

ముసిడికర్ర: చూ. పర్యా. తరమనికట్టె. మొద్దుబారిన పోగర్లు, లేగలు మొదలయిన పనిముట్లను సూరుకో డానికి వాడే కొయ్య. (కో. 21, 28).

మూకుడు[1]: (బ.) మూకుళ్ళు. చూ. పర్యా. కడాయి. పిండివంటలు చేయడానికి వాడే ఇరువైపులా హాండిల్సు అమర్చిన లోహపు పాత్ర. చూ. చిత్రం

163. (కో. 22, 24–27; తె. 8, 9, 14–20, 23).

మూకుడు²: చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదును పెట్టడానికి, కాక రావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే నీళ్ళపాత్ర. (కో. 22).

మూకుడు³: విగ్రహాల తయారీలో లక్కను తయారు చేయడానికి వాడే ఇనుపపాత్ర. (తె. 17).

మూకుడుచెంబు: చూ. పర్యా. గోకర్ణం. పాయసం, చారు మొదలయినవి వడ్డించడానికి వీలుగా ముక్కు, పట్టుకోడానికి కాడ, అమర్చి ఉండే లోహపుపాత్ర. చూ. చిత్రం 92. (కో. 2).

మూకుళ్ళసుత్తి: చూ. పర్యా. పెద్దసుత్తె. రేకును లావు చేయడానికి, కుదింపు చేయడానికి వాడే ఇనప పనిముట్టు. (కో. 16).

మూగ: చూ. పర్యా. జత. వాయి, జవ్వకలిసిన బిందె భాగం. (తె. 5).

మూగలు: చూ. పర్యా. గజ్జెలు². ఎద్దులమెడకు, వాహనాలకు కట్టడానికి వాడే లావు గుండు ఇత్తడి గజ్జెలు. (తె. 17–19, 25).

మూటు: (క్రి.) చూ. పర్యా. జంటించు. తయారు చేసిన విడిభాగాలను కలిపి ఒక బిందెగా పల్లుచేసి అతికించడం. (కో. 20, 21).

మూడలి: చూ. పర్యా. పుల్లి¹. రేకు గాడులను ఖచ్చితంగా కొట్టడానికి వాడే పరికరం. (తె. 17).

మూడు: (క్రి.) చూ. పర్యా. అతుకు. రెండు లోహపు కమ్ములనుకలిపి కాల్చి ఒకటిగ గుండ్రంగ అతకడం. (కో. 29).

మూడుదారాలకడ్డి : బీరువా తయారుచేయడానికి వంపుగా ఉండే పరికరం. (రా. 8).

మూడుపలకలఆకురాయి : రంపంపళ్ళు పదును చేయడానికి వాడే సాధనం. (కో. 20).

మూత¹ : చూ. పర్యా. ఎక్కమూత. బాటరీలు పడిపోకుండ టార్చిలైటు గొట్టాన్ని మూసిఉంచే బిరడా. (తె. 1, 17, 21, 22, 24).

మూత²: చూ. పర్యా. కవరు³. పాత్రలపై మూతగా వాడే పళ్లెం. (కో. 8, 10, 11, 28; తె. 2, 15–19; రా. 2, 7, 13, 15).

మూత³: టాంకినూనె గొట్టంపై ఉండే బిరడా. (తె. 4).

మూత⁴: ట్రంకుపెట్టె పైభాగం. (కో. 2, 5, 13).

మూత⁵: బియ్యపుడ్రమ్ము పైభాగం. (కో. 1).

మూతకటోర: టార్చిలైటు మూతలో ఉండే పరికరం. ఇది టచ్అవుతే బల్బు వెలుగుతుంది. (తె. 17).

మూతకూరగిన్నె : కూరలు ఉంచుకోడానికి వాడే మూతకలిగిన స్టీలుగిన్నె. (తె. 8, 9, 13).

మూతగ్లాసు : నీళ్ళకు వాడే మూతఉన్న లోటా. (కో. 1).

మూతచెంబు: చూ. పర్యా. పాలజెగ్గు. పాలు, నూనె తెచ్చుకోడానికి వాడే మూతఉన్న చిన్నపాత్ర. (కో. 1, రా. 15).

మూతజగ్గు: నీళ్ళు ఉంచుకోడానికి వాడే మూతఉన్న లోహపుపాత్ర. (కో. 3).

మూతడబ్బి: చూ. పర్యా. గొళ్లెండబ్బా. పిండి, నూనెపదార్థాలు తెచ్చుకోడానికి వాడే మూతఉన్న లోహపు పాత్ర. మూతకు గొళ్లెం అమర్చిఉంటారు. చూ. చిత్రం 91. (రా. 6).

మూతనూనెపాలు: మూత, పట్టుకోడానికి కమ్మి అమర్చి వెడల్పుగాఉన్న నూనె పాత్ర. (తె. 8, 9).

మూతపక్క: చూ. మూతఫక్క. చూ. పర్యా. కోరు². ట్రంకుపెట్టె మూతభాగంలోని రేకు. (కో. 28).

మూతపర్మ: చూ. పర్యా. కోరు². ట్రంకుపెట్టె మూత భాగంలోని రేకు. (కో. 22).

మూతప్లేటు: చూ. పర్యా. పరాతం. అన్నం ఆర బోసుకోడానికి వాడే వెడల్పుపళ్ళెం. చూ. చిత్రం 150. (కో. 1).

మూతఫక్క: చూ. మూతపక్క. (కో. 22).

మూతబిళ్ల: చూ. పర్యా. తలకాయ. డ్రమ్ము పైభాగంలో అమర్చేరేకు. (రా. 1).

మూతరేకు¹: చూ. పర్యా. తలకాయ. బిందె పై భాగపు రేకు. (కో. 10, 12).

మూతరేకు²: చూ. పర్యా. టోపుకవరు. కాకపోకుండ కొలిమిపై మూతకువాడే పరికరం. (కో. 24).

మూతి¹: చూ. పర్యా. తలకాయ. బిందె పైభాగపు రేకు. (కో. 8; తె. 4, 6, 12, 18, 20; రా. 2; 7, 9).

మూతి²: మిషన్‌లో ముందుభాగం. (రా. 6).

మూతిచెక్క: పర్యా. వంకటింకం, వంకపట్ట, వంపు కమ్మి², వంగచెక్క, వంపుదాగలి, వంపురైలు కమ్మి, వంపులంగరు, వాయి². లోహపుపాత్రల మూతలను తయారుచేయడానికి వాడే సాధనం (కో. 14).

మూతిపట్టుకార: చూ. పర్యా. అతికేకారు. నిప్పును వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (రా. 7).

మూతిపళ్లుకత్తెర: చూ. పర్యా. సన్నకత్తెర. లోహపు రేకులకు కలిపే పల్లును వంచడానికి, కత్తిరించ

డానికి వాడే సాధనం. (కో. 10, 12).

మూయించు: (క్రి.) బిందెల మూతిని అతికించడం. (రా. 3).

మూయు: (క్రి.) కొలిమిలో గాలికి నిప్పులు చెదిరి పోకుండ ఉండడానికి డబ్బారేకును మూయడం. (రా. 2).

మూరచెంబు: చూ. పర్యా. చేరుశెంబు. నీళ్ళు తాగడానికి వాడే సాదాచెంబు. గుండ్రంగా ఉంటుంది. (కో. 28).

మూరమూరచెన్నె: పడబోసుకొనే పెద్దతొట్టె. (తె. 11).

మూల అకులాయి: పర్యా. ముక్కోణం అకురాయి. విగ్రహంలో హెచ్చుతగ్గులుండే తావున శుభ్రపరిచే అకురాయి. చూ. చిత్రం 192. (తె. 9, 13).

మూలకరవాయి: విగ్రహం మూలభాగాల్లో సరిచేయడానికి వాడే పరికరం. (కో. 3).

మూలక్లాంపు: (< మూల + ఇం. Clamp). చూ. పర్యా. కూసం. బీరువా, సేఫ్‌లాకర్ తలుపు సులభంగా తిరగడానికి, గట్టిగ ఉండడానికి అమర్చిన లోహపుకడ్డీ. (కో. 21).

మూలపోగారు: చూ. పర్యా. కత్తెముల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 28).

మూలమట్టసుత్తి: గేడీలను అణచడానికి వాడే పరికరం. (కో. 2).

మూలమట్టం: ఉ. మూలెమట్టం. పర్యా. అంకీల మూలమట్టం, మెట్నమూలల సమకోణం చూడడానికి, లోహపు రేకులపై లంబకోణంలో గీతలు గీయడానికి 'L' ఆకారంలో '2 × 1' సైజులో చేయబడిన ఇనపబద్ద. దీని రెండుభుజాలమీద అంగుళాలు గుర్తించి ఉంటారు. చూ. చిత్రం 194. (కో. 1, 2, 4, 5, 7, 8, 10, 12, 15–20, 22–24, 26–28; తె 14, 15, 18, 20, 22–25; రా. 2–8, 10–14).

మూలముక్కడై: (< మూలముక్క + ఇం. Di) లోహపువస్తువుల మూలభాగాల్లో డిజైనుగ కొట్టడానికి వాడే పరికరం. (కో. 17).

మూలమెరియం: చూ. పర్యా. అడగోలు. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే దిమ్మ. (రా. 4).

మూలవంపుసుత్తి: రేకుమూలలు వంచడానికి వాడే పరికరం. (కో. 21).

మూలవాటము: చూ. పర్యా. మూలమట్టం. లోహపు రేకులపై, మూలల సమకోణం చూడడానికి లంబకోణంలో గీతలు గీయడానికి వాడే 'L' ఆకారంలో '2 × 1' సైజులో ఉన్న ఇనపబద్ద. రెండు భుజాలమీద అంగుళాలు గుర్తించి ఉంటాయి. చూ. చిత్రం 194. (రా. 10).

మూలాకురాయి: చూ. పర్యా. ముతక అకురాయి. లోహపువస్తువుల్ని అరగదీయడానికివాడే పనిముట్టు. (కో. 26, రా. 4).

మూలాడి: చూ. పర్యా. అడగోలు. లోహపురేకులను కడ్డీలను సాపుచేయడానికి వాడే దిమ్మ. (రా. 7).

మూల్పు: టంకుపెట్టె క్రిందిభాగంలో ఉండే పళ్ళు. (రా. 8).

మూస: పర్యా. గురిగి.బోలుమూస. లోహాన్ని కరిగించడానికి ఉపయోగపడే పాత్ర. (కో. 2, 4, 8, 10, 11, 14, 18–20, 22, 24, 26, 28, 29; తె. 4–9, 12–14, 16, 19–23; రా. 2, 4, 5, 15).

మూసకారు: చూ. పర్యా. అతికేకారు. కొలిమిలో నుండి మూసను పైకితీయడానికి వాడే పనిముట్టు. (కో. 22).

మూసపట్టుకారు: చూ. పర్యా. అతికేకారు. కొలిమిలో నుండి మూసను పైకితీయడానికి వాడే పనిముట్టు. (రా. 9).

మూసముక్కు: చూ. పర్యా. టోపుకవరు. దుకాణంపై వాడే మూతరేకు. (కో. 29).

మూసేయు: (క్రి.) తాళం రిపేరి అయిన తర్వాత పైకప్పును బిగించడం. (కో. 24; రా. 14).

మెజిను : ఇనుపఅచ్చును పాలిష్ చేయడానికి వాడే కమ్మిలాగా ఉండే పనిముట్టు. (రా. 3).

మెటల్: (ఇం.) చూ. పర్యా. తగరం. రాగి, సత్తు కలిపిన లోహం. రవ్వలో కలపడానికి, డబ్బా రేకులను అతకడానికి ఉపయోగపడే పదార్థం. (కో. 26; తె. 23; రా. 9).

మెట్టుకన్నులి: చూ. పర్యా. కంతాణి. లోహపు పాత్రలకు మెరుగు పట్టడానికి వాడే పరికరం. (రా. 1).

మెట్న: ఉ. మట్నా, మెట్నా. చూ. పర్యా. మూలమట్టం. లోహపురేకులపై, మూలల సమకోణం చూడడానికి లంబకోణంలో గీతలు గీయడానికి వాడే ఇనపబద్ద. 'L' ఆకారంలో '2 × 1' సైజులో, రెండు భుజాలమీద అంగుళాలు గుర్తించి ఉంటుంది. (తె. 1–3, 5–8, 12, 14–18, 23–25; రా. 6, 7,

12, 15, 16).

మెడబిళ్ళు: చూ. పర్యా. కంఠం. బిందెగొంతు భాగపు రేకు. (తె. 14).

మెడల్స్ : ఉ. మెడెల్స్. ఆటల్లో, పోటీల్లో, బహుమతిగా ఇవ్వడానికి వాడే పతకం. మెడల్స్‌లు, మెడళ్ళు. (కో. 11, 12, 13, 16, 18, 19, 28; తె. 6; రా. 11, 13).

మెడ్రాసుకాగుల కరవాయి: చూ. పర్యా. కాగు కరవాయి. లోహపుకాగులు సాపుచేయడానికి వాడే పరికరం. (రా. 9).

మెంటరాయి: చూ. పర్యా. గరుకురాయి[1]. వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడే రాయి. (రా. 14).

మెంటల్: (ఇం.) ఉ. మాంటల్. పెట్రొమాక్స్ లైటు కాంతి రావడానికి ఉపయోగపడే వత్తి. (తె. 18, 19, 21, 22, 24).

మెంటల్‌కడ్డీ: (< ఇం. Mantle + కడ్డీ). చేత్తో పట్టుకోడానికి వీలుగా పిడిఅమర్చిన కొడవలి ముందు భాగం. (రా. 15).

మెంటల్‌గడ్డ: చూ. పర్యా. జాలిగడ్డ. పెట్రొమాక్స్ లైటుకు గ్యాస్‌ను అందించడానికి వొత్తికి పైభాగాన అమర్చిన రంధ్రాల దిమ్మ. (తె. 18).

మెండుపోగరు: రివిట్లు కొట్టినతర్వాత వాటిని సాపు చేసేందుకు వాడే పనిముట్టు. (కో. 17).

మెతుకు: (క్రి.) బిందె నొక్కులను సరిచేయడానికి ముందు కాల్చి రేకును మెత్తగ చేయడం. (రా. 12).

మెత్తు: (క్రి.) చూ. పర్యా. తట్టు[1]. పోత రంధ్రాన్ని మట్టితో కప్పేయడం. (కో. 22, 26).

మెరకకంట్రానీ: చూ. మెరుగుకంటానీ. (కో.16,21).

మెరకగిన్నె: చూ. పర్యా. దబ్బకాయగిన్నె. మట్టులేని చిన్న లోహపుపాత్ర. (కో. 16).

మెరకదాగిలి: చూ. పర్యా. చిన్నమూకుడి. కోడిగుడ్లు అట్లుచేయడానికి ఉపయోగించే కాడ ఉన్న గుండు రేకు పరికరం. (కో. 19),

మెరకపట్టిడి: కంచాలరేకు సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 24, 29).

మెరకమట్టిసుత్తి: పర్యా. పల్లపు మెరకసుత్తి. సాపు కలపడానికి వాడే పరికరం. (కో. 21).

మెరకలేగ: రూ. మెరుగులేగ. పర్యా. బోడిలేగ. బోడిగా గోరులాగా ఉండే పరికరం. కాయ వంపుల్లోనూ, జవల్లోనూ, మట్టుల్లోనూ మెరుగుపట్టడానికి, లోహం ఎక్కువగా ఉన్నప్పుడు తగ్గించడానికి వాడే పరికరం. (కో. 5, 15, 21-25, 28, 29).

మెరకసదరం: చూ. పర్యా. ముదిపట్లలేగ. పాలిష్ పనిలో మొదట పాత్రలపై ఉండే మైలను పోగొట్టడానికి వాడే పరికరం. (కో. 26).

మెరకమట్‌సుత్తె: చూ. పర్యా. పలచనిసుత్తి. బిందె గొంతు, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 153. (కో. 28, 29).

మెరకసుత్తె: ఉ. మరకసుత్తి. పర్యా. దబ్బులసుత్తి, దబరసుత్తి, దిబ్బసుత్తి, పోతిసుత్తె, సాపుసుత్తి. అద్దగన్నుసుత్తితో కొట్టిన వస్తువును మళ్ళీ గంట్లు కలుపుతూ కన్నుపడకుండా కొట్టడానికి, బొద్దులు లోతుచేయడానికి, రేకులు పెరగ్గొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 5-12, 16, 17, 22-24, 29; తె. 24).

మెరగందిమ్మ: ట్రంకుపెట్టెల్ని జాయింట్లు చేసుకోడానికి ఉపయోగపడే పరికరం. (కో. 8).

మెరగంబట్టు: (క్రి.) ట్రంకుపెట్టెల్ని జాయింట్లు చేసుకోవడం. (కో. 8).

మెరిగించు: (క్రి.) చూ. పర్యా. జంటించు. రెండు రేకులను అతికించడం. (కో. 22).

మెరుక్కడ్డీ: చూ. పర్యా. లేగ. తరిణి పట్టేటప్పుడు లోహపు వస్తువుకు తెగువ రావడానికి వాడే పరికరం. (కో. 5).

మెరుక్కంటాణీ: చూ. మెరుగుకంటానీ. (కో. 20, 22).

మెరుగుకంటానీ: రూ. మెరకకంట్రానీ, మెరుక్కంటాణీ. చూ. పర్యా. లేగ. తరిణి పట్టేటప్పుడు లోహపు వస్తువుకు తెగువ రావడానికి వాడే పనిముట్టు. (కో. 12).

మెరుగుకాయితం: చూ. పర్యా. ఎమరిపేపరు. దెబ్బలసుత్తిని మెరుగుపెట్టడానికి వాడే గరుకు కాగితం. (కో. 4, 8, 24; తె. 24).

మెరుగుకొట్టు: (క్రి.) ఉ. మెరగకొట్టు. చూ. పర్యా. చుక్కకొట్టు. పూర్తిగా అతికిన తర్వాత బిందెపై వంకర్లు లేకుండ నున్నగ సాపుచేసే మెరుగు చుక్కలు కొట్టడం. (తె. 17, 19).

మెరుగుగెడపార : చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అడుగు భాగాలు కొట్టడానికి వాడే పరికరం. (రా. 2).

మెరుగుదెబ్బల కరవాయి : చూ. పర్యా. మట్ట కరవాయి. లోహపు పాత్రలకు మెరుగుచుక్కలు

కొట్టడానికి వాడే పరికరం. (కో. 14).

మెరుగుపెట్టు: (క్రి.) పూర్తయిన లోహపు పాత్రలను మెరుగుపెట్టడం. (కో. 22; తె. 20, 21, 25; రా. 2).

మెరుగుబళ్ళ: పర్యా. సప్పబళ. తట్టల్ని మెరుగేయడానికి వాడే పరికరం. (రా. 13).

మెరుగుబ్రెషు: చూ. పర్యా. గుజారను. లోహపు రేకుపై డిజైన్లు కొట్టడానికి వాడే పరికరం. (కో. 8).

మెరుగుమట్నుసుత్తె: చూ. పర్యా. పాలీష్‌సుత్తె. బిందెలపై మెరుగుచుక్కలు కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 10, 12; తె. 3).

మెరుగురాయి: చూ. పర్యా. గీటురాయి. లేగలను పదును పెట్టడానికి పనికివచ్చే తెల్లనిపొడి. (తె. 24, 25).

మెరుగులేగ: చూ. మెరకలేగ. (కో. 8, 21, 22, 27; తె. 24; రా. 9, 29).

మెరుగు ఉసిక: ఇత్తడిరేకు విగ్రహాలను తెల్లగచేయడానికి ఉపయోగించే సన్నని ఇసుక. మొదలు చింతపండు పులుసులో ఉడకబెట్టి, తర్వాత మెరుగు ఇసుకతో తోముతారు. ఆ తర్వాత పూర్తి మెరుగు పెట్టారు. (తె. 25).

మెరుగుసదరం: చూ. పర్యా. కంతాణి. లోహపు పాత్రలకు మెరుగు పట్టడానికి వాడే పరికరం. (కో. 27).

మెరుగుసలాకు: చూ. పర్యా. లేగ. తరిణి పట్టేటపుడు లోహపు వస్తువుకు తెగువ రావడానికి వాడే పరికరం. (కో. 7).

మెరుగుసుత్తి: పర్యా. పాలీష్‌సుత్తె, మెరుగుమట్నుసుత్తె. బిందెలపై మెరుగుచుక్కలు కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 2, 10, 12, 13; తె. 3, 12; రా. 7).

మెలి: రేకుపై ఉండే వంపు. (కో. 1).

మెలికతిప్పు: (క్రి.) సైకిల్‌నట్లు వంపుగా తిప్పడం. (కో. 7).

మెలికక్రట్లి: (< మెలిక + ఇం. Ketle) కమండలం ఆకారంలో మెలికలుతిరిగి ఉండే పాత్ర. టీ, కాఫీ పోసుకోడానికి ఉపయోగం. (కో. 19).

మెలిపెట్టు: (క్రి.) చూ. పర్యా. నులుపు. గొడుపుల్లలను ఇనపవైరుతో బిగించి మెలితిప్పడం. (కో.23).

మెలీష్‌రేకు: దేలికగా ఉండేరేకు. (రా. 3).

మెల్టా: చూ. పర్యా. అతుకు. రెండురేకులనుగాని, కమ్మలనుగాని, పట్టాలనుగాని ఒకటిగా అతకడం. (రా. 6).

మెల్ట్రిలకరవాయి: చెంబులు తయారుచేయడానికి వాడే మోపు. (తె. 3).

మేకప్‌చేయు: (< ఇం. Ma eu + చేయు) బీరువా జాయింట్లు, రిపిట్లు కనబడకుండ మైనాన్ని పూయడం. (తె. 3).

మేకు: చూ. పర్యా. చీల[1]. గొడుగుటోపను ఊడిరాకుండ కొట్టడానికి వాడే చీల. (కో. 18, 27; తె. 6, 24; రా. 11).

మేకులదాగలి: మేకులు తయారుచేయడానికి వాడే సాధనం. (కో. 16).

మేండర్: (ఇం.) పర్యా. జాలిగడ్డ. పెట్రొమాక్స్ లైటుకు గ్యాస్‌ను అందించడానికి వొత్తికి పైభాగాన అమర్చిన రంధ్రాల దిమ్మ. (కో. 2).

మేనకగ్లాసు: కాఫీ తాగడానికి ఉపయోగపడే లోట. (కో. 4).

మేరజగ్గు: నీళ్ళు ఉంచడానికి ఉపయోగించే పాత్ర. (కో. 8, 10, 11).

మేలకత్తెర: చూ. పర్యా. గుడ్డకత్తెర. బట్టలు కత్తరించడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 78. (తె. 18).

మేలిసుత్తి: చూ. పర్యా. మట్నుసుత్తె. తయారైన ఇనపవస్తువులను సాపుచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 138. (కో. 24).

మేస్టిక్‌కుక్కర్: అన్నం చేసుకోడానికి వాడే పరికరం. (కో. 1).

మైతాబు: (ఉర్దూ.) చూ. పర్యా. కటోరి[1]. వెలుతురు బాగా రావడానికి టార్చిలైటు బల్బుచుట్టూ ఉండే తెల్లనిరేకు. (తె. 4).

మైదం: చూ. మైనం. (తె. 17, 19).

మైనం: రూ మైదం. చూ. పర్యా. తేనెమైదం. లోహపు పాత్రలకు ఉండే రంధ్రాలను కనిపెట్టడానికి వాడే పదార్థం. (కో. 6, 10. 18, 28; తె. 15 17, 19, 25).

మైనంముద్ద: చూ. పర్యా. గొగ్గిలం. విగ్రహం నగిషీ పనికి వాడే పదార్థం. (కో. 28).

మైల: చూ. పర్యా. చిలుము. లోహపు రేకులపై, కడ్డీలపై పట్టినతుప్పు. (తె. 22; రా. 6).

మైలతీయు: (క్రి) చూ. పర్యా. పైల్‌చేయు. లోహపు రేకులపై హెచ్చుతగ్గులుంటే ఆకురాయితో సరిచేయడం. (రా. 13).

మైలవరపుకరవాయి: చూ. పర్యా. మట్నికరవాయి. మైలవరపు బిందెలకు మెరుగుపెట్టడానికి వాడే

కరవాయి. (కో. 6).

మైలవరపుకాగు: అన్నం వండుకోడానికి వాడే బిందె ఆకారంతో ఉన్నపాత్ర. (కో. 5).

మైలవరపుచెంబు: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారంతో చేసిన చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 84. (కో. 11).

మైలవరపుబిందె: చూ. మైలవరం బిందె. (కో. 4, 6, 8, 10, 12, 13, 15).

మైలవరపుబిందెకరవాయి: చూ. పర్యా. మట్నకరవాయి. మైలవరపు బిందెలను మెరుగుపెట్టడానికి వాడే పనిముట్టు. (కో. 10, 12).

మైలవరపుబిందె మెరుగుకరవాయి: చూ. పర్యా. మట్నకరవాయి. మైలవరపు బిందెలకు మెరుగు పెట్టడానికి వాడే పనిముట్టు. (కో. 10, 12).

మైలవరపుమూతికరవాయి: చూ. పర్యా. మట్నకరవాయి. మైలవరపు బిందెలకు మెరుగుపెట్టడానికి వాడే పరికరం. (కో. 10).

మైలవరంగుండిగ: నీళ్ళు కాచుకోడానికి రాగి అండా లాగా ఉండేపాత్ర. (కో. 10, 12).

మైలవరంబిందె: రూ. మైలవరపు బిందె, మైలారం బింది. చూ. పర్యా. ఆకుబిందె. నీళ్ళకు వాడే ఒక రకం పాత్ర. మైలవరంలో తయారయింది. చూ. చిత్రం 17. (కో. 5, 9, 10, 12, 14 16; తె. 17, 22).

మైలారంబింది: చూ. మైలవరంబిందె. (కో. 18).

మైసూరుగిన్నె: కూరలు చేయడానికి వాడే చిన్న లోహపుపాత్ర. (కో. 8, 10, 11, 13, 15).

మైసూరుటోపు: అడుగు గుండ్రంగ ఉండి పొడవు ఎక్కువగా ఉండే స్టీలుపాత్ర. (కో. 18).

మైసూరుబొగానిగిన్నె: క్రింద మూడుగుండ్లు ఉండే గుండ్రని లోహపుపాత్ర. (రా. 8).

మొకిలి: (హిం.) పాత్రల అడుగులు గుంతగా కొట్టడానికి ఉపయోగించే దిమ్మ. (రా. 12).

మొగ: ఉ. మగ. చూ. పర్యా. అకండం. బిందెలో పై మధ్యభాగాలు కలియుచోటు. (కో. 4, 9; తె. 4, 12).

మొగలకరవాయి: ఉ. మొగలుకరవాయి. చూ. పర్యా. మట్టగానికరవాయి. బిందెగొంతు జవ్వలను బిగించడానికి ఉపయోగపడే పనిముట్టు (కో. 4, 9; తె. 12).

మొగసాపు: (క్రి.) బిందె పైభాగాన్ని తయారు చేయడం. (రా. 5).

మొగ్గ: ఇరవై గదుఉండే పెట్టె పైభాగం. (రా. 5).

మొట్టుకరవాయి: లోహంలో సన్నరంధ్రాలు లేకుండా కొట్టడానికి ఉపయోగపడే పనిముట్టు. క్రిందిభాగం సన్నంగా, పైభాగం రౌండుగా ఉంటుంది. (రా. 2).

మొడ్డలి: ఉ.మడులి. చూ. మొడ్డొలి. (కో. 28; రా.15).

మొడ్డొలి: ఉ. మడ్డులి. రూ. మండుఉలి, మొదొలి, మొడ్డొలి. చూ. పర్యా. ఎక్కువదిమ్మ. లోహపు రేకుల జాయింట్లకు రివిట్లు కొట్టడానికి వాడే సాధనం. (కో. 5, 16–18, 22, 23, 26; రా. 4, 8, 10, 12).

మొత్తుసానం: బీరువా రేకును ఖడవడానికి వాడే ఒక రకం ఉలి. (కో. 2).

మొదిలి: చూ. మొద్దొలి. (కో. 2).

మొద్ద: మధ్యభాగంలో అక్కడక్కడ గుంతలుకలిగిన కొయ్యదిమ్మ. డబ్బారేకుపై బొడిపెలు కొట్టడానికి టిన్‌గార్ పని చేయడానికి ఉపయోగం. (తె. 17).

మొద్దు[1]: ఉ. మద్ద. చూ. పర్యా. అడమొద్దు. కరవాయిని కదలకుండా పట్టిఉంచడానికి వాడే కొయ్యదిమ్మ. (కో. 2; రా. 11).

మొద్దు[2]: చూ. పర్యా. టెంప్లేటు. ముందుగ డిజైను గీయడానికి వెల్డింగ్‌పనిలో వాడే పెద్ద లోహపురేకు. (కో. 28).

మొద్దు[3]: చూ. పర్యా. చట్రం[1]. కమ్మరంపనిలో లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 2, 6; తె. 8, 13; రా. 11).

మొద్దు[4]: ఇత్తడి వస్తువులపై రంధ్రాలు వేసుకోడానికి వాడే గుండ్రని కొయ్యతుండు.

మొద్దు[5]: ఉ. మొద్ద. చూ. పర్యా. ఎక్కువదిమ్మ. లోహపురేకుల జాయింట్లకు రివిట్లు కొట్టడానికి వాడే సాధనం. (రా. 8, 12, 14, 15).

మొద్దు[6]: డబ్బారేకులతో గారాలను చేయడానికి ఉపయోగించే రోకలిలాంటి పరికరం. (తె. 17).

మొద్దుపొగరు: ఉ. మొద్దుపోగర. పర్యా. బొద్దుదట్ట. విగ్రహాలకు బొద్దుకొట్టడానికి వాడే పరికరం. (కో. 3, 19).

మొద్దుబిందె: పర్యా. దేశంబిందె. వెడల్పుగా ఉండే ఇత్తడిబిందె. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. (తె. 23).

మొద్దొలి: రూ. మొదిలి. చూ. మొడ్డొలి. (కో. 5).

మొన[1]: రేకు చేటరేకుపై భాగం. (రా. 1).

మొన[2]: కొడవలి వాడిభాగం. (రా. 4).

మొనబెట్టు: (క్రి.) చూ. పర్యా. సరుసు. మొద్దు గడ్డపారను కొలిమిలో కాల్చి సాగ్గొట్టి కూచిగ చేయడం. (తె. 23).

మొనసుత్తి: పాత్రపై ఉండే రంధ్రాలను కలపడానికి వాడే పరికరం. (కో. 29).

మొరుకులు: చూ. పర్యా. గరుకులు[2]. లోహపు పాత్రలపై ఉండే నొక్కులు. (తె. 19).

మొల[1]: చూ. పర్యా. ఊస. టంకాన్ని రవ్వచేయడానికి వాడే పరికరం. (తె. 25).

మొల[2]: చూ. పర్యా. పోగరు. లోహపురేకులపై, కడ్డీలపై వేసిన రంధ్రాలను సరిచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 165. (రా. 3, 6, 15).

మొల[3]: రూ. మళ. చూ. పర్యా. చీల[1]. గొడుగు టోపను ఊడిరాకుండా బిగించడానికి కొట్టే ఇనప చీల. (తె. 4–6, 8, 9, 19).

మొల[4]: లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి వాడే పరికరం. (తె. 2).

మొల[5]: ఇనుపచీలల కొనభాగం. (రా. 7).

మొలకాడ: చూ. పర్యా. పోతకాలు. కరిగేలోహాన్ని పోయడానికి, అచ్చుకు రంధ్రం పెట్టడానికి వాడే పరికరం. (కో. 22).

మొలకాలు: అల్యూమినియం పోతపోసేటప్పుడు బిందె క్రిందిభాగంలో గుంటలాగా ఉండే భాగం. (కో. 4).

మొలచు: చూ. పర్యా. మతారించు. సొట్టలుగ ఉండే కడ్డీని సక్కగ వచ్చేటట్లు కొట్టడం. (రా. 16).

మొలలు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బుడిపెలు, (తె. 3, 7).

మొల్లంగిగిన్నె: చూ. పర్యా. కూరగిన్నె. కూరలు వండడానికి, వేసుకోడానికి వాడే లోహపుపాత్ర చూ. చిత్రం 60. (కో. 3).

మొల్లు: ఎద్దుకాళ్ళకు లాడాలు బిగించడానికి వాడే చీలలు. (రా. 3).

మోటకమ్మి: చూ. పర్యా. ముడిపట్లలేగ. పాలిష్ పనిలో మొదట పాత్రలపై ఉండే మైలను పోగొట్టడానికి వాడే పరికరం. (కో. 19, 20, 22).

మోటకాయితం: చూ. పర్యా. ఎమరిపేపరు. మెరుగు పెట్టిన తర్వాత నైసుగరావడానికి ఉపయోగించే గరుకు కాగితం. అల్యూమినియం పాత్రలకు మాత్రమే వాడుతారు. (కో. 20).

మోటపని: చూ. పర్యా. కమ్మరం[1]. లోహాలతో పాత్రలను, పనిముట్లను తయారు చేసేపని. (కో. 27; తె. 4).

మోటబొక్కెన: 'కపిలె' తోలడానికి వాడే పరికరం. (తె. 18).

మోటార్‌బెల్టు: (ఇం.) పర్యా. రబ్బరుముక్క. పాలిష్ పనికి ఉపయోగించే చక్రానికి మోటారుకు బిగించిన పరికరం. (కో. 4, 9).

మోటారు: (ఇం.) చూ. పర్యా. పాలిష్‌మోటారు. లోహపుపాత్రల పాలిష్‌పనికి వాడే పరికరం. (కో. 2, 9; రా. 5, 9).

మోటారుగ్రైనింగు: (ఇం.) చూ. పర్యా. పైపు బెండింగ్ మిషను. టూల్స్‌కు, బోల్ట్స్‌కు పనికివచ్చే పరికరం. (రా. 6).

మోటీయు: (క్రి.) ఇత్తడిపాత్రలను తయారుచేసేటప్పుడు మొదట రఫ్‌గా కొట్టడం. (కో. 28).

మోటు ఏయు: (క్రి) చూ. పర్యా. బాదు[1]. ఇనుమును సాగదీయడానికి సమ్మెటతో దెబ్బేయడం. (కో. 18).

మోటుసుత్తి: లోహపు రేకులను, కడ్డీలను, తెగ్గొట్టడానికి, సాపుచేయడానికి వాడే పెద్దసైజు సుత్తి. (కో. 30).

మోడ్‌నా: (క్రి.) (ఉర్దూ.) చూ. పర్యా. నులుపు. గొడుగుపుల్లలను ఇనపవైరుతో బిగించి మెలి తిప్పడం. (తె. 18).

మోడపాకుతట్టు: చూ. మోదగాకుతట్ట. (రా. 7).

మోడల్‌ప్లేట్: (ఇం.) చూ. పర్యా. మట్టంగునపం. రేకును లెవల్‌గా సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 15).

మోతి: కొలిమితొట్టెలో సరుకు కరిగిందా? లేదా అని చూచుకోడానికి వాడే సాధనం. (రా. 5).

మోదు: విగ్రహాలు పోతపోసినపుడు ఒకవిధంగా వచ్చే ఆకారం. (కో. 6).

మోదగాకుతట్ట: రూ. మోడపాకుతట్ట. మోదగాకు ఆకారంతో ఉన్న అంచున్న భోజనంప్లేటు. (రా. 8).

మోదు: (క్రి.) చూ. పర్యా. బాదు[1]. ఇనుపముక్కల్ని సాగదీయడానికి సమ్మెటతో గట్టిగ దెబ్బవేయడం. (తె. 3).

మోదుకాకు: ఉ. మోదుగాకు. మోదుగాకు ఆకారంలో ఉన్న అంచులేని భోజనంప్లేటు. (కో. 2, 19).

మోపు[1]: చూ. పర్యా. ఎక్కువదిమ్మ. లోహపురేకుల జాయింట్లకు రివిట్లు కొట్టడానికి ఉపయోగపడే సాధనం. (కో. 2, 4, 7–12, 15, 18, 19,

22-26; తె. 8, 9, 11, 12, 17, 21, 25; రా. 4, 7, 8, 10-12, 14-16).

మోపు²: చూ. పర్యా. చట్రం¹. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే పరికరం. (కో. 17, 18, 20-24; తె. 2, 3, 5, 6, 14, 17, 20, 22; రా. 15, 16).

మోపు³: పర్యా. టర్నింగ్ మోపు. అల్యూమినియం పాత్రల పోతపనిలో పాత్రలు కదలకుండా సహాయపడే పరికరం. (కో. 14).

మోపు⁴: చూ. పర్యా. గుల్లమోపు. లోహపురేకులపై, పట్టీలపై రంధ్రాలేయడానికి వాడేదిమ్మ. (కో. 20, 23, 25, 26; తె. 1-3, 17, 19, 21-24).

మోపు⁵: పాత్ర తయారీలో జవ్వ, బిళ్లపళ్ళు కలిసే స్థానం. (కో. 4).

మోపు అంబురు: పర్యా. మోపుపట్కారు. పనిచేసే టప్పుడు లోహపు వస్తువులను పట్టుకోడానికి వాడే సాధనం. (రా. 15).

మోపుచేయు¹: (క్రి.) చూ. పర్యా. బల్లించు. విడిగా ఉన్న రెండురేకులను కలిపి ఒకటిగా బిగించడం. (కో. 16, 20, 29: తె. 1, 3, 7, 19, 25; (రా. 15).

మోపుచేయు²: పర్యా. నునుపుచేయు. బిందె రేకులను చక్కచేసుకోవడం. (తె. 16).

మోపుచేయు³: (క్రి.) బీరువాబాడీకి తలుపులు సెట్ చేయడం. (కో. 26, 28; తె. 26, 28).

మోపుపట్కారు: చూ. పర్యా. మోపు అంబురు. వెల్డింగ్ సందులను సరిచేసే సాధనం. (రా. 15).

మోపేయు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపురేకులను కలిపి ఒకటిగాకలపడం. (తె. 2).

మోయు: (క్రి.) చూ. పర్యా. చుక్కకొట్టు. పూర్తిగ అతికిన తర్వాత బిందెపై వంకర్లులేకుండ నున్నగ సాపుచేసి మెరుగుచుక్కలు కొట్టడం. (కో. 21).

మోరిజాలి: చూ. మోరుకాలి. (తె. 9).

మోరిబిళ్ల: ఉ. మోరీబిళ్ళ. చూ. పర్యా. కాలువచక్కి. కాలువల్లోకి చెత్తాచెదారం వెళ్ళకుండ అడ్డంపెట్ట డానికి వాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 51. (కో. 28; తె. 19).

మోరుచెంబు: చూ పర్యా. మజ్జిగచెంబు. నీళ్ళకు, మజ్జిగకు వాడే చెంబు. (కో. 1, 3-5, 7, 10, 11).

మోరుజాలి: రూ. మోరిజాలి. చూ. పర్యా. కాలువ చక్కి. కాలువల్లోకి చెత్తాచెదారం వెళ్ళకుండ అడ్డం పెట్టడానికి వాడే రంధ్రాలబిళ్ళ. చూ. చిత్రం 51. (తె. 4, 9).

మోల్డింగ్అండి: అల్యూమినియంతో తయారుచేసే లోహపుపాత్ర. (కో. 2).

మోల్డింగ్చెంబు: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారంతో చేసిన చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 84. (కో. 2).

మోల్డింగ్చేయు: (క్రి) (< ఇం. Moulding+ చేయు) చూ. పర్యా. రివిట్చేయు. రెండురేకు అంచుల్ని ఒకదానితో ఒకటి ఎదురెదురుగా అమర్చి ఊడిరాకుండ గట్టిగాకొట్టడం. (రా. 8).

మోల్డింగ్పని: చూ. పర్యా. పోతపని. మట్టితో అచ్చు కట్టి లోహాన్ని కరిగించి పోసి పాత్రను తయారు చేసే పని. (కో. 2).

మోల్డింగ్సెక్షను: (ఇం.) పొగాకుఅచ్చులు తయారు చేసేస్థలం. (కో. 3).

మోలింగు: (ఇం.) చూ. పర్యా. అతుకు. రెండు రేకులనుగాని కమ్ములనుగాని పట్టాలనుగాని ఒకటిగా అతకడం. (రా. 6, 16).

మోల్డుచేయు: (క్రి.) చూ. పర్యా. తట్టు¹. విగ్రహం పనిలో అచ్చుమీద మట్టిని కట్టడం. (రా. 2).

## య

యన్.పి.గిన్నె: కూరలు ఉంచుకోడానికి వాడే సాదా గిన్నెలాంటి పాత్ర. (కో. 13. 15).

యన్.పి.గ్లాసు: నడుంభాగంలో మెలితిరిగి ఉండే చిన్న నీళ్ళలోటా. (తె. 8, 9).

యన్.పి.దబరాగిన్నె: కూరలు పోసుకోడానికి వాడే చిన్నపాత్ర. (కో. 11).

యంత్రపుబిళ్ల: దెయ్యాలు పట్టకుండా నిరోధించ డానికి ఉపయోగించే రాగి, ఇత్తడి కలిసిన బిళ్ళ. (కో. 13).

యల్.బెండ్: (ఇం.) ఇనుపముక్కలను వంపు చేసుకోడానికి వాడే పనిముట్టు. (కో. 28).

యళలుతీయు: (క్రి.) చీలలను బయటికి వచ్చేటట్లు చేయడం. (రా 11).

యాకార్తి: చూ. ఏకార్తి. (కో. 12).

యాక్సా: చూ. అక్సా. (కో. 23).

యాంగిల్స్: (ఇం.) చూ. పర్యా. ఆంగ్లేరు. వెల్డింగ్ డిజైన్స్ఫోర్కర్ల చుట్టూవేసే 'V' ఆకారపు పట్టీ. (తె. 24).

యాంగ్లరు: చూ. అంగలర్. (కో. 23, 24, 26, 27).

యాపరురాడ్డు: (ఇం.) టాంకునుండి కిరసనాయిలును బర్నర్‌కు అందించే గొట్టం. (కో. 30).

యాపిల్‌కాయ: (ఇం.) కుంకుమ వేసుకోడానికి యాపిల్ ఆకారంలో ఉండే డబ్బి. (కో. 19, 24).

యాపిల్‌కాను: (ఇం.) తినుబండారాలను, ఏవైన వస్తువులను నిల్వ ఉంచుకోడానికి వాడే ఆపిల్ కాయ ఆకారంతో చేసిన పెద్ద టిఫనుబాక్సు. (తె. 20).

యామరు: చూ. ఆమరు. (కో. 17, 24).

యాసిడ్: చూ. ఆసిడ్. (కో. 20, 23, 25, 27, 30; తె. 21; 24).

యాసిడ్‌పుల్ల (< ఇం. A… + పుల్ల). యాసిడ్‌ను పూయడానికి వాడే సన్నని రేకు. (తె. 21).

యు-ఛానలు: లోహపుకడ్డీలను వంపుపెట్టడానికి వాడే మోపు. (రా. 12).

యు-దిమ్మ: పర్యా. యు-బ్లాకు. ఇనపపట్టీలను 'U' ఆకారంగా మార్చడానికి వాడేదిమ్మ. (కో. 24).

యు-పట్టుకార: కొలిమిపనిలో గొట్టాలను పట్టుకోడానికి వాడే పనిముట్టు. (రా. 11).

యు-బ్లాకు: చూ. పర్యా. యు-దిమ్మ. ఇనపపట్టీలను 'U' ఆకారంగా మార్చడానికి వాడేదిమ్మ. (కో. 24).

## ర

రగ్గు: పెట్టెలు తయారుచేయడానికి వాడే తారుద్రమ్ము రేకు. (రా. 12).

రగ్గుసుత్తి: తారుద్రమ్ము రేకు అంచులను చక్క-చేయడానికి వాడే పనిముట్టు. (రా. 12).

రతి: పాత్రల డిజైనుపని పూర్తి అయిన తర్వాత ప్లాట్‌ను తూకంవేసుకొనే సాధనం. (రా. 2).

రద్దు[1]: చూ. పర్యా. బుగ్గి. కరిగే లోహంపై ఉండే మలినపదార్థం. (కో. 28, 29).

రద్దు[2]: పర్యా. రాకు[2], రాపురాయి, రాయి[3]. మొద్దుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడం. (రా. 3).

రన్‌చేయు: (క్రి.) (< ఇం. Ru… + చేయు). గొడుగు కడ్డీల గొట్టం. గొడుగుకర్ర పైకి, క్రిందికి తిరిగేటట్లు చేయడం. తాళంచెవిని తాళంలోపల సులువుగ తిరిగేటట్లు చేయడం. (కో. 17).

రన్నరు[1]: (ఇం.) రూ. రన్నల్. చూ. పర్యా. గొట్టం[3]. గొడుగుపుల్లలు బిగించడానికి ఉపయోగపడే గొడుగుకడ్డీపై పైకి, కిందికి సులువుగ తిరిగే పరికరం. (కో. 39; తె. 17, 18, 21; రా. 11).

రన్నరు[2]: (ఇం.) పర్యా. రైజరు[1]. కరిగిన లోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి వాడే గొట్టం. (రా. 11).

రన్నల్: చూ. రన్నరు. (తె. 20).

రఫ్‌చేయు: (క్రి.) (< ఇం. Rough + చేయు). చూ. పర్యా. తరగదీయు. లావుగా ఉండే లోహపు వస్తువులను ఆకురాయితో తగ్గించడం. (రా. 7, 9).

రంధ్రం: చూ. పర్యా. కన్నం. పోత లోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి ఏర్పాటుచేసిన బెజ్జం. (కో. 1, 13, 23; తె 1, 4-7, 17-19; రా. 2, 4. 5, 10, 12).

రంధ్రాలగరిటె: పర్యా. అప్పడాల సిమటా అబు[3], కిళ్ళచక్రం. చట్రం[4], చిల్లిగరిట, జల్లిగంటె, జల్లిదబ్బ, జార్ని, జాలరు, ఝరా, పూరీచంచా, బుడ్డకారాలగరిటె, బూడిద దేవుకిచట్రం, బూంది గంటె, బూందిచట్రం, బూందిజాల, మురుకుల గరిట, వడలగంటె, సెట్వాలచంచా. నూనెలో నుంచి పిండిపదార్థాలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న పరికరం. (కో. 18, 29; తె. 1, 4-6, 14-19, 21, 22, 23; రా. 15).

రంధ్రాలబిళ్ళ: చూ. పర్యా. జాలిప్లేటు. పెట్రొమాక్స్ లైటు భాగాలు కదలకుండ బిగించడానికి ఉపయోగించే సాధనం. (తె. 22).

రంధ్రాలు: పాత్రలలో ఉండే మురికిని గోకేందుకు వాడే పరికరం. (రా. 15).

రఫ్‌రాయి: (< ఇం. Rough + రాయి). చూ. పర్యా. గరుకురాయి[1]. వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడే రాయి. (కో. 23; రా. 12, 15. 16).

రఫ్‌స్టోను (ఇం.) ఉ. రఫ్‌స్టోన్. బొగ్గుగనుల్లో బొగ్గునుకోసే బ్లేడును సానపట్టడానికి వాడేరాయి. (తె. 21).

రబ్బరుముక్క: (< ఇం. R… + ముక్క). చూ. పర్యా మోటార్‌బెల్టు. పాలిష్‌పనికి ఉపయోగించే చక్రానికి మోటారుకు బిగించిన పరికరం. (కో. 4, 9)

రంపపుదొడ్డి: ఆక్సాబ్లేడును అమర్చిన ఫ్రేము. ఇనప వస్తువులు కోయడానికి ఉపయోగం. (కో. 15, 20).

రంపం: రూ రంపి, రంపె, అంపం. పర్యా. ఆక్సా, ఆక్సాఫ్రేము, ఆక్సాబ్లేడు. అర, బ్లేడు[1]. ఇనప కడ్డీలను, రేకులను, పైపులను, ప్లేట్లను, తంతెలను కోయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 185.

(కో. 2, 3, 15, 18, 19, 22; తె. 1–3, 7–9, 13, 22. 24, 29; రా. 6–8, 11, 14).

రంపంపొట్టు: చూ. పర్యా. రోసువడి. లోహపుపనిలో పాలిష్‌కు ఉపయోగించే పొట్టుపదార్థం. (కో. 22; రా. 8).

రంపె: ఉ. రెంపి. చూ. రంపం. (తె. 3, 4; రా. 12).

రయస్తంభం: దేవాలయాల్లో ఉండే ధ్వజస్తంభము. (కో. 8).

రవి: చూ. పర్యా. కవ్వం. మజ్జిగ చిలకడానికి వాడే సాధనం. చూ. చిత్రం 45. (తె. 11).

రవ్వ: చూ. పర్యా. చూర. లోహపు పాత్రలను అతకడానికి వాడే పదార్థం. (తె. 1–4, 9–11, 15–19, 23–25).

రవ్వకడ్డి: చూ. పర్యా. కడ్డి[1]. ఇత్తడిపాత్రలు రవ్వతో అతకడానికి వాడే కడ్డి. (తె. 3).

రవ్వగజ్జెలు: నాట్యం చేసేటప్పుడు కాళ్ళకు కట్టుకొనే చిన్న ఇత్తడిగజ్జెలు. (తె. 18, 22).

రవ్వచిప్ప: చూ. పర్యా. కుడక. టంకంపొడి వేసుకోడానికి వాడేపాత్ర. (తె. 1, 3, 17–19, 21, 23, 25)

రవ్వడాకలి: చూ. పర్యా. ఊస. టంకాన్ని రవ్వ చేయడానికి వాడే పరికరం. (తె. 1, 3).

రవ్వపుల్ల: చూ. పర్యా. కడ్డీ[1]. ఇత్తడి పాత్రలను రవ్వతో అతకడానికి వాడే కడ్డీ. (తె. 18, 19, 21, 22, 24, 25).

రవ్వమూస: చూ. పర్యా. కడ్డీ[1]. ఇత్తడి పాత్రలను రవ్వతో అతకడానికి ఉపయోగించే కడ్డీ. (తె. 10, 11).

రవ్వమొల: చూ. పర్యా. ఊస. టంకాన్ని రవ్వచేయడానికి వాడే పరికరం. (తె. 23, 25).

రవ్వసలాగ: చూ. పర్యా. కడ్డీ[1] ఇత్తడి పాత్రలను రవ్వతో అతకడానికి వాడే కడ్డీ. (తె 14, 16).

రసగుల్లాపికప్: (< రసగుల్లా + ఇం. Pickup) తయారయిన రసగుల్లాలు తీయడానికి ఉపయోగించే పట్టకార. (కో. 27).

రసమట్టం: పర్యా. లెవల్[2]. పాత్రసరిగా ఉందో లేదో చూడడానికి వాడే కడ్డీ లాంటి పరికరం. ఇందులో ఉన్నరసం లేదా నీటిచుక్క లెవల్ ప్రకారం అటూ ఆటూ తిరుగు తుంటుంది. (కొ. 27).

రసంమిషను: (< రసం + ఇం. Machine) చూ. పర్యా. జ్యూస్‌కిషరు. బత్తాయిరసం తీయడానికి వాడే సాధనం. (కో. 4. 9).

రాకు[1]: (క్రి.) చూ. పర్యా. తరగదీయు. బీరువాపై వెల్డింగ్ చేసిన తర్వాత పైె బుడిపెలు కనపడకుండ ఆకురాయితో శుభ్రంగా అరగ దీయడం. (కో. 17; రా. 6).

రాకు[2]: (క్రి.) చూ. పర్యా. రద్దు[2]. మొద్దుబారిన లోహపు పనిముట్టను పదును పెట్టడం. (తె. 3, 4, 21).

రాగి: పర్యా. కెంపు, తామ్రం. పాత్రలకు, గుళ్ళ వస్తువులకు వాడే ఒకరకం ఎర్రటిలోహం. (కో. 1–30; తె. 5, 14, 15, 17, 19, 25, రా. 1, 3, 8, 11).

రాగికలిశ: చూ. మరచెంబు[2]. దేవాలయంలో తీర్థానికి వాడే రాగిపాత్ర. (కో. 22).

రాగికుండ: అన్నంచేయడానికి వాడే గుండ్రని రాగి పాత్ర, చూ. చిత్రం 196. (కో. 21).

రాగిచెంబు: చూ. పర్యా. గిండి. పూజాసమయంలో తీర్థానికై వాడే రాగిపాత్ర. (కో. 18, 20, 23, 29; తె. 7; రా. 12).

రాగితపుక్క: చూ. పర్యా. రాగిపళ్లెం. ఉద్ధరణి మొదలయిన పూజాసామగ్రి ఉంచుకోడానికి వాడే చిన్న రాగిపళ్లెం. (తె. 5, 7).

రాగిపళ్లెం: పర్యా. నక్కీస్ప్లేటు, రాగితపుక్క, స్తపుకు, హరిబణం. పూజాసామగ్రి ఉంచుకోడానికి ఉపయోగించే చిన్నరాగితట్ట. (కో. 23, 29).

రాగిపాత్ర: చూ. పర్యా. మరచెంబు[2]. దేవాలయంలో తీర్థానికి వాడే రాగిపాత్ర. (కో. 24),

రాగిపూత: చూ. పర్యా. జాజు. రాగిపాత్రలపై పూతగ వాడే ఎర్రని రంగుపదార్థం. (కో. 2).

రాగిబింది: నీళ్ళు తెచ్చుకోడానికి వాడే గుండ్రని రాగి బిందె. (కో. 20).

రాగిమట్లుకరవాయి: రాగిపాత్రలను మెరుగుపరచడానికి వాడే పనిముట్టు. (కో. 4, 11).

రాగేకు: రూ. రావేకు. రాగి ఆకు ఆకారంలో ఉన్న అంచులేని భోజనంప్లేటు. (కో. 12).

రాచిప్ప: చూ. పర్యా. కుడక. టంకంపొడిని వేసుకోడానికి వాడే పాత్ర. (తె. 25).

రాజమండ్రికాగు: చూ. పర్యా. కాగు. నీళ్ళుతేవడానికి ఉపయోగించే వెడల్పు మూతిగల లోహపుబిందె. చూ. చిత్రం 46. (కో. 24, 28).

రాజమండ్రిబింది: చూ. పర్యా. కాగు. నీళ్ళు తేవడానికి ఉపయోగించే వెడల్పుమూతిగల లోహపు పాత్ర. చూ. చిత్రం 46. (కో. 29).

రాజమందిరిలోవి: అన్నం వండుకోడానికి బంగ

వాటంగా ఉండి మాడుఉండే లోహపుపాత్ర. రాజమండ్రిలో తయారయింది. (కో. 29).

రాడ్‌బెండింగు: (ఇం.) చూ. పర్యా. పైపు బెండింగ్ మిషను. కడ్డీలను డిజైన్లుగ వంచడానికి వాడే పరికరం. (కో. 24).

రాడ్‌రించి: (ఇం.) చూ. పర్యా. రించి. నట్లు బిగించడానికి వాడే సాధనం. చూ. చిత్రం 197. (కో. 21).

రాడ్డు[1]: (ఇం.) చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటికర్ర. (కో. 1; తె. 5, 17).

రాడ్డు[2]: చూ. పర్యా. కమ్మి[2]. లోహపురేకులను, కడ్డీలను వంచడానికి వాడే మోపు. (కో. 2, 8, 10, 13, 28; తె. 8, 14, 15, 17).

రాడ్డు[3]: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపుపాత్రల నొక్కులుతీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి వాడే పరికరం. (రా. 7).

రాడ్డు[4]: చూ. పర్యా. చువ్వ. బ్యాటరీలైట్ స్విచ్చును, సైకిల్‌సామాన్లు రివిట్లు చేయడానికి వాడే సాధనం. (కో. 4, 7, 9, 11, 22, 26; తె. 2, 3, 13, 21; రా. 6, 7, 11).

రాడ్డు[5]: లోహపువస్తువులను వెల్డింగ్ చేయడానికి వాడే కర్బనపు కడ్డీ. (కో. 5, 13, 23. 24; తె. 20, 21. 23, 25; రా. 6).

రాడ్డు[6]: మట్టిఅచ్చుకు పోతలోహాన్ని పోయడానికి రంధ్రాన్ని చేసేకడ్డీ. ఇవి నాలుగు ఉంటాయి. నాల్గు వైపుల ఉంచి అచ్చుకట్టారు. (తె. 19).

రాడ్డు[7]: చూ. పర్యా. కత్తెమొల. లోహపురేకులను కత్తిరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 24; రా. 2).

రాతిపొడి: చూ రాయిపొడి. (తె. 17).

రాతెండి[1]: చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే పోతపోసిన చెంచా. (తె. 2).

రాతెండి[2]: అల్యూమినియం. (తె. 24).

రాతెండితెలె: పర్యా. రిజ్జ. అన్నంతినడానికి వాడే పోతపళ్లెం. (తె. 18).

రాపనంచేయు. (క్రి.) చూ. పర్యా. తరగదీయు బిందెపై జాయింట్లు కనపడకుండ ఆకురాయితో రేక అతుకులను అరగదీయడం. (తె. 17, 21).

రాపు: (క్రి.) చూ. పర్యా. తరగదీయు. విగ్రహాలు పీసులుగా ఉంటే ఆకురాయితో రాసి శుభ్రం చేయడం. (రా. 1).

రాపుడుచేయు: (క్రి.) చూ. పర్యా. తరగదీయు. ఆకురాయితో పోతపాత్రలకు కచ్చులు లేకుండ అరగదీయడం. (కో. 24).

రాపురాయు: (క్రి.) చూ. పర్యా. రద్దు[2]. మొద్దుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడం. (కో. 20).

రామపాత్ర: చూ. పర్యా. మరచెంబు[2]. దేవాలయాల్లో తీర్థానికి ఉపయోగించే రాగిపాత్ర. (కో. 6, 7, 10–13, 15; తె. 17).

రాంపాత్రగ్లాసు: చూ. పర్యా. దానంగ్లాసు. చావు కర్మలు చేసేటప్పుడు దానం ఇవ్వడానికి వాడే పల్చని ఇత్తడి రేకుగ్లాసు. (తె. 10).

రాంపాల: చూ. పర్యా. జూస్‌కషర్. పండ్లరసం తీయడానికి వాడే సాధనం. (కో. 25).

రాయపూరుకాను : (< రాయపూరు + ఇం. Can) చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యిలాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపుపాత్ర. (తె. 17).

రాయపూరుజాడి: చూ. పర్యా. నూనెగిన్నె. నూనె, నెయ్యిలాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపుపాత్ర. (కో. 28).

రాయపూరుబుడ్డీ: చూ. పర్యా. నూనెగిన్నె. నునె, నెయ్యిలాంటి ద్రవపదార్థాలు తెచ్చుకోడానికి వాడే లోహపుపాత్ర. (కో. 17).

రాయల్‌పంచు: (< రాయల్ + ఇం. Punch) చూ. పర్యా. రౌండుపంచు. లోహపురేకులను కత్తిరించడానికి వాడే పరికరం. (తె. 15).

రాయి[1]: చూ. పర్యా. రోలు. ఇత్తడిరేకును కుట్టం పెట్టడానికి వాడే దిమ్మ. (కో. 5, 13).

రాయి[2]: గంట అంచుభాగం. (రా. 5).

రాయితొట్టి: చూ. పర్యా. తొట్టె. పనిముట్లను పదును పెట్టడానికి, కాకరావడానికి కొలిమిపై నీళ్ళుచల్లడానికి వాడే నీళ్ళపాత్ర. (తె. 4).

రాయిపొడి: రూ. రాతిపొడి. చూ. పర్యా. తరి. మొద్దుబారిన పనిముట్లను పదునుపెట్టడానికి ఇత్తడిపనిలో ఉపయోగించే గరుగ్గాఉన్న తెల్లనిపొడి. (తె. 24; రా. 2).

రాయిబండ: బండిచక్రాలు కట్టేటప్పుడు వాడే పెద్ద అరుగు. రా. 13)

రాయిరోలు: సీకును వంచడానికి ఉపయోగించే గాడి రాయి.(తె. 1).

రాయు[1]: (క్రి.) చూ. పర్యా. తరగదీయు. లోహపు రేకుల అతుకులను కనపడకుండ ఆకురాయితో నున్నగ సాపుచేయడం. (కో. 27; తె. 8; రా. 3,

4, 7, 8, 12).

రాయు[2]: (క్రి.) చూ. పర్యా. తీయు[1]. రేకుపై ఆసిడ్‌ను పూయడం. (కో. 5, 17, 23, 24, 28).

రాయు[3]: (క్రి.) చూ. పర్యా. రద్దు[2] మొద్దుబారిన లోహపు పనిముట్లను పదును పెట్టడం. (తె. 20, 21; రా. 2, 4).

రాలగొట్టు[1]: (క్రి.) అగరుగొట్టు. వెల్డింగ్ అయిన తర్వాత బుడిపెలనుతీసివేయడం. (తె. 2 17, 18).

రాలగొట్టు[2]: (క్రి.) పోతపోసిన తర్వాత పాత్రను తీయడానికి చుట్టూ ఉండే మట్టిని కొట్టివేయడం. (కో. 20).

రాల్పు: (క్రి.) చూ. పర్యా. అగరుగొట్టు. వెల్డింగ్ అయిన తర్వాత బుడిపెలను తీసివేయడం. (తె.17).

రాళ్లము: లోహాన్ని కరిగించి పోయగా మిగిలిన మట్టితో కూడిన పదార్థం. (రా. 11).

రావడి: చూ. పర్యా. చూర. లోహపు పాత్రలను అతకడానికి వాడే పదార్థం. (తె. 25).

రావేకు: చూ రాగేకు. (కో. 16, 29).

రాసగిన్ని: మహారాజులు వాడే చింతాకువాసి చిన్న శిరస్సు ఉండే చిన్న లోహపుపాత్ర. (కో. 24,29).

రికాపు: చూ. రికాబి. (తె. 2).

రికాబి: రూ. రికాపు, రికాబు[2]. మహమ్మదీయులు వాడే భోజనం పళ్ళెం. (రా. 15).

రికాబు[1]: చూ. పర్యా. కవరు[3]. పాత్రలపై మూతగా వాడేపళ్లెం. (తె. 2, 3; 19).

రిజాబు[2]: చూ. రికాబి. (కో. 2).

రిక్కలు: వెల్డింగ్ గ్రిల్స్‌లో ఉండే రెండు తలుపు భాగాలు. (తె. 17).

రిక్షారాడ్‌స్పానరు: (ఇం.) చూ. పర్యా. రించి. రిక్షారాడ్‌లు తయారుచేయడానికి, బిగించడానికి వాడే సాధనం చూ. చిత్రం 197. (రా. 8).

రింగ్‌స్పానరు: (ఇం.) రూ. రింగుపాన. చూ. పర్యా. రించి. నట్లు బిగించడానికి వాడే సాధనం. చూ. చిత్రం. 197. (కో. 1; రా. 6).

రింగు[1]: (ఇం.) చూ. పర్యా. గిన్నె[5]. స్టౌకో బర్నర్ మంటను అదుపులో ఉంచడానికి అమర్చిన రింగు. (తె. 4).

రింగు[2]: (ఇం.) చూ. పర్యా. డూం. టార్చిలైటు బల్బుచుట్టూ ఉండే అద్దం, ఫోకస్‌గిన్నె అమర్చిన బిరడా. (తె. 22).

రింగు[3]: చూ. పర్యా. రోలు. బిందె అడుగుబిళ్ళను కుదించడానికి మోపుగావాడే దిమ్మ. (కో. 5; తె. 2, 24; రా. 12, 14).

రింగు[4]: చూ. పర్యా. అడుగుగొంతు. గొడుగు పుల్లలను బిగించడానికి గొడుగుకర్ర పైభాగాన ఉండే గుండ్రని ఇత్తడి పరికరం. (తె. 1, 2, 18, 19, 21, 22, 24, 25; రా. 11, 12).

రింగు[5]: కొయ్యపోత చట్రంపై ఉండే మట్టిని శుభ్రం చేయడానికి వాడే పరికరం. (తె. 19).

రింగు[6]: తాళాలు గ్రుచ్చిన దండ. (కో. 24).

రింగు[7]: చూ. పర్యా. స్పానరు. నట్లు బిగించడానికి వాడే సాధనం. (రా. 6).

రింగుచెంబు: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారమున్న చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 84. (కో. 12, 15).

రింగుతపాల: చూ. పర్యా. గుండుతపాళా. కొంచెం ఎత్తుగా, గుండ్రంగా అంచు వెనక్కివంచి మూతి వెడల్పుగా చేసినట్టి లోహపుపాత్ర. మందుండదు. అంచుప్రక్కన బొద్దు వుంటుంది. వంటలు చేయడానికి ఉపయోగం. (కో. 12, 15).

రింగుపోగరు: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు చేయడానికి వాడే పరికరం. (రా. 13).

రింగుమూల: విగ్రహం గుండ్రని భాగాల్లో చెక్కడానికి వాడే పరికరం. (తె. 10, 11).

రింగురింజి: (ఇం.) చూ. పర్యా. రించి. నట్లు బిగించడానికి వాడే సాధనం. చూ. చిత్రం 197. (కో. 14).

రిజ్జ: చూ. పర్యా. రాతెండితలె. అన్నం తినడానికి వాడే పోతపళ్లెం. (తె. 18).

రించి: (< ఇం. Rench). ఉ. రెంచ్, రెంచి. రూ. రింజి. పర్యా. పలకరేంజి, బర్నల్‌పాన, బర్నల్ స్పానరు, రాడ్‌రెంచి, రింగ్‌స్పానరు, రింగురింజి, రిక్షారాడ్ స్పానరు, సట్‌పాన, స్క్రూపానరు, స్క్రూరింజి. నట్లు బిగించడానికి వాడే సాధనం. లోహపు రేకులకు జాయింట్లుచేసే పల్లును వంచడానికికూడా ఉపయోగం. అడుగుభాగం కొద్దిగ చీలి వుంటుంది. చూ. చిత్రం 197. (కో. 17, 26–29; తె. 21).

రింజి: చూ. రించి. (కో. 4, 5, 9, 10, 13, 28).

రింజిసెట్లు: (ఇం.) స్పానర్లకట్ట. (కో. 7).

రిఫ్లెక్టరు: (ఇం.) చూ. పర్యా. కటోరి[1]. వెలుతురు బాగా రావడానికి టార్చిలైటు బల్బుచుట్టూ ఉండే తెల్లనిరేకు. (తె. 3, 21).

రిమ్ము¹: (ఇం.) చూ. పర్యా. కమ్ము. బండిచక్రానికి చుట్టు వేయడానికి వాడే ఇనుపబద్ద. (రా. 14).

రిమ్ము²: చూ. పర్యా. చక్రం¹. సానరాయి తిరగడానికి బెల్టుద్వారా కలుపబడిన సైకిలుచక్రం. (తె. 21).

రివిట్‌చేయు: (క్రి.) (< ఇం. Rivet + చేయు). రూ. రివిటింగ్‌చేయు. పర్యా. పడుపు, మోల్డింగ్ చేయు, రివిచేయు. రేకు అంచుల్ని ఒకదానితో ఒకటి ఎదురెదురుగా అమర్చి ఊడి రాకుండ గట్టిగ కొట్టడం. (రా. 3, 5, 6).

రివిట్‌పోగరు: బ్రేటీకి రివిట్లు చేయడానికి వాడే పనిముట్టు. (కో. 2).

రివిట్‌ప్రెసింగ్‌చేయు: (క్రి.) చూ. పర్యా. జంటించు. రెండు రేకులను ఒకటిగా అతకడం. (రా. 8).

రివిటింగ్‌చేయు: (క్రి.) చూ. రివిట్‌చేయు. (కో. 26; రా. 10).

రివిటు: చూ. రివిట్టు. (కో. 4, 15; రా. 7, 10).

రివిచేయు: (క్రి.) చూ. పర్యా. రివిట్‌చేయు. రేకు అంచుల్ని ఒకదానితో ఒకటి ఎదురెదురుగా అమర్చి ఊడిరాకుండ గట్టిగా కొట్టడం. (తె. 23).

రివిట్టు: రూ. రివిటు, రివిట్లు. చూ. పర్యా. చీల². రేకు జాయింట్లు విడిపోకుండ ఉండడానికి వాడే చిన్న చీల. (కో. 2, 11, 13; తె. 8, 12; రా. 4).

రివిట్లు: చూ. రివిట్టు. (కో. 8, 9, 22, 23, 26; తె. 2, 9, 11, 17, 21; రా. 12).

రీటా: చిన్నపిల్లల్ని దొడ్డికి కూర్చోబెట్టడానికి వాడే పాత్ర. వెడల్పుమూతి, కాడలాంటి అడుగు కలిగి ఉంటుంది. (తె. 22).

రీమ: డక్కన్ వంగిపోకుండా పొడవున లోభాగాన కొట్టేపట్టి. (తె. 6).

రీరోలింగ్‌మిల్లు: (ఇం.) కరిగిన అల్యూమినియంను రేకులుగా తయారు చేసే పరికరం. (రా. 7).

రుద్దు¹: చూ. పర్యా. దులగొట్టు¹. గట్టిమట్టిని మెత్తగా చేయడం. (రా. 11).

రుద్దు²: (క్రి.) చూ. పర్యా. తరగదీయు. ఇనప సామాన్లను అకురాయితో రుద్దడం. (రా. 4).

రుద్రాణి చూ. పర్యా. ఉద్ధరిణి. కింద చిప్ప మోస్తరు పైన నాగుపడగ మాదిరి ఉండే పొడుగాటిగంటు. సంధ్య వార్చేటప్పుడు ఉపయోగం. (కో. 2).

రుబ్బు: (క్రి.) లోపలుండే అచ్చును తీసేందుకు చుట్టు ఉండే మట్టిఅచ్చును మెల్లగ కదిల్చి వదులుచేయడం. (కో. 20; తె. 19).

రూలరు: (ఇం.) చూ. పర్యా. కంపాసు². లోహపు రేకుపై, పట్టీపై గుండ్రంగా గీయడానికి వాడే పరికరం. (తె. 17).

రూలుతీయు: (క్రి) (< ఇం) సైజుప్రకారం రేకుపై కొలతలు గుర్తించడం. (కో. 27).

రెగులేటరు: (ఇం.) ఉ. రెగులేటరి. పర్యా. స్క్రూ-౧². స్టౌమంటను అదుపులో ఉంచడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 28, 29; తె. 3).

రెట్టకడియం: చేతిరెట్టలకు కట్టుకొనే మంత్రపూర్వకమైన గుండ్రని కడియం. (రా. 3).

రెడ్‌యాక్సైడు: చూ. రెడాక్సైడు. (కో. 25).

రెడాక్సైడు: రూ. రెడాక్సాసైడు, రెడ్‌యాక్సైడు. చూ. పర్యా. ప్రెమరిరంగు. పూర్తయినబీరువా, గేట్లువగైరా ఇనపవస్తువులకు మొదటిసారి వేసే ఎర్రనిరంగు పదార్థం. (కో. 23, 24, 26-29; తె. 2, 3, 7, 18, 21, 22; రా. 8).

రెడాక్సాసైడు: చూ. రెడాక్సైడు. (రా. 7).

రెండంచులగిన్నె: అన్నంతినడానికి వాడే లోతైన ఇత్తడిపాత్ర. (కో. 30).

రెండుకళ్ళసుత్తి: బిందెఅతుకులు కలపడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 28; తె. 8, 9).

రెండుప్రక్కల తరకరవాయి : స్టీల్‌కూజాలు నొక్కులు తట్టడానికి ఉపయోగపడే రెండుపక్కల కొనభాగం కూచిగ ఉండే పరికరం. (రా. 1).

రెండుబుగ్గలకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమి దగ్గర వాడే పనిముట్టు. (కో. 29).

రెండువైపుల కరవాయి: విగ్రహం మెడభాగం తయారుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 6).

రెండోపట్టుకమ్మి: చూ. పర్యా. బరువు సదరం. పాత్రను రెండోసారి మెరుగుపెట్టడానికి వాడే పనిముట్టు. (కో. 20).

రెంపిలేగ: చూ. పర్యా. చక్రలేగ. పాత్రలోపలవైపు మెరుగుపెట్టడానికి వాడే పరికరం. (కో. 27).

రేక: బావిలోంచి నీళ్ళు తోడుకునే సాధనం. (కో. 27).

రేకు¹: చూ. పర్యా. పలుగు. మోల్డింగ్‌పనిలో గీతలు గీసే పరికరం. (కో. 2).

రేకు²: చూ. పర్యా. గంపె². కొలిమిలో బొగ్గులు వేయడానికి వాడే పొడవుకాడ ఉన్న వెడల్పురేకు. (తె. 15).

రేకు³: చూ. పర్యా. గీకుడుపట్టి. అచ్చులపై ఉండే మట్టిని శుభ్రంచేయడానికి వాడే పల్చనిరేకు.

(కో. 22, 26; తె. 11).

రేకు[4]: చూ. పర్యా. టెంప్లేటు. ముందుగ డిజైను గీయడానికి వెల్డింగ్‌పనిలో వాడే పెద్ద లోహపురేకు. (కో. 23; తె. 23).

రేకు[5]: చూ. పర్యా. టాపుకవరు. కొలిమికి బయటిగాలి తగలకుండా అడ్డంపెట్టడానికి వాడే సాధనం. (కో. 26, 28; తె. 2, 17–19, 24; రా. 5, 11, 15).

రేకు[6]: బూడిదను సాపుచేయడానికి వాడే పరికరం. (రా. 14).

రేకు[7]: డబ్బా తయారుచేయడానికి వాడే పల్చనిసాధనం. (రా. 7).

రేకు[8]: చీలలాగా ఉండే పరికరం. మట్టిఅచ్చును గీసుకోడానికి ఉపయోగం. (కో. 14).

రేకుకత్తి: చూ. పర్యా. మంగలిషాపుల్లో షేవింగ్ చేయడానికి వాడే పరికరం (తె. 21).

రేకుకత్తెర: ఉ. రేకుకత్తిరి. రూ. రేకులకత్తిరి. రేకులను కత్తిరించడానికి వాడే పరికరం. (కో. 13, 29).

రేకుగిన్నె: చూ. పర్యా. కెటిలు. కాఫీ, టీ తయారు చేయడానికి ఉపయోగించే చిన్నపాత్ర. (కో. 22).

రేకుచెంబు: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారమున్న చిన్న లోహపుపాత్ర. (కో. 3, 18, 20; తె. 7, 10, 11, 20).

రేకుచేట: ఉ. రేకుచాట. చూ. పర్యా. చేట. బియ్యం చెరగడానికి, చెత్తాచెదారం ఎత్తడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 198. (కో. 14, 15).

రేకుపని: రేకుతో బీరువాలు, ట్రంకుపెట్టెలు, డ్రమ్ములు, బకెట్లు, పాలకాన్లు వగైరా తయారుచేసే పని. (కో. 16, 17, 19, 22; రా. 1, 5).

రేకుపెట్టు: (క్రి.) పాలక్యాను భూమికి తగలకుండా రేకును పెట్టుకోవడం. (రా. 2).

రేకుబిళ్ళ: చూ. పర్యా. అడుగు. ఇత్తడి, ఇనుప పాత్రల అడుగుభాగపు రేకు. (తె. 8).

రేకుబిందె: చూ. పర్యా. కొత్తనమూనా బిందె. నీళ్ళు తెచ్చుకోడానికి వాడే డబ్బీ ఆకారపు ఇత్తడిబిందె. (తె. 7).

రేకుబొగ్గులపొయ్యి : చూ. పర్యా. కుంపటి[1]. బొగ్గులతో వంటచేయడానికి వాడే లోహపుపొయ్యి. చూ. చిత్రం 181. (తె. 21).

రేకుమూకుడు: చూ. పర్యా. కడాయి. పిండివంటలు తయారుచేయడానికి వాడే ఇరుపైపులా పిడులు అమర్చిన లోహపుపాత్ర. చూ. చిత్రం 163.

రేకులకత్తిరి: చూ. రేకుకత్తెర. (కో. 14).

రేకులేగ: చూ. పర్యా. చక్రలేగ. పాత్ర లోపల భాగంలో మెరుగుపరచడానికి వాడే పరికరం. (కో. 14).

రేఖాహార్తి: కర్పూరంతో హారతి ఇవ్వడానికి వాడే గరిట. (కో. 7).

రేగ్‌మాల్‌పైపు: సైకిల్ ట్యూబ్‌కు పంచర్ వేయడానికి ఉపయోగించే పరికరం. (తె. 12).

రేగు: (క్రి.) బీగం చేసేటపుడు చుట్టూ లోపల ఉండే స్థలం చెదిరిపోకుండ ఉండటం. (కో. 19).

రేజర్: (ఇం.) చూ. రైజరు[2]. (తె. 2).

రేటి: నిలువుగా ఉన్న చిన్న అల్యూమినియం పాత్ర. మహమ్మదీయులు దొడ్డికి నీళ్ళు తీసుకెళ్ళడానికి వాడ్తారు. (తె. 17).

రేడియోస్టాండు: (ఇం.) రేడియో పెట్టుకోడానికి వాడే లోహపు పరికరం. (రా. 4).

రేనచ్చు: చూ. పర్యా. కారు[1]. కాల్చిన ఇనపబద్దలను సాపుచేయడానికి వాడేదిమ్మ. (తె. 21).

రేస్‌కప్పులు: (ఇం.) చూ. పర్యా. కప్పులు. బహుమతు లివ్వడానికి చేసిన లోహపు సాధనాలు. (కో. 13).

రేసులు: (ఇం.) చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బుడిపెలు. (కో. 22).

రైజరు[1]: చూ. పర్యా. రన్నరు[2]. కరిగిన లోహాన్ని అచ్చుల్లోకి పోయడానికి వాడే గొట్టం. (రా. 11).

రైజరు[2]: ఉ. రైజర్. రూ. రేజర్. చూ. పర్యా. మంగలికత్తి. మంగలిషాపుల్లో క్షౌరానికి వాడే సాధనం. చూ. చిత్రం 185. (రా. 10, 12, 14, 15).

రైటాంగలు: (ఇం.) చూ. పర్యా. అడికోలు. ఇత్తడి పాత్రలపై, ఇనుప సామాన్లపై కొలతలను గీయడానికి ఉపయోగించే ఇనపబద్ద. (తె. 19, 21).

రైమర్: (ఇం.) కుట్టుమిషన్‌లో రంధ్రాలు పెద్దవిగా చేసే పరికరం. (రా. 6).

రైలుకట్నం: చూ. పర్యా. గంటె[2]. కొలిమిలో బొగ్గులు వేయడానికి వాడే పొడవుకాడ ఉన్న వెడల్పురేకు. (రా. 4).

రైలుకమ్మి: చూ. రైల్వేకమ్మి. (కో. 1, 3, 8, 9, 14, 17, 24, 27, 29; తె. 21; రా. 7, 11, 16).

రైలుకమ్మిదాగలి: చూ. పర్యా. దాగలి[1]. లోహపు కమ్మిని రేకుబిళ్ళల్ని సాగగొట్టడానికి వాడే రైలు కమ్ముల్లాగా (ప్లాటుగా) ఉండే ఇనపదిమ్మ.

(కో. 15, 29).

రైలుకూజ: చూ. పర్యా. గడచెంబు. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగపడే చెంబు. (కో. 1).

రైలుదిమ్మ: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపు చేయడానికి వాడే మోపు. (కో. 5, 23).

రైలుపట్టా: (< ఇం. Rail + పట్టా). ఉ. రైలుపట్ట. చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడేమోపు. (కో. 4; తె. 3, 5-12, 17, 18, 22, 23, 25).

రైలుపోలు: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంచిపెట్టడానికి వాడేదిమ్మ. (తె. 25).

రైలుపట్టాదాగలి: చూ. పర్యా. దాగలి[1]. లోహపు కమ్మిని రేకుబిళ్ళల్ని సాగగొట్టడానికి వాడే రైలు కమ్ముల్లాగా (ఫ్లాటుగా) ఉండే ఇనపదిమ్మ. (కో. 13, 16, 19).

రైలుపోలు: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (రా. 14).

రైలుఫ్లాటు: చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంచిపెట్టడానికి వాడే దిమ్మ. (రా. 7).

రైలుబద్దీ: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 26).

రైలుబద్దీదాగలి: చూ. పర్యా. దాగలి[1]. లోహపు కమ్మిని రేకుబిళ్ళన్ని సాగొట్టడానికి వాడే రైలు కమ్ముల్లాగా (ఫ్లాటుగా) ఉండే ఇనపదిమ్మ. (కో. 20).

రైలుసుత్తి: చూ. పర్యా. గుండుసుత్తి. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (కో. 21).

రైల్వేకమ్మి: రూ. రైలుకమ్మి. చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (రా. 12).

రైల్వేగాడిదాగలి: చూ. పర్యా. దాగలి[1]. లోహపు కమ్మిని బిళ్ళల్ని సాగొట్టడానికి వాడే రైలుకమ్ముల్లాగా (ఫ్లాటుగా) ఉండే ఇనపదిమ్మ. (కో. 21).

రైల్వేపార: మట్టి లేదా ఇసుకను ఎత్తిపోయడానికి (వాడే) రెండుచేతుల్తో పట్టుకోడానికి వీలుగా పొడవుపాటి పిడి అమర్చిన లోహపు పనిముట్టు. చూ. చిత్రం. 200. (రా. 5, 9, 11).

రైస్‌ప్లేటు: (ఇం.) చూ. పర్యా. కంచం. అన్నం తినడానికి వాడే వెడల్పుపళ్లెం. పిండి కలపడానికి వేడి వస్తువులు చల్లార్చడానికి కూడా ఉపయోగం. చూ. చిత్రం 214. (కో. 2; తె 3; రా. 7).

రైస్‌బౌల్: (ఇం.) చూ. పర్యా. కూరగాయగిన్నె: పాత్రలోంచి అన్నం విడిగాతీసి ఉంచుకోడానికి వాడే మూత ఉన్న పాత్ర. (కో. 17).

రైస్‌స్పూను: (ఇం.) అన్నం తినడానికి వాడే గెరిట. (కో. 6, 11).

రొట్టెడబ్బా: చూ. పర్యా. డబ్బా[1]. పిండిపదార్థాలు ఉంచుకోడానికి వాడే లోహపుపాత్ర. చూ. చిత్రం 121. (తె. 9, 13).

రొట్టెదెబ్బ: చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనం పైనుండి తీయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 5. (రా. 13).

రొట్టెపెట్టె: రొట్టెలు ఉంచుకోడానికి వాడే చిన్నస్టీల్ పెట్టె. (తె. 8).

రొట్టెపెంకు: రూ. రొట్టెలపెంక. చూ. పర్యా. రొట్టె పెనుం, రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 199. (తె. 11, 19).

రొట్టెపెనుం: ఉ. రొట్టెపెనం. రొట్టెపెనుము, రొట్టె పేనాం. పర్యా. రొట్టెపెంకు. రొట్టెలు చేసుకోడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 199. (తె. 10, 11, 20, 26; రా. 8, 10, 16).

రొట్టెలపెంక: చూ. రొట్టెపెంకు. (తె. 23, 25).

రోదా: ఉ. రోద. చూ. పర్యా. గిలక[2]. సంగడిదిండు తిరగడానికి వాడే చక్రం. (తె. 19-21, 22).

రోకలి: పాత్రల అడుగుభాగం తయారుచేయడానికి వాడేదిమ్మ. పోతపనిలో మన్ను దంచడానికి కూడా ఉపయోగం. (కో. 28; రా. 15).

రోకు: చూ. పర్యా. డాబు. ట్రంకుపెట్టె మూత బలం కోసం లోపలిభాగంలో కొట్టిన నిలువురేకు. (కో. 22, 28).

రోజన్: సాడర్ చేసేముందు కడెంను శుభ్రంచేయడానికి వాడే జిగురు. (తె. 17).

రోదను: రోదా. చూ. రోద ఉ. రోదన. మూసకట్టే మట్టిలోపోసే ద్రవపదార్థం. దీనివల్ల మట్టికి పాత్రకు జాయింటు ఊడుతుంది. (తె. 8 13).

రోలర్‌మిషన్ : (ఇం.) వెల్డింగ్‌గేట్లను పైకిఎత్తే పరికరం. (రా. 7).

రోలరు: (ఇం.) చూ. పర్యా. రోలు. ఇత్తడిరేకులను కుదించి గుంతగా తయారు చేయడానికి వాడే ఇనపదిమ్మె. కడ్డీలను సులువుగా కట్ చేయడానికి కూడా ఉపయోగం. (కో. 18; రా. 10).

రోలింగ్‌ఫ్యాక్టరీ: (ఇం.) పాత అల్యూమినియంను

కరిగించి గుండ్రని అల్యూమినియం రేకును తయారుచేసే కార్ఖానా. (రా. 8).

రోలు: పర్యా. నట్టు[1], రాయి[1], రింగు[3], రోలరు. పాత్రంకోసం తయారుచేసిన అడుగుబిళ్ళలను కుదించడానికి, మోపుగా వాడే పెద్ద రంధ్రమున్న 'L' ఆకారపు గుండ్రని దిమ్మె. రేకును వంపు ఎత్తడానికి కూడా ఉపయోగం. (కో. 4, 8-12, 22, 23, 28; తె. 1-15, 18, 24-26; రా. 3, 7, 9, 16).

రోసుఫ్లవర్: (< ఇం. Rose + flower) చూ. పర్యా. గులాబిగంటె. గులాబిపువ్వు లాంటి వంటకాలు చేయడానికి వాడే అచ్చు. 4, 6 చిన్న గొట్టాలను ఒక కాడకుఅతికి చేస్తారు. (రా. 4).

రోసువడి: పర్యా. రంపంపొట్టు. లోహపుపనిలో పాలిష్‌కు ఉపయోగపడే పొట్టుపదార్థం. (రా. 5).

రౌండ్‌హాండిల్‌డిష్: (ఇం.) చూ. పర్యా. కూరగాయగిన్నె. చేసిన వంటకాలను టేబిల్‌పై ఉంచుకోడానికి వాడే మూతఉన్న గుండ్రని పాత్ర. (తె. 10).

రౌండింగ్‌చేయు: (క్రి.) (< ఇం. Rounding + చేయు) బీరువాగోడలను అర్ధచంద్రాకారంగా వంచడం. (తె. 2).

రౌండుఆకురాయి: (< ఇం. Round + ఆకురాయి) రూ. రౌనుఆకురాయి. చూ. పర్యా. రౌండుపైలు లోహపురేకులపై వేసిన రంధ్రాలను సరిచేయడానికి వాడే గుండ్రని ఆకురాయి. (కో. 3, 6; రా. 3, 10).

రౌండుఇడ్లీప్లేట్: (< ఇం. Round + ఇడ్లీ + Plate) ఇడ్లీ ఉంచుకోడానికి వాడే గుండ్రనిపాత్ర. (కో. 6, 11).

రౌండుకంచం: (< ఇం. Round + కంచం) చూ. రౌనుకంచం. (కో. 3-6, 9-11).

రౌండుకరవాయి: విగ్రహంలో అన్నిభాగాలు తయారుచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 6).

రౌండుకారు: చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువులను తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి పనికివచ్చే పరికరం. చూ. చిత్రం 147. (కో. 24).

రౌండుకొరాం: చూ. పర్యా. డెక్కకొరాం. బిందెల అతుకులను మత్తెన్నివేయడానికి వాడే పనిముట్టు. దీనితల ఆవుకాలిగిట్ట ఆకారంలో ఉంటుంది. (తె. 17).

రౌండుకొయ్యసుత్తి: పాత్రబిళ్ళలు వేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 10; రా. 5).

రౌండుగడారి: చూ. రౌండుగెడ్డపార. (రా. 13).

రౌండుగరిట: చూ. పర్యా. కూరగరిటె. కూరలు వడ్డించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63. (కో. 6, 7, 11, 13, 15).

రౌండుగిన్నె: చూ. పర్యా. రౌనుకంచం. అన్నం తినడానికి ఉపయోగించే గుండ్రని పళ్ళెం. (కో. 1).

రౌండుగునపం: రూ. రౌనుగునపం. చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి వాడే పరికరం. (కో. 5).

రౌండుగ్లాసు: (ఇం.) అడుగుభాగం గుండ్రంగా ఉండే నీళ్ళలోటా. (తె. 14, 16).

రౌండుచిన్నపోగర: నెమలి, హంస, బాతులకు డిజైన్లు వేయడానికి వాడేమొల. (కో. 4, 9).

రౌండుచెంబు: రూ. రౌనుచెంబు. చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళు తాగడానికి, కాళ్ళు కడగడానికి వాడేబిందె ఆకారమున్న చిన్నలోహపు పాత్ర. నూనె నెయ్యిలాంటివి తెచ్చుకోడానికి కూడా ఉపయోగం చూ. చిత్రం 84. (కో. 15, 19; తె. 14, 16).

రౌండుజాడి: ఊరగాయ వేసుకోడానికి ఉపయోగపడే లోహపుపాత్ర. (కో. 7).

రౌండుటాంగ్: (ఇం.) చూ. పర్యా. రౌండుపట్టుకార. గుండ్రని కడ్డీలను పట్టుకోడానికి ఉపయోగించే సాధనం. (తె. 3).

రౌండుట్రే: (ఇం.) వక్కలు, ఆకులు ఉంచుకోడానికి వాడే గుండ్రని పాత్ర (కో. 4).

రౌండుతట్ట: చూ. పర్యా. రౌనుకంచం. గుండ్రని భోజనంప్లేటు. అడుగుభాగంలో నిలబడడానికి మూడుగుబ్బ లుంటాయి. (రా. 11).

రౌండుదిమ్మె: ఇనుపపట్టీలను బెండింగ్ చేయడానికి ఉపయోగించే గుండ్రని బోలుదిమ్మ. (తె. 24).

రౌండుపట్నపోగరి: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 18).

రౌండుపట్టుకార: పర్యా. రౌండుటాంగ్. కొలిమిపనిలో గొడ్డలిని పట్టుకోడానికి ఉపయోగించే పరికరం. (కో. 5, 6).

రౌండుపంచు: పర్యా. గుబ్బపంచు, రాయల్‌పంచు. లోహపురేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (రా. 3).

రౌండుపులేలు: రూ. రౌండుపుల్లెలు. చూ. పర్యా.

బాడర్‌పుల్లి. బీరువాగోడలు గుండ్రంగా వంచడానికి ఉపయోగించే పడగ ఆకారమున్న పరికరం. చూ. చిత్రం. (కో. 17, 19, 22–24, 26, 28; తె. 2, 3, 17, 22; రా. 10–12, 16).

రౌండుపుల్లెలు: ఉ. రౌండుపుల్లల్. చూ. రౌండుపులేలు (కో. 4, 8, 9, 11; తె. 8, 9, 12; రా. 4–8).

రౌండుపూలబుట్ట: చూ. పర్యా. గుండ్రం పూలబుట్ట. దేవాలయానికి పూజాసామగ్రి తీసుకెళ్ళడానికి వాడే పరికరం. (కో. 4).

రౌండుపైలు: చూ. రౌండుపైలు. (రా. 5, 6).

రౌండుప్లేటు: చూ. పర్యా. పరాతం. అన్నం ఆర బోసుకోడానికి వాడే వెడల్పు పళ్లెం. చూ. చిత్రం 150. (కో. 3, 19).

రౌండుఫైలు: రూ. రౌండుపైలు. పర్యా. రౌండు ఆకురాయి. లోహపురేకులపై వేసిన రంధ్రాలను శుభ్రంచేయడానికి వాడే గుండ్రని ఆకురాయి సాధనం. (కో. 17–19, 22, 24; తె. 2, 17, 20, 22, 24, 25; రా. 12).

రౌండుబింది: నీళ్ళు తెచ్చుకోడానికి వాడే గుండ్రని లోహపుబిందె. (కో. 17, 19).

రౌండుబాజిస్పూను: చూ. పర్యా. కూరగరిటె. కూరలు వడ్డించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63. (కో. 6).

రౌండుమరచెంబు: చూ. రౌనుమరచెంబు. (కో. 6).

రౌండుమెరిన్: చూ. పర్యా. గోలుసాంచ. ఇనుమును సాపుచేయడానికి కొలిమిపనిలో వాడే పనిముట్టు. (రా. 11).

రౌండురోలు: విగ్రహంపనిలో ఏదైనా వస్తువులను లావు చేయడానికి వాడే గుండ్రనిదిమ్మ. (కో. 6).

రౌండుసర్కిల్: గుండ్రంగా ఉండే అల్యూమినియం రేకు. (రా. 8).

రౌండుసుత్తి: (< ఇం. Round+సుత్తి). రూ. రౌనుసుత్తి. చూ. పర్యా. గుండుసుత్తి. రేకుజాయింట్లు ఊడిరాకుండా గట్టిగా కొట్టడానికి, కంచాలు, గిన్నెలు మొదలైనవి సాపుచేయడానికి వాడే గుండ్రని పరికరం. చూ. చిత్రం 86. (కో. 4, 7, 9, 13–16, 19–22; రా. 13).

రౌండు సోప్‌బాక్సు: గుండ్రని సబ్బుపెట్టె. (కో. 6).

రౌతు: పెద్ద ఇనపముక్కలను చక్కగ సాపుచేయడానికి వాడే పెద్దబండ. (తె. 7).

రౌను ఆకురాయి: చూ. రౌండు ఆకురాయి. (కో. 16).

రౌనుకంచం: (< ఇం. Round+కంచం). రూ. రౌండుకంచం. పర్యా. గుండుతల్లె, పూనాకంచం, పూనాతట్ట, పూనాప్లేటు, రౌండుగిన్నె, రౌండుతట్ట, రౌనుపళ్లెం. అన్నం తినడానికి వాడే గుండ్రని ప్లేటు. నిలబడడానికి దీని అడుగుభాగంలో మూడు గుబ్బలుంటాయి. (కో. 12, 13, 16, 20, 25).

రౌనుకాయ: లింగాయతులు మెడలో ధరించే గుండ్రని లింగంకాయ. (తె. 42).

రౌనుకుసి: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 20).

రౌనుగలాసు: (< ఇం. Round Glass). పర్యా. గుండుగిలాసు. గుండ్రనిలోటా. నీళ్ళు తాగడానికి ఉపయోగం. (తె. 7, 17, 19).

రౌనుగిన్ని: (< ఇం. Round+గిన్ని). గుండ్రంగా ఉండే చిన్న లోహపుపాత్ర. కూరలు, పచ్చళ్లు వేసుకోడానికి ఉపయోగం. (కో. 18).

రౌనుగునపం: చూ. గ్రాండుగునపం. (కో. 16).

రౌనుచెంబు: చూ. రౌండుచెంబు. (కో. 15).

రౌనుతామరాకు: ఉ. రౌన్తామరాకు. తామరాకు ఆకారంలో ఉన్న అంచులేని గుండ్రని భోజనంప్లేటు. (కో. 12, 13, 19, 29).

రౌనుదాగలి: (< ఇం. Round + దాగలి). ఉ. రౌన్దాగలి, రౌండాంగలి. పర్యా. గ్లోబుదాగలి, పన[1], రౌనుపట్టెడ. కంచాలు మొదలైనవాటిని రేకులు తిరగ్గొట్టుకోడానికి, తాట దళసరి సరిపెట్టుకోడానికి వాడే గుండ్రంగా, లింగాకారంగా, విడిగా ఉండే దిమ్మ. (కో. 13. 16, 20).

రౌనుదిమ్మ: చూ. పర్యా. గోలుసాంచ. ఇనుమును సాపుచేయడానికి కొలిమిపనిలో వాడే పనిముట్టు. (కో. 30).

రౌనుదుక్క: ఇత్తడిరేకును కుదించి గుంతలాగ చేయడానికి వాడే గుండ్రనిదిమ్మె. (కో. 21).

రౌనుపట్టెడ: ఉ. రౌనుపట్టెడి. చూ. పర్యా. రౌను దాగలి. కంచాలు మొదలైనవాటికి రేకులు తిరగ్గొట్టుకోడానికి వాడే గుండ్రంగా, లింగాకారంగా, విడిగా ఉండే దిమ్మ. (కో. 12, 20).

రౌనుపళ్లెం: చూ. పర్యా. రౌనుకంచం. అన్నం తినడానికి వాడే గుండ్రనిప్లేటు. దీని అడుగు భాగంలో నిలబడడానికి మూడు గుబ్బలుంటాయి. (కో. 12).

రౌనుపోగారు: చూ. పర్యా. కత్తెమొల. లోహపు

రేకులను కత్తిరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 28).

రౌనుబిందె: కాగు ఆకారంలో ఉండే స్టీలుబిందె. (కో. 21).

రౌనుమరచెంబు: రూ. రౌండు మరచెంబు. చూ. పర్యా. గుండు మరచెంబు. పైభాగం గుండ్రంగా ఉండే మరచెంబు. (కో. 10, 15).

రౌనులేగ: (< ఇం. Round + లేగ). చూ. పర్యా. చక్రలేగ. పాత్ర లోపలవైపు మెరుగుపెట్టడానికి వాడే పరికరం. (కో. 17, 28, 29).

రౌనుసాంచ: ఇనుమును సాపుచేయడానికి వాడే సాధనం. (తె. 1).

రౌనుసుత్తి: చూ. రౌండుసుత్తి. (కో. 7, 12, 16, 18–20, 25, 29).

## ల

లక్క: చూ. పర్యా. డాంబరు. బిందెను సంగడి మోపుకు అంటించడానికి వాడే జిగురు పదార్థం. (కో. 2–5, 8, 24, 25, 26, 28, 29; తె. 7, 8, 15–17, 20, 21,23).

లక్కట్టు: చూ. పర్యా. డాంబరు. బిందెను సంగడి మోపుకు అంటించడానికి వాడే జిగురు పదార్థం. (రా. 2).

లగన్: చూ. పర్యా. స్మాల్‌బేసను. అన్నం అరబోసుకోడానికి, పిండి కలుపుకోడానికి ఉపయోగపడే వెడల్పుమూతి ఉన్న లోతైన పాత్ర. (తె. 1, 3).

లంకశెగులపీట: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 6).

లంగరు: చూ. పర్యా. కట్ట. లోహపురేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 27).

లంగరుముక్క: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడాచికి వాడే మోపు. (కో. 29).

లడికోరాం: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగు భాగాలు కొట్టడానికి వాడే పరికం. చూ. చిత్రం 83. (తె. 17).

లడిగ: ఉ. లడిగె, లొడిగ. పర్యా. అగ్గి, గరగ[1], గరాటు, గల్ల[1], గౌరా, జవ్వ[4]. సీసాల్లో నూనెపోయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 201. (తె. 6, 24; రా. 4, 6, 7).

లపేటతిప్పు: (క్రి). చూ. దొర్లించు. లోహపురేకుపై స్కేలుతో కొలతలు తీయడం. (కో. 23).

లప్పకారు: వెడల్పు ఇనపవస్తువుల్ని తెగ్గొట్టడానికి కమ్మరంపనిలో వాడే పనిముట్టు. (తె. 18).

లప్పర్‌ఉలి: బీరువాను ఫినిషింగ్ చేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 16).

లప్పలు: ఇరుసును చేసేటప్పుడు ఉపయోగించే ఇనుప బద్దీలు. ఇరుసుకు వీటిని జాయింట్‌చేసి గుండ్రంగా చేస్తారు. (తె. 1).

లప్పం: చూ. పర్యా. చాక్‌పౌడరు. రివిట్లు, అతుకులు కనబడకుండ బీరువాపై పూయడానికి ఉపయోగపడే తెల్లని పదార్థం. (కో. 2; తె. 2, 3, 17; రా. 7, 8).

లబ్బరు: గొడుగు టోపనుకు గట్టిదనాన్నిచ్చే రబ్బరు ముక్క. (తె. 2).

లబ్బరుబూటు: (< ఇం. Rubber boot) చూ. పర్యా. వాషరు[2]. స్టౌటాంకిలోపలి గాలి పైకిరాకుండ స్ప్రింగును పట్టిఉంచడానికి వాడే సాధనం. (కో. 26).

లలితజాడి: చూ. పర్యా. టీపిడబ్బా. పిండిపదార్థాలు, పప్పులు వగైరా నిలువ ఉంచుకోడానికి వాడే పరికరం. చూ. చిత్రం. (కో. 17).

లస్కర్‌మట్‌సుత్తి: చూ. పర్యా. గుండుసుత్తి. లోహపురేకును కత్తిరించడానికి, రంధ్రాలువేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (తె. 1).

లస్కర్‌సుత్తె: చూ. పర్యా. గుండుసుత్తి. లోహపు రేకులను కత్తిరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (తె, 10, 11).

లస్సీపాట్: (< లస్సీ + ఇం. Pot) చూ. పర్యా. పాలడబ్బా[1]. నూనెను, పాలను తెచ్చుకోడానికి వాడే గుండ్రని లోహపుపాత్ర. పట్టుకోడానికి హాండిల్ ఉంటుంది. (తె. 4, 5, 19).

లస్సీబుడ్డీ: (హిం.) చూ. పర్యా. పాలడబ్బా[1]. పాలు, నూనెలాంటి ద్రవపదార్థాలను తెచ్చుకోడానికి వాడే గుండ్రని లోహపుపాత్ర. చేత్తో పట్టుకోడానికి హాండిల్ ఉంటుంది. (తె. 17).

లాక్: మూసినపుడు గొడుగుపుల్లల్ని పట్టిఉంచే రింగు. ఇది గొడుగుపిడికి బిగించి ఉంటుంది. (తె. 21).

లాక్‌కేస్: (ఇం.) చూ. పర్యా. కీసెట్టు. బీరువాకుండే లాకింగ్‌సెట్టు. (తె. 2).

లాక్‌సెట్టు: (ఇం.) రూ. లాకర్‌సెట్టు. లాకింగ్‌సెట్టు. చూ. పర్యా. కీసెట్టు. బీరువాకుండే లాకర్‌సెట్టు. (కో. 18).

లాకర్‌సెట్టు: (ఇం.) చూ. లాక్‌సెట్టు. (తె. 24).

లాకరు: (ఇం.) బీరువా లోభాగంలోని బీగం. (రా. 6, 8).

లాకరు కారేజి: (ఇం.) ఏవైన వస్తువులు తీసుకెళ్ళే టప్పుడు కిందపడకుండా మూత బిగించుకోడానికి ఏర్పాటు కలిగిన అల్యూమినియం పాత్ర. (కో. 28).

లాకింగ్‌మిషను: (ఇం.) అల్యూమినియం రేకులు జాయింట్‌చేయడానికి ఉపయోగించే పరికరం. (రా. 7).

లాకింగ్‌సెట్టు: (ఇం.) చూ. లాక్‌సెట్టు. (కో. 22).

లాగినకారు: చూ. పర్యా. కుక్కారు. బండికమ్మలను చక్రానికి ఎక్కించడానికి ఉపయోగించే సాధనం. (కో. 30).

లాగించు: (క్రి.) మలకట్ ఊడిరాకుండ రివిట్లు కొట్టడం. (కో. 16, 19).

లాగు[1]: (క్రి.) పర్యా. నాగు. బండిచక్రాలకు పట్టాలను ఎక్కించి లాగడం. (కో. 19).

లాగు[2]: (క్రి.) చూ. పర్యా. నప్పు[1]. ఉలితో లోహపు రేకును పాత్రలాగా మిషనుపై వంచడం. (కో. 22).

లాగు[3]: (క్రి.) కాల్చిన లోహపు ముక్కలను కావలసిన రీతిలో సాగగొట్టడం. (కో. 23).

లాగు[4]: (క్రి.) కొలిమిలో ఉండే చిట్టంను బయటికి తీసివేయడం. (కో. 27).

లాగొయ్యి: వాల్‌మాన్‌ను తిప్పడానికి వాడే స్టాండు. (తె. 4).

లాటిను: చూ. పర్యా. లాంతరు. వెలుతురుకోసం వాడే చిన్న లాంతరు. చూ. చిత్రం 202. (తె. 4).

లాటు: కొరాంను కదలకుండ పట్టి ఉంచడానికి ఉపయోగించే సాధనం. (తె. 21).

లాడకి: (బ.) లాడకీలు. చూ. పర్యా. పంపు[3]. డ్రమ్ముల్లోనుండి నూనెను పైకి తోడడానికి వాడే సాధనం. (తె. 1, 3, 5; రా. 13, 15).

లాడం: చూ. పర్యా. నాలు. ఎద్దుకాళ్ళ గిట్టలకు కొట్టే ఇనుపబిళ్ళ. (రా. 3).

లాడిల్: రూ. లాడీల్సు. చూ. పర్యా. కాడగంటె. నీళ్ళు పోయడానికి చలివేంద్రంలో ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 47. (కో. 23).

లాడీల్సు: చూ. లాడిల్. (కో. 13, 15).

లాంతర్‌గడ్డ: లాటిన్‌లో వత్తిని ఉంచడానికి వాడే దిమ్మ. (తె. 20).

లాంతరు: పర్యా. లాటిను. వెలుతురుకోసం వాడే కిరోసిను లాటీను. చూ. చిత్రం 202. (కో. 4, 6; రా. 3, 5, 8).

లాంధ్ర: కరెంటు లేనపుడు వెలుతురుకోసం ఉపయోగించే దీపం. (కో. 4, 9).

లాప్‌జాయింటు: (ఇం.) రెండు లోహపు రేకులను కలిపి ఒకటిగ చేసిన అతుకు. (కో. 19).

లాఫాల్: చూ. పర్యా. పట్టి[2]. బీరువాతలుపు రేకు వంగకుండ పొడవున లోభాగాన కొట్టి ఉండే పట్టి. (రా. 16).

లాంబి: పాత్రలు, డబ్బాలు మున్నగునవి కారకుండ పూయడానికి వాడే పదార్థం. (రా. 10).

లావట్టు: (క్రి.) వెల్డింగ్‌పనిలో డిజైన్‌పాటన్‌లో ఇనపబద్దను వంపెట్టి బయటికి తీసివేయడం. (తె. 17).

లావుకర్ర: బిందెపొట్టను లేపడానికి ఉపయోగించే కొనభాగం ఉబ్బుకలిగిన కర్ర. (రా. 5).

లావుచేయు: (క్రి.) చూ. పర్యా. అనుచు. రేకును గుండ్రంగా అతికించి బిందె మధ్యభాగాన్ని బొర్రలాగ చేయడం. (తె. 2, 3).

లావుపోగరు: చూ. పర్యా. కత్తెమొన. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 3; రా. 8).

లావుబిందె: మూతి అంచు దట్టంగా ఉండే బిందె. (కో. 19).

లావుసుత్తి: చూ. పర్యా. గుండుసుత్తి. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 86. (రా. 5, 8).

లికోబొగ్గు: చూ. పర్యా. చార్‌కోలు. కొలిమిలో లోహపు వస్తువులు వేడిచేయడానికి వాడే పదార్థం. (రా. 15).

లిక్క: చూ. పర్యా. కక్కుకొడవలి. పొలాల్లో గడ్డి కోయడానికి ఉపయోగించే కొడవలి. (రా. 4).

లిక్విడ్ అల్యూమినియం: (ఇం.) కరిగించిన అల్యూమినియం. (రా. 7).

లిఖిని: పర్యా. నిఖిలి. రేకులపై గీతలు వేయడానికి వాడే పరికరం. (కో. 22, 28).

లింగం: (బ.) లింగాలు. చూ. పర్యా. లింగంకాయ. లింగాయతులు మెడలో ధరించడాని వాడే లింగాకారముండే లోహపు పరికరం. (రా. 12).

లింగంకాయి: పర్యా. కల్డింగ్, లింగం. లింగాయతులు మెడలో ధరించడానికి వాడే లింగాకారముండే లోహపు పరికరం. (రా. 13, 13).

లివర్‌బెండింగ్ హ్యాండిల్: (ఇం.) చూ. పర్యా. లివరు. వెల్డింగ్‌పనిలో ఇనపపట్టీలను డిజైన్లుగ వంపుచేయడానికి వాడే 'F' ఆకారపు కడ్డీ. (రా. 5).

లివర్ మెరిన్: (ఇం.) చూ. పర్యా. లివరు. వెల్డింగ్ పనిలో ఇనపట్టీలను డిజైన్లుగ వంపుచేయడానికి వాడే 'F' ఆకారపు కడ్డి. (రా. 15).

లివరు[1]: ఉ. లివర్, లీవరు. పర్యా. డబ్బ, బావు[2]. బెండింగ్‌కడ్డీ, బెండింగ్‌పోగరు, బెండింగ్‌లివరు, బొద్దుకడ్డి, లివర్ బెండింగ్‌హ్యాండిల్, లివర్‌మెరిన్, లెంత్. వెల్డింగ్‌పనిలో ఇనపపట్టీలను డిజైన్లుగ వంపుచేయడానికి వాడే 'F' ఆకారపు కడ్డి. (కో. 16, 18, 23, 25, 28, 30; తె. 21, 23; రా. 2, 5, 8, 12, 13, 15, 16).

లివరు[2]: చూ. పర్యా. టైర్ లివర్సు. సైకిల్‌టైర్లు ఊడదీయడానికి వాడే కడ్డిలాంటి పరికరం. (కో. 1, 7, 13-15).

లివరు[3]: కొలిమిపనికి వాడే పరికరం. (కో. 3).

లివరు[4]: (బ.) లివర్లు. తాళంచెవి సులువుగా తిరగడానికి తాళంకప్పలోపల అమర్చిన పట్టీ. (కో. 23, 26; తె. 17).

లివరు[5]: పెట్రొమాక్స్‌లైటుకు క్రిందిభాగంలో ఉండే పరికరం. (కో. 2).

లివరు[6]: బీరువా లాకర్‌ప్లేటు. (తె. 3).

లివరుమోపు: కడ్డీలను వంపుపెట్టడానికి ఉపయోగించే సాధనం. (కో. 16).

లివరుహాండు: (ఇం.) హాండిల్‌ను అమర్చడానికి బీరువాకు రంధ్రంవేసే పనిముట్టు. (కో. 19).

లీకు: డబ్బానుండి ద్రవం కారకుండా సాల్డర్ చేయడానికి ఉపయోగపడే పరికరం. (రా. 7).

లెక్కతీసుకొను: (క్రి.) పర్యా. లెంత్‌ఏయు. తయారు చేయవలసి వస్తువుసైజునుబట్టి రేకులపై కొలతలు గుర్తించడం. (తె. 4).

లెగ్‌లు: బీరువాకింద మోపకుండా అడుగుభాగంలో అమర్చిన కాళ్ళు. (కో. 28),

లెగ్‌వైస్: (ఇం.) పెద్దపెద్ద కమ్ములు వంచుకోడానికి వాడే పనిముట్టు. (కో. 7).

లెగ్‌సీక్రెట్: (ఇం.) చూ. పర్యా. బాటమ్‌సొరుగు. బీరువాఅడుగు కాళ్ళకు ముందుఉండే అర. ఇది బీరువాకాళ్ళరేకుతో కలిసిపోయి వుంటుంది. (తె.20).

లెటర్: (ఇం.) ఉ. లెటర్. పర్యా. జంబు, దుంబు, పట్టీ, పాకెట్, లెటర్ బ్యాకెట్ కాగితాలు వగైరా చిన్న చిన్న వస్తువులను ఉంచడానికి ట్రంకుపెట్టె మూతకు అమర్చిన అర. (కో. 10, 18, 23, 28; (రా. 4, 8, 10).

లెటర్‌బ్యాకెట్: (ఇం.) చూ. పర్యా. జివ్వ. కాగితాలు వగైరా చిన్న చిన్న వస్తువులను ఉంచడానికి ట్రంకు పెట్టెమూతకు అమర్చిన అర. (కో. 2).

లెంత్: చూ. పర్యా. లివరు. వెల్డింగ్ పనిలో ఇనప పట్టీలను డిజైన్లుగా వంపు చేయడానికి వాడే 'F' ఆకారపు కడ్డీ. (తె.2).

లెంత్‌ఏయు: (క్రి.) (< ఇం. Length + ఏయు) చూ. పర్యా. లెక్కతీసుకొను. తయారుచేయవలసిన వస్తువు సైజును బట్టి రేకుపై కొలత గీయడం. (తె. 21).

లెఫెక్టరు: (< ఇం. Reflectro.) చూ. పర్యా. కటోరి[1] వెలుతురు బాగారావడానికి టార్చిలైట్ బల్బుచుట్టూ ఉండే తెల్లనిరేకు. (తె. 19, 22, 25).

లెమన్‌ప్రెజర్: (ఇం.) చూ. పర్యా. నిమ్మకాయ చెక్క. నిమ్మకాయలరసం తీయడానికి వాడే సాధనం. (కో. 22).

లెమన్‌ప్రెసింగ్: (ఇం.) చూ. పర్యా. నిమ్మకాయ చెక్క. నిమ్మకాయరసం పిండుకోడానికి వాడే సాధనం. (రా. 4).

లెమన్‌స్క్వెజర్: (ఇం.) చూ. పర్యా. నిమ్మకాయ చెక్క. నిమ్మకాయలరసం తీయడానికి వాడే సాధనం. (తె. 17).

లెవల్[1]: (ఇం.) లోహపు అచ్చుకు, మట్టి అచ్చుకు మధ్య వాడే తీగలాగా ఉండే రేకు. (రా. 2).

లెవల్[2]: (ఇం.) చూ. పర్యా. రసమట్టం. పాత్రసరిగా ఉందో లేదో అని చూడడానికి వాడే కడ్డీలాంటి పరికరం. ఇందులో నీటిచుక్క లేదా రసంఉండి లెవల్ ప్రకారం అటూ ఇటూ తిరుగుతుంటుంది. (తె. 12).

లెవల్‌కట్టు: (< ఇం. Level + కట్టు) చూ. పర్యా. లెవల్‌పట్టి. ఇనుపబద్దలపై పొడవుగా గీసుకోవడానికి వాడే పొడవైన సన్నని బద్ది. (కో. 22).

లెవల్‌డాకిలీ: చూ. పర్యా. చట్రం[1]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (రా. 4).

లెవల్‌పట్టి: పర్యా. పెద్ద సీదపట్టి, లెవల్‌కట్టు. బీరువా రేకులకు గీతలు వేయడానికి ఉపయోగపడే రంపం లాంటి పరికరం. (రా. 7).

లెవల్‌బద్ది: ఉ. లెవిల్‌బద్ది. చూ. పర్యా. దార్లబద్ది. బీరువా అంచులు వంపులులేకుండ సరిచేయడానికి వాడే పనిముట్టు. (తె. 19, 22).

లెవల్‌మిరియం: పర్యా. లోపలిమెరియం. బీరువా రేకుల హెచ్చుతగ్గులు సరిచేయడానికి వాడే పరికరం.

(రా. 7).

లెవెలింగ్‌ప్లేటు: (ఇం.) చూ. పర్యా. టెంప్లేటు. ముందుగ డిజైను గీయడానికి వెల్డింగ్‌పనిలో వాడే పెద్ద లోహపు రేకు. (తె. 25).

లెహి: (ఒరియా). చూ. పర్యా. చట్రం[1]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి ఉపయోగపడే మోపు. (కో. 30).

లేకక్రమ్మి: చూ. లేగకమ్మి. (కో. 21).

లేగకమ్మి: రూ. లేకక్రమ్మి. చూ. పర్యా. లేగ. తరిణి పట్టి తయారైన శాల్తీని సాపుగా పట్టడానికి వాడే పరికరం. (కో. 14, 16, 19–21, 24).

లేగబోనె: చూ. పర్యా. ఎలకలబోను. ఎలకలు పట్టుకోడానికి ఇనపకమ్ములతో తయారుచేసిన సాధనం. (కో. 14, 15).

లేగలి: చూ. పర్యా. లేగ. పూర్తయిన లోహపు పాత్రలను, విగ్రహాలను మెరుగుపరచడానికి వాడే మేకులాంటి పరికరం. (రా. 1, 5, 9; 16).

లేతిటంకం: చూ. పర్యా. చూర. లోహపు పాత్రలను అతకడానికి వాడే పదార్థం. (కో. 28).

లేతు: (ఇం.) వెల్డింగ్‌పనిలో పిన్ను పట్టుకోడానికి ఉపయోగపడే పరికరం. (కో. 7).

లేతుమిషను: (ఇం.) బీరువా రేకులను కత్తిరించడానికి ఉపయోగించే పరికరం. (తె. 8, 9).

లేపు[1]: (క్రి.) రేకుభాగాల్ని కలిపి బీరువా ఆకారంగా నిలబెట్టడం. (కో. 18).

లేపు[2]: (క్రి.) బిందెపొట్టను కర్రతో లావుచేయడం. (రా. 5).

లేబుల్: (ఇం.) చూ. పర్యా. కవరు[2]. గొడుగులోపలికి నీళ్ళుపడకుండా పైభాగాన అమర్చిన చిన్న మైనం లేదా ప్లాస్టిక్ గుడ్డ. (తె. 21).

లేబుల్‌మిషన్: (ఇం.) డబ్బా కంపెనీపేరు వేసే మిషన్. (రా. 7).

లేవిడిబద్దీ: చూ. పర్యా. దార్లబద్దీ. బీరువా అంచులు వంపులులేకుండ సరిచేయడానికి వాడే పనిముట్టు. (రా. 10).

లేగ: పర్యా. కంటపు సలాకు, కంటానీ, కిర్ లేకక్రమ్మి, కీతకడ్డి, మడికమ్మి, మెరుకక్రడ్డీ, మెరుగుకంటానీ, మెరుగుసలాకు, లేగకమ్మి, లేగలి. తరిణిపట్టేటప్పుడు లోహపు వస్తువుకు షైనింగ్‌తో హెచ్చుతగ్గులు లేకుండా సరిచేయడానికి వాడే పనిముట్టు. పూర్తయిన లోహపు పాత్రలను, విగ్రహాలను మెరుగుపరచడానికి కూడా ఉపయోగం. (కో. 5, 7, 10, 12, 16–22, 24, 29).

లైట్‌గడ్డ: చూ. పర్యా. గడ్డ. టార్చిలైట్‌లో బల్బును ఉంచడానికి అమర్చిన దిమ్మ. (తె. 1).

లైట్‌గేజిసీట్: (ఇం.) రీరోలింగ్ మిల్లులో పలుచ్చ రేకులు సాగదీయడంకోసం ఉపయోగపడే రేకు. (రా. 7).

లైటుటోపను: (ఇం.) చూ. పర్యా. టోపు[1]. పెట్రోమాక్స్ లైటు మెంటల్‌ను వెలిగించడానికి మెంటల్ పైభాగాన అమర్చిన పరికరం. (తె. 19).

లైనా: చూ. పర్యా. బొద్దు[1]. ఇనుపవస్తువులకు బొద్దు కొట్టడానికి వాడే కమ్మిలాంటి పనిముట్టు. (తె. 10, 11).

లైను[1]: రేకుపనిలో రేకులు వంచడానికి ఉపయోగించే మోపు. (కో. 22, 26, 28).

లైను[2]: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి ఉపయోగపడే మోపు. (తె. 3).

లైలాన్‌సుత్తి: (< ఇం. Nylon+సుత్తి). బెండింగ్ రేకులను సాపుచేసే పరికరం. (కో. 23).

లోట్టిచేయు[1]: (క్రి.) బాగా తెగడానికి వీలుగా కత్తెర మధ్యభాగాన్ని గాడిమాదిరి కొంతలోతు చేయడం. (తె. 17).

లోట్టిచేయు[2]: (క్రి) చూ. పర్యా. ఉబ్బెత్తుతీయు. చెకనంపనిలో ఇత్తడిరేకుపై మొలలతో బొడిపెలు కొట్టడం. రేకును తిరగేసినపుడు గుంతలుమాదిరి కనిపిస్తాయి. (తె. 25).

లొత్త: బిందెలకు పడిన నొక్కు. (కో. 30).

లొందకొట్టు: (క్రి.) గుండ్రని రేకును పళ్లెంలాగ తయారుచేయడం. లొందకొట్టిన రేకును పాలకాన్ల, బకెట్ల అడుగులకు వేస్తారు. (తె. 17).

లోటు: ఉ. లోటా. రూ. లోతా. చూ. పర్యా. గ్లాసు[1]. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215. (కో. 2, 4–7, 12, 13, 19, 21, 25, 29; తె. 11, 12, 14–21, 24–28; రా. 2, 11).

లోటాచెంబు: చూ. పర్యా. పంచపాత్ర. అంచుగాని మట్టుగాని లేనట్టి లోహపుపాత్ర. దేవాలయాల్లో తీర్థానికి వాడ్తారు. (కో. 20, 21, 24).

లోతా: చూ. లోట. (రా. 15).

లోదు: (క్రి) కొలిమిలో గుంత త్రవ్వడం. (రా. 8).

లోతుగరిటె: చూ. పర్యా. కూరగరిటె. కూరలు వడ్డించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63. (కో. 4, 9, 23).

లోతుగిన్నె: చూ. పర్యా. కూరగిన్నె. వంటకువాడే లోతైన చిన్నపాత్ర. చూ. చిత్రం 64. (కో. 6, 8, 11, 24, 28, 29; తె. 24).

లోతుచేయు: చూ. పర్యా. డొల్లచేయు. బిందె రేకులను ఒక ఆకారంగా చేసుకోవడం. (కో. 2).

లోతుడబరా: వెడల్పుమూతి, లోతు ఉన్న లోహపు పాత్ర. అన్నం ఆరబోసుకోడానికి ఉపయోగం. (కో. 10).

లోతుతీయు: (క్రి.) బిందెరేకును లోతుగా వంచుకోవడం. (తె. 15).

లోతుదాక: ఉ. లోద్దాక. నిలువుగా లోతెక్కువగా ఉండి పొట్టలేని లోహపుపాత్ర. నీళ్ళు కాచడానికి ఉపయోగం. చూ. చిత్రం 203. (కో. 26, 28).

లోపగిదరిలేగ: చూ. పర్యా. నగుఉలి. లోహపు పాత్రల లోభాగాన పాలిష్‌పనిలో మెరుగుపట్టడానికి వాడే పరికరం. (కో. 15).

లోపట: రూ. లోపడ. లోహపు పాత్రల లోపలిభాగం. (తె. 2).

లోపట్టుకమ్మి: చూ. పర్యా. నగుఉలి. లోహపుపాత్రల లోభాగాన మెరుగుపెట్టడానికి వాడే పరికరం. (రా. 15).

లోపడ: చూ. లోపట. (తె. 1).

లోపలమెరియం: రూ. లోపలిమెరిం, లోమెరిం. చూ. పర్యా. లెవల్ మిరియం. బీరువా రేకుల హెచ్చు తగ్గులు సరిచేయడానికి వాడే పరికరం. (రా. 4).

లోపలిడై: (< లోపలి + ఇం. Die) ట్రంకుపెట్టె లోభాగాన గుబ్బవచ్చేదానికి ఉపయోగించే పరికరం. (రా. 7).

లోపలిమెరిం: చూ. లోపలిమెరియం. (రా. 12).

లోపలిలేగ: చూ. పర్యా. నగుఉలి. లోహపు పాత్ర లోభాగాన చదరంచేయడానికి వాడే పరికరం. (కో. 28).

లోపుగిన్నె: చూ. పర్యా. బిరడాగిన్నె. టార్చిలైటు వెలగడానికి ఉపయోగించే వెనుక టోపనులో ఉన్న రేకు. (తె. 18).

లోభాగంపట్టి: చూ. పర్యా. నగుఉలి. లోహపుపాత్రల లోభాగాన పాలిష్ చేయడానికి వాడే పరికరం. (కో. 4).

లోమెరిం: చూ. లోపల మెరిం. (రా. 11).

లోయర్‌పార్ట్: (ఇం.) పెట్రొమాక్స్‌లైటు వొత్తికి టాంకినుండి నూనెను అందించే గొట్టం. (తె. 21).

లోవి: రూ. లోవు. బుంగవాటం, మూడుఉండే లోహపు పాత్ర. అన్నం వండుకోడానికి, నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 204. (కో. 11, 21).

లోవు: చూ. లోవి. (తె. 21-23, 26).

లోవులకరవాయి: బిందెను సాపుచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 27).

లోహం: పంచలోహపు విగ్రహం. (రా. 5).

లోహంచెంబు: నీళ్ళు తాగడానికి వాడే గుండుచెంబు. (తె. 20).

## వ

వక్కడబ్బా: చూ. పర్యా. పాన్‌దాను. తాంబూల సామగ్రి పెట్టుకోడానికి ఉపయోగపడే లోహపు పెట్టె. (తె. 25).

వక్కపొడిడబ్బా: వక్కపొడి ఉంచుకోడానికి వాడే డబ్బా. (కో. 1, 4, 12, 15).

వక్కరోలు: చూ. పర్యా. వక్కాకురోలు. వక్కాకు దంచుకోడానికి ఉపయోగపడే లోహపు పరికరం. చూ. చిత్రం 205. (రా. 4).

వక్కాకుతట్ట: చూ. పర్యా. తాంబూలం తట్ట. ఆకులు ఒక అరలోను, వోకలు ఒక అరలోను, చెక్కలు మరొక అరలోను పెట్టుకోడానికి వీలుగా గుండ్రం లేదా చౌకం లేదా ముక్కోణం ఆకారాల్లో ఉండే అరల స్టీలుపళ్ళెం. చూ. చిత్రం 127. (రా. 7, 8).

వక్కాకుప్లేటు: చూ. పర్యా. తాంబూలం తట్ట. తాంబూలం పెట్టుకోడానికి వాడే స్టీల్ ప్లేటు. గుండ్రంగాను, పొడుగ్గాను ఉంటాయి. చూ. చిత్రం 127. (కో. 1).

వక్కాకురోలు: పర్యా. వక్కరోలు. వక్క ఆకు దంచుకోడానికి ఉపయోగపడే లోహపు పరికరం. చూ. చిత్రం 205. (రా. 3, 5).

వగ్గాల్: చూ. పర్యా. కాడగంటె. చలివేంద్రంలో నీళ్ళుపోయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 47. (తె. 4).

వంకకారు: రూ. వంకారు. పర్యా. వంకపట్టకార, వంపుకారు, వంపు పట్టకార. కొలిమిపనిలో గుండ్రని ఇనపవస్తువులు పట్టుకోడానికి వాడే వంపుపనిముట్టు. (కో. 23; తె. 19).

వంకటింకం: చూ. పర్యా. మూతిచెక్క. చెంబుల మూతిభాగం సాపుచేయడానికి వాడే సాధనం. (తె. 22).

వంకపట్టకారు: ఉ. వంకిపట్టకార, వంకుపట్టకారు. చూ. పర్యా. వంకకారు. గుండ్రని లోహపు

వస్తువులకు పట్టుకోడానికి వాడే వంపుపనిముట్టు. (కో. 7, 9; రా. 2, 7, 8, 12).

వంకలేగ: ఉ. వంకలాగ. చూ. పర్యా. అమరువాలేగ. పాలిష్‌పాత్రలపై డిజైన్‌లు వేయడానికి వాడే పరికరం. (తె. 4, 15, 17, 20).

వంకపట్ట: చూ. పర్యా. మూతిచెక్క. కొలకుండ డొక్కను తయారుచేయడానికి వాడే సాధనం. (తె. 24).

వంకరపళ్ళెం: అన్నం ఆరబోసుకోడానికి వాడే కంచం. (తె. 8, 9).

వంకబెండు: చూ. పర్యా. పిడి[1]. గొడుగును పట్టుకోడానికి వాడే 'L' ఆకారపు హాండిలు. (తె. 2).

వంకమూతికారు: గొడుగుల రిపేరులో మేకులు లాగడానికి వాడేపనిముట్టు. చూ. చిత్రం. (కో. 28).

వంకమెరుగుకడ్డీ: చూ. పర్యా. అమరువాలేగ. పాలిష్‌పాత్రలపై డిజైన్‌లు వేయడానికి వాడే పరికరం. (తె. 25).

వంకరసుత్తి: చూ. వంకసుత్తె. (తె. 8, 9).

వంకసాపుపోగర: చూ. పర్యా. పెద్దవంపు పోగరు. విగ్రహం ఇరుకుభాగాల్లో చెక్కడానికి వాడే పరికరం. (తె. 25).

వంకసుత్తె: ఉ. వంకసుత్తి. రూ. వంకరసుత్తి. బిందె మెడభాగంలో సాపుచేయడానికి వాడేపనిముట్టు. చివరిభాగం కొడిలాగ వంపుతిరిగి ఉంటుంది. (కో. 14, 17, 18, 20-22, 24, 26, 28, 29; తె. 4, 25).

వంకారు: చూ. వంకకారు. (కో. 4, 5, 11, 13-22; తె. 13. 21, 22).

వంకాగ్లాసు: చూ. పర్యా. వంకాయగ్లాసు. వంకాయ ఆకారంలోవున్న లోటా. నీళ్ళు తాగడానికి వాడ్తారు. (కో. 3, 5).

వంకాయగ్లాసు: పర్యా. వంకాగ్లాసు. వంకాయ ఆకారంలో ఉన్న లోటా. నీళ్ళు తాగడానికి వాడ్తారు. (కో. 12, 13, 15).

వంకిగ్లాసు: డిజైన్లు ఉండే స్టీలుగ్లాసు. నీళ్ల తాగడానికి ఉపయోగం. (కో. 25).

వంకినబళ: చూ. పర్యా. ఒంపుకంటానీ. చెంబు గొంతుభాగంలో మెరుగేయడానికి వాడే పరికరం. (రా. 13).

వంకిరేకుస్టాండు: (< వంకిరేకు + ఇం. Stand) పళ్లాలు, గ్లాసులు ఉంచడానికివాడే పరికరం. (తె.21).

వంగచెక్క: చూ. పర్యా. మూతిచెక్క. బిందె పాల తపాలాలు, దేక్సాలు మూతులు తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 14).

వంగసుత్తి: చూ. వంకసుత్తె. (కో. 14).

వంగొట్టు: (క్రి.) చూ. పర్యా. బెండ్‌చేయు. లోహపు రేకులను, పట్టీలను సైజుప్రకారం వంచడం. (కో. 16; రా. 16).

వజ్రకిరీటం: దేవతావిగ్రహం తలపైన పెట్టడానికి వాడే గుమ్మడిపండులాంటి సాధనం. (కో. 2).

వంచలు వేయు: (క్రి.) చూ. పర్యా. ఒంపు. రేకును గిన్నెలాగ లోతుగ చేయడం. (కో. 16).

వంచివేయు: (క్రి.) చూ. పర్యా. బెండ్‌చేయు. కొలత ప్రకారం లోహపు రేకులను, పట్టీలను వంపు పెట్టడం. (రా. 4).

వంచు: (క్రి.) చూ. పర్యా. బెండ్‌చేయు. కొలత ప్రకారం లోహపు రేకులను, పట్టీలను వంపు పెట్టడం. (రా. 6, 12, 15).

వంచుకొను: చూ. పర్యా. బెండ్‌చేయు. కొలత ప్రకారం లోహపు రేకులను, పట్టీలను వంపు పెట్టడం. (రా. 1, 5).

వంచుడుచేయు: (క్రి.) చూ. పర్యా. బెండ్‌చేయు. కొలతప్రకారం లోహపు రేకులను, పట్టీలను వంపు పెట్టడం. (తె. 6).

వంచురాడ్డు: (< వంచు + ఇం. Rod). చూ. పర్యా. కడ్డీ[8]. లోహపు వస్తువుల వంపులను సరిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 8).

వంచెస్తలం: చూ. పర్యా. కవచం. దేవుని విగ్రహానికి ముఖం తప్పించి మిగతా శరీరభాగమంతటికీ వేసిన లోహపువస్త్రం. (కో. 12).

వంచెకమ్మి: కొనలు పక్కవంపుతిరిగి ఉండేసుత్తె. ఇనుప ప్లాట్‌లను బెండ్ చేసుకోడానికి ఉపయోగం. (తె. 13).

వట్టడాకలి: చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపు పాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి వాడే పరికరం. చూ. చిత్రం 83. (రా. 11).

వట్టుచేయు: (క్రి.) చక్రం చేయడానికి గుండ్రంగా గీయడం. (కో. 28).

వడగంప: చూ. పర్యా. అన్నంబుట్ట. బియ్యం వగైరా వడబోసుకోడానికి వాడే అడుగుభాగంలో రంధ్రాలున్న లోహపుపాత్ర. చూ. చిత్రం 11. (రా. 12).

వడగిన్నె: చూ. పర్యా. అన్నంబుట్ట. బియ్యం వగైరా వడబోసుకోడానికి వాడే రంధ్రాలు కలిగినపాత్ర.

చూ. చిత్రం 11. (రా. 7, 14, 15).

వడపోత: చూ. పర్యా. తుడుపేగి చెన్ని. కాఫీ, టీ వడగట్టడానికి వాడే పరికరం. (తె. 10, 11).

వడపోతగంటె: చూ. పర్యా. తుడుపేగిచెన్ని. కాఫీ, టీ వడగట్టడానికి వాడే పరికరం. (తె. 19).

వడబుట్ట: చూ. పర్యా. అన్నంబుట్ట. బియ్యం వగైరా వడబోసుకోవడానికి వాడే అడుగుభాగంలో రంధ్రాలున్న లోహపుపాత్ర. చూ. చిత్రం 11. (కో. 2, 8; తె. 19).

వడరౌతు: కంచులోహాన్ని సాగ్గొట్టడానికి ఉపయోగించే ఎత్తుగా ఏటవాలుగా, వెడల్పుగా ఉన్నబండ. (తె. 17).

వడలకమ్మి: చూ. పర్యా. గారెలకమ్మి. నూనెలోంచి గారెలు తీయడానికి వాడే సన్నని ఇనపచువ్వ. చూ. చిత్రం 77. (కో. 1).

వడలగంటె: చూ. పర్యా. రంధ్రాల గరిటె. నూనె పెనంలో నుండి గారెలు ఎత్తుకోడానికి వాడే రంధ్రాలున్న గరిటె. చూ. చిత్రం 107. (కో. 11).

వడితట్ట: చూ. పర్యా. అన్నంబుట్ట. బియ్యం వగైరా వడబోసుకోడానికి వాడే అడుగుభాగంలో రంధ్రాలున్న లోహపుపాత్ర. చూ. చిత్రం 11. (రా. 8, 13).

వడితిప్పు: (క్రి.) చూ. పర్యా. మలుపు. గొడుగు పుల్లలను ఇనపవైరుతో బిగించి మెలితిప్పడం. (తె. 18).

వడితిరుగు: (క్రి.) అడ్డకు అంటించినపుడు పాత్ర సొట్టలుగ తిరగడం. (కో .20).

వడ్డించు: (క్రి.) పర్యా. పిచ్చిగేయు. వలయుచేయు. రేకులు జాయింట్ చేసిన తర్వాత వెడల్పుగ, ఆకారం వచ్చేటట్లుగ కొట్టడం. (రా. 14).

వడ్నంతిప్పు: (క్రి.) కంచులోహాన్ని త్వరగా సాగగొట్టడానికి వీలుగా కొట్టేటప్పుడు గుండ్రంగా తిప్పుతూ ఉండడం. (తె. 17).

వంటగిన్నె: చూ. పర్యా. నిలువు అకుగు. నీళ్ళు తాగడానికి, వంటలు ఉంచుకోడానికి పనికివచ్చే నిలువుపాత్ర. (కో. 4, 7, 8, 24–29, తె. 12, 13, 18).

వంటగిన్నెలకరవాయి: చూ. పర్యా. దబరాగిన్నెల కరవాయి. కూరగిన్నెలు తయారుచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 10, 12).

వంటచేయు: (క్రి.) సొనరాయిని చేయడానికి రాయిని, ఇక్కను కలిపి ఉడికించడం. (తె. 23).

వంటతపాలు: ఉ. వంటతపేల. చూ. పర్యా. తిరుగిన్నె. వంటచేయడానికి వాడే పాత్ర. (కో. 12, 13, 15).

వంటలు: చూ. పర్యా. పిడకలు. కొలిమిలో ఇనప వస్తువులు వేడిచేయడానికి వాడే నుగ్గులు. (తె. 20).

వత్తులస్టౌ: (< వత్తుల + ఇం. Stove) ఉ. వత్తీస్టౌ, వొత్తుల స్టౌ. పర్యా. బత్తీస్టౌ. వత్తులద్వారా మంటరావడానికి ఉపయోగపడే స్టౌ. (కో. 4; తె. 4, 17).

వన్‌సాగరం: చూ. పర్యా. నవాచారం. కళాయిపనికి వాడే తెల్లని పొడి (పదార్థం). (రా. 13).

వన్‌స్టెప్‌గ్లాసు: (ఇం.) పర్యా. స్టెప్‌టమ్లరు, స్టెప్ గ్లాసు. మధ్యభాగంలో కుంటుఉన్న స్టీల్‌గ్లాసు. నీళ్ళు తాగడానికి ఉపయోగం. చూ. చిత్రం 222. (తె. 8, 9, 13).

వంపనంమొద్దు: సాగ్గొట్టిన కంచులోహాన్ని కంచం లేదా తల్లెచేయడానికి ఉపయోగించే కొయ్యమొద్దు. దీని మధ్యభాగంలో 'తల్లె' ఆకారం వంపుగలిగిన లావు కొయ్యపలకను నేలకు సమతలంగా పూడ్చి ఉంచుతారు. (తె. 17).

వంపినపట్కారు: చూ. వంపు పట్కారు. (రా. 14).

వంపు: చూ. పర్యా. బొద్దు[1]. ఇనుపవస్తువులకు బొద్దు కొట్టడానికి వాడే కమ్మిలాంటి పనిముట్టు. (తె. 10).

వంపుకడ్డి: సైకిల్ లాక్‌వేసే పరికరం. (రా. 8).

వంపుకమ్మి[1]: చూ. పర్యా. అదురువాలేగ. పాలిష్ పాత్రలపై డిజైనులు వేయడానికి వాడే పరికరం. (కో. 14).

వంపుకమ్మి[2]: చూ. పర్యా. మూతిచెక్కు. బిందె మూతి భాగం చేయడానికి వాడే సాధనం. (కో. 29).

వంపుకరవాయి: చూ. పర్యా. జవ్వలకరవాయి. బిందె జవ్వభాగం సాపుచేయడానికి వాడే అడుగుభాగం వెడల్పుగా గుండ్రంగాఉండే పరికరం. (కో. 3,30; తె. 8, 9; రా. 5).

వంపుకారు: చూ. పర్యా. వంకకారు. గుండ్రని లోహపువస్తువులు పట్టుకోడానికి వాడే వంపు పనిముట్టు. (కో. 28).

వంపుకొను: (క్రి.) ఇత్తడిపనిలో మెరుగురావడానికి పాత్రలోవేసిన అగ్గిని మరొక పాత్రలోనికి మార్చుకోవడం. (కో. 28).

వంపుగడార: పర్యా. వంపుగెడ్డపార. బిందెల కంఠాలు తట్టడానికి వాడే పనిముట్టు. (రా. 10).

వంపుగడారు: చూ. పర్యా. కరవాయి. లోహపు పాత్రలను సాపుచేయడానికి వాడే పరికరం.

(రా. 10).

వంపుగరిట: చూ. పర్యా. గరిట. కూరలువడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే పరికరం. (కో. 6, 11).

వంపుగెడ్డపార: చూ. పర్యా. వంపుగడార. విగ్రహ లోహాన్ని లోతుచేయడానికి బిందెల కంఠాలు తట్టడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 3).

వంపుగ్లాసు: నీళ్ళుత్రాగడానికి వాడే అంచున్న ఇత్తడి గ్లాసు. (కో. 19).

వంపుచానం: విగ్రహంపనిలో వంపు భాగాల్లో ఉపయోగించే పనిముట్టు. (కో. 3).

వంపుడుపట్టకార: చూ. వంపుపట్టకార. (రా. 6).

వంపుదట్టు: చూ. పర్యా. చదరగిన్నె లేగ. లోహపు పాత్రలను మెరుగు పట్టడానికి వాడే పనిముట్టు. (కో. 3).

వంపుదాగలి: చూ. పర్యా. మూతిచెక్క. లోహపు పాత్రల మూతులు చేయడానికి వాడే సాధనం. (కో. 21, 22, 24, 26).

వంపుపట్కార: చూ. వంపుపట్టకార. (రా. 15).

వంపుపట్టకార: రూ. వంపినపట్కార, వంపుడుపట్టకార, వంపుపట్కార. చూ. పర్యా. వంకకారు. కొలిమిపనిలో గుండ్రని లోహపువస్తువులు పట్టుకోడానికి వాడే వంపుపనిముట్టు. (కో. 3, రా. 4, 7, 11, 16).

వంపుపెట్టు: (క్రి.) రూ. వంపెట్టు. చూ. పర్యా. బెండ్‌చేయు. లోహపు రేకులను, పట్టీలను సైజు ప్రకారం వంపుపెట్టడం. (కో. 19, 22, 24, 26. 29, 30; తె. 2, 19-26; రా. 12).

వంపురైలుకమ్మి: (< వంపు + ఇం. Rail + కమ్మి) చూ. పర్యా. మూతిచెక్క. లోహపుపాత్రల మూతులు చేయడానికి వాడే పరికరం. (కో. 14).

వంపులంగరు: చూ. పర్యా. మూతిచెక్క. లోహపు పాత్రల అంచులు తయారుచేయడానికి వాడే సాధనం. (కో. 27).

వంపుసక్కటివాలు: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (తె. 25).

వంపుసక్కడిమొల: చూ. పర్యా. కత్తెమొల. లోహపు రేకులను కత్తరించడానికి, రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (తె. 17).

వంపెట్టు: (క్రి.) చూ. వంపుపెట్టు. (కో. 29).

వధ ఊబి: చూ. పర్యా. పోగరు. లోహపు రేకులపై, కడ్డీలపై రంధ్రాలువేయడానికిగుర్తులుపెట్టే పరికరం. చూ. చిత్రం 165. (కో. 2).

వరస. ఉ. వరసు. బిందెరేకుల అతుకు. (కో. 6, 10, 12).

వరంగల్‌బిందె: చూ. పర్యా. ఆకుబిందె. నీళ్లుతెచ్చుకోడానికి వాడే వెడల్పు మూతిఉన్న ఇత్తడి బిందె. చూ. చిత్రం 17. (తె 22, 23).

వరి ఊక: చూ. పర్యా. ఊక. కొలిమిలో కాక బాగుగా రావడానికి, పాత్రలను తోమడానికి వాడే పదార్థం. (కో. 10, 12).

వరిపొట్టు: చూ. పర్యా. ఊక. కొలిమిలో కాక బాగా రావడానికి. పాత్రలను తోమడానికి వాడే పదార్థం. (కో. 8, 10, 12; తె. 4, 5, 19; రా. 8, 13, 15).

వరుగు: (క్రి.) చూ. పర్యా. మరవేయు. లోహపు రేకులపై, కడ్డీలపై గీతలువేయడం. (రా. 5).

వరుసదీపం: వ్రతాలు చేసేటప్పుడు వెలిగించే దీపపు ప్రమిదలు. (రా. 15).

వరుసలువేయు: (క్రి.) బిందెపై వరుసగ మెరుగు చుక్కలు కొట్టడం. (కో. 23).

వర్టికల్ వెల్డింగ్: (ఇం.) వెల్డింగ్ పనిలో వస్తువు ప్రక్కలకువెల్డింగ్ చేసుకొంటూ వెళ్లడం.(తె. 17).

వలనుచేయు: (క్రి.) బిందె జవ్వ రేకును వాయికి అతికించిన తర్వాత వంకర్లు లేకుండ లోపల నుండి లావుచేసుకుంటూవస్తూ సాపుచేయడం. (తె. 25).

వలముచేయు: (క్రి.) చూ. పర్యా. వద్దించు. బిందె మధ్యరేకును ఇరువైపుల వంచిపొట్ట ఆకారాన్ని తయారుచేయడం

వలయు: శిల్పం యొక్క ఆకారం. (కో. 23).

వలం: బిందె పై ఉండే నొత్తు. (కో. 29).

వళా ఉలి చూ. పర్యా. బంతికమ్మి. లోహపు పాత్రలకు పాలిష్ పట్టడానికి ఉపయోగపడే రింగు (రా. 2).

వళూకి: (తమి౦). చూ. పర్యా. ఉలి. పెట్టెమూతకు ఉండే బొద్దు మట్టంగా రావడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 23 (రా. 12).

వళ్లు: చూ. పర్యా. ఉబ్బులు. లోహపు వస్తువులపై ఉండే బుడిపెలు. (తె. 13).

వస్త్రకాయితం: పోతపనిలో మట్టిని జల్లించడానికి ఉపయోగించే పలుచని బట్ట. (తె. 7).

వస్తవ: చూ. పర్యా. తీయవ. పూర్తయిన లోహపు పాత్ర. (కో. 14, 15; తె. 8).

వస్త్రగాళితంచేయు: (క్రి.) చూ. పర్యా. జల్లించు[1],

పోతపోయడానికి ముందు మట్టిని మెత్తగా జల్లించడం. (కో. 17).

వాకిలి: బీరువాతలుపు. (రా. 4, 7. 8).

వాగుమన్ను: చూ. పర్యా. జిగురుమట్టి. పోతపాత్రను తయారు చేయడానికి ఉపయోగించే ఒండ్రుమట్టి. (తె. 25).

వాంకిడి: (హిం). చూ. పర్యా. కుక్కారు. బండి చక్రానికి కమ్ములను ఎక్కించడానికి వాడే పనిముట్టు. (తె. 25).

వాచరు: (ఇం.) రూ. వాషరు[1]. చూ. పర్యా. కవరు[2]. గొడుగు లోపలికి నీళ్లుపడకుండా పైభాగాన గుడ్డకు బిగుతుగా అమర్చిన ప్లాస్టిక్ గుడ్డ. (కో. 25, 26; తె. 4, 6, 11-24; రా. 11, 14).

వాటర్‌గిన్నె: (< ఇం. Water + గిన్నె) కోళ్ళ ఫారంలో కోళ్ళు నీళ్ళుతాగేకొద్దీ నీళ్ళు రావడానికి అమర్చినపాత్ర. ఈ పాత్రపై చిన్నపాత్ర బోర్లించి ఉంటుంది. (కో. 2).

వాటర్‌గ్లాసు: (ఇం.) చూ. పర్యా. గ్లాసు[1]. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 214. (తె. 16).

వాటర్‌జగ్గు: (ఇం.) చూ. పర్యా. జగ్గు. నీళ్లు ఉంచుకోవడానికి ఉపయోగించే విలువైన లోహపుపాత్ర. చూ. చిత్రం 105. (కో. 1, 6, 8, 10, 11; తె. 14, 18; రా. 7).

వాటరుటాంకి: (ఇం.) చూ. పర్యా. కొలాయి. మంచి నీళ్ళు నిల్వఉంచడానికి కొళాయి అమర్చిన లోహపు పరికరం. చూ. చిత్రం 124. (తె. 21).

వాటర్‌డ్రమ్ము: (ఇం.) నీళ్ళు నిల ఉంచడానికి, కాచడానికి ఉపయోగించే పెద్ద లోహపుపాత్ర. (కో. 4, 6, 8, 10, 11, 13, 15, 17, 27; తె. 14. 16, 25).

వాటర్‌పిల్టరు: (ఇం.) త్రాగేనీరు పరిశుభ్రపరచడానికి వాడేపాత్ర. పైపాత్రలో పోసిననీళ్ళు పరిశుభ్రమై క్రిందిపాత్రలోకి వచ్చే ఏర్పాటు వుంటుంది. క్రింది పాత్రకు కొలాయి పైపాత్రకు మూత అమర్చి వుంటుంది. చూ. చిత్రం 206. (రా. 3, 5, 11).

వాటర్‌పేపరు: (ఇం.) లప్పంపూసిన బీరువారేకులను నీటితో కడగడానికి ఉపయోగించే సాధనం. (కో. 17, 24, 28; తె. 3).

వాటర్‌బయులరు: (ఇం.) చూ. పర్యా. గప్పకా. నీళ్ళు కాచుకోడానికి వాడే సాధనం. (కో. 15; తె. 10).

వాటర్‌స్పూను: (ఇం.) చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే పరికరం. (కో. 1).

వాటంకొయ్యసుత్తి: ఇత్తడి పాత్రలను వాటంచేసే సుత్తి. (కో. 4).

వాటంచేయు[1] : (క్రి.) చూ. పర్యా. ఎలుముచేయు. పదునుపెట్టడానికి వీలుగా కత్తులను వెడల్పు చేయడం. (తె. 5).

వాటంచేయు[2]: (క్రి.) పర్యా. ఇప్పు[2], వాల్చు. ఇత్తడిరేకును వెడల్పుగా సాగ్గొట్టి వెనక్కివంచి బిందెమూతిని చేయడం. (కో. 2, 4, 5, 9; తె. 6).

వాటంచేయు[3] : (క్రి.) చూ. పర్యా. బెండ్‌చేయు. కొడవళ్ళు వంపు చేసుకోవడం. (రా. 4).

వాటంసుత్తి చూ. పర్యా. అడ్డకన్ను. ఇత్తడి, అల్యూమినియం పాత్రలను వంపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 2, 9).

వాడకీలు: చూ. పర్యా. డాంబరు. బిందెను సంగడి మోపుకు అంటించడానికి వాడే జిగురుపదార్థం. (కో. 17, 23, 24, 27; తె. 6).

వాడిపెట్టు: చూ. పర్యా. సరును. మొద్దుబారిన పనిముట్లను కొస్సిగ చేయడం. (తె. 7).

వాతిపోగరు: చూ. పర్యా. గుజారను. విగ్రహానికి గీతలు వేసుకొనడానికి వాడే పరికరం. (రా. 1, 5).

వాత్తు: (క్రి.) పట్టాను గుండ్రంగా వంచేందుకు ఒక మొద్దును నేలలో నాటడం. (తె. 5).

వాదర: అంచు. ఆయుధాలకు ఉండే పదును.

వాంపాడిసాలిగ: చూ. పర్యా. కారావాచ. వాంపొడి, మురుకులు వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (కో. 4; తె. 4, 14; రా. 6).

వాయ: చూ. పర్యా. ఉరవ. పాత్రపొట్టభాగంపై వచ్చే ఉబ్బెత్తు. (కో. 25).

వాయి[1]: ఉ. వాయ. చూ. పర్యా. తలకాయ. బిందె మూతి భాగపురేకు. (కో. 25; తె. 1-3, 6-9, 15, 17-19, 21. 23. 25).

వాయి[2]: చూ. పర్యా. మూతిచెక్క. పాత్రల అంచు భాగం కొట్టడానికి వాడే పరికరం. (కో. 8).

వాయి[3]: కత్తికుండే పదును. (కో. 15).

వాయిఇప్పు: (క్రి.) పర్యా. సెలుసుతీర్చు. జవ్వను అతకడానికి వీలుగా పాత్ర మూతిభాగాన్ని తయారు చేయడం. (కో. 29).

వాయిఏయు: (క్రి.) రూ. వాయేయు. చూ. పర్యా.

సరుసు. సానపట్టడానికి వీలుగా ఇనుమును పల్చగ ఏటవాలుగ చేయడం. (కో. 30).

వాయితీయు: (క్రి.) తెగడానికి వీలుగా పనిముట్ల అంచుల్ని పల్చగ, ఏటవాలుగ తయారుచేయడం. (తె. 21).

వాయితీర్చు: (క్రి.) బిందె కుతికిభాగాన్ని నున్నగ సాపుచేయడం. (కో. 27).

వాయిదరకొట్టు: (క్రి.) రూ. వాయిదరపెట్టు, వాయిదార్‌పట్టు. చూ. పర్యా. సరుసు. కత్తులకు ఒకపైపు పదునుపెట్టడం. (తె. 2; రా 15).

వాయిదరపెట్టు: (క్రి.) చూ. వాయిదరకొట్టు. (రా.16)

వాయిదర్‌పట్టు (క్రి.) చూ. వాయిదరకొట్టు. (రా. 4).

వాయిదార: చూ. పర్యా. కన్నం. అచ్చులో కరిగిన లోహాన్ని పోసేందుకు మట్టి అచ్చుపై పెట్టిన రంధ్రం. (తె. 25).

వాయిపెట్టు: (క్రి.) చూ. పర్యా. సరుసు. మొద్దుబారిన పనిముట్లను పదునుచేయడం. (కో. 26).

వాయియిప్పు: చూ. పర్యా. నెలుపుతీర్చు. పాత్రల గొంతుభాగాన్ని సాపుచేయడం. (తె. 29).

వాయిలసుత్తె: చూ. పర్యా. గల్లసుత్తె. బిందెల మూతులు తయారుచేయడానికి వాడేసుత్తె. అడుగు భాగం కొద్దిగా వంగి ఉంటుంది. (కో. 29; తె. 2).

వాయువొచ్చు: (క్రి.) చూ. పర్యా. సరుసు. మొద్దుగ ఉండే పనిముట్లను కూచిగ పదునుచేయడం. (కో. 20).

వాయేయు: (క్రి.) చూ. వాయిఏయు. (కో. 19, 23).

వారకొట్టు: (క్రి.) చూ. పర్యా. కోరుచేయు. రెండు లోహపు రేకులను కలిపి ఒకటిగా జాయింటు చేయడం. (కో. 26).

వారంబడి: రేకు అంచుల వెంబడి. (కో. 18).

వారు: చూ. పర్యా. తోలువారు. సానరాయిని చేతితో లాగడానికి వాడే చర్మపుపట్టీ. (తె. 6).

వార్చేపళ్లెం: చూ. పర్యా. అన్నంబుట్ట. ఉడికిన కూరగాయలను వడగట్టడానికి వాడే అడుగున రంధ్రాలున్న లోహపుపాత్ర. చూ. చిత్రం 11. (కో. 18).

వార్నిష్‌రంగు: (< ఇం. Varnish + రంగు). చూ. పర్యా. ప్రైమరిరంగు. పూర్తయిన బీరువాలు. గేట్లు వగైరా ఇనుప వస్తువులకు మొదటిసారి వేసే ఎర్రనిరంగు పదార్థం. (కో. 26, 29; తె. 2. 7).

వార్నిషు: (ఇం.) చూ. పర్యా. ప్రైమరిరంగు. పూర్తయిన ఇనుప వస్తువులకు తొలిసారిగా వేయడానికి ఉపయోగపడే ఎర్రని రంగుపదార్థం. (కో. 23).

వాల్‌కార్కు: (ఇం.) స్టౌలో చిన్న రబ్బరుముక్క పంపులోపల ఉన్న పరికరం. (కో. 28).

వాల్‌తీయు: (క్రి.) విగ్రహాన్ని చేయడానికి ఇత్తడి రేకుపై డిజైన్ కనపడే విధంగా మార్కింగ్ చేయడం. (తె. 17).

వాల్‌పాన: (ఇం.) చూ. పర్యా. వాల్‌రించి. స్టౌ, పెట్రొమాక్స్‌లైటు 'టాంకి'ల లోపలి వాల్‌ను విప్పదీసి బిగించడానికి వాడే పనిముట్టు (తె. 4, 6, 17-24).

వాల్‌పానరు: (ఇం.) చూ. పర్యా. వాల్‌రించి. స్టౌ, పెట్రొమాక్స్‌లైటు 'టాంకి'ల లోపలి వాల్‌ను విప్పదీసి బిగించడానికి వాడే పనిముట్టు. (తె. 5).

వాల్‌మాను: చూ. పర్యా. అడిగేమొద్దు. ఇత్తడి పాత్రలను పాలిష్‌పెట్టడానికి ఉపయోగించే కొయ్య దిమ్మ. (తె. 4-6).

వాల్‌రించి: (ఇం.) ఉ. వ్రాలెంచి .రూ. వాల్‌రింజి. పర్యా. వాల్‌పాన, పాల్‌పానరు, వాల్‌స్పానరు. స్టౌ, పెట్రొమాక్స్‌లైట్ 'టాంకి'ల లోపలి వాల్‌ను విప్పదీసి, బిగించడానికి వాడే పనిముట్టు. (కో. 21, 26, 28-30).

వాల్‌రింజి: (ఇం.) చూ. వాల్‌రించి. (కో. 13).

వాల్‌స్పానరు: (ఇం.) చూ. పర్యా. వాల్‌రించి. స్టౌ, పెట్రోమాక్స్ లైటు 'టాంకి'ల లోపలి వాల్‌ను విప్పదీని, బిగించడానికి వాడే పనిముట్టు. (కో. 2, 3).

వాల్‌స్ప్రింగు: (ఇం.) స్టౌ కార్కును బిగించే పరికరం. (కో. 28).

వాలడ్డ: చూ. పర్యా. ఎమరుబల్ల. అంటించిన శాస్త్రీ వడుసురాకుండా ఉండడానికి మొకంబల్లకి ప్రక్కగా శాస్త్రీకి ఆపుగా నేలమీద విడిగా ఉంచే కొయ్య చెక్క. (కో. 5).

వాలరు: చూ. ఓలరు. (కో. 23).

వాలిఉలి: చూ. పర్యా. అదురులేగ, పాలిష్ పాత్రలపై డిజైనులు వేయడానికి వాడే పరికరం. (కో. 1).

వాలు: గాలిని నివ్వచేయడానికి పెట్రొమాక్స్‌లైటు, స్టౌ టాంకిలోపల అమర్చిన సాధనం. (కో. 2, 20, 21, 28, 30; తె. 4, 6, 17, 19, 24).

వాలుకమ్మి: ఉ. వాలికమ్మి. చూ. పర్యా. అదురులేగ. పాలిష్ పాత్రలపై డిజైనులు వేయడానికి వాడే

పరికరం. (కో. 14, 19, 20).

వాలుకరవాయి: చూ. పర్యా. ప్లాట్ కరవాయి. బక్కెట్లు, బిందెలు తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 5).

వాలుగెట్టు: వాలు లోపలిభాగాన ఉండి గాలిని సమంగా పంపడానికి ఉపయోగించే సాధనం. (కో. 30).

వాలుపోగరు: చూ. పర్యా. గుజారను. విగ్రహానికి లోతుగీతలు వేయడానికి, వాలు తీయడానికి వాడే పరికరం. (కో. 7, 8, 10, 15, 24, 28; రా. 16).

వాలుమొల: ఉ. వాలుమూల. చూ. పర్యా. చదర గన్నెలేగ. లోహపుపాత్రలను మెరుగుపట్టడానికి వాడే పనిముట్టు. (తె. 8, 13, 17).

వాలేయు[1]: (క్రి.) చూ. పర్యా. ఏట్లుఏయు. పూర్తయిన లోహపుపాత్రలను మెరుగుపెట్టడం. (తె. 2, 6, 25).

వాలేయు[2]: (క్రి.) చూ. పర్యా. బెండ్‌చేయు. కొలత ప్రకారం లోహపురేకులను, పట్టీలను వంపుపెట్టడం. కో.19; (తె. 3).

వాలేయు[3]: చూ. పర్యా. జంతర్‌ఏయు. పాలిష్ బిందెపై సన్నని గీరలు కొట్టడం. (కో. 7; తె. 4).

వాలేగ: (< వాలు లేగ). రూ. వాల్లేగ, వాళ్ళులేగ. పర్యా. ఒంపుకంటానీ, ఒంపుగీతకడ్డి, ఒంపులేగ. కంచాలు, గిన్నెలు మొ॥ వాటికి వాలుగాగీతలు వేయడానికి వంపుల్లో పట్టడానికి వాడే పరికరం. దీనివల్ల దెబ్బలు కొట్టినపుడు ఏర్పడిన కచ్చులు సాపు అవుతాయి. (కో. 5, 7, 11, 16, 18, 23–29).

వాల్క్నైజుమిషను: (ఇం.) సైకిల్‌ట్యూబులు ప్రాచ్ చేయడానికి ఉపయోగించే పరికరం. (కో.13).

వాల్డరు: చూ. ఓల్డరు. (కో. 17).

వాల్పు: (క్రి.) చూ. పర్యా. వాటంచేయు. ఇత్తడి రేకును వెడల్పుగ సాగ్గొట్టి, వెనక్కివంచి బిందె మూతిని చేయడం. (తె 4).

వాల్లేగ: ఉ. వాల్లాగ చూ. వాలేగ. (తె. 6, 8–12, 17, 18, 21–24, 25).

వాళ్ళులేగ: చూ. వాలేగ. (కో. 23).

వాషరు[1]. (ఇం.) చూ. వాచరు. (తె. 22).

షరు[2]: (ఇం.) పర్యా. లబ్బరుబూటు. స్టౌపంపు ఊడిరాకుండ లోభాగాన అమర్చిన రబ్బరు సాధనం. (కో. 28–30; తె. 3).

వాషింగుచేయు: (క్రి.) (< ఇం. Washing + చేయు). చూ. పర్యా. తీయు[1]. పాత్రను శుభ్ర పరచడం. (రా. 8).

విజయవాడబిందె: గొంతుభాగం వంగి ఉంటుంది. నీళ్ళు తెచ్చుకోడానికి వాడే చిన్నపాత్ర. (తె. 10, 11).

వింజామరగొట్టం: చూ. పర్యా. వింజామరం. దేవునికి విసరడానికి చమరీమృగం వెంట్రుకలు బిగించిన లోహపుగొట్టం. (కో. 13).

వింజామరం: (బ.) వింజామరలు, వింజామరాలు, వింజామరు. పర్యా. చామరం, వింజామరగొట్టం. దేవునికి విసరడానికి వాడే సాధనం. లోహపు గొట్టంతో చమరీమృగం వెంట్రుకలు బిగించి దేవునిప్రక్కన పెడ్తారు. (కో.17,20; తె. 16 17).

విడదీయు: (క్రి.) చూ. పర్యా. పల్లుచేయు. అతకడానికి వీలుగా రేకును పల్లుచేయడం. (కో. 5).

విరగ్గొట్టు: (క్రి.). చూ. ఇరగొట్టు. (4.) (రా. 4).

విష్ణుచెంబు: చూ. పర్యా. మరచెంబు[2]. దేవాలయంలో తీర్థానికి వాడే రాగిపాత్ర. (కో. 1).

విసురు: (క్రి.) పాత్రను కొట్టేటపుడు దూరముగా తిప్పుకోవడం. (కో. 5).

విస్తరాకు: చూ. పర్యా. అడ్డాకు. అన్నం తినడానికి వాడే స్టీలుపళ్ళెం. (కో. 23).

వీక్లాంబిట్: (ఇం.) లారీ చక్రాల్లో ¾ అంగుళం నట్టును తిప్పడానికి వాడే కొరముట్టు. (రా. 4).

వీవి: కరవాయి. క్రిందిభాగం. (కో. 2).

వీల్‌రింగు: (ఇం.) పర్యా. వీల్‌రింజి, వీల్‌స్పేనర్. సైకిల్‌చక్రాల నట్లు విప్పడానికి ఉపయోగపడే పరికరం. (కో. 3).

వీల్‌రింజి: (ఇం.) చూ. పర్యా. వీల్‌రింగు. సైకిల్ చక్రాల నట్లు విప్పడానికి ఉపయోగపడే పరికరం. (కో. 3).

వీల్‌స్పేనర్: (ఇం.) చూ. పర్యా. వీల్‌రింగు. సైకిల్ చక్రాల నట్లు విప్పడానికి ఉపయోగపడే పరికరం. (కో. 7; రా. 6, 8).

వెక్కు: చూ. పర్యా. బటన్. గొడుగును తెరచి ఉంచినపుడు పుల్లలను పట్టి ఉంచే మీట. (కో. 20).

వ్రటం: చూ. పర్యా. చదరపు వంచు. లోహపు రేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి ఉపయోగపడే పరికరం. (రా. 1–3).

వెడల్పు: చూ. పర్యా. అడ్డ[1]. బిందె మధ్యభాగపు

రేకు. (తె. 14).

వెడల్పుకూరగాకా: కూరలు వేసుకోడానికి ఉపయోగించే వెడల్పుగా ఉన్న పాత్ర. చూ. చిత్రం 207. (రా. 7).

వెడల్పుగిన్నె: అన్నం తినడానికి, పాయసం పోసుకోడానికి వాడేపాత్ర. వెడల్పుగా ఉంటుంది. (కో. 6, 8, 11).

వెడల్పుఛన్ని: కాగిన ఇనుమును తెగ్గొట్టడానికి ఉపయోగించే పనిముట్టు. (రా. 15).

వెడల్పుపోగరు: స్టీల్‌పాత్రలపై డిజైన్లు కొట్టడానికి వాడే పోగరు. (కో. 4, 9).

వెంట్రుకలకత్తెర: చూ. పర్యా. బార్ బార్కత్తెర. మంగలిషాపులో వెంట్రుకలు కత్తిరించడానికి వాడే పనిముట్టు. (తె. 4).

వెండిఅంచుగిన్నె: చూ. పర్యా. పోతకంచం. అన్నం తినడానికి వాడే అల్యూమినియం పోతగిన్నె. (కో. 28).

వెండిగిన్నె: చూ. పర్యా. పోతకంచం. అన్నం తినడానికి వాడే అల్యూమినియం పోతగిన్నె. (కో. 26).

వెండిటంకం: పాత్రల రంధ్రాలను అతకడానికి వెండి, ఇత్తడితుక్కు, సత్తుకలిపిన పదార్థం. (రా. 15).

వెండిసీసం: చూ. పర్యా. సీసం. రవ్వలో కలపడానికి, డబ్బారేకులను అతకడానికి ఉపయోగపడే పదార్థం. (రా. 15).

వెనకువేయు: (క్రి.) చూ. పర్యా. తర్వడిచేయు. ఇత్తడిపాత్ర రేకులను మడవడం. (తె. 16).

వెనుకటోపను: చూ. పర్యా. ఎన్నమూత. టార్చిలైటులోని బాటరీలు పడిపోకుండ మూసి ఉంచే బిరడా. (తె. 18).

వెన్నగిన్నె: పర్యా. వెన్నసట్టి. వెన్న, నేయివంటి పదార్థాలు ఉంచుకోడానికి వాడే నిలువుపాత్ర. (కో. 6, 8, 11).

వెన్నచిట్టి: చూ. వెన్నసట్టి. (కో. 22).

వెన్నబకెట్: (< వెన్న + ఇం. Bucket) వస్తువులు తెచ్చుకోడానికి, నిల్వఉంచుకోడానికి వాడే పరికరం. (కో. 17).

వెన్నసట్టి: రూ. వెన్నచిట్టి. పర్యా. వెన్నగిన్నె. వెన్న, నేయివంటి పదార్థాలు ఉంచుకోడానికి వాడే నిలువు గిన్నె. (కో. 4, 7, 9).

వెయిఇంగ్‌బ్యాలన్స్: (ఇం.) తయారైన ఇనుపగేట్లను తూకంవేయడానికి వాడే పరికరం. (రా. 5).

వెరన్(ఉర్దూ): చూ. పర్యా. చత్రం[1]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడేమోపు. (తె. 7).

వెల్డింగ్‌అద్దం: (< ఇం. Welding + అద్దం) చూ. పర్యా. అద్దం[1]. వెల్డింగ్‌పనిలో కంటికి రక్షణగా వాడే పరికరం. (కో. 4, 5, 7, 30; తె. 3, 15).

వెల్డింగ్‌కేబుల్ అండ్ హోల్డర్: (ఇం.) ఇనుపప్లాట్‌జాయింట్ చేయడానికి వెల్డింగ్‌రాడ్‌లు తెచ్చి అతికే సాధనం. (రా. 5).

వెల్డింగ్‌కేబుల్స్: (ఇం.) చూ. పర్యా. కేబులు. వెల్డింగ్‌ట్రాన్స్‌ఫారం నుండి హోల్డర్‌కు కరెంటును అందించడానికి ఉపయోగించే మందమైన రాగితంతి (కో. 13).

వెల్డింగ్‌గెడపార: (< ఇం. Welding గెడపార) చూ. పర్యా. ఉండగడ్డపార. లోహపుపాత్రల నొక్కులు తీయడానికి, అడుగుభాగాలు కొట్టడానికి వాడే పరికరం. (కో. 5).

వెల్డింగ్‌గ్లాసు: (ఇం.) చూ. పర్యా. అద్దం[1]. వెల్డింగ్ పనిలో కంటికి రక్షణగా వాడే పరికరం. (తె. 4, 7; రా. 6, 10).

వెల్డింగ్‌చేయు: (క్రి.) (< ఇం. Welding + చేయు) లోహపురేకులను జాయింట్ తెలియకుండా రవ్వతో అతకడం. (కో. 2; తె. 17; రా. 3, 6).

వెల్డింగ్‌ట్రాన్స్‌ఫరం: (ఇం.) చూ. పర్యా. ట్రాన్స్‌ఫారం. ఇనుపరేకులను, కడ్డీలను వెల్డింగ్ చేయడానికి వాడే యంత్రం. (కో. 5, 7; రా. 5, 7).

వెల్డింగుపని: ఉ. వెల్డింగ్‌పని. చూ. పర్యా. గ్రిల్‌వర్కు. డిజైనుచేసి ఇనుపవస్తువులు తయారు చేసేపని. (కో. 2, 5, 19, 24, 29; తె. 3, 6; రా. 3, 5, 6, 8, 15).

వెల్డింగ్‌పుల్ల: చూ. పర్యా పుల్ల[1]. లోహపు వస్తువులను వెల్డింగ్ చేయడానికి ఉపయోగించే కర్బనపుకడ్డీ. (తె. 1, 7, 15, 17, 18).

వెల్డింగ్‌ప్లాంటు: (ఇం.) చూ. పర్యా. ట్రాన్స్‌ఫారం. లోహపురేకులను, కడ్డీలను వెల్డింగ్ చేయడానికి వాడే యంత్రం. (కో. 24).

వెల్డింగ్‌బ్రెష్: (ఇం.) పర్యా. వైర్‌చెస్; వైర్‌బ్రెష్. లోహపు వస్తువులను శుభ్రంచేయడానికి వాడే సాధనం. (కో. 15).

వెల్డింగ్‌మిషను: (ఇం.) చూ. పర్యా. ట్రాన్స్‌ఫారం. లోహపురేకులను, కడ్డీలను వెల్డింగ్ చేయడానికి

వాడే యంత్రం. (కో. 2, 3, 13, 15–19, 21, 22, 25–30; తె. 1, 3–9, 17, 19, 21–25, తి. 4, 6–8, 11, 16).

వెల్డింగ్‌రాడ్డు: (ఇం.) రూ. వెల్డింగ్‌రాడ్సు. చూ. పర్యా. పుల్ల[1]. లోహపువస్తువులను వెల్డింగ్ చేయడానికి ఉపయోగించే కర్బనపుకడ్డీ. (కో. 5, 13, 23, 24, 29; తె. 20, 21, 23–25; రా. 6).

వెల్డింగ్‌రాడ్సు: (ఇం.) చూ. వెల్డింగ్‌రాడ్డు. (కో. 4, 9; రా. 5).

వెల్డింగ్‌వైరు: (ఇం.) చూ. పర్యా. కేబులు. వెల్డింగ్ ట్రాన్స్‌ఫారంనుండి హోల్డర్‌కు కరెంటును అందించడానికి ఉపయోగించే మందమైన రాగితంతి. (కో. 7).

వెల్డింగ్‌సీల్డు: (ఇం.) చూ. పర్యా. అద్దం[1]. కంటికి రక్షణగా వెల్డింగు పనిలో వాడే పరికరం. (రా. 2).

వెల్డింగ్‌సుత్తి: చూ. పర్యా. కత్తి[3]. వెల్డింగ్ ఉబ్బులను కొట్టడానికి వాడే పరికరం. (కో. 5, 6).

వెల్డింగ్‌స్పాట్: (ఇం.) స్టీల్‌పాత్రల తయారీలో ఉపయోగించే వెల్డింగ్ ముక్క. (కో. 5).

వెల్డింగ్‌హోల్డర్: (ఇం.) ఇనుపచట్టాలను అతకడానికి వాడే పరికరం. (తె. 12).

వేడిచేయు: (క్రి.) చూ. పర్యా. కాగబెట్టు. కొలిమిలో లోహపు పాత్రల్ని, కడ్డీలనుబాగా ఎర్రగా వేడి చేయడం. (తె. 5).

వేడిమిచి: వేడిగా ఉన్న ఇత్తడిపాత్ర. (తె. 8).

వేమరు: చూ. ఆమరు. చూ. చిత్రం. (తె. 18).

వేరుచేయు: (క్రి.) చూ. పర్యా. జల్లించు[2]. జల్లెడ సహాయంతో టీ పొడిని ఆకులాంటి చెత్తా చెదారం లేకుండా శుభ్రపరచడం. (కో. 1).

వేల్పురిగిన్నె: చూ. పర్యా. పప్పుతపిల. పప్పు వండడానికి ఉపయోగించే లోహపుపాత్ర. (కో. 19).

వేస్ట్‌ఆయిల్: (ఇం.) మట్టిలో కలుపుకోడానికి ఉపయోగించే పదార్థం. (రా. 5).

వైట్: (ఇం.) చూ. పర్యా. జస్. ఇత్తడిపాత్రల కళాయిపనికి వాడే యాసిడ్‌తో కనిపేపదార్థం. (రా. 9).

వైర్‌కారేజి: (ఇం.) రూ. వైర్ క్యారీరు. భోజనం తీసుకెళ్ళడానికి ఉపయోగపడే 45 గిన్నెలున్న వైర్‌తో నిర్మించిన లోహపుపాత్రలు. (కో. 30).

వైర్‌క్యారీరు: (ఇం.) చూ. వైర్‌కారేజి. (కో. 2, 12, 15).

వైర్‌చెస్: (ఇం.) చూ. పర్యా. వెల్డింగ్‌బ్రెష్. లోహపు వస్తువులను శుభ్రం చేయడానికి ఉపయోగపడే పరికరం. (కో. 15).

వైర్‌డ్రాయింగ్‌మిషన్: (ఇం.) వైర్‌రాడ్డును తగిన సైజుకు డ్రా చేసే మిషను. (రా. 7).

వైర్‌బ్రెష్: (ఇం.) చూ. పర్యా. వెల్డింగ్‌బ్రెష్. లోహపు వస్తువులను శుభ్రం చేయడానికి వాడే పరికరం. (తె. 5, 18, 19).

వైర్‌స్క్రాబ్, ఇన్‌గాడ్స్: (ఇం.) అల్యూమినియం పాతవస్తువులు. ఇవి ఉత్తరప్రదేశ్, మద్రాసునుండి వస్తాయి. (రా. 7).

వైరముడి: చూ. పర్యా. కిరీటం. దేవుని విగ్రహాలకు తలనెత్తిన పెట్టడానికి వాడే వజ్రాలు పొదిగిన ఆభరణం. (తె. 6).

వైరు[1]: (ఇం.) చూ. పర్యా. ఇనుపతంతె. గొడుగు పుల్లలను పళ్ళచక్రానికి బిగించడానికి వాడే సన్నని ఇనపతంతె. (కో. 20, 23, 25. 29, 30; తె. 1, 2, 6, 17, 18, 21, 23, 25).

వైరు[2]: (ఇం.) విగ్రహం అచ్చు తయారుచేయడానికి స్టీల్‌పాత్రల తయారీకి, బ్యాటరీలు రిపేరు చేయడానికి ఉపయోగించే సన్నని తంతె, (కో. 5; తె. 17; రా. 5).

వైష్ణవచెంబు: పర్యా. నిలువుచెంబు. అడుగు తక్కువగా మూతిపొడుగ్గా మరలులేని మరచెంబు ఆకారంతో ఉండే చెంబు. చూ. చిత్రం 208. (కో. 2, 5–7, 10–15, 18–20, 24, 28; రా. 7, 8, 14, 23).

వ్యాపర్‌కీప్: (ఇం.) చూ. పర్యా. గడ్డ. టార్చిలైట్‌లో బల్బును ఉంచడానికి అమర్చిన దిమ్మ. (కో. 2).

వ్యాపారబిందె: ఉ. యాపారబింది. చూ. పర్యా. ఆకుబిందె. మూతికి వెడల్పుచూరు ఉండి ప్రక్క వెడల్పుగ ఉండే లోహపుపాత్ర. నీళ్ళు తెచ్చుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 17. (కో. 16, 18, 19).

## శ

శకునంమూలు: విగ్రహం మధ్యభాగాన్ని చెక్కడానికి ఉపయోగించే పనిముట్టు. (తె. 10, 11).

శక్రం: చూ. పర్యా. కవరు[2]. గొడుగు లోపలికి నీళ్ళు దిగకుండా ఉండడానికి ఉపయోగపడే పైభాగాన అమర్చిన ప్లాస్టిక్‌గుడ్డ. (కో. 27).

శంఖు: దేవాలయంలో విష్ణువు చేతిలో ఉండే ఇత్తడి

ఆయుధం. (కో. 8).

శటగోపం: ఉ. చటగోపం. చూ. శటగోపురం. (కో. 11. 12; తె. 9, 15, 16, 17, 20).

శటగోపురం: ఉ. శెట్టగోపురం, శెడగోపురం, శెత గోపురం, సెడగోపురం. రూ. శటగోపం, శఠ గోపురం, శతగోపరం, షడగోపు, షడగోపురం. పర్యా. చటారు. దేవాలయాల్లో భక్తుల తలమీద పెట్టడానికి వాడే సాధనం. చూ. చిత్రం 209. (కో. 13, 17, 20; తె. 21).

శఠగోపురం: చూ. శటగోపురం. (తె. 1, 2; రా. 14).

శతగోపరం: చూ. శటగోపురం. (కో. 20; తె. 24).

శాకబట్టు: (క్రి.) చూ. పర్యా కాక ఎక్కు-. ఇనుమును సాగ్గొట్టడానికి వీలుగా కొలిమిలో ఎర్రగా కాల్చడం. (తె. 22).

శానపుకారు: చూ. చానంకారు. (కో. 18, 19, 23).

శానపుబద్దీ: చూ. శానంబద్ది. (కో. 20).

శానం: ఉ. శేనం. రూ. చానం, షానం. ఇనపకడ్డీలను తెగ్గొట్టడానికి వాడే మొల. (కో. 16–26, 29, 30; తె. 1–5, 12, 16–18, 20–25; రా. 12, 16).

శానంకారు: చూ. చానంకారు. (కో. 17, 21, 22, 24; తె. 2).

శానంపట్టకార: చూ. చానంపట్టకారు. (తె. 2, 3; రా. 12).

శానంపులేల్: బీరువారేకును కొలతకు సరిపోయేటట్లు పెంచుకోడానికి వాడే పరికరం. (తె. 25).

శానంబద్ది: రూ. శానపుబద్దీ. చూ. పర్యా. కమ్మరకారు. లోహపువస్తువులు తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి పనికివచ్చే పరికరం. చూ. చిత్రం 147. (కో. 30).

శానంమట్టు: చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువులు తెగ్గొట్టేటప్పుడు శానాన్ని పట్టుకోడానికి పనికివచ్చే పరికరం. చూ. చిత్రం 147. (కో. 22, 26).

శాత్రీ: చూ. పర్యా. తీరువ. పూర్తయిన లోహపు వస్తువు. (కో. 13).

శిరసు: బిందెమూతిభాగం. (కో. 21).

శిల్పపని: చూ. పర్యా. చిత్రకారుపని. ఇత్తడిరేకుతో విగ్రహాలు, వాహనాలు మొదలైన వస్తువులు చేసే పని. (కో. 16–18; తె. 25).

శివబొట్టు: చూ. పర్యా. నొసటిబొట్టు. శివుని ఫాలభాగంలో విబూదిమాదిరి చేసిపెట్టడానికి వాడే లోహపుబొట్టు. (తె. 2).

శీల: చూ. చీల[1]. (తె. 5).

శుద్ధంచేయు: (క్రి.) తయారయిన పాత్రను మెరుగు పరచి శుభ్రంచేయడం. (కో. 2, 5; రా. 5).

శుభ్రపరచు: (క్రి.) చూ. పర్యా. జల్లించు[2]. టీపొడిలో ఆకులాంటి చెత్తాచెదారాన్ని జల్లెడ సహాయంతో శుభ్రపరచడం. (కో. 1).

శెకనంసుత్తె: ఉ. చకనంసుత్తి. విగ్రహానికి ముక్కు-భాగం చెక్కడానికి ఉపయోగించే పనిముట్టు (తె. 8, 9).

శెట్టికత్తి: చెట్లను నరకడానికి ఉపయోగించే కత్తి. (కో. 27).

శేరు: చూ. పర్యా. మానిక-. గింజలుకొల్వడానికి ఉపయోగించే లోహపుపాత్ర. చూ. చిత్రం 210. (కో. 18; తె. 25; రా. 2).

శేరుచెంబు: చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళుతాగడానికి, కాళ్ళుకడగడానికి వాడే బిందె ఆకారంతో చేసిన చిన్నలోహపు పాత్ర. చూ. చిత్రం 84.

శేవుపీట: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 7).

శ్రావణం: ఉ. శ్రవణం. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 2, 6, 12; తె. 13).

## ష

షటగోపు: చూ. శటగోపురం. (తె. 2, 3).

షటగోపురం: దేవాలయాల్లో భక్తుల్ని ఆశీర్వదించడానికి దేవుని పాదాలదగ్గర పెట్టిన ఇత్తడిటోపి. (కో. 24).

షడగోపురం: ఉ. చెడగోపురం, పెడగోపురం. చూ. శటగోపురం. (కో. 10, 13, 17; తె. 2, 7, 19; రా. 10).

షమా (ఫార్సీ): చూ.పర్యా. కంచార్తి. దీపంవెలిగించడానికి వాడే లోహపు పరికరం. (తె. 1).

షాటు: టార్చిలైటు వెలగకుండ ఆరిపోవడం. (తె. 2).

షానం: చూ. శానం. (కో. 17; తె. 6, 12, 17, 18, 20, 24–26).

షిప్పింగ్‌చేయు: (క్రి.) చూ.చిప్పింగ్‌చేయు. (కో.18).

షీటు: (ఇం.) చూ. పర్యా. టెంప్లేటు. ముందుగ డిజైను గీయడానికి వెల్డింగ్‌పనిలో వాడే పెద్ద లోహపురేకు. (తె. 21).

షీల్డు: (ఇం.) రూ. సీల్డు[2]. ఆటల్లో, బహుమతులివ్వ

డానికి పనికివచ్చే పెద్దసైజు లోహపుసాధనం. (కో. 18).

షెకనంపని: చూ. చెకనంపని. (తె. 25).

షెటాంబరు: చూ. చెటాంబరు. (తె. 2).

షేడు[1]: (ఇం.) చూ. పర్యా. అద్దం[1]. వెల్డింగుపనిలో కంటికి రక్షణగా వాడే పరికరం. (కో. 21).

షేడు[2]: ఎండిన కరుగులు పెట్టుకోడానికి వాడేగది. (రా. 2).

షేప్ఉలి: టిఫెన్క్యారీర్ తయారుచేయడానికి వాడే పరికరం. (కో. 6).

షేపు: (< ఇం. Shape) చూ. పర్యా. కైపిడి. పెసైను పట్టుకోడానికి వీలుగా అమర్చిన నిర్మాణం. (కో. 16, 17).

షేపుకట్టి పాత్ర ఆకారాన్ని శేవడానికి వాడేపరికరం. (రా. 14).

షేపుకొట్టు: (క్రి.) పాత్ర ఆకారాన్ని తయారు చేయడం. (రా. 16).

షేపుమిషను: (ఇం.) అల్యూమియం రేకును పాత్ర లాగ పూర్తిఆకారాన్ని చేయడానికి వాడే యంత్రం. (కో. 26).

షేపువులి: రూ. సేప్ఉలి. రేకును పాత్ర ఆకారంగా వంచడానికి ఉపయోగించే సాధనం. (రా. 16).

స

సక్కటివాలు: చూ. పర్యా. కంటిపోగరు. విగ్రహాల పనిలో రేకువిగ్రహం చుట్టూ బార్డర్ కొట్టడానికి వాడే మొద్దుపోగరు. (తె. 25).

సక్కనిపట్టుకార: చూ. పర్యా. కమ్మరకారు. లోహపు వస్తువుల్ని తెగ్గొట్టేటప్పుడు తానాన్ని పట్టుకోడానికి పనికివచ్చే పరికరం. చూ. చిత్రం 147. (రా. 7).

సక్కి: మేకులదాగలి పూర్తిగ లోపలికి పోకుండ పట్టి ఉంచే పరికరం. (కో. 16).

సంగటిబాన: రాగిసంగటి తయారుచేయడానికి వాడే మందంగా ఉన్న లోహపుపాత్ర. (రా. 2).

సంగడి[1]: చూ. పర్యా. అడిగేమొద్దు. ఇత్తడి పాత్రలను మెరుగుపెట్టడానికి ఉపయోగించే గట్టి కొయ్యదిమ్మ. (తె. 8, 22, 25).

సంగడి[2]: మంగలికత్తుల పిడులు తయారుచేయడానికి వాడే సాధనం. (తె. 18).

సంగడికొయ్య: చూ. పర్యా. కంటకొయ్య. సంగడి దిండును బిగించడానికి ఉపయోగించే 'V' ఆకారపు పంగలకొయ్య. (తె. 18, 19, 20).

సంగడిగిల్ల: చూ. పర్యా. గిలక[2]. సంగడిదిండు తిరగడానికి వాడే పరికరం. (తె. 24).

సంగడితాడు: చూ. పర్యా. తాడు. సంగడిదిండును లాగడానికి వాడే సాధనం. (తె. 20).

సంగడిదిండు: చూ. పర్యా. అడిగేమొద్దు. ఇత్తడి పాత్రలను మెరుగుపెట్టడానికి ఉపయోగించే కొయ్య దిమ్మ. (తె. 1, 2, 17, 20, 24, 25).

సంగడిమొద్దు: చూ. పర్యా. అడిగేమొద్దు: ఇత్తడి పాత్రలను మెరుగుపెట్టడానికి ఉపయోగించే కొయ్య దిమ్మ. (తె. 7, 14–16, 18, 19, 21).

సంగడిమొల: చూ. పర్యా. అదురువాలేగ. పాలిష్ పాత్రలపై డిజైనులు వేయడానికి వాడే పరికరం. (తె. 2, 10, 11).

సంగడిమోపు: చూ. పర్యా. అడిగేమొద్దు. ఇత్తడి పాత్రలను మెరుగుపెట్టడానికి ఉపయోగించే కొయ్య దిమ్మ. (తె. 3).

సంగడిపట్టు: (క్రి.) చూ. పర్యా. ఏట్లు ఏయు. పూర్తయిన లోహపుపాత్రను మెరుగుపట్టడం. (తె. 3).

సంగడివేయు: (క్రి.) చూ. సంగడేయు. (తె. 17).

సంగడేయు: (క్రి.) రూ. సంగడివేయు. చూ. పర్యా. ఏట్లు ఏయు. పూర్తయిన లోహపు పాత్రను మెరుగు పట్టడం. (తె. 7, 18–26).

సజ్జ: పర్యా. పూలసజ్జ. దేవుని పూజకోసం పూలను తీసుకుపోయే లోహపుబుట్ట. (కో. 28–30).

సట్: చూ. పర్యా. బాస్కప్పు. గొడుగు మూసినపుడు పుల్లలను పట్టి ఉంచడానికి వాడే సాధనం. (తె. 25).

సట్పాన: (ఇం.) ఉ. సెట్పాన. చూ. పర్యా. రించి. నట్లు బిగించడానికి వాడే సాధనం. చూ. చిత్రం 197. (తె. 8, 12–15, 18).

సటి: చూ. పర్యా. పంచపాత్ర. దేవాలయాల్లో తీర్థానికి వాడే లోహపుపాత్ర. (తె. 4).

సటికె: చూ. సటికెం. (తె. 6).

సటికెం: ఉ. సటికం. రూ. సటికె, సడికెం, సతికెం. చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలో బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపు తిరిగిన సన్నని పొడవుకడ్డీ. (తె. 5, 6, 17–20, 21, 22, 23).

సట్టం: చూ. సట్రం[3]. (తె. 8, 9, 13, 21; రా. 10, 15).

సట్టుమూస: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని

బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (కో. 21).

స్రటు: చూ. చిట్టెం. (కో. 20).

స్రటం[1]: చూ. పర్యా. కాలువల్లోకి చెత్తాచెదారం వెళ్ళకుండ అడ్డంపెట్టడానికి వాడే రంధ్రాల బిళ్ళ చూ. చిత్రం 51. (కో. 20, 22).

స్రటం[2]: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగవంపు తిరిగిన సన్నని పొడవుకడ్డీ. (కో. 26)

స్రటం[3]: రూ. సట్టం. చూ. పర్యా. కట్టి. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి ఉపయోగపడే మోపు. (కో. 16, 13–20, 23; తె. 21).

సడికెం: చూ. సటికెం. (తె. 17).

సంటర్‌లివరు: (< ఇం. Center lever) తాళాల లివర్లను అమర్చడానికి తాళంకప్పలోపల మధ్య భాగాన ఉండే కడ్డీలాంటి పరికరం. (తె. 25).

సతారిచెంబు: చూ. సత్తారి చెంబు. (తె. 17; రా. 4).

సతారిలోటా: దోలు ఆకారంలో మధ్యభాగంలో క్రిందికి డిజైనుఉన్న పెద్దగ్లాసు. చూ. చిత్రం 211. (కో. 19; తె. 10, 11).

సతికెం: రూ. సత్తుకం. చూ. సటికెం. (తె. 25).

సత్తారిచెంబు: రూ. సతారిచెంబు. చూ. పర్యా. గుండుచెంబు. నీళ్ళుతాగడానికి, కాళ్ళు కడగడానికి వాడే బిందె ఆకారంతో చేసిన చిన్న లోహపుపాత్ర. చూ. చిత్రం 84. (తె. 8, 10).

సత్తు: చూ. పర్యా. జస్. ఇత్తడిపాత్రల కళాయి పనికి వాడే యాసిడ్‌తో కలిపే పదార్థం. (కో. 2, 26; రా. 5).

సత్తుకం: చూ. సతికెం. (కో. 16).

సత్తుగిన్నె: అన్నం తినడానికి ఉపయోగించే ఒక రకం లోహపుపాత్ర. (కో. 19).

సత్తురేకు: చూ. పర్యా. జస్. ఇత్తడిపాత్రల కళాయి పనికి వాడే యాసిడ్‌తో కలిపే పదార్థం. (తె. 4).

సత్తేలి: చూ. పర్యా. నూనెపాత్ర. నూనెలాంటి ద్రవ పదార్థాలు కొలవడానికి ఉపయోగించే స్టీల్‌పాత్ర. (తె. 10).

సత్రం: చూ. చట్రం. (కో. 16).

సదరకన్నుకరవాయి: బిందెలమట్టాలు పెట్టడానికి ఉపయోగించే మోపు. (కో. 16).

సదరకంటెలేగ: రూ. సదరగంటిలేగ, సదరుగంటు లేగ. పర్యా. సాప్‌లేగ. బిందె భుజాన్ని, అడుగు భాగాన్ని మెరుగుపట్టడానికి ఉపయోగించే పరికరం. (కో. 5).

సదరగంటిలేగ: చూ. సదరకంటెలేగ. (కో. 21–23, 29).

సదరపులేగ: చూ. సదరంలేగ. (కో. 28).

సదరం: చూ. పర్యా. చదరగన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగుపట్టడానికి వాడే పనిముట్టు. (కో. 27).

సదరంబిళ్ళ: చూ. పర్యా. కారు[1]. కాల్చిన ఇనప బద్దీలను సాపుచేయడానికి వాడే దిమ్మ. (రా. 16).

సదరంలేగ: ఉ. సదరంలాగు. రూ. సదరపులేగ. (కో. 21, 29).

సదరుకొట్టు: చూ. పర్యా. గాడికొట్టు. కట్టువేయడానికి వీలుగా రేకుపై పొడవునా బొడిపెకొట్టడం. (తె. 22).

సదరుగంటులేగ: చూ. సదరకంటెలేక. (కో. 28.)

సదిర: కరిగించిన లోహాన్ని ముద్దగా చేయడానికి కంచు తయారుపనిలో ఉపయోగించే ఇసుకదిమ్మ. ఇసుకలో గుంతలుచేసి ఉంటారు. (తె. 17).

సదురుకొను: (క్రి.) కొలిమిదగ్గరకి బొగ్గులన్ని కుప్పగా ఎగదోయడం. (తె. 22).

సద్దిగిన్నె: చూ. పర్యా. కడీడబ్బా. పొలందగ్గరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే పిడి, మూత ఉన్న పాత్ర. (తె. 14–16, 18; రా. 14, 15).

సద్దిడబ్బా: చూ. పర్యా. కడీడబ్బా. పొలందగ్గరకు అన్నం తీసుకెళ్ళడానికి వాడే పిడి, మూత ఉన్న పాత్ర. (తె. 12).

సనమాలుసుత్తి: అడుగుభాగం చదరంగా కొంచెం ఏటవాలుగ ఉండే సుత్తి. పూర్తయిన కంచుపాత్ర. వెనుకభాగాన కాట్లువేయడానికి వాడ్తారు. (తె. 17).

సన్నఆకరాయి: అద్దాల మొనలను సరిచేసే పరికరం. (తె. 1).

సన్నఇక్కిళం: చూ. పర్యా. గుబ్బకారు. చిన్నచిన్న వస్తువుల్ని పట్టుకోడానికి పనికివచ్చే పట్టకారు. మేకులు పీకడానికి, నట్లు తిప్పడానికి, సన్నకమ్మిని తెంచడానికి ఉపయోగం. (తె. 13).

సన్నకత్తెర: పర్యా. బోనస్. మూతిపళ్ళ కత్తెర. లోహపురేకులకు అతుకువేసే పల్లును వంచడానికి, కత్తిరించడానికి వాడే సాధనం. (తె. 12).

సన్నకన్నుసుత్తె: చూ. పర్యా. పలచనిసుత్తె. బిందె మూతులు, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 153. (తె. 3, 25).

సన్నకమ్మిగెడపార: రేకును వంచుకోడానికి వాడే

పనిముట్టు. (రా. 3).

సన్నకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 24).

సన్నగడార: పాతలోహపు వస్తువుల్ని పగులగొట్టడానికి వాడే సాధనం. (రా. 12).

సన్నపట్టుకార: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 4, 9; రా. 6).

సన్నపాటిసుత్తి: రేకులపై డిజైన్లను లావుగా వెడల్పుగా చేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం. (కో. 6).

సన్నపాన: చూ. పర్యా. గరుకురాయి[2]. మొద్దుబారిన లోహపు పనిముట్లను పదును పెట్టడానికివాడే రాయి. (తె. 23).

సన్నపోగరు: చూ. పర్యా. చిన్నపోగరు. లోహపు రేకులపై, కడ్డీలపై సన్నరంధ్రాలు కొట్టడానికి వాడే పనిముట్టు. (కో. 3, 4, 12, 15, 20, 23; తె. 17, 18; రా. 2, 4, 8).

సన్నమన్ను: చూ. పర్యా. జిగురుమట్టి. మోల్డింగ్ పనికి ఉపయోగించే మట్టి. (రా. 4).

సన్నముక్కుపోగరు: విగ్రహం ముక్కుభాగంలో చెక్కడానికి వాడే మొల. (కో. 6).

సన్నముట్టుకారు: చూ. పర్యా. జవకర. చిన్న చిన్న లోహపు వస్తువులను పట్టుకోడానికి, మరమ్మతు చేయడానికి వాడే పరికరం. (కో. 16).

సన్నమూతి పట్టుకార: చూ. పర్యా. జవకర. చిన్న చిన్న లోహపు వస్తువులను పట్టుకోడానికి, రిపేరి చేయడానికి వాడే పరికరం. (కో. 16; రా. 6).

సన్నరాతు: చూ. పర్యా. గరుకురాయి[2]. మొద్దుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడానికి వాడేరాయి. (తె. 4).

సన్నలేగ: చూ. పర్యా. అదురువాలేగ. పాలిష్ పాత్రలపై డిజైన్‌లు వేయడానికి వాడే పరికరం. (తె. 7).

సన్నవంపుపోగరు: విగ్రహంపనిలో సన్నని వంపు తావుల్లో చెక్కడానికి వాడేమొల. (కో. 6).

సన్నశానం: చూ. సన్నషావణం. చూ. పర్యా. చదరపుపంచు. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (తె. 19).

సన్నషావణం: చూ. సన్నశానం. (తె. 24).

సన్నసుత్తి: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను వంపుచేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 17).

సన్నం: లోహంలో చిట్టులకు ఉపయోగించే మెటల్ పొడి. ఇది నల్లగా ఉంటుంది. (రా. 2).

సన్నాయికట్టి : గల్లలుపంచడానికి ఉపయోగించే కొయ్యపనిముట్టు. (కో. 19).

సందాలం: ఇనుపకడ్డీలను గుండ్రంగా చేసేటప్పుడు ఉపయోగించే సాధనం. ఇది పొడవుగా '7' లాగ ఉండి భూమిలో పాతి ఉంటుంది. (రా. 14).

సందు: చూ. పర్యా. కన్నం. బిందెకు ఏర్పడే రంధ్రం. (రా. 3).

సందు అతుకు: బిందెకున్న జాయింటు. (కో. 29).

సందుభాగం: బిందె మధ్యరేకు. (కో. 29).

సందెన: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి ఉపయోగపడే మోపు. (తె. 8, 9).

సంధ్యావనంసెట్టు: చూ. పర్యా. పూజసెట్టు. పంచపాత్ర, ఉద్ధరణి, అరివేణి (రాగిపళ్ళెం) - వీటి మొత్తంపేరు. చూ. చిత్రం 160. (తె. 4).

సపటాసుత్తి: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను వంపుచేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 4, 9).

సపాయిచేయు: చూ. పర్యా. నున్నచేయు[3]. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడం. (రా. 7).

సపోర్టర్‌పీసు: (ఇం.) ఇనుపపట్టీలను వంపుచేయడానికి వెల్డింగ్‌పనిలో వాడే దిమ్మ. చూ. చిత్రం. (తె. 19).

సపోర్టుజాకి: (ఇం.) లారీస్ప్రింగ్లు పెరకడానికి వాడే పరికరం. (రా. 4).

సప్టదిమ్మ: చూ. పర్యా. అడగోలు. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే దిమ్మ. (కో. 28).

సప్టబళ: చూ. పర్యా. మెరుగుబళ. తట్టల్ని మెరుగేయడానికి వాడే పరికరం. (రా. 13).

సప్టాకంట్రానీ: కంచాలను మెరుగుపరచడానికి వాడే పరికరం. (కో. 15).

సప్తకొట్టు: (క్రి.) బాడీభాగాలు ఊడిరాకుండ గట్టిగ బిగించి కొట్టడం. (తె. 21).

సప్పతట్టు: (క్రి.) మల్‌కట్ వేసినతర్వాత పక్కభాగాల్ని అణగ్గొట్టడం. (కో. 26; తె. 21).

సప్పె: టంకుపెట్టె పొడవునా కొట్టినగీత. (రా. 12)

సబ్బుపెట్టె: పర్యా. సోపుబాక్సు. సబ్బు పెట్టుకోడానికి వాడే స్టీలుపెట్టె. చూ. చిత్రం 212. (తె. 3, 14, 15, 20).

సబ్లి: (ఉర్దూ.) పర్యా. సువ్వ. రేకులను వంచడానికి టిన్‌గార్ పనిలో వాడే పరికరం. పొడవుగా లావుగ ఉండి తలభాగం వెనక్కి వంగి ఉంటుంది. (తె. 17, 21).

సమయు: (క్రి.) బండిచక్రానికున్న పట్టాలు అరిగి పోవడం. (రా. 13).

సమాయ్: (మరాఠీ.) రూ. సమయ్యా. చూ. పర్యా. కంచార్తి. దీపం వెలిగించడానికి వాడే లోహపు పరికరం. (తె. 4).

సమిటి: ఉ. సమ్మి. చూ. సమ్మెట. (కో. 19, 24, 25, 30; తె. 24; రా. 15).

సమిటిసుత్తి: చూ. సమ్మెటసుత్తి. (రా. 5).

సమిసిపోవు: (క్రి.) పనిముట్లు అరిగిపోవడం లేదా మొద్దుబారడం. (తె. 1).

సమ్మిటివేయు: (క్రి.) చూ. పర్యా. పరిగేయు. కమ్మెటతో కాల్చిన ఇనుమును కావలసిన రీతిలో సాగ్గొట్టడం. (కో. 19, 25).

సమ్మెట: (బ.) సమ్మిట్లు, సమ్మెట్లు. ఉ. సమ్మిట, సమ్మిటి, సమ్మెటి. రూ. సమిటి, సమ్మెటిక; సంపెట. పర్యా. డబుల్‌సుత్తి, దెక్కసమ్మెట, దింపుడుసుత్తి, పట్టాసుత్తి, పెద్దసుత్తె, పౌనుసుత్తి, సమ్మెటసుత్తి. లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్ట డానికి సాగగొట్టడానికి, పాత్రల నొక్కులు తీయ డానికి, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 1, 4, 5, 8-11, 14-30; తె. 6-12, 15, 16, 19, 21-25; రా. 3-16).

సమ్మెటసుత్తి: రూ. సమిటిసుత్తి. చూ. పర్యా. సమ్మెట. బీగాలను పగులగొట్టడానికి వాడే పెద్ద సైజుసుత్తె. (కో. 18).

సమ్మెటేయు: (క్రి.) పర్యా. దెబ్బవేయు, దెబ్బకొట్టు, బాదు[2]. కాగిన ఇనుమును సాగగొట్టడానికి సమ్మిటితో కొట్టడం. (కో. 26).

సంపు: టిన్, హైడ్రోక్లోరిక్‌ల మీద జింక్‌క్లోరైడ్ వేసి శక్తి (Power) చచ్చిపోయేటట్లు చేయడం. (కో. 19).

సంపుష్టిని: చూ. పర్యా. అరివేణి పంచపాత్ర కింద పెట్టడానికి వాడే పళ్లెంలాంటి పాత్ర. (తె. 13).

సంపెట: రూ. సంబెట, సంబెడ. చూ. సమిటి. (తె. 18; రా. 15, 16).

సంపెడ: చూ. సంపెట. (తె. 1).

సంబెట: చూ. సంపెట. (తె. 18).

సరచ్చు: చూ. పర్యా. గమ్ము. సూట్‌కేసు తయారీలో ఉపయోగించే బంకపదార్థం. (తె. 8, 9).

సరవ: ఉ. సరవా, సర్వా, సెరవ, సెర్వా. చూ. పర్యా. దేక్షా. వంటచేయడానికి వాడే పాత్ర. చూ. చిత్రం 123. (తె. 1-8, 12, 15, 18-25; రా. 12-15).

సరాటు: చూ. సరాతం. (తె. 13).

సరాతం: రూ. సరాట. చూ. పర్యా. అట్లకర్ర, దోసెలు, రొట్టెలు పెనంపైనుండి తీయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 5, (తె. 8-18).

సరిగోలు: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (కో. 1; (రా. 6).

సరిగోలుకమ్మి: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమి లోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (రా. 2).

సరిచేయు: (క్రి.) మెట్నకుప్రేము మూలలు 90° ఉండేటట్లు కచ్చితంగ చేయడం. (తె. 5).

సరిపిచ్చు: (క్రి.) చూ. పర్యా. కూచోబెట్టు. పాత్రల ఆకారాన్ని తయారుచేయడానికి కొలతప్రకారం డిజైను కడ్డీలను అమర్చడం. (కో. 23).

సరిపించు: (క్రి.) చూ. పర్యా. నాటంవేయు. లోహపు రేకును పాత్ర ఆకారంగా తయారుచేయడం.

సరిపింపు మట్నసుత్తె: ఇడ్లీ పాత్రను సాప్ చేయ డానికి, ఇడ్లీ పాత్రపై గీతలు గీయడానికి ఉప యోగించే పనిముట్టు. (కో. 10, 12).

సరిపెట్టు: (క్రి.) లోహపుముక్కల్ని డిజైనుగ సుత్తితో వంచడం. (కో. 17).

సరుకు[1]: చూ. పర్యా. బోకు. పనికిరాని పాతలోహపు పాత్రలు. (కో. 26).

సరుకు[2]: చూ. పర్యా. తెరాయి. మూసలో కరిగిన లోహం. (కో. 4, 10, 24; రా. 5).

సరుకోలుకడ్డీ: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (తె. 19).

సరుసు: (క్రి.) పర్యా. ఆయుధం ఏయు, ఆయుధం కొట్టు, ఆయుధంచేయు, చప్పగతట్టు, తెగవాయి ఏయు, తేజ్‌చేయు, తేజ్‌వచ్చు, దారు ఏయు, దారుపట్టు, పలచగ

కొట్టు, పాయింట్ చేయు, మొనబెట్టు, వాడిపెట్టు, వాయిపేయు, వాటుతీయు. వాయిదరకొట్టు, వాయిపెట్టు, వాయువొచ్చు, సాఁచేయు, సాగ్గొట్టిన తర్వాత పదునుపెట్టడానికి వీలుగా పనిముట్ల అంచుల్ని ఏటవాలుగ, పల్చగ అవరగొట్టడం. (కో. 18-20, 25, 27; తె. 7, 18, 20-25; రా. 16).

సరోత: లోహపుపట్టీలను వంచడానికి వాడే సాధనం. ఒకదిమ్మపై రెండు చిన్న కడ్డీలను ఎదురెదురుగ అమర్చి ఉంటారు. వీటి మధ్యలో పట్టినిపెట్టి వంచుతారు. (తె. 1).

సర్క్రిటు: (ఇం.) జీనంచేయడానికి ఉపయోగించే గుండ్రనిరేకు. (కో. 24).

సర్క్రిల్ తీయు: (క్రి.) (< ఇం. Circle + తీయు) అడుగుభాగాన్ని చేయడానికి లోహపురేకును గుండ్రంగా కత్తరించడం. (కో. 18).

సర్క్రిల్ బిళ్ళ: ఉ. సరికిల్‌బిళ్ళ. చూ. పర్యా. అడుగు. ఇత్తడి, ఇనుపపాత్రల అడుగు భాగపు రేకు. (కో. 1, 2, 5, 13, తె. 7, 18, 22; రా. 2, 6, 8, 9).

సర్క్రిలు: (ఇం.) ఉ. సర్కులు. గుండ్రని అల్యూమినియంరేకు. ఈ రేకును నుండి అల్యూమినియం పాత్రలు తయారుచేస్తారు. (కో. 2, 13).

సద్దు¹: (క్రి.) చూ. పర్యా. సున్నచేయు³. కాల్చిన ఇనుపబద్దను వంపులు లేకుండ సమంగ చేయడం. (కో. 19).

సద్దు²: (క్రి.) టంకంను అతుకుమీద వచ్చేటట్లు చేయడం. (కో. 30).

సద్దుకొను: (క్రి.) బొగ్గులేసేటప్పుడు మూసపై పడకుండ ప్రక్కలకు సరిచేయడం. (కో. 17).

సద్దుబాటుచేయు: (క్రి.) పాతబిందెలకు నొక్కులు తీయడం. (రా. 10).

సర్వం: గరగ. అరివేణి లేకుండా పెండ్లిచేసే వాళ్ళు వాడే రంగుపాత్ర. పొట్టభాగానికి అతికించి ఉండే ఇత్తడి సర్వపురేకు. (కో. 20).

సర్ఫు: (ఇం.) అల్యూమినియం పాత్రను శుభ్రపరిచే పదార్థం. (రా. 8).

సర్వాంగం: చూ. పర్యా. కవచం. దేవుని విగ్రహానికి ముఖం తప్పించి మిగతా శరీర భాగమంతటికీ వేసిన లోహపువస్త్రం. (కో. 12).

సర్వీసు: (ఇం.) చూ. పర్యా. జాజు. రాగిపాత్రలపై పూతగ వాడే ఎర్రనిరంగు పదార్థం. (కో. 2, 21).

సలాక¹: ఉ. సలాకి, సలాకు, సెలాకి. రూ. చలాక. దోసెలు, రొట్టెలు మొదలయినవి పెనుం పైనుంచి తీయడానికి, తిరగదిప్పడానికి వాడే కొసభాగం చదరంగా ఉన్న కమ్మిలాంటి పరికరం. (తె. 1-3, 23, 25; రా. 6, 12-15).

సలాక²: చూ. పర్యా. బొద్దు¹. ఇనుప వస్తువులకు బొద్దుకొట్టడానికి వాడే కమ్మిలాంటి పనిముట్టు. చూ. చిత్రం 213. (తె. 10, 11).

సలాక³: ఉ. సలాకు. చూ. పర్యా. కడ్డీ¹. ఇత్తడి పాత్రలను రవ్వతో అతకడానికి వాడేకడ్డీ. (తె. 1, 19, 20, 25).

సలాక⁴: చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటికర్ర. (తె. 17).

సలాక⁵: డబ్బా రేకులను గొట్టాలుగా చేయడానికి వాడే గుండ్రని పొడవైన లావుపాటి ఇనపకడ్డీ. (తె. 17).

సలాక⁶: సానచక్రం తిరిగేటప్పుడు పట్ట జరిగిపోకుండ ఆధారంగా ఉంచే చిన్నకడ్డీ. (తె. 18).

సలాక⁷: బీరువాబీగం పడడానికి తలుపులోపల ఉండే పొడవుపాటి కడ్డీ¹. (తె. 17).

సలాక⁸: ఉ. సలాకా. వస్తువులు వంచుకోడానికి ఉపయోగించే కమ్మి. ముందు, వెనక భాగాల్లో వంగి ఉంటుంది. (తె. 8).

సలికరేకు: చూ. పర్యా. పారరేకు. పార తయారు చేయడానికి ఉపయోగించే దీర్ఘచతురస్రాకారపు ఇనుపప్లేటు. (తె. 1).

సలికె: చూ. పర్యా. పార. మట్టి తవ్వడానికి ఉపయోగించే పరికరం. చూ. చిత్రం 156. (తె. 4).

సలువు: గొడ్డలివాయి భాగం. (తె. 23).

సల్ఫర్: (< ఇం. Sulphur). ఉ. శిలపర్, షలరు. చూ. పర్యా. ఆసిడ్. విగ్రహాలను మెరుగుపరిచే పదార్థం. (కో. 3, 10, 26).

సల్ఫిటిక్ ఆసిడ్: (ఇం.) చూ. పర్యా. సల్ఫ్యూరిక్ ఆసిడ్. విగ్రహాన్ని శుభ్రపరచడానికి వాడే ద్రవ పదార్థం. (కో. 6).

సల్ఫ్యూరిక్ ఆసిడ్: (ఇం.) పర్యా. సల్ఫిటిక్‌ఆసిడ్. పోతపోసిన విగ్రహాన్ని కడిగేందుకు ఉపయోగించే ద్రవం. (తె. 17).

సవక: చూ. పర్యా. పాలగరిటె. చిన్నపిల్లలకు పాలు పట్టడానికి వాడే ఉగ్గుగంటెలు. (కో. 48).

సాకెట్టు¹: (ఇం.) బర్నర్ గొట్టానికి, కిరసనాయిల్ టాంకును కలిపే గొట్టం. (కో. 28).

సాకెట్టు: (ఇం.) డ్రిల్ బిట్‌లను మార్చడానికి వాడే

పనిముట్టు. స్టైబర్నర్ మంటను అదుపులో ఉంచడానికి కూడా ఉపయోగం. (తె. 1, 21).

సాగతీయు: (క్రి.) రూ. సాగదీయు. చూ. పర్యా. పరిగేయు. కాల్చిన లోహపు కడ్డీలను సమ్మెటతో కావలసిన రీతిలో సాగ్గొట్టడం. (రా. 7).

సాగదీయు: (క్రి.) చూ. సాగతీయు. (తె. 17; రా. 16).

సాగపట్టు: (క్రి.) చూ. సాగబెట్టు. (తె. 6).

సాగబీకు: (క్రి.) చూ. పర్యా. పరిగేయు. కాల్చిన ఇనుపకడ్డీలను సమ్మెటతో సాగ్గొట్టడం. (రా. 12).

సాగబెట్టు: (క్రి.) ఉ. సాగబట్టు. రూ. సాగపట్టు. చూ. పర్యా. పరిగేయు. కాల్చిన లోహపు కడ్డీలను సమ్మెటతో కావలసిన రీతిలో సాగ్గొట్టడం. (తె. 18, 21, 22, 23, 25).

సాగించు: (క్రి.) చూ. పర్యా. పరిగేయు. కాల్చిన లోహపురేకులను, కడ్డీలను సమ్మెటతో కావలసిన రీతిలో సాగ్గొట్టడం. (తె. 1, 17, 18, 29).

సాచేయు: (క్రి.) రూ. పర్యా. పరిగేయు. కాల్చిన లోహపురేకులను, కడ్డీలను సమ్మెటతో కావలసిన రీతిలో సాగ్గొట్టడం. (తె. 3, 5).

సాగొట్టు: (క్రి.) చూ. సాగ్గొట్టు. (కో. 26; తె. 2; రా. 10).

సాగ్గొట్టు: రూ. సాగొట్టు. చూ. పర్యా. పరిగేయు. కాల్చిన లోహపురేకులను, కడ్డీలను సమ్మెటతో కావలసిన రీతిలో కొట్టడం. (కో. 1, 19, 21, 23, 25, 28, 30; తె. 1, 4, 19).

సాంగిరిలోట: నీళ్ళు, కాఫీ తాగడానికి ఉపయోగించే చిన్నగ్లాసు. (తె. 10).

సాంగ్లి: అడుగుభాగం చదరంగా ఉండేపాత్ర. నీళ్ళు తాగడానికి ఉపయోగం. (రా. 14).

సాంచ[1]: చూ. పర్యా. పాటన్. ఇనపబద్దలతో డిజైన్లు చేయడానికి వాడే అచ్చుదిమ్మ. (తె. 1, 3, 17).

సాంచ[2]: ఉ. సాచ. చూ. పర్యా. గటంచి. లోహపు రేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే పరికరం. (తె. 1).

సాంచ[3]: దొప్పగ ఉండే కత్తెరభాగం. (రా. 15).

సాటర్‌పని: చూ. సాల్డ్రింగ్‌పని (తె. 23).

సాటరింగు: (ఇం.) చూ. సాల్డ్రింగు. (తె. 3).

సాటరింగ్‌పని: చూ. సాడరింగ్‌పని. (తె. 3).

సాటరు: (ఇం.) చూ. సాల్డరను. (తె. 12).

సాటాకొట్టు: (క్రి.) కాల్చి పూర్తిచేసిన బిందెపై వంకర్లులేకుండ సాపుచేసి చుక్కలు కొట్టడం. (కో. 25).

సాటు: (క్రి.) చూ. పర్యా. చుక్కకొట్టు. పూర్తిగ అతికిన తర్వాత బిందెపై వంకర్లులేకుండ నున్నగ సాపుచేసి మెరుగు చుక్కలు కొట్టడం. (తె. 23).

సాటుచేయు: (క్రి.) చూ. సాటేయు. (తె. 4).

సాటేయు: (క్రి.) రూ. సాటుచేయు. చూ. పర్యా. పదును. పదునుపెట్టడానికివీలుగా పనిముట్ల అంచుల్ని ఏటవాలుగ, పల్చగ తయారుచేయడం. (తె. 6, 7, 19, 22).

సాడర్‌చేయు: (క్రి.) చూ. పర్యా. మాట్లేయు. రెండు లోహపురేకులను జాయింట్‌చేయడం, అతికించడం. (తె. 4, 6, 17).

సాడరింగ్‌పని: రూ. సాటరింగ్‌పని. చూ. సాల్డ్రింగ్ పని. (తె. 22).

సాడరు: చూ. సాల్డ్రింగు. (తె. 4, 5; రా. 15).

సాడ్చి: (హిం.) చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమివద్దర వాడే పనిముట్టు. (తె. 4, 25).

సాదా అండా: (హిం.) చూ. పర్యా. అండా[1]. సాధారణంగా అన్నం చేసుకొనే పాత్ర. చూ. చిత్రం 8. (కో. 1).

సాదా ఇరుసుకరవాయి: చూ. పర్యా. కరవాయి. లోహపు పాత్రలను సాపుచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 2).

సాదాకరవాయి: చూ. పర్యా. కరవాయి. లోహపు పాత్రలను సాపుచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 2, 8; రా. 2).

సాదాకంచం: చూ. పర్యా. కంచం. బీడింగులేకుండా సాదాగాఉండే భోజనం ప్లేటు. చూ. చిత్రం 214. (కో. 4, 11, 12, 13).

సాదా కాడ: చూ. పర్యా. అట్లకర్ర. దోసెలు, రొట్టెలు పెనంపైనుండి తీయడానికి ఉపయోగించే సాధనం. చూ. చిత్రం 5. (కో. 13, 15).

సాదా కారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమివద్దర వాడే పనిముట్టు. (కో. 4).

సాదాకిస్తి: చూ. పర్యా. పరాతం. అన్నం అరబోసుకోడానికి వాడే వెడల్పు పళ్లెం. చూ. చిత్రం 150. (తె. 8, 9).

సాదాకుంకుమభరిణి: చూ. పర్యా. కుంకుమకాయ. కుంకుమ పోసుకోడానికి ఉపయోగించే స్టీల్ కప్పు గిన్నె. దీనికి మూత ఉంటుంది. చూ. చిత్రం 56.

(కో. 5, 6).

సాదాక్యాను: ద్రవపదార్థాలు పోసుకోడానికి వాడే పాత్ర. పట్టుకోడానికి పొడుగుపాటి కమ్మి, పై మూత, తాళంవేయడానికి గొళ్ళెం ఉంటాయి. చూ. చిత్రం 157. (కో. 15).

సాదాగరిట: చూ. పర్యా. కూరగరిటె¹. కూరలు వడ్డించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63. (కో. 6).

సాదాగిన్నె: చూ. పర్యా. కూరగిన్నె. కూరలు వండడానికి, వేసుకోడానికి వాడే లోహపు పాత్ర. చూ. చిత్రం 64. (తె. 8, 9, 14, 16).

సాదాగ్లాసు: చూ. పర్యా. గ్లాసు¹. సాదాగా ఆదోగ్గా ఉండే అంచులేని లోటా. నీళ్ళు తాగడానికి ఉపయోగం. చూ. చిత్రం 215. (కో. 1-3, 5-7, 11-13, 20).

సాదాటిఫిన్: చూ. పర్యా. టిఫెన్ ప్లేటు. టిఫిన్ తినడానికి ఉపయోగపడే స్టీలు ప్లేటు. (కో. 6, 11).

సాదాట్రే: ఏదైన తినుబండారాలు పెట్టుకోడానికి వాడే ప్లేటు. (కో. 13).

సాదాపట్టుకారు: ఉ. సాదాపట్టకార. చూ.పర్యా. అతికే కారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పరికరం. (కో. 5, 7 9; రా. 6, 8, 11).

సాదాపళ్లెం: చూ. పర్యా. పరాతం. అన్నం ఆర బోసుకోడానికి వాడే ప్లేటు. చూ. చిత్రం 150. తె. 8, 9).

సాదాప్లేటు: చూ. పర్యా. పరాతం. అన్నం ఆర బోసుకోడానికి వాడే వెడల్పు పళ్ళెం. చూ. చిత్రం 150. (కో. 2, 5, 8, 10, 11, 13, 15, 18).

సాదాబకెట్స్: చూ. సాదాబకెట్లు. (కో. 8).

సాదాబక్కెట్లు: రూ. సాదాబకెట్స్. చూ. పర్యా. బకెటు. నూతిలోంచి నీళ్ళు చేదడానికి, నీళ్ళు నిల్వ ఉంచడానికి వాడే సాధనం. (కో. 1).

సాదాలోటా: చూ. పర్యా. గ్లాసు¹. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215. (కో. 2, 10, 11; తె. 15, 16).

సాదాసుత్తి: చూ. పర్యా. చిన్నకటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను బెండ్ చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికివాడే పనిముట్టు. (తె.10,11).

సాధారణగ్లాసు: చూ. పర్యా. గ్లాసు¹. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 215. (కో. 10).

సాధారణపాలు: చూ. పర్యా. కూరగిన్నె. కూరలు వండడానికి, వేసుకోడానికి వాడే లోహపు పాత్ర. చూ. చిత్రం 64. (తె. 8, 9).

సాన¹: చూ. పర్యా. గరుకురాయి¹. వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడే రాయి. (రా. 2).

సాన²: ఉ. సౌన. చూ. పర్యా. గరుకురాయి². మొద్దుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడానికి వాడే రాయి. (తె. 3; రా. 11).

సాన³: పర్యా. సానమిషను. కత్తులు, కొడవళ్ళు పదునుపెట్టడానికి ఉపయోగించే పరికరం. (కో. 15).

సానచేయు: (క్రి.) చూ. పర్యా. ఏట్లుఏయు. తయారయిన లోహపు పాత్రను మెరుగుపరచడం. (కో. 2).

సానబట్టు: (క్రి.) చూ. పర్యా. ఏట్లుఏయు. పూర్తయిన లోహపు పాత్రను మెరుగుపట్టడం. (రా. 5).

సానమిషను: చూ. పర్యా. సాన³. కత్తులు, కొడవళ్లు పదునుపెట్టడానికి ఉపయోగించే మిషను. (రా. 15).

సానరాయి¹: చూ. పర్యా. గరుకురాయి¹. వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడే రాయి. (కో. 4, 9, 11; తె. 4, 20; రా. 5, 6, 9, 11).

సానరాయి²: రూ. సానంరాయి. చూ. పర్యా. గరుకురాయి². మొద్దుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడానికి వాడే రాయి. (కో. 23; తె. 2; రా. 1, 7, 10-12).

సానరాయికేబుల్: చూ. పర్యా. గరుకురాయి¹. వెల్డింగ్ అతుకులను శుభ్రం చెయ్యడానికి వాడే రాయి (రా. 2).

సానరౌతు: చూ. పర్యా. గరుకురాయి². మొద్దుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడానికి వాడే రాయి. (తె. 18).

సానంరాయి: చూ. సానరాయి². (రా. 14).

సాప్‌చేతిసుత్తి: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను బెండ్ చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 5).

సాప్‌పోగరు: విగ్రహం రేకుల్ని చదరం చేసుకొనే పరికరం. (కో. 8).

సాప్‌బొద్దు: చూ. పర్యా. కారు¹. కాల్చిన ఇనప బద్దలను సాపుచేయడానికి వాడే దిమ్మ. చూ. చిత్రం.

సాపచ్చు: చూ. పర్యా. కారు¹. కాల్చిన ఇనపబద్దలను సాపుచేయడానికి వాడే దిమ్మ. (కో. 14, 18;

తె. 19).

సాపింగ్‌చేయు: (క్రి.) చూ. పర్యా. నున్నచేయు³. లోహపు రేకును చదరం చేయడం. (కో. 3).

సాపుకమ్మి: చూ. పర్యా. చదర గన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగుపట్టడానికి వాడే పనిముట్టు. (కో. 20, 26).

సాపుకరవాయి: చూ. పర్యా. కరవాయి. లోహపు పాత్రలను సాపుచేయడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 24; తె. 8).

సాపుకాయితం: చూ. పర్యా. ఎమరిపేపరు. అల్యూమినియం. పాత్ర పూర్తిగ నునుపు, మెరుగు రావడానికి ఉపయోగించే నున్నటి గరుకుకాగితం. (కో. 20).

సాపుకారు: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడి లోహపువస్తువుల్ని పట్టుకోడానికి కొలిమిదగ్గర వాడే పనిముట్టు. (కో. 6, 11, 24).

సాపుగ్లాసు: పలకలులేని నీళ్ళలోటా. (కో. 24).

సాపుచేయు: చూ. పర్యా. నున్నచేయు³. లోహపు రేకులను, కడ్డీలను చదరం చేయడం. (కో. 2, 4-6, 8, 10, 23, 24).

సాపుటప్ప: చూ. పర్యా. పక్కమిరియం. లోహపు రేకులను, కడ్డీలను వంచుకోడానికి, సాపుచేయడానికి వాడేదిమ్మ. (కో. 11).

సాపుతీయు: (క్రి.) సుత్తితో పోతపాత్ర అడుగు భాగాన్ని సాపుచేయడం. (కో. 21).

సాపుదిమ్మె: చూ. పర్యా. కారు¹. కాల్చిన ఇనబద్దీలను సాపుచేయడానికి వాడేదిమ్మ. (కో. 20).

సాపుదుక్క: ఇడ్లీ పాత్రల తయారీలో రేకులకు గుంటలు కొట్టడానికి వాడే పరికరం. (కో. 10, 12).

సాపుపట్టు: (క్రి.) చూ. పర్యా. నున్నచేయు³. లోహపురేకులను, కడ్డీలను సదరం చేయడం. (కో. 16).

సాపుమట్టం: ఉ. సాప్‌మట్టం. చూ. పర్యా. కారు¹. కాల్చిన ఇనపబద్దలను సాపుచేయడానికి వాడేదిమ్మ. (తె. 22-24).

సాపుమట్టం పట్టిడి: చూ. పర్యా. సాపప్పట్టిడ. కంచాలప్లేటు మట్టంగా, సాపుగా నిలబెట్టడానికి వాడే పరికరం. (కో. 24).

సాపుమోపు: (క్రి.) చూ. పర్యా. నున్నచేయు³. మెరుగు పెట్టేముందు విగ్రహంపై కతుకులు లేకుండా శుభ్రంగా నున్నగా చేయడం. (కో. 18).

సాపులేగ: ఉ. సాప్‌లేగ. రూ. సాఫ్‌లేగ. లోహపు పాత్రలను మెరుగు పెట్టడానికి వాడే పనిముట్టు. (కో. 4, 6, 8-10, 12, 21, 22, 24; తె. 1, 4, 22).

సాపుసదరం: చూ. పర్యా. చదరగన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగు పట్టడానికి వాడే పనిముట్టు. (కో. 26).

సాపుసుత్తి: ఉ. సాప్‌సుత్తి. చూ. పర్యా. మెరకసుత్తి. కంచాలు, గిన్నెలు మొదలయినవి. సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 15-20, 24, 29; రా. 5).

సాప్టకరవాయి: విగ్రహాన్ని చదరం చేయడానికి వాడే పరికరం. (కో. 6).

సాప్టింగు: (< ఇం. Softing) చూ. పర్యా. ఉప్పెపేలు. సానరాయి తిరగడానికి చక్రాన్ని కాలితో తొక్కడానికి అమర్చిన సాధనం. (రా. 16).

సాప్పు: బిందె ఆకారాన్ని శుద్ధంగా కొట్టే పరికరం. (కో. 6).

సాప్పట్టిడ: పర్యా. సాపుమట్టం పట్టిడి. కంచాల ప్లేటు మట్టంగా సాపుగా నిలబెట్టడానికి వాడే పరికరం. (కో. 19, 29).

సాఫ్‌లేగ: చూ. సాపులేగ. (తె. 3).

సాంబార్‌పాట్: చూ. పర్యా. గోకర్ణం. సాంబార్ వడ్డించడానికి వాడే పైభాగాన గాడిరేకు అమర్చిన పాత్ర. చూ. చిత్రం 92. (తె. 4).

సాంబారుప్లేటు: సాంబారు వేయడానికి వాడే వెడల్పుగ లోతు తక్కువగా ఉండేపళ్లెం. (కో. 17).

సాంబాళం: చూ. తాంబాళం. (తె. 1).

సాంబ్రాణిహార్తి: చూ. పర్యా. ధూపకం. సాంబ్రాణి హారతివ్వడానికి వాడే పరికరం. (కో. 7).

సాయిపోగరు: ఇరుసుకోపులు తొలేయడానికి ఉపయోగించే పనిముట్టు. పొడవుగా అడుగు సన్నగా, చదరంగా ఉంటుంది. (తె. 23).

సాయిమేకు: బండిచక్రం బయటికి రాకుండ ఉండడానికి వాడే ఇరుసుమొవల్లో ఉండే చీల. (తె. 21).

సాల్ట్‌డబ్బా: (< ఇం.Salt + డబ్బా). ఉప్పు ఉంచుకోడానికి వాడే డబ్బా. (తె. 8, 13).

సాల్ట్‌స్పూన్: (ఇం.) ఉప్పు వేసుకోడానికి ఉపయోగించే గరిట. (కో. 6).

సాల్టర్‌పని: చూ. సాల్డ్రింగు పని. (తె. 21).

సాల్టరింగు: (ఇం.) చూ. సాల్డ్రింగు. (రా. 10).

సాల్డన్ ఐరను: (ఇం.) చూ. పర్యా. ఇనుపకారు. సాల్డరింగు చేయడానికి ఉపయోగించే ఇనుపకమ్మి. (తె. 11).

సాల్డరను: రూ. సాటరు. చూ. పర్యా. ఇనుపకారు. సాల్డరింగు చేయడానికి ఉపయోగించే ఇనుపకమ్మి. (తె. 11).

సాల్డ్రింగ్ ఐరన్‌రాడు: (ఇం.) చూ. పర్యా. ఇనుపకారు. సాల్డ్రింగు చేయడానికి వాడే ఇనుపకమ్మి పరికరం. (కో. 14).

సాల్రింగ్‌కడ్డి: (ఇం.) రూ. సోల్రింగుకడ్డి. చూ. సాల్డ్రింగుకడ్డి. (తె. 21).

సాల్డ్రింగ్‌కడ్డీ: రూ. సాల్రింగుకడ్డి. చూ. పర్యా. ఇనుపకారు. సాల్డ్రింగు చేయడానికి వాడే ఇనుపకమ్మి పరికరం. (కో. 15; రా. 7. 8)

సాల్డ్రింగ్‌కమ్మి: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డ్రింగు చేయడానికి వాడే ఇనుపకమ్మి పరికరం. (రా. 3).

సాల్డ్రింగ్‌డాకిలి: చూ. పర్యా. డాకిలి. ఇనపవస్తువులు తయారుచేయడానికి వాడే ఇనపకడ్డి. (రా. 6).

సాల్రింగ్‌పని: చూ. సాల్డ్రింగుపని. (తె. 21; రా. 2-4, 7).

సాల్డ్రింగ్‌పని: రూ. సాటర్‌పని; సాడరింగుపని. సాల్టర్‌పని, సాల్రింగుపని. చూ. పర్యా. చీప్ మెటల్‌వర్కు. లోహపు పాత్రలు రిపేరుచేసే పని. (కో. 2, 3, 12, 15).

సాల్డ్రింగు: (ఇం.) రూ. సాటరింగు, సాడరు సాల్టరింగు, సోల్రింగు. చూ. పర్యా. చీప్ మెటల్‌వర్కు. లోహపుపాత్రలు రిపేరుచేసే పని. (కో. 28; రా. 6).

సాస్‌పాను: చూ. వాస్‌పాను. (కో. 17, 22, 23, 28-30; తె. 4-6, 17, 18, 22; రా. 8).

సాస్‌పిన్ను: ఉ. సాస్‌పిను. చూ. పర్యా. కాడగిన్నె. కాఫీ, టీ తయారుచేయడానికి వాడే పొడవుపాటి కాడ ఉన్న పాత్ర. (రా. 7).

సాహెబ్‌ప్లేటు: (< సాహెబ్ + ఇం. Plate). పర్యా. సూపుప్లేటు. మహమ్మదీయులు అన్నం తినడానికి వాడే ప్లేటు. (కో. 12).

సి. ఆర్. గేజిసీటు: (ఇం.) ట్రంకుపెట్టె తయారు చేయడానికి వాడే రేకు. (కో. 13).

సీకుర్రు: నాగలి నక్కు ఊడిరాకుండ బిగించే కొక్కెం. (కో. 29).

సిగర్‌లైటు: (ఇం.) సిగరెట్ వెలిగించుకోడానికి వాడే సాధనం. (కో. 21).

సిగ్నల్‌కొట్టు: (క్రి.) (< ఇం. Signal + కొట్టు) పర్యా. సెంటర్‌కొట్టు. రంధ్రాలు చేయడానికి ముందు రేకుపై పోగరుతో గుర్తులుపెట్టడం. (తె. 17).

సింగిల్‌కత్తి: (< ఇం. Single + కడ్డి) సాధారణ ఛత్రిపుల్ల. (తె. 1).

సింగార: సేవింగుమిషన్ పెట్టుకోడానికి ఉపయోగించే చిన్న ఇనుప పెట్టె. (తె. 10, 11).

సింగిల్‌పంచింగ్: (ఇం.) కొన్ని కాగితాలకు ఒకే రంధ్రాన్ని వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 216 (రా. 3, 9, 11).

సిచ్చు: రూ. చిచ్చు, సుచ్చు. టార్చిలైటును వెలిగించడానికి, ఆర్పేయడానికి ఉపయోగించే బాటరీల గొట్టంపై ఉన్న పరికరం. (తె. 24).

సిజర్‌మిషను: (ఇం.) మెడదగ్గర వెంట్రుకలులేకుండ శుభ్రంచేయడానికి మంగలిషాపులో ఉపయోగించే సాధనం. (తె. 21).

సిజర్‌లైట్‌కమ్మి: చూ. పర్యా. టన్నెల్‌స్క్రూ. సిజర్ లైట్లు ఊడదీయడానికి వాడే పరికరం. చూ. చిత్రం 219. (కో. 2).

సిజర్‌షార్పింగ్‌పని: చూ. పర్యా. తెల్లపని. మొద్దుబారిన కత్తులు, కొడవండ్లు మొదలయిన పనిముట్లను పదునుపెట్టే పని. (కో. 23).

సిజలు: (ఇం.) ఉ. సిజిలు. రూ. సిలిజల్లు. చూ. పర్యా. చదరపుపంచు లోహపురేకులను, కడ్డీలను తెగ్గొట్టడానికి వాడే పరికరం. (తె. 18, 21, 24).

సిప్పచేయు: (క్రి.) సైపులను శుభ్రంచేయడం. (రా. 2).

సిత్రిపెట్టు: (క్రి.) కొలిమిపనిలో బండిచక్రానికి ఎక్కించిన కమ్ములను ఊడిరాకుండ తిప్పుతూ గట్టిగ కొట్టడం. (కో. 20).

సిప్పింగ్‌చేయు: (క్రి.) చూ. చిప్పింగ్‌చేయు (తె. 23, 29).

సిప్పింగ్‌శానం: చూ. పర్యా. కత్తి[1]. వెల్డింగ్ ఉబ్బులను కొట్టడానికి వాడే పరికరం. (కో. 23).

సిప్పింగ్‌హామరు: (ఇం.) చూ. చిప్పింగ్‌హామరు. (కో. 20, 24, 26, 29).

సిఫింగ్‌చేయు: (క్రి.) చూ. చిప్పింగ్‌చేయు. (కో. 3).

సిబ్బి[1]: చూ. పర్యా. పరాతం. శుభకార్యాల్లో వస్తువులు తీసుకెళ్ళడానికి, పిండి కలపడానికి, వేడివస్తువులు చల్లార్చడానికి వాడే వెడల్పు పళ్ళెం. చూ. చిత్రం 150. (కో. 19).

సిబ్బి[2]: పోతచెంబు మధ్యభాగం. (తె. 7).

సిబ్బి[3]: చూ. పర్యా. కళ్ళసిబ్బి. ఉడకబెట్టిన కాయగూరల్ని, గంజిని వార్చడానికి వాడే సగభాగం రంధ్రాలుకలిగిన పళ్లెం. (కో. 25).

సిబ్బి[4]: వెనక్కువంచిన మూతరేకు. (తె. 2).

సిబ్బిరేకు: ఉ. చిబ్బిరేకు, శిబ్బిరేకు. చూ. జెబ్బిరేకు. చూ. జిబ్బిరేకు. (కో. 1, 20, 29).

సిమిడి: చూ. పర్యా. కిట్టు. కొలిమిలో ఇనుము కాలగా మిగిలిన పనికిరాని బొగ్గు, ఇనుము మిశ్రమం. (రా. 4).

సిమింగ్‌మిషన్: (ఇం.) డబ్బా పైభాగాన్ని, క్రింది భాగాన్ని, మధ్యభాగాన్ని సెట్ చేయడానికి వాడే యంత్రం. (రా. 7).

సిమ్మెట: చూ. చిమట. (తె. 12; రా. 2).

సిరసు: చూ. పర్యా. జవ్వ[1]. బిందెయొక్క కుతికపై అంచు. (కో. 20).

సిల్: రేకుపనిలో ఆధారంగా ఉపయోగించే వెడల్పైన ఇనుప సాధనం. (రా. 12).

సిలిండర్[1]: (ఇం.) బక్కెట్లకు క్రింది బిళ్ళల్ని పొక్కించుకోడానికి వాడే పరికరం. (కో. 12).

సిలిండర్[2]: (ఇం.) వెల్డింగ్ పనిలో కార్బేటర్‌తో కలిసి వెల్డింగు చేయడానికి వాడే పరికరం. (కో. 7).

సిలీస్‌కట్టర్: (ఇం.) చూ. పర్యా. మిర్చికట్టర్. మిరపకాయలు తరగడానికి ఉపయోగపడే స్టీలు పనిముట్టు. ఒక గరిటె కిందిభాగంలో కట్టర్‌ను అమర్చుతారు. (కో. 1).

సిలుం: చూ. చిలుము. (కో. 1, 3; రా. 5, 6).

సిలుంపేపరు: చూ. పర్యా. ఎమరీపేపరు. బీరువాను శుభ్రపరచడానికి వాడే గరుకు కాయితం (రా. 8).

సిలెండరు: (ఇం.) ఉ. సిలిండర్. మామూలు రేకులను లోతుగా చేయడానికి, ఇనుపముక్కలను వంపుపెట్టడానికి వాడే పరికరం. (కో. 15 16).

సిల్కుమాజగ్గు: నీళ్ళు పోయడానికి ఉపయోగించే పొడవైన స్టీలుపాత్ర. (కో. 17)

సిల్వర్‌వెల్డింగ్: (ఇం.) స్టీలు వస్తువులపై చేసే వెల్డింగ్ పని. (తె. 25).

సిల్వరు: (ఇం.) ఉ. శిల్వరు, సిలవరు. పర్యా. జర్మన్ సిల్వరు, పాత్రల తయారీకి వాడే లోహం. వెండి, బంగార్లు నగలకు బదులుగా కూడ కొందరు దీన్ని ఉపయోగిస్తారు. (రా. 3, 8, 11).

సింహతలాటం: చూ. పర్యా. మకరతోరణం. దేవాలయాల్లో మూలవిరాట్టుకు, ఉత్సవ విగ్రహాలకు చుట్టూ కమానుగా అలంకరించిన లోహపుతొడుగు. మధ్యలో సింహంతల ఉంటుంది. (తె. 24).

సింహాచలం: చూ. సింహాసనం. (కో. 26).

సింహాసనం: చూ. సింహ...

ఉత్సవ విగ్రహాన్ని ఉంచడానికి ఉపయోగించే ఇత్తడితొట్టి. (కో. 16, 17, 19, 22, 24, 29; తె. 7, 21; రా. 15).

సింహాసనంతొట్టి: చూ. పర్యా. పీఠం. ఉత్సవ విగ్రహాని ఉంచడానికి ఉపయోగించే ఇత్తడి పీఠం. (కో. 27).

సీకు[1]: చూ. పర్యా. కడ్డి[1]. ఇత్తడి పాత్రలను దవ్వతో అతకడానికి వాడేకడ్డి. (తె. 2).

సీకు[2]: చూ. పర్యా. కంకణం. పాత్రల అంచులు దట్టంగా ఉండడానికి ఉపయోగించే లోహపుకడ్డి. (తె. 1, 3).

సీకు[3]: ఉ. సీక. చూ. పర్యా. కొలిమినువ్వ కొలిమి లోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డి. (తె. 4, 5, 7).

సీకు[4]: చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటి కర్ర. (తె. 19).

సీకు[5]: బెజ్జాలను కలపడానికి ఉపయోగించే పొడవాటి కడ్డీ. (తె. 2).

సీటు[1]: సైకిల్‌పై కూర్చోడానికి అమర్చినగద్దె. (తె. 8, 12).

సీటు[2]: టింకరపనిలో ఉపయోగించే రేకు. (రా. 4).

సీతాపతిబద్ద: చూ. పర్యా. అడికోలు. ఇత్తడిరేకులపై ఇనుప సామాన్లపై కొలతలను గీయడానికి ఉపయోగించే ఇనుపబద్ద. (కో. 18).

సీదపట్టి: రేకును కత్తరించడానికి వాడే రంపంలాంటి పరికరం. (తె. 9).

సీదా: బెండింగు మిషన్‌తో వీలుకానిదానిని హెచ్చు తగ్గులుంటే సరిచేసే పరికరం. (రా. 7).

సీదాచేయు: (క్రి) పడిచిన రేకును సాపుగ చేయడం. (కో. 28; తె. 24; రా. 14).

సీదాపట్టి: చూ. పర్యా. అడికోలు. ఇత్తడి రేకులపై, ఇనుప సామాన్లపై కొలతలను గీయడానికి ఉపయోగించే ఇనుపబద్ద. (తె. 2, 3; రా. 16).

సీదాబద్దె: ఉ. చీదాబద్ది. సీదాబద్దీ. చూ. పర్యా. అడికోలు. ఇత్తడి రేకులపై, ఇనుప సామాన్లపై కొలతలను గీయడానికి వాడే ఇనుపబద్ద. (కో. 8, 17; తె. 17, 22, 24, 25).

సీను: పెద్దపాత్రలపై మూతగా ఉపయోగించే అంచులు డిజైన్లున్న పళ్ళెం. (రా. 14).

సీప్‌కరవాయి: పూలబుట్టను తయారుచేసుకోడానికి ...

సీమమూస: పర్యా. క్రూసికిల్. కరిగిన ద్రావకాన్ని కొలిమినుండి తెచ్చుకోడానికి ఉపయోగపడే కూజా లాంటి పాత్ర. రాజమండ్రిలో తయారయింది. (రా. 5).

సీమసుత్తి: రివిటింగు వగైరాలకు పనికివచ్చే పరికరం. (కో. 21).

సీమెండి: చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే సాధనం. (తె. 2).

సీరు: చూ. చీల. (కో. 20, 22, 26; తె. 7).

సీల్‌కడ్డి: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డ్రింగు చేయడానికి వాడే ఇనుపకమ్మి పరికరం. (తె. 19).

సీల[1]: చూ. చీల[1]. (తె. 24).

సీల[2]: చూ. పర్యా. గుమ్మెకొయ్య. తరిణిపనిలో చక్రాలు తిప్పడానికి వీలుగా ఇరుసుకు తగిలించిన వంపు ఉండే ఇనుపకడ్డీ. (కో. 5).

సీలు: పాత్రలపై వేసే కంపెని గుర్తు. (కో. 26).

సీల్డు[1]: చూ. పర్యా. అద్దం[1]. వెల్డింగుపనిలో కంటికి రక్షణగా ఉపయోగించే పరికరం. (రా. 3).

సీల్డు[2]: చూ. షీల్డు. (కో. 13, 19, 20).

సీసం: పర్యా. వెండిసీసం. డబ్బారేకులను అతకడానికి తగరంతో కలిపే ఒకరకం లోహం. బరువెక్కువ. (తె. 3, 22, 23).

సీలు: చూ. పర్యా. ఫ్రిజ్‌బాటలు. పొడవుగా, మూతి సన్నగా సీసా ఆకారమున్న స్టీలుపాత్ర. ఫ్రిజ్‌లో నీళ్లు పట్టుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 168. (కో. 28; తె. 21).

సుక్కలబిండె: చూ. చుక్కలబిండి. (కో. 30).

సుక్కమొల: చూ. పర్యా. చుక్కపోగర. విగ్రహం పనిలో చుక్కలుగా డిజైను కొట్టడానికి ఉపయోగించే పరికరం. దీని అడుగుభాగం గుండ్రంగా ఉండి మధ్యలో చిన్నచుక్క ఉంటుంది. (తె. 17, 25).

సుక్కు: చూ. పర్యా. జవ్వ[1]. పాత్ర కొనభాగం. (రా. 7).

సుగర్‌పాట్టు: (ఇం.) చక్కెర పోసుకోడానికి వాడే లోహపుపాత్ర. (కో. 1).

సుగర్‌పాట్సు: (ఇం.) చక్కెర నిల్వ ఉంచడానికి వాడే స్టీలుపాత్ర. (తె. 14, 16).

సుచ్చు: చూ. సిచ్చు. (తె. 1, 2, 17–21, 22).

సుట్టు: (క్రి.) చూ. పర్యా. చుట్టుకొను. గొడుగు కడ్డీలు ఊడకుండా తంతెతో బిగించి మెలితిప్పడం. (కో. 18, 24; తె. 4; రా. 15).

సుడి: పర్యా. సుడిడిప్ప. లోహపు పాత్ర అడుగు భాగం. (కో. 13, 20–22, 26).

సుడికమ్మి: చూ. పర్యా. చదరగన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగుపట్టడానికి వాడే పనిముట్టు. (కో. 10, 19).

సుడిగునపం: పాత్రల అడుగుభాగాలు చేసేటప్పుడు క్రిందిభాగాన ఉపయోగించే సాధనం. (రా. 15).

సుడిడిప్ప: చూ. పర్యా. సుడి. లోహపు పాత్ర అడుగు భాగం. (కో. 21).

సుడిసుత్తి: చూ. పర్యా. పలచనిసుత్తి. బిందె గొంతు, అడుగుభాగాలు సాపుచేయడానికి వాడే సుత్తి. చూ. చిత్రం 153. (రా. 15).

సుత్తి ఉలి: చూ. పర్యా. చిన్నకటకలసుత్తి. లోహపు రేకులను, కడ్డీలను బెండ్‌చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (రా. 10).

సుత్తికి: రూ. సుత్కి. చూ. పర్యా. చిన్న కటకల సుత్తి. లోహపురేకులను, కడ్డీలను బెండ్‌చేయడానికి, రివిట్ చేయడానికి,సాపుచేయడానికి వాడే పనిముట్టు. (రా. 13).

సుత్తె: (బ.) సుత్తులు. ఉ. సుత్తి. లోహపు రేకులను, కడ్డీలను సాగ్గొట్టడానికి వాడే ఉక్కు పరికరం. ఒక చేత్తో పట్టుకోడానికి పిడి ఉంటుంది. చూ. చిత్రం 217. (కో. 3–5, 8, 10, 14, 16–29; తె. 1–6, 12, 20–23, 25).

సుద్ద: చూ. పర్యా. కనికపుల్ల. రేకుపై గుర్తులు పెట్టడానికి వాడే బలపం ముక్క. (తె. 21).

సునుగులేయు: (క్రి.) చూ. పర్యా. ఏట్లు ఏయు. పూర్తయిన లోహపు పాత్రను మెరుగుపెట్టడం. (తె. 22).

సున్నపోగరు: చూ. పర్యా. కన్నుమొల. రేకుపై కనుగుడ్లు చుక్కలు మొదలయిన గుండ్రనివలయాలు చెక్కడానికి శిల్పపనిలో వాడే పనిముట్టు. అడుగు భాగం గుండ్రంగా ఉండి మధ్య చిన్న చుక్క బొడిపె ఉంటుంది. (కో. 18; తె. 17).

సున్నం: రేకుపై మార్కింగ్ చేయడానికి వాడే పదార్థం. (తె. 22).

సున్నంకాయ: సున్నం వేసుకొనడానికి ఉపయోగించే స్టీల్ డబ్బా. (తె. 10, 11).

సుమ్మపోగారు: చూ. సుమ్మాపోగర. (కో. 24).

సుమ్మాపోగర: ఉ. సుమ్మాపోగరు. రూ. సుమ్మపోగారు. సున్నామాదిరిగా డిజైన్ వేయడానికి వాడే మధ్యలో బెజ్జముండే పరికరం. (కో. 7; రా. 5).

సుర్మాదాను: (హిం.) కంటికాటుక పెట్టుకోడానికి వాడే ఇత్తడి పరికరం. ఒక చిన్నబుడ్డీ మధ్య భాగంలో ఉన్న రేకుపుల్లద్వారా లోపలి కాటుకను అద్ది కంటిరేఖకు దిద్దుతారు. చూ. చిత్రం (తె. 7, 14, 19).

సులోబరు: రేకును గొట్టంలాగ చేయడానికి వాడే సాధనం. (కో. 23).

సుళ్లుగునపం: పర్యా. సుళ్లగెడపార. చెంబు, దేక్సాల అడుగుభాగాన్ని సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 19).

సుళ్లుగెడపార: చూ. పర్యా. సుళ్ళుగునపం. చెంబు, దేక్సాలు అడుగుభాగాన్ని సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 14).

సువ్వ[1]: చూ. పర్యా. కడ్డి[1]. ఇత్తడి పాత్రలను రవ్వతో అతకడానికి ఉపయోగించే కడ్డి. (కో. 17).

సువ్వ[2]: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డి. (తె. 22).

సువ్వ[3]: గౌరాలు వంపడానికి ఉపయోగించే లావుపాటి కడ్డి[1]. (తె. 23).

సువ్వచేయు: (క్రి.) చూ. పర్యా. కొస్సగచేయు. కూచిగ చేయడం. (తె. 5).

సూట్‌కేసు: (ఇం.) వస్తువులు ఉంచుకోడానికి వాడే పెట్టె. (కో. 15, 28; రా. 15).

సూటింగు: చూ. పర్యా. కంటకొయ్య. సానరాయిని అమర్చడానికి సాన చట్రంపై ఉండే ‘ ’ ఆకారపు పంగలకొయ్య. (తె. 24).

సూది[1]: గొడుగుగుడ్డను కుట్టడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 23, 24, 27, 28; తె. 2, 4–6, 24; రా. 6, 14, 15).

సూది[2]: లోహపు రంధ్రాల్లో అంటుకొని ఉన్న మట్టిని తొలగించడానికి వాడే పరికరం. (రా. 2).

సూదికారు: చూ. పర్యా. జవకర. చిన్నచిన్న లోహపు వస్తువులను పట్టుకోడానికి రిపేరు చేయడానికి వాడే పరికరం. (కో. 28).

సూదిగునపం: దీపంబుగ్గి కప్పులు వంచడానికి ఉపయోగించే సాధనం. (కో. 22).

సూదిపోగర: ఉ. సూదిపొగారు. చూ. పర్యా. చిన్న పోగరు. లోహపు రేకులపై, కడ్డీలపై చిన్న రంధ్రాలు కొట్టడానికి వాడే పనిముట్టు (కో. 19, 28).

సూదిప్లేయరు: చూ. పర్యా. జవకర. చిన్నచిన్న లోహపు వస్తువులను పట్టుకోడానికి, రిపేరు చేయడానికి వాడే పరికరం. (కో. 30).

సూదిముట్టుకారు: చూ. పర్యా. జవకర. చిన్నచిన్న లోహపు వస్తువులను పట్టుకోడానికి, రిపేరు చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం. (కో. 19).

సూదిమూతికారు: చూ పర్యా. జవకర. చిన్నచిన్న లోహపు వస్తువులను పట్టుకోడానికి, రిపేరు చేయడానికి వాడే పరికరం. (కో. 21).

సూదిసుత్తి: ఇరుకు భాగాల్లో పనిచేయడానికి వాడే పనిముట్టు. (కో. 30).

సూపు: సైకిల్‌ట్యూబ్. (కో. 14).

సూపుప్లేటు: (ఇం.) రూ. సూప్పేటు, సూప్లేటు. చూ. పర్యా. సాహేబ్‌ప్లేటు అన్నం ఆరబోసుకోడానికి ఉపయోగపడే లోహపుపాత్ర. మహమ్మదీయులు అన్నం తినడానికి వాడ్తారు. (కో. 1, 17, 23; తె. 1; రా. 7).

సూపేటన్‌బిందె: వాయిభాగం పెద్దదిగా ఉండే నీళ్ళ పాత్ర. (కో. 29).

సూప్పేటు: చూ. సూపుప్లేటు. (తె. 18).

సూప్లేటు: చూ. సూపుప్లేటు. (కో. 12, 13, 15).

సూరకత్తి: ఉ. సూరుకత్తి. కూరగాయలు తరగడానికి, మాంసం కోయడానికి వాడే పనిముట్టు. (తె 18; రా. 1; 11)

సూరు[1]: చూ. పర్యా. జవ్వ[1]. బిందె. ట్రంకుపెట్టె అంచుభాగం. (కో. 5, 6, 8 10, 16).

సూరు[2]: చూ. పర్యా. చూర. లోహపుపాత్రలను అతకడానికి వాడే పదార్థం. (తె. 1).

సూరుకరవాయి: రూ. సూరులుకరవాయి. చూ. పర్యా. పెనికకరవాయి. లోహపుపాత్రల అంచులను మడచడానికి వాడే పరికరం. (కో. 2, 9, 23; (రా. 3).

సూరుకొట్టు: (క్రి.) చూ. పర్యా. తీయు[2]. రేకు అంచులు గాడిలాగ మడచడం. (కో. 18, 21).

సూరుగిన్ని: చూ. పర్యా. పట్టీకంచం. అన్నం తినడానికి వాడే అంచుగలిగిన పళ్ళెం. (కో. 26).

సూరుపోరుకరవాయి: చూ. పర్యా. పెనికకరవాయి. లోహపుపాత్రల అంచులను మడచడానికి వాడే పరికరం. (రా. 1).

సూరులుకరవాయి: చూ. సూరుకరవాయి. (కో. 8, 11).

సూరుంచు (క్రి) చూ. పర్యా. తీయు[2]. రేకును వెనక్కు మడిచి అంచులాగ చేయడం. (కో. 29).

సూరువేయు: (క్రి.) చూ. పర్యా. తీయు². రేకు పైభాగాలు అంచులాగ మడచడం. (కో. 22).

సూరొంచు: చూ. పర్యా. పొట్టచేయు. బిందె మధ్య భాగాన్ని లావుగచేసి అతకడానికి వీలుగా తయారు చేయడం. (తె. 22).

సూరొంపుకరవాయి: చూ. పర్యా. పెనికకరవాయి. లోహపుపాత్రల అంచులను మడచడానికి వాడే పరికరం. (కో. 22).

సూర్లేసేకరవాయి: చూ. పర్యా. పెనికకరవాయి. లోహపుపాత్రల అంచులను మడచడానికి వాడే పరికరం. (కో. 4; తె. 3).

సెగచేయు: (క్రి.) చూ. పర్యా. కాగబెట్టు. కొలిమిలో లోహపుపాత్రల్ని, కడ్డీలను బాగా ఎర్రగా వేడి చేయడం. (రా. 2).

సెగబెట్టు: (క్రి.) చూ. పర్యా. కాకఎక్కు. ఇనుమును సాగ్గొట్టడానికి, అతకడానికి వీలుగా కొలిమిలో ఎర్రగా కాల్చడం. (తె. 24).

సెట్‌చేయు: (క్రి.) (< ఇం. Set+చేయు) దీపం పైభాగాన్ని కిందిభాగాన్ని జాయింట్ చేయడం. (రా. 5).

సెట్‌నాట్‌తూగు: అన్నం పెట్టుకోడానికి వాడే బక్కెట్టు. (కో. 2).

సెటర్: (ఇం.) చూ. పర్యా. బెండ్‌మిషను. పెదపెద్ద లోహపురేకులను వంచడానికి వాడే పరికరం. (రా. 16).

సెటంబరు: ఉ. సెటాంబరు, సెటెంబరు. చూ. చేటాంబరు. (కో. 17; తె. 3, 25; రా. 10, 14, 16).

సెట్టింగ్‌సుత్తి: (< ఇం. Setting+సుత్తి). లోహపు రేకులను, కడ్డీలను బెండ్ చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (కో. 16).

సెట్టింగు: (ఇం.) వెల్డింగ్ చేయడానికిముందు డిజైను ప్రకారం పట్టీలను అమర్చడం. (తె. 20).

సెట్నాలచంచా: ఉ. సెట్నాలచాంచ. చూ. పర్యా. రంధ్రాల గరిటె. నూనెలోనుండి పిండివంటకాలు ఎత్తుకొనడానికి వాడే రంధ్రాలున్న సాధనం. చూ. చిత్రం 107. (తె. 12, 13).

సెట్నిప్లేటు: ఉ. సెట్నిప్లేట్. ఊరువిండి ఉంచుకోడానికి ఉపయోగించే గిన్నె. గుంతగా ఉంటుంది. (కో. 2, 8, 11).

సెట్రటం: ఉ. సట్రటం. చూ. చట్రం. (కో. 17-21, 23, 26, 28).

సెంటర్ ఎక్సల్‌సట్టు: సైకిల్‌లో కాళ్ళుపెట్టుకొనే భాగంలో అమర్చిన కమ్మి. (తె. 8, 13).

సెంటర్ ఎక్సలు: సైకిల్‌చక్రం సెంటర్‌లో ఉపయోగించే పరికరం. (తె. 12).

సెంటర్‌కొట్టు: (క్రి.) రూ. సెంటర్లుకొట్టు. చూ. పర్యా. సిగ్నల్‌కొట్టు. రంధ్రాలేయడానికి ముందు రేకుపై పోగరుతో గుర్తులుపెట్టడం. (కో. 24).

సెంటర్‌జాకీట్: పెట్రొమాక్స్‌లైట్ పైభాగాన ఉండే పరికరం. (కో. 2).

సెంటర్‌పంచు: ఉ. సెంటర్‌పొంచ్. రూ. షెంటర్ పంచ్. చూ. పర్యా. పోగరు. లోహపురేకులపై, కడ్డీలపై రంధ్రాలేయిడానికి గుర్తులుపెట్టే పరికరం. చూ. చిత్రం 165. (కో. 5, 6, 8, 10, 12, 15, 17-19, 21-24, 26; తె. 14, 15, 21, 22; రా. 2, 4, 6, 8, 10, 12, 14-16).

సెంటర్‌పోగర: చూ. పర్యా. అడ్డి. లోహపురేకులపై, కడ్డీలపై రంధ్రాలేయిడానికి గుర్తులుపెట్టే పరికరం. చూ. చిత్రం 165. (కో. 4, 9).

సెంటర్‌ప్లేట్: పెట్రొమాక్స్‌లైటు బాడీని కదలకుండ ఉంచడానికి అమర్చిన రంధ్రాల బిళ్ళ. (తె. 8, 21).

సెంటరు: వంచుకోడానికి రేకుపై పెట్టిన గుర్తు. (రా. 4, 8, 12).

సెంటర్లుకొట్టు: (క్రి.) చూ. సెంటర్‌కొట్టు. (తె. 24).

సెంటుగరిట: సెంటు పూసుకోడానికి వాడే చిన్న చెంచా. (తె. 10, 11).

సెర్వ్యాలకరవాయి: ఉ. సెర్వ్యాలు కరవాయి, చూ. చెరవలకరవాయి. (తె. 14-16).

సెలాకు: రూ. సెల్లాకు. చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవు కడ్డి. (తె. 7, 12-18, 24, 25).

సెలాకుపుల్ల: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవు కడ్డి.

సెలుసు¹: చూ. పర్యా. జవ్వ¹. పాత్ర తలభాగం. (కో. 13, 17).

సెలుసు²: చూ. పర్యా. కోవ. పట్టీమాదిరి వెనక్కి మడిచిన బిందె పైభాగపు అంచు. (కో. 27).

సెలుసుతీర్చు: (క్రి.) చూ. పర్యా. వాయి ఇప్పు. జవ్వను అతకడానికి వీలుగా పాత్ర మూతిభాగాన్ని తయారుచేయడం. (కో. 29).

సెల్ఫు[1]: చూ. పర్యా. కంచాలస్టాండు. పళ్లాలు, గ్లాసులు, గరిట్లు ఉంచడానికి ఉపయోగించే ఇనుప పట్టీల పరికరం. చూ. చిత్రం 220. (కో. 22).

సెల్ఫు[2]: బీరువా లోభాగాన ఉన్న అర. (రా. 4).

సెల్లాకు: చూ. సెలాకు. (రా. 14, 15).

సేకారు: చూ. చేకారు. (తె. 21).

సేకొలిమి: చూ. పర్యా. అతుకుడు కొలిమి. లోహపు పాత్రల రేకులను అతకడానికి ఉపయోగించే చిన్న పొయ్యి. (తె. 17).

సేగలమిషను: పర్యా. సేమియామిషను. సేకల మిషను. సేమియాలు తయారుచేయడానికి ఉపయోగించే మిషను. (తె. 8, 9).

సేగుపావు: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (తె. 4).

సేజాలి: చూ. పర్యా. కాలువచక్కి. కాలువల్లోకి చెత్తా చెదారం వెళ్ళకుండ అడ్డంపెట్టడానికి వాడే రంధ్రాల బిళ్ళ. (తె. 1).

సేటుకోరం: చూ. పర్యా. కుడక. కొబ్బరి తురమడానికి వాడే పరికరం. (కో. 16).

సేప్: చూ. పర్యా. పీసు. అల్యూమినియం పాత్ర ఆకారం. (రా. 8).

సేప్ఉలి: చూ. షేపువులి. (రా. 8).

సేప్కరవాయి: చూ. పర్యా. షెనికరరవాయి. లోహపుపాత్రల అంచులను మడవడానికి వాడే పరికరం. (కో. 10).

సేపిడి: చూ. చేయిపిడి (కో. 18).

సేమియామిషను: చూ. పర్యా. సేగలమిషను. సేమియాలు తయారుచేయడానికి ఉపయోగించే మిషను. (కో. 22).

సేవాల్: చూ. పర్యా. గంటె[2]. కొలిమిలో బొగ్గులు వేయడానికి వాడే పొడవుకాడ ఉన్న వెడల్పురేకు. (తె. 11).

సేవలమిషన్: చూ. సేగలమిషను. (రా.)

సైకిల్పయ్య: చూ. పర్యా. చక్రం[1]. సానరాయి తిరగడానికి బెల్టుద్వారా కలిపిన సైకిలుచక్రం. (తె. 4).

సైకిల్పుల్ల: పర్యా. సైకిల్సువ్వ. అచ్చుకట్టిన తర్వాత పోతరంధ్రాలను శుభ్రం చేయడానికి వాడే సన్నని కడ్డీ. (తె. 2).

సైకిల్పోన్సు: గతుకులుగ ఉన్న సానరాయిని లెవల్ చేయడానికి ఉపయోగపడే పరికరం. (రా. 16).

సైకిల్బెండుమిషన్: (ఇం.) సైకిలుచక్రం వంపులు తీయడానికి వాడే సాధనం. చూ. చిత్రం 218. (రా. 3, 9, 11).

సైకిల్మోటారుబాక్సు: సైకిల్మోటారు రక్షణ కోసం తయారుచేసిన ఇనపపెట్టె. (తె. 10).

సైకిల్సువ్వ: చూ. పర్యా. సైకిల్పుల్ల. అచ్చుకట్టిన తర్వాత పోతరంధ్రాలను శుభ్రం చేయడానికి వాడే సన్ననికడ్డీ. (తె. 19).

సైకిల్హబ్బు: (ఇం.) రూ. సైకిలఅబ్బు. చూ. పర్యా. అబ్బు[1]. సానరాయి తిరిగేటప్పుడు పక్కలకు కదలకుండ ఉండడానికి చక్రానికి అమర్చిన పరికరం. (తె. 22).

సైకిలఅబ్బు: చూ. సైకిల్హబ్బు. (రా. 1).

సైజుపట్టుకార: చూ. పర్యా. అతికేకారు. నిప్పును, వేడిలోహపు వస్తువుల్ని పట్టుకోడానికి కొలిమి దగ్గరవాడే పనిముట్టు. (రా. 6).

సైజుబాడీ: పర్యా. సైజువారీ. లోహపు వస్తువులను కావలసిన కొలతప్రకారం కత్తరించుకోడానికి ఏర్పరచిన నమూనాలు. (కో. 8).

సైజువారీ: చూ. పర్యా. సైజుబాడీ. లోహపు వస్తువులను కావలసిన కొలతప్రకారం కత్తరించుకోడానికి ఏర్పరచిన నమూనాలు. (కో. 2, 5; రా. 6).

సైడ్కట్టర్. బ్యాటరీ లైట్లకు రివిట్లు కొట్టడానికి వాడే పరికరం. (కో. 13).

సైడ్కాపల: చూ. పర్యా. సైడు. బీరువా ప్రక్కభాగపురేకు. (రా. 4).

సైడ్కొలత: ట్రంకుపెట్టె ప్రక్కకొలత. (కో. 2).

సైడ్మెరిప్: రూ. సైడుమిరియం. చూ. పర్యా. పక్కమిరియం. పక్కరేకులు వంచడానికి వాడే పరికరం. (రా. 10).

సైడ్సుక్కి: ఇత్తడిరేకుపై వంకరటింకర గీతలు కొట్టడానికి శిల్పపనిలో వాడే పరికరం. (తె. 25).

సైడ్హ్యాండు: పెట్టెపెట్టుకోడానికి పనికివచ్చే కమ్మి. (కో. 2).

సైడీసు: చూ. పర్యా. పక్కమిరియం. పక్కరేకులు వంచడానికి వాడే పరికరం. (రా. 11).

సైడు: పర్యా. సైడ్కాపల. బీరువా ప్రక్కభాగపు రేకు. (రా. 6),

సైడుదిమ్మ: చూ. పర్యా. పక్కమిరియం. పక్కరేకులను వంచడానికి వాడే లోహపుదిమ్మ. (కో. 18).

సైడుదిమ్మ: కరిగినలోహం అచ్చులో సులభంగా

వెళ్ళడానికి రంధ్రం మార్గాన్ని సరళంచేసే లోహపుఅచ్చు పలకలు. (తె. 19).

సైడుపిన్ను: పిల్లలకు తలదువ్వి జడవేయడానికి వెంట్రుకలు చెదిరిపోకుండా ప్రక్కభాగాల్లో పెట్టే పిన్ను. (రా. 6).

సైడుమిరియం: చూ. సైడ్ మెరిప్. (కో. 12, 13; రా. 4).

సైడులేగ: ఇత్తడిపాత్రల ప్రక్కభాగాలను సాపు చేయడానికి వాడే పనిముట్టు. (కో. 28).

సైనిమింగ్ పొటాష్: విగ్రహాన్ని మెరుగుపెట్టడానికి ఉపయోగించే ద్రవపదార్థం. (కో. 16).

సైలెంట్ బర్నర్: (ఇం.) స్టౌల రిపేరిలో వాడే శబ్దం కాకుండ మంటవచ్చే పరికరం. (తె. 3).

సొక్కపెట్టు: (క్రి.) చూ. పర్యా. నాటంవేయు. లోహపురేకును పాత్ర ఆకారంగాతయారు చేయడం. (తె. 7).

సొంగమాలి: చూ. పర్యా. వోకిచెంబు. చిన్నపిల్లలకు నీళ్ళు తాగించడానికి వాడే చిన్నపాత్ర. చూ. చిత్రం 191. (తె. 5).

సొంగవేయు: (క్రి.) విగ్రహం భాగాల్లోని గాడిని లావుచేయడం. (రా. 5).

సొట్ట: లోహపురేకుపై ఉండే నొక్కులేదా వంపు. (కో. 1, 2, 4, 28)

సొట్టపోగరు: చూ. సొట్టలపోగరు. టంకుపెట్టెకు సొట్టలులేకుండా చేయడానికి ఉపయోగించే మొల. (కో. 2).

సొట్టలపోగరు: చూ. సొట్టపోగరు. (కో. 8, 13).

సొండిగిల అచ్చు: (కన్నడ). చూ. పర్యా. కారాచావ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు అచ్చు. చూ. చిత్రం 50. (రా. 14).

సొమ్ము: చూ. పర్యా. తెరాయి. మూసలో కరిగిన లోహం. (తె. 7).

సొరకట్టెలు: చూ. పర్యా. కొలిమిసువ్వ. కొలిమిలోని బొగ్గును కుదించడానికి, కాకను చూడ్డానికి వాడే కొద్దిగ వంపుతిరిగిన సన్నని పొడవుకడ్డీ. (రా. 3).

సొరకాయమరచెంబు: సొరకాయ ఆకారంతోఉండే మరచెంబు. (కో. 10, 10).

సొరసుత్తి: చెంబులు, గ్లాసులు మొదలయినవాటికి లోతు గొట్టడానికివాడే ఉక్కు పరికరం. (కో. 24).

సొరాగు: చూ. పర్యా. కన్నం. బిందెకు ఏర్పడే చిన్న రంధ్రం. (రా. 15).

సొరుగులు: చూ. పర్యా. అరలు. బీరువాలోపలి అరలు. (కో. 18).

సొలిగ: (బ.) సొలిగలు. చూ. పర్యా. కారాచావ. మురుకులు, వాంపొడి వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50. (కో. 1, 2, 4; తె. 8-11, 15; రా. 2, 4, 6).

సొల్పు: ఉ. సొలుపు. చూ. పర్యా. తేల్పు. బిందె మధ్య రేకును లోతుగా, గుండ్రంగా మిగతా భాగాలను అతికించడానికి వీలుగా తయారుచేయడం. (తె. 3, 25).

సొల్యూషను: ఉ. సెల్యూషన్. సైకిల్ టైరు పంచర్‌ను అంటించడానికి ఉపయోగించే పరికరం. (రా. 8).

సోడాగాసు: చూ. పర్యా. గ్లాసు[1]. నీళ్ళు తాగడానికి వాడే లోహపు పరికరం చూ. చిత్రం 215. (కో. 4, 19).

సోడాతొట్టు: సోడాలు ఉంచుకోడానికి వాడే పాత్ర. (కో. 15).

సోడావాటరు: అల్యూమినియం పాత్రలను శుభ్ర పరిచే ద్రవం. (కో. 2).

సోదించు: (క్రి.) కాఫీ, పాలు మొదలయినవాటిని మరగబెట్టడం. (రా. 11).

సోపకమ్మి: చూ. పర్యా. కుంచు. కాక బాగా రావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే గుడ్డచుట్టిన కర్రముక్క. (కో. 24).

సోపుబాక్సు: చూ. పర్యా. సబ్బుపెట్టె. సబ్బు పెట్టుకోడానికి వాడే స్టీలుపెట్టె. చూ. చిత్రం 212. (కో. 1, 2, 6; తె. 3, 14-16, 20).

సోపుమట్టి: ఉ. సోప్ మట్టి. చూ. పర్యా. కుంచు. కాక బాగా రావడానికి కొలిమిపై నీళ్ళు చల్లడానికి వాడే గుడ్డచుట్టిన కర్రముక్క. (కో. 21, 25, 27).

సోమసత్తెర: చూ. పర్యా. గోకర్ణం. పాయసం, చారు మొదలయినవి వడ్డించడానికి వీలుగా ముక్కు, పట్టుకోడానికి కాడ అమర్చిఉండే లోహపు పాత్ర. చూ. చిత్రం 92. (రా. 13).

సోమసత్రం: చూ. పర్యా. గోకర్ణం. రసం, పాయసం మొదలయినవి పోసుకోడానికి వాడే ముక్కుగిన్నె. చూ. చిత్రం 92. (రా. 8).

సోమానుస్పూన్సు: కజ్జికాయలు చేసుకోడానికి వాడే గరిట. (కో. 2).

సోల: ఉ. సోలె. ధాన్యం కొలుచుకోడానికి వాడే లోహపు పరికరం. (కో. 18; తె. 15; 16).

సోలగిన్నె: చూ. పర్యా. కళాయిగిన్నె. నీళ్ళు తాగ

డానికి, కూరలు వేసుకోడానికి ఉపయోగించే పొడవైన లోహపు పాత్ర. (తె. 17).

సోలాపురంకడవ: సన్నని మూతి-గుండ్రని ఆకారం గలిగి నీళ్ళు తెచ్చుకోడానికివాడే రాగిపాత్ర. (తె. 4)

సోలాపురంబిందె: మూతిభాగం సన్నగా గుండుగా తయారుచేసిన బిందె. (తె. 4).

సోలాపూర్ అండా: మూతిభాగం లేని ఇత్తడిపాత్ర. నీళ్ళు కాచుకోడానికి ఉపయోగం. (తె. 12).

సోలాపూర్‌పట్టీలకరవాయి: సోలాపూర్ పట్టీలను కొట్టడానికి పనికివచ్చే పరికరం. (రా. 9).

సోలాపూర్‌బిందె: మూతి కూచిగా ఉండే ఇత్తడిపాత్ర. నీళ్ళు తెచ్చుకోడానికి వాడ్తారు. (తె. 12; రా. 7, 9).

సోలాపూర్‌బిందెలకరవాయి: మూతిభాగం గుండుగా ఉండే సోలాపూర్ బిందెల తయారీలో వాడే పరికరం. (తె. 12).

సోల్‌గ్లాసు: నీళ్ళు తాగడానికి ఉపయోగించే పొడవు లోటా. (కో. 12, 13, 15).

సోల్డ్రింగ్‌రాడు: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డ్రింగు చేయడానికి వాడే ఇనుపకమ్మి పరికరం. (కో. 26; తె. 24).

సోల్డ్రింగ్‌హామరు: చూ. పర్యా. ఇనుపకారు. సాల్డ్రింగు చేయడానికి వాడే ఇనుపకమ్మి పరికరం. (కో. 20).

సోల్డ్రింగు: చూ. సాల్డ్రింగు. (కో. 20, 22, 25, 27; తె 21).

సోపాలి: చూ. చౌపాళి. (తె. 2).

స్క్రాపర్: క్యారెట్టు, కోకనట్టు, సిప్స్ తురుములు. ఇవి మూడూ ఒకదానిలో అమర్చి చేసిన పరికరం. (కో. 1).

స్క్రూల్‌డ్రైవరు: (< ఇం. Sc ew Dri r). చూ. స్క్రూడ్రైవరు. (రా. 12).

స్కూల్‌బాక్సు: స్కూలుపిల్లలకు అన్నం తీసుకువెళ్ళడానికి వాడే పరికరం. (కో. 4, 17; తె. 14-16).

స్కేల్‌రాడు: బీరువాపై పులేల్ కొట్టేటప్పుడు రేకు వంగకుండ ఉండడానికి ఉపయోగించే దిమ్మ. (తె. 24).

స్కేలు: (ఇం. Scale). పర్యా. బేల్‌పట్టి[2]. అంగుళాలు, అంగుళాల భాగాలు గుర్తించిన అడుగు పొడవున్న కొలతబద్ద. లోహపు రేకులపై, కడ్డీలపై కొలతలు వేయడానికి ఉపయోగం. (తె. 8-12, 16, 17).

స్కేలురెంచి: (ఇం.) యాపరురాడ్డును బాగుచేయడానికి వాడే పరికరం. (కో. 30).

స్క్రోరు: చూ. పర్యా. కానా. డిజైన్ ఫ్రేములో ఉండే ఒక్కొక్క డిజైను అర. (తె. 24).

స్క్రోరుదిమ్మె: చూ. పర్యా. గటంచి. లోహపురేకులు, కడ్డీలు వంపుపెట్టడానికి వాడే దిమ్మ. (తె. 24).

స్క్రీన్‌గ్లాసు: చూ. పర్యా. అద్దం[1]. వెల్డింగుపనిలో కంటికి రక్షణగా ఉపయోగించే పరికరం. (తె. 18).

స్క్రీను: రూ. స్క్రీము. చూ. పర్యా. అద్దం[1]. వెల్డింగుపనిలో కంటికి రక్షణగా ఉపయోగించే పరికరం. (కో. 17, 20, 25, 28; తె. 5, 6, 12; రా. 7).

స్క్రీము: చూ. స్క్రీను. (కో. 20; తె. 12).

స్క్రూ[1]: చూ. పర్యా. టర్నిస్క్రూ. స్క్రూలను ఊడదీయడానికి, బిగించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 219. (రా. 4).

స్క్రూ[2]: చూ. పర్యా. రెగులేటరు. స్టౌమంటను అదుపులో ఉంచడానికి ఉపయోగించే పనిముట్టు. (తె.1).

స్క్రూకంపాసు: సర్కిలు వేసుకోడానికి వాడే పరికరం. (కో. 15).

స్క్రూడైవరు: చూ. స్క్రూడ్రైవరు. (తె. 11, 25; రా. 6).

స్క్రూడ్రైవరు: రూ. ఇస్కూడ్రైవరు, స్కూల్‌డైవరు, స్క్రూడైవరు. చూ. పర్యా. టర్నిస్క్రూ. స్క్రూలను ఊడదీయడానికి, బిగించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 219. (కో. 1, 2, 8, 10, 12-15; తె. 8, 13, 18-20; రా. 3-8, 15).

స్క్రూపానరు: రూ. స్క్రూల్‌పాన. చూ. పర్యా. రించి. నట్లు బిగించడానికి వాడే సాధనం. చూ. చిత్రం 197. (తె. 3).

స్క్రూపోగరు: చూ. పర్యా. టన్స్ స్క్రూ. స్క్రూలను ఊడదీయడానికి, బిగించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 219. (కో. 2).

స్క్రూరింజి: చూ. పర్యా. రించి. నట్లు బిగించడానికి వాడే సాధనం. చూ. చిత్రం 197. (కో. 12).

స్క్రూల్‌పాన: చూ. స్క్రూపానర్. (తె. 19).

స్క్రూలు: బీరువా పిటింగ్‌కు ఉపయోగించే చీలలు. (కో. 9, 11).

స్క్వ్యాయర్‌ట్రే[1]: రూ. స్క్వేర్‌ట్రే. చూ. పర్యా. కుటకలకంచం. కూరలువేసుకోడానికి వీలుగా గుంట అమర్చిచేసిన భోజనం పాత్ర. చదరంగా ఉంటుంది. చూ. చిత్రం 57. (కో. 12).

స్క్వ్యాయర్‌ట్రే[2]: వక్కలు, ఆకులు ఉంచుకోడానికి

ఉపయోగపడే పాత్ర. (కో. 4).

స్క్వ్వేయర్ పూలబుట్ట: దేవాలయానికి పూజా సామగ్రి తీసుకెళ్ళడానికి వాడే పరికరం. (కో. 9).

స్క్వేర్‌రాడ్డు: చూ. పర్యా. స్క్వేరు. వెల్డింగు పనిలో డిజైన్లు వంచడానికి ఉపయోగించే ఇనుప కడ్డీ. (కో. 27).

స్క్వేర్‌ట్రే: చూ. స్క్వేయర్‌ట్రే. (కో. 19).

స్క్వేరు: పర్యా. స్క్వేర్‌రాడ్డు. వెల్డింగుపనిలో డిజైన్లు వంచడానికి ఉపయోగించే ఇనుపకడ్డీ. (కో. 28).

స్క్వైర్: కొలతలు వేయడానికి వాడే మూలమట్టం. (కో. 19).

స్టవ్వు: చూ. స్టౌ. (కో. 5, 7, 11, 13, 15, 16, 24, 25, 29; తె. 18; రా. 7).

స్టాండ్ డ్రిల్లింగ్‌మిషను: రూ. స్టాండు డ్రిల్లుమిషను. చూ. పర్యా. డ్రిల్లింగుమిషను. రేకుపై చిన్నచిన్న రంధ్రాలు వేసుకోడానికి ఉపయోగించే కరెంటు యంత్రం. రా. 7).

స్టాండింగ్: రూ. స్టాండుమిషను. చూ. పర్యా. డ్రిల్లింగుమిషను. రేకుపై చిన్నచిన్న రంధ్రాలు వేసుకోడానికి ఉపయోగించే కరెంటు యంత్రం. (తె. 22).

స్టాండు[1]: చూ. పర్యా. కంచాలస్టాండు. పళ్లాలు, గ్లాసులు, గరిట్లు ఉంచడానికి ఉపయోగించే ఇనుప పట్టీల పరికరం. చూ. చిత్రం 220. (కో. 1, 4, 13–15, 23, 28; తె. 8, 9, 12, 13, 16, 20; రా. 4, 12).

స్టాండు[2]: చూ. పర్యా. ఛీకా[1]. పాత్రలు పెట్టడానికి, స్టౌ బర్నర్ పైభాగాన అమర్చిన బొడిపెలున్న రేకు. (తె. 23, 24).

స్టాండు[3]: రూ. స్టాండ్సు. చూ. పర్యా. హ్యాంగరు. గుడ్డలు తగిలించుకోడానికి వాడే కొక్కీలున్న పరికరం. (కో. 4, 9).

స్టాండు[4]: బిందెలు పెట్టుకోడానికి పనికివచ్చే పరికరం. (తె. 8).

స్టాండు[5]: సైకిల్ నిలబెట్టడానికి ఉపయోగించే పరికరం. (తె. 12, 13, 15).

స్టాండుడ్రిల్లింగు: చూ. పర్యా. డ్రిల్లింగుమిషను. రేకుపై చిన్నచిన్న రంధ్రాలు వేయడానికి ఉపయోగించే కరెంటు యంత్రం. (రా. 6).

స్టాండుడ్రిల్లుమిషను: చూ. స్టాండ్ డ్రిల్లింగుమిషను. (తె. 17).

స్టాండుబొగ్గులపొయ్యి: బూడిద కింద రాలకుండ అడుగున రేకు అమర్చి ఎత్తైన స్టాండుతో తయారు చేసిన బొగ్గులపొయ్యి. (తె. 21).

స్టాండుమిషను: చూ. స్టాడింగ్‌మిషను. (కో. 8).

స్టాండులివరు: కడ్డీలను డిజైనుపూలను వంచడానికి మోపుగా వాడే దిమ్మ. (రా. 16).

స్టాండ్సు: చూ. స్టాండు[3]. (తె. 10, 11, 14, 15).

స్టీనరు: చూ. స్టెయినరు. (కో. 22; తె. 1).

స్టీల్‌కత్తిపీట: కూరగాయలు కోసుకోడానికి వాడే సాధనం. (కో. 2).

స్టీల్ పౌడర్: సానరాయికి పాలిష్ రావడానికి ఉపయోగించే ఉక్కుపొడి. (రా. 3).

స్టీల్ ప్లాస్టిక్‌కప్: ఆహారపదార్థాలు ఉంచుకోడానికి వాడే సాధనం. (కో. 1).

స్టీల్ ప్లేటు: బీరువారేకును చదరం చేయడానికి వాడే పరికరం. (కో. 8).

స్టీల్‌బ్రెష్: స్టీల్ పాత్రలను శుభ్రపరిచే పరికరం. (కో. 4).

స్టీలుహ్యాండిల్ డిస్: కూరలు ఉంచుకోడానికి వాడే చేతిగిన్నె. (కో. 11).

స్టీలుటేపు: కొలతలు గుర్తించడానికి వాడే పొడవు పాటి స్కేలు. (తె. 18).

స్టీలుబ్లేడు: చూ. పర్యా. ముక్కుబ్లేడు. బీరువాపై లప్పం పూయడానికి వాడే విరిగిన రంపపుముక్క. (తె.17).

స్టీలురైజరు: చూ. పర్యా. ఇంగ్లీషురైజరు. షేవింగ్ చేయడానికి మంగలిషాపుల్లో వాడే కత్తి. (రా. 10).

స్టీలుసీసా: సీసా ఆకారంలోఉండే స్టీలుపాత్ర. నూనె పోసుకోడానికి ఉపయోగం. చూ. చిత్రం 221. (రా. 3, 5).

స్టూలు: నగిషీపని చేసేటప్పుడు ఉపయోగించే దిమ్మ. (తె. 17).

స్టెప్‌గ్లాసు: చూ. పర్యా. వన్‌స్టెప్‌గ్లాసు. మధ్యభాగంలో కుంటుఉన్న స్టీలుగ్లాసు. తాగడానికి ఉపయోగం. చూ. చిత్రం 222. (కో. 2–4, 6, 8–11, 13, 15, 18, 19, 24, 25, 27, 28).

స్టెప్‌టమ్మరను: (< ఇం. Step tumbler) చూ. పర్యా. వన్‌స్టెప్‌గ్లాసు. మధ్యభాగంలో కుంటుఉన్న స్టీలుగ్లాసు. నీళ్ళు తాగడానికి ఉపయోగం. చూ. చిత్రం 222. (కో. 1).

స్టెప్పు: ట్రంకుపెట్టెపై ఉండే పొడవాటి బొడిపెలు.

స్టెయిట్‌గెరిట: చూ. పర్యా. కూరగరిటె. కూరలు వడ్డించడానికి వాడే పరికరం. చూ. చిత్రం 63,

(కో. 6).

స్టైయినరు: రూ. స్టీనరు. చూ. పర్యా. తుడుపేగిచెన్ని. కాఫీ, టీ వడగట్టడానికి వాడే పరికరం. (కో. 28).

స్టేండింగ్‌మిషన్: కరెంటుకమ్మి సైజును తాడుగ పీడడానికి వాడే మిషను. (రా. 7).

స్టేండు: ఎద్దు నాలుగుకాళ్ళు పెట్టుకోడానికి వాడే కొయ్యస్టాండు. (రా. 3).

స్ట్రెయిట్‌కట్టర్: లోహపురేకును నేరుగా కత్తిరించే పరికరం. (కో. 14).

స్టోన్‌రాయి: చూ. పర్యా. గరుకురాయి[2]. మొద్దుబారిన లోహపు పనిముట్లను పదును పెట్టడానికి వాడే రాయి. (కో. 22).

స్టౌ: (బ.) స్టౌవులు. రూ. స్టవ్వు. పర్యా. ఎటాప్ బర్నర్. కంచాలకోళ్ళు, మరచెంబు మట్లు, మరకట్లు మొదలైనవి అతకడానికి వాడే పరికరం. చేత్తో పట్టుకోడానికి కొక్కి ఉంటుంది. పైన గొట్టం, క్రింద తొట్టిమాదిరి ఉంటుంది. (కో. 1-4, 11, 12, 14, 18-21; తె. 8, 9, 17, 19, 24; రా. 7, 8, 12, 23).

స్టౌటాకి: చూ. పర్యా. టాంకి. స్టౌ పక్కభాగానగాని, కిందిభాగానగాని, పెట్రొమాక్సులైటు కిందిభాగాన కిరసనాయలు నిల్వ ఉంచడానికి అమర్చిన సాధనం. (తె. 24).

స్టౌడూము: స్టౌల క్రిందిభాగంలో పెట్టుకోడానికి ఉపయోగించే పరికరం. (కో. 14, 15, 23).

స్టౌపిన్: రూ. స్టౌపిన్ను. చూ. పర్యా. టచ్‌పిన్. స్టౌ లోపలి బర్నర్ నిప్పల్‌ను శుభ్రం చేయడానికి వాడే పరికరం. (తె. 18, 19, 21).

స్టౌపిన్ను: చూ. స్టౌపిన్. (కో. 2, 26).

స్టౌప్లేటు: చూ. పర్యా. ఛీకా[1]. స్టౌబర్నర్‌పై పాత్ర ఉంచడానికి వాడే బొడిపెలున్న రేకు. (కో. 2, 4, 8, 14, 15; తె. 3; రా. 6).

స్టౌబర్నరు: స్టౌలో వత్తులు వెలగడానికి ఉపయోగించే పరికరం. (కో. 14).

స్టౌరేకు: చూ. పర్యా. ఛీకా[1]. స్టౌమీద పాత్రలు పెట్టడానికి వాడే బొడిపెలున్న ప్లేటు. (రా. 4).

స్టౌస్టాండు: అగ్ని భూమికి అనకుండా స్టౌ పెట్టుకోడానికి ఉపయోగించే స్టాండు. (కో. 2).

స్ట్రై[1]: చూ. పర్యా. కుటకల కంచం. కూరలు వేసుకోడానికి వీలుగా గుంటలమర్చి చేసిన లోహపు భోజనపాత్ర. చూ చిత్రం 57. (కో. 20).

స్ట్రై[2]: చూ. ట్రే[1]. (కో. 18).

స్ట్రైట్‌హామర్: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోహపు రేకులను, కడీలను వంపుచేయడానికి; రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 19).

స్త్రపుకు: రూ. స్త్రప్కు. సంధ్యావంధన సమయంలో వాడే చిన్నప్లేటు. (రా. 15).

స్త్రప్కు: చూ. స్త్రపుకు. (తె. 3).

స్త్రంభం: ఇనప ముక్కలను డిజైన్లుగ వంపుచేయడానికి వాడే సాధనం. (కో. 17).

స్త్రాంబాణి: చూ. తాంబాణం. (తె. 1).

స్త్రాంబాళం: చూ. తాంబాళం. (తె. 24).

స్తాలి: చూ. స్థాళి. (తె. 3).

స్థాళి: రూ. స్థాలి. చూ. పర్యా. పంచపాత్ర. సంధ్య వార్చుకొనేటప్పుడు తీర్థానికి వాడే చిన్నపాత్ర. (తె. 2, 4, 7).

స్నోడబ్బా: స్నో ఉంచుకోడానికి వాడే సాధనం, (కో. 12, తె. 20)

స్పాట్‌వెల్డింగ్‌మిషను: చూ. పర్యా. స్పాట్‌వెల్డింగు. లోహపురేకులు, పట్టీలు జాయింట్ చేయడానికి ఉపయోగించే పరికరం. (కో. 8).

స్పాట్‌వెల్డింగు: పర్యా. స్పాట్ వెల్డింగ్ మిషను. లోహపురేకులు, పట్టీలు అతకడానికి ఉపయోగించే పరికరం. (కో. 4. 9, 10; తె. 25).

స్పానరు: ఉ. స్పానర్. రూ. పాన, పానం, పానర్. పర్యా. రింగు[7]. నట్లు బిగించడానికి వాడే సాధనం. (కో. 9, 10, 12, 13; తె. 8, 9, 11, 13; రా. 2, 5-9).

స్పాను: చూ. పర్యా. కాడగిన్నె. కాఫీ, టీ తయారు చేయడానికి వాడే పొడవుపాటి కాడ ఉన్న పాత్ర. (కో. 25).

స్పిట్‌కప్పు: చూ. స్పిరిట్‌కప్పు. (తె. 21).

స్పిన్నింగ్‌పని: పర్యా. స్పిన్నింగ్ వర్కు. అల్యూమినియం రేకుతో యంత్రంమీద పాత్రలను తయారుచేసే పని. (రా. 16).

స్పిన్నింగ్‌వర్కు: చూ. పర్యా. స్పిన్నింగ్‌పని. అల్యూమినియం రేకుతో యంత్రంమీద పాత్రలను తయారుచేసే పని. (కో. 22, 26).

స్పిరిట్‌కప్పు: రూ. స్పిట్‌కప్పు. పర్యా. స్ప్రిటోకటోరి. స్టౌ బర్నర్‌ను వెలిగించడానికి వాడే బర్నర్ కింది ప్లేటు. (తె. 8).

స్పూను[1]: చూ. పర్యా. గరిట. కూరలు వడ్డించడానికి, పదార్థాలు ఎత్తుకోడానికి వాడే సాధనం. చూ. చిత్రం 63. (కో. 2, 15),

స్పూను²: చూ. పర్యా. గరిటె. మూసలో కరిగిన లోహపుతేటను తీయడానికి వాడే పరికరం. (రా. 11).

స్పూను³: చూ. పర్యా. చెంచా. కాఫీ కలుపుకోడానికి, పచ్చళ్ళు, పొళ్ళువేసుకోడానికి వాడే చిన్నగంటె. చూ. చిత్రం 102. (కో. 12, 13. 28).

స్పూనుక్యారీరు. రూ. స్పూన్స్‌క్యారీ. స్పూన్సుక్యారీరు. చూ. పర్యా. కారియరు. అన్నంవగైరా పదార్థాలు తీసుకెళ్ళడానికి వాడేపాత్ర. (కో. 8, 11, 12, 15).

స్పూన్స్‌క్యారీ: చూ. స్పూనుక్యారీరు. (కో. 10).

స్పూన్సుక్యారీరు: చూ. స్పూనుక్యారీరు (కో. 6).

స్ప్రేయర్: పొలాలకు మందుకొట్టడానికి వాడే పరికరం. (కో. 8).

స్ప్రేయర్‌రింజి: స్ప్రేయర్ నట్లు ఊడదీయడానికి వాడే పరికరం. (కో. 13).

స్ప్రింగ్‌కత్తెర: టార్చిలైటు హోల్డర్‌ను ఊడదీయడానికి వాడే పనిముట్టు. (రా. 8).

స్ప్రింగ్‌కప్పు: చూ. పర్యా. స్ప్రింగు. బ్యాటరీ బల్బు వెలగడానికి బ్యాటరీలైటు వెనకమూతలో అమర్చిన వలయాకారపు కడ్డీ. ఇది బాటరీలకు తగిలితే లైటు వెలుగుతుంది. (తె. 22).

స్ప్రింగ్‌పట్టు: ట్రంకుపెట్టె అంచుల్ని కొట్టడానికి వాడే చదరంగా ఉండే పరికరం. (కో. 2).

స్ప్రింగ్‌ప్లేటు: కొడవళ్ళు, కత్తులు మొదలయిన పనిముట్లు తయారుచేయడానికి వాడే ఉక్కుబిళ్ళ. (రా. 4).

స్ప్రింగ్‌మీట: చూ. పర్యా. ఎలకలబోను. ఎలుకలను పట్టడానికి వాడే సాధనం. చూ. చిత్రం 30. (తె. 17).

స్ప్రింగు: పర్యా. స్ప్రింగ్‌కప్పు. బాటరీ బల్బు వెలగడానికి బ్యాటరీలైటుకప్పు వెనకమూతలో అమర్చిన వలయాకారపు కడ్డీ. ఇది బాటరీలకు తలిగితే లైటు వెలుగుతుంది.

స్ప్రింగుటేపు: (< ఇం. Spring tape) పర్యా. ఇనపటేపు. చిన్న డబ్బీలో చుట్టిపెట్టిన ఆరడుగుల పల్చని లోహపుటేపు. కొలిచేటప్పుడు లాగి వదలితే అదే ఆ డబ్బీలో చుట్టుకుంటుంది. జేబులో పెట్టుకోవచ్చు. (కో. 13, 15; రా. 3).

స్ప్రింగుగొడుగు: చూ. పర్యా. బాస్‌కప్పు. గొడుగు మూసినపుడు పుల్లలనుపట్టి ఉంచడానికి వాడే సాధనం. (కో. 27).

స్ప్రే: పర్యా. స్ప్రేగను, స్ప్రేమిషను. బీరువాకు రంగులు వేయడానికి ఉపయోగించే పరికరం. (తె. 2).

స్ప్రేగను: చూ. పర్యా. స్ప్రే. బీరువాకు రంగులు వేయడానికి ఉపయోగించే పరికరం. (రా. 7).

స్ప్రేమిషను: చూ. పర్యా. స్ప్రే. బీరువాకు రంగులు వేయడానికి ఉపయోగించే పరికరం (రా. 6 7).

స్మాల్‌బేసను. పర్యా. గమ్మెల. గంప[1] గుండుతట్ట. గుల్ల[2], జబ్బ[1], బుట్ట. లగన్. అన్నం ఆరబోసుకోడానికి, పిండి కలుపుకోడానికి ఉపయోగపడే వెడల్పు మూతిఉన్న లోతైన పాత్ర. (రా. 7).

స్మాల్ సీక్రేట్‌డోరు: బీరువాలోపల డబ్బు దాచి పెట్టుకోడానికి ఉపయోగించే రహస్యపుద్వారం. (రా. 4).

స్మూత్‌కమ్మి: చూ. పర్యా. చదరగన్నెలేగ. లోహపు పాత్రలను మెరుగుపెట్టడానికి వాడే పనిముట్టు. (కో. 22).

స్పిటోకటోరి: చూ. పర్యా. స్పిరిట్‌కప్పు. స్టౌబర్నర్‌ను వెలిగించడానికి వాడే బర్నర్ కిందిప్లేటు. (తె. 17).

స్లైసర్: చూ. పర్యా. టమేటాకట్టర్. టమేటా పండ్లు తరగడానికి వాడే పరికరం. (కో. 30).

స్మూత్‌రాయి: చూ. పర్యా. గరుకురాయి². మొద్దుబారిన లోహపు పనిముట్లను పదునుపెట్టడానికి వాడే రాయి. (కో. 23, 24).

స్లోపాస్ట్‌రాడ్: చూ. పర్యా. పిన్. స్టౌబర్నర్‌కు అందే గాలిని కంట్రోల్ చేయడానికి బర్నర్ కిందిభాగాన అమర్చిన చక్రం.

## హ

హండిలిన్: చూ. పర్యా. చేతి డ్రిల్‌మిషన్. కరెంటు లేనపుడు లోహపురేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (రా. 10).

హతోడ: రూ. హతోడి. చూ. పర్యా. చిన్న కటకల సుత్తి. లోహపురేకులను, కడ్డీలను బెండ్ చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (తె. 1, 4).

హతోడి: చూ. హతోడ. (తె. 6).

హంబర్: చూ. పర్యా. చిన్న కటకలసుత్తి. లోపుహరేకులను, కడ్డీలను బెండ్‌చేయడానికి, రివిట్ చేయడానికి, సాపుచేయడానికి వాడే పనిముట్టు. (రా. 15).

హరిటణం: (కన్నడం.) రూ. హరియాణం. సంధ్యావందనం చేసేటప్పుడు ఉపయోగించే రాగిపళ్ళెం. (రా. 15).

హరియాణం: చూ. హరిటణం. (తె. 17).

హరేరామహరేకృష్ణ కప్పు: కూరలు, రసంపోయ డానికి ఉపయోగించే గిన్నె. (కో. 6, 11).

హవుస్‌మిషన్: చూ. పర్యా. మిర్చికట్టర్. మిరప కాయలు తరగడానికి ఉపయోగపడే స్టీల్ సాధనం. ఒక గరిటె, కింది భాగంలో కట్టర్‌ను అమర్చుతారు. (రా. 4).

హస్తం: రూ. అస్తం. పర్యా. అన్నంగెరిటె. అన్నం చెంచా, అన్నంచెయ్యి, కరండి, గరిట, చెయ్యి, చెయ్యిగంటె, చేయిగరిటె, చేయిచెంచా, హస్తం. అన్నం వడ్డించడానికి వాడే చేయిగరిటె. చూ. చిత్రం 223. (కో. 1-4, 7, 9, 15, 17-21, 23-25, 27-30; తె. 2, 5, 17-25; రా. 6, 15, 16).

హాక్పురా: చూ. ఆకుపార. (కో. 21).

హాంగర్సు: చూ. హ్యాంగరు. (తె. 11).

హాంగల్: డిజైన్‌కానాల చుట్టూ బిగించడానికి వెల్డింగ్ పనిలో ఉపయోగించే 'V' ఆకారపు కడ్డీ. (తె. 17).

హాంగ్లేరు: చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (తె. 24).

హాండ్‌గ్లోజు: చూ. పర్యా. కవరు[1]. వెల్డింగ్ చేసేటప్పుడు కరెంటుషాక్ కొట్టకుండ ఉండడానికి చేతులకు వేసుకొనే చర్మపుతొడుగు. (తె. 19).

హాండ్‌గ్రైండర్: రూ. హాండ్‌గ్రైండర్. చూ. హ్యాండ్‌గ్రైండర్. (తె. 21; రా. 13).

హాండ్‌గ్రెండర్: రూ. హాండ్‌గ్రైండర్. (తె. 4).

హాండ్‌టూర్సు: చూ. హాండ్‌టూల్సు[1]. (కో. 8).

హాండ్‌టూల్సు[1]: రూ. హాండ్‌టూర్సు. చూ. పర్యా. కట్ట. లోహపు రేకులను, కడ్డీలను సాపుచేయడానికి వాడే మోపు. (కో. 8).

హాండ్‌టూల్సు[2]: చూ. పర్యా. చిన్నకత్తెర. చిన్న చిన్న రేకులను కత్తరించడానికి వాడే పరికరం. (కో. 10).

హాండ్‌డ్రిల్లింగ్: రూ. హ్యాండ్‌డ్రిల్లింగ్. చూ. పర్యా. చేతిడ్రిల్‌మిషన్. కరెంటు లేనపుడు లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (కో. 24; తె. 1, 22).

హాండ్‌డ్రిల్లింగ్‌మిషన్: చూ. హాండ్‌డ్రిల్లుమిషను. (తె. 25).

హాండ్‌డ్రిల్లుమిషను: రూ. హాండ్‌డ్రిల్లింగ్‌మిషన్. చూ. పర్యా. చేతిడ్రిల్‌మిషన్. కరెంటు లేనపుడు లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (తె. 4, 17).

హాండ్‌మంగను: చూ. పర్యా. చేతిమంగను. రిపేరి చేసేటప్పుడు తాళంచెవిని కదలకుండ పట్టిఉంచడానికి ఉపయోగించే పనిముట్టు. (తె. 22).

హాండ్‌మిషన్: చూ. పర్యా. చేతిడ్రిల్‌మిషన్. కరెంటు లేనపుడు లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (తె. 2).

హాండ్‌వైసు: చూ. పర్యా. చేతిమంగను. రిపేరు చేసేటప్పుడు తాళంచెవిని కదలకుండ పట్టిఉంచడానికి ఉపయోగించే పనిముట్టు. (కో. 19; తె. 21; రా. 14).

హాండ్‌సీల్డు: చూ. పర్యా. అద్దం[1]. వెల్డింగుపనిలో కంటికి రక్షణగా వాడే పరికరం. (రా. 16).

హాండల్‌టాపు: ఉ. హాండల్‌టోపు. చూ. పర్యా. కాడగిన్నె. టీ, కాఫీ తయారుచేయడానికి వాడే పొడవుపాటి కాడఉన్న పాత్ర. (రా. 11, 14).

హాండల్‌బెండింగ్‌స్టాండు: బకెట్ల హాండల్స్‌ను తయారుచేయడానికి వాడే సాధనం. (తె. 17).

హాండలు: చూ. పర్యా. కట్టె. గొడుగుకు ఆధారమైన పొడవాటి కర్ర. (రా. 11).

హాండిలు[1]: ఉ. హైండిల్. చూ. పర్యా. పిడి[1]. గొడుగును పట్టుకోడానికి వాడే 'L' ఆకారపు పరికరం. (కో. 29; తె. 18, 20-23).

హాండిలు[2]: సానరాయి తిరగడానికిగాను కాలితో తొక్కడానికి మిషన్‌లో అమర్చిన పిడి. (కో. 23).

హాండు: చూ. హ్యాండిలు[1]. (కో. 24).

హాండ్లను: చూ. పర్యా. చేతిమంగను. రిపేరు చేసేటప్పుడు తాళంచెవిని కదలకుండా పట్టిఉంచడానికి ఉపయోగించే పనిముట్టు. (రా. 12).

హామ్లెట్‌గరిట: (< ఇం. Omelet + గరిట). కోడిగుడ్డు అట్లు ఎత్తుకోడానికి ఉపయోగించే సలాకు. (తె. 15).

హారతితట్ట: ఉ. ఆరతితట్ట. పర్యా. హారతివలక, హారతిప్లేటు[1], హారతిరేకు. మంగళహారతి ఇవ్వడానికి వాడే చిన్నప్లేటు. (కో. 2, 19, 22-24, 30; తె. 1; రా. 1, 2, 10, 15).

హారతిపలక: చూ. పర్యా. హారతితట్ట. మంగళహారతి ఇవ్వడానికి ఉపయోగించే ఇత్తడి రేకుపలక (రా. 12).

హారతిప్లేటు[1]: చూ. పర్యా. హారతితట్ట. మంగళహారతి ఇవ్వడానికి వాడే ఇత్తడిపళ్ళెం. (రా. 16).

హారతిప్లేటు[2]: కార్తీకమాసంలో దీపాలు వెలిగించుకో

డానికి వీలుగా 3 నుండి 12 దాక గుంటలుకొట్టి తయారుచేసిన ఇత్తడిపళ్లెం. (తె. 21).

హారతిరేకు: చూ. పర్యా. హారతితట్ట. దేవునిదగ్గర మంగళహారతి ఇవ్వడానికి ఉపయోగించే ఇత్తడి పళ్ళెం. (కో. 23).

హారంవేయు: (క్రి.) విగ్రహంలో దండను చెక్కడం. (రా. 5).

హారిజాంటల్ వెల్డింగ్: వెల్డింగ్‌పనిలో వస్తువుక్రింద నుండి పైభాగానికి ఆరోహణ క్రమంలో చేసిన వెల్డింగు. (తె. 17).

హార్లిక్స్‌డబ్బా: పర్యా. హార్లిక్స్ బాటిలు, హార్లిక్స్ సీసా. పాలు, నేయివంటి ద్రవపదార్థాలను పోసుకోడానికి, చక్కెర, పప్పులు వగైరా నిల్వఉంచుకోడానికి ఉపయోగించే హార్లిక్స్‌సీసా ఆకారంలో ఉన్న స్టీలుపాత్ర. (కో. 2, 3, 27).

హార్లిక్స్‌బాటిలు: ఉ. హార్లిక్స్ బాటలు. చూ. పర్యా. హార్లిక్స్‌డబ్బా. పాలు, నేయివంటి ద్రవపదార్థాలను పోసుకోడానికి, చక్కెర, పప్పులు వగైరా నిల్వ ఉంచుకోడానికి ఉపయోగించే హార్లిక్స్‌సీసా ఆకారంలో ఉన్న స్టీలుపాత్ర. (కో. 1, 6, 8, 11, 17, 20, 25, 30; తె. 14, 15).

హార్లిక్స్‌మిక్స్: హార్లిక్స్, పాలు రెండూవేసి చిలక కొట్టడానికి వాడే పాత్ర. (కో. 1).

హార్లిక్స్‌సీసా: చూ. పర్యా. హార్లిక్స్‌డబ్బా. పాలు, నెయ్యివంటి పదార్థాలు ఉంచుకోడానికి, చక్కెర, పప్పులు వగైరా నిల్వఉంచడానికి ఉపయోగించే స్టీలుపాత్ర. (కో. 4, 17, 20).

హిందూస్తాన్‌ఉలి: చూ. పర్యా. మట్టపుల్ల. పెట్టె మూతకు పైభాగంలో గిర్రలుకొట్టడానికి ఉపయోగించే కడ్డీలాంటి పరికరం. (రా. 4, 5).

హిందూస్తాన్‌కమ్మి: ఉ. హిందూస్తానీ కమ్మి. చూ. పర్యా. మట్టపుల్ల. ట్రంకుపెట్టె పైభాగంలో గిర్రలు కొట్టడానికి వాడే కడ్డీలాంటి పరికరం. (రా. 4).

హిందూస్తాన్‌కొట్టు: (క్రి.) ట్రంకుపెట్టెకు పైభాగంలో బొద్దులు లేదా గిర్రలుకొట్టడం. (రా. 4, 5, 8).

హిందూస్తాన్‌పట్టి: చూ. పర్యా. మట్టపుల్ల. రేకును చదరంచేయడానికి, పెట్టె పైభాగాన గిర్రలు కొట్టడానికి ఉపయోగించే కడ్డీలాంటి పరికరం. (రా. 8).

హిందూస్తాను: చూ. పర్యా. గిర్ర. ట్రంకుపెట్టె పైభాగంలో ఉండే గీత. (రా. 4, 5, 8, 10).

హ్రంకు: గంట లోభాగాన నాలుకకు తగిలించడానికి వాడే పరికరం. (రా. 5).

హుబ్లీచెంబు: నీళ్ళు తాగడానికి ఉపయోగించే చౌకం చెంబు. (రా. 14).

హూకు: చూ. హుక్కు. (తె. 6).

హెజ్జి: పర్యా. గాడి[3]. గొడుగుపుల్లలను బిగించే చక్రం అర. (కో. 17).

హెడ్: చూ. పర్యా. డూం. టార్చిలైటు బల్బుచుట్టూ ఉండే అద్దం, పోతగిన్నె అమర్చిన మూత. (తె. 21; రా. 6).

హెడ్‌కప్లింగ్: చూ. పర్యా. చేతి డ్రిల్‌మిషన్. కరెంట్ లేనపుడు లోహపురేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. (రా. 8).

హెడ్‌స్పానరు: మిషన్‌స్క్రూలు రిపేరు చేయడానికి ఉపయోగించే పనిముట్టు. (రా. 6.)

హెల్మెటు: చూ. పర్యా. అద్దం[1]. వెల్డింగుపనిలో కంటికి రక్షణగా వాడే పరికరం. (తె. 21).

హేండిల్‌క్లిప్‌కటింగ్‌మిషన్: ప్లేట్‌రేకు క్లిప్‌చేసిన హ్యాండిల్‌కు జాయింట్ చేయడానికి వాడే పరికరం. (రా. 7).

హేర్‌కి: చూ. ఏర్‌కీ. (తె. 3).

హేర్‌పిన్: చూ. పర్యా. హేర్‌వాల్. స్టౌ టాంకి వాల్‌లోని గాలిని అదుపులో ఉంచడానికి ఉపయోగించే సాధనం. ఇది టాంకి పైభాగాన ఉంటుంది. (తె.24).

హేర్‌వాల్: పర్యా. గేజు, చాబి[1], హేర్‌పిన్. స్టౌ బర్నర్ గాలిని అదుపుచేయడానికి వాడే పరికరం. టాంకి పైభాగంలో ఉంటుంది. (తె. 5).

హైడ్రాలిక్‌ప్రెస్సు: పర్యా. హోల్స్ హ్యాండిలు, హ్యాండిలు[2], హ్యాండిల్‌ప్రెస్సు. లోహపు రేకులను వంచడానికి ఉపయోగించే పరికరం. (కో. 8, 10).

హైడ్రోక్లిక్ ఆసిడ్: చూ. పర్యా. ఆసిడ్. సాల్డ్రింగ్ పనికి ఉపయోగించే ద్రావకం. (కో. 14).

హైన్‌మేడు: చేత్తో పోతపోసి తయారుచేసిన కూర గిన్నె. (తె. 11, 14, 15).

హోటల్‌మిషను: చూ. పర్యా. కారాచాచ. మురుకులు, వాంపొడి, కారాసు వగైరా పదార్థాలు చేయడానికి వాడే లోహపు పరికరం. చూ. చిత్రం 50.

హోల్‌పన: చూ. పర్యా. చేతి డ్రిల్‌మిషన్. కరెంట్ లేనపుడు లోహపురేకులపై, పట్టీలపై రంధ్రాలు చేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం (రా. 2).

హోల్‌పంచు: రూ. హోల్స్‌పంచు. చూ. పర్యా. పోగరు. లోహపు రేకులపైన, కడ్డీలపైన వేసిన రంధ్రాలను సరిచేయడానికి వాడే పనిముట్టు. చూ. చిత్రం 165. (కో. 15).

హోల్‌పాక్సు: రూ. ఓల్‌పాక్సు, ఓల్‌పాసు, హోల్‌పాసు. చూ. పర్యా. హుక్సు. డిజైన్సు్ఫ్రేమును గోడలో బిగించడానికి వెలుపల ఇరువైపుల ఉండే 'Y' ఆకారపు కడ్డీ. (తె. 6).

హోల్‌పోగరు: చూ. పర్యా. పోగరు. లోహపు రేకులపై కడ్డీలపై వేసిన రంధ్రాలను సరిచేయడానికి వాడే పనిముట్టు చూ. చిత్రం 165. (కో. 8).

హోల్‌ఫాసు: చూ. హోల్‌పాక్సు. (తె. 21).

హోలిగపెనం: చూ. ఓలిగపెనుము. (రా. 11).

హోల్డరు[1]: చూ. ఓల్డరు. (కో. 16, 30; తె. 1, 2, 6, 7, 15, 17, 19-25; రా. 12).

హోల్డరు[2]: చూ. పర్యా. గొట్టం[3]. గొడుగుపుల్లలు బిగించడానికి ఉపయోగపడే గొడుగుకడ్డీపై పైకి, కిందికి సులువుగ తిరిగే పరికరం. (తె. 22).

హోల్డరు[3]: చూ. పర్యా. గడ్డ. టార్చిలైట్‌లో బల్బును ఉంచడానికి అమర్చిన దిమ్మ. (తె. 3, 4, 18, 21-25; రా. 6).

హోల్డరువైరు: చూ. పర్యా. టార్చి. వెల్డింగ్ రాడ్‌ను పట్టుకోడానికి వెల్డింగ్‌మిషను ద్వారా తగిలించే పనిముట్టు. (తె. 4).

హోల్స్‌పంచు: చూ. హోల్‌పంచు. (రా. 3, 4).

హోల్స్‌ప్లేయరు: చూ. పర్యా. చేతిడ్రిల్‌మిషన్. కరెంట్ లేనపుడు లోహపు రేకులపై, పట్టీలపై రంధ్రాలు వేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం. (కో. 30).

హోల్స్‌వేయు: (క్రి.) రేకుపై రంధ్రాలు వేయడం. (రా. 6).

హోల్స్‌హ్యాండిలు: చూ. పర్యా. హైడ్రాలిక్ ప్రెస్సు. ఇనుపముక్కల్ని, లోహపురేకుల్ని వంచడానికి ఉపయోగించే పరికరం. (కో. 15).

హోలకు: చూ. ఓలరు. (కో. 18, 26).

హోంవేయు: (క్రి.) చూ. పర్యా. ఓంతీయు. రేకు నుండి పీసులు తీయడం. (రా. 8).

హ్యాంగరు: రూ. హ్యాంగర్సు. పర్యా. స్టాండు[3]. గుడ్డలు తగిలించుకోడానికి వాడే కొక్కీలున్న పరికరం. (తె. 10, 11; రా. 7).

హ్యాండ్‌కత్తెర: చూ. పర్యా. చిన్నకత్తెర. చిన్నచిన్న రేకులను కత్తిరించడానికి వాడే సాధనం. (కో. 10).

హ్యాండ్‌గ్రైండర్: రూ. హాండ్‌గ్రైండర్. చూ. పర్యా. వెల్డింగ్ ఉబ్బులను అతుకులను శుభ్రపరచడానికి వాడే యంత్రం. (తె. 12).

హ్యాండిల్‌కప్: ద్రవపదార్థాలు త్రాగడానికి ఉపయోగపడే స్పూనులాంటి గిన్నె. (కో. 1).

హ్యాండిల్‌డిష్: చూ. పర్యా. కూరగాయగిన్నె. చేసిన వంటకాలను టేబిల్‌పై ఉంచుకోడానికి వాడే మూత ఉన్న పాత్ర. (తె. 10, 11).

హ్యాండిల్‌ప్రెస్సు: చూ. పర్యా. హైడ్రాలిక్ ప్రెస్సు. లోహపు రేకుల్ని డిజైనులాగా వంచడానికి ఉపయోగించే పరికరం. (కో. 8).

హ్యాండిల్‌బీగం: బీరువాలకు ముందుభాగంలో తలుపులు తెరవడానికివీలుగా అమర్చిన భాగం. (రా. 7).

హ్యాండిల్‌బోల్ట్: సైకిల్ హ్యాండిల్‌భాగంలో బిగించి ఉండే నట్టు. (తె. 12).

హ్యాండిలు[1]: రూ. హాండు. చూ. పర్యా. డోర్ హాండిలు. బీరువా తలుపు తెరవడానికి, మూయడానికి వీలుగా బీరువా తాళం పక్కన అమర్చిన వంపు సాధనం. (కో. 4, 9; రా. 8).

హ్యాండిలు[2]: చూ. పర్యా. హైడ్రాలిక్ ప్రెస్సు. ఇనుపముక్కలను మెలితిప్పడానికి ఉపయోగించే పరికరం. (కో. 15).

హ్యాండిలు[3]: ఉ. యాండిల్, హాండిల్, హైండిల్. చూ. పర్యా. కైపిడి. పెట్టెను పట్టుకోడానికి వీలుగా అమర్చిన నిర్మాణం. (కో. 13, 18, 26, 28; తె. 21; రా. 12).

హ్యాండిలు[4]: సైకిల్ తొక్కేటపుడు చేతితో పట్టుకోనడానికి ఉపయోగపడే సైకిల్ ముందుచక్రం పైభాగం. (తె. 8, 13).

చిత్రం-1

అక్షయపాత్ర



చిత్రం-2

అగరుబత్తిస్టాండు



చిత్రం-3

అగ్గిగంటె



చిత్రం-4

అంచుకంచం



చిత్రం-5

అట్లకాడ[1]



చిత్రం-6

అట్లపెనం



చిత్రం-7

అంటుడుగిన్నె



చిత్రం-8

అండా[1]



చిత్రం-9

అత్తరుదాని



చిత్రం-10

అన్నంగరిటె



చిత్రం-11

అన్నంబుట్ట



చిత్రం-12

అన్నంసరవ





చిత్రం-13
అప్పడాలపట్టకారు



చిత్రం-16
అరిసెపలక



చిత్రం-14
అమ్మవారిబిందె



చిత్రం-17
ఆకుబిందె



చిత్రం-15
ఆరత్రేకు



చిత్రం-18
ఆకురాయి

చిత్రం-19

ఆపాలపెనం



చిత్రం-22

ఇడ్లీపాత్ర

A. ఇడ్లీప్లేటు²



చిత్రం-20

ఆయిల్ క్యాను



చిత్రం-23

ఇత్తడిబకెట్టు



చిత్రం-24

ఇనుపబకెట్టు



చిత్రం-21

ఇడ్లీడిష్



చిత్రం_25

ఉక్కురోలు



చిత్రం_28

ఉలి



చిత్రం_26

ఉగ్గుగిన్నె



చిత్రం_29

ఉల్లిపాయలబుట్ట



చిత్రం_27

ఉయ్యాల



చిత్రం_30

ఎలకలబోను



చిత్రం–31

ఏతంబొక్కెన



చిత్రం–32

ఐస్‌గ్లాసు



చిత్రం–33

ఒలిగపెనుము



చిత్రం–34

కచ్చుసుత్తె



చిత్రం–35

కజ్జికాయపెట్టె



చిత్రం–36

కజ్జిగకట్టరు



చిత్రం-37

కట్ ప్లేటు



చిత్రం-40

కత్తెర



చిత్రం-38

కత్తి



చిత్రం-41

కప్పులకారేజి



చిత్రం-39

కత్తిపీట



చిత్రం-42

కప్పుసాసరు



చిత్రం-43

కమలం



చిత్రం-46

కాగు



చిత్రం-44

కలశంచెంబు



చిత్రం-47

కాడగంటె



చిత్రం-45

కవ్వం



చిత్రం-48

కాఫీజల్లెడ



చిత్రం_49

కాయిగ్లాసు



చిత్రం_52

కాళ్లగజ్జెలు



చిత్రం_50

కారాచాచ



చిత్రం_53

కిరోసిన్ ఇంజను



చిత్రం_51

కాలువచక్క



చిత్రం_54

కిరోసిన్ స్టౌ



చిత్రం–55

కస్టిల్



చిత్రం–58

కుందె



చిత్రం–56

కుంకుంగిన్నె



చిత్రం–59

కుంపటిబిళ్ల



చిత్రం–60

కుంబకోణంబిందె



చిత్రం–57

కుటకలకంచం



చిత్రం–61

కూజాచెంబు



చిత్రం–62

కూజాబిందె



చిత్రం–63

కూరగరిటె



చిత్రం–64

కూరగిన్నె



చిత్రం–65

కూరదాక



చిత్రం–66

కొడవలి



చిత్రం-67

కొండిపాపు



చిత్రం-70

గంగాళంకరవాయి



చిత్రం-68

కొయ్యసుత్తి



చిత్రం-71

గజంబద్ద



చిత్రం-69

కొలిమి



చిత్రం-72

గంట



చిత్రం–73

గదులపెట్టె



చిత్రం–76

గరుడస్తంభం



చిత్రం–74

గంధంగిన్నె



చిత్రం–77

గారెలకమ్మి



చిత్రం–75

గరగ[2]



చిత్రం_78

గుడ్డకత్తెర



చిత్రం_79

గుంటకరవాయి



చిత్రం_80

గుంటపొంగడాలపెనం



చిత్రం_81

గుండాం



చిత్రం_82

గుండుకరవాయి



చిత్రం_83

గుండుకొరం



చిత్రం-84

గుండుచెంబు



చిత్రం-85

గుండుబిందె



చిత్రం-86

గుండుసుత్తి



చిత్రం-87

గుత్తిగిన్నె



చిత్రం-88

గడ్డపార



చిత్రం-89

గొడుగు



చిత్రం_90

గొడ్డలి



చిత్రం_93

గోరుగుండు



చిత్రం_91

గొళ్లెండబ్బా



చిత్రం_94

గ్యాసుపొయ్యి



చిత్రం_92

గోకర్ణం



చిత్రం_95

గ్యాసు లైటరు



చిత్రం-96

చపాతీప్రెస్



చిత్రం-99

చుట్టకుదురు



చిత్రం-100

చూరకత్తి



చిత్రం-97

చాకు



చిత్రం-101

చెక్కుడుపార



చిత్రం-98

చాల్ని



చిత్రం-102

చెంచా



చిత్రం-105

జగ్గుకూజా



చిత్రం-103

చెమ్మెలు



చిత్రం-106

జగ్గుచెంబు



చిత్రం-104

చెవుల అండా



చిత్రం-107

జల్లిగంటె



చిత్రం-108

జల్లెడ[2]



చిత్రం-109

జాలీచెంబు



చిత్రం-110

జేగంట



చిత్రం-111

జోడుతపిలె



చిత్రం-112

జ్యూస్‌పిల్టరు



చిత్రం-113

టంచర్‌లివర్



చిత్రం-114

టార్చిలైట్



చిత్రం-115

టిఫెన్‌బాక్సు



చిత్రం-116

టీక్యాను



చిత్రం-117

టెల్లికరవాయి



చిత్రం-118

టేపు[2]




చిత్రం-119

ట్రంకుపెట్టె



చిత్రం-120

డబుల్ పంచింగ్ మిషన్



చిత్రం-121

డబ్బా[1]



చిత్రం-122

డీసు



చిత్రం-123

డేక్షా



చిత్రం-124

డ్రమ్ము[2]



చిత్రం-125

తప్పు



చిత్రం-126

తాఫీ



చిత్రం-127

తాంబూలంతట్ట

చిత్రం-128

తాళం[3]



చిత్రం-129

తాళం[4]

తాళంచెవి



చిత్రం-130

త్రాసు

తక్కెడజిబ్బులు

దండెం




చిత్రం-131

దత్తాగిన్నె



చిత్రం-132

దబ్బణం



చిత్రం-135

దీపప్రమిద



చిత్రం-133

దాణి



చిత్రం-136

దీపస్తంభం



చిత్రం-134

దానాబుట్ట



చిత్రం-137

దూపారతి



చిత్రం_138

ధారాపాత్ర



చిత్రం_139

ధూపకం



చిత్రం_140

నంజుడుతట్ట



చిత్రం_141

నందాదీపం



చిత్రం_142

నీళ్ళచెంబు



చిత్రం_143

నేతిజాడీ



చిత్రం-144

పచ్చికొబ్బరిపీట



చిత్రం-145

పంచపాత్రచెంబు



చిత్రం-146

పంచపాలి



చిత్రం-147

పట్టకారు



చిత్రం-148

పట్నంబిందె



చిత్రం-149

పంపు[2]



చిత్రం-150

పరాతం



చిత్రం-153

పలచనిసుత్తె



చిత్రం-151

పలకఊయల



చిత్రం-154

పాతళభైరవి



చిత్రం-152

పలకలగ్లాసు



చిత్రం-155

పాందాను[2]



చిత్రం-156

పార



చిత్రం-157

పాలక్యాను



చిత్రం-158

పాలగిన్నె



చిత్రం-159

పిన్‌కుషన్



చిత్రం-160

పూజసెట్టు



చిత్రం-161

పూలబుట్ట



చిత్రం-162

పెట్రొమాక్స్‌లైటు



చిత్రం-163

పెనుం[1]



చిత్రం-164

పాడులక్యాను



చిత్రం-165

పొగరు



చిత్రం-166

పౌడర్ డబ్బా



చిత్రం-167

ప్రభావళి



చిత్రం-168

ఫ్రిజ్‌బాటల్



చిత్రం-169

ఫ్రివీల్



చిత్రం-170

ఫ్లవుర్ వైజు



చిత్రం1-71

ఫ్లాట్ ఆకురాయి



చిత్రం-172

ఫ్లాస్కు



చిత్రం-173

బయలరు



చిత్రం-174

బాదం కొబ్బరితురుము



చిత్రం-177

బిందెకరవాయి



చిత్రం-175

బాదామికంచం



చిత్రం-178

బీరువా



చిత్రం-176

బాదియా



చిత్రం4179

బేసను



చిత్రం-180

జేసరిగిన్నె



చిత్రం-183

బోడ్డుగిన్నె



చిత్రం-181

బొగ్గుపొయ్యి



చిత్రం-184

బోవానిగిన్నె



చిత్రం-182

బొట్టుపెట్టె



చిత్రం-185

మంగలికత్తి



చిత్రం_186

మంగళారతిపళ్లెం



చిత్రం_189

మరచెంబు[1]



చిత్రం_187

మచ్చుకొడవలి



చిత్రం_190

మల్లిముల్లు



చిత్రం_188

మట్టసుత్తె



చిత్రం_191

ముక్కుచెంబు



చిత్రం-192

ముక్కోణంఆకురాయి



చిత్రం-193

ముళ్లస్పూను



చిత్రం-194

మూలమట్టం



చిత్రం-195

రంపం



చిత్రం-196

రాగికుండ



చిత్రం-197

రించి



చిత్రం–198
రేకుచేట



చిత్రం–199
రొట్టెపెనం



చిత్రం–200
రైల్వేపార



చిత్రం–201
లడిగ



చిత్రం–202
లాంతరు



చిత్రం–203
లోతుదాక



చిత్రం-204

లోవి



చిత్రం-205

వక్కాకురోలు



చిత్రం-206

వాటరపిల్టరు



చిత్రం-207

వెడల్పుకూరడాకా



చిత్రం-208

వైష్ణవచెంబు



చిత్రం-209

శటగోపురం



చిత్రం_210

శేరు



చిత్రం_213

సలాక



చిత్రం_211

సతారిలోటా



చిత్రం_214

సాదాకంచం



చిత్రం_212

సబ్బుపెట్టె



చిత్రం_215

సాదాగ్లాసు



చిత్రం–216

సింగిల్ పంచింగ్



చిత్రం–219

స్క్రూడ్రైవరు



చిత్రం–217

సుత్తె



చిత్రం–220

స్టాండు[1]



చిత్రం–218

సైకిల్ బెండుమిషన్



చిత్రం–221

స్టీలుసీసా



చిత్రం-222

స్టైప్‌గ్లాసు



చిత్రం-223

హస్తం

